# ఇట్లు, మీ విధేయుడు



## భమిడిపాటి రామగోపాలం

## సమగ్ర కథా సంకలనం

Printed and Published with
THE FINANCIAL AID
Granted by
VISAKHAPATNAM PORT TRUST



ప్రచురణ నెం. 42

Itlu, Mee Vidheyudu

Comprehensive Volume of Short Stories

By
BHAMIDIPATI RAMA GOPALAM (BHARAGO)
Port Quarters, S-3.
PORT AREA ; VISAKHAPATNAM- 530 035

First Edition : March, 1990

Cover Design : BAPU



Cover Photograph :
AMBU RAO, D'Light Studio, Visakhapatnam-530 016

Printed at :

Sri Krishna Printers,
Navodaya Colony
Vijayawada-520010
Phone : 473009



Title Printed at :

Jyoti Press
Golconda X-Roads
Hyderabad-500 020
Phone : 64323

Price Rs 100/-

COPIES CAN BE HAD FROM :-

* Secretary, VISAKHA SAHITI;
  26-9-388; Woodyard Street; Visakhapatnam-530 001
* Author (at Port Quarters as above)
* Visalandhra Book House
  Hyderabad, Vijayawada, Visakhaptnam and
  Other Branches
* Book Cantre, Main Road, Visakhapatnam-530 001
  Phone 62684

మాటలలో, చేతలలో;

పవిత్రతను, చిత్తశుద్ధిని విడనాడక;

ఎక్కడ విధి నిర్వహణం చేస్తే అక్కడ

భేష్ అనిపించుకుంటూ;

నిబంధనలు పాటిస్తూనే

సమాజానికి మేలు చేస్తూ;

తెలుగు జనం గర్వపడే

అతికొద్దిమంది కర్మఠులలో ఒకరుగా స్థిరపడిన

పత్రి వేంకట రామకృష్ణ ప్రసాద్

గారికి

ప్రేమతో



* నాకు గుర్తున్నంతవరకు నేను రాసిన కథలు 120 దాకా ఉంటాయని జాబితా తయారుచేస్తే అందులో దాదాపు 90 కథల వరకు పైటిల్సు చూడగానే గుర్తు చేసుకుని, ఆ తొంభైలో ఈ 52 అని, ఈ యాభై రెండే అనీ ఎన్నిక చేసిన భమిడిపాటి జగన్నాథరావుగారికీ;

* "మీ కథలు పుస్తక రూపంలో ప్రచురించుకొనే తలంపు ఉంటే దానికి అవసరమయ్యే కాగితం కన్వెషన్ రేటులో దొరికేటట్లు చూడగలను" అని సుమారు నాలుగేళ్ళకిందట చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకున్న అక్కినేని బలరామ కృష్ణయ్యగారికీ; అందుకు కెటలిస్టులాగా తోడ్పడిన ఎమ్. కె. ఆర్. వినాయక్‌గారికీ:

* 1974 లో విశాఖపట్నంలో "ఈనాడు" దినపత్రిక వ్యవస్థాపించిన నాటి నుండి: వార్తలకు వ్యాఖ్యలకు, సమాచారానికి, అనువాదానికి - అవసరమైన మేరకు నా సేవలను వినియోగించుకున్నా, ప్రతిఫలానికి అతీతమైన అపేక్షను లెక్కకు మించినన్ని సందర్భాల్లో చూపిస్తూ, నా కెప్పుడు ఏ క్లిష్ట పరిస్థితి వచ్చినా "నేనున్నా"నని ఆదుకుంటూ వస్తున్న ఎమ్.అప్పారావుగారికీ,

* సుమారు పదమూడేళ్ళనుంచీ నేను తలపెట్టిన సాహితీ కార్యక్రమాలని ప్రోత్సహించడమేకాక, నేను చనువుతీసుకుని అడిగినంత ఆర్థిక సహాయం అందిస్తూ వచ్చిన పి. వి. రమణయ్య రాజాగారికీ.

* విజయనగరంలో తాను చిన్నక్లాసులో చదువుతూ ఉండినప్పుడు మొదలు, తాను ఎంత పెద్దస్థాయికి ఎదిగినా, కాలమూ స్థితిగతులూ కల్పించిన దూరాన్ని అధిగమించి ఎప్పటికప్పుడు నా కథా రచనా వ్యాసంగం జాడ తెలుసుకుంటూ నా పర్మనెంటు అభిమానుల్లో ముఖ్యులుగా నిలిచిన తని కెళ్ళ రామశేషాద్రిగారికి. వారిచేత ప్రభావితులై నా అభిమానులయిన కోకా కిశోర్‌గారు, తదితర మిత్రులకు,

* "కథలకి ఇలస్ట్రేషన్స్ వేయడం"—"ఇలస్ట్రేషన్స్ వెయ్యడంకోసం కథలు చదవడం" వీటిమధ్యగల నిష్పత్తి అనుపాతాలు తెలిసి: ఈ పుస్తకానికి నా మస్తకాన్ని ముఖపత్రంగా రచించిన మహాను "బాపు"డు సత్తిరాజు లక్ష్మీనారాయణగారికీ:

* పాతికేళ్ళుగా నా సాహిత్యాభిమానానికి అభిమానిగా ఉంటూ, ఈ పుస్తక ప్రచురణ చివరిదశలో ఉన్న సమయంలో హఠాత్తుగా గంధర్వుడిలా

ఊడిపడి దీనికి "ఫినిషింగ్ టచ్" ఇచ్చిన కడియాల వివేకానంద మూర్తికీ:

ఈ కథలు పుస్తకరూపంలో ప్రచురించే నిమిత్తం ఆర్థిక సహాయం మంజూరు చేయడం సమంజసం అని ఏకకాలంలో కాకపోయినా ఏక కంఠంతో విశాఖపట్నం పోర్టు యాజమాన్యానికి నచ్చజెప్పిన లంక శివ రామ కృష్ణశాస్త్రిగారికీ, అవసరాల వేంకట కృష్ణారావుగారికీ, కామ్మోజు సత్యనారాయణగారికీ:

"పదినిమిషాల్లో భరాగో పరిచయం" పేరిట తాను లోగడ వ్రాసిన వ్యాసాన్ని ఈ పుస్తకంలో వాడుకోడానికి అనుమతించిన అత్తలూరి నరసింహారావుగారికీ:

పుస్తకాలు అచ్చువేయించడం కొట్టిన పిండే అయిన నాకు కూడా ఈ పుస్తకం విషయంలో ఎదురైన అవాంతరాలను సమర్థవంతంగా ఛేదించి నాకు చేదోడుగా నిలిచిన ఇస్మాయిల్ గారికీ, టి. నాగభూషణంగారికీ:

కేవలం పత్రిక పేరూ ప్రచురణ తేదీ చెబితే చాలు: "ఇదుగో, మీ దగ్గిరలేని మీ కథ!" అంటూ తన అమూల్య పత్రికా సంచయం నుంచి బయటికి తీసి నిమిషాలమీద జిరాక్సులూ తీయించి అందజేస్తూ ఎన్నో నిస్పృహ క్షణాలనుంచి నన్ను కాపాడి విభ్రమ కలిగించిన వై.వి.ఎస్. ఆర్.ఎస్. శాయిగారికీ.

కవర్ డిజైన్ కన్సెషన్ రేటులో అచ్చువేసిన జ్యోతిప్రెస్ వారికీ: ఆ సందర్భంగా మాట సాయంచేసిన అలనాటి "జ్యోతి" పక్షపత్రిక (తెనాలి) సంపాదకుడు ఆలపాటి రవీంద్రనాథ్ గారికీ:

ఈ కథల్ని ఏమి తమ పత్రికల్లో తొలిసారిగా ప్రచురించిన సంపాదకు లందరికీ:

"మీ కథలన్నీ జాబితావేసి వాట్లో మంచివి ఏరి ఒక సమగ్ర కథా సంకలనం వెయ్యాలి" అంటూ ఏనిమిదేళ్ళనుంచి నన్ను కొరుక్కు తినేసి చివరికి సాధించి సంతోషించిన "డిస్ట్రిక్ట్ లీడర్" రాయుడుగారి రాధా కృష్ణమూర్తి ("ఎల్. ఆర్.") గారికీ:

ప్రూఫులు దిద్దిన నాప్రియమిత్రుడు వేంకట సత్యప్రసాద్ గారికీ: ఉమకీ. వనజ లతకీ...

నా మనఃపూర్వక కృతజ్ఞతలు.

భరాగో

## ఇందులో కథలు

(ఆంధ్రప్రభ వీక్లీ, జూలై—1987)

# నేనెందుకు రాశాను?

ఈ ప్రశ్న నాకు తెలిసినంతవరకు దాదాపు పాతికేళ్ళ క్రిందట విశాఖ రచయితలు లేవదీసేరు. నన్ను నిలవదీసేరు కూడాను.

నేను ఆరోజుల్లో నరసరావుపేటలో ఉద్యోగం చేస్తూ, ఏదో కారణం చేత విశాఖపట్నం వచ్చేను. ఆలోచనల్ని కల్లియబెట్టే రచనలు చేస్తున్న విశాఖ రచయితల్లో కొందర్నయినా చూసి, పలకరించి, మాట్లాడగలిగితే బావుండునన్న కోరికతో ఆరోజు ఉండిపోయాను.

వివేకానందమూర్తి, తంబు, రామవరపు వేణుగోపాలరావు, శ్రీరంగం రాజేశ్వరరావు, మరువాడ రాజేశ్వరరావు, మల్లంపల్లి కృష్ణారావు, శివల జగన్నాథరావు, నవులూరి వెంకటేశ్వరరావు, మల్లాప్రగడ రామారావు కొత్త తరంలోంచి వచ్చిన శక్తిమంతులైన రచయితలు.

రాచకొండ విశ్వనాథశాస్త్రి, అంగర వెంకటకృష్ణారావు, కీర్తిప్రియ, కాళీపట్నం రామారావు, అంగర సూర్యారావు, జ్యేష్ఠ, పూసపాటి కృష్ణంరాజు బలివాడ కాంతారావు, మసూనా, ఎం. రామకోటి, గొల్లపూడి మారుతిరావు పాతతరం రచయితలు: లబ్ధప్రతిష్ఠులు.

ఈ రెండుతరాల మధ్య, శక్తీ ప్రతిష్ఠా సమపాళ్ళలో సమీకరించుకుంటున్న రంగనాయకమ్మ.

అందర్లోకీ రాచకొండ విశ్వనాథశాస్త్రి గొప్ప ఆకర్షణ. ఆయన ప్రభావం కొత్తతరం రచయితలమీద దిట్టంగా పడింది. "విశ్వనాథశాస్త్రిలా రాయని జీవితమేల?" అనుకునే కొత్తతరం రచయితలు ఎక్కువయ్యేరు. ఇతివృత్తాలు ఎంచుకోడంలోనూ ఉపమలు వెయ్యడంలోనూ "శాస్త్రీయ"ధోరణి మరీ కొట్టొచ్చినట్టు కొందరు కొత్తతరం రచయితల్లో కనబడిపోయేది. అందుకు కూడా శక్తి కావాలి గనక వాళ్ళూ ఆకర్షణే.

అలాంటిరోజుల్లో నేను విశాఖపట్నం వస్తే అర్జంటుగా అంగర వెంకట

కృష్ణారావు ఇంట్లో సమావేశం పెడితే పదహారుమంది చిన్నా పెద్దా కూడేరు.

"మీరెందుకు రాసేరో చెప్పండి" అని ఆరోజున నన్ను అంగర వెంకట కృష్ణారావు ఆ సమావేశం తరపున అడిగేరు. "ఈ మధ్య మా మీటింగుల్లో ఈ ప్రశ్నమీద మాట్లాడిస్తున్నాం. అంచేత మీరు మీ సంగతి చెబితే బావుంటుంది"

విశాఖపట్నం రచయితలు అప్పటికే సామాజిక స్పృహతో మెరుస్తున్నారని నాకు తెలుసును. నాలో అలాంటి మెరుపేదీ లేదనీ నాకు తెలుసును. అంచేత "మీ సంప్రదాయానికి నన్ను బలిపెట్టేకండి, ప్లీజ్!" అని అప్పటికి ఆ గండం తప్పించుకున్నాను.

1970లో నేను విశాఖపట్నానికి ఉద్యోగరీత్యారాగా ఇక్కణ్నించి ఉద్యోగ రీత్యా మరేవూరికీ వెళ్ళకుండా ఉండిపోగలిగితే బావుండునన్న కోరిక నాలో బల పడింది. 1974లో నా ఉద్యోగనాప విశాఖరేవుకి చేరడంతో (అంటే, ఆంధ్ర ప్రదేశ్ సర్వే మరియు ల్యాండు రికార్డుల శాఖ నుంచి విశాఖపట్నం పోర్టు ట్రస్టుకి నాకు ట్రాన్స్ఫరవడంతో) ఆ కోరిక తీరింది.

విశాఖ రచయితల సంఘం, "నేనెందుకు రాస్తున్నాను" అనే శీర్షికకింద కొందరు రచయితలచేత చేయించిన ప్రసంగాల వ్రాత—ప్రాతాల్లో కొన్ని వివేకానందమూర్తి ద్వారా నాదగ్గిర చేరేయి. మరికొన్ని అత్తలూరి నరసింహారావు దగ్గిర చేరేయి.

అతను ఇవన్నీ కలగలిపి పుస్తకంగా వేయిద్దాం అనే సంకల్పం వెలిబుచ్చడమే కాకుండా. ఆ పుస్తకంలో నా వ్యాసంకూడా ఉంటే బావుంటుందన్నారు. "ఈ వ్యాస సంకలనానికి మనం సంపాదకులుగానే ఉందాం" అని చెప్పేసి. ఈ ప్రశ్నని రెండోసారికూడా దాటవేశాను.

0 0 0

"ఎందుకు రాసేను" అనే విషయం పాఠకులకి రచయిత వివరించాలంటే ఏమిటి రాసేడో తెలుసుకోవాలి. "ఎ రైటర్ రైట్స్ బట్ వన్ స్టోరీ" అన్నాడెవడో అప్రాచ్యుడు(అదే. పాశ్చాత్యుడు)—ఆ ఛోరణి తోరణాన్ని వెతికి పట్టుకుని తన్నుతాను సమర్థించుకుంటూ ఆ వ్యాసం రాసుకోకపోతే అభాసయిపోతాడు.

—ఇదే నాకు పట్టుకున్న భయం.

అందుకే, ఎందుకు రాశానో అప్పట్లో రాయలేదు.

0 0 0

1949లో, ఇంగ్లీషు "స్వతంత్ర" లో ఉత్తరాల శీర్షికకి రాసిన ఒక పొలిటికల్ లెటర్‌తో ప్రారంభించేను. సినీమా రెవ్యూలు ఇప్పట్లా పత్రికల నిలయ విద్వాంసులే రాయాలన్న నియమం లేక, సాధారణంగా ప్రేక్షకులే రాసేసేవారు. అవి కొన్ని రాసేను.

ఒక అమాయకురాలైన పల్లెపిల్ల వాళ్ళ పెద్దల నిర్ణయంవల్ల ఒక పట్నవాసపు కుర్రవాడికి భార్య అయిపోతే ఆ పిల్లని అతగాడు చీటికీ మాటికీ ఆట పట్టిస్తూ ఒక సందర్భంలో తను వేసిన వల్లో తనే పడిపోడం ఇతివృత్తంగా రాసిన "నేను— మా [illegible]" అనేది నా మొదటికథ. మా ఇరుగునా పొరుగునా జరిగిన చిన్న చిన్న సంఘటనలు (దాంట్లోంచి ఏమాత్రం హాస్యం ఉత్పత్తి అయ్యే అవకాశం ఉన్నా పట్టేసి) కథలుగా రాసేసేను. పైకి నవ్వు పుట్టిస్తూ ఎక్కడో ఒకపాత్ర పడే వేదన ఉన్నట్టుండి గుండెను కలుక్కుమనిపించ గల కథలు రాయడం నాకు ఇష్టంగా ఉండేది. బహుశా ఆ ధోరణి అప్పటి పత్రికాధిపతులకి బావుండడంవల్ల నాకు పత్రికా ప్రవేశం సులభతరం అయివుండి ఉండొచ్చు. చిత్రగుప్త, వినోదిని, ఆనందవాణి, ఢంకా, తెలుగు స్వతంత్ర, సూర్యప్రభ, కథాంజలి, ఆంధ్రపత్రిక వీక్లీ, జ్యోతి (పక్షపత్రిక....తెనాలి) ఈ పత్రికలన్నీ నా కథలు అచ్చు వేసేవి. భారతి లో 1950 నాడే నాకథ అచ్చు పడ్డాది. అదుగో, అందుకు రాశాను. ఆ కథలన్నీనూ. అంటే: నేను రాస్తేఅచ్చు వేసే పత్రికలున్నాయి కదా అని రాసేను. భారతిలో ఆ కథ అచ్చయిన నాటికి నేను బి.ఏ (ఫస్టియర్) విద్యార్థిని. ఆరోజు నాకిప్పటికీ జ్ఞాపకం. ప్రఖ్యాత పండితుడు. బహు పాశ్చాత్య భాషావేత్త రోణంకి అప్పలస్వామి (మా ఇంగ్లీషు మేష్టారు) ఆవేళ కార్లయిల్ ఫ్రెంచ్ రివల్యూషన్ మీద చెప్పవలసిన పాఠం రద్దుచేసి విండుక్లాసులో ఆ కథ చదివి వినిపించేరు- వినండర్రా మీ సహాధ్యాయి రాసిన కథ-అంటూ. ఆ సాయింత్రం అంట్యాకుల పైడిరాజు "ఆర్ట్ ఎకాడెమీ" లో వాసో, కొత్తపల్లి వీరభద్రరావు మొదలైన వారందరికి నన్ను మెచ్చుకుంటూ పరిచయం చేసేరు. అందుకు రాసేను, ఆనాటి కథలు. నేను రాసిన కథలు నా

అధ్యాపకుల్ని మెప్పించ గలుగుతున్నాయని ఆత్మ విశ్వాసంతో రాసేను. భారతి లో పడిన కథకి డబ్బు పంపేరు. ఆ మనియార్డర్ చూసి మా నాన్నగారు. "ఓరి వోరి! నేను నెలరోజులు ఉద్యోగం చేస్తే వొచ్చే డబ్బు నువ్వొక్క్కథ రాసి సంపాదించేసేవురా!" అని బాధగా ఆనందించేరు. అదుగో. అందుకు రాసేను, ఆ కథలు. అంటే,కథలు రాస్తే డబ్బు కూడా వస్తుందని రాసేను. రచయితలకి డబ్బులివ్వకుండా ఎగేసే పత్రికలు ఇప్పటికన్నా అప్పుడు ఎక్కువగా ఉండేవి. రచన ప్రచురించగానే "మరి, డబ్బు పంపండి సార్" అని ఎడిటర్ గారి పేరిట ఉత్తరం రాసి ఆ కథకి డబ్బు అందుకున్నప్పటికీ ఆ తరువాత ఆ పత్రిక ఆదరణ (అంటే నా కథ ఆ పత్రికలో ప్రచురించే యోగ్యత) పోగొట్టుకోడం అనుభవంలో కొచ్చినా రచనచేస్తే డబ్బు వస్తుందనే సామాజిక స్పృహ కలగడం నా రచనా వ్యాసంగ చరిత్రలో ఒక కిలోమీటర్ రాయిగా పేర్కొనవచ్చు. (నాకు కలిగిన మొట్టమొదటి, మరియు చిట్టచివరి సామాజిక స్పృహ అదేనని నాకు చాలా అనుమానం) అంచులోనూ; తవిరి ఇనుమున తైలంబు తీసినట్టు, ఆనందవాణి పత్రికనుంచి మనియార్డర్ అందుకున్న పారితో షిక వీరుడిగా నాకు 1951 నాటికే చాలా ఖ్యాతి వచ్చింది.

1953 ప్రాంతంలో అకారణంగా ఆగిపోయిన నా కథన కుతూహలం (కొద్దిపాటి మినహాయింపులు తీసేస్తే) బాపు, ముళ్ళపూడి వెంకటరమణ, నండూరి రామమోహనరావు, రావికొండలరావు, వి.ఎ.కె. రంగారావు, వి.వి రాఘవయ్య సంపాదక మండలిగా 1963లో వెలువరించిన జ్యోతి (మాసపత్రిక) తో మళ్ళీ చెలరేగింది. ఈసారి, నాకిష్టమైన వ్యక్తులు కొందరు నా కథలని చదివి, బొమ్మలువేసి, ప్రచురించి ఇష్టపడుతున్నారనే భావం నాకిచ్చిన ప్రోత్సాహంవల్ల కథలు రాయడం సాగించేను. బాపు అంతటి ఆర్టిస్టు నేను సరదాగా రాసిన కథలకి నాలుగేసి ఆరేసి బొమ్మలు వేసెయ్యడమేకాక ఎప్పుడు నేను కనిపించినా ఆత్మీయంగా ప్రశంసా పూర్వకంగా మాట్లాడే వారంటేను; ముళ్ళపూడి వెంకటరమణ ఇవాళ కూడా నేను 1960లో రాసిన ఒక కథగురించి లోతుగా మాట్లాడకుండా నన్ను సాగనంపరంటేను, నండూరి రామమోహనరావు నా పుస్తకాలకి ప్రిఫేసులు రాస్తూ ఎవరికోగాని ఇయ్యని కితాబులు ఇచ్చారంటేను, రాస్తానా, రాసి చూపిస్తానా!

వాళ్ళేకాదు. కథా సాహిత్యం గురించి అంతో ఇంతో తెలిసినవాళ్ళు, కల్పనా సాహిత్యపు లోతుపాతులను చవిచూసినవాళ్ళు అయిన సంపాదకులు విమర్శకులు పాఠకులు ప్రోత్సహించడంవల్ల కూడా; నేను రాస్తున్నాను.

సమాజంలోని క్రౌర్యాలు నైచ్యాలు దౌష్ట్యాలు అట్టడుగు చీకటికోణాలు నా కథల్లో ప్రసక్తికి రావని. మధ్యతరగతి సంసారాల్లో తటస్థపడే స్వల్ప ప్రాముఖ్యంగల సంఘర్షణలను వస్తువులుగా తీసుకునిమనసును ఆహ్లాదపరచేవిధంగా నేను కథలు రాస్తానని, నండూరి రామమోహనరావు ప్రభృతులు చెప్పేరు. ఈ "విశ్లేషణ"లో ప్రశంసా అభిశంసా కలిసే ఉన్నాయని నాకు చాలా లేటుగా తెలిసింది. పాఠకులకి వినోదం (పోనీ ఆహ్లాదం) రచయితలకి ధన ప్రతిష్ఠలు మాత్రమే సాధించే రచనా వ్యాసంగం యావత్తూ ప్రయోజన విహీనం అని కొట్టి పారెయ్యగలిగే ప్రమాణాలు అమల్లోకొస్తే నాతోబాటుగా చాలామంది రచయితలూ ఒకరో ఇద్దరో తప్ప రచయిత్రులందరూనూ బఫూన్‌లయిపోతారు. వ్యాపారంలో లాభాలు చేసుకునేవాళ్ళూ రచనా వ్యాపారంలో లబ్ధి పొందేవాళ్ళూ ఒకటి కాదన్నది విజం, విజం!

"ఎందుకు రాయడం లేదు?" అని అడిగినట్టే "ఎందుకు రాస్తున్నావు?" అని కూడా ఎవరో అడుగుతూనే ఉంటారు నన్ను. సరికొత్త ట్రెండ్స్ సెట్ చేసి, తెలుగు కల్పనా సాహిత్యపు పరిధినీ పరిమాణాన్నీ అనూహ్యంగా మార్చేసిన ఈ కొత్తయుగపు రచయితల కాలంలో "ఎందుకు రాస్తున్నానా" అని నాకూ అనిపిస్తూనే ఉంటుంది!

— బరాగో

# భరాగో

నాకు చాలా ఎక్కువగా నచ్చిన చాలా తక్కువమంది రచయితలలో భరాగో అనబడే భమిడిపాటి రామగోపాలంగారు ఒకరు.

ఆయన కథలతో నా పరిచయం 1958-59లో ఆయన "వాహిని" అనే మారుపేరుతో ఆంధ్రవారపత్రికకు తన కథలు పంపించిన నాటిది. ఆయనతో నా పరిచయం అముద్రితంగా, అనాదృతంగా మిగిలిపోయిన తన కథ లన్నిటిని నా కోరికపై మళ్ళీ ముచ్చటగా ఫెయిర్ కాపీచేసి (1963 లో) "జ్యోతి" మాసపత్రికకు అందజేసినప్పటిది.

వెన్నెల ఎంత బావుంటుందో వెన్నెట్లో నీడలుకూడా అంత బావుంటాయి. ఆయన కథలు చదువుతూంటే వెన్నెలనీడలలో కూర్చుని సర్దాగా కబుర్లు చెప్పుకుంటున్నట్టు వుంటుంది. ఆయన కథ చెప్పడం రుజ్జుగాను, లజ్జుగాను కూడా వుంటుంది. ఎంత గహనమైన జీవిత సత్యమైనా ఆయన అలాగ్గా, చులాగ్గా చెప్పేస్తారు. చెప్పే పద్ధతి ఆయన మాట లాగానే చురుగ్గాను, కరుగ్గాను వుంటుంది. ఆయన వాక్యాలు ఆయన లాగానే చాలా నిష్కర్షగాను, మొగమాటం లేకుండాను వుండటానికి ప్రయత్నిస్తున్నట్టు కనబడతాయి. కాని, అవి చెప్పేవి మాత్రం మృదువైన విషయాలు, ప్రియమైన సంగతులు.

రామగోపాలంగారి కథలు చాలావరకు మధ్యతరగతి సంసారాల కష్టసుఖాలకు సంబంధించినవి, ఆయన పాత్రలు ఘోరంగా కష్టాలు పడిపోతూ వుండవు. ప్రపంచంలోని దారుణ దురంతాలను, క్రౌర్యాలను, నైచ్యాలను, అత్యాచారాలను, భయంకరమైన చీకటి కోణాలను అవి చూపించవు. మనస్సును వికలం చేసే విషాదాల జోలికి అవి వెళ్ళవు.

చంద్రుడి మీదికి నల్లటి మబ్బుతునక వచ్చి కాసేపు ఆగి వెళ్ళిపోయినట్టు వుంటాయి రామగోపాలంగారి కథలు.

కొందరు జీవిత యదార్థాలను ఎక్స్‌ట్రీమ్స్‌లోనే చూడగలరు. మరి కొందరు సాధారణ సంఘటనలలో నుంచి కూడా జీవిత కవిత్వాన్ని పిండగలరు. రామగోపాలంగారి కథలు ఈ రెండవ కోవకు చెందినవి.

రామగోపాలంగారి కథలు-చాలా సాధారణంగా వున్నట్టు కనిపిస్తూనే మళ్ళీ మళ్ళీ ఆలోచింప జేస్తాయి. ఆయన ప్రతి కథ మనుషుల మనస్తత్వాలకు ఒక స్టడీలాగా వుంటుంది. నాకు ఇలాంటి కథలు ఇష్టం. మీరు కూడా ఇష్టపడతారని నా నమ్మకం. చదవండి.

—నండూరి రామమోహనరావు

# ఆరామ గోపాలాలు

ప్రతి మంచి రచయితలోనూ ఒక విమర్శకుడు దాక్కొని వుంటాడు. రామగోపాలంగారిని చూస్తే నాకు విమర్శకునిలో దాగొన్న 'ఆర్టిస్ట్' కనిపిస్తాడు. రామగోపాలంగారిలో వున్న ఆర్టిస్టూ విమర్శకుడూ యిద్దరూ కలిసి ఈ కథల్ని నడిపించారు.

రామగోపాలంగారి కథలు నేతిగారెల్లా వుంటాయని నా కంటె పెద్దవాళ్ళ అనగా విన్నాను. ఆఫీస్ లైఫ్‌కీ, హౌస్ లైఫ్‌కీ [illegible] ప్రవేశించని పక్షం కథలు యీ రచయిత కడుపుల్లోగా రాస్తారు. [illegible] లంగ రించి పోయడంలో రామగోపాలంగారి కథలు ఆరామ గోపాలాలు!

'కఠిన శిక్ష' కథలో సులోచన శ్రీవారికి రాసిన ప్రేమలేఖ ఒక హ్యూమన్ డాక్యుమెంట్. 'ప్లాస్టిక్' కథలో [illegible] గదిలోని చీకటి శ్యామలలాంటి అమ్మాయిని తప్పించుకోవడం [illegible]. 'ఏకవీర' లోని ట్రాజెడీ అనివార్యంకాగా 'వెన్నెల నీడ' లోని ట్రాజెడీ నుండి శ్యామలను రచయిత అనివార్యంగా తప్పించినారు. [illegible] వెన్నెల నీడలతో రాజీపడాలి.

ఈ సంకలనంలోని శ్యామల, సరళ, కమల, [illegible] శ్యామల, సులోచన —వీరంటే నాకెంతో యిష్టం. రామగోపాలంగారి [illegible] ప్రసిద్ధమైన [illegible] పరిచయం కోసమైనా మీరీ కథలు చదవాలి!

—పురాణం సుబ్రహ్మణ్యశర్మ

(ఆంధ్రప్రభ, దినపత్రిక; విజయనగరం ఎడిషన్; 1985 ఆగస్టు 3వ తేదీని ప్రచురించిన వ్యాసంలో ఆ తరవాతి భోగట్టాలు చేర్చి)

# పదినిమిషాల్లో భరాగో పరిచయం

భరాగో అని వెనకాల పేరు రాసి వున్న ఓ డొక్కు లూనామీద, ఇంకా డొక్కుకాని భరాగో వెళ్తూ వుంటారు. పిచ్చిబట్టలు ఒంటిమీద తగిలించుకుని వుంటారు. ఓ మాసిన సంచి చంకన మోస్తూ వుంటారు. సగం బట్ట బుర్ర చేసుకుని వుంటారు. ఒంటిమీద అంతా నెరిసిపోయి వుంటారు. కాస్త లావు మీద పొట్టిగా, కాస్త పొట్టిగా వుంటారు. ఏ మాత్రం గర్వంలేకుండా వుంటారు. కొత్తవారికి కాస్త వెర్రి బాగుల వాడిలా వుంటారు. కడుపుబ్బ నవ్వేట్టు కబుర్లాడతారు. పగలబడి నవ్వేట్టు పన్నింగు చేస్తూ వుంటారు. అప్పుడప్పుడు గాత్ర సాధన చేస్తూ వుంటారు. బడ్డీ కొట్లమీదకెళ్లి తన కిళ్ళీ తనే స్వతంత్రంగా చనువుగా తృప్తిగా కట్టుకుంటూ వుంటారు. మంచి భోజనం అంటే మహదానంద పడిపోతారు. మంచి కాఫీ పెట్టడం మహాపసందుగా చేస్తూ వుంటారు. కోక్ టీ కలిపి వచ్చినవాళ్ళకి ఇష్టంగా ఇస్తూ వుంటారు. అక్షరాలు కుదురుగా, గుండ్రంగా రాస్తూ వుంటారు. విశాఖ రోడ్లమీద హడావుడిగా దొర్లిపోతున్నట్టు వుంటారు. బండెడు పనులు బట్టబుర్ర మీద వేసుకుంటారు. అరవచాకిరీలో అప్పుడప్పుడు అలిసిపోయినట్టు వుంటారు. ఇళ్ళమధ్యా వూళ్ళమధ్య బంతిలా తిరుగుతూ వుంటారు. మనుషుల మధ్య సరిహద్దులు తెలిసి సంచరిస్తున్న వారిలా వుంటారు.

ఇలాంటి భరాగో గార్కి మంచి చదువరి అయిన నాన్నగారు వుండటం అదృష్టం. ఇంట్లో సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు భాషల్లో క్లాసికల్ సాహిత్యం వుండటం మరో అదృష్టం. భారతి, చిత్రగుప్త, వినోదిని పత్రికలు వుండటం ఇంకో అదృష్టం. పుష్పగిరి అనే అందమైన పేరుగల వూళ్లో ఈయన పుట్టడం మరో అదృష్టం. శ్రీ రంగం గోపాలరత్నంగారి ఇంట్లో అద్దెకు వుండటం మరీ మరీ అదృష్టం. వేణుగోపాలస్వామి ఆలయంవున్న వూళ్లో తన పేరు రామగోపాలం అవటం మరొక అదృష్టం. తండ్రి సూర్యనారాయణ గారు టీచర్‌గా వుండటం విజయనగరం, శృంగవరపుకోట తాలూకాల్లో గ్రామాల మధ్య నడుస్తూ వెంట తిప్పుతుని చరిత్రా భాషా పాఠాలుగా చెప్పి తీర్చిదిద్దడం భలే భలే అదృష్టం.

ఇంత సంప్రదాయ, సమకాలీన వాతావరణం మధ్య. ఇన్ని అదృష్టాల మధ్య 6-2-1932న పుట్టిన భమిడిపాటి రామగోపాలంగారు, అయిదో తరగతి వరకు ఏ స్కూల్లోను చేరకుండా ఇంటిదగ్గరా తండ్రిగారిదగ్గరా ఇష్టం వచ్చి నట్టు చదివారు. ఆరేడు తరగతులు అలమండలో చదివారు. ఫర్ట్ ఫారం నుంచి బి.ఏ. వరకు విజయనగరంలో చదివారు. ఎన్ని అదృష్టాలు వరించినా ఆర్థిక దురదృష్టం వెంటరాగా రిటైర్డు పెదనాన్నగారింట్లో పడకెయ్యటం; మహారాజా వారి సత్రంలో భోజనం చెయ్యటం, కాలేజీ ఫీజులకోసం ఖాళీవున్నప్పుడల్లా ప్రయివేట్లు చెప్పటం చేస్తూ వుండేవారు. ఇలా చదివి ఇంటర్‌లో ఒకసారి దూదేసి, 1951లో బి.ఏ. పాసయ్యారు. 1951లోనే మొదటి ఉద్యోగం ఏనభై రూపాయలతో సెన్సస్ ఆఫీసులో క్లర్క్‌గా విజయనగరంలో వచ్చింది. ఆరు నెలలు చేసిన తర్వాత 1951 చివరిలోనే అలనాటి మద్రాసు గవర్నమెంటు సర్వే డిపార్టుమెంటులో గుమాస్తాగా విజయనగరంలోనే వచ్చింది. ఈయన లెఖ్ఖల పనితనం దస్తూరీ చూసి 1953లో సొంత డిపార్టుమెంటు వాళ్ళే సర్వే యర్‌గా తీసుకున్నారు. 1957లో జిల్లా సర్వేయర్‌గా ప్రమోషన్ ఇచ్చారు. అక్కడ నుంచి 1974 వరకు విశాఖ, శ్రీకాకుళం, తూర్పు గోదావరి, గుంటూరు, కృష్ణా, ఖమ్మం, నల్గొండ, హైదరాబాదు జిల్లాలు చుట్టుముట్టే శారు. పట్టణాల నుంచి పల్లెల వరకు కాలికి సర్వే గొలుసులు కట్టుకుని తెగ తిరిగారు. 1974లో బి.కె. రావుగారి పుణ్యమా అని ఉద్యోగ నావ విశాఖరేవు చేరగా విశాఖపట్నం పోర్ట్ ట్రస్టులో డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ సర్వేగా చేరి పోర్టు భూముల్ని కొలుస్తున్నారు.

భరాగోగారు ఇలా భూదేవిని కొలవకముందే ఇంటర్‌లో వున్నపుడు సరస్వతీదేవిని కొలిచారు. 1949 ఆగస్టు 15 మొదటి స్వాతంత్ర్యదిన వార్షికో త్సవ సందర్భంలో "సంఘ సంస్కరణ- చట్టాల పాత్ర" మీద వ్యాసరచన పోటీల్లో వ్యాసమే కథలా రాస్తే మొదటి బహుమతి వచ్చి మొదటి రచన అయి కూర్చుంది. ఇలా మొదటి వార్షికోత్సవంలో మొదటి బహుమతిని, దేశ స్వాతంత్ర్యంతోపాటు రచనా స్వాతంత్ర్యాన్ని సంపాయించారు. స్వాతంత్ర్య సౌభాగ్య రథం కదిలినట్లుగానే, రచనా సౌందర్యరథం కదిలించారు. దాంతో మొట్టమొదటి కథగా 1-2-1949 ఆంధ్రపత్రికలో "నేను-మా ఆవిడ" అనే కథరాశారు. ఇది విద్యార్థిగానే, పెళ్ళికాకముందే ప్రచురించారు. ఆ ఉత్సాహంతోనే 1950లో "పిచిక" కథ రాస్తే భారతిలో అచ్చేశారు. పైగిమిడేళ్ళకే భారతి వరించిన

భరాగోగార్ని విజయనగరం పెద్దలు కూడా పరించి వన్నెలోకి తెచ్చారు. 7-4-1950 నాడు రోణంకి అప్పలస్వామి మేస్టారు క్లాసుకివచ్చి, పాఠం చెప్ప కుండా పిచిక కథ చదివి వినిపించారు. కథ ముగింపు గురించి చర్చించారు. క్లాసులోనే వున్న రామగోపాలంగార్ని సాయంకాలం పైడిరాజుగారి ఆంధ్రాఆర్టు అకాడమీ దగ్గరికి రమ్మన్నారు. తన మిత్రులకు ఆ కథ చదివి వినిపించ మన్నారు. అలా మేస్టారు ఆదేశించగా, ఆనందం ఆవేశించగా "పిచిక"ని చంకన పెట్టుకుని పెద్దలదగ్గరకి పిచ్చికలా వెళ్ళారు. అక్కడ అకాడమీ ఆవర ణలో రోణంకి, చాసో, నారాయణబాబు, పువ్వాడ శేషగిరిరావు, నిడదవోలు లింగమూర్తి, కొత్తపల్లి వీరభద్రరావు, పైడిరాజు పరివేష్టించి కథ విన్నారు. కిచకిచల గుర్తింపు చప్పుళ్ళు, కితకితల అభినందనలు చేశారు. అక్కడినుంచి భరాగో చాసో పట్టులోకి వెళ్ళారు.

ఆ సంవత్సరంలో ఆ ఉత్సాహమే తెలుగు స్వతంత్రలో కొన్ని కథలు రాయించింది. వాళ్ళు ఏమీ డబ్బు యివ్వకపోతే ఆ పట్టే తిన్నగా ఖాసా సుబ్బా రావుగారికే పుత్తరం రాయించింది. అ ఉత్సాహమే ఖాసా నుంచి వెంటనే పుత్తరాన్ని పారితోషికాన్ని సంపాయించింది. ఆ పట్టే పత్రికలచేత పారితో షికాన్ని ఇప్పించే సంప్రదాయాన్ని ప్రయత్న పూర్వకంగా చేసింది. దాంతో అక్కడనుంచి ఆ పత్రిక ఈయన కథల్ని వేసుకోవడం విరమించేసింది. ఆ తర్వాత 1951లో బి. ఎ. పరీక్షల తర్వాత బతుకుతెరువుకోసం రాజమండ్రిలో కొద్దిరోజులు వున్నప్పుడు తెరుపు కానక కథలు రాస్తూ,నవల తలుపులు ఏకంగా తెరిచేశారు. అప్పుడే "కుండ పెంకులు" అనే నవల రాసేశారు. వెంటనే ఆంధ్రపత్రికవాళ్ళు ఆ తొలినవలని సీరియల్‌గా వేసేశారు.

ఇలా 1951 వరకు రాసిన కథలు. నవల తన అసలు పేరుతోనే ప్రచు రించారు. 1951లో ఎప్పుడయితే గవర్నమెంటు సేవ మొదలైందో అప్పుడే మారు పేరులోకి మారిపోయారు బ్రిటిషు వాళ్ళు పెట్టిన ఓ రూలువల్ల ప్రభుత్వ సేవకుడు సాంస్కృతిక కార్యకలాపాల్లో పాల్గొన కూడదు. పాల్గొంటే ముందే అనుమతి పొందాలి. దానిలో ఆదాయం వుంటే మూడోవంతు ప్రభుత్వానికి కట్టాలి. ఈ రూలు తెల్లదొరల పరిపాలనలో పెట్టినా. స్వాతంత్ర్యం సంపాయిం చిన తర్వాత కూడా 1963 ఏప్రిల్ వరకు వుంది. ఆ తర్వాత కళ్ళుతెరచి రద్దు చేయడంవల్ల, అసలు కలాలు బయట పడ్డాయి. ఆ రూలు వుండటంవల్లే 1960లో ఆంధ్రపత్రిక కథల పోటీలో పాల్గొనటానికి గుంటూరుజిల్లా కలెక్టర్

అనుమతి తీసుకున్నారు. అప్పుడే "వెన్నెలనీడ" కథరాస్తే రెండవ బహుమతి అందుకున్నారు. ఇది తప్ప ఆ రూలు వున్నంతకాలం "వాహిని" గానే వుండి భమిడిపాటి రామగోపాలంగా మళ్ళీ పునర్దర్శనం చేశారు.

ఒకపక్క తను రచయిత అవటం పట్ల నాన్నగారి అయిష్టతను. కోప తాపాలను చవిచూస్తూ, ఇంకోపక్క పెద్దల ప్రేరణలమధ్య పెరుగుతూ వడి వడిగా డజన్ల కొద్దీ కథలు (ఎక్కువ ఆంధ్రపత్రికలో)రాశారు.1954-68 మధ్య రాసిన కథల్లో హాస్యానికి ఎక్కువ ప్రాధాన్యంఇచ్చారు. 1955లో సత్యభామ గార్ని పెళ్ళాడారు ఆ తర్వాత ముగ్గురు పిల్లలకి తండ్రి అయ్యారు 1959 నుంచి 1962 వరకు అల్డస్ హక్స్లీ, మామ్, ఆస్కార్‌వైల్డ్. టాల్‌స్టాయ్, గ్రాహం గ్రీన్, మొపాసా, ఓ హెన్రీ, చెహోవ్. పూర్తిరచనలు పూర్తిచేశారు. 1963లో బాగఖ్వార్ యూనివర్సిటీ ఇంగ్లీషు ఎమ్. ఏ. పరీక్షకి చదివారు. 1971లో ఆంధ్రా యూనివర్సిటీ తెలుగు ఎమ్. ఏ.సెకండ్ క్లాస్‌లో పాసయ్యారు 1977లో 'మనోధర్మం' కథకి రెండవ బహుమతిగా యువ చక్రపాణిఅవార్డు పొందారు. 1981లో'రాజీ' నవల సత్యభామ పేరుతోరాశారు1983లో ఆంధ్రజ్యోతి "స్వర్ణ రేఖ"నవల సృష్టించారు. ఇలా దాదాపు నలభై ఏళ్ళ రచనా జీవితంలో రెండు రెండవ బహుమతి కథలతోపాటు, సుమారు 120 కథలు, 'వంటొచ్చిన మొగాడు' 'వెన్నెలనీడ' అనే రెండు కథా సంపుటాలు; మూడు నవలలు రాసి భమిడిపాటి రామగోపాలం గారు భరాగోగా ముచ్చటగా మూడక్షరాల్లో స్థిరపడి పోయారు.

ఇవికాక 1960 నుంచి విజయవాడ, హైదరాబాదు, విశాఖ రేడియోలకి హాస్య నాటికలు అందించారు. 1963-68మధ్య జ్యోతి మాసపత్రికలో కొందరు ఇంగ్లీషు రచయితల్ని పరిచయం చేశారు. 1967-68 మధ్య ఆంధ్రజ్యోతిలో గౌరవ ఉప సంపాదకులుగా ఉపకారాన్ని పొందారు. 1974-77 మధ్య "ఈనాడు" దినపత్రిక పేజీల్లో సాంస్కృతిక విలేఖరి (సత్యభామ)గా ప్రాతి నిధ్యం వహించారు. 1977-84 మధ్య ఆంధ్రజ్యోతిలో "పఠన విహారం" శీర్షిక నడిపారు. అదే పత్రికలో దాదాపు రెండు వందల పుస్తక సమీక్షలు రాసి "విద్యానాథు" డని "సత్యాపతి" అని అనిపించుకున్నారు. నవలలు, కథల పోటీ లకి న్యాయనిర్ణేతగా వుండి నిగ్గు తేల్చారు. దిన పత్రికల్ని క్షుణ్ణంగా చదవటం హాబీగా పెట్టుకున్నారు. అశుతోష్ ముఖర్జీ జీవిత చరిత్రని నేషనల్ బుక్ ట్రస్టు కోసం తెలుగు అనువాదం చేసి పెట్టారు. హైదరాబాదు ప్రాంతంలో రాసిన

'కల్పసూత్రం'లో జైనమత ప్రవక్త వర్ధమాన మహావీరుడి అవతరణ, ప్రవచనాలు, చాతుర్మాస దీక్ష వివరాలున్న ఎనిమిదో సంపుటాన్ని అనువాదం చేశారు.

వీటన్నిటితోపాటు 1971-76లో విశాఖ రచయితల సంఘంలో సభ్యులుగా వున్నారు; తర్వాత 1976 నుంచి విశాఖ సాహితి ఉపాధ్యక్షులుగా వున్నా, కార్యదర్శిగా వున్నా, తానే సారథ్యం చేపట్టారు. మీటింగులు పెట్టడంలోను, పుస్తకాలు అచ్చు వేయించటంలోను, పిక్నిక్కులు పెట్టించటంలోను, చాసో సప్తతి సభలోను; పద్మరాజు సంపుటాల్లోను భరాగో ముద్ర కనిపింప చేస్తున్నారు. ప్రతి సంవత్సరం పత్రికల్లో వచ్చిన బహుమతి కథలు కంచికి వెళ్ళకుండా సంపుటీకరించాలని ప్రయత్నించి విఫలమయ్యారు. తనకథలకి ఎడిటర్‌లా వ్యవహరించిన చాసో గురువు చించెయ్యమంటే దాదాపు మూడు పదుల కథలు, ఒక నవల శుభ్రంగా తన చేతుల్తోనే చింపేశారు.

తెలుగు రచయితల్ని కలపటం, సూవెనీర్లు అచ్చు గుద్దించటం, వాటికి ప్రకటనలు పకడ్బందీగా పట్టుకోవడం భరాగోగారి బలహీనతలు. వీటికి తోడు చిన్నప్పుడే సంగీతం సరసన చేరింది. ఒక పక్క విజయనగరంలోనే వున్నా అవకాశాలు లేక మంచి సంగీతం వినే అవకాశం మాత్రమే కలిగి దానికి ఆకర్షితులై అంటుకు పోయారు. ఇంకోపక్క కుటుంబ పెద్దలంతా సంగీత సాహిత్యాల పట్ల అట్టే సానుభూతి లేనివారవడం వల్ల దొంగతనంగా స్నేహితుల దగ్గర గొంతులుమార్చి అనుకరించి పాడుతూ, వుండేవారు. ఇలా రఫీ, సైగల్, రాజా, భానుమతి, నాగయ్య, రాజేశ్వరరావు, బాలమురళి పాటల్ని గోపాలీకరిస్తారు, మధ్య మధ్య జోక్స్‌ని. పిట్ట కథల్ని, కల్పించి చెబుతూ భరాగీయం చేస్తారు, అలా భానుమతి, రాజేశ్వరరావు పాటల్ని వాళ్ళకే వినిపించి వాళ్ళని ఆశ్చర్యానందానుభూతిలో ముంచెత్తారు. ఇలా ఆయన పాడే పాటల్ని మొదట ఘమిడిపాటి జగన్నాథరావుగారనే మిత్రుడు విని పరవశులై మిగతా మిత్ర ప్రపంచానికి పరిచయం చేసి ప్రచారం చేశారు. అలా పది మంది చెవుల్లోను భరాగోగార్ని పడేశారు.అలా బాపు, బాలు. ముళ్ళపూడి, తంబు, వివేకం, ఆరుద్ర,ఎమ్వీయల్,శ్రీవిశాస్త్రి, కాశీపట్నం, వాసుదేవరావు, ఇస్మాయిల ద్వయం, నాగభూషణం, కొమ్మన, రాయల అభిమానం చూరగొన్నారు. 1959లో రేడియో కొనుక్కున్న దగ్గర నుంచి ఈయన సంగీతానికి దగ్గర చుట్టమై పోయారు. మంచి కథలతోబాటు మంచి సంగీతానికి సన్నిహితులై పోయారు.

త్యాగరాజు, అన్నమాచార్య, శ్యామశాస్త్రి కృతులు చదివి పరిచయం పెంచుకున్నారు. దాంతో ఎక్కువభాగం సంగీతం, పాతపాటలు ఉన్న రికార్డులు రెండు వందలకి పైగా సమకూర్చుకున్నారు. వి.ఎ.కె. రంగారావు నిధి నుంచి, డి.ఎస్. శంకర్‌గారి కలెక్షన్ నుంచి తనకి ఇష్టమైన పాత సినిమాపాటల లిరిక్స్ పోగు చేసుకున్నారు. వాటి వైశిష్ట్యాన్ని గురించి "ఏమని పాడుదునో" "పాత బంగారం" శీర్షికల క్రింద వ్యాసాలు వ్రాసి నిరంతరం వాటికి సమాచారం వినోదం అందిస్తున్నారు. 1987 మే లో మొదలు పెట్టి "ఆంధ్రభూమి" విశాఖ ఎడిషన్‌లో "కథన కుతూహలం" కొనసాగిస్తున్నారు.

సంగీత సాహిత్యాల్ని రెండు చెవులకీ, కళ్ళకీ అద్దుకునే ఫరాగోనాకి యువ రచయితలలో రాజారామమోహనరావు, కళ్యాణసుందరి జగన్నాథ్, వీరేంద్రనాథ్ మొదటి కథలు అంటే ఇష్టం. ముందుతరం కథకుల్లో రామకృష్ణ శాస్త్రి, సుబ్రహ్మణ్య శాస్త్రీ గార్ల భాష. చలంశక్తి, విశ్వనాథ శాస్త్రి విశ్వరూపం, కాళీపట్నం వినయం, బుచ్చిబాబు కవిత్వం, చాసో సంక్షిప్తత అంటే ఇష్టాతి ఇష్టం, తను రాసిన కథల్లో పెన్నెలనీడ, త్రిపుష్పచక్రం, [illegible], పడమటిగాలి, మూడుగదులు మొదలయినవి అంటే ఇష్టమతి ఇష్టం. సంగీత విద్వాంసుల్లో విలాయత్ ఖాన్ మెహిదీ హసన్. పర్వీన్ సుల్తానా, బడేగులాం, చెంబై, ద్వారం, బాలమురళి, ఎమ్.ఎస్. నేదునూరి, బాలచందర్ మరీ మరీ ఇష్టం.

సాహిత్యంలో సల్లాపాలాడుతున్న ఫరాగోనాడు కష్టజీవి, పుస్తకజీవి, కథలజీవి. సంగీతంతో సరాగాలాడుతున్న ఫరాగోనాడు సంస్కారజీవి, స్నేహజీవి. ఇలాంటి ఫరాగోనాడు ఇప్పటివరకు ప్రవృత్తికి భిన్నమైన వృత్తిలో సర్వేయర్‌గా భూదేవిని కొలుస్తూ వున్నారు. ఇక సరస్వతి దేవిని తలుచుకుని సాహసం చేస్తే, జీవితం రెండో పడిలోనున్నా ఆయనని [illegible] పత్రికా రంగంలో పట్టాభిషిక్తులవుతారు.

—అత్తలూరి నరసింహారావు

("జ్యోతి" మాసపత్రిక—మే, 1984)

# శృంగార సర్పం

**"పలుకు తేనెలతల్లి పవళించెను—**
**కలికితనముల విభుని కలసినదిగాన॥"**

అది అన్నమాచార్యులవారి మధురగీతం. ఆ గీతం యిక్కడ అనువర్తిం చదు....ఈ "లక్ష్మి" కూడా "పవళించింది!" కాని "కలికితనం"లేదు కరుకు దనమే!

**"అలసిసొలసి కలికిరూపం**
**ఆర్పివేయగ కోర్కె దీపం**
**నిదుర రామిని మాధవునికి**
**చెదరెమది యెంతో-"**

అది ఎవరో పూర్వకవి గీతంలోని శకలం.

రాఘవులు మంచంమీది నుంచి లేచాడు. లక్ష్మిని చూద్దామని అంతకు ముందు వెలిగించిన జీరోవాట్ దీపం ఆర్పేసి, పదకొండున్నర గంటల ఆ రాత్రప్పుడు డాబా మీదికి వెళ్ళాడు.

రెండేళ్ళయినా సరే, ఎందుకో, లక్ష్మికి ఈ రసం అనుభవైకవేద్యం కాలేదు. "నానుంచి ప్రయత్నలోపంయేమీలేదు!" అని అయిదువందల తొంభయ్యో సారి స్థిరంగా నిశ్చయంగా అనుకున్నాడు. "ఎవరది రాఘవులేనా?" ప్రశ్నవిని పక్కింటి డాబామీదికి చూశాడు.

ఆ పలకరింపు అమీర్ అహ్మద్‌ది.

"నేనే, అమీర్!"

"ఏం కథా? నిద్రరాలేదా?"

"నీకులాగానే."

"నాతో పోల్చుకోడం అంత ఆరోగ్యం కాదు భాయ్" అమీర్ చప్పుడు చేస్తూ నవ్వాడు. "ఇటువేపు వచ్చేస్తావా? బల్లతెస్తానుండు!"

పక్కపక్కనేఉన్న ఆ రెండు డాబాలూ ఒకే ఎత్తు. క్రిందిగదులు ప్రహరీగోడకి అయిదేసి అడుగుల దూరాన్నుండేట్టు కట్టినా, డాబాలు రెండు కూడా మూడేసి అడుగులు పక్కింటివేపుగా వ్యాపించేటట్టు కట్టుకున్నారు. ఇద్దరు "వోనర్లూ" ఎవరికి వారే.

అప్పుడెప్పుడో చిన్నప్పుడు ఒకే గదిలో ఉండి ఒకే కాలేజీలో ఒకే క్లాసులో వుంటూ నాలుగేళ్ళపాటు చదువుకున్న ఆస్నేహితులిద్దరూ వేర్వేరు రకాల ఉద్యోగాలు చేసుకుంటూ పది హేడేళ్ళపాటు ఎడబాసి మొన్ననీమధ్యనే మళ్ళా ఇక్కడ కలుసుకున్నారు. వాళ్లిద్దరూ ఈ ఊరికి ఉద్యోగరీత్యా చేరింది ఒకే నెలలో. ఇద్దరూ ఈ పేటలోనే అద్దెయిళ్ళ కోసం వేటసాగించి, కాకతాళీయంగా పక్కపక్క యిళ్ళు నిరుకు చేసుకున్నారు.

పక్కయింట్లో యెవరున్నారో తెలుసుకోక పోవడం "నాగరికం." ఐనా, అలా నెలరోజుల కన్నా ఆగలేకపోయాడు రాఘవులు, కారణం, రోజూ తను కాలేజీనుంచి ఇంటికొచ్చే వేళకి, ఒక స్పోర్ట్సు సైకిల్ తొక్కుతుంటూ వొచ్చే ఆ కుర్రవాడు....కాలేజీలో అప్పుడప్పుడు కనబడుతూనే వుంటాడు; గేదెల తొగమధ్యని ఆవులాగా, కాని అతగాడు తన స్టూడెంట్ కాదు.

ఆ కుర్రవాడిలో (మహమ్మదీయ లక్షణాలు మెండుగా కనబడుతున్నాయి) అమీర్ అహ్మద్ పోలికలున్నూ కనబడ్డంచేత; యామైతే ఐందిలే అని పలకరించేశాడు రాఘవులే.

జవాబుగా, "మా డాడీ పోలీస్ ఇన్స్పెక్టర్. మాది ఫీమ్లీ. మా నాన్నగారి పేరు అమీర్ అహ్మద్" అని ఆ కుర్రవాడు చెప్పేడు.

పద్దెనిమిదేళ్ళట.బి. ఏ. థర్డియర్ చదువుతున్నాడు. పేరు కలామ్. ఒక చెల్లెలు; నూరున్నీసాట, పదోక్లాసు చదివి మానేసింది. ఇంకో తమ్ముడు ఇబ్రాహీంట. తొమ్మిది చదువుతున్నాట్ట. వాడు పుట్టినప్పుడే వాళ్ళమ్మ పోయిందిట.

అన్నీ విన్నాక అమీర్ని పలకరించాలని మరింతగా కలిగింది. కోరిక, రాఘవులికి. కాని ఒకహత్యకేసు పర్యాటనలో చిక్కుకున్న అమీర్, ఆ మర్నాటి రాత్రి పదకొండు గంటలకి గాని ఇల్లు చేరనే లేదు. ఆ యెడబాటు భరించలేక పోయాడు రాఘవులు.

ఇంటికి రాగానే రాఘవులి సంగతి కొడుకు చెప్పగా విన్నాడు అమీర్. కాని ఆ పదకొండు గంటల రాత్రప్పుడు రాఘవుల్ని నిద్రలేపడమా అని సంకో

చం కలిగింది. అంతలోనే; పక్కయింటి గేటుదగ్గర లీలగా ఏదో శబ్దం వినిపించింది, ఆ పోలీస్ చెవులకి.

రాఘవులికి ఆ మోటార్ సైకిల్ చప్పుడుతో పరిచయం అయి పదిహేను రోజులే అయింది. అయినా ఆ విలక్షణమైన ధ్వని అతన్ని ఎంతగా ఆకర్షించిందంటే; అతను; "ఇదొకటి నేర్చారు. మధ్యలో లేచిపోవడం" అన్న లక్ష్మి మాటల్ని కాతరు చెయ్యకుండా వొంటికి లుంగీ గట్టిగా చుట్టబెట్టుకుని, ఒక గది తలుపూ ఒక వరండా తలుపూ తెరచి, తల్లికి మెలుకువ రాకుండా జాగ్రత్త పడుతూ; అమీర్ మోటార్ సైకిల్‌కి స్టాండేసే లోపుగా తన ఇంటి గేటు దగ్గిరున్నాడు....

డాబామీద వున్న గదికి పక్కనే విడిగా స్నానపుగదీ మరుగుదొడ్డీ వుండడాన్ని; అది అమీర్ ప్రయివేటు రూమైంది. మంచం, టేబుల్, ఫ్యాను, రిఫ్రిజిరేటర్, పుస్తకాలు, బట్టలు, ఫోన్‌కోసం ప్లగ్ పాకెట్టు. "మూడువందల అరవై రోజులూ ఇరవైనాలుగేసి గంటలుకూడా చేతినిండా పనుంటుంది గనకా సరిపోయింది గానీ, లేకపోతే ఈ ఒంటరి బ్రతుకు దుర్భరం భాయ్" అంటాడు. పనిలో ఒత్తిడి బాగా ఎక్కువైనా, బొత్తిగా ఖాళీగావున్నా ఆ గదిలో అతనొక్కడే కూర్చుని మద్యపానం చేయగలడు. ఎప్పుడైనా గాలి మళ్ళితే వొక "ఆడతోడు"ను రప్పించుకోవడం కద్దు. పక్కయింట్లో రాఘవులు ఉన్నాడని తెలిసినప్పటినుంచి చదరంగం ఆట సాగుతోందక్కడ. అమీర్ చదరంగంలో మంచి అశ్వికుడు. పట్టుమని నాలుగెత్తులయినా పడకముందే రాఘవులి ఆట నీరస పడిపోయిందని తేలిపోయింది.

**"జీవిత సార్థవాహము విచ్ఛిత్రగతిన్ పయనించు; నందులో**
**నీవొక రెప్పపాటయిన నెయ్యురతో సుఖముండు వేని**
**మోదావహ మంతకన్న కలదా! మధుపాత్రిక నందియిమ్ము**
**పాఖీ! వి వరించెదేల తిలకింపని రేపును రేయి జారెడిన్"**

అంటూ అందుకుని ఉమర్ ఖయ్యాం రుబాయీకి కవికోకిల రామిరెడ్డిగారి తెలుగుసేతలోంచి కమ్మని పద్యాలు చదవడం మొదలు పెట్టాడు అమీర్.

ఖమాస్, పూరబి, దేశ్, ముల్తానీ, బేహాగ్ పీలూ లాంటి హిందుస్తానీ రాగాల్లో, సంగతులూ దీర్ఘాలూ మోపు చెయ్యకుండా భావానికి ప్రాణంపోస్తూ అతనలా ఎన్ని పద్యాలైనా చదవగలడు. అంతేకాదు. పారశీక మూలంనుంచి

ఎడ్వర్డ్ ఫిజ్‌గెరాల్డ్ ఆంగ్లానువాదం నుంచి, ఆ పద్యాలెలా వెలువడ్డాయో ఆ స్వారస్య వివరమేమిటో చెప్పి కవికోకిల తీయని పలుకులను మెచ్చుకుంటూ శకలాలు శకలాలుగా సమాసాలు, సమాసాలుగా, ఖండాన్వయం చెయ్యగలడు.

అంతకుముందే రాఘవులు ఆట అంతంత మాత్రం. ఇహా దీంతో రేగిన కలత మరింత. అంచేత రాఘవులూ అందులోనే విజృంభిస్తాడు. "రహివుట్టు జంత్ర గాత్రముల రాల్గరగించు విమల గాంధర్వంబు విద్య మాకు" అని అల్లసాని పెద్దన మనుచరిత్రలోదో!

"-వాసోభూషణ గంధమాల్య రచనా వైచిత్ర్య సజ్జాంగియై ;
ఆ సీమంతిని అన్యకాంతయను మిథ్యా భ్రాంతి పుట్టించుచున్
వాసాగారమునందు నొక్కతెయ నానాభంగి వర్తించు న
త్యాసక్తిన్ -విభుండామోదముం బొందగన్"

అని శ్రీనాథుని శృంగార నైషధంలోదో "కూడితి విర, విడియుంచరా, మువ్వ గోపాల నా మోహ మెంచరా; వేదు కయ్యీని; కౌగరించరా" అని క్షేత్రయ్య పదం లోదో.

"సిగనిగని మోముపయి, నెఱులు గెలకులు చెదర
పగలైనదాక చెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారినదాక
జగదేకపతి మనసు జొప్పిగొనెగాన"

అని అన్నమాచార్య కీర్తనలోదో పద్యమో శ్లోకమో గేయమో అందుకుని, సమర్థవంతమైన వ్యాఖ్యానం నిర్వహిస్తాడు రాఘవులు.

"వహ్వా! వహ్వా!" అనీ "సుభానల్లా!" అనీ కరతాళ ధ్వనులు చేస్తాడు అమీర్. ఇంకా సరదా తీరకపోతే రాఘవులు భుజం మీదనో, నడుం మీదనో చరుస్తాడు. మరీ అయితే అతన్నోసారి కావలించుకుని తన దాడీలో మెచ్చుకుంటాడు. "ధన్యుడవురా, మిత్రమా!" అని అరుస్తాడు. "గో! హేవ్ ఎ నైస్ టైమ్!" అని రాఘవులకి వీడ్కోలిచ్చి రెండు డాబా గోడలకీ మధ్య బల్ల చెక్క వంతెన ఎక్కించి పంపేస్తాడు.

ఆ మాటల్లోంచి "గో!— హేవ్-ఎన్-ఐస్—టైమ్" అనీ వినిపిస్తుంది రాఘవులకి. బల్ల చెక్క యెక్కి డాబా మారి మెట్లు దిగి, మెట్ల గది తలుపు

మూసి పడక గదిలో కెళ్ళి, జీరో వాట్ బల్బ్ వెలిగించి అక్కడ కరగని "ఐస్" గడ్డలా నిద్రిస్తున్న ఇల్లాల్ని చూసి, దీపం ఆర్పేసి మంచం మీద ఆమెకి తగలకుండా ఒదిగి పడుకుంటాడు రాఘవులు.

**"అలికిడైతే చాలు, ఆసతో నా కనులు వెదికేను నలుదెసల, అతడేమొ"**

అనుకొని - కనులూ చేతులూ తెరవ వలసిన సీతారామలక్ష్మి మండు వేసంగిలో కూడా ముడుచుకొని పడుకోగలదని, అలికిడి కాగానే నిద్రా భంగమైనట్టు ఒళ్ళు కదిపి చిన్న మూలుగుతో ఒంటి మీదున్న వస్త్రాలన్నీ చాలనట్టు దుప్పటి లాక్కుని ముసుగు పోసుకుని గోడవేపు తిరిగి పోగలదని రాఘవులకి ముందే తెలుసును.

* * *

"బి.ఏ. సెంకండియర్ తెలుగు పేపర్లస్పాట్ వేల్యుయేషన్ కోసం వాల్తేరు వెళ్ళి పన్నెండు రోజులున్నాను బ్రదర్. అట్నుంచి ఆఖరోజు సాయం కాలమే వచ్చేద్దామనుకొనీ, కూడా, కొలీగ్స్ కోరిక ప్రకారం ఆ రాత్రి సినిమా కని ఉండిపోయాను. ఎంతమందినని కాదనడం? ఇటు ఏలూరునుంచి అటు శ్రీకాకుళం వరకు ఎందరో క్లాస్‌మేట్స్ లెక్చరర్స్ అయ్యారు....మర్నాడు సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌లో వచ్చాను!

"ఆ బండి అంత ఖాళీగా ఉండదేమొ. నేనెంచుకున్న సింగిల్ సీట్లో నేను. దానికి సరిగ్గా పక్క వేపున బెర్‌సీట్లో ఒక జంట, అంతే! ఆ కంపార్ట్‌మెంట్‌లో నాలుగో ప్రాణి లేదు! ఆ అమ్మాయి సుమారుపాతి కేళ్ళుంటాయనుకో -అత్యద్భుత సౌందర్యవతి అంటే నమ్ము! అతను కూడా సుమారు అందగాడూ స్ఫురద్రూపీనీ. ఇహ వాళ్ళిద్దరి లీలలూ ఏమని చెప్పను? కాసేపు అతను కిటికీని ఆనుకుని కూర్చుంటే అతని ఒళ్ళో తలపెట్టి ఆవిడ పడుకునేది. కాసేపు ఆవిడ కూర్చుంటే ఆవిడ ఒళ్ళో తలపెట్టి అతను పడుకునేవాడు! ఇక అవి ముచ్చట్లు కావు, ముద్దులు కావు, సరసాలు కావు, కేరింతలు కావు, గుసగుసలు కావు! అలకలు కావు! ఎదురుగా మరో మొగవాడున్నాడని అతనికీలేదు. పక్కనే పరపురుషుడున్నాడని ఆవిడకీలేదు సంకోచం! అంత స్వేచ్ఛగా, నిస్సంకోచంగా, హాయిగా, అట్టే మాట్లాడితే విశృంఖలంగా ఆ జంట ఆ సెకండ్ క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో శృంగారారంభ చర్యలకుపాల్పడ్డారు. ఆ చేష్టలు చూసి నాకు నిజంగానే మతిపోయింది.

"నాకూ మా లక్ష్మికీ పెళ్ళయి రెండేళ్ళు కావస్తోందిప్పటికి. అలా బహిరంగంగా మాట అటుంచి, అఖరికి కిటికీలు, తలుపులూ మూసేసుకున్న గదిలో జీరోవాట్ బల్బు అయినా వెలిగించని చీకట్లో కూడా మేం ఎన్నడూ అందులో శతాంశం సహస్రాంశం కూడా చేసుకోలేక పోయాం అంటే నమ్ము! మా వ్యవహారం అంతా నువ్వో అందుకు పోస్తున్నావంటే నేనో అందుకు తాగుతున్నానన్నట్టుగా సాగుతోంది....ఏదో వాడి పాపాన వాడే పోతాడులే అన్నట్టుగాను; పెళ్ళాడేడు. అన్నం వస్త్రం పెడుతున్నాడు గనుక వీడికైన ఒళ్ళప్పచెప్పకపోతే భగవంతుడో సాటి మానవులో చర్య తీసుకోవచ్చు నన్నట్టుగానూ ప్రవర్తిస్తుందే తప్ప సరసం సహకారం ఎన్నడూ లేవు బ్రదర్ నాకు!

"ఆ రోజు చెప్తే నమ్మవేమోగాని అమీర్ నాకు పిచ్చెక్కినట్టయిపోయింది. సాయంకాలం వరకు ఎలా ఉన్నానో నాకే తెలీదు! వేసవి సెలవుల మూలాన్ని కాలేజ్ కూడాలేదు! మామూలుగా రాత్రి పది గంటలు దాటాక, మా అమ్మ నిద్రపోయాకనే లక్ష్మి నా గదిలో కొస్తుందసలు. వచ్చినా, ఆవలిస్తూ లయబద్ధంగా చిటికెలు వేస్తూనో, తూగుతూనో వస్తుంది. నేను తనకోసం ఎదురు చూస్తూ మంచంమీద పడుకున్నా-"జరగల్ది" అంటుంది ఆవలింతల్లోంచి ఒకటే మాట. నేను డిమ్ముగా టేబుల్ లైటేసుకుని కూర్చుని పుస్తకం చదువుతున్నా. "మీ చదువై పోగానే దీపం తీసేస్తారుకదూ?"అని తన మొహానికి దీపం వెల్తురు తగలకుండా అటు తిరిగి పడుకుని దుప్పటి మొహం మీదికి లాక్కుంటుంది....

"నా పెళ్ళి చాలా లేటుగా చేసుకున్నాను. నీకు తెలుసుగదూ! అంటే మా చెల్లెలు పెళ్ళి అయ్యేదాకా నేను "భీష్మించు" కున్నాను కదా! ఆ ముప్పయ్యయిదో ఏట అయినా, ఏ పద్దెనిమిది, ఇరవై ఏళ్ళమ్మాయినో చేసుకుంటే భయంవల్లనో ముగ్ధత్వం వల్లనో వైముఖ్యం వల్లనో తొలగిపోవచ్చు. అవహ్యించుకోవచ్చు. కాని నా పెళ్ళికి నాకెలాగైతే ముప్పయ్యయిదేళ్ళున్నాయో మా లక్ష్మికీ ముప్పయొక్క సంవత్సరాలున్నాయి మరి....మరి తనెందుకిలా ప్రవర్తిస్తోందో నాకర్థమై చావదు!

"ఎన్నో శృంగార గ్రంథాలున్నాయి నా దగ్గిర; సంప్రదాయ సాహిత్య విద్యార్థిగా, అధ్యాపకుడుగా పోగేసింవి. వాట్లో భాగాలు కథలు కథలుగా చదివి వినిపించడానికి ప్రయత్నం చేసుకొన్నాళ్ళు అర్థాలు చెప్పగలను కదా!" "ఛీ

పొండి, ఏమిటా అసహ్యం మాటలు అనేసేది. పురాతన చిత్రకళ ఆధారంగా వేసిన బొమ్మలుకూడా చూపించేను. శివ శివా అని కళ్ళు మూసుకోడమే.

"సరే, ఆ రోజు సంగతి చెబుతున్నాను కదూ! ఇహ ఈ రోజు రాత్రి పడే వరకుకూడా ఆగలేను. సాయంకాలమే ఈభావానికి ముఖద్వారంగా శరీర చర్య నిర్వహించేయాలని ఊరీ, పూరీ, మా అమ్మకి ఊళ్ళో ఆడుతున్న "భక్త అంబరీష" సినిమా గురించి వర్ణించి ఆవిణ్ణి ఒప్పించి రిక్షా ఎక్కించి ఇలా ఇంటి కొచ్చేనో లేదో మా లక్ష్మి ముందుగదిలో ఓ మూల చతికిల పడిపోయి కూచుని "ఆ చాపా చెంబూ ఇలా పడేయండి!" అంది!

"అదేనీ-మామూలుగా మా ఇళ్ళలో అయితే ఈ శౌచాన్ని మూడురోజులే పాటిస్తారా, మా లక్ష్మి ఖచ్చితంగా అయిదు రోజులు ఆపివేస్తుంది, కొందరైతే ఇళ్ళలో కలిపేసుకుంటున్న ఈ రోజుల్లోనే ఇదంతా!

"ఇలా ఎందుకు జరుగుతోంది బ్రదర్? ఇహ నా జాతకం ఇంతేనా? నేను ఇన్ని వందల శృంగార కావ్యాల్లోనూ చదివి పొందిన రసతుష్టి ప్రయోగాత్మకంగా అనుభవైక వేద్యంగా పొందే భాగ్యం నాకు కలగదా!"

అని ఓ రోజు రాఘవులు దుఃఖపడితే, అమీర్ అహ్మద్ పకపకా నవ్వాడు. "వలే సొసైటిలే, మనది! మా ముస్లిమ్స్‌లో కూడా కొందరింతే! మొగవాడి చేష్టలకి స్పందించినట్టు తెలిస్తే విశృంఖలత్వం ఆపాదిస్తారని ఫ్రిజిడ్‌గా మిగిలిపోతారు, నటిస్తారు తెలుసా?" ఆ నవ్వు చాలా సేపు కొనసాగింది.

"రేపు కలుద్దాం" అని రాఘవులు లేచాడు.

"రేపు ఏ వేళప్పుడు కొంపకి చేర్తానో! మా యస్పీ దిగుతున్నాడు రేపు!"

* * *

"నమస్కారం మేష్టారూ!....అబ్బ! దేవుళ్ళాగా కనిపించారండి...."

రాఘవులు దిగ్భ్రాంతి చెందాడు. అది ఎవరో మనుష్య మాత్రులు చేసిన అభివాదం కాదు....

**రతియో, పార్వతియో, శచీయువతియో; రంభాంగనా రత్నమో?"** కడు+ఎదుట=కట్టెదుట—నిలచి మోహ(న)రాగంలో మీటిన హృదయ తంత్రీ నిస్వనం—అది కుసుమశరమై నాటింది. ఇప్పుడే తల[illegible]

వాళ్ళు ఇప్పుడే కనబడితే "నూరేళ్ళ ఆయుర్దాయం" అంటారు. రాత్రి తలచు కున్న మనిషి తెల్లారి కనబడితే ఎన్నేళ్ళు?

"పేరు—" అన్నాడు; గుర్తుపట్టలేక కాదు, మరో నాలుగు సుస్వరాలు పలికించాలంటే.

"మేం మీకు తెలీకపోయినా మీరు మాకు బాగా తెల్సండి....మమ్మల్ని కూడా మీరు—మర్చిపోయారు గాబోలు గానండీ, చూసేరండి! ఆ రోజు రైల్లో—వాల్తేర్ నుంచి సామర్లకోట వరకు—సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌లో—మనం ముగ్గురం వొకే పెట్లో గూర్చుని....ఆ రోజు ఆయన్ను సాగనంపడం కోసం నేను సామర్లకోటలో దిగడిపోయానండి, తమరేమో వెంటనే టాక్సీలో వొచ్చేశా రండి—"

"ఓహో, మీదీ ఈ వూరేనా?"

"మాదేమో ఈ వూరేనండి....వారు కాకినాట్లో వుంటారండి....తండ్రి చాటు బిడ్డండి. అవన్నీ తరవాత మనవి జేస్తాను గానండీ వారేమో యిప్పుడే ప్రిన్సిపాల్ గారి రూమ్‌లో కెళ్ళారండి ఇంటర్‌వ్యూ కొచ్చేరండి, ఎకౌంటెంట్ ఉద్యోగానికండి" ఆ మాటల్తోఇంకా ధగ్గిరిసావొచ్చి రాఘవులి రెండు చేతులూ పట్టేసుకుంది...."అయ్యో!అయ్యో! వారికెల్లాగయినా ఈ ఉద్యోగం రావాలండి, ఈ ఊర్లో యెవర్నడిగినా ప్రిన్సిపాల్‌గారికిమీ మాట మీదనే గురి అన్నారండి అయ్యగారు; మీరు మా మీద దయవుంచి వెంటనే లోపలికెళ్ళి కలుగజేసుకోవాలండి. కొస్త ఆలస్యమైనా విషమైపోతుందండి....వారికి ఇల్లాంటి పద్ధతులు తెలియవండి ....వారిక్కడ వుద్యోగం చెయ్యడం నా కెంతో మేలండి...." అని చేతులు వదిలేసి, నమస్కారంగా జోడించి "తమ రుణం వుంచుకోనండి" అన్నది. వెంటనే చేతులు మళ్ళా పట్టుకుని అతని కుడి అరచేతిలో తన బొటనవ్రేలితో నొక్కింది. ఆ నిమిషం ఆ నిముషీయం—

ఆ సంకేతం అర్థం చేసుకోడానికి రాఘవులు, సతి సీతారామలక్ష్మికి కొంత అపచారం ద్రోహం తల పెట్టడానికి ముందుగా నిర్ణయించుకోనక్కర్లేదు. బీజం ఉన్నదున్నట్లుగా క్షేత్రప్రసక్తి లేకుండా సద్యోఫలితం పొంది ఫల పుష్ప భరితమైన వృక్షంగా మారగలిగిన క్షణం అది.

"సరే! నువ్విక్కడ కూర్చో. అయిదు నిమిషాల్లో వస్తాను" అని ఆ

పక్కనున్న క్లాస్‌రూమ్‌లో స్టేజిమీద వున్న కుర్చీని క్రిందికి దింపి "అతనీ పేరేమిటి?" అన్నాడు ప్రిన్సిపాల్ రూమ్‌లోకి వెడుతూ.

* * *

"ఒక్క నవ్వే చాలు, వొజ్జర వొయిడూర్యాలు!"

అవేం తక్కువ ప్రలోభాలు కావు....

దానికి తోడు అతన్ని అలా కాలేజినుంచే కాకినాడబొమ్మని సాగనంపేసి తనవేపు వేలు చూపించి గుసగుసలాడి, అంతలోనే తన దగ్గిరికొచ్చి "మా యింటికి దయచెయ్యాలండి మాస్టారూ, తమరు! ఇప్పుడే ఇలాగే!!" అని, ఆదర-హాస-పూరిత ఆహ్వానం. ఆ-దరహాస-పూరిత ఆహ్వానం అసలేమీ తక్కువ ప్రలోభం కాదు.

కోటకి వెనకవేపున, కొంచెం రద్దీతక్కువగా వుండే వీధిలో, పురాతనమైన ఒక పెంకుటింటి ముందు రెండు రిక్షాలు ఆగాయి. వీధి గుమ్మం ప్రహరీ గోడ, అక్కడున్న ఖాళీస్థలం, మొదటి వరండాగది, పాతదనమో సంప్రదాయ వైభవమో తెలియనంత గజిబిజిగా తోచాయి రాఘవులికి.

వరండాగదిలో మూడు ఖాళీ కుర్చీలు, ఒక టేబిల్ ఫ్యాను. దానికెదురుగా పడక్కుర్చీలో వొక ముసలమ్మ. ఆవిడ అస్పష్టంగా గొణుగుతున్నట్టే వున్నా, అది కృష్ణకర్ణామృతంలోని శ్లోకమేనని గుర్తుపట్టాడు రాఘవులు.

అందుకోసం అక్కడే నిలిచిపోయిన రాఘవుల్ని, "రండి మాస్టారు, లోపలికి రండి" అని చెయ్యి పట్టుకుని ఆహ్వానించింది. "మా అమ్మమ్మ.... కళ్ళు ఆనవు...." అంది.

"ఎవరే, ఉలూచీ?" అడిగింది ముసలమ్మ.

"అయ్యవారమ్మమ్మా!" అని కంఠంలో ప్రసన్నతే వుంచి, కళ్ళలో విసుగు చూపింది. "లోపలికి!" అన్నట్లు రాఘవులికి సంజ్ఞ చేసింది.

ఉలూచి!

ఉ....లూ....చి!!

"నీ పేరు—"

"ఉలూచి...." కనురెప్పలల్లారుస్తూ, నవ్వుతూ, ఉలూచి....

"....నాకెంతో ఇష్టం.... విజయ విలాసంతో చేమకూర వెంకట కవి చెప్పినట్టు — "రూప విభ్రమ రేఖా ఖనులెందు నాగ కన్యకల్!"

**అన్నాడు రాఘవులు, "ఈ కలహంసయాన నను నెక్కడి కెక్కడినుండి దెచ్చె!"** అని అవిభ్రమం అంతా అనుభవిస్తూ, ప్రకటిస్తూ

"అంతేగాదండి. మేం నాగ వంశీయులం కూడా నండి." అంటూ ఆ లోపలి గది పక్కగావున్న మరోగదిలోకి అడుగు పెట్టింది ఉలూచి.

**"స్మర దివ్యాగమ కోవిదుల్; మదన శిక్షా తంత్ర విద్యా విదుల్; సురతాకంఠ మహాధ్వర ప్రవణులు—** అని శ్రీనాథ మహాకవి క్రీడాభిరామం అనే గ్రంథంలో చెప్పేడు మీ వాళ్ళకు కావలసిన పురుషుల్ని గురించి—" అన్నాడు రాఘవులు. ఉలూచివవ్వి "లోనికి దైచేండి." అంది.
ఆ గదిలో అడుగు పెడుతూ, దానివైలక్షణ్యాన్ని గమనించేడు రాఘవులు.

మరో గదిలో అడుగుపెట్టినట్టుకాక,
మరోలోకంలోనే అడుగు పెట్టినట్టుంది....!

ఇంతకుముందు ఈ ఇంట్లోనే చూసిన గదులకీ, దీనికీ పొంతనా పోలికా లేవుగాక లేవు!

దీన్ని కేళీ మందిరం అనాలా, కళా భాండారం అనాలా, లేక ఏ శ్రీనాథ మహాకవినో అడిగి దీనికొక నూతన నామాన్ని నుడికారం చెయ్యాలా అని ఆలోచిస్తూనే "అయితే మీరు, నిజంగా-యిప్పటికీ-?" అన్నాడు.

"అవునండి. చెప్పేను కదండీ! మేం నాగ వంశీయుల మేనండి! తరతరాలుగా ఇదే విద్యండి, ఇదే జీవికండి మాకు. మీ కిందాక కనిపించిన మా అమ్మమ్మ, రెండేళ్ళ కిందట రంభాత్వం పొందిన మా అమ్మ, గత ఏడెనిమిది నెలలుగా రావు అప్పారావుగారి ఇల్లాల్నిగా వుంటున్నా నేను కూడా నండి, మేం అందరమూనండి, శూద్రక మహాకవి సృజించిన వసంతసేన వారసుల మేనండి."

ఆ గది దక్షిణపు గోడ మీద ఎత్తుగా వున్న చోట అందంగా వ్రేలాడుతున్న రెండు తైలవర్ణ చిత్రాలు చూపింది ఉలూచి "మా అమ్మమ్మానండి, మా అమ్మా నండి!.... ఈ బొమ్మ సాక్షాత్తు దామెర రామారావుగారే దయచేయించారటండి."

అలా తలతిప్పి మిగిలిన గోడలూ చూశాడు రాఘవులు.

రవివర్మ చిత్రించిన మేనక, దమయంతి, రాసక్రీడ-ముద్గల్ కర్ రూపొందించిన రతీమన్మథ, శివపార్వతి; జపాన్ నుంచి దిగిన నగ్నసుందరీమణుల బొమ్మలు, రంగులలో అచ్చయినవి, ఖారీఫ్రేముల్లో బిగించి వున్నాయి.

"బొమ్మలు బాగున్నాయాండీ?" అని అడిగింది ఉలూచి.

"నిజంగా చాలా బాగున్నాయి. వీట్లో చాలా వట్టుకు అక్కడా అక్కడా చూ సినవేగానీ, ఇంత పొందికగా కళాత్మకంగా వీటిని భద్రపరిచే యిళ్ళుంటా యని తెలీదు,

"ఎప్పుడూ ఎవ్వరింటికీ వెళ్ళలేదన్నమాటండి!" అని నవ్వింది ఉలూచి.

"వెళ్ళకపోవడం అనేది అర్హతా, అనర్హతా?"

"నేనేం చెప్పినా మీకు నచ్చకపోవచ్చునండి."

"బానేను!" అని రాఘవులు, "మరి ఇందులో ఉలూచీ అర్జునుడూ వున్న బొమ్మలేదేం?"

"అందులో లేదుగానండి," అని కొంటెగా నవ్వింది ఉలూచి, "ఇందులో ఉందండి" అని, డ్రెసింగ్ టేబిల్ సొరుగులాగి, దాంట్లోంచి ఒక ఫోటో ఫ్రేమ్ తీసింది. అది తైల చిత్రమూకాదు, వర్ణ చిత్రమూకాదు, ఛాయాచిత్రం. కాకినాడలో ఫలాని స్టూడియోవారు తీసినది-దాంట్లో ఉలూచి ఉందిగాని ప్రక్కన ఉన్నవాడు అర్జునుడు కాదు. అప్పారావు.

వాళ్ళ యిద్దరి పెళ్ళిగురించి చెప్పింది. అతను మూడువేల ఆరువందల రూపాయలు చెల్లించి, ఐదుకాసుల బంగారం పెట్టి తన కులం స్త్రీల సమక్షంలో తాళికట్టాడు. ఏడాదిపాటు అతను వచ్చిపోతూ ఉండవచ్చు. అలా అని, ఇత రులు రాకూడదన్న నిబంధన లేదండి. కాని తన మొదటిబిడ్డ అతగాడిది అవడం తనకి జయమ్మట, అభిలాషానట!

"కూర్చోండి" అని, ఆ గదిలోకి తాము వచ్చిన ద్వారాన్ని మూసి, మరో తలుపు తెరిచి, "కళావతీ" అని కేకేస్తూ లోపలికి వెళ్ళింది ఉలూచి.

పాతకాలపు పట్టెమంచం. దానిమీద ఎత్తయిన పీచు పరుపు. దానిమీద వొత్తయిన బూరుగుదూది పరుపు. ఆ పైన ముదురు రంగులోవున్న షోలాపూర్ కలంకారీ దుప్పటి. ఓ వైపున రెండు పెద్ద పెద్ద దిండ్లు, కాళ్ళదిక్కున, తల దిక్కున కూడా రెండు గోడలకీ పెద్ద పెద్ద బెల్జియం వారి అద్దాలు. దోమతెర కట్టు కోవడానికి పందిరి. దానికి పైగా సీలింగ్ ఫ్యాన్. మంచానికి తలదిక్కున డ్రెసింగ్ టేబిల్ దానిమీద క్లుప్తంగా అలంకార సామాగ్రి, పరిమళ సంభారం. మంచానికి కాళ్ళవైపున ఒక పక్కగా చిన్న మేజా. దాని మీద వొక ఇత్తడి పళ్ళెంలో అచ్చం పింగాణిది వొక యాష్-ట్రే. ఆ పక్కన రాజదర్బార్లలో వుండేవి కాబోలని నమ్మేరకం పాతకాలపు సౌఖ్యదాయకమైన కుర్చీ, ఏ వంద

చేశ్చకిందటిదో. ఉలూచి అమ్మమ్మగారి అమ్మమ్మగారికి అలనాటి పత్సవాయి రాజావారో లేక వారి బంధువో ఇచ్చారుగావుననిపిస్తుంది. దాని పనితనం, నిర్మాణ కార్యక్రమం చూస్తే, చేతులు, కాళ్ళూ, వీపూ, సీటూ అన్నీ ఉత్కృష్ట మైన దారు శిల్పానికి ఉదాహరణలుగా పేర్కొనదగ్గ డిజైన్లమయంగా ఉన్నాయి.

మంచానికి కాళ్ళవైపున పొడవైన, ఎత్తయిన అరలులేని టేబిల్. దాని మీద ఒక వీణ, దానిమీద సన్ననిదైన చిక్కని చక్కని తెల్లని అఛ్ఛాదన.

తాము ప్రవేశించిన ద్వారానికీ ఉలూచి నిష్క్రమించిన ద్వారానికీ మధ్య గోడలో ఒక అద్దాల బీరువా. దాని మూడు అరలనిండా పుస్తకాలు.

అద్దాల్లోంచి చూసి పుస్తకాలెల్లాంటివో పలకరించాలని రాఘవులు వంగి నిల్చున్న సమయంలో, చేతిలో కంచుగ్లాసు పుచ్చుకుని వచ్చింది ఉలూచి. "కొబ్బరిపీళ్ళు పుచ్చుకోండి. పాలు కాగుతున్నాయండి. మీరు టీ అంటే టీ, కాఫీ అంటే కాఫీ!.... ఆగండి, తాళం తీస్తాను!"

* * *

"మా అమ్మ ఎంత తాపత్రయం పడ్డానండీ, నాకు సంగీత సాహిత్యాల్లో కొంచెమైనా ప్రవేశం దొరికింది గానీ నాట్యం మాత్రం పట్టుబళ్ళేదండి. పల్లే కాక, పట్నంకాక, మధ్యస్థంగా వున్న ఈ ఊళ్ళో మమ్మల్ని పాత పద్ధతి ప్రకారం ఒక్కళ్ళెవ్వరో పోషించే రోజుల రోజులు కావండి. ఇప్పుడండి, చచ్చిపోతున్న ఈ సంప్రదాయాన్ని పట్టుకు వేళ్ళాడుతున్న నాబోటి వాళ్ళకు చదువూ ఆటాపాటా సరిపోవటం లేదండి. అందం ఉండాలండి, వగలు కురవా లండి, అదను దొరికితే మోసం కూడా చెయ్యాలండి. కొద్దిగా నటన, నాట్యం నేర్చిన మాత్రంచేతనే మా పెత్తల్లి చిత్తజల్లు పుల్లయ్యగారి దినాల్లో ఇక్క ణ్నుంచి వెళ్ళిపోవడానికి సాహసించింది కనుకా పెద్ద సినిమాతార అయిపోయి బాగా సంపాదించుకుని గౌరవంగా దర్జాగా బతికిందండి. ఇక్కడుండిపోతే పూట బత్తెం పుల్ల వెలుగే కదండి?"

ఆ కథలన్నీ విని,

ఆమె చదివిన ఆ గ్రంథాలేమిటో తెలుసుకొని, వాటిల్లో స్వారస్య ప్రధానమైన ఘట్టాలూ కవి సమయాలూ చర్చించి ఆమె ఆ వాతావరణంలో వినిపిన సంగీతాన్ని ఆస్వాదించి-

గడియారం చూసుకున్నాడు రాఘవులు. వీణను తిరిగి టేబిల్ మీద దాని స్థానంలో వుంచి మంచం దిగింది, ఉలూచి.

మంచం మీది దుప్పటిని తీసేసి మంచం క్రిందవున్న పెట్టెలోంచి తెల్లని చాకింటి దుప్పటి తీసి, దులిపి, పరచింది. "మీరు ఆ కుర్చీలోంచి లేసి కాసేపు ఈ మంచంమీద విశ్రాంతి తీసుకోండి మాష్టారూ! మీరు పుచ్చుకుంటానంటే మళ్ళీ టీ ఇస్తానండి....లుంగీ కానీ పంచెగానీ ఇమ్మంటారాండీ కట్టుకోటానికి?"

రాఘవులు లేచాడు. కళ్ళు సన్నగాచేసి ఉలూచిని పరీక్షగా చూసేడు.

"మీతో ఈ పూట గడపడానికండీ, అప్పారావుగార్ని పంపించేశానండి. వారి అనుమతే పొందానండి ఎకాయెకి! మీరేమీ సంకోచించనే అక్కర్లేదండి." అంది ఉలూచి నవ్వుతూ. "వారి పని సానుకూలం కావడం నాకు ఇష్టమూ అవుసరమూ కూడా కనకనండి, అది మీ ద్వారా నెరవేరింది కనకానండి—"

రాఘవులు ఆ చనువును విభ్రమతో చూశాడు.

"ఒక రహస్యం చెప్పేస్తానండి. ఆ రోజు రైల్లో మీ ఎదురుగానే వారు నన్ను అమితంగా లాలించేరు కదండి, ఓసారండీ; నా చెవిలోకి వంగి, ఉలూచీ నీ చేష్టలతో ఆయన్నెంత వేడెక్కిస్తున్నావో తెల్సా అన్నారండి! అంటే ఆ మాటకి నేనేమన్నానో తెలుసాండీ?"

"ఊఁ!"

"ఊఁ! యేమిటండి! నేనేమన్నానో తెలుసాండీ?....ఎప్పుడో ఓ రోజు వెతికి పట్టుకుని కాక తీర్చేస్తానన్నాడండి" అని కుడిచేతి చూపుడు వేలితో అతని గుండె మధ్యభాగాన్ని పొడిచింది ఉలూచి. అంతలోనే చాలా ఆత్మీయమైన ధోరణి తెచ్చుకుని "చాలా మంచివారండి, వారు మరొకరైతే ఆ మాటకి నన్నక్కడే నరికేసే వారేమో?"

**"ననవిల్తు శాస్త్రంబు మినుకు లావర్తించు పని వెన్న తోడ బెట్టినది మాకు"** అని వరూధిని ప్రవరుడికి చెబుతున్న దృశ్యం కళ్ళకు కట్టింది రాఘవులికి.

అతనికి పూర్తిగా అర్థమైంది.

చాప చిరిగినా చదరంత.

ఈ ఊళ్ళో మాత్రం ఇంకా స్వల్పంగా మిగిలి ఉన్న ఈ కళాస్వరూపాల నైపుణ్యాన్ని పరిశీలిద్దామని, చాతుర్యాన్ని చవిచూద్దామని, ఈ దూరపుకొండల నునుపును స్పృశిద్దామని ఎక్కడెక్కడినుంచో రసికులు వస్తూనే ఉన్నారని "సామాన్య"లే అయినప్పటికీ "పరకీయలా!" అనిపించేటంత భ్రమ కలిగించి

శృంగార రస పరాకాష్ఠను సాక్షాత్కరింప చేస్తున్న వీటి పొందు విందై వెళు తున్నారని-కొద్ది రోజులక్రితమే విన్నాడతను.

అతనికి—

విన్నరాత్రి అంతకు ముందు మరో అయిదు వందల తొంభయ్ రాత్రులు కలిగిన ఆశాభంగాలున్నూ గుర్తుకొచ్చాయి.

ఒక్కొక్క జావళి పాడుతున్నప్పుడు మనోహరంగా కదిలిన ఆమె పెద వులు, వీణ వాయిస్తూ ఉంటే రమ్యంగా కదిలిన ఆమె కన్నులు. తానింతకు ముందు ఎన్నడూ ఎక్కడా పొందనిది, కోరినది అనుభవం ఇదే ఇదే అని పదే పదే చెప్పాయి.

అయినా సరే—

పారిశ్రామికీకరణం వల్ల సంభవించి నిమిష నిమిషానికీ ఉధృతమౌ తున్న ద్రవ్యోల్బణం ప్రభావం చేత అన్ని రకాల ఆనందాల కాల పరిమితీ కుదించుకు పోయి అనుభవం యాంత్రికమై పోయినట్టు అతనికి అవగాహన అయింది. మొదట్లో కళగా అవతరించి తనకంటూ ప్రత్యేక సంకేతాలను ఆరాధ్య దైవ స్వరూపాలను ఏర్పరచుకొన్న శృంగారం మీద మతం, రాజ కీయం తమ ప్రభావాన్ని చూపాయి.శృంగారం రంగులు మార్చి సెక్స్ అయింది కళ కాస్తా సైన్స్ అవతారం తాల్చి ప్రశ్నోత్తరాల స్థాయి కొచ్చింది. అయినా సరే పాపంగా, నేరంగా పరిగణించ బడుతూనే వుంది.

ఈ పరిస్థితి కిక్కడ చోటు లేకపోవడమే ఈ సీమ ప్రత్యేకత, ఇది మహానంద సీమ. ఇది మనోల్లాస సీమ.

కాని ఈ పురుషార్థాన్ని రాఘవులు ఎన్నడూ ఒక ధర్మంగానే స్వీకరిం చాడు కనక అతడు సంకోచంలోనే ఉండి పోయాడు.

"లుంగీ వుందా?"

"ఓ!" అని సెకండ్ల కాలంలో మంచం తలాపిన ఉన్న డ్రెసింగ్ టేబిల్ దిగువ భాగంలో ఉన్న అలమారులోంచి ఘుమ ఘుమ లాడుతున్న మడత తీసి అందించింది ఉలూచి.

అతను చొక్కా తీసేసి "పాగా కొయ్య"కి తగిలించాడు. లుంగీ కట్టు కుని దాని లోపలినుంచి ప్యాంట్ను దిగవిడిచాడు "నేను వెంటనే దేహ బాధ తీర్చుకో వచ్చునా?"

"రామాయణం అంతా విని" అని నవ్వుతూ అతనికి దగ్గిరిసా వచ్చింది ఉలూచి. లోపలి మండువాలోకి తెరిచిఉన్న తలుపుకి అడ్డంగా తెరలాగి "ఇంకా సందేహమాండి?" అని అతని ఎదుటికి వచ్చి ఆనుకుని నిలబడింది. ఆ క్షణమే అతని మొహంలో రస భేదాన్ని పసిగట్టి, నాలుక కరచుకుని "ఓ! అదా?" అని వెంగున గెంతి మండువాలోకి దారి తీసింది. అతనికి మరుగు స్థలం చూపించి గదిలోకి వచ్చేసింది.

0 0 0

రాఘవులు తిరిగి వచ్చేసరికి తెర తప్పించుకుని గదిలోంచి మండువాలోకి వస్తున్న "కళావతి" ఒంటినిండా పైట కప్పుకుంటూ, ముసి ముసి నవ్వులతో "వెళ్లండి బాబు" అంది.

రాఘవులు గదిలోకి ప్రవేశించడం తడవుగా ఉలూచి అతన్ని సర్పంలా చుట్టేసింది.

ఆమె ఒంటిమీద వస్త్రాలు నామమాత్రం. ఆ గది అంతా సుగంధ పరిమళ భరితం.

ఏకాంతం.

అంగీకారం

ఆమోదం

ఆహ్వానం

అయినా భయం, సంకోచం, వేదన.

0 0 0

ఆ క్షణంలో వచ్చి పడ్డారా యింట్లోకి, శాంతిభద్రతల రక్షకులు దండుకు దండూనూ.

0 0 0

హింస

దూషణ

అవమానం

అన్నీ వరసగా సంభవించేయి

ఉలూచీ బాహూ పరీ రంభం కాదది,

శృంగార సర్ప పరిష్వంగం........... *

("జ్యోతి" మాసపత్రిక; మార్చి 1965)

# మీకూ కథలే యిష్టం

నేనొచ్చేస్తున్నా నన్న టెలిగ్రాం చూసుకుని స్టేషనుకి ఒచ్చినట్టున్నారు మా ఆయన .... అంతసేపూ చింతతో నిండిన మనస్సులో. ఆయన కనబడగానే ఆయన మీదున్న సానుభూతి యిగిరిపోయి కోపం ఒచ్చేసింది నాకు.

"పండక్కి రాలేదేఁవఁడీ ?" అని అడిగాను జోరుగా.

"........................"

"అస లెక్కడున్నారు, పండక్కి ?"

"........................"

"జవాబు చెప్ప రేఁవఁడీ ?"

"........................"

"మీ కోసం ఎంతలా ఎదురు చూసేనండీ! .... మా వాళ్ళందరూ అడగడఁవేఁ; ఏఁవేఁ మీ ఆయనరారా, అసలు నీతో ఏం చెప్పేరే అంటూనూ ? ఏమిటిలా చేసేరు ?.... మరీ మరీ చెప్పేను కదా;.... అసలు మీరే కదండీ, తప్పకుండా ఒస్తాను - అంటూ చెప్పేరు !"

ఆయన నా ప్రశ్నల్ని టైమ్ లేనట్టుగా దాటేస్తున్నారు.... నడుస్తూనే ఉన్నాం.... పోర్టర్ని పిలవడం, సామాను వాడినెత్తిన పెట్టడం, టికెట్టు నా దగ్గిర పుచ్చుకోవడం, జేబులోంచి ఆయన టిక్కెట్టు బైటికి తీసుకోవడం, రెండూ కలిపి గేటు దగ్గిర ఇచ్చెయ్యడం, రిక్షామాట్టాడ్డం, అందులో సామాను పెట్టించి కూచోడం— నా ధ్యాసేలేదు....నేను అడుగుతూ వుండడం, ఆయన నా వేపు ఓసారి వెర్రిమొహంవేసి చూడ్డం, మళ్ళీ పనిలో పడ్డం—అలా అయిపోయింది.

"ఎందుకండీ రాలేదు ? .... మాట్లాడరేఁవఁడీ?— పండక్కి ఎడ్వాన్సూ పెట్టుగుని;— సెలవూ పెట్టుగుని; —హాయిగా అక్కడి కొచ్చి సరదాగా

వుండక ఇక్కడే కూచుండి పోయారేం ? — మా వాళ్ళిల్లు అంత మొహం మొత్తేసిందా? ఆమాత్రం దానికి నన్నెందుకూ, రెండు రోజులు ముందుగా వెళ్ళు అంటూ పంపేశారు? - అసలు మాట్లాడరేం ? ?"

అప్పుడొచ్చింది ఆయనోన్నట, వో మాట.... జవాబుకాదు; ప్రశ్న! "చెప్తాను కమలా; ఏమిటి గొడవ ? ఇంటికెళ్ళే వరకూ ఆగలేవా ?"

"నే నాగలేను ! చెప్పండి ? !" అన్నాను గట్టిగా.

రిక్షావాడు ఓసారి వెనక్కి తిరిగి చూశాడు. నేను మొహం ముడుచుకొని ఊరుకున్నాను.

*　　　　*　　　　*

రాత్రైంది.

తొమ్మిది దాటింది. వంటా భోజనాలూ ఐ మళ్ళీ తీరిక తీసుకునే సరికి.

"కిళ్ళీలు తెమ్మంటావా ?" అన్నారాయన; నేను వంటింట్లో పని పూర్తి చేసుకుని ఇవతల పడగానే.

"కిళ్ళీ ఒద్దూ, సోడాలూ వొద్దు. కాస్త నడుం వాల్చనీండి. చచ్చి చచ్చి ఒచ్చేను...."

"ఆమాత్రం దానికి ఈ ఒక్కపూటకీ వంటా పెంటా అంటూ గుండా పిండీ అయిపోకపోతే ఏం ? కేరియర్ తెచ్చుకుంటే ఏడింటి కల్లా తినేసి ఈ పాటికి నిద్రపోయే వాళ్ళంగా!— పోనీ నన్నైనా సుఖంగా కూర్చో నిచ్చేవా.... గసగసాలు తెండి.; ధనియాలు తీసుకురండంటూ అరడజను సార్లు బజారుకి పంపేవు!...."

నాకావలింత ఒచ్చింది. లేకపోతే ఏదో అందును నేనూనూ....అక్షణం అయిపోగానే మళ్ళీ పండగ - ఈన రాకపోడం జ్ఞాపకం ఒచ్చేసింది. "ఇంతకి పండక్కెక్కడున్నారో చెప్పరే కారు!"

"ఇక్కడే ఉన్నాను ...." అన్నారాయన చిరునవ్వుతో.

"అబద్ధం— ఇక్కడ లేర్టగా. మహాలక్ష్మమ్మగారు చెప్పింది. విశాఖ పట్నం వెళతానని బైలుదేరాడు, మీ ఆయన — అయితే రాలేదూ—? అని ఆశ్చర్య పడ్డ దావిడ. తాళం చెవులు ఆవిడికే ఇచ్చేర్టగా !"

"రాగానే కష్ట సుఖా లావిడితో చెప్పుకున్నా వన్నమాట !" ఎగతాళిగా అన్నారు.

"చాల్లెండి—నేనేం అబద్ధాలు కల్పించి చెప్పలేదు. మీరేమో పదకొండో తారీఖు సాయంత్రం విశాఖపట్నం వెళుతున్నా నండోయ్ అని తాళా లిచ్చేరుట; మళ్ళీ పదహారో తారీకు మధ్యాన్నం ఒచ్చి అంతా కులాసాగా ఉన్నారండి; మా ఆవిడ రేపు ఒస్తోందంటూ తాళాలు తెచ్చుకున్నార్ట — నాకు ముందుగా తెలీక నిజం చెప్పేశాను!"

"పోనీలే — ఏదో అయిపోయింది —"

"ఇక్కడా లేక, విశాఖపట్నమూ రాక, ఎక్కడున్నారండీ, నాలుగు రోజులూ మరీ!"

"ఎందుకులెద్దూ!"

"ఎందుకేంవిటి — చెప్పండి! — ఇంటి దగ్గిర చెప్తానన్నారుగా ?"

ఆయన మళ్ళీ మాటాడకుండా కూచున్నారు. ఎంత అడిగినా చెప్పక పోడానికి కారణం ఏమిటో! అంత చెప్పకూడని చోటికి వెళ్ళేరా! అయినా చెప్పేస్తారే! ఇలా దాచటం కొత్తగా ఉందని తెలిసిపోయి బాధగా ఉంది.

"—ఎక్కడున్నారో, ఏం చేస్తున్నారో అసలు ఒంట్లో కులాసాగా ఉందో లేదో అని నా ప్రాణం ఎంత కటకట్లాడిందో మీకేం తెలుసు? — ఇద్దరం కలిసే — వెళదాంవండీ అంటున్నా కూడా వినిపించుకోక కొంపలు మునిగిపోయినట్టు రెండ్రోజులు ముందుగా నన్ను సాగనంపేశారు. — పైగా వాళ్ళందరూ అడగడం ఒకటీ "ఏమే మీ ఆయనొచ్చాడా అంటే, ఒసే నీ మొగుడు రాట్టే" అంటూనూ!"

"కష్టంవేఁ; పాపం!" అన్నారాయన చిరునవ్వుతో.

"ఎంత వెటకారంగా వుందండీ మీకు! — ఇంతకీ ఎక్కడున్నారో చెప్పరే?"

"ఎక్కడుంటే నేం; నేను ఆరోగ్యంగా, సుఖంగా, కులాసాగా, సంతోషంగా పండగ వెళ్ళించేను - నీక్కావాల్సిం దంతేగా!

"ఏ వూరు వెళ్ళేరు చెప్పండి, పోనీ!"

"విడదవోలు!"

"మీ సుభద్రి గారింటికా?"

"ఏ సుభద్రి?"

"—ఎంతమంది సుభద్రి లున్నారు? - మీ - మీ సుభద్రి -సుభద్రి

జనీయంలో సగందాకా వొచ్చిన- అదుగో, నవ్వుతున్నారు వెళ్ళేరా, అక్కడికి? - ఛీ ఛీ - ఇలా ఎవరైనా చేస్తారుటండి?" నాకూ నవ్వు ఆగలేదు: సుభద్రా, ఆయనా, ఆ కథంతా జ్ఞాపకం ఒచ్చి..

"నవ్వకు కమలా - - - సుభద్రగారింటిక్కాదు. అక్కడి కెందుకు వెళతానూ!- అసలు సుభద్ర వాళ్ళ పుట్టింటికి వెళ్ళిందిగా!"

"ఓహో; భోగట్టా చేసేరన్నమాట!"

"అంటే మరి - ఆ వూరుదాకా వెళ్ళేక - నువ్వు నవ్వితే నేనసల్లు చెప్పను!"

నేను బలవంతాన నవ్వు ఆపుకున్నాను- అయినా ధోరణి అలాగే ఒచ్చేస్తోంది. "చెప్పండి చెప్పండి - అసలు సరిగ్గా నిడదవోలే ఎందుకు వెళ్ళవల్సొచ్చిందట!"

ఆయన గొంతు సర్దుకున్నారు. "విశాఖపట్నానికే టిక్కెట్టు కొనుక్కున్నానే - - -" అని తలగడా గోడకి నిలువుగా చేరేసి, సదుపాయంగా ఆనుకొని కూర్చొని, అనగనగా ధోరణిలో ప్రారంభించారు. "- అసలేం జరిగిందంటే; బండి రెండుగంటలు లేటు! ప్లాట్ ఫారమ్మీదే బెంచిమీదకునికిపాట్లు పడుతున్నానన్నమాట-"బండొచ్చింది లేవండిసార్" అంటూ పోర్టర్ లేపేడు; బేగ్ రైల్లో పెట్టాడు - - కూచోడానికి జాగాలేకా జనం చస్తూంటే ఎవరో ఒకళ అతను దర్జాగా ముసుగుతన్ని నిద్దరోతున్నాడు - ఒళ్ళుమండి, ఆవళంగా చేతులో వున్న న్యూస్ పేపర్తో వీలైనంత గట్టిగా నాలుగు తగల్నిస్తూ "రైలుబండి నీ బాబుగారి సొత్తనుకున్నావా,లే" అని లేపేను.తీరాచూస్తే వాడు మా నర్సింహారావు!"

"నర్సింహారా వెవరండీ!" అన్నాను, సంగతి సగంపైగా బోధపడక.

"- కలకటాలో పనిచేస్తున్నాడులే, వాడు. ఏడెనిమిదేళ్ళయింది, వాడూ నేనూ కలుసుకుని - ఓరి నీ తస్సాదియ్యా అంటే హోరి నీ దుంపతెగా అని పలకరించుకున్నాం. చకచకా మాట్లాడేసుకున్నాం - - వాడికి కిందటేడే పెళ్ళయిందట. పండక్కి అత్తారింటికి పోతున్నాట్ట -- కబుర్లు చెప్పుకుంటూ కూచున్నాం--ఇంతలో రైలు గోదావరిబ్రిడ్జిమీద నడవడం తెలిసి కంగారుగాలేచి నించున్నాను - ఆ రైలు విశాఖపట్నం వెళ్ళటంలేదు! బెజవాడ పోతోంది!! పోర్టర్ వెధవ ఇందులో కూచోపెట్టేశాడు! -" అని గాభరాపడ్డాను.

"ఎంత తమాషా అండీ!"

ఆయన నన్ను ఆశ్చర్యపడనివ్వలేదు.

"విను.... అప్పుడింకేం చెయ్యడం?—సరే, కొవ్వూర్లో దిగి వెళ్ళ క్కొడ్దాం; అనుకున్నాను—అపళంగా వాడు లంకించుకొని,—ఏడిశావులేవోయ్, ఇప్పుడు నువ్వు విశాఖపట్నం వెళ్ళకపోతే ఏమి? అన్నాడు. టిక్కెట్ కూడా కొనుక్కున్నాను: మా ఆవిడా వాళ్ళ వాళ్ళూ ఎదురు చూస్తార్రా అని ఎంత చెప్పినా వాడు విన్నాడేకాదు. నిడదవోలు వాళ్ళ అత్తారూరట; వాడికూడా అక్కడి కెళ్ళేసి, పండగ మూడు రోజులూ వాడితో వుండి, మళ్ళీ పదహారో తారీక్కి రాజమండ్రి చేరమంటాడు.... సగంసేపు వేళాకోళం అనుకున్నాను.... కొవ్వూరు స్టేషనులో నన్ను దిగకుండా పట్టేసుకున్నాడు. ఆ తరువాత స్టేష నులో గార్డు దగ్గరకువెళ్ళి నిడదవోలుకి టిక్కెట్ రాయించి పుచ్చేసుకున్నాడు— సరి. ఇంకో గడియలో నిడదవోలు రానే వొచ్చింది?"

"ఊఁ హూఁ !.... అతన్తో నిడదవోల్లో దిగిపోయి అక్కడుండి పోయే రన్నమాట.... ఎంతపని చేసేరండీ? - పోనీ ఓ ఉత్తరంముక్క రాయలేక పోయారా, ఇలా జరిగిందంటూను!.... పండగ మూడురోజులూ, పిలవని పేరం టానికి వెళ్ళి బట్టలకీ, దానికీ దీనికీ- మొహమాటపడి-ఎలా ఉండిపోయేరండీ, అంత తెలియని వాళ్ళింటోను! - అతని కత్తారుగాని మీ కెవరు?-" నాకు నవ్వొచ్చింది.

"అబ్బే, లేదు కమలా, అన్నీ బాగా జరిగేయి- వాళ్ళ ఆదరం చెప్ప డానికే బాధగా ఉంది నాకు!" అన్నారాయన. పెంకెతనంగా నవ్వుతూ, వోరకంట చూస్తూ.

"బాధెందుకో?"

"నువ్వేమనుకుంటావో నని -!"

"నేనేమనుకుంటావండీ, చిత్రంగా మాట్లాడతారు!"

"నువ్వనుకోడానిక్కారణం ఉందిలే-అసలు మానర్సింహారావు వాళ్ళింటికి వెళ్ళడమే పెళ్ళయ్యేక మొదటి సంక్రాంతి.... బాగా డబ్బున్న వాళ్ళేమో, చాలా ఘనంగా చేద్దామనుకున్నారు- అల్లుడితో గిల్లుడిన్నట్టు నాక్కూడా అంత ఘనంగామా చెయ్యవలిసొచ్చింది.... నే నెక్కడ మొహమాట పడతానో అని అన్నీ అడక్కుండా ఏర్పాటయి పోయేవి!—"

"బాగా ఆస్తిపరులా."

"అబ్బో; చాలా! ధాన్యం వ్యాపారం!! గోడౌన్లూ, మిల్లులూ, దుకాణాలూ, ఓ పెద్ద బట్టలకొట్టూ. ఇదికాక ఆడవాళ్ళు వడ్డీ వ్యాపారం చేస్తారు.—తెల్లారితే భోగి అనగా రాత్రి వెళ్ళాం కదూ—తెల్లారే సరికి వేణ్ణీళ్ళూ, జెమాజెట్టీలాంటి మంగళ్ళూ తయారు. వాళ్ళ ఐశ్వర్యం చూసి పద్ధతి మారిపోతుందనుకున్నాను. కాని అలా జరగలేదు. షాంపూ రుద్దుకొని షవర్ బాత్‌లు చేస్తే మట్టుకు నలుగు పెట్టి తలంటుకున్న సునుపూ. శుభ్రం ఒస్తాయా? జన్మలో కుళ్ళంతా ఒదిలేటట్టు అభ్యంగనం చేయించారు—కొత్తబట్ట ల్లేవెలాగా అని నేను చిన్నబుచ్చు కుంటూనే ఉన్నాను; ఇంతట్లోకి పెద్దాయన ఎనిమిది గజాల ఫిన్లే చాపు పట్టు కొచ్చాడు, (ఇప్పుడు నేకట్టుకున్న పంచె దాన్లోదే, చూడు!)—"అలా వొక్క క్షణం కూర్చోండీ. అబ్బాయి షాపుకు వెళ్ళేడు. చొక్కాలు తెస్తాడు" అని మర్యాదగా చెప్పి కాఫీ తాగేలోపుని కట్టబెట్టారు. నాకేవైతే నచ్చుతాయో, ఎంతలేసైతే సరిపోతాయో సరిగ్గా అలాటివి, రెండు చొక్కాలు....ఆశ్చర్య పడుతూనే, మా నర్సింహారావుని పిల్చి, "ఏమిట్రా ఇదంతానూ, నీకేమేనా మతుందా లేదా" అని చివాట్లు పెడితే, వాడు పెద్ద నవ్వు నవ్వేసి, "మీ అత్తా రింటికి వెళ్ళి వాళ్ళిస్తే కట్టుకోవుట్రా, అక్కడికి వెళ్ళకుండా చేసి నందుకు నీకీ మాత్రం" చెయ్యకపోతే ఎలాగు, అన్నాడు-!

"చాలా బలగం వున్నారు కాబోలు...."

"ఓ? అతనికి నలుగురు మరదళ్ళూ, ఇద్దరుబావమరుదులున్నూ- గొప్ప కాలక్షేపం అనుకో - నాకే ఆశ్చర్యం వేస్తుందిప్పుడు; మూడురోజులు నిన్ను మరిచిపోయి; నీకు ఉత్తరమైనా రాయకుండా వుండిపోయానంటే -" అని ఆగారు, ఘా ఆయన.

"అవున్లెండి-అలాంటి చోటికెళ్తే ఇంక నే నెందుకు జ్ఞాపకం వస్తాను; ఉత్తరాలేనా ఎందుకు రాస్తారు; పాపం!" అన్నాను. చాలా అనందిస్తున్నా ఆయన్ని సరదాగా సాధించాలన్న కోరిక చంపుకోలేక.

"అదుగో - చెప్పకపోతే ఊరుకోవు; చెబితే ఇలా గొడవ చేస్తావు!"

"గొడవ కేఁవుందిలెండి. మావాళ్ళూ మీకు బట్టలు ఎక్కువే తీసేరు. నేను పుచ్చుకోలేదని అక్కసుకొద్దీనీ, దానికితోడు మా చిన్నన్నయ్య వెటకారం ఒకటీ, "మీ ఆయన వొచ్చినప్పుడే ఇస్తాంలేవే" అంటూనూ. పెద్దన్నయ్య పట్టి కెళ్ళ మంటూంటేకూడా బీరువాలో పెట్టేశాడు—నాకు ఉక్రోషంఁ వొఁచ్చి

అడగేలేను — వెధవది. బట్టలకేంగాని — ఎక్కడున్నారో ఏం చేస్తున్నారో, ఏం తిన్నారో, అన లారోగ్యంగా ఉన్నారో లేదో అని నామనస్సు మాత్రం మూడు రోజులూ విలవిల్లాడి పోయింది. వాళ్ళందరూ "పరధ్యానంలో వున్నావా, పుంచే పతిధ్యానంలో ఉన్నావా" అంటూ పరామర్శలూ, వేళాకోళాలూనూ— బయలుదేరేరేమో ఆ బస్సో రైలో ఎక్కడేనా యాక్సిడెంటయి పోయిందేమో అని బెంగొచ్చేసేసింది, ఎక్కడైతేనేం; పండగపూట ఇంత పప్పూ అన్నం తిని హాయిగా విశ్రాంతిపోయారుకదా; నా కంతే చాలు—" నిజం అయినా సరే కొంత విసుగుతోనే చెప్పేను. అయినా ఎంతో తేలిక పడింది మనస్సు.

"సరి సరి........పప్పూ అన్నం అంటావేమిటి ! నవరసాలూ, పిండి వంటలతో, బ్రహ్మాండంగా చేసేరు. ఇహ విశ్రాంతంటావా; వేరేగదీ, దోమ తెర మంచం, దన్లప్పిల్లో?- అనుకోకూడదుగానీ" మీ ఇంట్లో అయితే నాకలా జరగనే జరగదు?"

"పోనీసెండి పాపం, మా వాళ్ళింట్లో మీకెన్నడయినా బాగా జరిగింది కనకనా?" అని లేచాను. ఉడుకుబోత్తనం వాస్తోంది. ఆయన మాటలకి. మా వాళ్ళింట్లోనే కాదు, వాళ్ళింట్లోనూ.... అంటే మా అత్తారింట్లోనూ-ఆయన కలా జరగదు. ఆమాట ఆయన అన్లేదు. నాకనాలని ఉందిగాని ఆయన అన్నంత సుళువుగా నేనెలా అనడం....ఆలోచిస్తూ కిటికీ దగ్గర నుంచుంటే అమ్మపాడిన పాటలో ఓ చరణం జ్ఞాపకాని కొచ్చింది.

ఇయ్యగల చోటానే వియ్యమందరాదా !

పెట్టగల చోటానే పెళ్ళాదారాదా ?

అని సుభద్ర అర్జునుణ్ణి దెప్పుతుంది. ఇలాంటి సందర్భంలోనే, ఈ అర్జునుణ్ణి దెప్పేచాన్సు సుభద్రదికాదు : నాదైంది—రాగ వరసలో అంటే ఆ చరణాలు ఎంత బావుంటాయని ! ఆకర్షణకి తట్టుకోలేక అనేశాను - - దెప్పా లవి కానేకాదు.

ఆయన చిరునవ్వు మొహాన పోసుగుని లేచి కిటికీ దగ్గిరకొచ్చారు. రెండు చేతులా నన్ను పొదివి పట్టుకొని-" "నే ముందే చెప్పేను కదే: నువ్వు బాధ పడతావని!" అన్నారు.

"బాధ కాదండీ: బోధ" అన్నాను. మనస్ఫూర్తిగా నవ్వుతూ.

* * *

అమలాపురం మునిసిపాలిటీలో ఏదో లెక్కలు తనిఖీ చెయ్యడానికట వెళ్ళేరు మా ఆయన. పదిహేనురోజులైంది, ఇవాళో రేపో రావాలి. ఎదురు చూస్తున్నాను.

అంతలో పార్థసారథి అని, ఆయన స్నేహితు డొకాయన, ఒచ్చేడు. "అర్జునరావుగారున్నారా?" అంటాను.

నా కతను యిదివరకే తెలుసును. కూచోబెట్టి, సంగతంతా చెప్పాను. ఏదేనా పనుంటే ఉండిపోయి, రేపు ఆయన్ని చూసి వెళ్ళమన్నాను.

అతను ఉండడానికి వీల్లేదనీ, కొంచెం డబ్బు కావలసి ఒచ్చేననీ, చెప్పేడు. "ఆయన పిఠాపురం నించి ఒచ్చేసిన దగ్గర్నుంచీ కూడా నా ఇబ్బంది అలాగే ఉండిపోయాయి!" అన్నాడు.

"పిఠాపురం ఎప్పుడొచ్చారీయనా?" అన్నాను.

"మొన్న పండక్కి ఒచ్చేరు కదండీ."

"పండక్కి—అంటే?"

"సంక్రాంతిపండక్కండీ— తెలియనట్టడుగుతారేం?-ఆరోజు వైజాగ్ వెళతానని అర్జునావుగారు బైలుదేరడం, స్టేషన్‌లో ఎవరో టిక్కెట్‌తో సహా ఉన్న పర్సు కాజెయ్యవం—మీతో ఆయనేం చెప్పలా?"

నా కళ్ళు తిరిగాయి. మనస్సులో విద్యుత్తు ప్రస్ఫుకరించినట్టయింది. కడుపులో చెయ్యిపెట్టి తిప్పినట్టయింది. నీరసం వచ్చేసింది. స్పృహ తప్పి పోతుందని భయంవేసింది....డబ్బుపోవడం....కాదు; ఎవరో కాజెయ్యడం!

"లేదండి, ఏం జరిగింది?" అని చిరునవ్వు నటించాను.

"సరిపోయింది. మీతో ఏం చెప్పలేదన్నమాట...." పార్థసారథి చిరునవ్వు నవ్వాడు. "ఏ మొహం పెట్టుకు చెబుతార్లెండి!....ఈయనేమో టిక్కెట్ కొనుక్కొని, బండి లేటుకదా అని నిద్రపోతూంటే ఎవరోవర్సుకాస్తా కొట్టేశారు. ఆ సంగతాయనకి తెలీకబండి రాగానే ఎక్కేశారు. ఎక్కి ఎక్కగానే నేను కనిపించేసరికి మాట్లాడుతూ కూర్చున్నారు....సామర్లకోటలో టిక్కెట్లు చెకింగ్ చేసే స్టాఫ్ ఒచ్చి అడిగితే జేబులూ, బేగ్, అన్నీ తడుముకొని, వెతుక్కొని, పర్స్‌పోయిందని తేల్చారు.

"ఉహుం"

"....పండగ ఎడ్వాన్సు డెఫ్ఫయ్యయిదుట. ఇంట్లోంచి తీసుకున్నవి

ఇరవై౦టి; కాక టిక్కెట్టుట-మొత్తం నూరు....టిక్కెట్టు లేదని వాళ్ళు ఛార్జ్ చేసేరు. బొటాబొటిగా నా దగ్గరున్నది సరిపోతే ఇచ్చేశాను. పిఠాపురానికి టిక్కెట్ రాయించి....పొద్దున్నే వేరేబండిలో వెళ్దురుగాని రండని, పిఠాపురంలో దించేశాను. అప్పటికి మా యిద్దరి దగ్గిరా కలిపి ఇరవై ఒక్క నయాపైసాలు మిగిలేయి...."

"అంతకుముందు నాలుగు నెలల్నించీ నాకు జీతాలు లేవు. శాంక్షన్ రాలేదు, మా పోస్టులకి. అందుకని జీతాలు డ్రా చెయ్యలేదు. మా వాళ్ళని పుట్టింట్లో ఒదిలేసి, హోటల్లో అరువుపెట్టి రెండునెలలు తిన్నాను. రెణ్ణెల్లు దాటాక వాళ్ళు పెట్టలా. స్వయంపాకం మొదలెట్టాను.....బియ్యం ఉంటే మిరపగాయల్లేకా, పప్పుంటే నెయ్యిలేకా, బాధలుపడుతున్న రోజులు....మా డిపార్టుమెంటు సంగతి మీకూ తెలుసుగా. తిండికి లేక చస్తున్నా సరే, కేంపూ వర్కూ మాత్రం యమ అర్జంట్! ఎడ్వాన్సులైనా ఇవ్వరు. అలాగే బాధలు పడుతూ, రాజమండ్రి కేంప్ ఒచ్చాననుమాట....చేతిలో ఉన్న డబ్బులు కాసినీ ఎక్స్పెన్సెకి కట్టేశాను. పొద్దుటేచి ముష్టి ప్రారంభించాను....ఏం లాభం, అందరికీ పండగే. తగని ఖర్చులూ! ఎక్కడా పుట్టలేదు సొమ్ము. అందులో నాకు జీతాలు రావడంలేదని అందరికీ అవగాహన అయిపోయింది....ఇంతాచేసి ముష్టి మూడురూపాయలు దొరక్క, ఆఖరికి ఆయన, ఇక్కడే ఉండిపోతాను లేవోయ్, నీతోబాటే-అన్నారు....నాకు కక్కాలేక మింగాలేక అవస్థొచ్చి పడింది...."

"అయితే మీరిద్దరూ కలిసి పిఠాపురంలో గడిపారా, పండగ మూడు రోజులూ!—పోనీలెండి పాపం! థేంక్స్" అన్నాను దుఃఖం దిగమింగు కుంటూ.

"ఏం గడిపాం; నా మొహం! - ఆయన్లాటి మనిషి, నేనలాటి పరిస్థితుల్లో చేతిలో కాణీ అడని పరిస్థితుల్లో ఉండగా వొచ్చి ఉండి పోవలిసొచ్చినందుకు నాకెంత బాధ అనిపించిందో చెప్పతరం గాదు. సరిగ్గా తిండైనా పెట్టలేకపోయాను. కూరకైనా డబ్బులులేక బాధలు పడ్డాం....పొద్దున్నే బన్ రొట్టి అరువుతెచ్చి టిఫిన్; ఐదు నయాపైస లుంటే టీపొట్లాం తెచ్చుకుని టీ కాచుకునేవాళ్ళం (కాఫీ మరిచేపోయాం)—ఇజారో కొన్న ఊరగాయ, అప్పడాలూ, పెరుగు మనిషి నెల్లాళ్ళనించీ డబ్బు

లిచ్చేరు కాదని సణుగుతూ పోసే మజ్జిగ నీళ్ళుపోసి-ఇదీ నేనాయనకి పెట్టిన భోజనం! పోనీ అలాగేనా పెట్టగలిగానా, అంటే; సంక్రాంతినాడు సాయంత్రానికల్లా బొగ్గులు అయిపోయి, ఎక్కడా బుట్టెడు అప్పైనా పుట్టేయి కావు!- అందరూ ఎంచక్కా పంచభక్ష్య పరమాన్నాలూ వొండుకుని పండుగ చేసుకుంటూ వుంటే నా యింటికి రాకరాకొచ్చిన వారూ, నాకన్నా అన్ని విధాలా పెద్దవారూ, ఇలాటి కష్టాలు ఎన్నడూ ఎరగనివారూ అయిన అర్జునరావుగారికి అలాటి సత్కారంచేసి అవమానించవల సొచ్చినందుకు నాకెంత బాధ కలిగిందో నిద్రకూడ సరిగ్గాలేదు. సమయానికి రెండు దుప్పట్లు చాకలాడి దగ్గర ఉండిపోయాయి. దోమతెరలు తెచ్చుకోలేదు. ఒకటే దోమలూ, చలీ, ఒట్టిరోజులైనట్లైతే ఎలాగో గడిపేద్దుం కాని పండుగలు కావటం, దరిద్రం మరీ భూతద్దంలోంచి చూసినట్టు కనుపించసాగింది. ఆఖరికి సంక్రాంతినాడు సాయంత్రం ఉండబట్టలేక బట్టలకొట్టాయన్ని బతిమలాడితే రెండు దుప్పట్లూ, ఒక పంచెల్చాపూ, రెండు రెడీమేడ్ షర్టులూయిచ్చాడు; పద్దు రాసుకుని.... అత్తారింటికి వెళదామని అందరితో సరదాగా గడుపుదామనీ బైల్దేరిన ఆయనకి నావల్ల అలా అయింది. రైల్లో నేను కనబడకపోతే ఆయన పర్సుపోయిన సంగతి ముందే తెలుసుకొని వెంటనే ఊళ్ళోకొచ్చి ఏవో తంటాలుపడి మర్నాటికైనా విశాఖపట్నం చేరుకుందురు. వెనక్కి వెళ్ళలేక ముందుకి పోలేక-అలా అవసక్తిలోనైన ఆయనమొహం చూడ్డానికి నాకు మొహం చెల్లలేదు. ఎంతబాధో!"

"అయ్యో ఇంకా నయం టిక్కెట్ కలెక్టర్కి కివ్వడానికైనా మీ దగ్గిర ఉందిగనక-" అని ఏదో అన్నాను. ఆ తరవాత నాకు మాటేరాలేదు. ఊరుకున్నాను.

"ఆఖరికి, కనుం వెళ్ళిన మర్నాడు తిరిగిరావడానికి డబ్బులు లేవుగా. నాకు తెలుసున్న ఓలారీడ్రైవర్‌తో చెప్పి. లారీలో ఎక్కించి పంపేనండి, ఆయన్ని రాజమండ్రి!-ఎందుకులెండి; అవన్నీ వింటున్నకొద్దీ మీకు బాధ."

ఇంతకంటె బాధపెట్టే మాట అతనేదీ అన్లేదు. నాకింక ఏడుపు ఆగదనిపించింది. "ఉండండి, మీకు కాఫీ తెస్తాను!" అని లోపలికెళ్ళాను.

నా మొహం నటించ గలిగిందిగాని, నా మనస్సూ, కళ్ళూ నటించలేకపోయాయి. లోపలి కెళ్తూనే, నీరు కమ్మిన కళ్ళకి ఏదీ కనిపించక, వెంటనే తుడుచుకోవల సొచ్చింది.

*  *  *

అలాగే మనస్సూనూ.

నా మనస్సు, పరిపరి విధాల పోయింది..... సిల్లీగా కనుపించే ఈ పండగ ఉదంతం ఈ అనుభవం నాకేవో కొత్తపాఠాలు నేర్పడానికి సమకట్టినట్టుంది.

* * *

నా గుండె నీరైపోయింది. జరిగింది నెమరు వేసుకొంటే ఇలా కనుపిస్తోంది....ఆయనెలా వున్నారో అని నేను అనుక్షణం బాధపడడంవల్లే ఆయన నిజంగా బాధలు పడ్డారు. తిండి అమరిందో లేదో, నిద్ర కుదిరిందో లేదో, సరదా లేదేమో, సరసం లేదేమో, అని నేనెలా అనుకున్నా అన్నీ తథాస్తై పోయి, ఆఖరికి ఏక్సిడెంటైందేమో అనినేననుకొనేసరికి ఆయనకి లారీలో ప్రయాణం చేసే యోగం పట్టడం! ఇంత పాపాత్ము రాలినా నేను!-నా కాయన మీదవున్న ప్రేమాభిమానాలు కీడునూ చెడునూ శంకించడానికేనా?-ఆయనెక్కడో కులాసాగా, హుషారుగా, ఆనందంగా ఉండివుంటారని నే నెందుకనుకోలేకపోయానో! అలా అనుకుంటే అలాగే ఉండేవారేమో.

ఈ ఆడిట్ క్యాంప్ పదహారోరోజు ఎప్పుడు పూర్తవుతుందో ఆయనెప్పుడు ఇంటికొస్తారో-ఆయన్ని ఈ క్షణం చూడాలనుంది.

హాల్లో ఆయన బస్టఫోటో కెదురుగా నించొని, సగం అల్లిన జడ ముందుకు తెచ్చుకుని అల్లుకుంటూ, ఓసారి పైకి ఓసారి కిందికి చూసుకుంటూ, ఆ ఫోటో నన్ను పలకరించిన పులకరింపుకి సిగ్గుపడి నవ్వుకున్నాను.

కాని-అది కాదు. అదొట్టి మూఢనమ్మకం-ఆయనేమైనా రాజకుమారిడి తులసిమొక్కా, నా మనస్సులో భావాన్ని బట్టి పెరుగుతూ తరుగుతూ వుండడానికి?-అది కాదు. మరేదో వుంది పాఠం.

* * *

గొప్పలు చెప్పేరు. ఎయిర్ కండిషన్ గది, డన్లపిల్లో అంటూనూ. కోరికలు గుర్రాలై కోటగోడలు లంఘించేయి. పెనగలూ రాళ్ళూ కలియబోసినట్టు బాగానే అల్లేరు. ఫిన్లే వారి పంచెల చాపు? గొప్పలు విని అలా జరిగేట్టు చేస్తారనా?-ఏమో, నవ్వు వస్తోంది.

రానీ, ఇంటికి-ఎలా చెప్తితే బావుంటుందో. నిడదవోలునించి ఎవరో ధాన్యం వ్యాపారస్తుడట. ఈవూళ్లో పనుండి మనింట్లో మకాం ఉందామని వొచ్చాట్ట....ఎయిర్ కండిషన్ గదీ డన్లపిల్లో లేవని వెళ్ళిపోయాడు అననా? అంటే ఏమంటారో.

అదీకాదు. గొప్పకోసం ఆయ నెప్పుడూ తాపత్రయ పడలేదు. మా పుట్టింటూరు గొప్పగా జరిపించలేదని ఆయన అభిప్రాయం కానేకాదు. ఇంకేదో వుంది. నేనైనా మరెవరైనా నేర్చుకోవలసింది!

*　　　*　　　*

ఈ అబద్ధాలెందు కాడేరో? మోసం చేసేరు-అవును.

అబద్ధా లాడవలసిందే. ఈ అర్జునులవారు ఆ పార్ధసారధితో, పిఠాపురంలో నా ఎడబాటులో గడిపిన ఆ యుగాల చరిత్ర-ఆయన నాతోనే కాదు, ఏ భర్త ఏ భార్యతో చెప్పినా అందంగా వుండదు.

పార్ధసారథే, కొంచెం ఆలోచించి నాతో నిజం చెప్పక మానెయ్యవలసింది.... అసలీయనే, అతన్ని కూడా కట్టుదిట్టం చేసుకోవలసింది.... టైమ్ లేక పోయి ఉంటుంది. నేను రైలు దిగి, రిక్షా ఎక్కి- ఝూడించే సమయానిక్కూడా ఆయనకీ అబద్ధాలు తట్టలేదు.... రాత్రి మళ్ళీ, పునః పృచ్ఛలో పుట్టిన ఉపాయం.... అంతలా నే నడక్కపోతే ఆయన చెప్పేవారే కాదు.

ఇంతాచేసి దారిద్ర్యం, లోకంలోని తత్త్వవేత్తలందరూ అనుభవనీయమని తేల్చి ముంచీ చెప్పిన ఉదాత్తయోగం-తప్పకుండా చవి చూడవలసిందే. కాని పండగ అవడాన్ని-ఒచ్చింది పేచీ-అందుచేత-నా సంతోషం కోసం, నేను మూడురోజులూ అనుభవించిన వేదన మరిచిపోడం కోసం, ఆయన సుఖంగా ఉన్నారు కదా అని నేను తృప్తి చెందడం కోసం, అట్టే మాటాడితే మా ఆయనకేం లోటు. ఇలాంటి గొప్ప స్నేహితులున్నారని నేను పొంగిపోడం కోసం-వొక అందమైన అబద్ధం ఆడేశారు ఆదర్శవంతంగా.

నిజానికి ఆదర్శం అంటే కూడా అందమైన, కష్టమైన అబద్ధమేగా.

క్షణికంకానీ, శాశ్వతం కాని, ఆనాటి, ఆయనగారి అందమైన అబద్ధాన్ని విని, నేను పొందిన ఆనందాన్నీ, అది చూసి ఆయన పడ్డ తృప్తినీ, ఆయనా నేనూ స్మరణీయంగా ఉంచుకోడం మాత్రం కల్తీలేని నిజం!

నిజం కోసం అబద్ధం!

అబద్ధం అని తెలిసిపోయినంత మాత్రాన అందం నశించి పోయేటట్లయితే కావ్యాలు కాయితప్పడవలూ, ప్రబంధాలు పకోడి పొట్లాలూ అయిపోయి ఎప్పుడో పోయి వుండేవి.

కోపగించుకునీ, మీ కధ నాకు తెలిసిపోయిందండోయ్ అని వెటకారం చేసి, నే నే ప్రయోజనాన్ని సాధించేది? ఓ గడియసేపు ఆయన్ని దులిపేసి, మీ కూ క థ లే యి ష్టం

కడిగేసి యిలా చేస్తారా అని నిలదీసి అడిగితే ఫలితం ఏమిటో నాకూ తెలుసు. ఆయన నా కిచ్చిన ఆనందం అంతా ఒట్టి నీటిమీద రాతయిపోతుంది. ఆయన బాధపడిపోతారు. క్షమార్పణలు చెప్తారు, మనస్ఫూర్తిగా 'పశ్చాత్తాప పడతారు. అయితే చాలా చిన్నబుచ్చుకుంటారు-నేనే ఆయన్ని చిన్నబుచ్చేసేకన్న అవమానం ఏముంది, నాకు?

నేను పార్థసారథంత తెలివి తక్కువదాన్ని కాదు!

నా దానందం యిస్తున్నానన్న గర్వం ఆయన కుండడం నా జీవితానికెంతో అవసరం, ఆరోగ్యం! ఆ గర్వాన్ని భంగం చెయ్యడం చాలా ప్రమాదం-నన్ను సుఖపెడుతున్నాననీ, ఆనందింపచేస్తున్నాననీ ఆయన అనుకుంటే, అది భ్రమే అయినా ఆయనకి ఆరోగ్యం....అవసరమైనంత భ్రమలేక, ఎప్పటికప్పుడు దతోటి సర్యాన్నే కలుసుకుంటూ నిరాశల్నే ఎదుర్కొంటూ వుండడం వల్లనే జనం సుఖపడలేక పోతున్నారు....

* * *

దఫిసూ, కాఫీ యిచ్చి, పార్థసారథి వాట్ని స్వీకరిస్తున్న సమయంలో, నేను నేర్చుకున్న పాఠం, వాటికన్న రుచిగా శుచిగా అతనికి అందజేసేను. అతను చేసిన తప్పు తెలుసుకొని, మరో తప్పు చెయ్యకుండా వుండే అవకాశం ఒస్తోందంటే అది అంది పుచ్చుకుందికి చాలా వుత్సుకత చూపించేడు, దాంట్లో అతనికి చాలా ఆనందం కనబడేట్టు చూపించేను.

నవ్వుకుంటూ నమస్కరిస్తూ వెళ్ళాడు పార్థసారథి.

* * *

మర్నాడు మహాలక్ష్మమ్మగారితో సాయంకాలం ఆటకి సినిమాకి వెళ్ళేను. అక్కణ్ణించొచ్చేసరికి మా ఆయన ఈజీచైర్లో పడుకుని నిద్దరోతున్నారు.

"ఎప్పుడొచ్చేరండి?" అన్నాను; లేపుతూ.

"ఏడుంబావుకి"

"అయ్యో; అనుకుంటూనే వున్నాను సుమండీ. వంటకూడా చేసిందాన్ని. ఏమోలే ఇవాళే ఒస్తారా అని అనుకుంటూ మాలక్ష్మమ్మగారు రమ్మంటే సినిమాకి వెళ్ళేను!"

"పోన్లే—"

"కాళ్ళు కడుక్కోండి భోంచేద్దాం. ఇద్దరం కలిసి తిని ఎన్నాళ్ళైందో!"

ఆయన నావేపు విచిత్రంగా చూస్తూ లేచేరు.

నా ధోరణి కృత్రిమంగా తయారై పోతోందని గ్రహించాను. వెంటనే నోటి కొచ్చిన మాటేదో పెదిమల్లోనే బిగించేశాను.

"పెట్లో డబ్బు తక్కువైందే—! ఏమైనా కొన్నావా?" అన్నారు మా ఆయన; కొంత సేపు పోయాక.

ముద్దనోట్లో ఉండిపోయి నేనేం అన్లేదు. "లే"దన్నట్టు తలూపాను.

"- -మరేంలేదు; రవణమూర్తి డబ్బు అప్పు కావాలంటేను, ఇస్తాను రమ్మని ఇంటిదాకా తీసుకొచ్చి లేదని పంపవలిసొచ్చింది.

"అప్పుకావాలని ఒచ్చేరా....తీర్చవలసిన బాకీ ఒకటుంటే తీర్చేశాను, నేను." అన్నాను, ఆయనవేపు చూడకుండా.

"ఎవరి కబ్బా?"

"ఎవరో పిఠాపురంలో బట్టల వ్యాపారస్తుట్ట.మీరు నలభై రెండురూపాయల చిల్లరివ్వాలంటూ బిల్లుబుక్కు తెచ్చి చూపించాడు....ఏదో పనుండి రాజమండ్రి ఒచ్చి పనిలో పనిగా మనింటికొచ్చినట్టున్నాడు....మీ సంతకం ఉంది. బాగానే గుర్తుపట్టాను. మనింటి గుర్తులు మీ ఫ్రెండెవరో చెప్పేట్ట. తిన్నగా ఒచ్చేశాడు ....సరేలే, ఏ క్యాంపులోనో ఎప్పుడో తెచ్చుంటారు అనుకుని పెట్లో డబ్బు ఉంది, తెచ్చి యిచ్చేశాను."

మా ఆయన ఒక్క నిమిషం తినడం మానేసి, అంతా విన్నారు "ఇంకేమైనా చెప్పేడా?" అన్నారు. ఆయన అంతలా తెల్లబోవడం చూసి. బిల్లు బుక్కు మీద తారీకు చూశావా అని అడిగేస్తారేమోననీ, ఈ కథ పప్పులో కాలువెయ్యకుండా ఒడ్డెక్కించ గలనా అనే భయం వేసింది.

"ఉఁహూఁ. ఏం చెప్పలేదే."

ఆయన నావేపు ఇంకా కాస్త అనుమానంగా చూస్తూ "పార్థసారథీ" ఆ సంగతులేమీ చెప్పలేదూ?"

"పార్థసారదంటే, నల్లగా ఉండే ఆయనేన, ఇన్సూరెన్సు-"

"ఛీ ఛీ అతనుకాదే, తెల్లటాయన, సర్వేయరు!"

"ఓహో, ఆయన ఊసెందుకూ, ఇప్పుడు?"

"అఁహఁ అతనూ పిఠాపురం లోనేఉంటున్నాడులే!"

"ఏమో, అయితే మనింటి గుర్తులూ అవీ అతనే చెప్పి ఉంటాడు.... సినిమాకి బయల్దేరుతూ వుంటే వదురుగా ఒచ్చాడు. వెంటనే పంపేశాను.... ఇంతకీ మీరు బాకీ ఉండటం నిజమే కద!"

మా ఆయన నోట్లో ముద్ద పెట్టుకొని తలవూపాటు పరధ్యానంగా.

(రంగనాయకమ్మగారు మెచ్చుకుని ఉత్తరం రాసిన కథ)

(ఆంధ్రజ్యోతి వీక్లీ - దీపావళి 1983)

# సద్యోగం

"రెండు గోపాల్ జర్దా కిళ్ళీలు!" అన్నాను, రెండు రూపాయల నోటు అందించి.

కుర్రాడు ముగ్గుతూ ముగ్గుతూ వున్న అరటిపండులా వున్నాడు. "అయ్" అని వినయంగా అందుకుంటూ "బంగాలీ ఆకే గదండి?" అన్నాడు.

"ఆ' కిమాం దిట్టంగా తగిలించు."

"అలాగే సార్."

"ముందొక సోడా కొట్టు?" అని ఆజ్ఞాపించేను.

"యస్సార్."

సోడా పుచ్చుకుంటూ "ఈ అరటి పండెంత ?" అన్నాను.

"ముప్పయ్యయిదు పైసలండి సార్."

"అబ్బా! యేమిటంత గిరాకి ? చక్కెర కేళీ రేటు చెబుతున్నావ్ ?"

"చిత్తం సార్. రాయిమండ్రి సరుకండి. చక్కెర కేళీ కాదుగానండి. అమృతపాణీ అంటారండి." అని సున్నం బ్రష్ అంటించిన తెలుపును చేతి నుంచి తుడుచుకుంటూ చెప్పాడు. తనే ఒకపండు ఎంపిక చేసి కత్తితో గెల నుంచి కోసి అరటిపండు వొలిచి చేతిలో పెట్టినంత పనిచేసేడు. "చక్కెర కేళీ దీనిముందు ఎందుకు పని చేస్తదండి ? ఊరికే దూరపు కొండలు నునుపంతే. తమరు భోంచేసి చూడండండి. నచ్చకపోతే వూరికే ఇచ్చేస్తానండి" అన్నాడు. మళ్ళీ కిళ్ళీకట్టే కార్యక్రమంలో పడ్డాడు. మొగాన చిరునవ్వు వదలకుండాను.

పండు తిన్నందుకాద్దు. అతగాడి ప్రవర్తనకి ప్రసన్నతకీ ఇవ్వవచ్చు నలభై పైసలు-అనిపించింది.

రాత్రి పదిన్నర కావస్తోంది. మేం వుండే కాలనీలో కిళ్ళీ దుకాణాలుండవు. ఈ వేళప్పుడు ఒకవేళ ఉన్నా అక్కడ నాక్కావల్సిన జర్దా వుండదు; 'గోపాల్ జర్దా' అన్నానా' అది లేదు సార్ బాబాజర్దా వుంది కట్టమంటారా ?" అంటాడు. అదీలేకపోతే బంగాలీఆకు లేదుసాల్ అంటాడు. అదీ కాకపోతే ఏలక్కాయలేదనో పిప్పరమెంటు పువ్వు లేదనో కండిషన్ పెడ్తాడు. రోజూ అందుకని టౌన్‌లోంచే

పట్టుగెడతాను కిళ్ళీలు. మా రామారావు మాస్టారూ అంతే. యాభై చదరపు మైళ్ళ సిటీమొత్తంమీద ఆయనకి కావలసిన కిళ్ళీ ఆయన జావలసినవిధంగాకట్టేది ఒక్కదుకాణమే. ఆయన స్వయంగా అంత దూరం(కనీసం నాలుగు కిలోమీటర్లు) సైకిలుమీద వెళ్ళి తెచ్చుకుంటారు. ఓసారి ఆయనకి కొంచెం ఆయాసంగా వుండి స్వయంగా వెళ్ళలేని పరిస్థితొచ్చిందిట. కొడుకులు ముగ్గురూ మూడు పన్లమీద వుండిపోయారుట. ఆయనకేమో ఆ "స్పెసిఫికేషన్స్"ప్రకారం కిళ్ళీలు వుంటేనే గాని తోచదని యెరిగిన వారై వారి ఇల్లాలే స్వయంగా కొంతదూరం సిటీ బస్‌కి నడిచి బస్సుకోసం నిలబడి బస్సులోపలా నిలబడి అంతదూరమూ వెళ్ళి మాస్టారి కిళ్ళీలు కట్టించుకుని గంటన్నర శ్రమ చేసుకుని వచ్చారట.

"మేస్టారు మందుకొట్టరు. మనకి అరవై రూపాయల విస్కీ బాటిల్‌తో గానీ రానిది ఆయనకి అరవై పైసల జర్దా కిళ్ళీతో వస్తుంది కిక్కు అదే ఆయనతో చిక్కు"అని మాస్టారు శిష్యులూ మాసహోధ్యాయులూ కొందరనడం యెరుగుదును.

"ఆయ్"తో మొదలెట్టాడు కుర్రాడు. యస్సార్ అన్నాడు. అలాగే సార్ అన్నాడు. చిత్తం అన్నాడు,ఐదుపైసలు తగ్గిస్తాడేమో అని బేరం ఆడబోయాను, పండు బాగులేకపోతే డబ్బులే ఇయ్యొద్దన్నాడు. కాస్తమోతాదు మించితే ధూర్త లక్షణం అయిపోయేటంత అతి వినయం ప్రదర్శించి నన్ను వశపర్చుకున్నాడు.

"అందులో వోకిళ్ళీ ఇటిచ్చిమళ్ళీ మరోటి కట్టు" అన్నాను; రెండు రూపాయల నోటు ఇచ్చినదానికి బేరం సరి పెట్టేస్తూ.

"ఎస్సార్" అన్నాడు కుర్రాడు; చెప్పినట్టు చేస్తూ.

"చదువుకున్నావా ?" అన్నాను.

"ఏదోలెండి సార్. బి. కాం. మూడోయాడాది వరకు చదివిమానేశానండి"

"మరెక్కడయినా వుద్యోగం కోసం ప్రయత్నించలేక పోయావా?" అన్నాను.

"మా మామయ్యొద్దన్నాడండి."

"మీమామయ్యేంచేస్తున్నాడు,అతనూ వ్యాపారమేచేస్తున్నాడా?" అన్నాను.

"ఆయ్."

నా ప్రశ్నకి మరో జవాబులాగా పక్కనుంచి వో వ్యక్తి దూకుడుగా

వచ్చి "ఏరా ఇంకా మూసెయ్యలా కొట్టు? పోలీసోళ్ళు చూశారంటే సంపుతా
రారే?" అన్నాడు.

"ఇదిగో అయిపోయింది మావయ్యా. ఇదే చివర బేరం"! అని
కళ్ళు ముడిచేసి "రెండూ కాగితానికి కట్టేనండి సార్." అన్నాడు కుర్రాడు.

వచ్చిన వ్యక్తి నన్ను పరిశీలనగా చూసి "నమస్కారం గురువుగారు
కాన్నాళ్ళకి" అన్నాడు.

"మీరు —? "అన్నాను.

"గుర్తుబట్టేదేంటండి? నేను కిష్టమూర్తినండి. నా చేత కళ్ళికొట్టెట్టించింది
మీరేనండి" అని నవ్వుతూ, నా చేతిని వెతిగి పట్టుకుని వూపాడు.

తొమ్మిదేళ్ళ కిందట—

బి. కామ్. సెకండ్ క్లాస్‌లో పాసయ్యాను సార్. ఎంప్లాయ్‌మెంటు ఎక్
ఛేంజిలో రిజిష్టర్ చేసి నాలుగేళ్ళయింది సార్. నా కొచ్చినమొట్ట మొదటి
కాల్ లెటర్ తమరు పన్చేసే ఆఫీస్ నుండే వచ్చింది సార్. ఎకౌంట్స్ క్లర్క్
కమ్ టైపిస్ట్ పోస్టులు సార్. నాలుగు కాలశీంట సార్, ఇరవై ఆరుమంది
పంపుతున్నారు సార్. తమలాంటి వారు కలగజేసుకుంటేగానీ రాదు సార్.
అంటూ మూడు రోజులపాటు ఎడాతెరిపీ లేకుండానన్ను ఆశ్రయించాడు.

ఈ క్రిష్ణమూర్తి!

అప్పటికీ యిప్పటికీ ఆ ఆఫీస్‌లో ఎస్టాబ్లిష్‌మెంట్ సెక్షన్ సూపరిం
టెండెంట్ నేనే.మధ్యలో ఒకసారి ట్రాన్స్‌ఫర్ అయ్యానుగాని మళ్ళీ పలుకుబడి
వుపయోగించుకుని యిక్కడికే చేరాను.

సరే. మర్నాడు ఫైల్స్ తిరగేసి చూశాను. ఇంటర్వ్యూ ఇంకా మూడు
రోజులుంది. ఎకౌంట్స్ ఆఫీసర్ బ్రహ్మాజీరావుగారు; డెప్యూటీశెక్రటరీ అనంత
శయనంగారు, పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ కొండయ్యగారూ ఆ ఇంటర్వ్యూ
చేస్తారు. బ్రహ్మాజీరావు గారికి నా మాటంటే గురి కదా; పోనీ నేనున్న వీధి
లోనే వుంటున్నాడు కదా కాస్త కనిపిస్తూ వుంటాడు మంచికీ చెడ్డకీనని; క్రిష్ణ
మూర్తి కేసు ఆయనతో కదిపించాను.

"నేను అర్జంటు పనిమీదా కలకత్తా వెళ్ళిపోతున్నాను. ఇంటర్వ్యూ
వాళ్ళిద్దరే కండక్ట్‌చేస్తారు. సరే మీరు అంత యిదిగా చెబుతున్నారు గనక నేను

వాళ్ళకిద్దరికీ విడివిడిగా చిన్న హింట్ యిస్తాను. ఆపైన అతని అదృష్టం!" అన్నారాయన.

క్రిష్ణమూర్తికి ఆ ఉద్యోగం రాలేదు.

సరిగ్గా ఆ రోజుల్లోనే ; ఒక కమర్షియల్ బ్యాంక్ బ్రాంచికి, మేనేజరుగా నా శిష్యుడు రామబ్రహ్మం వొచ్చాడు. ఉద్యోగంలో చేరిన మూడో రోజు అతను మా యింటికొచ్చి కుశల ప్రశ్నడుగు తున్న సమయంలో క్రిష్ణమూర్తి తన ఇంటర్వ్యూ ఫలితం యేమైందని కనుక్కోడానికి మా ఇంటికే వొచ్చాడు. బోలెడు సార్లు తిరిగి క్రిష్ణమూర్తికి ఆ చేదునిజం తెలియజేశాను. నేను అంత మర్యాదగా చూస్తున్న మనిషికదా అని రామబ్రహ్మం ఆసక్తి చూపించి, పట్టభద్రులకి స్వయం ఉపాధి పథకాలు చాలా వున్నాయని: అలాటివాట్లో ఏదో ఒకటి చేపట్టగలిగితే తన బ్యాంక్ నుంచి రెండువేల అయిదు వందల వరకు అప్పు యివ్వొచ్చనీ ఈ వూరి బ్రాంచికి తనే యజమాని కనక "జస్ట్" గురువుగారు "మోరల్ సెక్యూరిటీగా ఉంటే చాలు. "ఆర్డర్" తనే యిస్తాననీ చెప్పేడు.

దాంతో-

క్రిష్ణమూర్తి వాళ్ళయింటి అరుగు మీద కిళ్ళీ దుకాణం పెట్టాడు.

బ్యాంకు వాళ్ళు ఇండెమ్నిటీ బాండుకి. నామకః తెరిచి వుంచవలసిన కరెంట్ ఆకౌంటుకి కొంత ఖర్చు పెట్టించినా, మిగిలిన డబ్బుతో వాళ్ళ యింటి ముందరి అరుగుమీద గోడలు అల్మారాలు నిర్మించి తలుపు లేర్పాటు చేసి పకడ్బందీగా కొట్టు కట్టాడు క్రిష్ణమూర్తి.

ఆర్నెల్లు గడిచేలోగా నేను అతన్ని చాలాసార్లు పలకరించేను: కిళ్ళీలు తీసుకుంటున్న ప్పుడల్లా.

ఇవాళా. రేపా దివాలా తియ్యడం అన్నట్లే ఉండేవాడు.

"ఏం వ్యాపారం సార్. అందరూ అరువులు పట్టుకుపోతున్నారు! ఉన్న సరుకులు కొనరు. సబ్బులు తెప్పించావా. అగరొత్తుల ప్యాకెట్లు లేవా. అయ్యో తల నెప్పి మాత్రల్లేవటోయ్ అనేస్తున్నారండి" అన్నాడొకసారి క్రిష్ణమూర్తి.

"బ్యాంకోళ్ళు రెండువేల అయిదు వందలిచ్చారాండి? అందులో ఈ కొట్టు కడతానికి మునిసిపాల్టీవాళ్ళు ప్లానెప్రూ చెయ్యటానికి రెండొందలు కాజేశారండి. అసలు బ్యాంకి గుమ్మం దాటేలోపుగానే దాదాపు నూటరవై రూపాయలై పోయాయండి. ఆ తరువాత ఇక్కడ గోడల్లేపటానికై తేనేం. తలుపులూ అల్మేరాలూ

ఐతేనేం రోడ్డుమీదికి మెట్లయితేనేం పన్నెండు వొందలై పోయాయండి. నల్లే కలపతో బడ్డీ కట్టించినా పదిహేను వందలైపోతా యనుకోండి. అదిగాదు నేననే దండి. ఆ రెండువేలనాలుగొందలూ దీనిమీద బెట్టానుగానండీ దీనికి బదులు అదే సొమ్ము గుప్‌చిప్‌గా ఎవరిచేతుల్లో నైనా పడేస్తే ఉద్యోగమే వొచ్చేది గదంటండి?" అన్నాడు క్రిష్ణమూర్తి యింకోసారి.

నాకు ట్రాన్స్‌ఫర్ అయినప్పుడు క్రిష్ణమూర్తితో చెప్పకుండా తిన్నగా బ్యాంక్ కెళ్ళి రామబ్రహ్మాన్ని కలిశాను. "క్రిష్ణమూర్తి తరుపున హామీ వున్నాను కదా: అతను నేడో రేపో కొట్టు ఎత్తేసే టట్టున్నాడు. కొంపదీసి నా పీకల మీదికి రాదుగదా" అని రహస్యంగా అడిగాను.

రామబ్రహ్మం లెడ్జెల్ తెప్పించి చూశాడు.

దుకాణం తెరిచిన నాలుగు నెలల వరకు అకౌంట్‌లో జమ అసలు లేదు. (వడ్డీకూడా లేదు)

అయిదో నెలనుంచి, నెలకెంతకట్టాలో అంతకి ఒకటిన్నర రెట్ల చొప్పున జమ ఎడింది. అలా నాలుగు నెలలు పడింది మళ్ళీ గైర్ హాజరు. అలా మూడు నెలలు. మళ్ళా పదో నెలలో నాలుగు వాయిదాల మొత్తం చెల్లు.

"ఈ లెక్కని అతనేమి దివాలా తియ్యడు మేస్టారూ, అయినా అతగాడికి స్వంత యిల్లు వుంది. మరేం భయంలేదు; మీరు నిశ్చింతగా వెళ్ళిసొండి." అన్నాడు రామబ్రహ్మం,

అంతే. క్రిష్ణమూర్తిని మరిచి పోయాను.

ఇప్పుడు—

ఈ నగరాని కంతటికీ నాడీకేంద్రం లాంటి ఈ సెవెంటీ ఎం. ఎం. థియేటర్ జంక్షన్‌లో సరిగ్గా థియేటర్ కెదురుగా క్రిష్ణమూర్తి కిళ్ళీకొట్టు!

షేక్‌హాండు అయినాక వెంటనే క్రిష్ణమూర్తి కిళ్ళీకొట్టు మీదనుంచి మేన ల్లుణ్ని దింపేశాడు.

తనే అధిష్టించాడు ఆ సింహాసనం.

అప్పటికే నాకు చేతికందిపోయిన జర్దాకిళ్ళీల విశేషం అడిగి తెలుసుకుని "నాచేత్తో రెండు కిళ్ళీలు కట్టి ఇస్తాను గురూగారూ" అని ముచ్చటపడ్డాడు,

పళ్ళెంలో తడిగుడ్డ కింద వుంచిన బెంగాలీ తమలపాకుల్ని ఓసారి నిర్ల క్ష్యంగా తిరగేసి వదిలేసి దిగువన బుట్టలోంచి మర్రి ఆకులంతేసి పరిమాణం దళస రీవున్నవి లాగాడు! వాటిని చక్కగా శ్రద్ధగా కడిగాడు.

సున్నం రాస్తూ
కవిరి (కాచు) పూస్తూ
ఖిమాం తగిలిస్తూ
జర్దా వేస్తూ
పచ్చివక్కా
ఉప్పుచెక్కా
యాలక్కాయి
పిప్పరమెంటూ తగిలిస్తూ ; చెప్పాడు విశేషాలు.—
ఆ కిళ్ళీ దుకాణం విలువ యెంత లేదన్నా నలభై వేలుంటుందిట ఇవాళ,
సెంటర్లో పెట్టినందుకు 'పగిడీ' లాంటి ముడుపు పదివేల రూపాయలు.
కొట్లోవున్న నిలువెత్తు ఫ్రిజిడేర్ ఏడువేలు.
ఇంక అక్కడి సరుకో?
అది కిళ్ళీ కొట్టేనా అంటే
అవునంటే అవును,
కాదంటే కాదు కూడాను.
సబ్బులు, దువ్వెనలు, హేరాయిల్సు, షాంపూలు,
టూత్ పేస్టులు, బ్రష్షులు, నాలికబద్దలు.
బ్లేడులూ, రేజర్లు, లోషన్లు, ఆ బ్రష్సులు.
పేకదస్తాలు, జేబురుమాళ్ళు, బట్టలారేసుకునే హాంగర్లు, క్లిప్పులు, రబ్బరు బ్యాండ్సు, జెడపిన్నులు, రిబ్బన్లు.
కాఫీపొడి, టీ పొడి పొట్లాలూ, బోర్న్‌విటా డబ్బాలూ రీఫిల్సు. బూస్టు లాంటి ఇతరపొడులూ పాలపొడి డబ్బాలు.
సిగరెట్లు విదేశీ స్వదేశీ అనే విచక్షణ లేకుండా కొన్ని డజన్ల రకాలు. చుట్టలూ, బీడీలూ పొగాకు—
సూదులు, దారాలు, గుండీలు, జిప్పులు.
దోమల్ని తరిమేసే కొత్తరకం సర్పాకృతి అగరొత్తి చుట్టలు,
సోడాలూ, అరటిపళ్ళూ డ్రింకులు.
ఈపక్కగా వేళ్ళాడుతూ సీమటపాకాయగుత్తుల్లా రకరకాల రంగురంగుల వివిధ భాషల వార్తాపత్రికలూ, వారపత్రికలూ, మాసపత్రికలూ,

ఆ లోపల ఫ్రిజిడేర్ నెత్తిమీద కూర్చునిమరిన్నిరకాలపుస్తకాల దొంతర్లు

నోట్ పుస్తకాలూ, పెన్సిళ్ళు, బాల్ పాయింట్ పెన్నులూ వాటి రీఫిలు్స,

టార్చి లైట్ లకీ, రేడియోలకీ, వాడే బ్యాటరీలు.

అగరొత్తులూ, ఫేస్ పౌడర్లు, సెంట్లూ,

ఎదురుగా సినిమా హాలు ఉండడం చేత తప్పనిసరిగా అవసరంవొచ్చే

తల నెప్పిమాత్రలు.

అక్కడ లేని వస్తువు సూపర్ బజార్లో కూడా వుండదన్నాడు.

"పోన్లే. నే ననుకున్నదానికంటే యెక్కువగానే బాగుపడ్డావు. అదే సం

తోషం నాకు" అన్నాను.

అతను నా కోసం ప్రత్యేక శ్రద్ధతో కట్టిన కిళ్ళీలిస్తూ "అమ్మాయి తమ

ఆఫీస్ కొచ్చేనండి. ఇక్కణ్నుంచి ట్రాన్స్ఫరై పోయారన్నారండి." అన్నాడు

క్రిష్ణమూర్తి.

మళ్ళా జేబులోంచి డబ్బులుతీసి ఇవ్వబోయాను.

"మంచారే. ఉంచండుంచండి" అని నన్ను కసిరినంత పనిచేశాడు.

రే కామేశా ఇందాక అయ్యగారిదగ్గర డబ్బులుచ్చుకున్నావా?" అని మేనల్లుణ్ణి

కసిరాడు.

"మరే మామయ్యా రెండ్రూపాయలిచ్చారు."

ఆ రెండు రూపాయలు కూడా ఇచ్చేశాడు క్రిష్ణమూర్తి.

"కాని ఇన్ని వందలవస్తువులు పెట్టావు చూసుకోతం. కాసుకోతం కష్ట

మేమోకదు?" అన్నాను.

"తప్పదండి, ఇందులో పోటీ అల్లాంటిదండి" అన్నాడు క్రిష్ణమూర్తి,

"మనూళ్ళో సుమారు ఎనిమిది వందల కిల్లీ కొట్లుంటాయండివ్వాళ. అందులో

ఐదు వందల్దాకా ఇదే పద్ధతండి. ఈ పద్ధతిలో వున్న కొట్లేవీ కూడా మన

తెలుగోళ్ళవి కావండి. ఈ మలయాళీ కొట్ల పద్ధతి చూసి, నేర్చుకోకపోతే యాపా

రం పాపాయిలా గుండిపోద్దండి. ఇంకా ఆశ్చర్యమైతే కిళ్ళీకొట్టాననుకుని టీ

కొట్లు కూడా పెట్టేసి దాంటో బన్నులు బ్రెడ్డులు బిస్కెట్లు కేకులు పకోడీలు

సమోసాలు మసాలొడ్లు అమ్మేస్తున్నారండి. కాఫీలు టీలు బోర్నవిటాల్తో సయి

తంగా. ఆళ్ళండి; పుతయం ఐదున్నరకి కొట్టిచెప్పుతారండి. రాత్రి పదిన్నర

దాటాక పోలీసోడు అల్లంతదూరాన్ని కనబడేవరకు అలా కూర్చుని అమ్ముతానే వుంటారండి. కూర్చోటానికి ఇసుగైతే నుంచుటారంతేగానీ, కొట్టుదిగి బేటికెళ్ళరండి, ఇంకా అది పట్టుబడక నేను మా మేనల్లుణ్ణి రప్పించానండి. ఈడికి పద్దేనిమిదేళ్ళు లేవండి, కాని నెలకి వంద యాభై జీతమిచ్చి తిండెడత న్నానండి."

తకరకాల వాళ్ళతో ఆత్మీయంగా మాట్లాడడంకోసం కాబోలు, క్రిష్ణమూర్తి భాషకూడా మార్చేసుకున్నాడు. లోగడ ఈ రకం యాసలేనట్టే నాకు జ్ఞాపకం.

"మీ తమ్ముడుండాలి కదా" అన్నాను.

"ఆడు ఇంటి దగ్గర పెట్టిన దుకాణం చూస్తున్నాడండి. ఒక ఆటో కొనుక్కుని వెనకాల కేరియర్ పెట్టామండి. ఉదయాన్నే ఐస్ఫ్యాక్టరీకెళ్ళి ఐస్ తెచ్చినల బైకొట్లలో యేసేత్తాడండి. మాతో పాటున్న్నే. అలా మూడుసార్లు తిరుగుతాడండి."

"మరి అతనలా తిరుగుతున్నప్పుడు ఆ దుకాణం ఎవరు చూస్తారు?"

"మా చెల్లెలుంది కదండి: కాసేపు కొట్టుమీద కాసేపు మిషనుమీద కూర్చుంటాదండి."

"కుట్టు మిషనా?"

"కుట్టుమిషన్ మాయావిడదండి. మా చెల్లెమ్మ టైపు హయ్యర్ పేస యింది కదండి. మా యిల్లేమో జిల్లాకోర్టు ఎదట గదండి: అర్జంటుగా టైపు గావల్సిన కాగితాలు అలా వొచ్చిపడ్తా వుంటాయండి."

ఇలా అన్నీ చెబుతూనే కొట్టు మూసేశాడు క్రిష్ణమూర్తి మేనల్లుడి సహాయంతో. తాళాలన్నీ స్వయంగా లాగి చూసుకుని

"పదండి" అన్నాడు. "అన్నట్టు ఇప్పు డెక్కడరండి, మనిల్లండీ?"

"అబ్బే. సీతమ్మధార కొండవొద్దునయ్యా."

"టి. పి. టి. స్థలంకొని కట్టించారాండి?"

"లేదయ్యా బాబూ క్వార్టర్సు"

"అయిబాబోయ్ ఇంతరాత్రప్పుడు ఎలాగెల్తారండి? ఉండండి నేను డ్రాప్ చేస్తాను." అని కిళ్ళీకొట్టు పక్క సందులోంచి ఒక స్కూటర్ తెచ్చాడు. "ఒరే

కామేశ! నువ్వింటికెళ్ళిపో. నేనొక అరగంటల్లో గురువుగార్ని దిగబెట్టొచ్చేస్తా."

"స్కూటర్ కూడా కొన్నావన్నమాట."

"తమ దయవల్ల అన్నీ కొన్నానండి. మంచివి రెండు ఇళ్ళస్థలాలుకూడా సంపాదించేనండి, ఈ యేడాది అవి రెండు అమ్మేసి కార్పొరేషన్ వాళ్ళ షాపింగ్ కాంప్లెక్స్‌లో ఒకదాంట్లో డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ తెరుద్దా మనుకుంటున్నానండి."

మా క్వార్టర్సు దగ్గిర నన్ను దింపేస్తూ అడిగాడు "ఇంకా తమకెంత సర్వీసుందండి మాస్టారు?"

"ఎంతో యెక్కడుంది నాయనా? మామూలుగా అయితే ఇంకా రెండేళ్ళుండేదే, కాని మొన్న జీ.వో. వొచ్చిందిగా, ఈ నెలాఖర్న రిటైర్ కావల్సిందే అంటే ఇంకో అరురోజులున్నట్టు లెక్క!.... అది సరేగాని. ఈ రిటైర్మెంట్ అయిపోతే కొన్నాళ్ళపాటు ఏదైనా పని దొరికితే చెయ్యాలనుందయ్యా.... అంటున్నానమకోకు. ఆనాడు నాచుట్టూ రాత్రీపగలూ తిరిగావు. ఉద్యోగం కోసం. నేను ఇప్పించ లేకపోయాను. అదంతా మనసులో పెట్టుకోక నాకిప్పుడు ఎక్కడైనా చిన్న ఉద్యోగం చూపిద్దూ.నీకు పుణ్యముంటుంది!"

"ఎంతమాటన్నారు మాస్టారు. మీరు నాకు ఉద్యోగం యిప్పించుంటే నేనొక్కణ్ణే ఈసురోమంటూ నెలజీతం తెచ్చుకుండేవాణ్ణేమరి ఆనాడు నన్ను వ్యాపారంలో పెట్టాకి మాత్రం మీరేగదేటి. ఆధారం సూపించింది?"

"సరేలే మంచివాడివి కనుక గుర్తుంచుకున్నావు. మరి నామాటేం జేస్తావు?" అని విలదీసేను: క్రిష్ణమూర్తి బుజంమీద చెయ్యేసి.

"ఇరవయ్యేనిమిదో తేదీ గందడి మాస్టారూ, తమ రీటైర్మెంటు? ఫస్టు తారీకుని కనిపిచ్చండి, తమకి ఏదో చేస్తాను. గాడ్ ప్రామిస్"అని స్కూటర్ కిక్ కొట్టాడు కిళ్ళీ కొట్టు క్రిష్ణమూర్తి.

ఆలిండియా రేడియో (విశాఖ) వారి "సూపర్ హిట్"
ప్రసారం: 6,4-87 తరవాత మళ్ళీ మళ్ళీ

# తడిసి మోపెడు

నా పంధొమ్మిదోయేట చేరాను. పొలాలూ స్థలాలూ కొలిచే సర్వే ఉద్యోగంలో అప్పట్లోనూ ఆ తరవాత చాలా కాలంవరకూనూ మన రాష్ట్రంలో చాలినన్ని రోడ్లు ఉండకా రోడ్లున్నా బస్సుసౌకర్యాలూ లేకా నా ఉద్యోగధర్మం చాలా కాలం పాటు నడిచే నిర్వహించాను.

నడిచీ నడిచీ కొలిచీ కొలిచీ రాష్ట్రంలోని ఇరవై మూడు జిల్లాల్లో పదకొండు జిల్లాలు తిరిగాను. సాగినన్నాళ్ళు సాగిన నా నడకకి సుమారుఎనిమిదేళ్ళ కిందట మోపెడ్లు ముమ్మరంగా మార్కెట్లోకి దిగినప్పుడు బ్రేకుపడింది బ్రేకుపడ్డ నడక అక్కడ ఆగిపోయిందనుకోకండి. నా నడకకి పడ్డబ్రేకువేగాన్నీ ధ్వనినీ పెంచడానికీ నా స్థానిక ప్రయాణాల పరిమాణాన్ని గుణీకృతం చెయ్యడానికీ పడ్డాది గాని ఆపెయ్యడానిక్కాదు ఎందుకంటే ఆ ఎనిమిదేళ్ళనాడు నేనొక మోపెడ్ కొన్నాను.

దరిద్రుడు తల కడిగితే వడగళ్ళవాన అన్నారు. అలాగా నేను మోపెడ్ కొన్న మర్నాడు డ్యూటీకొస్తుండగా ఏ హెచ్చరికా లేకుండా వానపట్టుకుంది. ఇంతా అంతా కాదు. అరగంట వ్యవధిలో అరవై మిల్లీ మీటర్లు కురిసి ఠకీమని ఆగిపోయింది. కాపురం మల్కాపురంలోనూ డ్యూటీ టౌన్లోనూ కావడం వల్ల ఈ అరగంట ప్రయాణంలోనూ నేనూ నా మోపెడూ చిత్తుగా తడిసి ఓ కిలోమీటర్ దూరం బండి తోసుకోవలిసొచ్చింది. నే ననుకున్నట్టే నన్ను పలకరించిన వాళ్ళందరూ మోపెడ్ కొన్నారా; ఎంతైందిఅని అడగడం; అందరికి ఒకటే సమాధానం చెప్పడం సంభవించింది అదే-తడిసిమోపెడు.

అందరూ ఆ సమాధానాన్ని అలా మింగేసి వూరుకున్నారు. మా డాక్టర్ ఫ్రెండు మాత్రం "పోన్లే, ఇన్నాళ్ళకి నువ్వు కూడా ఓ బండివాడి వయ్యేవన్న మాట అన్నాడు. అతను అంతకు ఐదారేళ్ళ కిందటే ఇంటివాడూ బండివాడూ అయ్యేడు. అంచేత మరి నేనేం మాటాడలేదు.

అప్పుడెప్పుడో ఒకాయన మేక పిల్లనికొనుక్కొడుతూ వుంటే ఇది మేక

పిల్ల కాదు కుక్క పిల్ల అని పద్ధతిగా చెప్పి కుట్రచేసి ముగ్గురు పెద్దమనుషులు ఆ మేకపిల్లని అపహరించేరుట. అలాగ అపహరించే వుద్దేశంతో కాకపోయిన నా మోపెడ్‌నీ, దాన్ని కొన్నందుకు నన్నూ అపహాస్యం చేస్తూ జనం డైలాగు లెయ్యటం అదో ప్రహసనాల మాలిక, ఆ వివరాలు కొద్దిగా మనవి చేస్తాను.

పాపారావుగారిని, విశాఖపట్నం రచయితలకి ఓ అన్‌లిమిటెడ్ క్రిటిక్కు రాజకీయ శాస్త్రం నుంచి రతి శాస్త్రం వరకు అన్నీ చదివి విమర్శించడమే అతని కాలక్షేపం, ఓ అరగంట అతని మాటల్ని పాలో అయినవాడు ఐదారు జీవిత సత్యాలను క్రొత్తగా గ్రహించక తప్పదు. ఆయనొకసారి నేను మోపెడ్ మీద వెళుతుండగా తటస్థపడ్డాడు. ఆస్పత్రి డౌన్‌లో స్ర్రుమని వొచ్చేస్తూవుంటే. ఎంతదూరం నించి చూసేడోగాని చెయ్యి అడ్డం పెట్టి ఆపేడు, "ఏటివాయ్, మంచి జోరు మీదుందే ఎవహారం!" అన్నాడు. "ఔను, మోటారుంది కదా ఇంకా జోరుగా వెళ్ళక పోవాలా?" అన్నాను." నన్ను పౌల్ట్రీ దగ్గర దింపె స్తావేటి" అన్నాడు. "ఓ!" అన్నాను, వెనకాతల కూచోమని సూచనచేసి. అతను నావేపూ నా బండివేపూ పరీక్షగా చూసి "లాబంలేదు గురూ. ఇది మన్ని కాయదు. దీనికి గుండె సిన్నది, సీటు సిన్నది.ఇలాటిది కొన్నావేటి గురూ, ఆగి వన్నాల్లాగి నావు గదా, కుంచెం పెద్దది కొన్లేకపోయేవా!" అనేశాడు.

మరోమాటు మా బావమరిది కూతురు వరలక్ష్మి- ఇంటరో యేదో చదువు తూవుండేది అప్పట్లో- దొండపర్తి బస్టాప్ దగ్గర "మామయ్యోయ్ అని పెద్ద కేకేసి ఆపింది. "ఏంటి మామయ్యా-జొత్తిగా అటూ యిటూ చూడ కుండా వెళిపోతున్నావు? ఎవరేనా లిఫ్ట్ ఇమ్మని అడుగుతారని భయమేనా ఆదంతా?" అంది. "అలాకాదే మేనకోడలా, ఈవూళ్ళో మోటర్లవాళ్లు రోడ్డు మీదా ట్రాఫిక్ సిగ్నల్స్ మీదా తప్ప మరెక్కడా దృష్టి పెట్టుగో కూడదు యాభై గజాలకో స్పీడు బ్రేకర్ పదేసి గజాలకో గొయ్యినీ.మనుషులవేపుచూస్తూ పోతే గోతులో పడ్డం ఖాయం, అందుకని! అన్నాను "ఐతే నీ మూషిక వాహనం మీద నన్నెక్కనియ్యవా?" అంది "ఎక్కడ దించ మంటావు" అన్నాను, "జగదంబా సెంటర్లో దింపేస్తీమామయ్యా అక్కణించీ కాలేజీకి బస్సులో వెళిపోతానూ "అంది,

ఒకటికి రెండు ప్రాణాలు కదా అనీ. అందులోనూ ఆడపిల్ల కదా అనీ జాగ్రత్తగా వెళ్తున్నాను, ఆపిల్లకి ఆస్పీడు నచ్చకపోతే గేరుమార్చు, స్పీడు

పెంచు అని, పాటవరసలో కాకపోయినా మాట వరసకైనా ఆ మాట చెప్పోప్పుగా డాబాగార్డెన్ స్టాప్‌కీ జగదంబా జంక్షన్‌కీ మధ్య తనెవక్కల్సిన బస్సు మమ్మల్ని దాటుకుని వెళ్ళిపోయిందిట. నేను స్లోగా వెళ్ళే బండి కొన్నానని విసుక్కుంటూ విశ్వనాథంవిగ్రహం దగ్గర బండి ఆపించి దిగెళ్ళిపోయింది.

ఆవేళనించి నాకు కసిపెరిగిం దనుకుంటాను. రోజూ మల్కాపురం నించి, ఆఫీసుకి వచ్చేటప్పుడు రంహ్యాముని నలభై కిలోమీటర్ల స్పీడులో వచేస్తూ నా బండికేం అని ధీమా పడ్డం మొదలెట్టేను. ఓ రోజు అలావస్తూ. డ్రైడాక్‌కి కొంచెం దక్షిణంగా ఒకచోట మూడున్నర హార్స్ పవర్ బండినొక దాన్ని దాటేశాను కూడాను. ఆ బండిమీద తెల్లటియూనిఫారం వేసుకున్న ఆఫీసర్ ఒకాయన వస్తున్నాడు, ఆ బండికక్కడ తెల్లరంగేవేశారు. వెనకాల ఒక ఆడ కూ[illegible] తెల్లటి పిల్ల కూచుంది. ఉంటేనాకేం? నేనునా బండితో ఆబండని దాటేశానన్నది తేట తెల్లమైపోయింది,

అయితే అతనలా ఊరుకోలేదు. ఓకనిమిషం గడిచేలోగా డుబ్ డుబ్ లాడుకుంటూ నా కుడిపక్కగా వొచ్చేసి "మిస్టర్, ఓ క్షణం ఆగుతావా నీతో మాట్లాడాలి!" అన్నాడు ఇంగ్లీషులో. నాకు కొద్దిగా భయం వేసింది. అతని బండి మీద "నేవల్ పోలీసు" అని రాసుంది. ఎక్కువ స్పీడులో వస్తున్నానని నా మీద ఏదైనా కేసుపెట్టమని సివిల్ పోలీసుకి సలహాగానీ ఇచ్చేస్తాడేమోరా నాయనా అనుకున్నాను. కాని అంతలోనే ధైర్యం తెచ్చుకున్నాను. నా బండి ఎక్సలరేటరు సరుకే గాని గేరు బండి కాదు, ఎంత పీక్కున్నా నలభై కిలోమీటర్ల స్పీదు కన్నా వెళ్ళదు. అదో పెద్ద స్పీడు కాదు అంచేత "ఓ, ష్యూర్" అని నా బండిని పక్కగా తీసి ఆపాను. ఎందుకేనా మంచిదని, కిందికి దిగి, నిలబడి, స్టాండు కూడా వేసేను. అతను నా బండిని దాటుకెళ్ళి అక్కడ తనబండి ఆపి; ముందు ఆ అమ్మాయిని దిగమని, తరవాత తనుదిగి; స్టాండేసి నా దగ్గరికొచ్చేడు.

"ఎన్నాళ్ళయింది, ఈ బండికొని?"

"రెండు నెల్లవుతోంది"

బండి హాండిలూ బ్రేకులూ అవీ పట్టుకుని చూశాడు. ఓసారి స్టార్ట్ చేసాడు. కళ్ళెగరేసి "బానే పోతున్నట్టుందే!" అన్నాడు,

"పరవాలేదు" అన్నాను, జాగర్త భయం నాస్తిధోరణిలో.

"అదే నేనూ అనుకుంటున్నాను." అని; ఆ అమ్మాయిని రమ్మని సంజ్ఞ

చేసేరు. ఆవిడ రాగానే "చూశావా: నే చెప్పలే?" అన్నాడు నావేపు తిరిగి, "మా ఆవిడకి ఇలాటి వొకటి కొందామని ఉద్దేశం. మీ సలహా ఏమిటి?" అన్నారు.

దాంతో నాకు భయం పోయిందిగాని ఏదో వికారం పుట్టింది. "ఓ, తప్ప కుండాను. ఇక నేను వెళ్లొచ్చా?" అని బండి స్టార్ట్ చేసాను.

* * *

జీవితాన్ని గురించి సూక్ష్మంలా మోక్షంగా వ్యాఖ్యానం చెయ్యమని ఓ తత్వవేత్తని అడిగితే ఆయన చెప్పేడుట: జీవితం అనేది, మాట వరసకి నువ్వూ నీ మిత్రుడూ కాఫీ హోటలుకి వెళ్ళి చెరొక రవ్వ దోశె ఆర్డరివ్వడం లాంటిదని చెప్పొచ్చు. సర్వర్‌కి, మీ కిద్దరికీ విభేదాలు కల్పించాలన్న తలంపు లేదు. దోసె వేసేవాడు మిమ్మల్నసలు చూడలేడు, కాని చివరికి ఏమైంది? నీ మిత్రుడి కెదురుగా ఉంచిన ప్లేట్లో దోశ కొంచెం పెద్దది; మరొక్క చాయ ఎర్రగా కాలింది. అనిపిస్తుంది అంతే—

తనకి లేదని ఏడిస్తే వో కన్ను పోతుందనీ, ఇంకోడికి ఉందని ఏడిస్తే రెండో కన్ను పోతుందనీ మహా తత్వవేత్త శెలవిచ్చారట. అయినా ప్రపంచం అంతా రెలెటివిటీ మీదనే నడుస్తోందని నా అనుమానం. నా ఉద్యోగం కన్నా (నా అర్హతలే ఉన్న) సూర్యారావు కొచ్చిన ఉద్యోగం మంచిదేమో. మా కిచ్చిన క్వార్టర్స్ కన్నా (నా పేజ్ గ్రూప్‌లోనే ఉన్న) కృష్ణారావు కిచ్చిన క్వార్టర్స్ ఆరోగ్యమేమో. ఇంకా కొంచెం లోతుకి వెడితే మా ఆవిడకన్నా ఆ మనోహర్రావు గారి పెళ్ళాం అందమైందేమో, మా పిల్లలకన్నా గోవిందరావు గారి పిల్లలు స్మార్ట్‌గా ఉంటారేమో.

నాకు తెలుసు. మీలో చాలామంది ఇలా ఆలోచించరు. ఎవరికెలా రాసి పెట్టుంటే అలాగ అని సంతృప్తిపడి జీవితాన్ని గొప్ప కంటెంట్‌మెంట్‌తో అనుభవిస్తున్నారని నాకు తెలుసు. కాని నాదౌర్భాగ్యమేమిటో, సంతృప్తి అన్నది అసలు లేకుండాపోయింది! రోడ్డుమీద నా మోపెడు తోలుకుంటూ వెళ్తానా. మిగిలిన మోటారు వాహనాలు దేన్ని చూసినా నాకు చిరాకే, అసూయే. నాది సగం హార్స్‌పవర్ బండికదా. ఆఫీసులో నా రూమ్‌లో నాతో కలిసి పని చేసే ముగ్గురికీ ఒకటిన్నర హార్స్‌పవర్ బండ్లున్నాయి. పక్కరూంలో నాకన్నా చిన్న ఉద్యోగస్తులు ముగ్గురికి ఒకటింముప్పాతిక, రెండున్నర,

మూడున్నర హార్స్‌పవర్లు గల బండ్లున్నాయి. వాళ్ళందర్నీ చూసి అసూయతో, చిరాకుతో కుళ్ళిపోయి చస్తూ వుంటాన్నేను. మా ఆఫీసులో మిగిలిన వాళ్ళలో చాలా మందికున్నవి మోపెడ్లే, అయినా అవన్నీ ఇంకేవేవో కంపెనీలవి. తడిసి మోపెడ్లు కావు తడవని మోపెడ్లేమోనని నా బండికన్నా ఏదైనా నయమేమో ననీ అనిపిస్తుంది అస్తమానం.

ఈ ఎనిమిదేళ్ళలోనూ నా మోపెడ్‌ని చిన్నచూపు చూసిన సంఘటన లైతేనేమి, దాన్ని కొన్నందుకూ—అనేక మందిలాగా ఏడాదో రెండేళ్లో గడవ గానే అమ్మి పారేసి మరో పెద్దబండి కొనకుండా దాన్నే మెయింటేన్ చేస్తూ ఏకబండీ వ్రతుడిగా కొనసాగుతున్నందుకూ—నన్నో అప్రయోజకుడిగా చూసిన సంఘటన లైతేనేమి, చాలా జరిగేయి. మాట వరసకి కొన్ని ఉదాహరిస్తాను.

ఓసారి కాలేజీ డౌన్ మీదుగా కలెక్టరాఫీసుకి వెళ్తూండగా త్రోవలో రెల్లి వీధి దగ్గర ఏమైందనుకున్నారు? ఓ ఇద్దరు, రోడ్డుమధ్యని నిర్భయంగా నిలబడి ఏదో మాటా మాటా అనుకుంటున్నారు. నేను హారన్ మోగించాను. వాళ్ళు కదల్లేదు. వాళ్ళ గొడవే వాళ్ళది! వీళ్ళ పని ఇలాక్కాదని బండి ఆపేను అంటే. ఇంజిన్ ఆపకుండా బ్రేకుమాత్రం వేసేనన్నమాట. మళ్ళీ హారన్ మోగించేను. అబ్బే. వాళ్ళు అంగుళం కూడా జరగరేదు. ట్రాఫిక్ రూల్సన్నీ తప్పని సరిగా అమలు పరుస్తానని ఆర్. టి. ఓ ఆఫీసులో రాతమూలకంగా హామీయిచ్చి రోడ్డు టాక్సు కట్టిన నాకు, ఏ హామీలూ ఇవ్వకుండా రోడ్డు టాక్సు కూడా కట్టకుండా వున్న వాళ్ళు.దారివ్వకుండా నిలబడ్డమా అని నాకు ఉక్రోష మొచ్చింది. జేబులో చెయ్యిపెట్టి రెండు పదిపైసల నాణాలుతీసి ఇద్దరికీ చెరోటీ ఇచ్చాను. వాళ్ళు కొంచెం ఆశ్చర్యపడినా అసంకల్పితంగా పుచ్చేసుకున్నారు. నేను బండి లాగించేసి జోరుగా వెళిపోతూ "గుడ్డోడికీ చెవిటోడికీ దర్మం" అని కేకేశాను.

మరో మాటేమైందనుకున్నారు? డైమండ్ పార్క్‌కి దగ్గిరగా రోడ్డు మధ్యనే, మళ్ళా!) ఓ నలుగురు నిలబడి ఎన్నికల్లో ఎవరు గెలుస్తారు, ఎందుకు —అన్నే విషయం మీద కాబోలు, తీవ్రమైన చర్చలో ఉన్నారు. వాళ్ళకూ్కడా తప్పుకోమని సూచిస్తూ హారన్ కొట్టాను. వాళ్లేం తప్పుకోలేదుగాని అందులో వొకాయన "ఎందుకు" అన్నట్టు చూశాడు, చుట్టూ చూశాను. ఎంతెంత లేసిపెద్ద పెద్ద వాహనాల వాళ్ళూ మనకెందుకులే అన్నట్టుగా వాళ్లే తప్పుకునిపోతు

న్నాడు. "ఇక్కడ పార్కు పక్కడుంది!" అన్నాను. నన్నో పెర్రి పెద్దవ కింద చూసి "ఇదేగా" అని పక్కనే ఉన్న పార్కు వేపు చూపించాడు అతను. నేను బండి బ్రేకులు వదిలి ఏక్సిలరేటరు బిగించి "మరి మీ మీటింగు రోడ్డు మీద పెట్టేరేమిటీ?" అంటూ లాగించేశాను!

ఇంకోమాట — ఇసకతోట దగ్గర! ఇసకతోటంటే తెలుసుగా, మంచి రద్దీ అయిన ప్రదేశం, జనం బోలెడు ఇళ్ళు కట్టుకున్నారు. అయినా ఎవ్వరూ ఇళ్ళల్లో ఉండరు. అంతా రోడ్లమీదనే ఉంటారు. ఏడాది పొడుగుతా కలిపి కనీసం పదిమంది, ఒక్క పిక్నిక్ సీజన్‌లో మాత్రం ఇరవైమంది లారీలకింద పడి చచ్చిపోతూ ఉంటారు. ఏక్సిడెంట్ జరిగిన గంటలో అంతా మర్చిపోయి మళ్ళా రోడ్డుమీదకి చేరుకొంటారు — అలాటిచోట నేను మోపెడ్ మీద వెళ్తా వుంటే ఒక ఆజాను బాహుడు తీరిగ్గా రోడ్డు ఇట్నుంచటు దాటుతున్నాడు. నా బండి నేను నడుపుతున్న ప్రకారం వెళితే అతన్ని గుద్దేయడం ఖాయం, అయినాసరే, పెళ్ళైపోయిన పిల్ల మేనత్తకొడుకుని చూసి బెదరనట్టు దీమాగా వెళ్ళేడతను. నేను రోడ్డుకి పక్కగా నా బండి ఆపి (ఇంజిన్ ఆపలేదు, బ్రేకేసే నంతే,) అతన్ని పిల్చాను, "అప్పారావు ఇట్రా ఓసారి!" అని—

అతను వచ్చేడు. "నాపేరు అప్పారావు కాదు"

"సింహాచలమా?" అన్నాను

"కాదే."

"పోనీ పైడితల్లి," అన్నాను.

"అదీకాదు, ఇంతకీ ఏటి?" అన్నాడతను.

నేను కళ్ళెగరేసి "మంచి పెర్సనాల్టీ గున్నావోయి. "అన్నాను.

అతను కాలర్ పైకెత్తుకుని మీసం సవరించుకుని "అయి." అన్నాడు, ఖుషీగా.

"కానీ, ఇదుగో ఈ రోడ్డుమీద నువ్విప్పుడు నడచినట్టు నడిసే ఏ లారీయో గుద్దేసి కాలో శెయ్యో ఇరిగిపోద్ది. నువ్వు ఆస్పటలుకీ ఆడు జేలుకీ ఎళిపోతారు. తెల్సా?" అని బోధించి యధాప్రకారం బండి లాగించేశాను.

ఇలాగ ట్రాఫిక్ రూల్సు గురించీ రోడ్డుమధ్యని పాదచారులు నిలబడుట లేక నడచుట యందలి ప్రమాదములు అనే విషయం గురించీ ఇంకా ఈ వూళ్ళో ఏడులక్షల తొంభైతొమ్మిదివేల తొమ్మిదివందల మందికి పైగా చెప్పాలి.

ఎందుకంటే ఈ ఊరి జనాభా ఎనిమిది లక్షలుట. అయినా నేను నిరుత్సాహ పడ దల్చుకోలేదు.

*　　*　　*　　*

మొన్నోరోజు ఆఫీసు నుంచి కొంచెం త్వరగా ఇంటికొచ్చేసేను. మళ్ళా బయటికి వెళ్ళవలసిన పనున్నాది కదా అని మోపెడ్ ఇంట్లోకి తెచ్చి కుండా రోడ్డువారని ఉంచేసేను. కిటికీ పక్కని కూచుని కాఫీ తాగుతూ ఓ కన్ను అటుంచేను. ఇంతలో ఎవరో ఓ మనిషి నా మోపెడ్‌ని అదే పనిగా గమనిస్తూ అందుకోసం దాని చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నట్టు తెలిసిపోయింది. ఏదైనా కుక్క అలా తిరిగిందంటే దాని అర్థం వేరు కనక వెంటనే లేచి వెళ్ళి తరిమేసే పని. అయితే మనిషే కదా అని నిర్లక్ష్యం చేసినందుకు అతనేం చేశా డనుకున్నారూ?

అబ్బే! అతను నా మోపెడ్ దొంగతనం చెయ్యలేదు. దానికెంత గుండె కావాలి! అసలు ఎవరైనా ఆ మోపెడ్‌ని ఉన్నదున్నట్టుగా స్టార్ట్ చెయ్యగలిగితే సన్మానం చేసో చప్పట్లు కొట్టో దాన్ని అతనిపేర రిజిస్టర్ చేయించేసే య్యొచ్చని నా సహోధ్యాయులు కొందరు అంటారు.

అయితే అతనేం చేసేడు? మా పక్కవాటా వాళ్ళ తలుపుకొట్టి ఈ మోపెడ్ ఎవరిదండీ అని అడిగేడు. వాళ్ళు నాపేరు చెప్పి, మా వాటా చూపిం చేరు. (అంతా కిటికీల్లోంచి కన బడుతూనే ఉంది.) అతను మా తలుపు తోసు కుని లోపలికొచ్చేసి నమస్కారం చెప్పి కుర్చీ ఈడ్చుకుని కూచున్నాడు. నేను ఫలానా కంపెనీ మోపెడ్ల సేల్స్ ప్రొమోటర్నని చెప్పేడు. నాకు అర్థమై పోయింది. నా మోపెడ్ ఆ కంపెనీదేగా, ఫ్రీ సర్వీసింగు, చెడిపోయిన పార్టు లకి బదులు కొత్తవి చవగ్గా సరఫరా చెయ్యడం అలాంటి కార్యక్రమాలేవో ఉన్నాయిగాబును, అనుకున్నాను.

అతను చెప్పింది వింటే నాకే కాదు, మీక్కూడా కోపం వస్తుంది.

నా మోపెడ్ ఎనిమిదేళ్లనాటి మోడల్లోదిట. దరిమిలును ఆ కంపెనీవారు ఇంకా కొంత కృషిచేసి ఈ మోపెడ్ నాణ్యతను పెంచుకుంటూ పోయి కొత్త రకాలు విడుదల చేస్తున్న కారణంగా నా 1979 మోడల్ మోపెడ్ ఇంకా రోడ్డుమీద తిరగడం కంపెనీకి అంతమంచిది కాదుట. అందుకని దీన్ని ఏదో ధర కంపెనీకే ఇచ్చెయ్యాలన్నాడు.

నేను కొంచెం బాధ పడ్డా. ఓపిరికి పోనీ సరేలే అన్నాను. ఎంతధర చెప్పొచ్చు—అని కాయితం కలం తీసి లెక్కేశాను. మొదట కొన్నది మూడు వేల ఎనిమిదివందలకి ఏడదిలో రెండు టైర్లూ ట్యూబులూ పోయాయి. అప్పట్లో మూడువందలు. రెండోయేడు నడుస్తుండగా ఓమారూ, నాలుగేళ్ల తరువాత ఓ మారూ ఇంజన్ రీబోర్ చేయించేను. మూడువందలు. ఆరోయేడు నడుస్తూ వుండగా కొత్త ఇంజిన్ వేయించేను. ఆరువందలు. మధ్యలో మరో రెండు సార్లు టైర్లు ట్యూబులు మార్చాను, ఆరువందలు. మొన్న డిశంబర్‌లో కార్బ్యురేటరు క్రొత్తది వేసేను. మూడువందలు. ఇంకా సైలెన్సర్ డీ కార్బనైజ్ చెయ్యడం. బ్రేకు షూలు మార్చడం, బెల్టులు మార్చడం లాంటి చిల్లరమల్లర రిపేర్లకి ఐదువందలు పెట్టాను. అంతాకలిపి ఆరువేల నాలుగు వందలైంది. మరి ఈ ఎనిమిదేళ్ళూ పెట్రోలు పోయించేను కదా. దానికో నాలుగువేలేనా అయ్యుండదూ? అంచేత పదివేలిచ్చి పట్టుకుపోతే అదే పదివేలన్నాను. మీరు నవ్వుతున్నారు కదూ, అతనూ నవ్వేడు. అదంతా ఎందుకు గానీ, ఇచ్చే ధర చెప్పేమన్నాడు.

"ఇచ్చేధర కాకపోతే మరేమిటి! ఇప్పుడు మీరిది పట్టుకుపోతే నేనుకొత్త బండి కొనుక్కోవాలి కదా. ఈ మాటు మోపెడ్ కాకుండా కనీసం రెండు గేరైనా ఉండేదిగా చూసి కొనుక్కుంటాను," అన్నాను.

"అలా అయినా ఎనిమిది వేలకి మించి లేదే!" అన్నాడతను.

"అవునయ్యా, ఎనిమిది వేలకి మించిలేదు. కాని ఇప్పుడేదో కొత్తరూల్ వచ్చింది కదా. పన్నెండేళ్లకి ఒకేసారి రోడ్డుటాక్సు కట్టాలని, దాని మాటేమిటి మరి?" అన్నాను.

అతను కోపంగా మొహం పెట్టి "అసలు మా కంపెనీ మోపెడ్‌ని మీరు సరిగా మెయిన్‌టేన్ చెయ్యకుండా డొక్కులాగా తయారుచేసి. ఏ కీలుకా కీలు విరిక్కొట్టి రోడ్డుమీద ధమ ధమ ధమ ధమ అని చప్పుడు చేసి అందరి దృష్టీ ఆకర్షిస్తూ మా కంపెనీకి అప్రదిష్ట తెస్తున్నారు. అందుకని మీ మీద పరువు నష్టం దావా వేస్తాం" అని లేచి వెళ్ళిపోయాడు.

ఆంధ్రప్రభ వీక్లీ, దీపావళి 1968

# వైడోంట్యూ మేరీమి?

“వైడోంట్యు మేరీమి, సుబ్రావ్?” అని మాట ఇరవై ఒకటో సారి కూడా అతి తియ్యగా అడిగింది కమ్లా మేనోన్. అదెందుకో వెగటుగా వినిపించింది సుబ్బారావుకి, ఇంటివగ్గిర నించి వచ్చిన ఉత్తరం తపీమని నేలకేసి కొట్టేడు,

ఆ విసురు నామీద కాదులే నాకు తెలుసు” నన్నట్టుగా కమ్లా మేనోన్ ఒళ్ళంతా కదుపుతూ గుమగుమమని నవ్వేసింది. ఆ క్షణంలో సుబ్బారావుమీద ఆ బాధ్యత పడ్డాది.

తను ఉత్తరం నేలకేసికొట్టడం ఆమెమీద విసుక్కోడం అనుకుంటూందేమోనని మొహంమీద చిరునవ్వు పోసుకొని, “ప్లీజ్. ఒక్క నిమిషం కూచో, రేడియో పెట్టుకో కావాలంటే?” అని చెప్పేసి లోపలికి వెళ్ళేడు.

బాగానే ఉంటుంది, కమ్లా మేనోన్ .... మలయాళది.... “ఆడవీ మలయాళవీ — బహూకళలు తెలిసిన జాణవీ?” .... కట్టినట్టు కట్టుకట్టకుండా, పెట్టినట్టు బొట్టు పెట్టకుండా, చుట్టినట్టు జుట్టు ముడి చుట్టకుండా ఆఖరికి అల్లరేనా సరే చేసిన పద్ధతిలో రెండో మాటు చెయ్యకుండా చలాకిగా తిరిగేస్తూ ఉంటుంది.

వైడోంట్యూ మేరీ మీ — వైడోంట్యూ - మి-?” అమ్మ బాబోయ్.

క్రమంగా ఈమధ్య “నన్నే పెళ్ళాడవోయ్. నరసింహా;”అని పాడినట్టు దండయాత్ర ప్రారంభించినా, మొదట్లో “వాట్ సుబ్రావ్, యువార్ ట్వెంటీ నైన్ - వైడోంట్యు మేరీ సమ్బడీ” అనే అడిగేది.

ఇరవైతొమ్మిదేళ్ళు మీదపడ్డ ప్రతిమొగాణ్ణి “నువ్వింకా పెళ్ళాడవేమో” అని నిలదీసి అడిగేసే అంతంతపేసి ఆడవాళ్ళు కలకత్తాలోనేకాదు. నాటినాడలోను కావసినంతమంది కనబడతారు.

అయితే ఆ ప్రశ్న అందమైన భూమికతో ముస్తాబై వస్తుంది

ఇంత చేసుండదు, ఉగాది పచ్చడిలో ఉన్నట్టు తగుమాత్రం వగరూ తీపీటూ ఉంటాయి. అందులోనించి లేగిన వసనోక్తి పుడుతుంది. "అయ్యో! ఇప్పటిదాకా పెళ్ళిచేసుకోకుండా పెళ్ళికాకుండా ఉండిపోయానే, దుఃఖం, విసుగూ, వెంగా పరిచిపోవడానికి అందులో చిన్న చిన్న హోమియోపతీ మాత్రలంతేసి హాస్యం డోసు ఉంటాయి. కాని ఈ మలయాళది - బేకర్ అండ్ బేకర్ కంపెనీవారి అసిస్టెంటు సెక్రెటరీ - కాలికట్లో పుట్టి కలకత్తాలో పెరుగుతున్న - కాదు పెరిగిపోతున్న ఈ కమ్లూ మేనోన్ మాటలకి కాకినాడ కలకంతుల మాటలోని కమ్మదనం ఎలా వస్తుంది! రెండేళ్ళకిందట ఆమె నోటంట ఆ ప్రశ్న ఎంత వెగటు కలిగించిందో ఇప్పుడూ అంత వెగటూ కలిగిస్తూనేవుంది. ఆ మాట దానితో చెప్పేస్తే బావుణ్ణనిపిస్తుంది. కాని..

ప్రెషర్ స్టవ్ వెలిగించి నీళ్ళు పడేశాడు సుబ్బారావు. కాళ్ళూ చేతులూ కడిగేసుకొని మళ్ళీ గదిలోకి వచ్చేటప్పటికి కమ్లూమేనోన్ చక్కగా మంచం మీద తలగడా నిలూవుగా పెట్టుకొని సుఖంగా పడుకొని న్యూస్‌పేపర్ చదువుకుంటున్నాది. తన అలికిడికాగానే "ప్లీజ్—ఐ డోంట్ వాంట్ దట్ రెచ్చెడ్ టీ, మిస్టర్ సుబ్రావ్" అన్నాది ముద్దుగా.

కమ్లూ మేనోన్ ముద్దుగా మాట్లాడినాకూడా సుబ్బారావుకి ఎబ్బెట్టుగా వినిపిస్తుంది.

"సుబ్రావ్" అంటుంది. "సుబ్బారావూ?" అనకూడదు. "బ్రావ్" అంటుంది. అతను నోరుమూసుకుని నమస్కారం పెట్టేస్తాడు. తనని "కమలా మేనన్" అనద్దు, "కమ్లూ మేనోన్" అనమంటుంది, "కమ్లూ" అనమంటుంది. అట్టే మాటాడితే "కొమ్లూ" అనమంటుంది కూడానూ.

"నేనేమీ చిన్నపిల్లవాణ్ణి కాదు, కమ్లూ, ఏమిటా ముద్దు పేర్లు పెట్టి పిలవడాలు!" అన్నాడతనోసారి. "ముప్పయేళ్ళు నెత్తి మీదికి వచ్చి ఐదడుగుల తొమ్మిదంగుళాలు పొడుగూ, పద్దెనిమిదించీల వెడల్పా కలిగి నెలకి ఎనిమిది వందలు జీతం తెస్తున్న నిన్ను చూసి చిన్నపిల్లడనుకుందికి నేనేమైనా పూతన ననుకున్నావుటయ్యా." అంది

"టీ కాదు, కాఫీయే పెట్టుకుందాం, అన్నాడు సుబ్బారావు,

"కాఫియ్యే పెట్టూకుందాం" అని వెక్కిరించి మళ్ళీ ఒళ్ళంతా కదుపుకుంటూ గుసుగుసుమని నవ్వుకుంది కమ్లూ.

"నీ కెన్నిసార్లు చెప్పాలి రోడ్లన్నీ తిరిగి వచ్చిన కాళ్ళతోటి మంచ మెక్కి కూచోవద్దే తల్లి అని. అని మనసులోనే అనుకున్నాడు సుబ్బారావు, మర్యాదగా దగ్గిరికివెళ్ళి "ప్లీజ్, ఒక్కసారితే. దుప్పటీ మారుద్దామనుకున్నా నుగాని బద్దకించేశాను నిన్నటి నించీనూ, ఏముంది బ్రహ్మచారి జీవితం" అని ముక్కలు ముక్కలు చేసి అన్నాడు నవ్వుతూ.

"హ్హా హ్హా హ్హా ది క్వెశ్చన్ అండ్ ది ఆన్సర్!"అంటూ మళ్ళీ నవ్వింది కమ్లా.

ఇదింతే!

దీని దృష్టి నామీ దెప్పుడు పడ్డాదో అప్పుడే నాపని అయిపోయింది అని నిరుత్సాహపడ్డాడు తను, మొట్టమొదటిసారి ఈమెని నారాయణ గోస్వామి ఇంట్రడ్యూస్ చేసినప్పుడు అసిస్టెంటు సెక్రటరీ కదా. కొత్తిగా క్లర్క్ టైపిస్టో కాదుకాదా, మాట్లాడితే తప్పేముటని తనే చొరవగా ఉన్నాడు. అదే ఆకర్షణకి పూనుకొన్నట్లయింది. రోజూ కలుసుకోవడం, మాట్లాడుకోడం అలవాటయ్యేసరికి ఆమె రెండుమూడు రోజులు కనబడీమాట్లాడలేకపోతే గిల గిల్లాడిపోయాడు. ఆ రోజు రాత్రి సెకండ్ షో సినిమానించి టాక్సీ దొరక్క అవస్థ పడుతున్నా ఆమెని తను దయతలచి తన టాక్సీలో డ్రాప్ చెయ్యక పోతే ఈ కథ ఇంత దూరం రాకనేపోను. నాలుగోరోజునించీ "పోవోయ్, నీ సెక్షన్ వేరూ. నాది వేరూ." అని వేరుగానే ఉండి పోయేవాడు.

ఇప్పుడు ఎన్ని అలవాటయిపోయాయని ఇక్కకి పిల్చుకోడాలూ. కాఫీరి వ్వడాలూ, అందరికీ ఇంట్రడ్యూస్ చేసుకోడాలూ, పబ్లిసిటీ కాంపెన్‌లా కలసి తిరగడాలూ. చివరికి రాత్రి అయిపోతే ఒకళ్ళ నొకళ్ళు ఇక్కకే దిగబెట్టుకో డాలూనూ! ఇంతవరకూ వచ్చింది కదా, ఇది ఇంకెంతవరకూ రాకపోతుందా అని కమలా మేనోన్ అంచనా .... ఏమిటో ....

"ఉత్తరం ఎవ్రాశారు, సుబ్రావు!" అని కట్టుకున్న పెళ్ళాం కంటే చొరవగా అడిగేసింది కమలా మేనోన్. కాఫీ సుతారంగా సిప్‌చేస్తూ.

"ఎవరోలే...."

"మా అమ్మా, నాన్న ఉత్తరం రాసేరు. అందులో నేననుకున్నది ఏమి లేదు" అన్న ఆశాభంగాన్ని మొహంలో తెలియనివ్వకుండా చెయ్యాలని సుబ్బారావుపడ్డ తాపత్రయం అంతా వృథా అయిపోయింది.

"డబ్బు పంపమని రాస్తే నీకింత కోపం రాదే!"

క్రమంగా ఈ కమలామేనోన్ తన స్వంత సమస్య లన్నిట్లోనూ దూరి పోతున్నాడు. డబ్బు పంపమని రాస్తే కోపం రాదని తెలిసిపోయింది. దీని కన్నీ తెలిసిపోతున్నాయి.

అవును. అక్కణ్ణుంచి వచ్చే ఉత్తరాలుకూడా అలాగే వుంటాయి.... నెల మధ్యని అసలు ఉత్తరాలే రావు. నెలాఖర్నే వస్తాయి. ఇక రెండు మూడు రోజు లలో జీతాలు అందుతాయనగా వస్తుంది ఉత్తరం.

అలాటి ఉత్తరాలు నలభయికి దాటి వచ్చాయి ఇక్కడికి. అవన్నీ ఒక్క లాగే ఉంటాయి. వాట్లో సంగతులన్నీ మూసపోసిన సీసపుదిమ్మల్లా ఒకటిగానే వుంటాయి.

నెలాఖర్న ఇంటిదగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందంటే అది విప్పిచూసు కోవడం అనవసరం అని చెప్పవచ్చు. అసలు కొన్ని ఉత్తరాలు విప్పేవి రానే రావు. కార్డులే వస్తాయి.

"కార్డులు రాయకండి నాన్న" అంటే "పిచ్చివాడా! ఇక్కడ తెలుగు వచ్చినవాళ్ళ కంటబడకుండా ఎర్రడబ్బీలో స్వయంగా నేనే వేస్తున్నాను కదురా! అక్కడ అంతకుంది బెంగాలీవాళ్ళ మధ్య నీ ఉత్తరం ఎవడికొక్కావాలిరా! అందేత కార్డే మంచిదిరా, ఆ మాత్రం దానికి కవరుకూడా ఎందుకు అదో దండుగ? అందులో ఏమిటుందోనని ఎవరేనా చింపి చూస్తారు కూడానూ!" అని పొదుపు ఉద్యమం ఏజెంటులాగ మాట్లాడతాడు. "ఇంతకీ అందులో ఏమంత రహస్యమైన ఫోగట్టా లుంటాయి గనక!" అంటాడు.

అవును. రహస్యాలుండవు,

అవసరమేమీ ఉండవు వాటిల్లో.

అంతా బాగున్నాం అని మొదలుపెట్టి ఎవరూ కులాసాగాలేం అన్నట్లు తేలుస్తాడు ఆఖరికి. "నా వంట్లో ఈ మధ్య అంత ఇదిగా ఉండడంలేదు. దగ్గు తెరలు తెరలుగా వస్తున్నాది. మీ అమ్మకి బ్లెడ్ ప్రెషర్ ఎటాక్ ఈనెల్లో రెండుసార్లు వచ్చింది. చిన్నిగాడు మొన్న ఫుట్ బాలాడుతూ పడ్డాడు. మోచేతి దగ్గరెముక చెకుక్కుని పెద్దపుండు అయిపోయింది. చెల్లెళ్ళిద్దరికీ పెళ్ళి సంబంధాలు చూస్తూనే ఉన్నాం. ఈ నెల్లో ముగ్గురు పెళ్ళికొడుకులు వసంతని చూడ్డానికి వచ్చేరు. ముగ్గురికీ అది నచ్చినట్టేగాని, అందులో ఒకరి అంతస్తుకేనా

మనం తూగేటట్టు లేము." ఇలా గెలాగో ఉంటాయి ఆ క్షేమసమాచారాలు. చివరి వాక్యం మాత్రం డబ్బు ఎంత పంపాలో స్పష్టంగా రాసి వుంటుంది. ఎంత వేగిరం పంపితే అంత మంచిదని ప్రాధేయపూర్వకంగా ఆజ్ఞాపిస్తారు.

ఇరవైఆరో యేట కలకత్తాలో అడుగుపెట్టేడు తను. ఈ ఉద్యోగం కోసం. కాకినాడలో ఉన్నంతకాలం ఎక్కడా ఆఖరికి స్టేట్ గవర్నమెంటులో కూడా ఉద్యోగం దొరకలేదు. దొరికి ఉంటే అక్కడే వాళ్ళతోబాటు ఉండిపోయే వాడు, ఈ ఉత్తరాల బాధ, ఈ దిక్కుమాలిన వాడిలా ఉండడం బాధ. ఈ కమలా మేనోన్ పరామర్శ బాధ తప్పిపోయేది. ఎక్కడో ఎవతెనో చూసి తనూ కట్టుకునేవాడు. చెల్లెళ్ళకి దక్షతగా చేసేవాడుకూడానూ.

ఇప్పటినుంచీ తొందరేమిటని అప్పటివరకూ తనే నిర్లక్ష్యం చేసేడు పెళ్ళి సంగతి.

ఇప్పుడు సంగతంతా వేరుగావుంది.

ఇప్పుడు తనెలా ఉన్నాడో, వేళకి అన్నమేనా తింటున్నాడో లేదో, బట్ట లెవరు అందిస్తున్నారో, పక్కెవరు వేస్తున్నారో; తలనొప్పి వస్తే అమృతాంజనము ఎవర్రాస్తున్నారో, కష్టం సుఖం కలిగిన్నాడు ఎవరితో పంచుకుంటున్నాడో, అందమైన ఈ నగరంలో తిరిగినప్పుడు సుందరమైన దృశ్యం ఏదేనా కనబడి తనలో విపరీతమైన భావోద్వేగం కలిగినప్పుడు దానికి బయటికి వెళ్ళే మార్గం ఎవరు చూపిస్తున్నారో—ఇవేవీ తనవాళ్ళు పలకరించి పరామర్శించరు. అసలు ఇంటికి వెళ్ళి రెండేళ్ళయింది.

నిజమే! రెండేళ్ళకిందట ఇంటికి వెళ్ళినప్పుడు తల్లి నాలుగైదుసార్లు హెచ్చరించింది. "అబ్బాయీ, ఓ నెల్లాళ్ళు సెలవు పొడిగించు నాయనా, సంబంధాలు దొరుకుతాయి. నెల్లాళ్ళలో ముహూర్తాలు కుదురుతాయి. ఏకంగా కోడల్ని వెంటబెట్టుకునే వెళ్ళిపోదువుగాని" అంటూనూ. తల్లిమాట నిజంగా నిజమే. కుదిరిపోయేది, జరిగిపోయేదీ కూడానూ.

ఆవేళ రాత్రి సినీమాకి వెళ్ళడంతో వచ్చింది పొరపాటు. మరునాడు పిఠాపురం వెళ్ళి శ్రీధర్రావు చెల్లెలు పద్మజని చూడాలని, "మీచెల్లెల్ని నాకిచ్చి పెళ్ళి చెయ్యవోయ్" అని శ్రీధర్రావు నడగాలని, "నన్ను చేసుకో. పద్మజా!" అని ఆమె నడగాలని తియ్యగా, రహస్యంగా ప్రోగ్రాం వేసుకున్నాడు. ఆ ఉత్సాహంలో అలా అలా నాలుగు వీధులూ తిరిగి అక్కణ్ణించి సినిమాకి వెళితే....

పేన పక్కసీట్లోనే పద్మజ. "ఎంతో సంతోషంగా ఉంది, నిన్నివాళ యిక్కడ చూసినందుకు." అని పలకరించింది. తనకి కూడా ఆ నిమిషంలో సగంసేపూ అలాగే అనిపించింది. తరువాతి వాక్యంలో అగ్నిపర్వతాలు పేలి లావా నెత్తుమీద ప్రవహించింది. "ఇటు చూసేవా, ఈయన విద్యాసాగర్, ఎం. ఏ, ఇక్కడే లెక్చరర్. మా శ్రీవారు. మా స్నేహం వయస్సు ఇవ్వాళ్టికి నలభయి ఒకటోరోజు, మీరిద్దరూ కలుసుకోండి" అంటూ అందంగా నిండుగా నవ్వి ఇద్దరి చేతులూ కలిపింది. నలభయి ఒకటో రోజుకే రోజులు లెక్క పెట్టడందాకా వచ్చిందా అన్న జోకు తన నోట్లోనుంచి ఇంకా ఇవతలికి రాలేదు. వెల్లటి సినిమాస్కోపు తెర నల్లగా పైన కంఫర్టబుల్‌గా వెలుగుతున్న డిమ్‌లైటు నల్లగా, పక్కన హర్పుని అంటంగా నవ్వుతున్న పద్మజ పలువరస నల్లగా, అంతులేని భవిష్యత్తంతా నల్లగా తననిచూసి వెక్కిరిస్తున్నట్టయింది. ఈ అపశ్రుతికి విరుగుడేమిటో చప్పున అర్థంకాలేదు. అంతే, ఇంక పిఠాపురంలేదు. పిల్లలమర్రీలేదు. మరునాడే మెడ్రాస్ మెయిల్ ఎక్కేశాడు తను.

తనని ఇప్పుడు కమలామనోష్ తప్ప ఎవరూ అడగరు. "వై డోంట్యూ మేరీ ఏ బ్యూటిఫుల్ లేడీ" అని. ఈ కమలా మేనోన్—ఇది నవ్వుతుంది, పలకరిస్తుంది, హాస్యమాడుతుంది....బజార్లకీ, బట్టలకొట్లకీ; సినిమాలకీ, చిల్లర షికార్లకి వస్తుంది. కాని దీనిలో ఏమేనా శృంగారం, సౌకుమార్యం ఉన్నాయా? ఇది వంట వండగలదా? పప్పుతిమ్మక్కలా మంచం మీద బాసింపట్టు వేసుక్కూచుని తను కాఫీచేసి ఇస్తే సుతారంగా సగందాకా తాగగలదు, ఆ మిగిలిన సగం ఎత్తి తాగడానికీ, కప్పు కడిగి అక్కడ పెట్టడానికీ కూడా బద్దకమే. పువ్వులు కొని ఇచ్చేడు తను ఓసారి. "అబ్బా, నాకివి ముడుచుకోడానికి బద్దకం: మువ్వే పెట్టు, బాబూ." అని ఒయ్యారం కురిసింది. అందులో శృంగారం కనబడాలంటే చాలా కాండెసెన్షన్ అవసరం అనిపించింది.

న్యూస్‌పేపరు చదువుతూ, కాఫీ తాగుతూ ఉన్న కమలా మేనోన్ హఠాత్తుగా రెండూ ఆపేసి లేచి కూచుంది. ఒక ఎడ్వర్‌టైజుమెంటుమీద వేలు పెట్టి "దీనికి నేను ఎప్లయ్ చేస్తాను" అన్నది. గబగబా పెన్నూ నోట్‌బుక్కూ తీసుకుంది. ఆ వివరాలన్నీ రాసేసుకుంది, మరోసారి రాసింది. పేపరులో ఉన్నదీ తైపారువేసి చూసుకొని పేపరులో రెండుసార్లు టిక్ కొట్టింది.

"దొంగముండ! దీని కింకా ఆశ తీర్లేదు. బేకర్ అండ్ బేకర్ మందుల

కంపెనీలో పనీపాటూ లేకుండా షోగ్గా వేనిటీబేగ్ ఆడించుకుని ఇటూ అటు తిరిగినందుకు నెలకి అయిదువందలు పట్టుకుపోతున్నాది. ఇంకా మంచి ఉద్యోగం, ఇంకా ఎక్కువజీతం సంపాదించేద్దామని కాబోలు దీని ఎత్తు" అని విసుగ్గా అసూయగా అనుకున్నాడు సుబ్బారావు.

"సో—గుడ్‌నైట్, సుబ్రావ్!" అని లేచింది కమలా మేనోన్.

"వెళ్ళు. తల్లీ, వేగిరం వెళ్ళు" అని మనస్సులో అనుకొని, "నీకు వెళదామని బుద్ధిపుట్టింది. ఇంక నే నాగమంటే మాత్రం ఆగుతావా? అదేదో ఉద్యోగానిక్కూడా ఎప్లయ్ చేస్తున్నావు. అదొస్తే మా కంపెనీకే గుడ్‌బైకొట్టేసి వెళ్ళిపోతావు" అన్నాడు సుబ్బారావు.

లేచి నిలబడుతూ గుసగుసమని నవ్వుకుంది కమలామేనోన్. ఒళ్ళంతా కదువుతూ అలా నవ్వుతూఉంటే కొంచెం చిరాగ్గానే ఉంటుందిగాని అప్పుడప్పుడు ఆ నవ్వులో కమలా మేనోన్ని చూడాలనే ఉంటుంది సుబ్బారావుకి.

"ఆ ఎడ్వర్టయిజ్‌మెంటు నువ్వోసారి చూడు, అది నా ఒక్కదానికే కాదు!" అని చిలిపిగా నవ్వుకుంటూ గదీ దాటి వెళ్ళిపోయింది.

యథాలాపంగా ఆ ఎడ్వర్టయిజ్‌మెంటు తీసి చూసేడు సుబ్బారావు, ఇది ఏ కంపెనీదయి ఉంటుందో గెస్ చేషమని, దొరకకుండా వేద్దామనుకుంటారుగాని కొంచెం గట్టిగా ఆలోచిస్తే ఏ కంపెనీ వాళ్ళదో తెలిసిపోతుంది. చూస్తే సరి....

లెంపకాయ కొట్టినట్టయింది హఠాత్తుగా,

అది ఒక "వధువు కావలెను" ప్రకటన!

"చక్కని రూపమూ- మంచి అలవాట్లూ. హుందా అయిన ఉద్యోగమూ గల ఒక ఇరవైయెనిమిదేళ్ళ మలయాళీ యువకునకు కలకత్తాలో కాపరం ఉండడానికి ఇష్టపడే సౌందర్యవతి అయిన మలయాళీ కన్యకావలెను. వధువునకు ఇంగ్లీషు బాగా తెలియాలి. వయస్సు ఇరవై రెండునుండి ముప్ఫయివరకూ ఉండవచ్చు. త్వరగా ఫోటోతోసహా దరఖాస్తు పెట్టండి."

మళ్ళీ మళ్ళీ చదివేడు సుబ్బారావు.

కమలా మేనోన్ గడుసుది, తనకి కావలసిన పని మంచిగా జరక్కపోతే మాయోపాయంతోనైనా చేసేసుకుంటుంది. దాంట్లో తనకెప్పుడూ సందేహంలేదు. కాని ఇది ఇన్నాళ్ళూ నామీద కన్నేసిందని భ్రమపడ్డానే,

పేపరులో మలయాళీ యువకుడు— అని కనబడేసరికి నిమిషమేనా నిలబడకుండా ఎగిరిపోయిందే! దాన్ని నే నాకర్షించేననుకొని ఘోరంగా గోతిలో పడ్డానే:— అని తెల్లబోయేడు సుబ్బారావు. ఓపక్క నోటితో "వై డోంట్యు మేరీ—మి—మి—మీ" అని రోజూ తనని అడుగుతూనే దాని కళ్ళూ, మనస్సూ మలయాళీ యువకుడి కోసం వెతుకుతున్నాయన్న మాట; ఎంత గడుసు దెంత బిరుసు దెంత జాణది!— "దాని కంతకీ కారణం నా ముభావమే. నా తరఫునుంచి దానికి కలుగుతున్న ఆశాభంగమే, నే నెప్పటికప్పుడు దానికి ప్రసాదిస్తున్న నిరుత్సాహమే" అనుకున్నాడు మనస్సులో దైన్యం, పశ్చాత్తాపం నింపుకొని.

అవును, నూటయిరవైయ్యొక్కసార్లు వై డోంట్యూ మేరీ మీ—అని తెగేసి అడిగితే కనీసం ఒక్కసారైనా, కనీసం నన్ను ఆలోచించుకోనీవే అనైనా అన్నాడా? మీరు వేరూ; మేం వేరూ అనే అన్నాడు. "ఇది కాస్మొపాలిటన్ సిటీ. మనం కాస్మిక్ యుగంలో ఉన్నాం. ఇంటర్నేషనల్ రిలేషన్స్ బలపడుతూ ఉంటే ఏమిటి ఈ ఇరుకుసందుల్లాంటి ఆలోచన్లు?" అని దబాయించింది. తను ఎప్పుడూ దానికి ఆశ పుట్టించలేదు. అందుకే అది ఉండీ ఉండీ దానికి కావలసినవాణ్ని వెతుక్కుందికి పోయింది. రేపీపాటికి వాడెవడో తను క్కొని వాడికి వల పన్ని స్వంతం చేసుకుంటుంది. దాంట్లో సందేహంలేదు.

చేసుకుంటే చేసుకోనీ, పీడ పదిలిపోయింది అని అనుకోడానికి చాలా సేపు పట్టింది సుబ్బారావుకి, ఒక క్షణం ఇలా అనుకుంటే మరుక్షణంలో ఏమిటో దాన్ని చెయిజారిపోనివ్వడం పొరపాటేనేమో అని అనిపించేస్తూంది. దానిలో ఏమీ లేదుగాని ఏదో ఆకర్షణ ఉంది.

ఏమైనాసరే, ఇన్ని ఇంటర్నేషనల్ కబుర్లూ చెప్పి చివరికి అది మలయాళీ వాణ్నే వెతుక్కుంటూ వెళ్ళిపోయిందే! దాంట్లో తను నేర్చుకోవసిన పాఠం ఏమీ లేదా?

ఏమీ లేదా?

లేదా, అని!

సుబ్బారావు కాయితం, కలం తీశాడు. ఆంధ్రప్రదేశంలో బాగా ప్రచారం కలిగి కలకత్తాకూడా వచ్చే ఇంగ్లీషు దినపత్రికలు మూడింటికి ప్రకటనలు వ్రాశాడు.

*    *    *

"ఏమంటున్నాడు మీ ఫ్రెండు?" అని వేళాకోళం చేసేడు సుబ్బారావు కమలా మేనోన్‌ని.

"ఫ్రెండెవడు?" అని పేల్చింది కమలా మేనోన్. ప్రతిధ్వని ఇచ్చినంత వేగంగా.

"అదే, ఆ ఎడ్వర్టయిజ్‌మెంట్ ప్రియుడు!"

"ప్రియుడూ లేడు, మొగుడూ లేడు!"

"ఎవడూ లేకపోతే ఇన్నాళ్ళూ నా రూమ్‌కి రాకుండా ఎలా ఊరు కుంటున్నావు!....ఎటుపోతున్నావు!"

"ఓ!" అని మళ్ళీ ఒళ్ళంతా కదుపుతూ నవ్వింది కమలా మేనోన్, "జెలసీ! దై నేమీజ్ మేన్!....వాటెఫాల్ మైడియర్ కంట్రీమేన్!" అని మరింతసేపు సుబ్బారావుని లక్ష్యపెట్టకుండా నవ్వుకుంది.

"ఇంటర్వ్యూకైనా రమ్మన్నాడా పోనీ!" అని భోగట్టా చేసేడు సుబ్బారావు వెటకారం తెలియకుండానే.

"ఆ ఇడియట్—వాడు రమ్మనడం, నేను వెళ్ళడం! వాడెవడో సి.ఐ.ఏ. వాడోయ్. మిస్టర్ సుబ్రావ్!-ట్రివేండ్రమ్ జిల్లాలో అంత దౌర్భాగ్యుడు పుట్ట లేదని మాడాడీ కామెంట్ చేసేడు!"

"ఓ!"

సుబ్బారావు కింకా తనివి తీర్లేదు.

"శృంగభంగమైంది దొండముండకి! దీని కింతే కావాలి" అనుకున్నాడు. రూమ్‌కి తీసుకువెళ్ళి దీనిచేత ఇంటర్నేషనల్, కాస్మో పాలిటిన్, కాస్మిక్ కబుర్లు చెప్పించి, లెక్చర్లిప్పించి, "ఏం పిల్లా, మరి మలయాళీ యువకుడు అని చదవగానే గజ్జెలగుర్రంలా పారిపోయావే" అని వెక్కిరించాలి. అప్పుడు తన కసి తీరాలి.

"మరవుతే మా రూమ్‌కి రా! పార్టీ ఇస్తాను."

"ఎందుకు పార్టీ?"

"ఇంకా నయం? గండం గడిచినందుకు నువ్వియ్యవలసింది పార్టీ. పద, పద;" ఎప్పుడోగాని చెయ్యని పని; నడుంమీద చెయ్యేసి లాక్కుపోయాడు.

తిన్నగా లోపలికి వెళ్ళిపోయి స్టవ్ వెలిగించి నీళ్ళు పెట్టి అవతలికి వచ్చాడు సుబ్బారావు.

నిలబడి ఉండే లెటర్ స్లిప్‌లోంచి పడ్డ పెద్ద కవరుని అటూ ఇటూ తిప్పి చెకీ చేస్తూంది కమలా మేనోన్.

"ఏమిటది?" అన్నాడు సుబ్బారావు హుషారుగా.

"చూడు" అన్నట్టు కళ్ళలో మెరుగు పెట్టుకొని చేతి కందించింది.

అది ఒక దినపత్రికవాళ్ళు పంపిన కవరు. పైన వ్రాసి ఉంది; ఫలానా ఎడ్వర్టైజ్‌మెంటు నెంబరుకి జవాబుగా వచ్చిన మెయిల్, ఫలానా పత్రికవారి అభినందనలతో.

దొంగచూపుగా కమలో మేనోన్‌వేపు చూశాడు సుబ్బారావు.

దొంగతనం ఎప్పుడో పసికట్టేసింది కమలా మేనోన్.

కళ్ళలో చిరునవ్వు నోటిమీదికి రాకుండా జాగర్త పడుతూ కమలా మేనోన్ ఖాళీగా వదిలిపెట్టిన మంచంమీద కూర్చుంటూ కవరు తెరిచాడు సుబ్బారావు.

"జస్ట్ వన్ మినిట్. ఆ కుర్చీ తెచ్చుకుని కూర్చో. ఇదేం కాన్ఫిడెన్షల్ గాదు. నీకంతా చెబుతాగా!"

లోపల ఒకటే ఒక కవరు ఉంది.

అంతే!

"తను మూడు ఆంగ్ల దినపత్రికలకి అడ్వర్టయిజ్‌మెంటు పంపిస్తే, మూక్కోటి ఆంధ్రులు—కాదు, అయిదు కోట్లుట ఆంధ్రుల జనాభా—అంత మంది చదివితే ఒక్కటా. తనని వివాహం చేసుకోడానికి ఇష్టపడి సిద్ధపడుతూ వచ్చిన కన్య దరఖాస్తు. నేనూ, నా స్థితీ ఒక్క కన్యనికంటె ఆకర్షించలేక పోయానా." అని చిన్నబుచ్చుకున్నాడు సుబ్బారావు.

నాన్నగారు చెప్పిందే నిజమేనేమో!

కలకత్తాలో కాపరం అనేసరికి కామేశ్వరావుగారి ఇందిరా, వీరభద్రయ్యగారి గిరిజా ఇద్దరూ వద్దన్నారుట. అసలా పెళ్ళిళ్ళ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సంబంధాలు నేను చూడ లేనండీ అన్నది కూడా ఇందుకేట!

నిన్ననే మిగిలిన రెండు పత్రికల వాళ్ళూ రాసిన ఉత్తరాలు వచ్చేయి మీ "యాడ్"కి జవాబుగా ఒక్క అప్లికేషనూ రానట్లు తెలియజేయడానికి చింతిస్తున్నాము అంటూనూ,

ఈ ఒకటె?

ఇది ఎవతె?

కమలా మేనోన్ కళ్ళలోకి బ్లాంక్‌గా చూశాడు సుబ్బారావు. చిలిపిగా నవ్వుతూంది.... కొంపదీసి ఈ ఒక్క అప్లికేషనూ దీనిది కాదుగద!

మే గాడ్ ఫర్‌బిడ్?

"కవరు విప్పు! ఏమిటలా తెల్లబోయి చూస్తావు" అన్నట్టు కుతూహలం కళ్ళలో కనబరుస్తూ, "ఏదీ ఇలా తే! నేను ఓపెన్ చేస్తాను!" అన్నట్టు చెయ్యి జాపింది కమలా మేనోన్.

"ఉండుండు."

విప్పి చూసేడు సుబ్బారావు.

స్థాణువైపోయేడు.

గదీ, మంచం, చేతిలో కవరూ, కమలా మేనోన్, అన్నీ. అందరూ గిరగిరా తిరుగుతున్నాయి. నేనూ తిరిగిపోతున్నాను.

నాకు తెలివి తప్పిపోతున్నాది.

పై నున్న పంకా పడిపోతుంది నామీద.

నేనెంతో దుష్టుణ్ని, చస్తాను. కుళ్ళి కుళ్ళి చస్తాను,

ఇప్పుడు నా అంత్యకాలం సమీపించింది. ఎంత ఘోరమైన పాపం!

ఈ అక్షరాలు....

ఇది ఒక లేఖరూపం దాల్చిన మానవజాతి మరణశాసనం,

దీనికి నేను పురోహితుణ్ని.

ఇది మహా పాపం.

"అయ్యా,

నా పేరు వసంత. మా నాన్నగారి పేరు కె. వీరభద్రరావు నేను స్కూలు పైనలు పాసయి ఉన్నాను. ఇందులో నా ఫోటోను పంపినాను. నా వయస్సు ఇరవైనాలుగు సంవత్సరాలు. కట్నాలు ఇచ్చుకోలేక మా వాళ్ళు ఇన్నాళ్ళవరకు నా పెళ్ళి చెయ్యలేకపోయినారు. నేను కలకత్తాలో కాపురం చేయడానికి ఇష్టపడు తున్నాను. అక్కడ మా అన్నయ్య పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. మా అన్నయ్య చాలా మంచివాడు. నాకూ, మా చెల్లెలికీ పెళ్లిళ్ళు కాలేదనీ తన పెళ్ళి వాయిదా వేసుకుంటున్నాడు. క్రింద అతని ఎడ్రసు కూడా వ్రాసినాను. తమరు త్వరగా సంప్రదింపులు జరిపినట్లయితే మాకు నిరీక్షణ బాధ తప్పుతుంది.

పై డోంట్యు మేరీ మీ? —కె. వసంత."

"ఎందుకలా వణికిపోతున్నావ్, సుబ్రావ్!" కమలా మేనోన్ కూర్చుని అడిగింది;

జవాబు లేదు.

లేచి నిలబడి అడిగింది.

ఊఁహూఁ.

"ఏదో ఇమోషనల్ షాక్ వచ్చినట్లుంది. పూర్ ఫెలో. ఒళ్ళంతా చెమటలు పోసేస్తున్నాయి," ఫేన్ పూర్తిస్పీడ్‌లో తిరిగేటట్లు ఆన్ చేసింది కమలా మేనోన్.

"ఐ హేవ్ నో టియర్స్ టు షెడ్."

"ఏమిటి, సుబ్రావ్!"

"నా పాపానికి నిష్కృతిలేదు" అన్నాడు సుబ్బారావు కళ్ళు తేలిగ్గా ఒత్తుకుంటూ, "వాళ్ళకి నామీద ఉండే సదభిప్రాయానికి నేను చేసే నిరవాకం ఇదా?"

"అసలేమిటుంది, సుబ్రావ్, అందులో ? ఎందుకు నువ్వలా అయిపోతున్నావ్ ?"

చేతిలో ఫోటో, ఉత్తరం పరుపుమీద పడేశాడు సుబ్బారావు. "మా చెల్లెలు .... అప్లికేషన్ ...." గొణుగుతూ రెండు చేతులూ మొహంమీద కప్పుకున్నాడు.

అప్లికేషన్లు ఇంగ్లీషులోనే ఉంటాయి.

కమలా మేనోన్ జరిగిందేమిటో గ్రహించి, పరిస్థితి అదుపులో ఉంచుకున్నట్టే కనబడిందిగానీ సగం పైగా షాక్ తనూ తిన్నది.

ఈ ఉదంతంలోని అవమానం దేశ కాల పరిస్థితులేవైనాసరే—ఎవరికేనా ఒక్కలాటిదే.

వెంటనే లోపలికి వెళ్ళిపోయింది.

స్టవ్‌మీద నీళ్ళు మరుగుతున్నాయి.

"పూర్ ఫెలో!" అనుకున్నది కమలా మేనోన్.

రెండు నిమిషాల్లో కాఫీకప్పులతో ఇవతలికి వచ్చింది. సుబ్బారావు దిగాలుపడి ఉన్నాడు.... కాఫీ అందుకొనేటట్లు చెయ్యడమే కష్టమైపోయింది.

"నయం ! నేనివాళ రాకపోతే ఏమై ఉండేదో!" అనుకుంది కమలా మేనోన్, గ్రీకు ట్రాజెడీలు ఆమె మనసులో వికారంగా కదలాడి భయంకరమైన ప్రమాదాల్ని ఊహించాయి.

"ఎంత కష్టం! ఎంతవిషాదగాథ! ఎటువంటి షాక్స్ ఇస్తుంది మన సాంఘిక వ్యవస్థ!" అని ఓదార్పు మాటలు చెప్పి అతని కష్టంలో పాలు పంచుకుంది కమలా మేనోన్.

("వై డోంట్యు మేరీ మీ ?" అని ఈ మాటు సుబ్బారావు కమలా మేనోన్ని అడిగాడు.)

("జ్యోతి" మాసపత్రిక; మార్చి 1970)

# గమనశ్రమ

"బోరు కొట్టేస్తోంది మేష్టారూ" అన్నాడు భాస్కరం.

"ఎవరు, రంగమ్మగారేనా?" అన్నాను పరధ్యానం నటించి. రంగమ్మ గారంటే, నిర్మలను పెంచుకుంటున్న రిటైర్డు లేడీ డియ్యీవో.

"సరేలెండి. ఎవరో వుంటే బోరు మనమే కొడ్తాంగా! ఎవరూ లేక పోవడాన్నే లైఫ్ సింగ్యులర్‌గా మొనాటనస్‌గా తయారయిపోయి బోర్ కొట్టే స్తోంది సార్"

"అలాగా"

భాస్కరం వాల్తేర్లో ఏదో పెద్ద క్లాసే చదువుతున్నాడు. చాలా తెలివి గలవాడే గాని చటుక్కుని పరీక్ష పాసైపోతే లటుక్కుని ఏదేనా బాధ్యత ఉద్యోగం వేషంలోనో పెళ్ళివేషంలోనో తగులుకుంటుందని- ఆ పైనలియర్నే ఐదేళ్ళ బట్టీ అలా దీక్షగా చదువుకొస్తున్నాడు.

"మంచివాడు" "ఇంటరెస్టింగ్ చాప్" "టెరిబుల్ ఫెలో" అంటారు. అతన్ని గురించి డాక్టరు వసుంధరా దేవి; ఫిలాసఫీ ప్రొఫెసర్ సుబ్రమణియన్; ఎడ్వకేట్ కామేశ్వర్రావుగార్లు; మొదలగువారు.

అతను పాటలు పాడుతాడు. నాటకాల్లో వేషాలు వేస్తాడు. (నాటకాలు రాస్తాడేమో అని కూడా నా కనుమానం.) బాగా ఇమిటేట్ చేస్తాడు. ఈ మధ్య అన్ని కాలేజీల్లోనూ మిమిక్రీ చేసేవాళ్ళు ప్రబలయినవుతున్నారు కదా. యూని వర్సిటీకి ఇతను——

భానుమతి పాటలు భానుమతి లాగ పాడుతాడు——రఫీ పాటలు రఫీలాగ పాడుతాడు. నాగయ్య డైలాగులు, రాజబాబు కంగారు అరుపులు అన్నీ బాగా వస్తాయి. నూర్జహాన్‌వీ, జోరా ఆఫ్ అంబాలావీ పాత పాటలు అతన్చేత పాడించుకోవాలని నా కెన్నాళ్ళనించో కోరిక. కలకటా రాసి ఆ ఎల్. పి. రికార్డులు తెప్పించాలి.

"ఇప్పట్నించీ వొద్దు గురువుగారోయ్- నేను టేపు రికార్డర్ కొనుక్కొనే

దాకా ఆగండి. ఆ గొంతుకలు మళ్ళీ మళ్ళీ అనలేను—" అన్నాడు భాస్కరం నేనోమాటు ఆ మాట అంటేను.

అలాంటి కుర్రాడికి లైఫ్ బోరు కొడ్డానికి వీల్లేదు.

"లైఫ్ అంటూ ఒకటి మన జీవితాల్లో యెక్కడో దాక్కుని ఉందనుకో. కాని ఆవిడగారు మస్తాబైవొచ్చి నిన్ను బోరు కొట్టేదాకా నువ్వు అందులోంచి పారిపోలేక పోతున్నావంటే- నాకేమిటో నమ్మకంగాలేదు భాయ్" అన్నాను.

"అంతా ఈ మధ్యనే సార్"

"ఏం, మీ నిర్మలేమయింది? నిర్మలంగా వుండిపోతానందా?"

"ఘా ఘా, యిన్‌సల్ట్! నిర్మల కంటుకున్న మలినం పోలికలన్నీ నావేనని యూనివర్శిటీలో ఏ గోడా మీ కింతా చెప్పలేదూ?.... పోన్లెండి వెళ్ళిపోయింది దాంతో మీకేమిటి?.... విశాఖ వదిలెళ్ళిపోయింది సార్. నిర్మలే కాదు; సుజాతా, కమలా, నారాయణమ్మా, జానీ అందరూ వరసగా తప్పుకున్నారు. ఇప్పుడు మినిమమ్ ఒకరైనా గర్ల్‌ఫ్రెండు మనకి ఇమ్మీడియెట్ నెస్‌సిటీ, రేషను కార్డుకంటే కూడా ముఖ్యమైన అవసరం అయిపోయింది సార్........ రండి అలా వెళ్ళి సిగరెట్స్ తెచ్చుకుందాం"

వాళ్ళ పెద్దన్నయ్య నా ఫ్రెండు రాజమండ్రిలో ఎడ్వకేట్. "మావాడు చెడిపోతున్నాడంటూ ఉత్తరాలొస్తున్నాయి. నువ్వు చూస్తే అనకాపిల్లి తాలూకా ఫీసులోనే కుళ్ళుతానంటావు కాని వైజాగు ట్రాన్స్‌ఫరేనా చేయించుకోవు. వాడికి నువ్వు గార్డియన్‌గా వుంటానని ఎంతో ఆశపడ్డాను" అని అలా ఏదో రాస్తూంటాడు; నా కెప్పుడేనా ఉత్తరం రాస్తే—

కాని— వాడికి తెలీదు. వైజాగు అప్పుడప్పుడొచ్చి చూడ్డానికి బావున్నంతగా కాపురం వుండడానికి బావుండదు— ఎవరికో తప్ప.

రెండు; భాస్కరంలాంటి హుషారైన కుర్రవాడికి; పాదరసంలాంటి అతని చురుకుతనానికి గార్డియన్‌గా వుండటం తాలూకాఫీసులో ఉద్యోగం చెయ్యడం కన్నా కష్టం. అప్పుడు భాస్కరం నా దగ్గిర మహేంద్రకపూరు పాటలు పాడ్డు. శివాజీగణేశన్‌కి జగ్గయ్య చెప్పిన డైలాగులు అనడు. ట్విస్టు లేదు. రాక్ెన్‌రోల్ లేదు. అంతా చప్పగా స్ట్రెయిట్‌గా అయిపోయింది.

అయినా సరే— "మీ అన్నయ్య లెటర్రాసేడు" అన్నాను.

"ఏమిట్రాసేడు?— మా భాస్కరం గాడి కోసం రోజూ కోర్టులో అబ

ద్దాలు ఆడలేక, ఆడించలేక చచ్చిపోతున్నాను. వాడు ఈ ఏడాదేనా ఒడ్డెక్కేటట్టు చూడు. అని రాసేడు కదూ! అక్కడికీ నేనీ మధ్య మా ప్రొఫెసరు బ్రహ్మయ్యగారి దగ్గిర—

"అయ్యయ్యో ఓఓఓ బ్రహ్మయ్యా

అన్యాయం చేసేవేమయ్యా?

ఈ ఏప్రెల్లో ఒడ్డు చేరితే ఎంత గుమ్మంగా ఉండేదయ్యా

య్యా, య్యా, య్యా,

అని మిమిక్రీ ద్వారా సజెష్టు చేసేను. ఆయనకి వినిపించలేదో యేమో ఖర్మ. మీరు ఈ మాటు నా ప్రయత్న లోపం యేమీలేదని మా అన్నయ్యకి రాసెయ్యండి. మీ మాటంటే వాడిగ్గురి. మీ రాతంటే అంతకన్నానూ."

నవ్వుకున్నాను. ఇలాంటివాడు పరీక్ష పాసైపోతే యెలాగా అని వో నిమిషం బెంగెట్టుకున్నాను కూడాను.

"దానికేం గాని లైఫ్ బోరు కొట్టకుండా చూసుకోవడం యెలా మేష్టారూ?"

నేను చెప్పకముందే అతనికి ఆ పాయింటు మీద వొక ఐడియా వున్నాది. "తుమ్మెద కొత్తపువ్వుల్ని చూసుకోవాలి" అని కాని—అదికాదయ్యా అది నీకు తప్పు. బుద్ధిగా చదువుకొని చక్కగా పరీక్షలు రాసి పాసవ్వాలి. భావి భారత పౌరులు మీరు. మీకు అనేక బాధ్యతలున్నాయి. అని లెక్చరు కొట్టనా? పారిపోతాడు!

* * *

"మరి నువ్వు నాకో మాట ఇవ్వాలి" అన్నాను.

"మాటివ్వడమేమిటి? చేతులో చెయ్యివేసి గిల్లమంటే కూడా గిల్లుతాను చెప్పండి"

"ఒకమ్మాయుంది. ఆ అమ్మాయిని నీకు పరిచయం చేస్తాను. అయితే ఆ అమ్మాయిని నువ్వు అందర్లాగా—"

"థేంక్స్ థేంక్స్ థేంక్స్ మాష్టారు! ఎవరా అమ్మాయి; ఏమా అడ్రసు? ఆఁ.... ఆఁ.... నే ననుకుంటూనే వున్నాను—" అని రావి కొండలరావు మొహం గొంతుకా పెట్టి; "మీరు.... ఈ వయస్సులో ఈ కాస్టాఫ్ లివింగు ఇలావున్న రోజుల్లో.... ఈ వయి జాగు.... ఇన్నిమాట్లు వొస్తున్నారంటే—

ఎవరో అమ్మాయి వుండే ఉంటుందని అనుకుంటూనే ఉన్నాను.... చెప్పండి.... ఎవరు మీకు తెలుగు చెప్పిన మేష్టరు? తదరినన్నాం.... ఆతాణా"

"సరేలే. నీకు ఏ విషయమూ సీరియస్‌గా ఆలోచించే యోగ్యత లేదని తేలిపోయిందిగా. నిష్కారణం ఒక మెడికో అమ్మాయిని పరిచయం చేసి ఆ పాపం నేను కట్టుకోలేను" అన్నాను.

"ఛ ఛ బొడ్డుంచాల్ మేష్టారు. మీకు తెలీదుగాని; మనం మర్యాదస్తుల దగ్గిర మర్యాదస్తుల్నరగా వుంటాం. కావ(ల)స్తే—"

"ఓ! అడగక్కర్లేదు నీ గురించి—" అని విసుక్కున్నాను.

"అందుకేగా, మీరు మాట యిమ్మన్నారు; ఇమ్మీడియట్‌గా ఇచ్చేశాను. వొట్టు వెయ్యమంటే వేస్తాను."

"నాకు వొట్లూ ప్రమాణాలూ అంటే నమ్మకం లేదు."

"అది— అంచేత మనుష్యుల్నికూడా నమ్మరు."

"మనుషులందర్నీ యెందుకు నమ్మను—?"

"పోనీ నన్ను— అయితే గురువుగారూ; మీకు నే నెప్పుడు నమ్మక ద్రోహం చేసేనో చెప్తారా?"

"సరే—అదంతా యిప్పుడెందుగ్గాని"

"అలా దారికి రండి— యిప్పుడు చెప్పండి. ఒకటి-ఎవరా అమ్మాయి?"

"రిటైర్డు ట్రెజరీ ఆఫీసరు దశరథరామయ్యగారి కూతురు."

"ధన్యుడను. అసలేవూరుట?"

"వాళ్ళదా?— తణుకు అనీ;—"

"తెలుసులెండి— సరే. అమ్మాయి పేరు?"

"పూర్వీ కళ్యాణి"

"అబ్బా! ఏదో రాగంలా ఉందే! వినిపించని రాగాలే; అనిపించని అందాలే; కలలో ఎవరో పిలిచే!"— ఓహో!"

"అవును! రాగమే, వాళ్ళ నాన్నగారికి సంగీతం యిష్టం. పూర్వీ కళ్యాణి రాగం బాగా ఆలాపన చేసిన నాడు ఈమె పుట్టిందిట— ఆ పేరెట్టారు"

"ఆహా!....పూర్వీ....కల్యాణి— పూర్తి పేరు పిలవాలంటే పూరీ కల్యాణి అని వచ్చేస్తుంది— కల్యాణి అని పిల్చుకోవచ్చు.... నా కిది సరి పోర్తి పేరు మేష్టారూ. ఈ పేరు గల అమ్మాయి మనకెక్కడా తగల్లేదు....

పరీక్ నో సబ్‌స్టిట్యూట్ ఫర్ వాటర్ అన్నట్టుగా; కల్యాణికి కల్యాణే సాటి బొంబాయిలో అయినాసరే; మరెక్కడేనా సరే !.... సరె- ఫర్దర్ ?"

"అంటె ?"

"ఏ ఇయరు? ఎక్కడుంటుంది అవన్నీ చెప్పండి మరీ."

"ఇంకా ఇక్కడ జాయిన్ కాలేదు"

"హరి హరీ! మా వూరి సినిమా హాల్సులో మంచి సినిమాల్లాగ త్వరలొ వస్తున్నది- అని రాసుకోమంటారా?"

"ఎన్నాళ్ళో అవదు. గుంటూర్లో రెండేళ్ళు చదివింది. ఇక్కడికి ట్రాన్స్ ఫర్ చేయించడానికి ఏర్పాట్లయ్యాయి. గవర్నమెంటు ఆర్డరు వచ్చేసింది. ఇంక జాయిన్ అవడమే తరవాయి."

"మరీ మంచిది- స్టేషన్లో దిగగానే మనమే వెళ్ళి స్వాగతం- సుస్వాగతం జయహో- అని చెప్పొచ్చు."

"ఈ వూళ్ళో దొండపర్తిలో వాళ్ళ చిన్నాన్నగారు డాక్టరు. అక్కడ పుటప్ చేస్తుంది."

"కనీసం వారితో పరిచయం చేయండి ప్రస్తుతం. ఆ తరవాతైతే మనం ఏదో అ అమ్మాయికోసం పరిచయం చేసుకున్నాం అనుకొంటాడు"

"ఆయనలా అనుకోడు"

"అనుకోడు కాబట్టే పూర్వి కల్యాణి ఈ ఊరొస్తోంది. నాకు చెప్పకండి."

"ఇలా వెకిలిగా మాట్లాడితే రెండురోజుల్లో చాలించుకుంటుంది."

"అదంతా నే చూసుకుంటానుగా.... మన్ని వెకిలి అనడానికి చాలాసేపు మూతులు బిగించుక్కూచోవాలి మేష్టారూ."

o o o

"మోసం మేష్టారూ, మోసం!"

"అదేం?"

"కల్యాణీ లేదు ఖమాసూ లేదు థర్డియర్‌లో ఎవరూ కొత్తమ్మాయి జాయిన్ కాలేదుట. రోజూ మెడికల్ కాలేజీకి వెళ్ళిరావడం అవుతోంది."

"అప్పుడే యన్‌క్వైరీ ప్రారంభించేవా ?.... అయితే నా ఉత్తరం అందలేదన్నమాట ?"

"ఉత్తరమా ? అదేమని ?"

"కల్యాణికి టైఫాయిడ్, - నెలరోజుల్దాకా రాదు."

"అరె! వాచే బాడ్ న్యూస్!"

"లెటర్ నీకు పోస్టుచేసి మూడురోజులు దాటిందే !.... ఎప్పుడూ రాయనివాణ్ని నీకు కదా అని ఉత్తరం రాస్తే అది కాస్తా మిస్ అయిపోయిందా ?"

"అదేలెండి. ఎప్పుడూ రాయడం అలవాట్లేదు కదూ. ఎడ్రస్ రాయడం మరచిపోయుంటారు."

"అది కాదయ్యా, రీసెంట్‌గా- అదే మొన్న నీతో మాటాడి వెళ్ళేక ఆయన ఉత్తరం రాసేరు."

"ఎవరు?"

"అదే- దశరథరామయ్యగారు"

"ఆయనెవరు బాబూ, నా పీకలమీదికి? ఏదేనా కోర్టుపని మీద గట్రా విశాఖపట్నానికి తగులడుతున్నాడా యేం?"

"అంతా తొందరే! మనిషి ఎవరో ఊహించకండా కామెంట్లు-"

"ఆగండాగండి....దశరథరామయ్య కొంపదీసి పూర్వి కల్యాణి ఆలపనా మరుడు కాడుగదా-"

"ఎగ్జాక్లీ- ఈ మాత్రం జ్ఞాపకశక్తి నీ కింకా మిగిలి వున్నందుకు నీ పరీక్ష ఫెయిలవ్వకుండా వొడ్డెక్క వచ్చునే!"

"ఇది స్పెషల్ కేసు- అందుకనిలెండి; జ్ఞాపకం.........ఇంతకీ ఏమని రాసేరు?"

"ఆఁ మా అమ్మాయి వైజాగులో చదవడానికొస్తోంది; కాస్త యెర్రగా బుర్రగా వున్నవాణ్నెవర్నైనా చూసి పెట్టమని రాసేరు"

"పెళ్ళికే ?"

"కాకపోతే లవర్‌గా వుండటానికనుకున్నావా"

"ప్చ్! ఈ రిటైర్డు ఆఫీసర్లున్నారే- ప్రపంచం అందర్నీ రిటైర్ చేసి ఎలాగో సెటిల్ చేసేద్దాం అనుకుంటూ వుంటారు గాబోలు."

"ఇందులో తప్పేమిటన్నాడోయ్"

"తప్పా తప్పున్నరా ? థర్డియర్ మెడిసన్ చదివే అమ్మాయికి పెళ్ళేమిటండీ- కనీసం హౌస్సర్జన్సీ అయినా పూర్తికాందే ఈ అర్జన్సీ ఎందుకండి?"

"సరే ఆయన ఉత్తరంలో రాసేడు- పూర్వీకల్యాణికి జరం; టైఫాయి డంటున్నారు, అంచేత ఇలా నెల్లాళ్ళు పోయేదాకా పై జాగు రాలేదు" అంటూను, చివర్ని "ఎవరేనా కుర్రాడుంటే ఊరికే పోనివ్వకు-"

"వెంటనే రాసెయ్యలేకపోయారా; ఇక్కడ మనవాడొకడున్నాడు; పరిచయం అయినవాళ్ళనెవ్వర్నీ ఊరికే పోనివ్వడు అలా అని—?"

"ఆ మాటే రాసేద్దాం అనుకున్నా, కాని అతికేచోట తెంపడం దేనికని ఊరుకున్నాను."

"అదేమిటండోయి అతుకు అంటున్నారు. అతుకంటే నాకు బితుకు- కనక మీరు మరో కుర్రాణ్ని వెతుకుతే నా బతుకేదో నేను బ్రతుకుతాను"

"మరి మొన్న, అమ్మాయిని జాగర్తగా చూసుకుంటానని చేతుల్లో చెయ్యి వేసేవు కదోయ్"

"అంటే సోదరీ ప్రేమతో చూడమనికదా మీ ఉద్దేశం?"

"సర్లే- బండి మళ్ళా మొదటికొచ్చింది........"

o o o

"ఈ అమ్మాయి కాక ఒక అబ్బాయి అతను మిలిట్రీ ఆఫీసర్."

"వేరీ గుడ్."

"పదివేలు కట్నం యిస్తారు"

"లాభంలేదు మేషారూ, కట్నం ఔట్ డేటయిపోయింది. అది మీ తరవ ఫేషను."

"ఎవరి కర్మకెవరు కర్తలు?"

"అసలు కట్నాలు ఆఫర్ చెయ్యకుండా- ఏదేనా జాబ్ యిప్పిస్తామనో, మరెలాగో ప్రారంభించాలి, ఈ వరుడు కోసం వేట-"

"ఆ! జాబ్ యిప్పించవలసిందే! పరీక్షలు ఫెయిలవుతున్నావు గనక ట్రెజరీలో యల్. డి. సీగా వేయించగలడు."

"అది కాదు మేష్టారూ, మరీ మా అన్నయ్యలా మాట్లాడతారేం? పరీక్ష పాసవగానే జాబ్ వస్తుందన్న షూర్టీ వుంటే తలుచుకున్న వెంటనే పాసం లేనూ ?"

"అవుతావు అవుతావు! కాని నీకు పరీక్షల్ని తల్చుకోడానికి తీరుబాటేదీ? ఎంతసేపూ-"

ఘాటైన ప్రొటెస్టు చేస్తాడని ఆగాను. అతను ప్రొటెస్టు చెయ్యలేదు సిగరెట్టు ఘాటుగా రెండు దమ్ములు లాగి “....సరేలెండి.... నే నిందాకే చెప్పేను; మీ తరవాత మా అన్నయ్య వాసన వేస్తున్నారని.” అన్నాడు.

ఆ మాట నాకు గట్టిగా తగిలింది— ఊరుకున్నాను.

“ఎజుకేషన్లో, సివిలిజేషన్లో; పోనీ ఎజుకేషనల్ సివిలిజేషన్లో మీ తరానికి ఎంతో తేడా యేర్పడింది మేష్టారూ— మీ టైమ్‌లో అదే బ్రిటిష్‌వాడు దేశం నుంచి వెళ్ళిపోయిన తొలి పదేళ్ళలో అనుకోండి. జాబ్స్‌కి ఇంటలిజెన్స్, ఇండస్ట్రీ వున్న యెంగ్మెన్ యెంత మంది వున్నా చాలేవారు కాదు. ఇంకా కావలసి వచ్చేరు. అంచేత చదువైపోతే యేం చేద్దాం అన్న ప్రాబ్లెం లేదు మీకు. మాకు అలాకాదు. క్రమంగా పాపులేషన్ పెరిగింది. ఎజికేషన్ అందరికీ అందుబాట్లోకొచ్చి ప్రతివాడూ ప్రతి జాబ్‌కి క్వాలిఫై అయ్యాడు. చిన్న చిన్న వుద్యోగాలు రేడీస్ చెయ్యగల్గుతున్నారు. దాంతో చిన్న ఉద్యోగానిక్కూడా ఎక్కువ క్వాలిఫికేషన్సున్న జీనియస్‌లు సిద్ధపడవలసి వస్తున్నాది. అందుకని బాగా చదువుకుందాం; ప్రాస్పర్ అవుదాం అన్న తపన ఒక స్టేజిలో అనవసరపు వేదన అయిపోతోంది. చదువుమీద పెట్టుబడిగా ఉపయోగించిన తెలివికీ పరిశ్రమకీ తగిన ప్రతిఫలం జీవితంలో లభ్యంకావడంలేదు. అందుచేత ఏవరేజి స్టూడెంటు ఏవో 4 మార్కులు ఎక్కువ వస్తే మంచిదికదా అని ప్రూడెంట్‌గా చదువుతున్నాడే తప్ప, నిజమైన ఇంటలిజెంట్ స్టూడెంట్‌కి స్ట్రగుల్ కావలసినంత అవసరమూ లేదు; దానికి తగిన ఆకర్షణలూ లేవు.”

“ఆ పరిస్థితుల్లో మీ తరంవారు మరింత బాగా చదువుకుని, మరింత శ్రమపడి కాంపిటిటివ్ స్పిరిట్‌లో పని చేయాలి కదా. నువ్వు చెప్పిందాని ప్రకారం మా కాలంలో “డూయింగ్ వెల్” సరిపోయేది. మీకు అది వర్తించక “డూయింగ్ బెటర్ దాన్ అదర్స్” అవసరం వస్తోంది కదా!”

“సరే— అలా వుంచండి. మీ టైమ్‌లో హిస్టరీ, జాగర్ఫీ, తగుమాత్రం పొలిటికల్ కాన్షస్‌నెస్సు ఉంటే చాలు; స్మార్ట్‌గా వుండడం సాధ్యపడిపోయేది. మాకు అలా లేదు— కామన్‌సెన్సే కాకుండా కామన్‌నాన్సెన్స్‌లో కూడా ప్రవేశం ఉండాలి. సబ్జెక్ట్‌లోనే కాక పై సెస్‌లో కూడా చెయ్యి ముంచి తియ్యవలసి వస్తోంది. లేకపోతే వీడుత్త ఫూల్, స్టుపిడు, నిన్కంపూప్— అనేస్తారు కొలీగ్స్!”

నాకు భాస్కరం ఆర్గుమెంటు నచ్చలేదు. అతను తల్చుకుంటే వాళ్ళన్నయ్యకూడా యిలాగే చెప్పేస్తాడు. వాళ్ళన్నయ్యా నీ చదువుకీ నాకూ సంబంధంలేదు పో అంటే మరుచటి రోజు యితను దశరథరామయ్యలాంటి వాడెవరి దగ్గిరో సాష్టాంగపడి యల్.డీ.సీ. జాబ్‌కి కూడా తన్ను తాను హీన పర్చుకొని ఆశ్రయించవలసిందే. అప్పుడు అతను కూడా "వెనకాల ఏమీలేని వాడు" అని యితన్ని ఆదరించకపోవచ్చునేమో.

అందుచేత నే నతన్ని చెక్ చెయ్యదల్చుకోలేదు.

o o o

నిజంగా భాస్కరానికి ఇది దురదృష్ట దశ. ఏలినాటి శని ఏడేళ్ళన్నట్టుకి అతనికి ఈ శని కొన్ని నెలలుంటుందేమో అతనికి కావలసిందేమిటి?- మినిమమ్ ఒక్కర్తయినా గర్ల్‌ఫ్రెండు. అతని కబుర్లు వినాలి. అతన్తో గంటల తరబడి మాట్లాడుతూ యెదురుగుండా కూచోవాలి. మధ్య మధ్య భోజనాలూ, కాఫీలూ ఏవి అవసరం అయితే అవీ - వాటంతట అవి వొచ్చి వాలాలి. చదువెలా సాగుతోందని గాని, డబ్బు ఎక్కణ్ణుంచి వస్తోందని గాని ఎవరూ అడగరాదు. ఇదంతా ఈ ప్రకారం జరగాలంటే చాలా అదృష్టమే కాక; మిగతా ప్రపంచానికి చాలా వోర్పు వుండాలి. జరగడం లేదు! అందుకే ఇది దురదృష్ట దశ అన్నాను.

మొన్నటిదాకా నిర్మలవుండేది.వాళ్ళమ్మ రిటైర్డుడి.యీ.వో.బంగళాఅంత కొంపలో వాళ్ళద్దరే ఉండేవాళ్లు.నిర్మలకి యితనంటేనూవాళ్ళమ్మకి నిర్మలంటేనూ భూతద్దంలోంచి చూసినా తప్పుకనిపించనంతఆరాధనాభిమానాల చత్వారం.చివరికి ఇరవై నాలుగ్గంటలూ చదువూ సంధ్యా మానుకుని నిర్మల భాస్కరాని కెదురుగా కూచుంటే కూడా, ఆవిడ భాస్కరాన్నే కోప్పడ్డది కూతుర్నికాక. యెక్కణ్ణుంచొచ్చాయో, భాస్కరానికి కష్టాలు. నలభై ఏళ్ళనించీ బెంగాల్‌లోనే ఉండి పోయిన రంగమ్మగారి అన్నగారి రూపంలో కొన్ని; ఫారిన్ వెళ్ళొచ్చిన ఆయన కొడుకు రూపంలో మరికొన్నీ వచ్చేయి. సరీగా సమయానికి నిర్మల యం. ఏ. అనిపించుకుంది, దాంతో రంగమ్మగారు ముకాం కలకత్తాకు మార్చేసింది.

అంతకుముందు; ఇంకా అంతకుముందు; మరికొంతముందు; అసలు మొట్టమొదట కూడా భాస్కరానికి అతన్ని మెచ్చేవాళ్ళు, వాళ్ళకి వాళ్ళని మెచ్చే వాళ్ళవాళ్ళు - ఉంటూనే వొచ్చారు. అతని ఎడ్యుకేషనంతా కో ఎడ్యుకేషనే. చదువెలాగయినా వస్తుందోయ్ సౌందర్యాస్వాదన ఎలాగబ్బుతుంది -

అన్న ఏక్సాలో పడి; కో ఎడ్యుకేషన్ కాంది అసలు ఎడ్యుకేషన్ కాదన్న లెక్కకి వచ్చేరాను.

ఇప్పుడు- ఒంటరి అయిపోయాడు. భయపడిపోయాడు. ఒంటరితనం లోంచి న్యూనత, దుర్మార్గం; పాపం యివన్నీ పుట్టుకువస్తాయని వులిక్కిపడు తున్నాడు. ఎక్కడ కాలు జారుతుందోనని బెదరిపోతున్నాడు, యిదివరకు జార లేదని కాదు. అప్పుడంతా జారిన కాళ్ళు యితనివి కావు.

సరే.... .... దొండపర్తి తీసుకువెళ్ళాను. ఆవేళ డాక్టర్ కృష్ణమూర్తి గారి భార్య ఊరెడుతూ పొద్దుట కనిపించింది. కృష్ణమూర్తిగారు మూడు గంట లకి బయల్దేరి రౌండ్స్‌కి వెళతాడుగా. అందుకని మూడుంపావుకి మేం అక్కడే ఉండేటట్టూ ఏర్పాటు చేసేను. దూరంనించే మూసున్నతలుపు చూపించి "అదుగో అదే వాళ్ళిల్లు. వాళ్ళెవరూ లేనట్టున్నారు" అన్నాను డిజప్పాయింట్ మెంట్ నటిస్తూ. "కల్యాణి ఈ వూరొస్తే ఇక్కడే వుంటుందిగా. మీరు విరివిగా కలుసు కోవచ్చు." అన్నాను మళ్ళీ అందులోనే ధైర్యం వొలకబోస్తూ.

చాలా నిరుత్సాహపడ్డాడు. "మీరు లేనప్పుడుకూడా నేను రాగలననుకోండి. అయినా మీరు ఇంట్రడ్యూస్ చేసిందానికీ దానికీ తేడావుంది కదా" అన్నాడు భాస్కరం,

ఆ పాయింట్ నేననుకున్నదే. నాకు నచ్చింది. ఎటువంటి వాళ్ళనైనా తానుగా వెళ్ళి పలకరించి పరిచయం చేసుకొని పది నిముషాల్లో తనవార్ని చేసుకోగల కుర్రాడు ఇలా అనడం నాకెంతో గర్వకారణమైంది.

ఆ పైవారం అతని రూమ్‌లో వుండగా నిద్రొచ్చింది. లేచి మొహం కడు క్కోడానికి వెళ్ళొచ్చి చిప్పాను. జేబులోంచి పడ్డ కాగితాల్లోనించి ఫోటో తీసి చూస్తున్నాడు భాస్కరం. ఆ ఫోటోలో అమ్మాయికి మొహంలేదు.అంటే, ఫోటో పేపరు పైపొర చిరిగిపోయింది; మొహం దగ్గర.

"ఎవరిదండీ యీ ఫొటో!"

"అదే; అయమ్ సారీ- దానికో చిన్న యాక్సిడెంట్ అయింది. ఈమాటు మంచిది తెస్తాను"

"పూర్వి కల్యాణిగారిదేనా?"

గారు అనడం; అందులో నాదగ్గిర - యిదే మొదలు ఈ మార్పుకూడా

నాకు నచ్చింది. నేను ఇంట్రడ్యూస్ చేస్తున్న కేండిడేట్ అనే కారణం వల్ల కాక పోయి కూడా వుండవచ్చును.

అవునయ్యా ఈ ఉదయం పాత కాగితాలు తీస్తూవుంటే ఈ ఫొటో కన బడ్డాది. ఇది ఆ అమ్మాయి ఇంటర్ కాలేజియేట్ మ్యూజిక్ కాంపటీషన్లో గెల్చి నప్పుడు వాళ్ళ మేగజైనులో వెయ్యడానికి తీసింది. అప్పుడు ఆయన ఈఊళ్లోనే ట్రెజరీ అఫీసర్‌గా ఉండేవాడు. కుటుంబంతో అనకాపిల్లి క్యాంపు వస్తేను. అక్కడ తీయించారు. వెధవది - ఇందాక జేబులో స్టాంపులు పెట్టుకున్నాను; అందులో ఒకటి సరిగ్గా ఆ ఫొటోమీద అతుక్కుపోయింది. గట్టిగా ఊడదీసే సరికి పొర లేచొచ్చేసింది.—" అని కథంతా చెప్పేను.

"ఇంటి దగ్గిర జేబులో వేసుకురాడం నా కిద్దామనేనా?"

"అవును."

".... ఏం చేస్తాం, నాకా అదృష్టం లేదు."

అయిదేళ్ళుగా అతనామాట అనడం నేను విన్లేదు. అతని స్వాతిశయం తగ్గించ గలుగుతున్నానని" ఆనందంతోబాటు అతని పట్టువదలని ఆత్మ విశ్వా సాన్ని పోగొడ్తున్నానేమో అని భయంకూడా వేసింది..... .... ఏ మాత్రం దిగినా దిగాడే - అని మింగేసి ఊరుకున్నాను.

ఆ మరుసటి వారం వైజాగ్ వెళ్ళినప్పుడు "ఈ ఉత్తరం చదువు. దీంట్లో నీకు కొంత ఇంటరెస్ట్ కలిగించే మేటర్ వుంది" అన్నాను,

ఆడపిల్ల దస్తూరీ: మధ్యలో ఎక్కడో తన పేరు; ఆ కాగితం చూసీ చూడగానే భాస్కరానికి కనబడిపోయాయి. వెంటనే - తన్నాన నన్ననన్నాం అంటూ దేవగాంధారి రాగంతో ఆ వచనం చదవడ ప్రారంభించేడు.—

"మొన్న - మా కాలేజీ మెన్స్ హాస్టలు వాళ్ళు వైజాగ్‌నించి ఎవరో లిట్రేచర్ ఎమ్మే అబ్బాయి భాస్కరంగారుట—అతన్ని మిమిక్రీ కోసం పాటలు పాడ్డం కోసం పిలిపించేరు. అతని పెర్ఫార్మెన్స్ ఎంతో బాగుంది. నిజానికి అది మెన్స్ హాస్టల్ వాళ్ళ ఫంక్షనే అయినా మాలో చాలామందికిఇన్విటేషన్లొచ్చాయి. నాకు రాకపోయినా ఎలాగో వెళ్ళేను. ప్రోగ్రాం చాలా థ్రిల్లింగ్‌గా వుంది. నాన్నతో చెప్తే ఆ భాస్కరంగారు నీకు బాగా తెలుసునని చెప్పేరు. నేను వైజాగు వచ్చేవరకు ఆయన అక్కడే వుంటారా? ఉంటే నాకు తప్పకుండా యింట్రడ్యూస్ చెయ్యి."

అంతవరకు చదవగానే ఆ ఉత్తరం లాగేశాను "మిగిలింది ఏదో ఫామిలీ వ్యవహారం" అన్నాను.

"ఐసీ-ఎవరు రాశారో చెప్పండి మరి-" అన్నాడు చిరునవ్వు దాచుకోలేంతా భాస్కరం.

"ఇంకెవరయ్యా మహానుభావా! పూర్వీ కల్యాణి" అని ఇన్లాండు కవరు మడతపెట్టి ఫ్రమ్ ఎడ్రస్ చూపించేను. "టి. పి. కల్యాణి థర్డ్ ఎం. బి. బి. ఎస్."

సంతోషంగా నిట్టూర్చాడు భాస్కరం. "గుంటూరు వెళ్ళినపుడు పూర్వీ కల్యాణిగార్ని కలవపుదామని చాలా ట్రై చేసేనండీ. కాని వుమెన్స్ హాస్టల నించి వచ్చిన ఇన్‌వైటీస్ లిస్ట్‌లో ఆవిడ పేరు లేదు. ఒకబ్బాయి నడిగితే ఆవిడ హాస్టల్లో లేరు-అన్నాడు. మరి కొంతమందిని అడిగాను: పూర్వీ కల్యాణి గార్ని తెలుసా; అని. సరైన రెస్పాన్స్ రాలేదు........ అక్కడి వాళ్ళకి అంత చైతన్యం లేదు లెండి. అమ్మాయిల నామినల్ రోల్ కంఠస్థం రాకపోతే మరెందుకండి!....అయినా మనం ఆ ఊరెళ్ళి అక్కడి వాళ్ళని ఏమిఅంటాం! ఏదో వచ్చేశాను- ఎనీవే ఆవిడ లక్కీగానా ప్రోగ్రాంకి వచ్చేరు. దట్స్ వెరీ గుడ్."

"లక్కీగా - అంటే - ఎవరిది లక్కంటావు?" అన్నాను పెంకెతనంగా!

"ఇద్దరిదీ ననుకోండి -" అని కాంప్రమైజ్ అయ్యాడు భాస్కర్. అది కూడా గమనించేను,

ఇంక చాలు - అనుకున్నాను; నాలో నేనే నవ్వుకొని.

*           *           *

తరువాత రెండు నెలలు భాస్కరం దగ్గిరికి వెళ్ళడం పడ్లేదు. ఆర్.డి వో. గారు మా ఆఫీసు ఇనస్పెక్షన్ చేయడం; మినిస్టర్స్ టూర్స్ కోసం ఏవేవో వివరాలు సేకరించి ఏర్పాట్లు చేయించడం - ఇలా ఏటో రొటీన్లో ముఖ్యమైన పన్లు పడ్డాయి. ఓ సారి జీపులో విశాఖపట్నం వెళ్ళినా- భాస్కరం రూమ్‌కి వెళ్ళడానికి కుదర్లేదు. కలెక్టర్ ఆఫీసులో పని ముగించుకొని వెంటనే అనకాపల్లి వెళ్ళిపోయాం.

అవకాశం వున్నా వెళ్ళాలని లేక వో పదిహేను రోజులు ఊరుకున్నాను. [illegible] చేసేను కదా. అది భాస్కరంమీద పనిచెయ్యాలి.

కొన్నాళ్ళు విరహంగా; కొన్నాళ్లు పూర్వి కల్యాణి ఆరాధనగా చివరికి అన్వేషణగా పని చేసి పరిణామం చెందాలని; చివరికి ఆటంబాంబు నొక్కసారిగా వేసి డిజిల్యూషన్మెంట్ కల్పింతామని నా స్కీము.

"పూర్వి కల్యాణి మంచి ఇంపైన రాగము. ఎవరినైనా అడిగి బాణీ ప్రాక్టీస్ చెయ్యి. ముందు ముందు పనికొస్తుంది" అన్నాను వొకసారి అతనితో.

"శాస్త్రీయ సంగీతమే - అమ్మ బాబోయ్!" అన్నాడు.

నేను మాయాబజార్లో శ్రీకృష్ణుడి లాగ నవ్వుతూ "అది నీకు శాస్త్రీయ సంగీతం ఎలా అవుతుంది? స్త్రీయ సంగీతం కదా!" అన్నాను.

"ఎగ్రీడ్!" అన్నాడు.

ఆ దర్పం విరగ్గొట్టాలంటే; ముందు దాన్ని పెరగనివ్వాలి. (పెరుగుట విరుగుట కొరకు కదా. మరి!) పెరగాలంటే అతనికి; దాన్ని పెంచుకోడానికి టైమ్ యివ్వాలి.

టైమ్ నేను వేరే యివ్వక్కర్లేకుండా, దానంతటదే ఏర్పాటైంది.

* * *

డిపార్ట్మెంటల్ గండాలన్నీ గడిచి, మెంటల్ గండాల్లో, సమస్యల్లో భాస్కరం వొకడు. అతన్ని భారతదేశానికి పాలనా రంగంలో పనికి వచ్చే ఉత్కృష్ట పౌరుడిగా కాకపోయినా సామాన్యమైన బాధ్యతగల పౌరుడిగా చేయగలిగితే చాలు. సెన్సువల్ నాన్సెన్సులోంచి సెన్సులోకి లాగగలిగితే అదే పదివేలు.

వైజాగ్ వెళ్ళేను రూమ్‌లో భాస్కరం లేడు. "ఇప్పుడే వెళ్ళేడు బాబూ" అన్నది కిందని కాపలా వుండే ముసలమ్మ. ఎవరెవరు వెళ్ళేరని అడిగాను. "ఎవరో అడకూతురుతో సేతులు గలుపుకొని యెల్లా"డంది. నా గుండెల్లో రాయిపడ్డాది.

రెండు నెలలు నేను రాకపోవడం వల్ల పూర్వి కల్యాణిని మర్చిపోయి ఎవరో కొత్తహీరోయిన్ని సంపాదించేసేడు. నా ఊహా నిర్మితరాగ ప్రసారం అంతా కీచురాయి పాటగా మిగిలిపోయింది.

అతన్ని చూడాలి.

సినిమాల సైన్ బోర్డులు చూసేను. లీలామహల్లో ఏదో డోరిస్ డే-టోనీ కర్టిస్ కాంబినేషన్ ఉంది. అక్కడ తప్పకుండా ఉంటాడు, ఇంకా టైముంది.

* * *

బాల్కనీలో వున్నాడు భాస్కరం. ఆ అమ్మాయితో సరదాగా కబుర్లు చెబుతూ; షోగ్గా పాపకార్న్ కొరుకుతూ; సిగరెట్ కాల్చలేక పోతున్నాననే అన్న దిగులు వొదలని చిరునవ్వు మొహంతో ముందుకి వొంగి కూర్చున్నాడు. చరచర అతని పక్కకి వెళ్ళాను.

నన్ను చూడగానే భాస్కరం మొహం విప్పారింది. "మామూలు ప్రిగల్భమే" అనుకున్నాను. "చూసేవా; కొత్త పిట్టని పట్టేను - అన్న దర్పం అని లోపల పీదరించుకున్నాను....పైకి ఆ అమ్మాయి దగ్గర ఎట్లా? నేనేమన్నా భాస్కరం పెద్దన్నయ్యనా?

"మీట్ మిస్ పంచకల్యాణి" అన్నాడు; నాతో అరక్షణంసేపు ఆమె వేపు తిరిగి చిరునవ్వుతో "అదే, మిస్ పూర్వీ కల్యాణి" అన్నాడు. ఆమె అందంగా నవ్వింది.

"అయామ్ సూరిబాబు" అన్నాను నవ్వుతో నమస్కారం చేస్తూ.

"అనకాపిల్లి తాలూకాఫీసులో డిప్యూటీ తాసిల్దార్" అని భాస్కరం నన్ను పరిచయం చేసేడు. "మా ఫేమిలీ ఫ్రెండు. వెల్ విషర్....నాకు మిమిక్రీకి అప్పుడప్పుడు మెటీరియల్ సప్లయి చేస్తూవుంటారు...."

"అయామ్ గ్లాట్టు సీ యు" అన్నదామె;

"మి టూ" అన్నాను.

మరునిమిషం ఎవరం మాట్లాలేదు.

"అయిందా? ఇప్పుడు చెప్పండి. మీ యిద్దర్లో ఎవరో అబద్ధాలాడేరు. నాతోటి" అని భాస్కరం కుర్చీలో వెనక్కి చారబడ్డాడు.

నేనూ, నేను సృష్టించని పూర్వీ కల్యాణీ ఎదురుగా, దగ్గిరగా అయిపోయాం.

"ఆవిడ మిమ్మల్నెపుడూ యెరగనంటోంది. మీరేమో ఆవిడ మీకు రాసిన ఉత్తరాలు చూపిస్తున్నారు, ఇందులో ఏదో మాయ వుంది" అన్నాడు భాస్కరం.

నేనబద్ధాలాడేనని, అతని సౌందర్య పిపాసమీద డర్టీ ట్రిక్ ప్లే చేసేనని, ఖచ్చితంగా అనడంలేదు భాస్కరం. నా కదే సంతోషంగా వుంది. నా ఎమ్యూజ్మెంటుని అతను డిస్టర్బ్ చెయ్యలేదు అతని "వేట" ఆగకపోయినా నాకేం పెద్ద యిబ్బందిలేదు——

*　　　*　　　*

మీ రబద్ధాలాడేరని నే నెప్పుడో కనిపెట్టేను గురూ గారూ! ఫొటో పొటకి స్టాంపు అతుక్కొని ఊడిపోడం: డాక్టరుగారింటికి నన్ను సరిగ్గా వాళ్ళ

లేనప్పుడే తీసుకువెళ్ళడం- ఇలాంటివి మొదట సరిగా తెలియలేదనుకోండి; క్రమంగా ఆలోచిస్తే బోధపడిపోయాయి.

"అయితే ఇందులో యెక్కడో ఏదో కొంత నిజం వుందని నాకు ఇన్ ట్యూషన్ చెప్పింది........ అంతా కల్పించి చెప్పడానికి వీలుగాలేదని తట్టింది పనీపాటలూలేక తిరిగేబదులు ఇన్వెస్టిగేట్ చేదామని బయల్దేరాను- ట్రెజరీ ఆఫీసుకి వెళ్ళి రిటైరై పోయిన దశరథరామయ్యగారు ఎక్కడుంటారని అడిగీ అడగ్గానే; అతివినయంగా వొక గుమస్తాగారు; చేస్తూ చేస్తూవున్న పని ఎవరికో వొప్పగించి నా వెంట వీళ్ళింటి కొచ్చేడు. ఆయన రిటైరవలేదని ఆఫీసు మెట్లు దిగుతూ వుండగానే తెలిసింది.

"దశరథరామయ్యగారికి ఒక కూతురూ ఒక కొడుకూ, కరక్టు. కూతురు పంచకల్యాణి- మీకే డీటేల్సు ఎలా తెలుసును? ఆయన్ని అడిగాను; "డిప్యూటీ తాసిల్దార్ సూరిబాబు తెలుసా" అని. ఉఁహూ....అప్పుడు గెస్ చేసేను. పూర్వం ఆయనెక్కడో. మీకు తాసిల్దార్‌గా తటస్థపడివుంటారు. ఉరమరికగా పిల్లల గురించి తెలుసు-

"ఆయనకిగాని ఈ అమ్మాయికి గాని మీ రెవరో తెలీకుండా నీళ్ళ పేస్టు తెలుసుకోవడం కష్టం. ఐ కం గ్రాచులేట్ యు కాని ఎలా గెస్ చేసేరు?" అన్నాడు భాస్కరం,

"మీ ప్రశ్నకు సమాధానం చెప్పేను; మీ పరిచయానికి వున్న బేక్ గ్రౌండూ ఫ్యూచరూ తెలిస్తేతప్ప!" అన్నారు, నేను ఉడుక్కొని వుండాలి.

"బలేవారే- మా అమ్మను రాజమండ్రి నుంచి రప్పించి పునాది డైలాగ్స్ పడేవరకు ఈ అమ్మాయిని నాకు పరిచయమే చెయ్యలేదు; దశరథరాములవారు- ఏకపత్నీవ్రతుడే కాక- ఏక జామాతావ్రతులు; అన్నాడు భాస్కరం ఆమెవేపు కొంటెగా నవ్వుతూ.

"పోనిద్దురూ; మీకు మరీనూ!" అన్నట్టు మొహం పెట్టిందా అమ్మాయి.

"అలా అయితే నా గమన శ్రమ ఫలించినట్లే" అన్నాను,

"ఏమిటేమిటీ -గమన-శ్రమా? అదేమిటది?" అన్నాడు భాస్కరం కంగారు పడుతూ.

"అదేలే—పూర్వి కల్యాణీ మరో పేరు." అన్నాను.

సినిమా మొదలయింది.

—o—

(ఆంధ్రజ్యోతి వీక్లీ; జనవరి 1969)

# మిస్టేక్

“డర్టీ న్యూసెన్స్!” అని పైకే విసుక్కుంది శ్యామల. అప్పటికింకా శేఖరం గుమ్మందాటి వుండడు.

మూడు రోజుల్నుంచీ శేఖరాన్నెలా గయినా హర్ట్ చెయ్యాలనుంది.

అతను తల్చుకొంటే తనకి రాబోయే అప్రతిష్ఠని ఒచ్చేసిన ఆపదనీ “ఏమీ లేదు పో”మ్మని తీసి అవతల పారెయ్యగలడు. అలా అతను చెయ్యడని ఖచ్చితంగా తెలిసేవరకు అతని అవసరం చాలా ఉంది తనకి.

అయినా సరే తను బాధపడ్డానికతనే కారణం అన్న సంగతి పదే పదే మనసులో మెదుల్తోంది. మనసంతా అదే ఆలోచన.

ఒక్క తెలివి తక్కువ పని; శాశ్వతమైన ముద్ర.

అతనికి శిక్ష లేదు; సరికదా. కొంచెం బాధకూడా లేదు, తనని ఆపదలో ముంచేడు. అనుమానం చేసేడు. ఫూల్ చేసేడు....హర్ట్ చేస్తున్నాడు. ఇది చాలా అన్యాయం. తననింత చిక్కుల్లో పెట్టినందుకు అతన్ని గట్టిగా ఒకదెబ్బ కొట్టడానికీ, ఘాటుగా కోప్పడడానికీ కూడా వీల్లేక పోవటం దారుణం....ఓపికుంటే ఓ ఏడుపు ఏడ్చి వూరుకోవచ్చు....

“అలా మూడీగా అయిపోకు శ్యామూ. మనం దీనికేదో సొల్యూషన్ ఆలోచిద్దాం” అంటాడు, ఆ అనేదేదో కమాండింగ్‌గా, డిమాండింగ్‌గా మొగవాళ్ళా అనడేం; తనకూడా ఏదో ప్రమాదం జరిగిపోయినట్టుగా మొహం దీనంగా పెడతాడేం!

“మనం తప్పకుండా పెళ్ళి చేసుకోగలం” ఎప్పట్నుంచో అంటున్నాడు మరి అలా గిల్టీగా పెడతాడేం, మొహమూ గొంతుకా?....నిన్ననొకసారి అనిపించింది; ఈ అపసవ్యంపల్లి పిరికివాణ్ని కొసాకీ మెడకి తగిలించుకోడం కంటే ఈ తెలివి తక్కువ వ్యవహారం ఇక్కడితో మరచిపోయి....కొత్త బతుకు వెతుక్కుంటే మంచిదేమోనని.

“సొల్యూషన్” ఆలోచిస్తానంటాడు. తన మనస్సులో ఆలోచనని పసి

గట్టినట్టు. "ఇదేదో ముదరకుండా చూసుకుందాం" అనేగా, అతనుద్దేశం !....
ఎంత దారుణం, ఎంత రాక్షసం,

అవును నిజమే. ఆ ఆలోచన ఇద్దరిలో మొదట తనకే వచ్చింది....
అయినా, ఎందుకో అతనిదే అన్యాయంలా వుంది. ఇందులోకూడా ఏదో మిస్టేక్
వుంది. తనకి అదే ఆలోచన కలిగినప్పుడు అది తనకి అవసరంలా తోచింది.
అదే అతనికి స్ఫురించగానే అందులో అతని స్వార్థం. ప్రయోజనం ఏదో
ఇమిడి వున్నట్టు అనుమానం పీడిస్తోంది.

బాగా చదువుకొన్నానని, సుళువుగా ఎవరిటోపీలోనూ పడనని తనకి
గర్వం. ఆ గర్వమే తన అహం. ఎత్తిన తల ఎత్తినట్టే వుంది. అహం దెబ్బ
తింది. అహర్నిశలూ భయపెట్టే సమస్య ఒచ్చిపడింది.

.........భయం.........

భయపడవలసిందేమీ లేదు. దీనిచుట్టూరా వున్న చీదరతప్ప.

ఆడదీ మగవాడూ ప్రేమించుకోడం సహజం; కలిసి తిరగటం సహజం.
ఇంటిమసీ కూడా సహజమే.... సుఖం వెనుక కష్టం వుంటుందంటారు. కష్టానికి
తను ఎప్పుడూ భయపడలేదు. రకరకాల ఆపదల్లోంచి దర్జాగా అందర్నీ ఎదిరించి
తప్పుకున్నది తను.

ఇది న్యూసెన్సు. చీదర, ఈ క్షుద్రాన్ని ఎదిరించి తప్పుకోడం కష్టంగా
వుంది.

## 2

"శేఖరం!"

రోడ్డవతల పదమూడో నెంబరు బస్సు కోసం పరుగెత్తుతున్నాడు.
శేఖరం. ఇవతల్నుంచి శ్యామల కేక.

బస్సు తప్పిపోయినవాడి మొహంపెట్టి యిటు తిరిగాడు శేఖరం.

అక్కడతను,

ఇక్కడ తను

శ్యామల అటువెళ్ళాలని ముందుకు వంగింది. కఠోరంగా హారన్
మ్రోగింపుకొంటూ అసహ్యంగా అడ్డం వచ్చింది జీపు పడిపోబోయి నిలదొక్కు-

మిస్టేక్

కుంది. ఆ [illegible] [illegible] రోడ్డుకు అటూ ఇటూ అరవై సెంకడ్లు ఎడబాసి వుండడం....చిరాగ్గావుంది. అతనెందుకు తనవేపు రాకూడదు; నిన్నటిదాకా అలా వచ్చినవాడేగా! ఇప్పటికిప్పుడు ఈ నిరుత్సాహం. ఈ పిరికితనం, పలాయన సూత్రం ఒకటేనా ఏమిటి?

కాదేమో?

ఔనేమో,

దర్టీ స్కౌండ్రెల్స్!.... వస్తే రానీ, పోతే పోనీ-అటు చూడకు. పిలవడం అయిందిగా.

వచ్చేడు.

రెండు చేతులూ పట్టుకున్నాడు. "నువ్విలాంటి పని ఎప్పుడూ చేయనని నాకు మాటివ్వాలి."....చప్పున విదిలించింది, చేతుల్ని. ఆహా! ఏం ఐడియా!.... సిలిచ్ క్రీచర్! నేనాత్మహత్య కోసం ప్రయత్నించనని మాటివ్వాలి....అంత బుద్ధిహీనురాల్నని అనుకుంటున్నాడా?—అనుకోవడమేమిటి, అంటున్నాడు.... ఆ మాత్రం అర్థం చేసుకోలేక పోయిన దానికి ఇన్నాళ్ళూ కలిసి తిరగడాలూ, ఈ స్నేహం, ఈ ఇంటిమసీ ఎందుకు?

ఆపదలు మనుషుల్లో మంచిని, ఔదార్యాన్ని, హృదయవైశాల్యాన్ని, ఎవతలి మనిషిని అర్థం చేసుకొనే సహృదయతని పెంచుతాయంటారు. నిజమేనా? వొకర్ని గూర్చి మరొకరు నీచంగా; హీనంగా నిందాత్మకంగా వూహించుకోడం నేర్పుతాయేమో!

నడక

నిశ్శబ్దం

"నేనంత పిరికిదాన్ననుకున్నావా?" "నేను నీ అంత విశ్వాసఘాతకురాల్ననుకున్నావా?" ఏమిటో, ఏదో ఘాటుగా అనాలిని. అతన్ని గాయపరచాలని వుంది....అడగలేకపోతున్నది. కసిగా వుంది....అతను చాలా లవబుల్‌గా బిహేవ్ చేస్తూ తనని గాయపర్చాడు.

"మీరూమ్‌కే వెళ్తున్నాను," నీరసంగా నవ్వాడు.

"నేను నీకోసమే బయల్దేరి వచ్చాను,"

శత్రువుల్లా పొడి పొడి పలంరింపులు . . "నిన్నటిదాకా వొకరి నొకరు పంచప్రాణాలుగా, కట్టుకున్న బట్టకంటె అపురూపంగా చూసుకొంటున్న

ప్రేయసీ ప్రియులం మేము!".... ఏకాంతం కావాలి....అక్కడ. చూపిస్తాను. తడాఖా....

"పద"

"పగోడా దగ్గిరికి" అలవాటైన కాళ్ళు అలవాటైన చోటికి తీసుకు వెళ్తున్నాయి. .. హఠాత్తుగా ఆగింది. శ్యాపుల, "నేనటువేపు రాను,

"ఏదేం!"

"అక్కడి ఆ బీచ్ రోడ్డున అంతా ఛండాలం, సభ్యత లేకుండా మొగాళ్ళు"

"ఒస్సి! మొగాళ్ళంటే ఇన్నాళ్ళూ లేని భయం" మాకరీతో జోడించి నట్టున్న నవ్వు.

"భయమా....?హుఁ! అసహ్యం!"

ఆమెకి అసహ్యం; అతనికి భయం.

"పోనీ ఇటు వెళ్దాం పద...."

"ఇటూ రాను."

"ఇదేమిటుంది? ఒహో; వుమెన్స్ హాస్టలా?? హహ్హహ్హ! వెనకటి కెవతో, తనకి ఆడాళ్ళంటే అనుమానం మొగవాళ్ళంటే మొహమాటం అన్నాదిట!

"మనకి జోక్సొక్కటే తక్కువొచ్చాయి!"

అయింది, మళ్ళీ నేరస్తుడి మొహం పెట్టేసేడు.... అనుకున్నదేగా; హర్ట్ చేయాలని!

అతను హర్ట్ అవలేదు.... నక్క వినయం....మాకరీ.

"మరెక్కడికి వెళ్దాం?"

"నాకొక పందరూపాయలు తెచ్చి ఇయ్యి." ప్రతిధ్వనిలా వచ్చింది డిమాండ్.

". . ."

"ఛీ" మొహం పక్కకి తిప్పుకుంది.

"అదికాదు శ్యాం...." —రోడ్డుమీద బ్రతిమాలుకోవడం కష్టం. .

"నిన్నడక్కూడదనుకుంటూనే అడిగేను."

ఆ పరిస్థితి కడుపులో పెట్టుకుని, అంత వేదన గుండెలోదింపుకొని, అలాటి వెచ్చటి నీళ్ళు కళ్ళలో తిరుగుతూండగా ఆడది రోడ్డుమీదా ఎలక్ట్రిక్

పోజు వేసుకుని నిల్చుంటే శేఖరంలాంటి మొగవాడు తట్టుకోలేడు. అసలు గొప్ప గొప్ప వక్తల దగ్గర్నుంచి నోటికొచ్చినట్టు వాగేసే గిరీశంలాంటి వాళ్ళ వరకు ఒట్టి మూగవాళ్ళు అయిపోయే పరిస్థితి అది.

విడమర్చి చెప్పాలని వుంది.

"ఆడదాని శరీరాన్ని వాడుకొన్నందుకు మొగవాడుగా నువ్వు చెల్లించవలసిన మూల్యంగా నేను అడగడంలేదు.నాకు వేరే పనుండి అడుగుతున్నాను" అని ఆమెకి,

"నేన్నీపట్ల చేసిన అపచారానికి పరిహారంగా నువ్వు వందరూపాయలు అడుగుతున్నావని నేను అనుకోడంలేదు, నీప్రోగ్రాం ఏమిటని భోగట్టా చేసే వుద్దేశంతో—" అని అతనికి.

నేనేం అన్నాను? డబ్బుకావాలన్నాను. రోజూ అడుగుతున్నానా?.... ఇచ్చేదమే....ఎంతకు-నిజంగా అవసరమా—ఇలాంటి వన్నీ విడమర్చి చెప్పడం; అసలు చెప్పవలసిరావడం ఇంకా దైన్యంకాదా" అనుకొని బిగిసిపోయిందామె.

"అలాటి మాటలన్నీ యిక్కడ రోడ్లుమీద ఇంతమందిలో ఎలా చెప్పడం" అని అతను సాహసించలేదు.

# 3

చిన్నప్పుడు కలకత్తాలో నాన్నగారితో గార్డన్ వ్రుడ్ఫ్ కంపెనీకి వెళుతూవుండేది. అక్కడ ఒక ఆంగ్లో ఇండియన్ లేడిటైపిస్టు; నెలలో ముప్ఫై రోజులూ ఒక్కరోజు కూడా తప్పకుండా రోజూ ఆఫీసుకొచ్చేస్తూ ఉండేది, చాలా చురుగ్గా, ఎంతో చలాకీగా, ఆరోగ్యంగా వుండేది. ఆమెకేమి బాధలులేవా అనిపించే, అమ్మ నొకసారి అడిగేసింది, "అమ్మా, ఇంగిలీషువాళ్ళు ముట్టవరా?"

ఏ సబ్జక్టయినా సరే డౌటొస్తే ఇంగిలీషులోవున్న పుస్తకం రిఫర్ చెయ్యడమే అలవాటు. వాళ్ళేం చేస్తారో; ఇలాంటి ఆపద వస్తే.

అవును. రాకుండా ముందే జాగ్రత్త పడతారు. ఇక్కడ పడుతున్నారు... తనుకూడా....పొరపాటున ఒక్కరోజు జాగ్రత్తగా వుండడం మరిచిపోయింది.

అది మరపుకాదు,, ఏదో ఎక్స్టసీ. టైమ్‌లేదు., వుండదు, ఇన్స్పిరేషన్‌కి కామన్‌సెన్సు" స్లీపింగ్‌డోస్,, మొత్తంమీద జరిగింది పొరపాటు. వాళ్ళు మిస్టేక్ అంటారు,, పిల్లల్ని ఎవరికేనా చూపిస్తూ వేళాకోళానికి అవర్ ఫస్ట్ మిస్టేక్, సెకండ్‌మిస్టేక్ అంటారుట,

ఈ మిస్టేక్స్ రెక్టిపై చేసుకోవాలంటే,. వాళ్ళ పద్ధతులేమిటో!?

కాకతాళీయంగా యిచ్చింది. రోజీ, ఈ పుస్తకం చూడు, బాయ్ ఫ్రెండ్సున్న నీలాంటివాళ్ళు చదవ్వలసిందొక ఎస్సేవున్నాదిందులో,"

"ఎబార్షన్" ఎ గరల్స్ స్టోరీ, "నలభైమూడో పేజీ అండర్‌లైన్ చేస్తున్నాది. తను చూసీ చూడకముందే నిర్మలా శ్రీనివాసన్ అందుకుంది; పుస్తకాన్ని.

"ఏం" నువ్వూ అలాంటి ఫిక్స్‌లో పడ్డావేమిటి?" హాస్యం చేసింది శ్యామల,

"నువ్వూ అంటున్నావు; నువ్వు పడ్డావేమిటి కొంపతీసి!" అని తిరగ్గొట్టింది నిర్మల.

"అది కాదు. శ్యామలమొహం ఎర్రబడింది, "ఆ పుస్తంలో గరల్‌లాగ అనబోయాను"

"పుస్తకంలో గరల్‌లాగ అవడానికి నేనేం మీలాగ మిస్"ని కాను. ఇవన్నీ మిస్‌లు చేసే మిస్-టేక్స్."

"అలా అని రూలేమీలేదు. మిస్ట్రెస్‌లుకూడా ఒక్కొక్క నెల మిస్ అయ్యారంటే ప్రెస్ తప్పదు" అనిరోజీ హెల్ప్‌చేసింది.

"మాటవరసకి మొగుడు ఫారిన్‌లోవున్న శ్రీమతి ఒకావిడ ఉన్నదనుకో శ్యామలకి బలంవచ్చి నిర్మలమీద పెర్సనల్‌గా కలియబడ్డాదిః

ఆ పుస్తకంలో వ్యాసం.... ఒకమ్మాయియుంటుంది. పాపం.. ప్రేమించినబ్బాయే అప్పటికప్పుడు పెళ్ళి చేసుకోవాలంటే ఏవో అడ్డున్నాయి.

"తనలాంటి కేసే."

ఆమెకి ఎవరో టెలిఫోన్లో చెప్తారు. నీకు ఇలాంటిలాంటి ఆపద వచ్చిందటగా. మేం వున్నాం నీకేం భయంలేదు? రేపు సాయంత్రం ఐదింటికి, ఫలానా హోటలు గుమ్మందగ్గిర గులాబీరంగు డ్రెస్‌తో నిలబడు. మా కార్లో నిన్ను హాస్పిటల్‌కి తీసుకొస్తారు. అంతా సుళువుగా. నొప్పిలేకుండా త్వరగా జరిగి

పోతుంది. షుక్కీ ఎనిమిది లోపునే నిన్ను ఆ హోటల్ దగ్గిర మాకార్లోనే దిగ బెట్టేస్తారు. 500 డాలర్లు తెచ్చుకో,. మిగిలిన ట్రీట్ మెంట్ మీ ఇంటిదగ్గిరే....

ఆమె వొప్పుకుంటుంది. తప్పదు కద?

500 డాలర్లు .... చాలా ఎక్కువేమో రూపాయల్లోకిమారిస్తే 3,750 అవుతుంది. వాళ్ళ దేశంలో డాలర్లు రూపాయల్లాంటివేమో. పోనీ అలా అయినా 500 రూపాయలంటే ఎక్కువ సొమ్మేకదా? ఎంత పెద్ద ప్రైవైనా అంతకంటె పెద్ద జరిమానా కాదా. అది?

అంతా చాలా బాగా జరిగిందట. పైగా ఆ 500 డాలర్లూ ఆమె ప్రియుడే సేకరించి ఇచ్చేట్ట.

తనకి? — అతనివ్వలేదు.... అడిగిందంతే ....

పడగాలి కాబోలు. అలా ఆధారపడాలికాబోలు, తప్పుచెయ్యడానికీ, తిప్పులోంచి మర్యాదగాగాని అమర్యాదగాగా నితప్పుకో మనికీ, ప్రాక్పశ్చిమాల తేడాలేకుండా ఆడది మొగాడిమీదనే ఆధార పడాలి కాబోలు .... మామిడిచెట్టును అల్లుకొన్నదీ మాధవీలతొకటి. బొష్? షియర్ నాన్సెన్స్? బంకమ్.

"మా వీధిలో వొక ముసలావిడ వున్నాది. ఆవిడికి ఇదొక రెగ్యులర్ ప్రాక్టీసూ. నెలకి నాలుగు కేసులు కనీసం తగుల్తాయి— నేటివ్ ఆపరేషన్ లాంటిదేదో చేస్తుందనుకుంటాను, నోట్లో కేవో మందులుకూడా ఇస్తుంది"అంది నిర్మలా శ్రీనివాసన్.

"పోనిద్దూ, డర్టీ ఫెలోస్?"అని మొహం మడమట లాడించింది శ్యామల "నాలుగు కేసుల మీదా నాలుగు వందలు సంపాదిస్తుంది కాబోలు .... నాలుగు వేలు సంపాదించనీగాక? చి ఛ్ఛీ వెధవ బతుకు?" ఆడవాళ్ళ మధ్య కొచ్చేసరికి శ్యామల కన్జర్వేటివ్ అయిపోతే బతకడం కష్టమని ఆమె థియరీ.

"అలా అనకు. ఎవరి ఆపదలెలాంటివో?" అని సన్నాయి నొక్కు నొక్కింది రోజీ.

"వందలూ పుచ్చుకోదు. వేలూ పుచ్చుకోదు. కేసుకు యాభై రూపాయలు తీసుకుంటుంది. గ్యారంటీ ట్రీట్మెంటనీ, కాన్ఫిడెన్షల్‌గా వుంచుతుందనీ ఆవిడ దగ్గిరకొస్తారు." హుషారుగా ఇన్ఫర్మేషనిస్తోంది నిర్మల .... తన సంగతేమీ పసిగట్టి హెల్ప్ చేయడం లేకుకద?

"మా వీధిలో నాకు తెలియని వాళ్ళెవరున్నా రోయ్!!సిన్సియర్‌గా; కాజువల్‌గా.

"అదేనోయ్; ఆ ఎర్రడాబా వక్కన పాత పెంకుటింటి లోపలి గదిలో_ నల్లటావిడా, బక్కపల్చగా వుంటుంది చూశ్శేదూ? అన్నట్టొకసారి తేలుమంత్రం వేస్తుందని చూపెట్టేనే_ అదు గావిడ!"

"ఓహో _ ఎందుకిలాటి వెధవ పనులు చేస్తుంది."

"బావుందోయ్, నువ్వన్న మాట .... నీకు అది వెధవపన్లాగ కనిపించొచ్చు. కొందరి కదే అవసరం రావచ్చు. వాళ్ళ దృష్టిలో ఆ సమయంలో ఆవిడ దేవత."

"నా దృష్టిలో మాత్రం రాక్షసి! దాని కళ్ళుకూడా చెంగల్రావుపేట నూతుల్లాగ లోతుగా వుంటాయి. నల్లగా సన్నంగా చింపిరి జుట్టూ అదీ. షేక్స్పియర్ నాటకంలో విచెస్ అలాగే వుంటారు కాబోలు. అయితే మరి నాకు తెలియక అడుగుతాను! ఆవిడికి మొగుడ్లేడన్నావు కదా? మన సరస్వతిగారు పెట్టుకున్నంత బొట్టెందుకు పెడుతుంది?"

"అదా! .... ఆవిడ ఎదో శక్తిపూజ చేస్తుందట, ఆ పూనకం వున్నంత సేపూ బొట్టుపెట్టుకోవాలిట."

"దీనిశక్తి చల్లగావుండా! .... ఊఁహూఁ. అయితే పిల్లా పీచూ లేరు గాబోలు అందుకే ఇలాంటిపనులు చేస్తుంది.... పిల్లల్ని గన్న తల్లయితే ఇంతలేసి ఘోరాలు చేస్తుందా!"

"ఎందుకు లేరు! ఒక కొడుకున్నాడు, వాడికీఈవిడ చేసే పనులు నచ్చక వూళ్ళోనే వేరే ఎక్కడో కాపరం పెట్టేట"

"ఔను మరి .... ఇలాంటిపనులు చేసే స్వంత కొడుకైనా భరించడు"

* * *

డబ్బు తెచ్చీకూడా, గేటుదగ్గిర సారీ ఫేస్ కట్ చేసి నిలబడ్డాడు శేఖరం

"అదుగోనోయ్, నీ బాయ్ ఫ్రెండు"

"బాయ్ కాదు, ఫ్రెండూ కాదు"

"బాయ్ కాకపోతే గర్లంటావా?"

"గర్ల్స్ ఆర్ ఫార్ బెటర్,"

## 4

"అచ్యుతమ్మ ఎవరు?"

"నేనే"

"అంజమ్మ పంపింది"

"కూర్చో"

"డబ్బు నిన్ననే పంపేను"

"ఇచ్చింది"

"ఆలస్యముందా?"

"లేదు"

లోపలి కెళ్ళిపోయింది.

చీకటి కొట్లు. పాతకాలపు ఇళ్ళు, ఆసుపత్రి వాసనే కాస్త ఇంపుగా వుంటుందనిపించే దుర్గంధం. ఏం చేస్తుందో, "నేటివ్ ఆపరేషన్" అంటే!.... మోటకత్తి పెట్టి పరపరమని కోస్తారా ఏమిటి చెప్మా?"

"ఈ డబ్బీలో ఎర్రమందు లేదేమే!" లోపల్నుంచి పెద్దకేక ,

జవాబులేదు. డబ్బీనేలకేసి కొట్టిన చప్పుడు. పది పదిహేను తిట్లు. "వెళ్ళు, వేగిరం పట్టా మనిషి కూర్చున్నాడని చెప్పు, ఇక్కడున్నట్లు రావాలి"

పక్కని సందులోంచి ఎవరో ఆడమనిషి నడచినట్టు మట్టెల చప్పుడు, తలుపు తియ్యడం; మళ్ళీ వెయ్యడం.

గుప్పుని ఏదో నల్లమందువాసన్లా వచ్చిగదంతా కమ్మింది. అచ్చుతమ్మ నల్లమందేసుకుంటుంది కాబోలు.

"ఆ ఆను"

హడిలిపోయింది శ్యామల. తన పక్కనే మనిషి. ఎప్పుడొచ్చింది; ఎలా వచ్చింది.ఆశ్చర్యంలో నోరు తెరుచుకుంది.

నోట్లో ఏదో మాత్ర వేసింది, నల్లమందా! అడిగి వేయించు కోవలసింది. సమయానికి తెల్లారింది....

గోడనున్న అలమారు దగ్గిరకి వెళ్ళింది అచ్చుతమ్మ. "టేబిల్ మీద పడుకో పిల్లా"

"పిల్లిట" పిల్ల!." ఏం పిలుపు!.... చెప్పింది చెయ్యడానికి బుద్ధిపుట్ట నంత వెగటుగా వుంది.

"అచ్యుతమ్మ అలమార్లోంచి సామాను తీసింది. కత్తెర, ఫ్రాంగ్స్. దబ్బలంలు, నెత్తురు తుడవడానికి కాటోలు గుడ్డలు! గాజు గుడ్డ రీల్. ఆయింట్ మెంట్ ట్యూబ్.

"నేటివ్ ఆపరేషన్!"

బార్బరస్ ప్రిమిటివ్.

ఇంకెవరికైనా చేస్తూవుంటేకూడా చూడ్డం కష్టం. పోనీ అలా చూసినా బావుణ్ను. మళ్ళీ వస్తానని చెప్పేసే .... అబ్బ! ఈ పద్ధతి బాగులేదు.

మంచి పద్ధతులున్నాయిట .... చాలా జ్ఞానంతో వ్యవహరిస్తారు వాళ్ళు. అంటే శక్తిట పూర్వం. ఇప్పుడు జ్ఞానం అంటే మనీ .... బాగా డబ్బు పుచ్చుకుంటారు; రహస్యం తెలిసినట్టు మొహంపెడతారు. ఎప్రిన్స్. యూనిఫామ్స్ వేసుకొనే డాక్టర్స్ రహస్యాన్ని రహస్యంగా వుంచుతారని నమ్మకం కలగదు. వారు మన సర్కిల్స్‌కి దగ్గిరిగా రాగలరు. మనకు తెలిసిన వ్యక్తులెవరి తోనో ఎక్కడో ఒకసారి నోరు జారితే .... బస్! న్యూసెన్స్ మళ్ళీ ఆరంభం.

ఎక్కడో చదివింది. ఎబార్షన్స్ లీగలైజ్ చేయాలని ప్రభుత్వం సంకల్పించ వచ్చుట. అయినాసరే అది రహస్యంగానే వుంచాలికదా .... లీగలైజ్ చెయ్యవలసిన సోషల్ సీక్రేట్.

అది పెళ్ళాడిన వాళ్ళకోసం.

వాళ్ళ సంతానాలు పెరక్కుండాను. దేశానికి అహార సమస్య పెరక్కుండాను. మనకోసం కాదు .... పెళ్ళికానివాళ్ళ సీక్రెట్స్ లీగలైజ్ చెయ్యబడవు .... మరి, అందుకే 500 డాల్లరు!

ఒళ్ళు తిరుగుతున్నాది. నిద్రవస్తున్నట్లున్నది. స్పృహతప్పి పోవడానికి మందిచ్చిందా? మందేమీ అక్కర్లేదు. ఈ గదిలో ఐదు నిముషాలు కూర్చుంటే చాలు! స్పృహ దానంతటదే తప్పి పోతుంది.

అచ్చుతమ్మ బల్ల మరోమాటు శుభ్రంచేసింది. తలగడా మీద దుమ్ము దులిపింది. ఒదల్లేదు. దుప్పటి అట్నించిటు తిప్పి తలగడా మీదుగా పరిచింది.... అక్కడ పడుకోమని ఇందాకే అన్నది. ఇప్పుడు అసలూరుకోదు.

"నా కక్కర్లేదు! వెళతాను"

లేపింది.

ఊహ్!....

అచ్యుతమ్మ గభాల్నవచ్చి పట్టుకోకపోతే పడిపోయేది. "మత్తుందా లేదా." కసిరింది, తీసుకెళ్ళి బల్లమీద పడుకోబెట్టింది.

"నాకు తెలివి తప్పిపోతుందా?"

"ఊఁ."

"ఆపరేషన్ చేస్తారా?"

"అవును"

"ఆ కత్తెర, చబ్బలం. అవేనా?"

నవ్వింది "భయంలేదు. నొప్పెట్టదు"

"నా కొద్దు"

"..........—...."

"ఒద్దంటే మాట్లాడవేం?"

"వెళ్ళి అబ్బాయిని మళ్ళీ బతిమాలుకుంటావా పెళ్ళిచేసుకోమని!!" చిరునవ్వులో వేళాకోళమేకాక ఏదో అపేక్ష కూడా వున్నట్టుంది.

"అవన్నీ నీకెందుకు"

"అంజమ్మ అంతా చెప్పింది."

"చెబితే చెప్పిందిలే...." తరువాత ఏమని దబాయించాలి? డాక్టర్ నోస్ యుపర్ మిస్టేక్స్!

"మొగవాళ్ళు బతిమాలుకుంటే. వింటారా?....వింటే అదెంతకాలం?"

"నన్ను తీసికెళ్ళి రిక్షాలో కూచోబెట్టు. నేవెళ్ళిపోతాను. ఇక్కడంతా వాసన. భరించలేకుండా వున్నాను!" బలం ఎరువు తెచ్చుకుని బల్లదిగి వచ్చింది.

లోపలిగదిలో బూట్ల చప్పుడు.

"అమ్మా;" మొగగొంతు పిలుపు.

"వచ్చే-" అచ్చుతమ్మ అటుతిరిగి కదిలింది. ఆ పిలుపు అచ్చుతమ్మకి కాదేమో, తననే ఎవరో అమ్మా అని పిలుస్తున్నట్టుంది. తియ్యగా ఉంది.

ఆ పిలుపు! మధురంగా వుంది ఆ పిలుపులోని భావం. మళ్ళీ మళ్ళీ వినాలనివుంది ఆ కంఠస్వరం. అంత తియ్యటి పిలుపు వుంటుందా? నేను అమ్మని పిలుస్తే అమ్మ అలాగ రెస్పాండ్ అవుతుందా?

కాబోలు,?

అచ్యుతమ్మ తలుపుదాకా వెళ్ళి వెనక్కొచ్చింది. "నా మాట విని ఇల్లి మీద పడుకో,"

"ఇక్కడ బాగానే వున్నాది"

"ఈ బెంచీ సన్నం, పడిపోతే కిందపడిపోతావు"

"ఫరవాలేదు; వెళ్ళు"

తలుపు మూసింది. గొళ్ళెంవేసిన చప్పుడు, తలుపవతల గుస గుసలు, తల్లీ కొడుకూ సంభాషణ....తియ్యగా పిల్చేకొడుకూ, అభిమానంగా మాట్లాడే అమ్మ-అంత మెల్లిగా మాట్లాడతారేం?

కడుపులో బిడ్డ....అతి నెమ్మదిగా మాట్లాడుతుంది....కదలికలే సంభాషణలు....ఎబార్షన్ కాకపోతే బిడ్డ పుడ్తుంది....బిడ్డమాట ఇప్పుడే వినిపించదు....వినిపించని చప్పుళ్ళకోసం వీనుల ఆదుర్దా. ఆ ఆదుర్దాలో ఆనందం.ఆ ఆనందంతోనే కాబోలు అమ్మ కాబోయే ఆడది పచ్చగా పుష్టిగా నున్నగా అయిపోతుంది. అమ్మా అని పిలవ వలసిన బిడ్డ కడుపులో వుంటేనే కావలసినంత ఆనందం....అమ్మా? అమ్మా? ఆదరం ఆపేక్షించినవారు అమ్మా అని పిలుస్తారు....అమ్మగారు....అమ్మ!

తలుపుదాకా వెళ్ళి వినాలనుంది "పడిపోతావు" అన్నది అచ్చుతమ్మ. అతనికి అమ్మ అచ్చుతమ్మ. అతని పేరు అచ్యుతరావా?

గొంతుకలు పెద్దవవుతున్నాయి.

తలుపుదగ్గిర మనుషుల సడి, తలుపు సందులోంచి ఎవరిదో కన్ను—ఈ గదిలోని ఎలక్ట్రిక్‌లైటు వెల్తురుపడి థళుక్కుమని మెరిసింది.

చూసేడు.

వాడెవడో నన్ను చూసీసేడు!

చూసీసేడు. గుర్తు పట్టేస్తాడు. రోడ్డుమీద వెళ్తూంటే—ఇదే యిదే-మా ఇంటికొచ్చి మా అమ్మచేత....దింపించుకున్నాది అని చెప్పేస్తాడు. అడిగిన వాళ్ళకీ అడగని వాళ్ళకీ.

ఇక్కడ సీక్రెసీ ఉందంది నిర్మల.

లేదు లేదు. ఇక్కడ సీక్రెసీ లేదు, డీసెన్సీ లేదు. కర్టెసీ లేదు. ఇదొక కమేళా, నేటివ్ ఆపరేషన్లు....పరపర కోసి పారేస్తారు.

"వాడెందుకొచ్చినట్టు? ఎందుకు చూసినట్టు?....అవును చూస్తాడు....తల్లి భ్రూణహత్యలుచేసి డబ్బు సంపాదిస్తుంది. కొడుకు ఆ మనుషుల లిస్టురాసుకుని వాళ్ళ ఎడ్రసులు సంపాదించి బైటపెడతానని బెదిరించి వాళ్ళదగ్గిర డబ్బు లాగుతాడు. బాగానే వుంటుంది; ప్రాక్టీస్—

మెదడు ఖరేల్ మంది.

వెధవపని చేసింది తను. కప్పిపుచ్చుకోడానికి ప్రయత్నించడం అంత కన్నా వెధవపని. ఇది అయిపోతే దీనివల్ల ఆరోగ్యం గట్టా చెడిపోదమో లేక ఈ గాయాలు మానకపోదమో బ్లాక్ మెయిలింగో సంభవిస్తె మళ్ళా దానికోసం మరోతప్పు చెయ్యాలో ఏమిటో! ఒక తప్పుని కప్పుకోడానికి పది తప్పులు.... శిక్ష అనుభవించేసినా బాగుండేదేమో.

కష్టం. శిక్ష అనుభవించడం అంత తేలికాదు.

చెయ్యొచ్చు. బాస్ మంచివాడు. విశాఖపట్నం బోరు కొడుతోంది సార్ అంటే చాలు. ఎక్కడికావాలంటే అక్కడకి పంపిస్తారు. ఏ అనంతపురమో దూరంగా వెళ్ళిపోయి అబద్ధాలు చెప్పి కాలక్షేపం చెయ్యొచ్చు.

తలుపవతల గొడవ.

"అరవకురా!"

"అరుస్తానా మరీ అరుస్తానా!....నువ్వీ వెధవపన్లు మానమంటే మానవు. నేనేదో మర్యాదగా యింత సంపాదిస్తున్నా నీ బుద్ధిసీది! చివరికి నీ విద్యంతా సరిగ్గా ఎవరిమీదా ప్రయోగించావో చూడు....గొంతు తగ్గింది. మెల్లిగా మంద లిస్తున్నాడు.

అతను చెప్పేది బావున్నట్టుంది....జ్ఞాపకం వచ్చింది. నిర్మల ముందే చెప్పింది కదా. అతను బ్లాక్ మెయిలింగు చేసే మనిషికాదు.

తలుపుదగ్గిర కెళ్ళాలి....అతని గొంతుక బావుంది, అతనాడే మాటలు బావున్నాయి. ఈ డర్టీ ఆపరేషన్లు వద్దంటున్నాడు....నన్ను అమ్మని కమ్మంటు న్నాడు....గుడ్ గై...."

"ఎర్రమందు తెచ్చేనమ్మా" దూరంనించి ఆడగొంతుక.

"వస్తున్నా"

"వస్తున్నాయి. "నల్లమందు; ఎర్రమందు, దబ్బలం, కత్తెర—ప్రాంగ్స్....గుడ్డపేలికలు—ఇంగువముద్దలు, కంపు....అమ్మా "ఓ అమ్మా! నన్ను చంపేస్తున్నావా;?....అమ్మా నన్ను పుట్టనియ్యవా?....అమ్మా నేన్నీకు ఏం అపకారం చేసేను? అమ్మా నన్ను పుట్టనీ-నీకు తియ్యని పిలుపులందిస్తాను....అమ్మా నువ్వీ వెధవపన్లు మానీవా? మర్యాదగా సంపాదిస్తున్నాను....తప్పు పన్లు చెయ్యకు. ఒక తప్పుని కప్పుకోడానికి పది తప్పులు చెయ్యకు. సంవత్సరం ఆగితే పెళ్ళి చేసుకుంటాడు. ఆఫీసులో నచ్చజెప్పు. అనంతపురంవెళ్ళిపో....అమ్మా నాన్నా కలకటాలో వున్నారు....సంగతి తెలీదు....నీలాంటివాళ్ళు చదవ్వలసిన పుస్తకం....500 డాలర్లివ్వకు....డీసెన్సీ, కర్టెసీ, సీక్రెసీ లేవు. వాడే మిస్టేక్! శేఖరం. ఎక్కడున్నావు? సగం మిస్టేక్ అయినా నీదని వొప్పుగో.

ధడ్;....

*   *   *   *

కళ్ళు తెరిచింది శ్యామల

తను ఇంతసేపూ తెలివితప్పి పడిపోయేవున్నాది కాని, ఆ మురికివాసన గదిలో కటిక నేలమీద కాదు. తన ఎదురుగా నిలబడ్డది అచ్చుతమ్మే కాని ఆమె చేతుల్లో ప్రాంగ్స్, దబ్బలం లేవు, పక్కన ఆమె కొడుకు శేఖరమే నిలబడ్డాడు గాని అతను పెళ్ళికోసం సంవత్సరం ఆగేటట్టుగా లేడు, కడుపులో బిడ్డ ఉన్నాదిగాని ఆక్రందన లేమీ చెయ్యడంలేదు.

శ్యామల మనస్సులో వొక్కక్షణం. తాను ఇటువంటి పన్లుచేసే అచ్చుతమ్మకు కోడలు కావలసిందేనా అని, ఇది డర్టీ న్యూసెన్సే మోసని అనుమానం పొడసూపిందిగాని శేఖరం మొహంలోని నవ్వుకాంతికి అదట్టే సేపు నిలబళ్ళేదు.

ఇప్పుడు తను చేసింది మిస్టేకే అయినా తప్పు అనిపించుకోదు. ఔను. ఫస్ట్ మిస్టేక్....

(ఆంధ్రజ్యోతి వీక్లీ; దీపావళి 1974)

# పనికిరాని కథ

రేడియోలో టైమ్ చెప్పేటప్పుడు "టోమాటైమ్" అంటూనూ. సరిగ్గా ఆ టయిముకి తలకి అది రాసుకుంటే తెల్ల వెంట్రుకలు నల్లగా వున్నట్టవుపిస్తాయట.

రోజూ మా ఆవిడ నన్ను నిద్దర్లేపే టైమది. "లేవండీ- టయిమయిందీ" అని పీయిన్నంత గోముగా పలకరించే గుడ్మార్నింగ్ టైమది. నేను మొహం కడుక్కోకపోయినా నా పక్క దగ్గిరికి మా ఆవిడ కాఫీ తెచ్చిచ్చే టైమది.

నేను బద్ధకంగా అట్నించిటు ఒత్తిగిలితే, ఊడిపోయినన్ని ఊడిపోగా,

నా నెత్తిమీద మిగిలిన వెండ్రుకల్ని,

మా ఆవిడ ఒక్కసారి అట్నించిటు కలియబెట్టి "అప్పే రోజు రోజుకీ చిన్న పిల్లాడయి పోతున్నారు. లేస్తారా, కాఫీ పట్టుకు పొమ్మంటారా?" అనేసే టైమది.

కాఫీ వెనక్కి పట్టుకుపోతే మళ్ళీ ఎప్పుడొస్తుంది?

అబ్బో, చెప్పలేం.

మొహం కడగాలి గెడ్డం గియ్యాలి - మేడదిగి లావెటరీకి వెళ్ళాలి - అట్నుంచొచ్చి స్నానం చెయ్యాలి.

అప్పుడొస్తుందా కాఫీ.

కనక -

తెచ్చిన కాఫీ వెనక్కి పట్టికెళ్ళనియ్య కూడదు. ఎం చేతంటే వాడెవడో సామెత చేసేడు కూడాను, బిట్వీన్ ది కప్ ఎండ్ ది లిప్ దేర్ మేబి మెనీ ఎ స్లిప్ అని.

కాఫీ తాగుతున్నాను.

తాను కలియబెట్టేసిన నా జుట్టువేపు చూస్తోంది మా ఆవిడ. తన మనస్సులో ఏం ఆలోచనలు కలియబెట్టుకున్నాదో మరి తెలియదుగాని. "ఏమండీ" అని ప్రశ్నార్థకంగా పలకరించింది. "చెప్పు!" అన్నట్టు కప్పు అంచుమీంచి చూసేను.

"జుట్టుకి రంగేయించు కోరాదుటండీ?"

"ఎందుకూ?"

"ఎందుకేమిటీ? పండిపోతున్నాది రోజుకి గుప్పెడేసి చొప్పున!"

"పండితే పండనీలేవే!"

"అలాక్కాదు. నేనెందుకు చెప్తున్నానో కొంచెం ఆలోచించుకోండి."

"పోదూ, గొడవా!" అంటే కప్పు చేతిలో పెట్టేసి పారిపోయింది. హాల్లో నిలువటద్దం "హల్లో" అంటూ పలకరించింది.

"హవ్వార్యూ, ఓల్డ్ బోయ్" అన్నట్టయింది.

గబగబా దువ్వెనతో జుట్టుని మామూలుగా చేసేను.

దువ్వేసుకుంటే కొంచెం నల్లగా కనిపిస్తుంది అక్కడక్కడ.

పరవాలేధోయ్ అనిపిస్తోంది.

జుట్టుకి రంగేసుకోవాలేమో అన్న భయం తగ్గిపోతుంది.

"టైమెంతయింది?" అని కేకేశాను.

"ఇప్పుడే కదండీ రేడియోలో చెప్పేడూ" అంటూ వచ్చింది మా ఆవిడ.

"ఏమిటి చెప్పేడు?"

తలకి అదేదో నూనె రాసుకునే టైమైందట. అని తన ఐడియాని మరో మారు బలపర్చుకునే ధోరణిలో చెప్పింది.

నేను ఖాతరు చెయ్యలేదు.

ఎనిమిదై పోయిందన్నమాట. అరగంటలో బయల్దేరితేగాని బండందదు. టిఫిన్ తయారైందా?" అన్నాను.

"ఆ"

బెజవాడా, హైదరాబాదూ వెళ్ళాలి.

ఎనిమిదీ యాభయ్యయిదుకి రైలు.

రాజమండ్రి చేరేసరికి రెండవుతుంది.

మా బావమరిది రాజమండ్రి రైల్వేస్టేషన్లో గుమస్తా. బండికి వచ్చి కలవమని మూడ్రోజులనాడే ఉత్తరం రాసేను. ఒస్తాడు. తెరిచుంచిన పుస్తకాలు, న్యూస్ పేపర్లు అన్నీ సర్దుకున్నాను.

కార్నర్ సీట్లో పరుచుకున్న దుప్పటీ బాగా నలిగిపోతే అదోమాటు తీసి దులిపి సరిగా వేసేను.

స్టేషన్లో బండాగుతోంది. మా బావమరిది ప్లాట్ఫారంమీద సుంచుని నా కోసం బండంతా వెతుక్కుంటాడు.

నేనే లేచి కంపార్టుమెంటు గుమ్మం దగ్గర నిలబడితే—
పని సులువై పోతుంది—
అనుకుంటూ లేస్తున్నాను.
బండి ఆగింది.
"తాతగారూ, దిగిపోతున్నారా?"
వెళ్ళి పోతున్నాను గుమ్మం దగ్గరికి
"మిమ్మల్నే"—
అటు తిరిగి చూసేను.
నన్నే—
నా ఎదుటి కార్నర్ సీట్లో
నలభయ్యేళ్ళావిడ కూచుందిగా,నలుగురు గడుగ్గాయి పిల్లల్తో!
ఆవిడ—
నావేపే చూస్తోంది,
తాతగారూ అని పిల్చింది—
నన్నేనా అని అనుమానంగా అటూ ఇటూ చూసేను,
నన్నే—
ఇంకెవరూ లేరక్కడ.
"దిగి పోవడం లేదండీ—" అన్నాను.

"మరేమీ అనుకోకపోతే తాతగారూ, ఈ మరచెంబుతో నీళ్ళు తెచ్చి పెట్టూ? పిల్లలు దాహానికి గోల్చేస్తున్నారు!"

అంటూ చెంబు అందించింది,
ఒక్కసారిగా నిర్ఘాంత పోయేను.
వెంటనే సర్దుకున్నాను కూడాను.
"అయ్యో దానికేం భాగ్యం, ఇలా ఇవ్వండి!" అన్నాను.
చెంబందుకున్నాను.

ఆ క్షణంలో నాకావిడమీద వాత్సల్యం లాంటిది కలిగితే బాగుణ్ణని పించింది.

"నీళ్ళేనా తల్లీ! ఈ వృద్ధుడు నీకామాత్రం సాయానికి అందగా వుండ

గలడమ్మా! నువ్వు నిశ్చింతగా వుండు తల్లీ" అని ఆమెను పొదివి పట్టుకుని వీపు నిమిరి చెప్పగలిగితే బాగుణ్ణు....

కాని అది ఎలా జరుగుతుంది.

నాకు ముప్ఫయ్యయిదో యేడు నడుస్తోంది.

తల పండిపోతోంది.

అదిచూసి నాకు నలభై అయిదేళ్ళు దాటాయనుకోవచ్చు. కాని నలభై ఏళ్ళావిడ తాతగారూ అని పిలవ్వలసినంత వార్థక్యం కనబడదు.

పండుతున్నది తలవొక్కటే.

చర్మం మీది నున్నదనం, అవయవాల్లోని దారుఢ్యం, కంఠస్వరంలోని స్పష్టతా....

ఇవేవి గమనించకుండా వున్నా ఆవిడ?

పోనీ నా వేషం చూడరాదా?

డార్కు కలర్ పెనామా ఫేంటు తొడుక్కున్నాను.

దానిమీద.

నూటికి యాభైపాళ్ళు బనీను కన్పించేటట్టుగా

నూటికి నూరుపాళ్ళు టెర్లిన్ చొక్కా తొడుక్కున్నాను.

అప్టు డేటు మోడలు నల్లడయల్ రిస్టువాచీ ధరించాను కుడిచేతికి.

అదీ చూళ్ళేదా?

నే చదివే పుస్తకాలు కూడా.

భగవద్గీతలూ కాదు. బ్రహ్మసూత్రాలు కావు.

ఉపనిషత్తులు కావు ఉపన్యాస వేదాంతాలు కావు.

మామూలుగా యువతీ యువకులు చదువుకునే రంగురంగుల పత్రికలే.

పోనీ నాకు లాంగ్‌సైటువల్ల సంక్రమించ వలసిన చత్వారపు కళ్ళ జోడైనా యింకా రాలేదు.

ఇన్నిటిద్వారా నేను తాతగార్ని కానని స్పష్టంగా కనబడుతూవుంటే కేవలం జుట్టుచూసి.... అదేదో ఆత్మసౌందర్యం గమనించిన దాన్లాగా నన్ను తాతగారూ అని పిల్చించంటే తనకి నామీద వున్న గౌరవాన్ని తెలియజెయ్యడం లక్ష్యంగా పెట్టుకుందనుకోడమా? లేక పురచెంబు పోకుండా జాగ్రత్తపడుతున్న దనుకోడమా?

*　　*　　*

బెజవాడలో.

పుస్తకాల పబ్లిషర్ శాస్త్రిగారు స్టేషను కొచ్చేరు.

సాదరంగా స్వాగతమిస్తూ నన్ను స్టేషన్నుంచి టౌన్లోకి రవాణా చేసేరు.

నేను ఆఫీసు పనిమీద వొచ్చేనని సాయంత్రం షాపుకొచ్చి కలుస్తాననీ చెప్పేను. వాళ్ళ పుస్తకాల షాపుకి వెనక వేపుండే గదిలో నాకన్నిటికీ వసతిగా వుంటుందనీ అక్కడే వుండమని అన్నాడు.

"ఎందుకు లెద్దురూ మీకు లేనిపోని శ్రమ.మా వొదినగారింట్లో వుంటాను" అన్నాను.

"అదేం కుదర్దు సార్. రాక రాకొస్తారు. ఏవో కథలూ కాకరకాయలూ మనం మాట్లాడుకోవలసినవి చాలా వుంటాయి. మీరు మాషాపు వెనకాల గదిలో వుండాల్సిందే! భోజనానికో చుట్టపుచూపునో కావాలంటే మీ వదినగారింటికి వెళ్ళొచ్చులెండి".

*　　　　*　　　　*

మర్నాడు పగలంతా ఆఫీసుపని చూసుకొని పెందరాళే మా ఒదిన గారింట్లో భోజనం చేసేసి రాత్రి ఎనిమిది గంటలవుతుండగా శాస్త్రిగారి పుస్తకాల షాపుకి చేరేను.

"ఈయన నీలకంఠంగారు. అమలాపురం" అని ఒకాయన్ని పరిచయం చేసేరు శాస్త్రిగారు. "ఈయనే రామగోపాలంగారు" అని నన్నాయనకి చూపించేడు.

కొత్తాయన వేపు చూశాను "నమస్కారమండీ" అంటూ.

అరవై ఏళ్ళుంటాయాయనకి

ఎమ్మెల్యే అంచు నేత పంచె కట్టాడు.

కోరా ఖద్దరు కమ్మీజు తొడుక్కున్నాడు,

బ్లీచ్ చేసిన ఖద్దరుకండువా చొక్కాపైన జీరాడుతోంది.

"నీలకంఠంగారికి అన్నిరకాల సాహిత్యం ఇష్టమే. ఇటు కథకులూ, నవలా కార్లూ, అటు పద్యాలవారూ, గేయాలవారూ అందరూ వారికి మిత్రులే. నాటక రచనమీద స్టేజీ నటనమీద అభిరుచి, స్వయాన నటులుకూడాను" అన్నారు శాస్త్రిగారు.

"చాలా సంతోషమండీ మిమ్మల్ని కలుసుకున్నందుకు!" అన్నాను.

కాస్సేపు అదీ ఇదీ మాట్లాడుకున్నాం.

ఓ ముప్ఫయ్యేళ్ళ సాహిత్యం మామధ్య తెరలు తెరలుగా దొర్లిపోయింది. నేను చిన్నప్పుడు చదివిన పాత పుస్తకాలు, మానాన్నగారు మాఇంట్లో జాగ్రత్త పెట్టిన నలభయ్యేళ్ళనాటి సాహిత్య మాసపత్రికలు నాకెంతో సాయం చేసేయి నీలకంఠంగారితో సమానంగా సాహిత్య చర్చ చేసేటందుకు.

"తమది విజయనగరం అన్నారు కదూ" అన్నాడాయన వుండుండి.

"అవునండీ"

"అక్కడే చదువున్నాను"

"మరేనండీ"

తమకి సంగీతంలో తగు మాత్రం ప్రవేశం వుందని కూడా శాస్త్రి చెప్పాడు.

"ఆ యేదోలెండి-" అయినా విజయనగరంలో ఓ పదేళ్ళుంటే సంగీతం-అదే వంట ఒట్టేస్తుంది లెద్దురూ" అన్నాడు తప్పంతా విజయనగరందే అయినట్లు

"ఇచ్ఛ వుండాలికదా." అన్నాను.

"తమకి ఆదిభట్ల నారాయణదాసు గారు బాగా తెలుసనుకుంటాను" అన్నాడాయన.

"లేదండి. నేను ఐదో క్లాసులో చదువుతున్నప్పుడే ఆయన పోయారు."

"పోనీ వీణా రమణయ్యగారు?

"అబ్బే ఆయనింకా పూర్వమే పోయాడు కదండీ"

"ఏదో అల్లా అంటారు గానీ మీకు వారు తెలికపోవడమేమిటి అని కళ్ళు సన్నగాచేసి నవ్వాడాయన. "గొప్పవారితో పరిచయం సాంగత్యం. వుండీ కూడా లేదంటున్నారంటే అది కేవలం విద్య ఒసగిన వినయాన్ని సూచిస్తుందతే" అన్నాడాయన.

అపుడు తెలిసింది, గొయ్యతవ్వుతున్నాడా నాయనా అని.

నయంనేను ప్రగల్భానికి పోయి ఏ శ్రుత పాండిత్యమో ఆధారం చేసుకుని నారాయణదాసుగారు నాకు తెలిక పోవడమేమిటి? హరికథా పితామహుడు కదా. ఆయన! ఆయన గజ్జెకట్టి బల్ల మీద కదను తొక్కేడంటే——" అని అలాటిదేదో అనుంటే ఈయనగారునన్ను తిన్నగాతీసికెళ్ళి అడిదం సూరకవికో ఆనందగజపతి మహారాజులు గారికో సమకాలికుణ్ని చేసేసి నాపుట్టుక 1885కి లాగేసేవాడే.

ఇహ కలియబడక తప్పదు." అయ్యా! మీరేమనుకుంటున్నారో ఏమో కాని నేను మాత్రం మీరనుకుంటుటన్నంత వయోవృద్ధుణ్ని కానండోయ్. నేను పుట్టింది 1932 లో "అన్నాను.

"హ హ్హ హ హ్హ హ్హ! పంధొమ్మిది వందల- ఎంతన్నారూ, ముప్పయి రెండా? ఇంకానయం, నలభై రెండన్నారు కాదు! బలే హాస్యంగా మాట్లాడతారే మీరు!" అని నేనేదో చెప్పబోతూ వుంటే కూడా చెయ్యి అడ్డం పెట్టేశాడు.

* * *

మర్నాడు బెజవాడలో పని పూర్తవుతుంది, అయ్యాక హైద్రాబాదు వెళ్ళాలి, బస్సులో వెళ్ళడానికి టిక్కెట్టు రిజర్వుచేసుకున్నాను. ఒంటిగంట న్నరకి బస్సు.

పదకొండున్నరకి ఆఫీసు పని పూర్తియింది. మా తోడల్లుడుగార్ని వెంట బెట్టుకుని హడావుడిగా వాళ్ళింటికి చేరాను.

మా వొదినగారు లోపలి గదిలో ఎవరో వొక భద్ర మహిళను పీటవేసి కూర్చోపెట్టి ఆవిడతో బాతాఖానీ కొడుతోంది.

"పొరుగింటావిడ! పుస్తకాల పిచ్చి ఇంతా అంతా కాదీవిడకి" అని మా తోడల్లుడుగారు నా చెవి కొరికారు,

మేం లోపలికేళ్ళేలోగా మా వొదినగారు కూడ ఆవిడ చెవి కొరికినట్టు న్నాది, నేను తన మరిదినని" చిరునవ్వు నవ్వుకుంటూ లేచి నిలబడ్డాదావిడ,

"మీ మరిదిగారంటే మీ సత్యభామ నిచ్చేరా?" అన్నదావిడ చిన్న గొంతుకతో.

"ఆఁ ఆయనే అన్నట్లు చెప్ప మరిచాను, ఈయన మా ఆయన పనిచేసే డిపార్టుమెంట్లోనే ఆఫీసరు?" అంది మా వొదినగారు?

"అలాగాండి"

"ఆ తరువాత- కథలు రాసే రామగోపాలం ఈయనే?"

"అయ్యబాబోయ్" అందావిడ "మీర్రాసినవి చాలా చదివేనండోయ్?" ఇంతలో మా తోడల్లుడు గారు కలుగ జేసుకొని "అర్జంటుగా, ఆయనకి భోజనం పెట్టు, అవతల బస్సుకి టైమైపోతోంది" అని మావొదిన మొహం మీద నాలుగు చిటికెలు వేసేరు. లేకపోతే అప్పటికప్పుడు నాకో అభినందన సభ తయారైపోయేదేమో.

"వెళ్ళొస్తామ సుబ్బలక్ష్మిగారూ........ అది సరే కాని చిన్నమాట. ఇలా వస్తారు? అంటూ ఆవిడ బైటికి దారి తీసింది.

ఒక్క నిమషం లోనే కాళ్ళూ, చేతులూ, మొహం కడిగేసుకొని, భోజనానికి నా ఆలస్యం ఏమీ లేకుండా తయారైపోయేను, ఇంతలో మా వదినగారు పళ్ళన్నీ కనబడేట్లు నవ్వుకుంటూ వొచ్చిందింట్లోకి.

"ఏంటీ కులసా?" అన్నాను.

"కులాసే మరి! ఇట్టు సంపాదాన. అటుకీర్తి అన్నిటికీ మించి గౌరవం ఇన్నీ వున్న భాచ్యవంతుడి వయాకపు కులసా కాదు మరి?" అన్నాది మా వొదినగారు.

"ఆవిడెవరో బైటకె పిల్చి చెబితేనే గాని నీకు గుర్తురాలేదులా వుంది, నా భాగ్య మంతాను" అన్నాను.

"అంతే అంతే" అని ఇంకా నవ్వుకుంటూ సంభాషణ మాతోడల్లుడు గారితో సాగించిందింమా వొదినగారు.

"మా సత్యని మాణిక్యమ్మగారి తమ్ముడికి చేసుకుంటారేమోనని పెళ్ళిచూపులకి పిల్చుకొచ్చేం మీకు గుర్తుందా. తాడేపల్లి గూడెంలో."

"అదేమో నాకు జ్ఞాపకం లేదు. మీ అక్క చెల్లెళ్ళకి వొచ్చినన్ని సంబంధాలు భూప్రపంచం మీద ఎవరికీ వచ్చుండవు. అవన్నీ ఎవడికి జ్ఞాపకం!" అనేశాడాయన.

"అప్పుడు మాణిక్యమ్మగారి తమ్ముడు నల్లగా వున్నాడని మా సత్య వొద్దంది గుర్తులేదటండీ?"

"అయితే అపును కాబోల్లేస్తూ, ఇప్పుడదంతా ఎందుకు? ఓ పక్క బస్సుకి టైమైపోతుంటే!" ఆయనింకా పుస్తకాల షాపుకెళ్ళి పెట్టే, బేడా సర్దుకోవాలి కూడాను. తొందరగ వొడ్డించమంటూ వుంటే!"

"అదికాదు" అంటూ వడ్డనకి ఏర్పాట్లు చేస్తూనే- "అందర్నీ కాదని ఈ ముసలాయనకిచ్చి చేసేరుటమ్మా పిల్లనీ, రెండో పెళ్ళా, మూడో పెళ్ళా అని అడుగుతోందండీ మాణిక్యమ్మగారు," అని మళ్ళా నవ్వింది మా వదిన.

"మతి పోయిందేమిటే? రెండో పెళ్ళెవరికి? ఆవిడంటే అన్నాది కాని నువ్వు మళ్ళీ చెప్పడమేమిటి, నోరుముయ్యి" అన్నాడు మా తోడల్లుడుగారు.

నిజమే మరి___

నేను తోడల్లుణ్ణే కాక, ఆఫీసర్ని కూడాను.

మా వొదిన నాతో సరాగాలాడితే ఆడింది గాక! ఆయనెక్కడాడుతూ కూచోగలడు?

*          *          *

హైదరాబాదు చేరేను.

సత్యప్రసాద్ ఇంట్లో దిగుతానని అతనికి రాసేను.

బస్సుదిగి ఆటోచేసుకుని చిక్కడపల్లి వెళ్ళాను.

సత్యప్రసాద్ యిచ్చిన ఎడ్రస్‌ను బట్టి, వీధి నెంబర్ని బట్టి ఆ ఇల్లూ వెతుక్కున్నాను.

దొరికింది, అతను రాసిన ఆనవాలు—

మెయిన్ గేటుమీద చెక్కబోర్డు దానిమీద తెలుగక్షరాలతో వి. సాంబమూర్తి. ఎమ్.ఏ.ఎల్.టి—అన్న పేరు!

సామాను దింపించాను.

"ఎవరి కోసమండీ?"

"ఈ ఇంట్లో సత్యప్రసాన్ వున్నారు కదండీ!"

"ఉన్నారున్నారు స్టేట్ బ్యాంకీలో పని, ఆ కుర్రాడేనా?"

"ఆఁ ఆఁ అతనేనండీ—ఇక్కడేనా?"

"ఇక్కడే పెరటివేపె వాటా.అలా సందులోంచి వెళ్ళండి."

అతని తెలుగుచూసి ఇతనెక్కడో సర్కారు జిల్లాలనుంచి వచ్చినవాడేనని రూఢి చేసుకున్నాను.

మొహం కాస్త తేరిపార చూడగానే మనిషి గుర్తొచ్చాడు.

"నమస్కారం మేష్టారు! నన్ను గుర్తు పట్టలేదండీ?"

"అదే అదే ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం...."

"అదేంటి మేష్టారూ మీరు విజయనగరం కాలేజీలో లెక్చరర్‌గా పని చెయ్యలేదూ? నేను మీ దగ్గర బి.ఏ, చదువుకున్నాను—1951లో నా పేరు రామగోపాలం సార్!"

"నువ్వటయ్యా, నీ తస్సాచెక్కా, ఎంత మారిపోయావు? నిన్ను చూసీ చూడగానే ఎక్కడో చూసిన మొహంలా ఉందని అనుమానిస్తూనే వున్నాన్నుమా కాని నా స్టూడెంటనుకోలేదు. అలహాబాదు యూనివర్సిటీలో నేను చదివినప్పుడు

మా ప్రొఫెసరొకాయన సరిగ్గా యిలాగే వుండేవాడు. ఆయననుకున్నాను!"
అన్నారు సాంబమూర్తిగారు షేక్‌హేండ్ కోసం చెయ్యి జాపుతూ.

చేతిలో సంచి మార్చుకోడానికి వీల్లేదన్నట్లుగా నేను ఆ చెయ్యందుకో లేదు.

పైగా ఆటోరిక్షా అబ్బాయి నా సూట్‌కేస్ పట్టుకుని సందులోకి దూరి పోడం.... హడావుడిగా అతని వెనకపడ్డాను.

* * *

రెండ్రోజులైంది.

హైదరాబాదులో నేననుకున్న పన్లన్నీ అయిపోయాయి. సాయంకాలానికి గాని రేపుదయానికి గాని బెజవాడకి బస్సుటిక్కెట్టు కొనెయ్యమని సత్య ప్రసాద్‌కి చెప్పేను.

వేగిరం విశాఖపట్నానికి వెళ్ళిపోవాలనున్నాది.

అంచేత సాయంకాలం బస్సుకే టికెట్ దొరికితే బావుణ్ణనిపిస్తున్నది. ఇంతట్లోకే సత్యప్రసాద్ ఫోన్ చేసి టిక్కెట్టు రేపటికేనని ఇవాళ ఉండిపోక తప్పదని చెప్పాడు. త్యాగరాయ మండపంలో చెంబై వైద్యనాథ్ భాగవతార్ కచేరి వుంది రమ్మన్నాడు.

నాలుగురోజుల్నించి ఆఫీసు పన్లతో ప్రయాణాల్తో సతమతమయిపోతు న్నాను. ఇవాళ అనుకోకుండా ఈ అదృష్టం!

మహానుభావుడు, చెంబై మనం కావాలనుకున్నపుడు దొరకడు. ఆ మధ్య ఆయన విశాఖపట్నం వొచ్చినపుడు ఊపిరి సలపని పని. వెళ్ళలేక పోయాను.

ఇప్పుడు తలవని తలంపుగా ఈ అవకాశం.

గొప్ప ఆవేశం వొచ్చింది.

"సంగీత జ్ఞానము భక్తివినా సన్మార్గము కలదే మనసా" అనుకుంటూ గొప్ప సంగీతం వినడానికి మనస్సుని ఆయత్తం చేస్తున్నాను.

నాలుగురోజుల్నించే టెర్లిన్ పులెన్ బట్టల మధ్య ఉక్కిపోతున్నాను. దాని కూడా రిలీఫ్ దొరికింది.

మొహం కడుక్కున్నాను, తల దువ్వుకున్నాను. తలంటు పోసుకున్నా నేమో, జుట్టు కుచ్చులాగున్నాది. గొప్ప సుఖంగా వుంది.

తిలకంపీసా తీసుకుని నిలువుగా పొడుగ్గా బొట్టెట్టుకున్నాను.

గ్లాస్కో మల్లుపంచె తీశాను. ఉభయపింజలూ పోసి కట్టాను.

కళ్ళు లాల్చీ వేసుకున్నాను.

అకుచెప్పులు తొడుక్కుని బైటికొచ్చాను, బస్టాండ్‌దాక వచ్చి కిళ్ళీ కొట్టుమీద దళసున్నర ఆకులూ, నాలుగు వక్కపొడి పొట్లాలు, ఇంత సున్నం ముద్దా కొనుక్కున్నాను జేబులో ఉమాదేవిగారిచ్చిన ఏలక్కాయలూ, లవంగాలూ ఉన్నాయి.

బస్సుకోసం చూస్తూ తాంబూలం వేసుకుంటున్నాను. చిన్నప్పుడు మద్రాసులో ఉన్నప్పుడు అలవాటు, సున్నం నున్నగా ఉన్నది. అకులకి పట్టించి గట్టిగా వున్నది ఎలక్ట్రిక్ పోల్‌కి రాస్తున్నాను.

ఒకావిడ ఆ పోల్ని ఆనుకుని నిలబడ్డాది. ముచ్చటగా ముగ్గురు పిల్లలున్నారు. సున్నంచెట్టు ఎర్రచీరకి ఎక్కడ తగుల్తుందోనని దూరంగా జరుగుతూ హైదరాబాదులో ఈ"వెత్తలిపాక్"గాడు ఎవడన్నట్టు తేరిపార చూసింది నావైపు.

నేనూ చూశాను.

అనుమానం వేసింది.

ఎక్కడో చూశాను.

మరో పదిసెకండ్లు తిరిగేలోగా మర్రెండు సార్లు చూశాను.

నమ్మకం ఏర్పడుతోంది—

గాయత్రే!

ఇక్కడున్నాదా గాయత్రి?!

ముగ్గురు పిల్లలు కూడానా?

నావేపు చూస్తున్నాది గాయత్రి.

నేనెవరో ఇంకా గుర్తు రాలేదులావుంది.

"ఏదో జ్ఞాపక మేదియో—పలుకరించెను గుండెలో" అని రాసేడు కవి,

1951 నాటి మాట.

నేను బి.ఎ. ఫైనలియర్.

ఏను ఎస్సెస్సెల్సీ—

మాను ఎస్సెస్సెల్సీదాకా లెక్కలు చెప్పిన సుబ్బారావుగారమ్మాయి, గాయత్రి.

తనకి పదహారో ఏడు.

విజయనగరంలో—

అన్నాళ్ళూ ఎక్కడున్నా కానీ ఆ ఏడాది మా ఇంటికెదురుగా వున్నింట్లోకి వచ్చేరు.

చెవిలో సొంతరాగం గుంయిమంటున్న తుమ్మెదని నేను.

విడీవిడని మొగ్గ గాయత్రి.

చూపుల్తోనే సంపూర్ణాలింగనాలు చేసేసుకునేవాళ్ళం.

అంతకంటే ఏం చెయ్యాలో మాకు తెలీదు అప్పటికి మరి.

ఆ తరువాత కొన్నాళ్ళకి వాళ్ళెల్లిపోయారు.

ఆ ఇంట్లోంచి. నాకు గాయత్రి అపుపళ్ళేదు మరి. కాని పెళ్ళిచూపుల కెళ్ళి ఆడపిల్లల్ని పరీక్షగా చూసేటపుడు గాయత్రే జ్ఞాపకం వచ్చి ప్రతి పిల్లా అలాగే కనబడేది. కాని ప్రతిపిల్లకి గాయత్రికున్నలాటి కళ్ళెక్కణ్ణుంచొస్తాయి. ఎక్కడో సత్యభామకి తప్ప!

పిల్లలు నచ్చకపోయినపుడల్లా గాయత్రి జ్ఞాపకానికొచ్చి ఆ మాట చెప్పడానికి మొహమాట పడిపోయేవాణ్ని—

నాకిప్పుణ్ణుంచీ పెళ్ళేమీటమ్మా అని తేల్చేసేవాణ్ని.

చివరికోసారి మా అమ్మతో అన్నాను.

సుబ్బారావు మేష్టారమ్మాయి గాయత్రినైతే చేసుకుంటానమ్మా అని. మా అమ్మ భోగట్టాలు చేసింది ఎక్కడున్నా దెక్కడున్నాది మా కాబోయే కోడలంటూనూ

ఎక్కడున్నాదో మరి తెలిసిందే కాదు.

చివరికిక్కడ తేలింది.

"నమస్కారమండీ" అంది. రెండు చేతులూ జోడించి

నోటి్నిండా ఆకులు- చెయ్యాడించేను.

"మీది విజయనగరం కాదండీ?"

ఇన్నాళ్ళయి పోయినా నేను పలకరించి మాట్లాడలేకపోయాను. పైగా తను పలుకరిస్తేకూడా మాట్లాడ్డానికి వీల్లేకుండా ఈ ఆకులు నమలడం వొకటీ.

తల నిలువుగా ఆడించేను.

ఉమ్మి తుంపర్లు గాని పడిపోతాయేమోననే భయంతో కొంచెం వెనక్కి తగ్గేను.

"మీ ఇంటిపేరు భమిడిపాటివారు కాదూ!"

కుడిచేతి చూపుడువేలుతో "కరెక్ట్" అని సంజ్ఞ చేసేను.

"నేను గాయత్రినండి సుబ్బారావుగారమ్మాయిని— మీ ఇంటెదురుగుండా వుండేవాళ్ళం కొన్నాళ్ళు- జ్ఞాపకం ఉన్నామా?"

ఓ మాటు ఉమ్మి "అయ్యో, ఎంత మాటా!" అన్నాను.

"మీ అబ్బాయి రామగోపాలం అని వొకడుండాలి, ఇప్పుడెక్కడున్నాడు?"

వెనకాల ఏదో రాయి తగిలినట్టు అయింది. అడుగు తడబడింది. బర్హామంటు బస్సొచ్చింది.

"బర్హాంపురా చల్తీ"? అని అడుగుతూ వాడేం చెప్తున్నాడో వినిపించుకోకుండా బస్సులో దూకేసేను.

* * *

వాల్తేరు స్టేషన్లో రైలు దిగేసరికి పావుతక్కువేడవుతోంది. రిక్షా మాటాడుకున్నాను. ఇంటికి చేరేసరికి ఎనిమిది దగ్గరవుతోంది.

పనిమనిషి నేనూ వొకేసారి గుమ్మం దగ్గర తటస్థపడ్డాం.

"పరేగాని అలా సెలూన్‌కెళ్ళి అప్పారావు నోసారి రమ్మన్నానని చెప్పిరా" అని పనిమనిషికి పురమాయించేను.

పనిమనిషి వెళ్ళింది.

"అప్పారావెందుకూ?" అంటూ సత్యభామ ఎదురొచ్చిందింట్లోంచి.

జేబులోంచి రెండు సీసాలుగా వున్నదొక పాకెట్ తీశాను.

"ఏమిటిది?"

"జుట్టుకి రంగేసుకోమన్నావుగా"

"అన్నానుగానీ మీరు వేసుకుంటారని అనుకున్నానటండి! ఇంతకీ ఏం జరిగింది.

"కథే జరిగింది."

"ఏమి కథ?"

"పనికిరాని కథ"

"పనికిరాక పోవడమేమీ?"

"నిజంగా జరిగిందేదైనా సరే కథగా పనికిరాదన్నారు ఆస్కార్ వైల్డు!"

"లోమా సైమ్" అని అరుస్తున్నాడు రేడియో సిలోన్లోంచి.

("జ్యోతి" మాసపత్రిక—జనవరి 1970)

# పృథ్వీపతి

రెండు రోజులైంది; కలెక్టర్ మధుసూదన్ ఈ జిల్లాలో ఛార్జి తీసుకొని. ప్రముఖులంతా వొచ్చి పరిచయాలు చేసుకోడం అయింది. ఆఫీసుకి సంబంధించిన వాళ్ళు ఒక్కొక్కళ్ళూ వొచ్చి దర్శనాలు చేసుకోడం ఇంకా అవుతూనే ఉన్నాది. నిన్న సాయంకాలం వెల్కమ్ పార్టీ ఫొటో, నిన్నరాత్రి ఆఫీసర్స్ క్లబ్ డిన్నరు యిచ్చింది.

ఇవాళనించీ "రొటీన్ వర్క్" కూడా మొదలెట్టాలి.

మొట్టమొదటి ఫైల్ తెరవగానే "అబ్బా!" అని కుర్చీలో వెనక్కి చేరబడిపోయాడు. "అప్పుడే శిక్షలు మొదలా?" అని విసుగు కలిగిందతనికి.

ఎవ్వణ్ణీ దగ్గిర్నించి పరిశీలించి చూడడానికి వీల్లేదు. పరిచయంవున్నా పరధ్యానం నటించాలి, వీసమెత్తు పొరపాటు జరిగినా "నీ ఉద్యోగం ఎందుకు తీసెయ్యకూడదు? నీ ఇంక్రిమెంటు యాడాదిపాటు ఆపీగల్ను జాగర్త. నిన్ను చావగొట్టి చెవులు మయ్యాలనుందోయ్" అంటూ కాయితాలు సంతకాలు చెయ్యాలి.

గుమస్తాలూ, శిరస్తాదారూ, పెరసనల్ అసిస్టెంటూ వీళ్ళందరూ ఆ కాగితాలన్నిట్లోనూ వాద ప్రతివాదాలు జాగర్తగా కూర్చిపేర్చి సారాంశాన్ని తేర్చుతారు. ఎవడిమీదికో గాలి పోగుచేసి ధూళి రేపుతారు. అందువల్ల ఎవరికీ నష్టం రాదు. కాని ఆఖర్ని తనుపొడిచే కలంపోటు మాత్రం వాడి గుండెల్లో గునపంపోటు అయిపోయి, ఆ దెబ్బకి వాడి పెళ్ళాం పిల్లలూ వీధిని పడిపోతారు.

వీడెవడో కృష్ణమూర్తిట. నాలుగు నెలలపాటు వరసగా వాడి పెరసనల్ రిజిష్టర్లు ఆలస్యంగా పుటప్పు చేసేడుట. వాడికి ఆరు నెలలపాటు ఇంక్రిమెంటు ఆపెయ్యాలని ఆ తడాఖా సర్వీసంతా ప్రతీ ఏడూ నష్టం వొచ్చేటట్టు చెయ్యాలని—ఆ ఫైల్‌లో గ్రంథం నడిచింది.

"ఈ కృష్ణమూర్తిని నేను చూడాలి" అనుకున్నాడు కలెక్టర్ మధుసూదన్.

ఫైలుమీద "ఇరవై రోజుల తర్వాత దీన్ని నాకు పంపండి" అని వ్రాసి

డఫేదార్ని కేకేసి, "బి.ఫైవ్-కృష్ణమూర్తి-ట—నేను రమ్మన్నానని కబురుపెట్టు' అన్నాడు.

*　　　*　　　*

"నమస్కారం సార్."

"ఊఁ....ఎస్!"

"నేను కృష్ణమూర్తిని సార్. బి. ఫైవ్."

కృష్ణమూర్తిట....ముఫ్ఫై నాలుగేళ్ళట. అతనికి .... ఇరవై నాలుగేళ్ళు కూడా లేవా అన్నట్టున్నాడు....తెల్లగా, ఎక్కడా పుట్టుమచ్చ కూడా లేని రంగు. తిన్నగా పోతపోసినట్టున్న విగ్రహం. నల్లగా ఒత్తుగా ఉంగరాలు తిరిగిన తల, బిరుసుగా పొగరుబోత్తనంతో మెరుస్తున్నాది.

కృష్ణమూర్తి....కృష్ణమూర్తే .... ఆర్. కృష్ణమూర్తి కాబోలు- ఫెమిలియర్ నేమ్-

అప్పను....

కృష్ణా....ఆర్. ఎమ్. కృష్ణా.... మేగాడ్ ఫర్‌బిడ్....బి.ఎస్సీ ఆనర్స్ చదివి ఇతగాడిక్కడ యూడీసీగా అఘోరిస్తున్నాడా?....క్యూములేటివు ఎఫెక్ట్‌తో ఇంక్రిమెంట్ స్టాప్ చెయ్యాల్సింది ఇతనికేనన్నమాట!

"ఎస్....వాట్ మేడ్ యు కమ్ హియర్?"

"కబురు చేసేరుట."

"ఐసీ!....సో-నువ్వు కృష్ణమూర్తా? నీ సబ్జక్టు ఏమిటి?"

"అబ్కారీ;గన్ లైసెన్సెస్, మునిసిపాలిటీ ఏక్టు!"

"ఆల్‌రైట్!ఇదిగో, ఈ ఫైల్ చూసేవా! దీంట్లో నీమీద రివర్షన్‌కి చాలినంత మెటీరియల్ ఉంది.అయినా నేనిప్పుడేమీ అర్డర్సు వెయ్యడంలేదు.నీ కిరవై రోజులు టైమ్ యిస్తున్నాను. ఈలోగా నువ్వు బుద్ధికలిగి జాగర్తగా పనిచేసుకున్నావా, సరి.... లేకపోతే"

"థాంక్యూసార్"

"బై ది బై! నిన్ను నేనెక్కడైనా చూసేనా?"

కృష్ణమూర్తి మొహాన ఇంతసేపూ దాగిన చిరునవ్వు గలగలా చప్పుడు చేస్తూ బైటపడింది. ఆ చప్పుడు వింటే పాత జ్ఞాపకాలొస్తున్నాయి.

"ఫెమిలియర్ నోయిస్—"

సముద్రపు కెరటాలు బండరాళ్ళ మీద కొట్టుకునేటప్పుడయ్యే చప్పుడు. కర్రభరిణలోంచి గవ్వలు సిమెంటు గచ్చుమీద ఒంపినప్పుడయ్యే చప్పుడు, ఆహ్లాదంగా వుండకపోయినా ఏదో చిత్రంగా వుంటాయి కొన్ని శబ్దాలు. అలాంటి వాటిల్లో కృష్ణమూర్తి పకపక నవ్వేటప్పుడయే చప్పుడుని చేర్చొచ్చు. అది పాత పరిచయపు ధ్వని....

సందేహం లేదు....ఆ. రెమ్. కృష్ణా!

"చూడ్డంకాదు సార్—మనిద్దరం వాల్తేర్లో ఆంధ్రా యూనివర్శిటీలో సద్ధర్మ సదన, రూమ్ నెంబరు అరవై ఆర్లో—"

"మై....గాడ్!"

"మూడు రోజులుగా సెలవులో ఉన్నానండి....అందువల్ల తమరు కబురు పెట్టేదాకా దర్శనం చేసుకోలేకపోయాను."

"ఇటీజ్ ఆల్‌రైట్!"

*　　*　　*

"వాడికి కబురుపెట్టి ఇంటర్‌వ్యూ ఇచ్చార్టగా!....వాడి సంగతి మీకు తెలీ ద్సార్! ఈ కలెక్టరేటుని కొండచిలవలాగ చుట్టుకుని ఒదలకుండా వున్నాడుసార్. తిన్నగా పనిచెయ్యడు; ట్రాన్స్ఫర్ చేస్తె పోడు. వూళ్ళో కట్టెల అడితీ ఊరి పక్కనే పొలం. వూళ్ళో సొంత యిల్లూ సినిమాహాల్లో షేర్లూ, అందరూ తెలి సిన వాళ్ళు, అత్తారు కూడా యీ వూరే....వాడు తెచ్చే ఇన్ఫ్లూయన్సులకి, రిక మండేషన్లకి, కానుకలకి ఇక్కడికి ఇదివరకొచ్చిన ఐ.ఏ.యస్. ఆఫీసర్లందరూ ఎలాగో లొంగిపోయేరు. మీరే వాణ్ని ఓ పట్టుపట్టాలి సార్." అని పి.ఏ. చెప్పేడు.

"సరే-సరే—" అన్నాడు కలెక్టరు.

మధుసూదన్ ఇంకా చాలాసేపు "వాణ్ని" గురించి ఆలోచించేడు. "వాడేం నే నెరగని కృష్ణమూర్తా! వాణ్ని గురించి మీకన్నా నా కెక్కువే తెలుసును.... ఏ మొగల్ పాదుషానో మళ్ళీ యిలా పుట్టవించి వుంటాడు—అంత విలాస పురుషుడు వాడు. వాడికి చదువుకొనేటప్పటికే—వేలది. పానంబు జూదంబు అంటూ చెప్పిన సప్త వ్యసనాల్లో మొదటి మూడూ అబ్బేయి. ఇప్పుడూ ఉండే ఉంటాయి. అడ్డం వొచ్చిన వాళ్ళందరికీ ఎవడి యోగ్యతనిబట్టి వాడికి చేతికీ మూతికీ పారేస్తూనన్నిలా అనుభవించనియ్యండ్రా అనడం వాడి విద్య. మీరంతా తినే వుంటార్లెండి...."

"వాడొక ఫ్రీబర్డ్!" అనుకున్నాడు మధుసూదన్.

"మరొకళ్ళకయితే వాడికున్న ఆ స్వేచ్ఛ; అనుభవించడానికి ఆ యోగ్యత ఎలా వస్తాయి?"

"వాడితో పోలికే లేదు!"

"మనదంతా జైల్లో జీవితంలాగ మరీ రొటీన్. అంతా యాంత్రికంగా జరగాలి. ప్రోగ్రాం ప్రకారం, టైం ప్రకారం, ఎక్కడా తేడా రాకూడదు. ఎక్కడా ఎప్పుడూ ముందూ వెనకా తొంభయిమంది కాపలా. వేసే అడుగుకీ చేసే పన్లకీ అందరూ చెప్పగలిగినన్ని రూల్సూ సలహాలూ వుంటాయి. ఏ మాత్రం పక్కకిపోయినా అందరూ వింతగా చూస్తారు.

"నాకైతే అసలు స్వేచ్ఛ అనేదే లేదు....బొంబాయిలో కస్టమ్స్ డిపార్టుమెంట్లో ఉండేవాణ్ణి-అప్పుడే నయం కావలసినంత స్వేచ్ఛ వుండేది. సంపాదన; విలాసం; భోగం. అన్నీ వుండేవి. డ్యూటీదిగి వెళ్ళిపోతే చీకట్లోకి వెళ్ళిపోవచ్చు. చీకట్లో అంతా తమాషాగా వుంటుంది. ఎప్పటికప్పుడు కొత్తగా థ్రిల్లింగ్‌గా; సుఖంగా, ఎన్నో దేశాల మనుషుల్తో పరిచయం, స్నేహం, సంపర్కం....స్వరాష్ట్రంలో వుండే సదుపాయంకోసం అవన్నీ వొదులుకొని యిలా వచ్చేసేను.

"ఇక్కడ నే నెప్పుడూ నేనుకాదు. ప్రజలకి, ప్రజా ప్రతినిధులకి సాధన సామగ్రిలాగ చేసీసేరు ఈ ఉద్యోగాన్ని. ఎవడెవడో ఎప్పుడెప్పుడో వచ్చేస్తాడు. ఏ క్షణంకూడా నా యిష్టం లేదు.

"నాకు సినీమా చూడాలని వుంటే ముందుగా నా పి.ఏ.కారో, క్యాంపు క్లార్కో హాలు యజమానికి కబురుచేస్తారు.వాడేమో "అన్నీ సరిగా" ఉన్నాయో లేదో చూసుకుని, జాగ్రత్తపడి నాకోసం బోలెడు ఏర్పాట్లు చేసేస్తాడు. పోలీసు సూపరెంటుగారు ఓ అరడజనుమంది జవాన్లని వీలైతే ఒక యినస్పెక్టరుతో సహా అక్కడి డ్యూటీమీద వుంచేస్తారు.

"నేను రోడ్డుమీద కార్లో వెడుతూ నా యిష్టం వచ్చిన దగ్గర అయిదు నిమిషాలు ఆగి అక్కడ జరుగుతూవుండే వింతనే చోద్యాన్నో లేక గలాటానో గమనించవచ్చునా? వీల్లేదు వీల్లేదు. నేను తీర్పు కేగాని సాక్ష్యానికి పనికిరాను. నేను ఎక్కడేనా నిలబడ్డానంటే అక్కడ మామూలు జీవితం అంతా స్థంభించి పోతుంది.

"నేను చిన్నప్పటిలాగ హోటలుకి వెళ్ళి నాకు బాగా నచ్చే దేదైనా హోటలు సెర్వరుతో తగాదా పెట్టుకుంటూ వాణ్ని కిందామీదాపెట్టి తినడానికి వీలుంటుందా? ఉండదు. నా డఫేదారు పర్మిషన్ లేకుండా నేను వచ్చి మంచి నీళ్ళుకూడా తాగడానికి వీల్లేదు. హెడ్‌క్వార్టర్స్ ఆర్. ఐ. అసలు ఒప్పుకోడు.

"నాకెవరైనా గరల్ ఫ్రెండు ఉన్నాదనుకో ఆవిణ్ని నేను నా యిష్టం వచ్చినట్టు కలుసుకోవచ్చా?....నాతోబాటు యం. ఏ. చదివిన సునంద ఈ ఊరి వుమెన్సు కాలేజిలో ఇంగ్లీషుకి హెడ్డాఫ్ ది డిపార్టుమెంట్‌గా వున్నాదిట.ఆవిడా నేనూ తరుచుగా కలుసుకోవాలని వుంటుంది. కబురుపెట్టి వెళ్ళవచ్చును. కాని అంతా కృత్రిమంగా వుంటుంది. కబురు పెట్టకుండా నా జీప్ నేను డ్రైవు చేసుకు వెళ్ళొచ్చు. కాని అదీ కృత్రిమంగానే వుంటుంది. నేనెక్కడుంటే అక్కడ వాతావరణం సహజత్వాన్ని కోల్పోతుంది.

"నన్నుగురించి తెలిసిన వాళ్ళు తెలియని వాళ్ళు అంతా అంతులేని విస్పరింగ్ కాంపైన్ నడుపుతారు. వీళ్ళంతా నాకు కావలసిందాన్ని నాక్కావలసినప్పుడు నన్ను అనుభవించ నిస్తారా? ప్రేక్షకులు లేకుండా నేనొక్కపని అయినా చెయ్యగలనా? ఒక్క కోర్కె అయినా తీర్చుకోగలనా?—"

అని ఆవేదనలో పడ్డాడు మధుసూదన్.

"వాట్ కృష్ణమూర్తి? ఏమిటంటావు?"

"నన్నడిగితేనండి — డ్యూటీని అలా మోస్తూ కూర్చోకూడదండి. డ్యూటీ దిగిపోగానే—"

"నా అంత పెద్ద ఆఫీసరు డ్యూటీ దిగిపోవడం అనేది వుండదేమొ."

"అలా ఎందుకనుకోవాలి? ఎవరికి నచ్చిన అండర్ వరల్డ్‌వారు తయారు చేసుకుంటూనే వుంటారే! అడ్జస్ట్ చేసుకోడంలో ఉంటుందనుకుంటానండి".

"ప్రయత్నంచేసి చూడాలి. ఈ మొనాటనీతో నాకు బోరు కొడ్తోంది."

* * *

"కలెక్టరుగారు నాకొక చిన్న ఉపకారం చేసిపెట్టాలి."

"అదేమిటి కృష్ణమూర్తి ఆ భాష!?....సారీ....ఎవరో వొచ్చారా, నీకూడా!...ఎస్!?"

"ఈ అమ్మాయి—"

"నమస్కారం సార్."

ఇరవై ఏళ్ళ అమ్మాయి అందంతో, చురుకుతనంతో, ఆమె అవయవాలు, కళ్ళు మెరిసిపోతున్నాయి.... వాటే ఫిగర్ !.... ఈ అమ్మాయికి ఉపకారం చెయ్యగల్గిన పరిస్థితిలో ఉన్నందుకు నాకు కంగ్రాచులేషన్స్-

కూర్చోమన కూడదు........

"ఈ అమ్మాయి—పేరు రాజేశ్వరి—కలెక్టరాఫీసులో టెంపరరీగా ఒక టైపిస్టు ఉద్యోగం ఖాళీవొచ్చింది— ఈమె అప్లై చేసిందిసార్, కలెక్టర్‌గారి దర్శనానికి వచ్చింది—"

"ఐసీ—మీ బంధువా?"

కృష్ణమూర్తి ఆ ప్రశ్న అనవసరం అన్నట్టు నవ్వేడు "బంధువులాంటిదేనండి. వీళ్ళసిస్టరూ నేనూ క్లాస్‌మేట్స్——"

"వీళ్ళ సిస్టరా?....ఆవిడెవరు?"

"....ఆవిడ—రమణమ్మగారని జెనరల్ హాస్పిటల్ వర్కు చేస్తున్నది. డాక్టరు కాదండి....మాకు నైబర్ కూడాను."

"ఐసీ—సరే—పి.ఏ గారు చూస్తారనుకుంటాను ఆ వ్యవహారాలు—తరవాత కనబడమను——"

* * *

"క్లియోపాట్రాలాగున్నాది, దానికి మన ఆఫీసులో ఉద్యోగం ఖర్మ ఏమిటోయ్ కృష్ణమూర్తీ?

"నేనదృష్టవంతుణ్ని సార్. ఈమె కుడా మీకు నచ్చదేమో అని భయపడి పోయాను!

* * *

డర్టీఫెలోస్! వెధవ కాయితాలూ వీళ్ళూను! రొటీన్స్, రొటీన్, అంతా రొటీన్! సైలెన్‌లెస్ మొనాటనీ; మార్పులేని మందకొండి జీవితం!-ఏమిటిది?- సెలవు కావాలిట. బ్రదర్స్‌మ్యారేజీ - వెణ్ణెల్లెందుకో! రెఫ్యూజ్‌డ్....ఇదేమిటి? - ప్రమోషన్....ఈ ఏడాది లిస్టులో ఒద్దు.... ఈ చెత్త ఫైలు దేనికో?- ఎవడో రికార్డులో ఫైలుమాయిచేసేడని చార్జి,పర్మనెంటుగా రివర్టుచేసి పారేస్తేసరిపోతావనీ వెధవలు....ఏమైపోయింది రాజేశ్వరి?కృష్ణమూర్తి కనపడ్డేం?

ఈ ఫైలేమిటి? - బోర్డుమెంబరు వస్తున్నాడు - ఆయనగారు క్యాంపులో అడిగే విషయాలమీద లంకెలు - అన్ని కాపుల లెక్కలు, ఇలాంటివి ఫైల్లోకట్టి పంపేస్తే ఎలాగ? - బ్రింగ్!

కృష్ణమూర్తి ఫైల్సేమీలేవా?.... యస్. కృష్ణమూర్తీ—స్పీక్! స్పీక్ ఎ బౌట్ మై స్వీట్ ఫ్రెండ్!.... బ్రింగ్! బ్రింగ్ దట్ నైస్ క్రీచర్ ఎగైన్. ఒక్కసారి వచ్చి వెళ్ళిపోయింది. ఈ కృష్ణమూర్తి గాడొకడు— కబురు పెడితేనే గాని కనబడి చావడు.

"ఏమయ్యా—ఏం వచ్చావు?"

"ఈ ఫైల్లో స్పీక్ రాశారుసార్"

"ఐసీ—"

"దీంట్లో కాంప్లికేషనేమీ లేదుసార్.... ఆర్డరు వేసెయ్య వచ్చునండి—"

"—వెధవ ఫైల్స్ వెధవ ఆర్డర్స్ నువ్వూ—

"అయ్యా—"

"అదెవరో అమ్మాయికి ఉద్యోగం కావాలన్నావుగా"

"తమ చిత్తంసార్, కాని ఆ అమ్మాయి యస్సల్సీ పాసవలేదుట సార్. టైపుమాత్రం చెయ్యగలదు."

"వంట వచ్చునా?"

"ఒచ్చుసార్.

"నా మిసెస్‌కి ఒక లేడీ అసిస్టెంట్ కావాలి.... కొన్ని నెలలే అనుకో—ఆ మధ్య వచ్చినావిడ—షి ఈజ్ వెరీ ఇరెగ్యులర్.... షి ఈజ్ ఓల్డ్ ఆల్సో—"

"సర్—"

"ఒకసారి ఆమెనివచ్చి నా మిసెస్‌కి కనబడమను. రేపో ఎల్లుండో జాయిన్ కావచ్చు."

"సరేసార్"

"జాగర్త"

"ఎంతమాట సార్! నాకామాత్రం తెలీదా?"

* * *

"నమస్కారం సార్."

"ఎవరది?—ఏమిటీ—మిస్ రాజేశ్వరి? ఏమిటి, ఇలా వచ్చేవు? నిన్ను ఆఫీస్ రూమ్ దగ్గరికి పంపించెవరు?"

"నేనే వచ్చానండి. ఆఫీస్ పనిమీదేనండి"

"ఐసీ, వాట్ కెనైడూ ఫార్యూ?"

"బందల పత్రులలో బంజర్లు పంచి పెడుతున్నారటగా, మా చిన్నాన్న గారు అప్లికేషన్ పెట్టుకున్నారండి, పదెకరాలు వారికి గ్రాంటు చేయిస్తే— మీ పేరు చెప్పుకుని బ్రతుకుతారండి."

"అరె! ఏమిటో అనుకున్నాను.... నీకు మాట్లాడడం కూడా వచ్చునే!.... ఆల్‌రైట్! ఐ విల్ డూ ఇట్."

* * *

"సార్!"

"ఓ'—రాజేశ్వరి—ఏమిటది?"

"—ఈ చీటీమీద పేరు రాసి వున్నాయన మా మేనమామగారి అల్లుడండి. నారాయణపేట తాలూకా ఆఫీసులో ఎనిమిదేళ్ళబట్టి మగ్గిపోతున్నాడండి. ఈ వూరికి ట్రాన్స్‌ఫరు చేయించమని ప్రాణం తీస్తున్నాడండి."

"అంటే?....నువ్వు ఇలాంటి పనులు చేసిపెట్టగలవని అతనికెందుకు తెలిసింది?"

"ఎంతమాటన్నారండి సార్!....నేను కలక్టరుగారి వంటమనిషినని ఎవరికీ తెలియదంటారా సార్?

"ఐసీ! మరి అమ్మగారితో చెప్పావా?"

"తమరు చెప్పమంటే చెబుతానండి."

* * *

"సూరారెడ్డిగారు సార్.గోవిందపురం యువజన సంఘం ప్రెశిడెంటుగా వుండి చాలా మెప్పుదల అయిన పనులు చేశారండి."

"ఐసీ—కూర్చోండి"

ప్రస్తుతం వారు తమ దర్శనానికి ఒక పనిమీద వచ్చేరండి"

"గో ఎ హెడ్ !"

"కొత్త సిమెంటు ఫ్యాక్టరీ విషయమై గవర్నమెంటు రిపోర్టు పోతుందట కదండి. దానికి సైట్‌గా ఈయన భూమిని రికమెండ్ చేయాలని తమర్ని కోరడానికి వచ్చేరు."

"గట్టిగా చెప్పలేను మిస్ రాజేశ్వరి! క్రిందినుంచి రిపోర్టులన్నీ ఎలా వచ్చేయో చూడాలి."

"తమరు దయతలిస్తే క్రిందవార్ని ఆకట్టుకోడం ఎంతసేపండి"

"సరే చూద్దాం వెళ్ళండి"

"………….."

"వెళ్ళాడా!"

"వెళ్ళాడండి"

"ఇటు చూడు మిస్ రాజేశ్వరి! ఈ వచ్చిన పెద్దమనిషి—

"సూరారెడ్డండి"

"అది చెప్పావు—నీ కెలా పరిచయం—?"

"………….."

"పరిచయం కూడా లేదన్నమాట"

"ఉన్నదండి"

"ఎలాగ?

"మా అక్కకి పొలముందండి. అది ఇతనే చేస్తున్నాడు—"

"నువ్వూ నీతోబాటు మీ అక్కా. ఆవిడతో ఆవిడభూమి చేసే సూరారెడ్డి ఇంతమంది నా ఎడ్మినిస్ట్రేషన్లోకి రావడం బాగాలేదు. నీ కిదివరకే నాలు గైదుసార్లు చెప్పాను—

"ఈ ఒక్కటీ చేసిపెట్టండయ్యగారూ. ఇంక అడగను"

"అడగవని ఎలా రూఢి?"

"అడగనంటే అడగనండి!"

"అయితే యిదే ఎందుకు మానయ్యరాదు?"

"చెప్పాలా, సార్?"

"చెప్పు—"

"అక్క ఈయనదగ్గర వెయ్యిరూపాయలు అప్పు పుచ్చుకుని నగచేయించు కుందండి—తొందర చేస్తున్నాడు—"

"ఈ పని చేయించిపెడితే ఆ వెయ్యి అడగడం మానేస్తాడు. అంతేగా"

"అయ్య"

"సో—నాచేత తప్పుడు పనులు చేయించడానికి మీరు లంచాలు కూడా పుచ్చుకుంటున్నారన్నమాట."

"అంతంత మాటలంటే నేనం చేసేదండి?"

"నో గో—నేనిలాంటి పనులు చెయ్యను. నువ్వు వెళ్ళిపో—"

"ఇంటికి వెళ్ళిపోతున్నానండి: అమ్మగారికి చెప్పేసి—"

"యూ, బిచ్!"

కలం కిందపడి విరిగిపోయింది. సిరా నేలమీద అసహ్యంగా మరక కట్టింది.

*     *     *

"హలో-కలెక్టర్ స్పీకింగ్ !....ఎవరు? పి. ఏ. గారా? నమస్కారం, నమస్కారం—ఎవరు? యూడీసీ కృష్ణమూర్తినా? ఎరెస్టు చేసేరా ? .... నాన్సెన్స్!....వారంట్ ఉంది కాబోలు.... ....ఐసీ-జామీను ఎవరేనా వుంటే వాళ్ళే వచ్చి విడుదల చేయించుకుంటారు—మనం ఇంటర్ ఫియర్ కానక్కర్లేదేమో-పోలీస్ సూపరెంట్ అలా అనుకున్నారా?....రిడిక్యులస్-నేనా, ఔట్ ఆఫ్ ఆల్ పీపుల్....ఏమిటి ఈ ఇన్వెస్టిగేషన్? స్మగ్లింగ్ అఫ్పైన్ తో ఇతనికి. సంబంధం వుందా! చాలా ఆశ్చర్యంగా వుందే-థాంక్యూ."

*     *     *

రివిన్యూబోర్డు ఆర్డరు ప్రకారం కలెక్టరు మధుసూధన్ కి ట్రాన్స్ఫర్ అయింది ఆర్డరు వచ్చిన అయిదోరోజున రిలీవు అయి. పదమూడోరోజున కొత్తచోటజాయిన్ అయ్యాడు మధుసూధన్.

*     *     *

"నేను జామీనుమీద విడుదలయ్యాను సార్. ఎన్క్వైరీవస్తే నా ఉద్యోగం పోతుంది. పోనివ్వండి. నాకేదో దేవుడిచ్చింది ఇంతవుంది; అదే చాలు. కాని ఆ సి.బి.ఐ. వాళ్ళు దేవాంతకులు సార్. వాళ్ళ నోళ్ళు ముయ్యడానికి బ్రహ్మాండం బ్రద్దలైపోతోంది సార్. వాళ్ళు ప్రతి ఇష్యూలోను మిమ్మల్ని నాతోపాటు మిక్సప్ చేస్తున్నారు. మీ అండ చూసుకుని నేను విజృంభించేనని వాళ్ళ రికార్డు. దఫేదార్ని ప్యూన్స్ని అందర్నీ ఎన్క్వైర్ చేసేరు....ఎంత మందినని నోరుముయ్యటం-చచ్చిపోయాను సార్."

"ఓ! వెరీసారీ!"

"మీపైన ఈ రాజేశ్వరీ ఎఫైర్ రుజువు కాలేదులెండి. అది ప్రూవ్ అయితే ఆవిడద్వారా కొన్ని ఎట్రాసిటీస్ జరిగాయని ఛార్జి వచ్చేదే-ఎలాగేనా కొన్ని-అదే బంజర్ల పంపకం -స్టాప్ పనిష్మెంట్సు ట్రాన్స్ఫర్సు-కొన్ని పితూరిలు గవర్నమెంటుకి పోయాయిసార్. మీకు తెలుసో లేదో-"

"ఐసీ-తెలీదు"

కాని, ఏం పరవాలేదు సార్. సూరారెడ్డికి మీరు బోలెడు హెల్పుచేసేరు. వాడి బ్రదరు నారాయణరెడ్డికి మినిస్ట్రీలో మంచి పలుకుబడి వుంది. నేను ఇక్క

ఇక్కుంచి తిన్నగా హైదరాబాదు వెళ్ళి అవన్నీ డ్రాప్ చేయించేస్తాను. సూరారెడ్డి కూడా ఈసరికి హైదరాబాదుకు చేరుకుని వుంటాడు."

"చాలా థాంక్స్ కృష్ణమూర్తి, మెనీ మెనీ థేంక్స్. నువ్వు లేకపోతే ఇదంతా—"

"ఏం లేదుసార్. ఇదంతా నా డ్యూటీ.

* * *

గౌరవనీయులైన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఛీఫ్ సెక్రటరీగారికి

నమస్కారం.

జిల్లా కలెక్టరుగా నేను డ్యూటీలో వుండి ఉద్యోగస్తులకు, ప్రజలకు ఇతర దరఖాస్తుదారులకు, కొన్ని తప్పుడు ఆర్డర్లు జారీచేసినట్లు, వాటివల్ల నష్టం పొందినవారు నాపైన, లేదా నా ఆర్డర్లపైన ప్రభుత్వానికి వినతులు, పితూరీలు పంపుకొన్నట్లు తెలిసినది. చాలా సంతోషంతో ఈ సవాలును స్వీకరిస్తున్నాను.

"నా విష్ణుః పృథివీ పతిః" అని సంస్కృతంలో ఒకనుడి. విష్ణు అంశ లేనివాడు పాలకుడు కాలేడని దాని అర్థము. పాలన నా చేతిలో వుండినప్పటికి, ప్రభుత్వము నన్ను పరీక్షించి బాధ్యతగల ఉద్యోగానికి తగినవాడనని నిర్ణయించినప్పటికి, చిత్త చాంచల్యము వల్ల, బలహీనతలకు లొంగి నేను దారి తప్పినమాట నిజము. అనాలోచితంగా అధికార దుర్వినియోగం చేసినమాట నిజం.

బాధ్యతగల ప్రభుత్వోగి తనకు నచ్చినదారిని వెళ్తే ప్రజలకు నష్టంవచ్చే పరిస్థితి ఏర్పడినప్పుడు స్వంత విషయాల్లోకూడా చాలా నిబంధనలు పాటించాలన్న విషయం నాకు అవగాహన అయింది. తప్పుచేసే మనిషి స్థాయినిబట్టి తప్పు పరిమాణం పెరుగుతుందని నేను గుర్తిస్తున్నాను.మామూలు మనిషి చేసే తప్పులే, జిల్లా కలెక్టరుగా వుండి నేను చేయడంవల్ల చాలా పెద్దె తప్పులయిపోయి విపరీత పరిణామాలకు దారితీసింది.

నేను చేసివున్న తప్పులకు ప్రాయశ్చిత్తంగా నేను నా ఉద్యోగానికి రాజీనామా యిస్తున్నాను. అంగీకరించ ప్రార్థన.

ఇట్లు
మధుసూధన్

("విజయ" మాసపత్రిక; జూన్ 1979)

# థాంక్స్ టు రాఘవరావ్

సాయంకాలం ఆరుదాకా చూశాడు రాఘవరావు.

విశ్వనాథం రాలేదు.

బుర్ర కాడెక్కిపోతోంది— నిరీక్షణతో అలిసి.

"నేనెల్లుండి వెళ్ళిపోతున్నాను!" అన్నాడు నిన్న, ఆఫీస్కొచ్చి.

ఢిల్లీలో వుంటున్నాడు. కలుసుకుని పదేళ్ళయింది. నిన్న అతను ఆఫీసుకి రాగానే పాతజ్ఞాపకాలన్నీ ఒంపుకుందికి సిద్ధమైపోయాడు రాఘవరావు. "అయితే పద, మా ఇంటికి పోయి కబుర్లు చెప్పుకుందాం" అని ఆఫీసుకి "తుమ్మా" కొట్టెయ్యడానికి సిద్ధపడ్డాడు....

"అది కాదు. ఇప్పుడు నేను అర్జంటుగా మా అన్నయ్య దగ్గరికెళ్ళిపోవాలి. ఇవ్వాళంతా మా అన్నయ్యతో గడపాలి. రేపు పూర్తిగా తీరిక చేసుకుని నీతో గడపడానికి వొస్తాను. మనం ఎక్కడెక్కడికో తిరగాలి. మీ యింట్లో కూచోడం కాదు. మనిద్దరం కలిసి కొంతమందిని కలవాలి. రేపు సెలవు పెట్టి నువ్వింటి దగ్గరుండు. నేను ఉదయం ఎనిమిదిన్నరకి వస్తాను. మీ ఆవిణ్ణి వోసారి పలకరించి నిన్ను బైటికి లాక్కెడతాను. మనం మధ్యాహ్నందాకా యెక్కడో తిరిగి. భోజనం కూడా ఎక్కడో కానిచ్చేసి మళ్ళా సాయంకాలం దాకా తిరిగి, వీలుంటే యేదన్నా తెలుగు సినిమా చూసి, రాత్రి భోజనానికి మీ యింటికొద్దాం. భోజనం అయ్యాక నేను మా అన్నయ్యగారింటికి వెళ్ళిపోతాను. ఎల్లుండి వెళ్ళిపోతాను ఢిల్లీకి" అదీ విశ్వనాథం నిర్ణయం.

"ఊళ్ళో తిరగడమే అయితే సెలవు పెట్టక్కర్లేదు. బోలెడుచోట్ల చెకింగులున్నాయి. అలా అలా మనం ఎటువెళితే అటు మన స్పాట్సు చూసుకొని ఆటోగ్రాపులు పెట్టేసి డ్యూటీ చేసినట్టు నటిద్దాం" అని రాఘవరావు చెబితే—

"నో- సెలవే పెట్టు!" అని కూడా విశ్వనాథం నిర్ణయించేడు.

ఉదయం ఎనిమిదిన్నరకి వస్తానన్న మనిషికోసం, ఆరున్నరకి నిద్రలేచిన దగ్గర్నుంచీ అదిగో వస్తాడదుగో వస్తాడని వెయిటింగ్!

పన్నెండు గంటలపాటు అంతులేని నిరీక్షణ!

తన యింట్లోనే తనున్నాడు. అయితే మాత్రం? ఔట్ డోర్ డ్యూటీమీద రోజుకి ముప్ఫయి కిలోమీటర్లు తిరిగే కాలు: ముప్ఫయి మందిని తిట్టేనోరు- రెండూ కట్టడిపోయి మహా బోర్‌గా వుంది.

ఈ మహానుభావుడు రేపు వెళ్ళిపోతాడు.

"నువ్వు తొమ్మిదిదాకా రాకపోతే మీ అన్నయ్యగారింటికి ఫోన్ చేస్తా" నన్నాడు రాఘవరావు. "అలాంటి పిచ్చిపన్లు చెయ్యకు. నీతో ఒకరోజంతా గడుపుతున్నానని తెలిస్తే మా అన్నయ్య వూరుకోడు" అని హెచ్చరించేడు విశ్వనాథం.

ఇంక తప్పదు- ఫోన్ చెయ్యవలసిందే!

మేడమీది వాటా వాళ్ళకుంది, టెలిఫోను. పాపం! మంచివాళ్ళు. అర్ధ రాత్రి అయినా సరే: అవసరం వచ్చిందంటేనూ. అట్నుంచి ఫోను వచ్చిం దంటేనూ, ఏమీ విసుక్కోకుండా; ఆనందం మాదే అన్నట్టుగా వాడనిస్తారు; కబురూ చేస్తారు.

పి. అండ్. టి. కంపెనీ జెనరల్ మేనేజరు-3758. ఊఁహూఁ ఇంట్లో నెంబరు కావాలి. జనరల్ మేనేజరు-ఇదేమిటి, కృష్ణన్ అని వుంది? అవు నవును- విశ్వనాథం అన్నయ్యగారి పేరు లోకేశ్వరరావు, ఆర్. ఎల్. రావు అంటారు. ఆయన ఈ కంపెనీకి జి. ఎం. గా ఈ వూరొచ్చి రెండు నెలలే అయింది. డైరెక్టరీ ఆర్నెల్ల కిందట అచ్చైంది. అంచేత ఫోన్ కృష్ణన్‌గారి పేరిట వుంది—2255.

"హలో!"

"2255."

"ఆర్. ఎల్. రావుగారున్నారాండీ?"

"మాట్లాడుతున్నాను!"

"నా పేరు రాఘవరావు సార్! నేను మీ తమ్ముడు విశ్వనాథం క్లాస్మేట్ని, ఫ్రెండుని కూడా."

"విన్నాను మీ గురించి. మీరు మంచి ఫోటోగ్రాఫర్ కదూ?"

"హాబీగా ఫోటోలు తీస్తానంతేనండి. సరే-విశ్వనాథం. నేనూ కలుసు కుని పదేళ్ళు దాటింది. నిన్న అతను నా దగ్గిరకొచ్చి, ఇవాళంతా నాతో గడుపు

తానని, శలవు పెట్టి ఇంటి దగ్గరే వుండమనీ. రేపు వెళ్ళిపోతున్నాననీ చెప్పాడు. ఇవాళ పొద్దుట ఎనిమిదిన్నరకి వస్తానన్నాడు. ఇప్పుడు సాయంకాలం ఆరు దాటింది.... హెల్ ఆఫ్ వెయిటింగ్! అంచేత కబురు తెలుస్తుందని మీకు రింగ్ చేశాన్సార్!"

"అయామ్ సారీ! విస్సు-అదే మా తమ్ముడు-కంపెనీ కారు తీసుకొని, మా పి.ఆర్.ఓ.ని కూడా తీసుకుని, పొద్దున ఏడున్నరకి కుటుంబంతో సహా బయల్దేరి వెళ్ళాడు. ఇంతవరకు రాలేదు. మధ్యాహ్నం ట్రీ తర్టీకి ఫోన్ చేశాడు. అందరూ ఎక్కడో డిన్నర్‌కి సెట్ అయిపోయారట. ఎనిమిదిన్నరకొస్తారట ఇంటికి."

"అరెరె! మరెలాగండి? అతన్ని కలవాలే? రేపు వెళ్ళిపోతాడు కాబోలు! తను ఏ బండికి వెడతాడో చెబితే ట్రెయిన్ దగ్గరైనా కలుస్తాను!"

"నో-అతను రేపు వెళ్ళిపోవడంలేదు. ఎనీవే-మీ ఫోన్ నెంబరు చెప్పండి. తను రాగానే ఫోన్ చెయ్యమని చెబుతాను."

"మాకు ఫోన్ లేదండి. ఇది మా కో-టెనెంటు గారి ఫోన్- ఆం ఆం-పిలుస్తారండి. నెంబరు 4150."

"జస్టు ఎ సెకండ్, కాగితం పెన్సిల్ పికప్ చేస్తానుండండి!"

"అక్కర్లేదు సార్! ఇది మీ పేరు మీదుగా వున్న ఫోనండి, అంటే-ఆర్. ఎల్. రావు అనే పేరిట వుంది ఇది. ఆయన పేరు ఆర్. లక్ష్మణ్రావు గారండి. ఆర్. ఎల్. రావు అన్న పేరుమీరు మర్చిపోరు కదా! డైరక్టరీలో ఆ పేరు వెతికితే చాలు."

"ఐసీ-గుడ్ జోక్! సర్లెండి."

"థాంక్యూ సర్!"

* * *

ఐదురోజుల బిజినెస్ ట్రిప్పు ముగించుకుని అప్పుడే ఇల్లు చేరాడు ఆంజనేయులు. విస్సు విజయవాడనుంచి ఫోన్ చేశాడు భార్య జమునాబాయికి. మన సంతా పెంపుడు కూతురు మాలతి మీదనే వుంది. నిన్న సాయంకాలం ఇక్కడ మాలతి పాట కచేరీ వుంది. ఆ సభకి ఆర్. ఎల్. రావుగారు ముఖ్య అతిథిగా వస్తున్నారు. ఆయన ఎంత పెద్ద అధికారో. అంతకన్నా అధికుడయిన కళా ప్రియుడు. (సౌందర్య ప్రియుడని కూడా వినికిడి).

పి. అంచ్. బి. కంపెనీతో తన బిజినెస్ చాలాకాలం మూడు పువ్వులు

ఆరు కాయలుగా ఉండేది. రావుగారికన్నా ముందు కృష్ణన్ జనరల్ మేనేజర్‌గా వున్న కాలంలో తన వ్యాపార ప్రత్యర్థి పంచాపకేశన్ అరవంలో మాట్లాడి ఆయ మాయ గారడీ చేసేసి తన బిజినెస్సంతా లాగేసుకుని తన నోట మట్టి కరిపించాడు.

పాటకచ్చేరికి ఆర్. ఎల్. రావుగారు ఛీఫ్ గెస్టుగా రావడం తన బిజినెస్‌కి టర్నింగ్ పాయింటు కావచ్చు. ఎందుకంటే, కళాకారిణికి ముఖ్య అతిథితో రెపార్టు ఉంటుంది. ఆ రెపార్టు సహాయం దొరక బుచ్చుకుని ఆర్.ఎల్. రావుగార్ని ఓసారి ఫామిలీతో సహా "టీ"కి ఇన్‌వైట్ చేసి ఎలాగో ఒకలాగ పి. అండ్. టి కంపెనీలో కను పోగొట్టుకున్న బిజినెస్‌ని తిరిగి సాధించాలి. దీనికి పునాది వెయ్యవలసింది అత్యంత సౌందర్యవతి, పూర్ణయవ్వనవతి అయిన తన పెంపుడు కూతురు మాలతే.

ఒకప్పుడయితే యిలాంటి కార్యాలు తన "భార్య" జమునాబాయి అవలీలగా చేసేదే. కాని యిప్పుడు జమునాబాయి యుగం అంతరించింది. మంచి గౌరవతో, ఆర్.ఎల్. రావుగారి కళాప్రియత్వంపట్ల తగుమాత్రం ముఖస్తుతితో, ఆ ప్రోగ్రాం ముందూ వెనకా మాలతి ఆయనతో ఎలా ఎలా ఏమిటేమిటి మాట్లాడాలి, ఎన్నిసార్లు ఎంత స్వీట్‌గా ఆయన మాటలకి నవ్వాలి. కాన్‌సర్టు చేసేటప్పుడు ఎలాంటెలాంటి సందర్భాల్లో ఆయనవేపు సార్థకంగా చూడాలి- అన్నీ పద్ధతిగా రిహార్స్ చేయించాడు. అది గుర్తుచేస్తూ ఆర్. ఎల్. రావుగార్ని ఎలాగయినా "కేచ్" చెయ్యాలని చెప్పడానికే ఆంజనేయులు నిన్న విజయవాడనుంచి ట్రంక్ కాల్ కూడా చేశాడు.

"హల్లో! మాల్తీ డియర్! ఎలాగైంది నిన్న ప్రోగ్రాం?" అని పలకరిస్తూ ఇంట్లో అడుగు పెట్టేడు.

"బాగా పాడాను డాడీ!"

"బాగా ఏమిటి-నాన్‌సెన్స్! అద్భుతంగా పాడుంటావు డార్లింగ్! దాంట్లో డవుటేం వుండదు. కాని ఆర్. ఎల్. రావుగారు ఎలా రియాక్టు అయ్యారు?"

ఆయనతో మాట్లాడ్డానికి అపర్చునిటీ దొరకలేదు డాడీ!"

"వాట్ ఎ ఫూల్ యువార్! అపర్చునిటీలు ఎక్కడన్నా దొరుకుతాయా? మనమే వాటిని సృష్టించెయ్యాలి. చెప్పాగా!" అని, పెద్ద కేక పెట్టి "జమ్నా" అని భార్యని పిలిచాడు ఆంజనేయులు.

"అది కాద్ డాడీ! వాళ్ళేమో మీటింగు ముందు పెట్టేసి. రావుగార్ని

సంగీతం గురించి స్పీచ్ యిమ్మన్నారు. ఆర్టిస్ట్ ఆఫ్ ది డే గా నన్ను డయాస్ మీదికి ఇన్ వైట్ చెయ్యలేదు. సభంతా అయిపోయాక ఇప్పుడు సంగీత కచ్చేరీ అని రొటీన్‌గా అనౌన్స్ చేసి. నిమిషంలో చేర్స్ టేబిల్ అన్నీ సైడ్స్‌కి లాగే శారు. ఆయన అడియన్స్‌లోకి నేను స్టేజి మీదికి మారిపోయాం."

"కాన్సర్ట్ అయిపోయాక ఆయన్ని కలిసి అడగవల్సింది!"

"ఆయనకి ఢిల్లీ నుంచి ఎవరో గెస్టులు వచ్చారని డిన్నర్‌కి ఎర్లీగా వెళ్ళి పోయారు డాడీ! మీరన్నట్టుగానే ఆలాపన చేస్తున్నప్పుడు, పల్లవి పాడుతున్నప్పుడు, చరణాల్లో పొగడ్త వచ్చినపుడు ఆయన్నే చూస్తూ పాడాను. కాని ఆయన రాగం తానం పల్లవి అవుతూ వుండగానే వెళ్ళిపోయారు."

"ఐటమ్ మధ్యలో లేచి వెళ్ళారా? అబ్‌సర్డ్!"

"మధ్యలో అంటే నాట్ ఎగ్జాక్ట్‌లీ ఇన్ ద మిడిల్ డాడీ! రాగం తానం పల్లవి అవంగానే వెళ్ళి పోయారు."

"ఓకే, ఓకె, డోన్ట్ గెట్ డిజార్టెండ్! చేజారిన అవకాశం లోంచి కొత్త ప్రయత్నానికి ప్రాణం పోసు కోడమే ఆప్టిమిస్ట్ చెయ్యవల్సిన పని. ఆల్ రైట్! నేను స్నానం చేసి బట్టలు మార్చుకొనే లోగా ఆర్. ఎల్. రావు గారికి రింగ్ చేసి ఎపాయింట్‌మెంట్ తీసుకో. మనం ఆయన దగ్గిర పడదాం యువర్ సెల్ఫ్, మమ్మీ అండ్ మిసెల్ఫ్?"

ఎదురుగా వస్తున్న భార్యని చనువుగా నడుం మీద చెయ్యేసి లాక్కొడుతూ ఆంజనేయులు "కమన్ జమ్నా-అయ్ హావె వర్డ్ ఫర్ యు.... ఏమిటి, మాలతి ఇంకా పెంపుడు కూతుర్లాగే బిహేవ్ చేస్తోంది? ఇంతకంటె చొరవ నేర్చుకోకపోతే మరి నువ్వెందుకు, నేనెందుకు? సిల్లీ?" అన్నాడు.

* * *

"హలో—"

"హలో—"

ఆర్. ఎల్. రావుగారున్నారండి?"

"మాట్లాడుతున్నాను'"

"నమస్కారం సార్! నేను సింగర్ మాలతిని మాట్లాడుతున్నానండి బావున్నారా సార్?"

"థాంక్యూ."

"నిన్న సంగీత కచేరి చేసేను కదండి-గుర్తొచ్చాననుకుంటాను?"

"అయ్యో, గుర్తు రాకేం? యు శాంగ్ క్వయిట్ వెల్?"

"థాంక్యు సర్.... ఇఫ్ యు డోంట్ మైండ్- నేను, డాడీ, మమ్మీ ఇప్పుడు మీ ఇంటికొద్దామనుకుంటున్నాము సార్! మాతో కొంతటైమ్ స్పెండ్ చెయ్యడానికి మీకు వీలుంటుందా సార్?"

"ఓ-ష్యూర్. యువర్ వెల్‌కమ్. వెంటనే రాకండి. నేను ఇప్పుడు బయల్దేరి చిన్మయానంద స్పీచ్ వినడానికి వెడుతున్నాను. ఒక గంట పోయాక మీరు రాగలిగితే మంచిది. విల్ ఇట్ సూట్యు?"

"ష్యూర్లీ సార్; డాడీ విల్ బి సో ప్లీజ్డ్. నిజానికి ఆయన ఇప్పుడే ఇల్లు చేరారు- ఐదు రోజుల టూర్ తరువాత. ఇప్పుడు ఆరూ పది నిమిషాలైంది. సరిగ్గా ఏడుంపావుకి మీ కాంపౌండ్‌లో వుంటాం. థాంక్యూ."

"ఓ.కె."

ఫోను పెట్టేసి ఆర్- ఎల్. రావు పెద్దమ్మాయికి చెప్పాడు."

"చూడు, ఒక గంటలో మనింటికి డీలక్స్ ఏజెన్సీస్ ప్రొప్రయిటరు ఆంజనేయులుగారు; వాళ్ళావిడ జమునాబాయిగారు; వాళ్ళమ్మాయి పాట కచేరీలు చేస్తుందే, మాలతి- వాళ్ళందరూ వస్తారుట. వాళ్ళు చాలా గొప్పవాళ్ళు మనలాంటి వాళ్ళం వాళ్ళని చూడాలంటే సభల్లోనో కార్లలోనో చూడవల్సిందే గాని అంటి దగ్గిర దొరకరు! అలాంటివాళ్ళు, తమంతట తాముగా ఫోన్ చేసి మరీ చెప్పారు, వస్తున్నామని. వాళ్ళు వచ్చేసరికి ఇల్లంతా శుభ్రంగా సర్దేసిఉంచండి. వాళ్ళకి ఆఫర్ చెయ్యడానికికాఫీలు, బిస్కెట్లు రెడీచెయ్యండి. మీ రందరూకూడా కాస్తమరోసారి మొహాలూఅవీకడుక్కుని ప్రెజెంటబుల్‌గావుండండి ఏబ్రాసిగా వుండక.నేను చిన్మయానందస్పీచికి వెడుతున్నాను;సరిగా నలభైనిమిషాలుఅక్కడుండి వొచ్చేస్తాను. జాగ్రత్త! ఎక్కడా ఏమీ పొరపాటు రానివ్వకండి."

* * *

పి. అండ్. టి. కంపెనీ జనరల్ మేనేజరు బంగాళా ఊళ్ళో కల్లా పోష్ లొకాలిటీలో వుంది. బంగళాచుట్టూ రెండెకరాల ఖాళీ జాగా. అందులో నాలుగు విలాస వేదికలు. వాటి మీద లతానికుంజాలు. ఏ కాలంలో అయినాసరే రోజా కేజీన్నర పువ్వులు పూయడానికి తగినన్ని రకరకాల పూల మొక్కలు. కొబ్బరి ఉసిరి, జీడి మామిడి, మామిడి చెట్లు. రెండు మద్దిచెట్ల మధ్య, విలాసంగా వూగడానికి బలిష్టం విశాలం అయిన ఉయ్యాల. ఇది ఇల్లా, లేకపోతే రామా

నాయుడు సినిమాలో సెట్టింగా అని ఆశ్చర్యపరిచే విధంగా వుంటుంది ఆ వాతావరణం.

ఏడుంపావుకి మెయిన్‌గేటు దగ్గిరాగి మెత్తగా హారన్ కొట్టిన కారు సెక్యూరిటీ జవానుకి పరిచయమే. డీలక్స్ ఏజెన్సీస్ ప్రొప్రయిటరు ఆంజనేయులుగార్ని, "వాళ్ళావిడ" జమునాబాయి గార్ని అతను చాలాసార్లు చూశాడు. అంచేత "అపాయింట్ మెంటుందా సార్?" అని అడక్కుండానే గేటు తెరిచే స్విచ్చి వేశాడు. కారుమెయిన్ బంగళా పోర్టికో దగ్గిర ఆగే వేళకి గుర్తొచ్చింది. అయ్యగారు ఒక్కరే వున్నారు కనా, కీళ్ళు రాడానికి పర్మిషన్ యిచ్చుంటారా అన్న సందేహం పరిగెత్తు కెళ్ళాడు గేట్ స్విచ్ వేసి. కాని అప్పటికే వాళ్ళు తిన్నగా, అయ్యగారు చదువు కుంటూ కూర్చున్న మెయిన్ హాల్లోకి వెళ్ళిపోయారు.

"ఎస్?" అని తలెత్తి చూశారు రావుగారు, పుస్తకం చదవడం ఆపి.

ముందుగా "నమస్కారం" చెప్పి నవ్వింది మాలతి ఆ నవ్వు స్వీట్‌గా, "మెలిఫువస్"గా వుందని రావుగారి వెనకాల దూరాంగా వున్న అద్దం చెప్పింది

"నేను సింగర్ మాలతి నండి. మా డాడీ, మమ్మీ...."

"సిడౌన్?"

అందరూ కూర్చున్నారు.

రావుగారు మళ్ళా పుస్తకం చదుకుంటూ వుండిపోయారు ఒక నిమిషం ఆ నిమిషం గడవ డానికిముగ్గురు అతిథులూ మొహాలు చూసుకోడం సాగించారు. రోజూ చూస్తున్న మొహాలే కావడాన్ని మరింత విసుగైంది.

పాటకి ముందు లాగ, గొంతు సర్దుకుంది మాలతి. రావుగారు చూశారు.

"నేను సింగర్ మాలతి నండి, నిన్న కాన్సర్ట్ చేశాను. మీరు చీఫ్ గెస్టుగా వచ్చారు."

"ఐనో; ఎస్. ఒకటి రెండు సార్లు లోగడ మీపాట రేడియోలో కూడ విన్నాను."

"థాంక్స్వండి." జమునాబాయి కృతజ్ఞతలు చెప్పింది.

"మా డాడీ ఆంజనేయులుగా రండి. మా మమ్మీ జమ్నాబాయి."

"చెప్పారుగా!"

మళ్ళీ కొన్ని సెకండ్లు నిశ్శబ్దం. తరువాత రావుగారు "ఎస్?" అని మాలతి వేపు చూశారు. "వాట్ కెనైడు ఫర్యూ?" అని ఆ చూపు అర్థం

గ్రహించి, మాలతి మరో నవ్వు, "స్వీట్‌గా" "మెలిప్లువస్‌గా" కాకపోతే కొంచెం మిస్చీవస్‌గా- నవ్వి, అడిగింది- "చిన్మయానంద స్పీచ్‌కి వెళ్ళొచ్చే శారండి?"

"ఎవరు చెప్పేరు? అఫ్‌కోర్స్- నేను చిన్మయానంద స్పీచెస్ లైక్ చేస్తాను. ఆయన ఇవాళ ఇక్కడున్నారని తెలుసు. నిజానికి నే నిప్పుడు చదువుతున్నది కూడా ఆయన రాసిన పుస్తకమే. కాని స్పీచ్‌కి వెళ్ళి అక్కడ నైబర్స్ చేసే డిస్టర్‌బెన్స్ భరించలేను."

"మరి చిన్మయానంద స్పీచ్ కెళుతున్నానని చెప్పారేండి?" ఇంకా మిస్చీవస్‌గా నవ్వుతూ అడిగింది మాలతి,

"నేను చెప్పానా! ఎవరికి?"

"నాకే సార్! గంట కిందట మీకు ఫోన్ చేస్తే: ఏడుంపావుకి రమ్మ న్నారుగా!"

రావుగారి కళ్ళు పెద్దవి. అలా తెరిచి చూడ్డంలో అవి మరింత పెద్దవై- వాట్లోంచి శక్తిపాతం అయినంత పని జరిగింది; మిగిలిన ముగ్గురూనూ.

"ఐసీ? నో-మీరు ఆర్. ఎల్. రావుగారితో మాట్లాడారన్న మాట?"

"అవున్సార్? మీరే మాట్లాడారుగా?"

రావుగారు వెంటనే లేచారు. "ఆయామ్ సారీ? మీరు గంట కిందట ఆర్, ఎల్, రావుగారితో ఫోన్లో మాట్లాడారు, కాని నాతో కాదు. ఈ ఊళ్ళో ఇంకొక ఆర్. ఎల్. రావుగారున్నారు. వారితో చెప్పారు మీరు; ఏడుంపావుకి వారింటికి వస్తామని, ఆయన, ఆయన కుటుంబ సభ్యులు బహుశా మీ కోసం చూస్తూ వుంటారని. నా కనిపిస్తోంది, అంచేత, మీరు దయచేసి ఆర్. ఎల్. రావుగారింటికి వెళ్ళడం మంచిది, లేకపోతే, మీ ఇంటికి వెళ్ళి, మీ రక్కడికి రావడం లేదని కనీసం ఫోన్లో అయినా చెప్పడం సమంజసం. నా కొంచెం పనుంది. మనం మరో సారి ఎప్పుడైనా, తీరిగ్గా కలుద్దాం. థాంక్స్ టు రాఘవరావ్?" అని చెయ్యి గారితో అడించి, చేతిలో ఆ పుస్తకంతో లోపలికి వెళ్ళి పోయారు. సెక్యూరిటీ జవాను ఇంక ఆలస్యం చెయ్యకుండా సలాం కొట్టాడు.

"అంతా బాగుంది, కాని, థేంక్స్ టు రాఘవరావ్ అంటా దేమిటి? వాడెవడు, మధ్యని?" అంటు లేచి, బయటికి దారితీశాడు టీలక్స్ ఏజెన్సీస్ ప్రొప్రయిటర్ ఆంజనేయులు.

["జ్యోతి" మాసపత్రిక దీపావళి 1978]

# మళ్ళీ కలుద్దాం!

"హలో, రఘునాథరావుగారూ! బావున్నారా?" అంటూ ఆప్యాయంగా పలకరించి, నేను ఆశ్చర్యంలోంచి తేరుకొనేలోగానే నా కుడిచెయ్యి అందుకొని నొక్కాడు.

నా మొహానికి పూసుకొన్న చిరునవ్వులో అతనికి—నేనతన్ని గుర్తుపట్టలేక పోయానని తెలిపే భావమేదో కనబడుంటుంది.

"మీరు రఘునాథరావుగారు కాదా! మీది గుంటూరుజిల్లా పర్చూరు కదా?" అన్నాడతను జోరుగా "సార్—" అని చెయ్యొదిలేశాడు, అంతలోనే.

"ఔనౌను. నేను రఘునాథరావునే. నేను మిమ్మల్ని గుర్తుపట్టలేక పోయినాను."

"నేను జగన్నాథాన్ని సార్. బాపట్ల తాలూకాఫీసులో మీ దగ్గర పని చేసే వాణ్ణి."

"అబ్బో! ఎప్పటిమాట!" పదహారేళ్ళ క్రితం.

"ఇప్పుడేం చేస్తున్నారు?" అన్నాను.

"వాల్తేర్లో ప్రొఫెసర్‌గా వున్నాను సర్-డిపార్టుమెంటు?"

"నేను మిమ్మల్ని గుర్తుపట్టలేక పోయినాను. క్షమించండి!"

"గుర్తు పట్టలేక పోవడంలో వింతేంలేదుగాని" నాకన్నా క్షమాభిక్షకుడిగా మారాడతను—"మీరు నన్ను మీరూ అనడం; క్షమించండీ అనడం నాకేదో యిబ్బందిగా వుంది సార్. ఎంచక్కా ఏమోయ్ జగన్నాథం అనేవారు, ఆ ఆప్యాయత మరి రాదా సార్?"

అప్పుడైతే అనేవాణ్ణేమో.

అయితే అందులో అతనంటున్న ఆప్యాయతేం లేదు.

నేనూ అతని వయసువాణ్ణే. సరాసరి డిప్యూటీ తహసీల్దార్‌గా చేరినవాణ్ణి, అతను కొత్తగా కాలేజీమెట్లు దిగి ఎల్. డి సి.గా చేరినవాడు. ఆ అనుబంధంలో మీరూ! మీరూ అంటూ కూచుంటే పన్లు జరగవు....

"హైదరాబాదెడుతున్నారా సార్?"

అవును.

ఇంకో నాలుగురోజుల తరువాత గవర్నరు వాల్తేరు వస్తారు. వారి క్యాంపులో కొన్ని ముఖ్యమైన పరిశీలనలు జరుగుతాయి.అయితే ఏదో మామూలు విజిట్‌లాగా, సైట్ సీయింగ్ ప్రోగ్రాంలాగా కనబడాలని గవర్నర్‌గారి ఉద్దేశం. కాగితాలమీద అలాగే సూచించేరు.కాని అసలు పరిశీలన జరగవలసిన విషయాలు కలెక్టర్‌గారికీ, డి. ఐ. జి. గారికీ, కొంతమంది ముఖ్యులకు స్వయంగా చెప్ప వలసినవి వున్నాయి. నివేదించవలసిన కొన్ని రహస్య విషయాలున్నాయి. అందించవలసిన కొన్ని డాక్యుమెంట్లున్నాయి; ఆ కారణంచేత హోంమినిస్ట్రీ సెక్రటరీగారి అనుమతిని ప్రత్యేకంగా వచ్చాన్నేను.ఫస్టుక్లాస్‌కంపార్టుమెంట్‌లో "కుపే" వుంది నా పేరిట.

"ఔను. మీరో?"

"నేనూ హైదరాబాదేనండి. ఫస్టుక్లాస్ టికెట్ తీసుకున్నాను. ఏకామిడేషన్ లేదన్నారు. వి.సి.గారితో చెప్పించాను. ఈ కంపార్టుమెంట్‌లోనే ఇస్తానన్నారు. ఇంకా కన్‌ఫర్మ్ చెయ్యలేదు."

"ఐ.సీ!" అన్నాను, నా సహజ నిర్వికార ధోరణిలో.

ఒక రైల్వే అధికారి వచ్చి ఇంతకుముందే నాతో మాట్లాడాడు. ఈకుపేలో బెర్త్ అతనికివ్వడానికి నా అనుమతి అడిగాడు. ఇచ్చాను. "ప్రొఫెసర్ జగన్నాథం" అంటే యెవరో అనుకున్నాను. ఇతనేనన్నమాట.

"లోపలికి పోదాం పదండి!" అన్నాను.

నన్ను దిగబెట్టడానికొచ్చిన వాళ్ళంతా ఇతను పలకరించడానికి ముందే వెళ్ళిపోయారు. "ఇక్కడే హేంగ్ అవొద్దు. నాకు పబ్లిసిటీ నచ్చదు!" అని నిష్కర్షగా కసిరేసాను వాళ్ళని. నేనొచ్చిన పని పరమ రహస్యం. నా ఉనికిని, మూవ్‌మెంట్సును ఎవరో గమనించడం నాకిష్టం వుండదు.

* * *

జగన్నాథం—

"చురుకైన వాడే" అని ఆర్. డి. ఓ. ఆఫీసు హెడ్‌గుమస్తా చెప్పాడు.

మొదట అక్కడ అపాయింటయ్యాడు జగన్నాథం. అక్కడ చేరిన నాలుగు నెలలకి తాలూకాఫీసులో వేశారతన్ని.

ఎంత చురుకైనవాడో అతనొచ్చిన వారం రోజుల్లోగా తెలిసిపోయింది. తివిరి ఇసుమున "తైలంబు" తీసేసేవాడు.

అది నాకు నచ్చలేదు. ఇలాంటి వాళ్ళ ద్వారానే ప్రభుత్వఆఫీసులకు చెడ్డ పేరు వచ్చేది.

అతని పద్ధతంతా విలక్షణంగా వుండేది. ప్రాణం పోయినా కాగితం ఆలస్యం చేసేవాడుకాడు. అతనికి లాభించే కాగితం అయితే మరీనూ.

పార్టీలయితే వాళ్ళ యిళ్ళకే వెళ్ళిపోయేవాడు. తిమ్మిని బ్రహ్మిని, బ్రహ్మిని తిమ్మిని చేసి. తావుల కొద్దీ నోటుమెయిల్సు రాసేసేవాడు. అరడజను స్టాక్ ఫైల్సులో యింపై ప్లాగులు పెట్టి ఫైలు పకడ్బందీగా తయారుచేసేసేవాడు. ఒకటికాదు! సీట్లోకొచ్చిన ప్రతికాగితానికీ అలాగే. ఎప్పుడు రాసేవాడో మరి.

పార్టీలు అడిగిన వరాలు యిచ్చితీరవలసిందేనని తేల్చేవాడు. ఎవరికీ చదివే ఓపిక లేక, వరుసగా చిన్న సంతకాలు పడిపోయి ఆర్డర్సుగారూపొందేవి అతని "నోట్లు" అతను లాభం పొందేవాడని తెలిసిపోతూనే వుండేది. కాని అతను డిల్డవ్ చేసిన ఫైల్లో?

నాకు తెలిసేది : తప్పుడు ఆర్డర్సు వేస్తున్నానని, వేయిస్తున్నావని అతనికి తప్పక లాభిస్తోందని. కాని ఏం చేస్తాను? పని తొందర. ఒకవేళ ఏదైనా కుంటి కొర్రీ వేసి రిటర్న్ చేసినా అస్త్రశస్త్రాలతో తయారై ప్రిసిడెంట్సు. జి. ఓలూ కోట్ చేసేసి కొర్రీ వేసిన అరగంటలో ఉక్కిరి బిక్కిరి చేసేసేవాడు.

ఒక ఫైల్లో—నేనేకాక పై అధికారులు కూడా ఇరుక్కున్నాం; తప్పుడు ఆర్డర్సు వేసేసి ఆర్డర్సుపడ్డ పదిరోజులకి గవర్నమెంట్ నించి గూటింపు వొచ్చేసింది—మీకెవరికయినా మతులున్నాయా అంటూనూ.

కలెక్టర్‌గారు నన్ను పిల్చి అడిగారు. ఒక రాత్రంతా కూర్చుని, ఫైలు, రూల్సు, మేన్యువల్సు, కోడ్సు, బి. పి. లు; క్షుణ్ణంగా చదివి—జగన్నాథం నోటు ఆధారంగా మేమంతా తప్పు చేసేమని తెలుసుకున్నాను. కాగితం మీద పెట్టకుండా చల్లగా కలెక్టర్‌గారి దగ్గిరికెళ్ళి విన్నవించుకున్నాను,

"అతన్నో కంట కనిపెట్టండి మరి?" అన్నారు కలెక్టరుగారు.

ఈ ఫైలు ఆధారంగా అతనిమీద చర్య తీసుకోవద్దని; సరికొత్త కేసు ఏదో చూసుకొని దాంట్లో అతని భరతం పట్టమని ఆయన వుద్దేశం. సుళువుగానే గ్రహించాను.

వారంరోజులు తిరక్కుండా మరో కేసులో దొరికాడు జగన్నాథం.

ఇప్పట్లో అప్పుడు ఎ.సి.బి.లు అవీలేవు. ఛార్జి మెమో చాలు: ఉద్వాసన చెప్పడానికి. అందులోనూ—గట్టిగా ఏడాది సర్వీసులేని ఎల్.డి.సి!

జగన్నాథాన్ని డిస్మిస్ చేయించడానికి పెద్ద శ్రమ అక్కర్లేకపోయింది. అంతముక్కూ కూడా, గట్టిగా తుమ్మేసరికి వూడిపడిపోయింది.

*  *  *

"మంచికో చెడ్డకో జరిగింది సార్ అది. ఆ ఆరునెలల్లోనూ ఐదువేలకి పైగా సంపాదించుకున్నాను. అది పెట్టుబడిగా, యూనివర్శిటీలో ఎమ్.ఎ. చదివాను. రెండేళ్ళు. వెంటనే ఉద్యోగం ఒచ్చింది; ఓ కాలేజీలో లెక్చరర్‌గా. మళ్ళీ రెండేళ్ళు కష్టపడి రీసెర్చిచేసి డాక్టరేటు తెచ్చుకునేసరికి యూనివర్శిటీలోనే లెక్చరర్ వుద్యోగం దొరికింది. ఒక వి.సి.గారు నన్ను స్టేట్స్ పంపారు. ఇంకో వి.సి.గారు వెస్ట్ జర్మనీ పంపారు. ఐదేళ్ళలో అక్కడే రీడరయ్యాను; ఫారిన్ డిప్లొమా సహాయంతో.... పన్నెండేళ్ళలో ప్రొఫెసరే అయ్యాను. ఫారిన్ ఎక్స్ఛేంజ్‌తో వైజాగ్‌లో మంచిచోట ఇంటిస్థలం సంపాదించేను; ఇల్లూ కట్టేను. ఇద్దరు అబ్బాయిలు; ఒకమ్మాయి పుట్టారు. అందరూ ఇంగ్లీషు మీడియమ్‌లో చదువుకుంటున్నారు. ఒక ఫియట్ కారుంది. దేశం అంతటా అభిమానులున్నారు. ఇదంతా మీ చలవే సార్. అప్పుడు మీరె పట్టుబట్టి నన్ను డిస్మిస్ చేయించకుండా వొదిలేసి, వాడి పాపాన వాడే పోయాడులే అని వొదిలేస్తుంటే—ఈ ప్రగతి ఏదీ లేనేలేదు? ఎక్కడో తాలూకాఫీసులోనో, కలెక్టరాఫీసులోనో—యూడీసీగా—మహా ఐతే డిప్యూటీ తాసిల్దార్‌గా రాట్ అవుతూ వుండేవాణ్ననుకుంటాను!" అన్నాడు జగన్నాథం.

తుని స్టేషన్ కాబోలు, వస్తోంది.

నేను చాలా సిగ్గుపడ్డాను....

ఆనాడు నేను చేసింది రైటే.

అతను ముందుకు వెళ్ళిందీ రైటే.

కాని—ఒక మనిషిని—సంప్రదాయం, ప్రజల బలహీనతా ఆధారంగా; లంచాలు పుచ్చుకుంటున్నాడని "డిస్మిస్" చేయించడం తప్పేమోనని తొలిసారిగా అనిపించింది.

అతనిలో ఆ పట్టుదలా కార్యదీక్షా లేక పోయుంటే—?

గవర్నమెంట్‌లో పనికి రాలేదని ఏ చిల్లర వ్యాపారమో చేసేవాడేమో!

"పన్నుల నిర్ణయం—ప్రజల బాధ్యత." అనే విషయంమీద నాటి దినపత్రికలో ప్రచురణ అయిన తన వ్యాసం ఒకటి చూపించాడు. అలవోకగా

చెప్పినట్టుగా వుంది. కాని సాధికారికంగా చెప్పాడు. ఆ నేర్పు చూసి ఆశ్చర్య పోయాను.

"మీ భోజనం మాటేమిటి సార్?"

నేనేం మాట్లాడలేదు; పేపర్లో మరో ఐటం ఏదో చూస్తున్న నెపంమీద.

"సామర్లకోట వచ్చేస్తోంది సార్. మీ భోజనం మాటేమిటో?" అన్నాడతను మళ్ళీ.

"నాకు రాజమండ్రిలో భోజనం ఒస్తుంది" అన్నాను. తప్పించుకోలేక.

"అలా అయితే నేనిక్కడ-అదే, సామర్లకోటలో—తినెయ్యనా, సార్?.. అంటే మరేం లేదనుకోండి—రామారావు వస్తానన్నాడు; సామర్లకోట స్టేషన్ దగ్గిర ఈ బండి ఆగేవేళకి—వాడొస్తే ఏదో ద్రవపదార్థం తెస్తాడు. రాజమండ్రిలో దిగిపోతాడు,"

నేను సీరియస్‌గా చూశాను.

"మీ కభ్యంతరమైతే వాణ్ని రైల్లోకి రానివ్వను సార్. పది నిమిషాల పాటు బండి ఇక్కడ ఆగుతుంది కనక ప్లాట్‌ఫారంమీదనే అవగొట్టేస్తాం."

"అతనెవరు?"

"రైల్వేలో పని."

"ఓ.కే. రమ్మనండి" అన్నాను.

ఆ మాట విని అతను కిటికీలోంచి తల బైటికి పెట్టాడు వీలయినంత వరకు. అప్పటికి ప్లాట్‌ఫారం సమీపిస్తోంది. రామారావు ఇతని కోసం తీక్షణంగా చూస్తున్నట్టున్నాడు. ఇతన్ని గమనించి, పరుగెత్తుకుంటూ వచ్చాడు. సరాసరి లోపలికొచ్చేసి: "గుడ్మార్నింగ్ సార్! నేను రామారావుని!....ఏరా వెధవా; పరిచయం చెయ్యవేంరా?" అన్నాడు; మా యిద్దరితోటీ.

మావాడు కొంచెం రఫ్‌గా మాట్లాడుతాడు సార్. మీకేమాత్రం యిబ్బందైనా చెప్పండి. దింపేస్తాను!" అన్నాడు జగన్నాథం. రామారావుకి జోక్‌గా, నాకు సిన్సియర్‌గా వినిపించే ధోరణి అంది పుచ్చుకొని.

"నా బెటాల్!" అని—చదువుతున్న పేపరు పూర్తిగా విప్పి; వాళ్ళేం చేస్తున్నారో చూడ్డం మానుకున్నాను.

ప్లాస్టిక్ బుట్టలో సీసాలు, గ్లాసులు. పొట్లాలు—

రాజమండ్రి వచ్చేలోగా అన్నీ ఖాళీ. మధ్యలో రెండుమూడుసార్లు నాకూ "ఆఫర్" చెయ్యడం—నేను వద్దని ఖచ్చితంగా చెప్పడం—

రాజమండ్రిలో నేను భోజనానికి దిగిపోయాను. నా భోజనం అయ్యాక, నేను కంపార్టుమెంటులో కొచ్చేక. బండి కదిలింది.

అప్పటికి రామారావు లేడు అక్కడ, జగన్నాధం పడుకుని వున్నాడు.

నేను "ఒపే" తలుపు తెరవగానే "గుడ్ నైట్ సార్" అంటూ అటు తిరిగాడు.

* * *

విజయవాడలో మెలకువ వచ్చిందతనికి. నాకసలు నిద్దరే రాలేదు—

బాపట్ల తాలూకా ఆఫీసు....రొంపేరు ప్రాజెక్టు—పేదలకి పొలాలూ స్థలాలూ పంచిపెట్టడం—ఆ కుంభకోణం—జగన్నాధం నోట్ ఫైల్స్—కలెక్టర్ గారి ఎన్‌క్వయిరీలు- ఇతని డిస్మిసల్—ఏవేవో జ్ఞాపకాలు; అన్నీ వివరాలతో సహా.

ఆ సందట్లో మరికొన్ని వ్యక్తిగత జీవితపు జ్ఞాపకాలు—

విజయవాడ దాటినా నిద్రరాదేమో అనిపించింది....

ప్రొఫెసర్ జగన్నాధం—

రామారావు-రాత్రి ఎనిమిదిన్నరకి గుడ్మార్నింగ్ అనగలిగిన రైల్వే వుద్యోగి—టిక్కెట్టు, పర్మిట్టూ ఏమీ లేకుండా సామర్లకోటనుంచి రాజమండ్రి వరకు ఫస్టుక్లాసులో ప్రయాణం—

మందూ, మాంసం—

అసహ్యం వేసింది.... జుగుప్స కలిగింది.

బాత్‌రూంలో వున్నాడుగాని—

ఆ క్షణం అతను ఎదురుగా వుంటే చాచి లెంపకాయ కొట్టాలని అనిపించేదే—

ఆ బెర్తువేపు చూడ్డానికే అసహ్యంగా వుంది.

కోటూ బూటూ ఖాత్రూం శాండల్సూ—అట్టహాసంగానే వున్నాడు. రేపు హైద్రాబాద్‌లో ఏదో సెమినార్ట; "పేపరు" చదువుతాట్ట!

బాగానే ప్రిపేరయి వచ్చినట్టున్నాడు.

అతని వైదుష్యంచూసి ఆనందించాలా, కృషిచూసి మెచ్చుకోవాలా, చిలిపితనం చూసి చిరాకుపడాలా తేల్చుకోలేక పోతున్నాను.అతను కూర్చున్న భాగం వేపు చూశా నొకసారి, అప్రయత్నంగా; తీక్షణంగా.

అక్కడ వేలాడదీసిన కోటు పాకెట్లోంచి ఏదో విజిటింగ్ కార్డు లాంటిది తొంగి చూస్తోంది.

ఆ క్షణం—

వీడు చెప్పేవన్నీ నిజమేనా—అసలు వీడు ప్రొఫెసరు జగన్నాధమేనా—అని నా ప్రవృత్తి సహజమైన అనుమానం తలెత్తి చూసింది. మరుక్షణం లేచి. లైటార్పి ఆ కార్డు తీశాను. అతను లేవటరీలోంచి వచ్చి తన పక్కమీద పడుకొన్నాడు.

నేను ఒక మూలుగు మూల్గి, లేచి వచ్చి; బండి దిగి—లైటు దగ్గిర చదువుకున్నాను. ఆ విజిటింగ్ కార్డుని.

అంతే.

నా అడుగులు రైల్వే పోలీసు ఆఫీసువేపు పడ్డాయి.

"ఎవరు కావాలి సర్?" డ్యూటీలోవున్న రక్షక్ అడిగాడు.

నా ఫొటో పాస్ చూపించాను.

శెల్యూట్ చేశాడు. "చైచేండి, సార్!"

జగన్నాధం జేబులో దొరికిన విజిటింగ్ కార్డు నా చేతుల్లోవుంది. తిన్నగా ఫోన్‌దగ్గిర కెళ్ళాను. కంట్రోల్ రూమ్‌కి ఫోన్‌చేసి—"అర్జంటుగా హైదరాబాద్‌కి మెసేజ్ యివ్వండి?" అంటూ వివరాలు చెప్పాను.

"తమరెవరు సార్?" అడిగింది అట్నుంచి గొంతు.

"జాస్టర్డు! ఎవరో చెప్తే ఇంతకథా వింటావన్న మాట!" అని అరిచాను.

"ఎక్స్‌క్యూజ్‌మి సార్. ఇదుగో డియస్పి గారొచ్చారుసార్. వారితో మాట్లాడండిసార్" అని వణికిందా కంఠం.

"ఇమ్మను"

"హలో—"

"నేను రఘునాథరావుని; స్పెషల్ సెక్రెటరీ—హోం! అక్కడ డ్యూటీలో వున్న కానిస్టేబుల్‌కి వివరాలు చెప్పాను. మెసేజ్ తక్షణం హైదరాబాదుకి చేరవెయ్యండి!" అని ఫోన్ పెట్టేశాను.

* * *

"అర్హతలుగాని, అనుభవంగాని (రెండూగాని) వున్న అభ్యర్థులకు చక్కని సువర్ణావకాశం? మీరు ఇరాక్, ఇరాన్, దుబాయ్—లలో ఎక్కడికైనా ఉద్యోగ రీత్యా వెళ్ళాలని అనుకొంటున్నారా? నెలకు ఐదువేలు అంతకు మించిన జీతం సంపాదించుకోవాలని కోరుకుంటున్నారా? అయితే వెంటనే; పాస్‌పోర్టు మొదలైన డాక్యుమెంట్ల సేకరణలో ఖర్చుల నిమిత్తం నూరు రూపాయలతో దరఖాస్తు చెయ్యండి—ప్రొఫెసరు లోకనాథం—సువర్ణా ఏజన్సీస్—31-1?-31; మహారాణీపేట; విశాఖపట్నం" అని—ఆరు నెలల క్రిందట పేపర్లో ప్రకటన పడ్డాది.

మా రెండో అబ్బాయి, ఎల్. ఎం. ఇ. పాసై, అన్నిటికీ పెట్టినట్టే దీనికీ పెట్టారు. "దరఖాస్తు." నూరు రూపాయలూ కట్టాడు. వాడి స్నేహితులు ఒకరిద్దరితో కట్టించాడు కూడాను.

కొన్నాళ్ళయ్యాక ఉత్తరం రాశాడు. మా సంగతి ఏమయిందంటూనూ.

జవాబు లేదు—

మళ్ళీ రాసేడు—

ఊఁ హూఁ.

నాలుగునెలల కిందట అశోకన్ విశాఖపట్నానికి బదిలీ అయినప్పుడు "ఇదేదో మా అబ్బాయి ప్రయివేటు కంప్లెయింట్....కొంచెం చూడు—" అని ఫోన్లో చెప్పాను.

అతను వైజాగ్‌లో జాయినైన వారం రోజుల్లో వొచ్చింది వుత్తరం: "అదేదో బోగస్ కంపెనీ సార్. మహారాణిపేట అంతా తిరిగినా ఆ హౌస్ నంబరే లేదు. ఆ నెంబరింగే తప్పు. అయితే పెద్ద పెద్ద అంకెలతో అదే నంబ

రును వేసి, సువర్ణా ఏజెన్సీస్ అనే బోర్డు పెట్టిన ఇల్లు కనుక్కున్నాను. ఇప్పుడు ఆ బోర్డూలేదు, ఆ కంపెనీలేదు. వాళ్ళకి—బ్యాంక్‌లో ఆపేరిట అకౌంట్ వుండేదిట. బ్యాంక్‌లో వెరిఫై చేశాను. కరెంట్ అకౌంట్. ప్రొఫెసరు లోక నాథం మేనేజింగ్ డైరెక్టరుగా ఆపరేట్ చేశాడు. ముప్ఫయ్యొనిమిది వేలు డిపాజిట్ చేర్చింది. అంతా విత్‌డ్రా చేసి అకౌంట్ క్లోజ్ చేశారు."

* * *

సికింద్రాబాదు వచ్చేవరకు అలా మేలుకొని కూర్చున్నాను. ఎందుకంటే:

విజయవాడలో నేను ఫోన్ చేసి రాగానే—

"నా కోటు జేబులో ఒక విజిటింగ్ కార్డుండాలి, ఇక్కడెక్కడైనా పడిపోయిందా?" అంటూ అడిగాడు, వెతికాడు, జగన్నాధం.

సికింద్రాబాదులో నేను దిగిపోవాలి.

సికింద్రాబాదు స్టేషన్ దాటితే చాలు. హైదరాబాదు స్టేషన్లో అతనికోసం మా వాళ్ళు వచ్చేస్తారు. మెసేజ్‌లో కంపార్టుమెంటు నెంబరు ఇచ్చాను.

బండి కదలబోతూవుండగా అతన్ని పలకరించాను "జగన్నాధం!"

మూలిగాడు. కదల్లేదు.

"మిస్టర్ లోకనాధం!" గర్జించాను.

"ఎస్‌సార్" అంటూ లేచాడు. "మీరు దిగిపోతున్నారా?.... చాలా కాలం తరువాత కలిశాము. ఎంతో సంతోషంగా వుంది.... మళ్ళీ కలుద్దాం!" అని చెయ్యి జాపాడు,

"అవును. ఈ మాటు కొంచెం త్వరలోనే కలుద్దాం!" అన్నాను, నా బ్రీఫ్‌కేస్‌తో దిగిపోతూ. **

("జ్యోతి" మాసపత్రిక— దీపావళి 1984)

# నా సుఖమే నే చూసుకున్నా

"తిరప వెళ్ళున్నాన్రా, ఓ మాటు చెప్పిపోదా మనొచ్చేను" అంది రాజీ: ఎన్నో ప్రశ్నలు కళ్ళలో పెట్టుకొని నేను చూపుతోనే పలకరిస్తే అవన్నీ అర్థమైనట్టు.

మా అక్క: "రాజీ" అసలు పేరు రాజేశ్వరి నాకన్నా యాడాదే పెద్ద. ఈ ఊళ్ళోనే బావగారు మెడికల్ రిప్రెజెంటేటివు. నెలకి ఇరవై రోజులుఆయనెలాగా ఊళ్ళో వుండరు కదా; ఓ మాటు వొచ్చిపోవే అంటే; నేనూ ఆయన్తో క్యాంపులు పోతున్నానంటుంది. ఈ రావడం సల్దై రోజుల తరువాత. వార నాడు మార్కెట్ దగ్గిర బావగారి స్కూటర్ కనబడితే ఆయనెక్కడో ఇందమ్మటే వున్నారు. కదా అని ఓసారి పలకరిద్దామని రెండు నిమిషాలా గేను. పక్కనే ఉన్న షాపులోంచి ఇవతల పడ్డాది అక్క. బావగారేరీ అన్నాను. అయన క్యాంపు. నేనొక్కదాన్నే వొచ్చానంది. అంటే స్కూటర్ నేర్చేసుకుందన్నమాట. ఇహనేమ్మరీ- ఓ మాటు ఇంటికిరా; అన్నాను. అబ్బే: టైంలేదు: ఆయన బొకారో ఎక్స్ప్రెస్‌తో వస్తానన్నారు. బండి పట్టుకెళ్ళాలి అని స్కూటర్ గిర్ మనిపించింది.

"ఎవరెవ రెళ్తున్నారు?" అన్నాను సాదాగా. సదాగా.

"నేనూ బావగారే—"

"మరి ఇల్లు?"

"నిన్ననే మా మామగారొచ్చేరు. శివానందస్వామిగారి ఉపన్యాసాల్ట: ఇవాల్టినుంచీనూ, పదిరోజులుంటారుట్లే"

"ఏం మర్యాద మనిషివే. ఆయన్ని ఇంటికి కాపలాపెట్టడం, నువ్వూ అతనూ షికార్లు కొట్టడమూనా! రెండు పూట్లా వంటకూడా చేసుకోమని చెప్పేవా?" అంది మా అమ్మ: చీవాట్లు పెడుతున్నట్లు తెలిసిపోతుందని నవ్వుతో కప్పేస్తూనూ.

"నన్నేంచై మంటావు? టిక్కెట్లు కొనుక్కొచ్చిమరీ చెప్పేరు ఈన.

అయ్యో ఇల్లు తాళం పెట్టేస్తే మళ్ళీ ఎవడైనా దూరుతాడు కదండీ అంటే మా అమ్మనీ నాన్ననీ రమ్మని ఉత్తరం రాసేస్లే అన్నారు. ఆ ఉత్తరం అందలేదు గాబోలు; మామగారొక్కరే వొచ్చేరు. మధ్యాన్నం ఎండ పూట రాలేరు గానీ రాత్రిళ్ళ ఉపన్యాసాలయ్యేక ఇలావొచ్చి భోంచేసి వెళ్ళమని చెప్పేస్లే"

మేం ఇద్దరం కలిసే చదువుకున్నాం. ఒకే స్కూల్లోనూ, ఒకే కాలేజీ లోనూ.. నేను పదకొండోయేట సైకిల్ తొక్కడం నేర్చాను. ఇద్దరం ఏడేళ్ళపాటు ఆ సైకిల్ మీదనే వెళ్ళే వాళ్ళం.ఏదైనా వోరోజు ప్రాక్టకల్స్ మూలంగానో స్పెషల్ క్లాసు మూలంగానో నేనో గంటసేపు కాలేజీలో వుండిపో వలసి వస్తె తను నా దగ్గరకొచ్చి సైకిల్ తాళం పుచ్చేసుకొని ఇంటికొచ్చేసేది. అప్పుడప్పుడు సాంకేతిక కారణాలవల్ల మేం ఇద్దరం ఒకే వాహనం మీద వెళ్ళ కూడని రోజులు వస్తె అప్పుడూ సైకిల్ తనే వాడేది. ఆ రోజుల్లో ఓ సినిమా పాట వొచ్చింది :

"నీ సుఖమే నే కోరుకున్నా-
నిను వీడి అందుకే వెడుతున్నా" అని.

దానికి పేరడిగా నేను రెండు లైన్లు తయారు చేసేను; "అక్కపాట" అని :—

నా సుఖమే నే చూసుకున్నా
నను వీడి అందుకే; పొమ్మంటున్నా-

ఒకటి రెండు రోజులు ఉడుక్కుంది గాని, ఆ తరవాత మాత్రం దానికి ఏదైనా అవసరం వచ్చి నేను చిన్న చిన్న త్యాగాలు చెయ్యవలసి వచ్చినా ఆ పేరడీ పల్లవి తనే నిర్మొహమాటంగా ఆలాపన చేసేది....

"ఎన్ని రోజులు, క్యాంపు?" అన్నాను.

"రేపు రాత్రి బయలుదేరుతాం. ఎల్లుండి సాయంకాలానికి తిరుపతి. ఆ రాత్రి అక్కడ కింద తిరుపతిలోనే ఆయన ఫ్రెండింట్లో ఉంటాం. ఆ మర్నాడు అంటే ఇరవైతొమ్మిదో తారీకునాడు వీళ్ళ కంపెనీ జోనల్ ఏజంటుగారికోసం స్పెషల్ దర్శనం ఏర్పాటయిందట: తిరపతి రిప్రజంటేటివ్ గారు కారు తీసు కొస్తారట. కార్లోనే ఎగువకి వెళ్తాం. మళ్ళీ మధ్యాహ్నానికి దిగువకొచ్చి, భోజ నాలైపోగానే మెడ్రాస్ వెళ్తాం. ముప్ఫయ్యో తారీకు ఒకటో తారీకు మెడ్రాస్‌లో కంపెనీ మీటింగులున్నాయట. దసప్రకాశ్ హోటల్లో ఉంటాం. రెండూ మూడు

తారీకులు సెలవు పెట్టారు. కంచీ మధురా వెళతాం. నాలుగు ఆదివారం కలిసి వచ్చింది. ఆ రోజుకి మద్రాసుకి చేరి ఆ రాత్రి మెయిలెక్కి ఐదో తారీకు మధ్యాహ్నానికి ఇంటికి చేరతాం. ఆ సాయంకాలం గోదావరికి మామగారు వెళ్ళి పోతారు."

"హాట్సాఫ్ రాజీ. మొత్తంమీద మీ మామగారు ఇంటికి కాపలా కాస్తున్నందుకు ఆయనకి నీ చేత్తో మొత్తం ఎన్ని పూటలు భోజనం పెడుతున్నట్టు?— అఁహఁ— నాకు సరిగ్గా లెక్క తేలక అడుగుతున్నాను!" అన్నాను చప్పట్లు కొట్టి.

"నీ వేళాకోళానికేం లే."

నేను సినిమా పాటగాని పేరడీ గాని అనకుండా: కేవలం ట్యూలతో,— పాడాను.

"స్వామివారి హుండీలో వెయ్యడానికి డబ్బులిస్తాను; శ్రద్ధగా వేస్తావుటే?" అంది అమ్మ: లోపలికి వెళ్తూ.

"అదికాదు బాజీ;" అంది రాజీ, రాజీధోరణిలో.

"చెప్పు చెప్పు—"

"ఓ మూడు వందలుంటే సర్దుదూ— మళ్ళీ నింపాదిగా ఇచ్చేస్తాను."

"అమ్మనే అడుగు. నా దగ్గిర డబ్బు వుండదు. నీకు తెలుసుగా."

"అమ్మనడిగితే మళ్ళీ యివ్వననుకుంటుంది. ఒకవేళ నేనిచ్చినా నా దగ్గిర తీసుకోకూడదనుకుంటుంది; ఎంతైనా ఈ ఇంటి ఆడపిల్లను కదా! అంచేత ఈ తికమకలు తప్పించుకోవడానికి ముందే లేదనేస్తుందని; నిన్నడుగుతున్నాను."

"నీ లాజిక్ తప్పు రాజీ. మిగతా విషయాలెలావున్నా ఇంట్లో డబ్బు వుంటే మాత్రం ప్రాణం పోయినాసరే అమ్మ "లే"దని అనదు. "లే" దంటే లేకుండానే పోతుందని; ఎవరో తథాస్తు దేవతలుంటారని అమ్మనమ్మకం. సత్యనారాయణ వ్రతంలో కథ గుర్తుచేస్తుంది."

"ఏమోరా బాజీ. నువ్వే ఎలాగో నాకి అవసరం గడపాలి." అని గునిసింది అక్క.

"అమ్మ దగ్గిర నిజంగానే లేకపోతేనో?"

"ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటున్నారు. ఇద్దరు తెచ్చిందీ భక్తిగా శ్రద్ధగా అమ్మకే ఇస్తారు, నాన్నారి ఫెన్షనోటి. ఉండకుండా యెలా వుంటుంది బాజీ? నువ్వడిగి చూడు."

"అలాగంటావా? సరేగాని అమ్మ మేం ముగ్గురం తెచ్చిన డబ్బుని జాగ్రత్తగా దాచేసి పైసాపైసా లెక్కకట్టి ఖర్చుపెడుతూ నెలకో ఇంత వెనకేస్తోందని నేను అనుకోవడం లేదు. ఇంటి ఖర్చు బాగా పెరిగింది. నువ్వున్నప్పుడు తింటున్నట్టే ఇప్పుడూ తింటున్నాం. నువ్వున్నప్పుడు ఉన్నంతమందే ఇప్పుడూ ఉన్నాం. కాని ధరలన్నీ పెరిగిపోయాయికదా. కటాకటీగానే ఉన్నట్టుంది."

"అనుకుంటే అలాగే వుంటుంది. పోనీ ఓ స్కూటరైనా కొనుక్కోలేదు నువ్వు. ఆ ఖర్చులేదుకదా నీకు?".... అడిగి చూడు రాజీ. నిజంగా అవసరం; చెబుతున్నాను కదా. ఇంకా మెడ్రాస్‌లో ఆ మీటింగ్ ధర్మమా అని ఆయన ఖర్చులు కంపెనీ ఇస్తుంది. మరి ఈ మిగిలిన ప్రయాణాలకీ అక్కడేమైనా కొనుక్కోవాలని అనిపిస్తె దానికీ ఎలాగా అని నా బాధ."

"సరేలే అడుగుతాను. ఒకవేళ అమ్మ దగ్గిర నిజంగానే లేకపోతే ఇంకెక్కడైనా అడిగైనా సరే యివ్వవలసిందేకాదా," అన్నాను.

"ఇంకెక్కడో యెందుకు? శారద దగ్గిరే ఉంటుంది. ఆ మాత్రం బ్లాక్ మనీ-" అంది రాజీ మరో 'కాకా' నవ్వు విసురుతూ.

నేను నవ్వు విసురులోనే పడిపోయేను గాని శారద దగ్గిర బ్లాక్‌మనీ ఉంటుందనే విసురు పట్టించుకోలేదు ఆ క్షణంలో." అవున్లే, తిరపతి దేవుడి దగ్గరి కెళ్తున్నావుకదా. బ్లాక్ మనీ అయితేనే సమంజసంగా వుంటుంది." అని నవ్వేను.

"నేనన్నదాంట్లో తప్పేమైనా ఉందో లేదో నీకేతెలుస్తుంది. సమంగా ఆరా తీస్తెను." అని ఈ మాటు ఇంకో రకంగా నవ్వింది రాజీ. "మా ఇంటి పక్క రంగనాథంగారబ్బాయికి కూడా శారద పనిచేస్తున్న బ్యాంక్‌లోనే; అదే రోజున ఉద్యోగం వొచ్చింది. ఇద్దరిదీ ఒక్కటే రాంకు. మరి అతనికి నెలకి పన్నెండు వందల ఎనభయ్యేమిటి; శారదకి తొమ్మిది వందల తొంభయ్యేమిటి?

ఓ చేతిలో రెండు కప్పుల కాఫీ ఉన్న ట్రేతో, రెండో చేతిలో చిన్న పసుపు గుడ్డతో కట్టిన మూటతో: అమ్మ వొచ్చింది.

అమ్మ అక్కడ ఉండిపోయింది. సోఫాలో నా పక్కని చోటుచేసుకుని. రాజీకి బహూశా అమ్మ దగ్గిర డబ్బు సంగతి ప్రస్తావించడం యిష్టంలేదు. పావుగంటసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పి గడిపింది. "అయ్యో, టాబ్లెట్ వేసుకోవడం మరిచేపోయాను" అని వాలెట్ లోంచి టాబ్లెట్ తీసి మంచినీళ్ళుంచే

బావున్ను. ఇది వొట్టినోట మింగుడు పడదు" అంది. అమ్మ లేపలేదు. తనే వెళ్ళి మంచినీళ్ళు తెచ్చుకుంది. రాజీ మాత్ర మింగుతూవుంటె నాకే ఏదో మింగుడు పడంది గొంతుక్కి అడ్డం పడ్డట్టయింది.

"నే నెళ్తున్నాన్రా బాజీ. రేపు పదకొండు గంటలకి మీ ఆఫీసువేపొస్తాం నేనూ బావగారూను. సీట్లో ఉంటావు కదా." అని అప్పటికి డబ్బు సిద్ధం చెయ్యమన్న మాట సంకేతం చేసి వెళ్ళింది రాజీ.

* * *

'ఆడపడుచు అర్ధమొగుడు' అని వొక నుడికారం వుందవి నాకు తెలుసు. శారద దగ్గిర బ్లాక్ మనీ ఉందని రాజీ సూచించింది. సమంగా ఆరా తీస్తె నాకే తెలుస్తుందని కూడా అంది. రాజీ చూపించిన ఆధారం కూడా సరిగ్గానే ఉన్నట్టుంది. రంగనాథంగారబ్బాయి రాజశేఖరం నాకు తెలుసు, చాలా బుద్ధిమంతుడు. జీతం అంతా పొల్లుపోకుండా తన చేతికొచ్చిన కాన్సేపట్లో వాళ్ళ నాన్నగారికి యిచ్చేస్తాడు.సిటీ బస్సుకిగానీ సినిమాకిగానీ యింట్లో చెప్పి మరీ తీసుకుంటాడు.

శారద కూడా అంతే, అయితే వాళ్ళిద్దరూ ఒకే రాంకులో ఒకే బ్యాంకులో ఒకే తేదీని చేరి వుంటే వాళ్ళిద్దరి జీతాల్లో అంత తేడా వుండకూడదే! ఆఖరికి వ్యవసాయ కూలీల్లో కూడా ఆడమగ విచక్షణ లేకుండా సమానంగా ఇవ్వాలని చట్టం వున్నట్టుంది. బాంకు ఉద్యోగుల మధ్య ఎలా వుంటుంది తేడా?

మా నాన్నగారు రెవెన్యూ డిపార్టుమెంటులో పనిచేశారు. రిటైరై యిన్నాళ్ళయినా ఆయన్ను గురించి ఎంతో మంచిగానే చెప్పుకుంటారుగాని వేరే విధం లేదు. ఆయన సహోద్యోగి శివశంకరం'గారు' మా వీధిలోనే రెండంతస్తుల మేడ కట్టారు. ఎప్పుడైనా ఎదురైతే రెండు నిముషాలు వాళ్ళబ్బాయిల ప్రయోజకత్వం గురించి మాట్లాడతారు. మీ నాన్న సత్పురుషుడు అంటారు. మీ నాన్న మహాపురుషుడు అంటారు. "అయినా సరే, అతను సత్యకాలం మనిషి"అంటారు. సత్యకాలం అంటే ఏమిటో సత్యలోకం అంటే ఏమిటో తెలుసుగాని అది అప్రయోజకులను గురించి అనే మాటగా అర్థమై "వస్తానండి" అని తప్పుకుంటూ ఉంటాను.

రాజీకి పెళ్ళయి తొమ్మిదేళ్ళయింది. కొత్తలో కొంచెం తరుచుగా వొచ్చారుగాని రాజీ, బావగారు. మా ఇంటికి రావడం బాగా అరుదు. ఊళ్ళోనే ఉన్నాడు కదా అని ఏ పండగ సాకుతోనో భోజనానికి రమ్మని చెప్పడానికి వెళ్తే

"సారీ– రెండు రోజులు సెలవు కదా అని చిన్న షికారొకటి ప్రోగ్రాం వేసుకున్నాం," అనేస్తారు బావగారు. వాళ్ళిద్దరూ చాలా సరదాగా ఆత్మీయంగా ఉంటారన్నది నిజం. కాశీ నుంచి కన్యాకుమారిదాకా వాళ్ళు చూడని విహార క్షేత్రం లేదు. ఆఖరికి ఊట్యాటీమీద క్యాంపెళ్ళినా సరే. ఏ మాత్రం అవకాశం వున్నా ఇద్దరూ కలిసే వెళ్ళిపోతారు. "వెయ్యేళ్ళకీ అలాగే వుండాలి. అంతకన్నా మనకి కావలసిందేముంది?" అంటుంది అమ్మ.

నాకు ఇరవై ఆరో ఏట ఉద్యోగం వొచ్చింది. మా నాన్నగారికి రిటైరయిననాడు ఎంత జీతమో నాకు ఉద్యోగంలో చేరిననాడే అంత. అయితే "ఆ రూపాయలు పెద్దవిరా బాజీ" అన్నారు గారు. కట్నం ఇవ్వకూడదు; పుచ్చుకోకూడదు– అన్న సూత్రం ఆయన నా చిన్నతనం నుంచీ చెప్పడం నాకు తెలుసు. బావగారు రాజీని చూడ్డానికొచ్చిన మొట్టమొదటి పెళ్ళికొడుకు. "పిల్ల నచ్చింది; మిగతా విషయాలు మాట్లాడుకోండి" అన్నారు బావగారు ఆ రోజునే చాలా కులాసాగా "పిల్ల నచ్చితే ఇంక మిగతా విషయాలంటూ ఏమీ వుండవు నాయనా" అన్నారు నాన్నగారు. అంతే. వాళ్ళ నుంచి మళ్ళీ కబురు లేదు. ఆ వూళ్ళో వున్న మా నాన్నగారి స్నేహితుడు కూడా ఈయన రాసిన ఉత్తరానికి సమాధానం ఇయ్యలేదు, ఆ తరవాత రాజీని మరో నలుగురు పెళ్ళికొడుకులు చూసేరు; సుమారు మూడు నెలల వ్యవధిలో. అంతే. బావగారు ఒక సాయంత్రం మా ఇంటికి వచ్చి ఆ రాత్రి మా ఇంట్లోనే మా నాన్నగారితోబాటు వీధి వరండాలో మాట్లాడుతూ అక్కడే నిద్రపోయాడు. మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకి వెళ్ళిపోతూ అమ్మకీ, నాన్నగారికీ నమస్కారాలు చేసి "ఇంక మీదే ఆలస్యం" అన్నారు; "వస్తాను బాజీ" అని నాతోను "వస్తాను రాజీ" అని అక్కతోనూ చెప్పి, "మనం త్వరలోనే కలుస్తామని ఆశిస్తాను" అంటూ వెళ్ళాడు. అలా ఐంది ఆ పెళ్ళి.

"కట్నం పుచ్చుకోవటం తప్పని మీరు నమ్ముతున్నారు కనక అలాగే చెయ్యండి నాన్నారూ" అని చెప్పేను; నా పెళ్ళి శారదతో స్థిరపడుతున్న సమయంలో, "నెలకు వెయ్యో ఎంతో జీతం తెచ్చుకుంటోంది. ఓ రకంగా యిది కట్నమే. కాని కట్నం కాదు కూడాను. ఇది ఆలోచించే నీకు ఈ సంబంధం స్థిరపరుస్తున్నాను" అన్నారు నాన్నగారు.

ఈ మూడేళ్ళ నుంచీ శారద పొద్దున్నే లేచి బ్యాంక్ కెళ్ళడానికి

పైమయ్యే వరకూ అమ్మకి సహాయపడి నాతోపాటు భోంచేసి వెళ్తొంది. సాయం కాలం ఐదు దాటగానే వొచ్చేస్తోంది. జీతం వొచ్చిన్నాడు అమ్మకి ఇచ్చేస్తోంది. బస్సు చార్జీ నుంచి బట్టలషాపు బిల్లు వరకు ఎంత కావాలంటే అంతా అడిగి తీసుకుంటూంది. ఈ నెల ఇంతే వొచ్చిందా అని నేను గాని అమ్మగాని అడగ లేదు. నాన్నగారికి అసలా విషయాలే అక్కర్లేదు.

ఇప్పుడు రాజీ వొచ్చి తనకి మూడు వందలు అవసరమై ఈ ఆడిట్ పెట్టింది. పైగా "సమంగా ఆరా తియ్యాలి" అని సూచన కూడా చేసింది.

మూడేళ్ళ నుంచీ మూడు వందల చొప్పునైతే కూడా పదివేలు దాటి వుండాలి బ్లాక్‌మనీ, అంతా వో దగ్గిర పోగేస్తుందా లేక వాళ్ళన్నయ్యకి పద్ధతిగా పంపిస్తోందా? మా బావమరిది ఏదో ఉద్యోగం చేసుకుంటూ సంసారం లాగు తున్నాడే గాని నాకున్నంత పాటి స్తోమత కూడా లేదని నాకు తెలుసు,

కాని ఆరా తియ్యడం, రభస చెయ్యడం ఎంతో అన్యాయంగా తోచింది నాకు, శారద నిజంగా తన జీతం ఇంతా అని చెప్పక పోవడం తప్పేకావచ్చు, కాని ఆమెకి స్వంత ఆలోచన అంటూ ఏదైనా ఉండవచ్చుననీ,అందులో కొంత ఆర్థిక స్వాతంత్ర్యపు ఆలోచన ఉండటంలో తప్పులేదనీ అనిపిస్తోంది. నేను ఆరా తియ్యడానికి ప్రయత్నించడమే తప్పుగా తోస్తోంది.

ం ం ం

హాల్లోంచి నా గదిలోకి వెళ్ళాను. ఏమీ తోచలేదు. అక్కకి కావలసిన డబ్బు అమ్మని అడగదలచుకోలేదు, నారాయణరావు నడిగితే ఇస్తాడు. మళ్ళీ జీతాల్లో ఇచ్చెయ్యొచ్చు. కాని ఆ మేరకి అమ్మ చేతిలో పెట్టేది తగ్గుతుంది. అమ్మ అడగదు, తక్కువెందుకిచ్చావని. ఓసారి కళ్ళెత్తి చూస్తుంది. జరిగిం దంతా అప్పుడైనా చెప్పితీరాలి. రాజీ కులాసాగా కాలం గడుపుతోందని, బావ గారికి అక్కంటే ప్రాణమనీ అమ్మకి తెలుసు, వెయ్యేళ్ళకీ అలాగే ఉండా లంటుంది. కాని అప్పుడప్పుడైనా, ఆ కులాసా తిరుగుళ్ళు ఆపేసి ఖర్చులు తగ్గించుకొని ఓ ఇల్లు కట్టుకుంటే బావుంటుందన్న ధోరణిలో అమ్మ మాట్లాడు తూనే వుంది: "మాయరోజులు వచ్చిపడ్డాయి, పెళ్ళయి పదేళ్ళు కావస్తోంది. ఇంకా బిడ్డలెప్పుడు కంటుందో...." అంటూనే వుంది. "కాలం నాటి పిల్లలూ లేక కాలం నాటి డబ్బూ మిగలక, ముసలితనంలో ఎన్ని బాధలు పడతారో" అని భయపడుతూనే ఉంటుంది.

మంచం మీద వాలుదామని, మంచం దగ్గరగా వెళ్ళాను. శారద పెట్టె మంచం కిందనే ఉంటుంది. కాని. కొద్దిగా ముందుకి పొడుచు కొచ్చినట్టుంది, కాలికి తగిలింది. వొంగి ఆ పెట్టెని లోపలికి నెట్టడంలో పెట్టె తెరచి చూద్దామనే కోరిక కలిగింది. వెనక్కి నెట్టకుండా ముందుకే లాగాను.

"ఏం కావాలి?"

బెదిరేను, శారద గొంతు విని.

"అబ్బే!" అంటూ ఆపెట్టెని లోపలికి నెట్టేసిలేచి నిలబడి ఇటుతిరిగాను.

బ్యాగ్‌లోంచి డబ్బు,ఒకఉత్తరం తీసింది శారద,ఉత్తరం నాకిచ్చి"సాయంకాలం బస్‌లో మా అన్నయ్య దగ్గర కెళ్తున్నాను...." అని చెప్పేసి డబ్బుతో అమ్మ దగ్గర కెళ్ళిపోయింది.

ఉత్తరం చదువుకున్నాను. వాళ్ళ వదినెగారు రాసింది, "మీ అన్నయ్యగారికి ఒంట్లో ఏమీ బాగులేదు. వీలుంటే ఒకసారి వచ్చి చూచి వెళ్ళు. ఇదే టెలిగ్రాం అనుకో...." అని సారాంశం.

రెండు నిముషాల్లోవెనక్కొచ్చిసింది శారద"మామయ్యగారేరీ?"అంటూ.

"డాబా మీదున్నట్టున్నారు" అన్నాను.

ఆయన్తో చెప్పేసొస్తాను. బస్‌స్టాండ్ దాకా వద్దురు గాని. ప్యాంటేసుకోండి" అని నాతో చెప్పి వెళ్ళిపోయింది,

శారద పెట్టె కెలుకుదామని, ఆరా తియ్యమన్న అక్కమాటకి విలువ ఇచ్చానని నా మీద నాకు చిరాకు వేసింది. ముప్ఫయ్యో తారీఖున తీసుకోవలసిన జీతం ముందుగానే (ఇరవై ఏడునే తీసుకుని ప్రయాణక పెట్టుకుందంటే సెలవెన్ని రోజులు పెట్టింది - లాంటి ప్రశ్నలు ఏవో నన్ను బాధపెట్టడం మొదలెట్టాయి, అక్కడ ఉండటానికే బుద్ధి పుట్టలేదు, నేనూ వెళ్ళాను.

శారద నాన్నగారి కాళ్ళకు దండం పెట్టి లేచింది. చీర చెంగుతో కళ్ళు వొత్తుకుంది.

"నీలాంటి వాళ్ళని దేవుడు చల్లగా చూస్తాడమ్మా. ఏం భయపడకు" అన్నారు నాన్నగారు.

శారద మా అమ్మనీ నాన్నగార్నీ గౌరవంగా చూడ్డం ఎరుగుదును. కాని ఇలా భక్తిగా కాళ్ళకి దండాలు పెట్టడం కన్నీళ్ళు పెట్టుకోవడం నాకు తెలిసినంత వరకు కొత్తచర్యలు. ఆశ్చర్యపడి చూశాను.

"ఏమిటి నాన్నారూ?" అన్నాను కంగారుగా.

"నువ్వు గర్వపడవలసిన వ్యక్తిరా శారదా!" అన్నారు నాన్నగారు చెదిరిన కంఠంతో.

"తొందరగా రండి. సాయంకాలమైపోతోంది. గంట పెర్మిషన్ పెట్టేనన్నమాటే గాని అంతా ఇక్కడే అయిపోయింది" అని నాన్నగారికి టాటా చెప్పినట్టు చెయ్యూపి కిందకి దిగిపోయింది శారద.

"వెళ్ళు, వెళ్ళు!" అన్నట్టు నాకూ చేత్తోనే చెప్పారు నాన్నగారు.

o o o

కాఫీ పుచ్చుకోవడం—

చీర మార్చుకోడం—

ప్రయాణానికి కావలసిన వస్తువులు ఏరుకొని బ్యాగ్‌లో పెట్టుకోడం—

అన్నీ మూడు నిముషాల్లో పూర్తి చేసుకుంది శారద.

"అక్కకి కావలసిన డబ్బు ఇంట్లోనే వుంది. నారాయణరావుని అడగక్కర్లేదు"–

"అక్క ఆరా తియ్యమందని శారద పెట్టె కెలకబోవడం శుద్ధ పొరబాటు" "బావగారికి ఏం సుస్తీ? శారద ఎప్పుడు తిరిగి రాగలుగుతుంది?" "అక్కకి డబ్బు ఇస్తే తిరిగి ఇస్తుందా?" ఇలాటివి ఆలోచించుకుంటూ నేను సిద్ధపయ్యాను.

* * *

రిక్షా ఎక్కేవరకు శారద ఏమీ మాట్లాడలేదు.

"మూడు రోజులు సెలవు పెట్టాను"

"వెళ్ళగానే ఎక్కణ్ణించయినా ఫోన్ చెయ్యి, మీ అన్నయ్య ఆరోగ్యం గురించి. ఈ రాత్రి చెయ్యగలనంటే రమణయ్య గారింట్లో వెయిట్ చేస్తాను. రేపు ఉదయమైతే తొమ్మిది గంటలకి ఆఫీస్ కెళ్తాను"

"రేపే—"

"ఓకే—"

"ఈ రాత్రి మీ నాన్న గార్నడగండి. కొన్ని ముఖ్యమైన సంగతులు చెప్తారు...."

"నువ్వు నాన్నగారి కాళ్ళకి దండం పెట్టడం చూడగానే అనుకొన్నాను, ఏదో వుందని"

"తప్పా?"

"తప్పుకాదు గానీ, అరుదుగా చేసే పని కదా"

"అసలు రోజూ ఆయన కాళ్ళ మీద పడాలి. ఆయన దేవుడు!"

నాకు నవ్వొచ్చింది.

"ఓ విధంగా మీరూ దేవుడే లెండి. ఇన్నాళ్ళయినా మీరు నన్ను ఒక ముఖ్యమైన ప్రశ్న అడక్కుండా వూరుకున్నారు."

ఆ ప్రశ్నేమిటో అర్థమైపోయింది. అది అక్క లేవదీసిన ప్రశ్నే!

"ఇవాల్టితో అప్పు తీరిపోయింది. కనక నాకు ధైర్యం వొచ్చింది"

"అ-ప్పా-?"

"ఔను....మామయ్యగారు చెప్తారన్నాను.... పోన్లెండి. అయనెన్నెందుకు హింస పెట్టడం. నేనే చెప్తాను-"

○ ○ ○

నా చెవుల్ని నేనే నమ్మలేకపోతే ఎలాగ?

అలాగే నా మనసులో మనసై, మా ఇంట్లోనే దీపమై, మూడేళ్ళపాటు ఒక్క పొల్లు మాట అనకుండా అనిపించుకోకుండా, ఒక్క నిరర్థకమైన చర్యకు పాల్పడకుండా వున్న శారద మాట కూడా నేను నమ్మవలసిందే.

తొమ్మిదేళ్ళనాడు హఠాత్తుగా ఓ సాయంకాలం మా ఇంటికొచ్చి రాత్రి చాలా సేపు నాన్నగారొక్కరితోనూ మాట్లాడి రాజీపెళ్ళి తనతో నిర్ణయం చేయించుకున్న బావగారు.... తనకి కూడా కట్నం అంటే వెగటేనని. అయితే ఓ పది వేలు తప్పనిసరిగా తీర్చవలసిన అప్పు ఉందని, ఆ మాత్రం సొమ్ముకోసం రాజీని బాధలు కోరేనని. ముందు ఆ సొమ్ము ఎలాగో సమకూరిస్తే అది తనే తీర్చుకుంటానని- నాన్నగార్ని ఒప్పించాడట-

ఆ అప్పు తీసుకోడం రహస్యంగా జరిగింది. నాన్నగారు ఎంత వెసులు బాటు చేసుకొని తీర్చినా నా పెళ్ళి నాటికి అది వడ్డీమీద వడ్డీ చేర్చుకొని ఇంకో తొమ్మిదివేలకి తేలిందట. ఆ అప్పు తీర్చడంలో తన బాధ్యత ఉంటుందని వాగ్దానం చేసిన బావగారు విహారయాత్రలు చెయ్యడం. స్కూటర్ కొనుక్కోడం లాంటి ఆకర్షణల్లో పడిపోయి—

"ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటున్నారు కనక ఈ అప్పు కోడలు తీరుస్తుందిలే" అనుకొన్న నాన్నగారికి, శారద తను మా ఇంట్లో కాలు పెట్టిన వారం రోజుల్లోనే, తన పెళ్ళి కోసం తను పనిచేస్తున్న బ్యాంకులో తీసుకున్న అప్పు పదివేలు యథాతథంగా వప్పగించి- ఈ నెల నుంచీ నాజీతంలో దాదాపు మూడు వందలు కోత ఉంటుందని, ఇది మూడేళ్ళుంటుందని, చెప్పింది....

"అయితే కట్నాలు ఇవ్వకూడదు. పుచ్చుకోకూడదు-అనే సూత్రాన్ని నాన్నగారు పాటించారా లేదా?" అన్నాను.

"పెద్దవారు, ఆయన ఆ సూత్రాన్ని నమ్మారు. కాని మీ బావగారూ నేనూ పడనిచ్చినట్టు లేదు" అంది శారద—

***

("జ్యోతి" మాసపత్రిక; దీపావళి 1963)

# క్షణభంగురమ్

నాకు ఆ వూరు కొత్తగా ట్రాన్స్‌ఫరైంది, ఎంత వెతికినా ఎక్కడా ఇళ్ళు దొరకలేదు. ఊరు చివర రాజానగరం కాలనీలో వెతకమన్నారు కొందరు. ఊరికి దూరం అవడంవల్ల కారూ, నౌకర్లూ వుంచేనే అక్కడ వుండటానికి సదుపాయం గానీ, నాలాంటి మధ్యతరగతి వాళ్ళు ఆ అద్దెలూ పెట్టుకోలేరు; ఆ పేటకి వెళ్ళి రిక్షాలకి డబ్బు తగలేసుకోనూ లేరు. అయినా చేసేదిలేక అక్కడే వెతికాం. ఒక పెద్ద ఆఫీసరుగారు ఆ బంగళా అంతా అద్దెకు తీసుకున్నారట; 'కావాలంటే ఔట్ హౌస్ మీ కిస్తా' మన్నారు. ఏదో అద్దె మాట్లాడుకున్నాం. ఔట్ హౌస్ అయినా వేరే బాత్రూమ్; వేరే కొళాయి, వాళ్ళతో సంబంధం లేకుండా వీధివేపు తలుపూ వున్నాయి. మాకు నచ్చింది; చేరాం.

నాదేంపోయింది. ప్రొద్దుట పదింటికి వెళితే సాయంత్రం ఆరయ్యే వరకూ రావాలనుకున్నా రావడం పడదు. కాని మా మాణిక్యానికే బాధ. నాభార్య మొదట్నుంచీ పదిమందిలో మెసిలిన మనిషి. పది గంటలకి నాకు అన్నం పెట్టేసి పంపిస్తే పదకొండు గంటలకల్లా తన భోజనం. మిగతా పనులూ అయిపోతాయి. అక్కణ్నుంచి సాయంత్రం ఆరు వరకూ (గంటలు ఎలాగూ లెక్కబెడుతుంది) నిమిషాలు కూడా లెక్కబెట్టవలసివొస్తుంది. మొదటిరోజునే విసుగు పుట్టింది మాణిక్యానికి. నేను రాగానే గోల పెట్టేసింది. ఎన్నో రోజులనుంచీ మాట్లాడ్డానికే వాచిపోయినట్టు;

పోనీ ఇంటివాళ్ళు ఏమైనా కలుపుగోరుతనంగా వుంటారా అంటే అదేమీ లేదు. ఇంటావిడ మా మాణిక్యానికి అయిదురోజుల వరకూ మొహామే చూపించలేదట. వాళ్ళ వంటింటి కిటికీ మాకు కొంచెం దగ్గరగా కనిపిస్తుందిగాని, అందులో ఎవరో ఒక 'మొగ అతను, వంట చేస్తున్నట్టుందిగాని ఆడమనిషి అలికిడి లే'దంది మాణిక్యం. వారెవరో వంటవాణ్ణి పెట్టుకోగల భాగ్యశాలురు గాబోలు. పోనీ పొరుగు చూదామా అంటే అదీ ఒక పెద్ద బంగళా (కుక్కలు వున్నవి జాగ్రత్త అనే బోర్డుతో సహా). మా ఔట్ హౌస్ నానుకొని ఆ

బంగాళా లోనూ ఒక బోట్ హౌస్ వుండగాని నిశ్శబ్దం. అందులో దిగటాని ఎవరూ తయారవలేదన్న మాట, ఇంకాను. పోనీ అందులోనయినా మా బోటి వాళ్ళెవరో దిగితే మాణిక్యానికి కొంచెం ఉబుసుపోయేది.

పది రోజులు దాటింది గాబోలు. ఒకనాడు రాత్రి మాటుమణిగేక ఏదో చప్పుడవుతూందంటూ మాణిక్యం లేపింది నన్ను, పక్కనున్న బోట్ హౌసులోంచి ఒక మగ గొంతుక, ఒక ఆడ గొంతుకా వినిపించాయి. ఎవరో అక్కడ ఇది వరకటినుంచీ వుంటూ అప్పుడే ఏదో ఊర్నించి వచ్చినట్టుగా వుంది ఆ సందడి. మాణిక్యానికి స్నేహితురాలు ఏర్పాటవుతుందని అనుకుంటూ పడుకున్నా.

పక్క బోట్ హౌసూ, మాదీ మరీ దగ్గిర. రెండల్లా ఒక్క ద్వారమే, ఒకే గోడని ఆనుకుని అటూ ఇటూ వున్నాయి ఈ రెండూను. ఆ గోడైనా సందడి గోడేమో; పల్చనే అనిచెప్పాలి. ఏ మాత్రం గట్టిగా మాట్లాడినా ఒకరి మాటలొకరికి వినిపిస్తాయి. మెయిన్ గేటుకి సంబంధం లేకుండా మాకున్నట్టే వాళ్ళకీ వీధిలోకి దారి వుంది.

సరే; వాళ్ళు వొచ్చినట్టు మాకు తెలిసినట్టుగానే మేం ఇందులో దిగినట్టు వాళ్ళకీ తొందరగానే తెలియాలి. మాణిక్యంతో మర్నాడు పది గంటలకి నేను ఆఫీసుకి వెళుతున్నప్పుడే చెప్పాను. ఇవాళనుంచీ కాలాన్ని దుర్వినియోగం చెయ్యకుండా కొత్త స్నేహితురాలితో పరిచయం కలుపుకో-అని. కాని మాణిక్యం వాళ్ళతో స్నేహం చేసుకోలేదు.

మొదటిరోజేమో-'వాళ్ళెవరో అసలు తెలియకుండా ఎలాగండీ?' అంది. రెండో రోజు ఏదో సెలవొచ్చి నేను ఇంటి దగ్గరే వుండిపోయాను. మూడో రోజు 'ఆవిడే వస్తుందేమో అని చూశా' నన్నది మాణిక్యం. నాలుగో రోజు-అయిదో రోజు-యిలా కొన్నాళ్ళు-'ఏదోలెద్దురూ, వాళ్ళ రేడియో పగలస్తమానం పాడుతోంది, ఏదోనాకూ గోడ చాటునుంచి అవన్నీ వినబడుతూ కొంత కాల క్షేపం అవుతోంది' ఇలా అనీ. మొగాయన వున్నాడేమో అని చెబుతూ మరో రోజూ మొత్తంమీద పరిచయం చేసుకోనే లేదు. నేను రోజూ ఆఫీసునుంచి వొచ్చిన తర్వాత ఏదో సమయం చూసి అడుగుతూ వుండడమూ, మాణిక్యం ఏదో యిలాటి కారణం చెబుతూ వుండడమూ అయింది కొన్నాళ్ళు, అసలు కార ణం నేను వూహించక పోలేదనుకోకండి.

ఈ రోజుల్లో ఎవరు ముందుగా స్నేహం అర్థించి పరిచయం కోరితే వాళ్ళు తేలిక. రెండో వాళ్ళు వీళ్ళమీద కొంచెం ఆధిక్యం చెలాయించడతారు.

* * *

మా పొరుగు వాళ్ళు చాలా హుషారుగా వుంటారని గమనించాను. వాళ్ళు కొత్తగా పెళ్ళయిన దంపతులయి వుండాలి. మేనత్త మేనమామ పిల్లలో, లేక మేనమామ మేనకోడలో-ఇలాటి దగ్గిర బంధుత్వమేదో వుండి వుండాలి వాళ్ళకి, వివాహ బంధం గాక. ఇంకా బాగా చిన్నవాళ్ళు. ఇరవై ఏళ్ళలోపు అతనికీ, పదహారేళ్ళో ఏమో ఆమెకీ వుండాలి. పెళ్ళయి ఏ ఆర్నెల్లో అయినట్టు అనిపిస్తుంది; పిల్లాపీచూ లేకపోవడమూ, ఆ హుషారు చూస్తే....

ఆ అబ్బాయికి ఎందులో ఉద్యోగమో ఊహించలేకపోయాం గాని, మొత్తంమీద ఇంటి దగ్గరే వుంటాడు; రోజులో చాలా భాగం.

వాళ్ళ రేడియో పగలస్తమానం అలా మోగుతూనే వుంటుంది. పొద్దున్న ఆరున్నరకి రామాకృష్ణా అని భక్తిరంజనితో మొదలు, ఏడు గంటలకి వార్తలైనా పెట్టకుండా సిలోన్. పదిగంటలకి సిలోన్ స్టేషన్ మూసేస్తే సింహళ భాషా సిలోన్, పదకొండు గంటలకి మళ్ళీ బొంబాయి. పన్నెండున్నర నుంచీ రెండువరకూ తెలుగు ప్రోగ్రాములు. రెండునుంచి మూడువరకూ మళ్ళీ హిందీ పాటలు, నాలుగున్నర నుంచి సిలోన్. ఇహ రాత్రీ పదకొండు గంటలే కాని, ఒంటిగంటేకానీ-వాళ్ళు స్టేషన్ మూసేసి తాళం వేసుకొని వెళ్ళిపోవాలే తప్ప, వీళ్ళు ఆపరు. నాటికలూ, కథానికలూ, లలితసంగీతం, పిల్లలు లేకపోయినా పిల్లల ప్రోగ్రాములు. మధ్య మధ్య రేడియో సంక్షిప్త శబ్దచిత్రాలు ఏవీ పోనివ్వరు వాళ్ళు, పాటలు; పాటలు!! పాటలు!!! వార్తలైనా పెట్టకుండా పాటలు పెట్టేస్తారు. సంసారం చేస్తూ పదేళ్ళు కావస్తోంది; మాకే పాటలమీది మోజుపోలేదు. ఇంకా కుర్రాళ్ళు. వాళ్ళకెలా పోతుంది? అనుకునే వాళ్ళం నేనూ మాణిక్యం, సందర్భం వచ్చినప్పుడు.

అతను పెళ్ళాన్ని బలే చిత్రమయిన పేర్లతో పిల్చేవాడు, సుబ్బలక్ష్మి కాబోలు ఆ అమ్మాయి పేరు 'బానా' 'ఒసే- ఆవిడా- సుబ్బీ- సుబ్బులూ- సుబ్బమ్మా సుబ్బలక్ష్మీ' యిలా పిలవడం - ఆ అమ్మాయి పాపం 'ఊరుకోండీ.ఏమిటా గావుకేకలూ! ఎవరైనా వింటే నవ్వుతారు కూడానూ!' ఆమె చాలా సిగ్గుతో ఎంతో మృదువుగా అనటమూ మాకు వినబడేవి; నేనూ మాణిక్యం ఒకరి మొహాలొకరు చూసుకోవడం, పైకి నవ్వుకోడం.

పైకి నవ్వుకోడం—అని ఎందుకన్నానంటే - మా కలాటి అదృష్టం లేదు గనక. మొదట్నించీ పదిమంది ఉన్న ఇంట్లో మెసిలేం. పెళ్ళయిన కొత్తలో—అంటే మూడేళ్ళవరకూ - నాపనేదైనా మాణిక్యంవరకూ వచ్చేదేకాదు. చెల్లెళ్ళూ అమ్మా, తమ్ముళ్ళూ వీళ్ళ సాన్నిధ్యంతో మేమిద్దరం ఎప్పుడోగాని ఏకాంతంగా ఉండడమే పడేదిగాదు. అంతగా మాణిక్యంతో ఏదేనా అవసరమొస్తే పక్కనే ఉన్న మా తమ్ముడినో చెల్లెల్నో పిల్చి—'ఒదిన్ని ఇలా రమ్మనూ. అని చెప్పడం తప్ప, పిలవవలసిన అవసరం కలిగేది కాదు. తరవాత ఉద్యోగరీత్యా వేరే ఊళ్ళో కాపురం పెట్టినా మూడోమనిషి ఎవరో మాతో ఉంటూనే వచ్చారు. అధమం ఒక ప్యూన్ అయినా ఉండేవాడు. 'అమ్మగార్ని ఒకసారి ఇటు రమ్మన వోయ్'అని చాలామాట్లు తప్పించుకున్నాన్నేను మాణిక్యాన్ని పిలవడాన్నుంచి. పోనీ ఎక్కణ్ణించో ఇంటికి వచ్చి తలుపుకొట్టేటప్పుడు - తలుపు కొట్టీ కొట్ట డంలో తపీమని తెరవడమూ—యిలా పిలవవలసిన తతంగం లేకుండానే కాల క్షేపం అయిపోతోంది. ఏదైనా రాసుకుంటూ వున్నప్పుడు మధ్యలో కాఫీ కావాల్సి వస్తే - 'ఇదిగో, కొంచెం కాఫీలాంటిది యేర్పాటుచెయ్యి!' అని ఓ కేకపెట్టడం: ఇలా అయిపోతుంది. కొన్నాళ్ళు మాణిక్యం నన్ను సాధించింది.

'ఇదిగో, అదుగో ఏమిటండీ! పేరు పెట్టి పిలవలేరా?' అని. కాని అదే మిటో ఆమెని 'మాణిక్యమూ' అని పిలవబుద్ధెయ్యరునాకు.అలా పిలిస్తే అదేదో ప్రాణంలేని వస్తువుని పిల్చినట్టు బాధ కలుగుతుంది. లక్షణమైన అర్ధాంగిని, ప్రాణంలేని వస్తువుని పిల్చినట్టు పిలవలేక పోయేవాణ్ణి. అసలు ఇన్నింటికీమూలం పిలవకుండానే దాదాపు అన్ని పన్లూ అయిపోవడమేనని ఒప్పుకోక తప్పదు. 'చక్కటి పేర్లు ప్రపంచంలో అన్నివుంటే మాణిక్యమని పెట్టేడేమిటి నీకు మీ నాన్న?' అని దెప్పుతుంటాన్నేను.

మాకు మరీ నవ్వొచ్చే సంఘటన వొకటి ఇంచుమించు రోజూ జరుగుతూ వుంటుంది. ఆ అబ్బాయి బాత్రూములో దూరి స్నానం చేస్తూవుంటాడు. కొంత సేపు పోయాక 'తువ్వాలోయ్!' అని గట్టిగా కేక వేస్తాడతను.

'అబ్బా రోజూ ఎంతకనండీ ! తువ్వాలు పట్టుగెళ్ళకుండా స్నానానికి వెళ్ళడం మా బాగా అలవాటయిపోయింది!' అంటుందా అమ్మాయి, తువ్వాలు తీసుకెళ్ళి బాత్‌రూమ్ దగ్గర నిలబడుతుంది గాబోలు !

'సుబ్బులూ! తువ్వాలోయ్' అంటాడతను ఇంకా గట్టిగా.

అమ్మాయి హడలి పోయినట్టు – 'అబ్బా తెచ్చాననండీ! ఏమిటా కేకలు.... తలుపు తెరవమంటారా ?' అంటుంది.

'తెరవ్వే? నాని పోతున్నానూ!' అంటా డతను.

ఆ అమ్మాయి తలుపు తెరుస్తుంది గాబోలు! అతను స్వరం కొంచెంతగ్గించి 'నీకు తెలియని రహస్యం నా దగ్గరేముందే. పెర్రిదానా!' అంటాడు.

చేస్తున్న పని మర్చిపోయి. ఈ దృశ్యం అంతా కళ్ళల్లోకి తెచ్చుకుంటూ బహూశా అతను బాత్‌రూమ్‌లో తువ్వాలుతో ప్రవేశించిన ఆ అమ్మాయి బుగ్గ మీద వొక్క చిటిక వెయ్యడం దగ్గర్నుంచీ మేమిద్దరం వేరే వేరేగా వూహించు కుని – వొకరి మొహం వొకరు చూసుకుంటాం తెల్ల మొహాలేసుకుని.

అది మాకే ఎందుకు జరగకూడదని అనిపిస్తుంది గాబోలు. అలాటి తియ్యటి సంఘటనలు ఇప్పుడు ఈ వయస్సులో ఏం జరుగుతాయి: జరిగినా ఏం బాగుంటాయి; పదహారేళ్ళ పడుచుగా తనూ ఇరవై ఏళ్ళ కుర్రాడుగా నేనూ ఉన్నప్పుడు ఛాన్సు విడిచి పెట్టుకుని! మా యిద్దరి కళ్ళలోనూ, అప్పుడు ప్రస్ఫుటంగా కనబడే దిగులు – 'వెళ్ళిపోయింది తియ్యటి కాలం – మళ్ళీ రమ్మంటే రాదు.' అనే బరువైన పొగ–అది నేనెలాచెబితే మీకు అర్థమౌతుంది!

అనుకోకుండా ఎప్పుడో వోసారి (వారానికోసారికి తక్కువ ఉండదు) సినిమాకి వెళతారు వాళ్ళు. రాత్రి ఏడు గంటలకే సద్దు మణిగినట్టు అయి పోతుంది. మేము ఇద్దరమూ వున్నా ఒంటరిగా వున్నట్టూ, ఏవరో పదిమంది ఇంట్లోవాళ్ళు హఠాత్తుగా ఎక్కడికో వెళ్ళిపోయినట్టూ, ఏదో వెలితిగా ఉన్నట్టూ, బాధ కలగడంతో తెలుస్తుంది. వాళ్ళు సినిమాకు వెళ్ళినట్టు. బిక్కుబిక్కుమంటూ పదిగంటల రాత్రిదాకా గడియకోసారి గోడ అవతలినించి రావలసిన శబ్దాలు రాలేదన్నట్టు సాభిప్రాయంగా ఒకరి వేపొకరు చూసుకుంటూ గడుపుతాం మేము. అప్పుడు వొస్తారు వాళ్ళు. ఆ నిశ్శబ్దంలో, వాళ్ళు చేసే గిన్నెల చప్పుడూ, కంచాల చప్పుడూ, ఆఖరికి నేతి గిన్నెలో చెమ్చా వొదిలిన చప్పుడూ అన్నీ ఎంతో స్ఫుటంగా, ఆహ్లాదకరంగా వినిపిస్తాయి మాకు. నిద్దరట్టదు !

భోంచేసి ఇవతలికొచ్చి అతను హుషారుగా అప్పుడే చూసొచ్చిన సిని మాలో పాటది కాబోలు, వో చరణం ఎత్తుకుంటాడు. అతనికి పాడటం రాదు. కానీ వచనంలా చదివేసినా అదే సంగీతంలా వుంటుంది మాకు, నోళ్ళు తెరచు కుని వింటాం. (చెవులు ఎలాగూ తెరచుకొనే వుంటాయి.) అలాంటి సమయంలో సంభాషణ ఎలా వుంటుందనీ:–

'సుబ్బులూ! తమలపాకుల్లేవూ? తమలపాకులు అయిపోక ముందే చెప్ప మని ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోవు గదా. ఇప్పుడీ అర్ధరాత్రప్పుడు ఏ సందులోకి వెళ్ళడం తమలపాకులకోసం ?'

'అబ్బా! ఈ ఒక్క రాత్రి గడుపుకొందురూ ! పొద్దున చూద్దాం ?'

'అదే వొద్దన్నాను. ఎందుకు గడుపుకోవాలి. అందులో తమలపాకుల్లే కుండానా! అసలు తమలపాకులంటే ఏమిటో, తాంబూలమంటే ఏమిటో, నీకే మైనా తెలుసునా!'

'ఊరుకోరు గదా; చిన్నతనం మీరూనూ!' లేకపోతే—

'అబ్బా ! ఆ రేడియో కట్టేద్దురు ఇహ. చాలా రాత్రయిందీ!'

'ఎంతమాట ! రాత్రి సద్దుమణిగేక క్షీరాన్న భోజనం, ఆ తరువాత పక్క మీద చలితో దెబ్బలాడుతూ ఆనుకొని పడుకోడమూ – ఆ సందట్లో రసవంత మయిన సన్నటి సంగీతమూ—వీటి మహిమ ఎలాటిదో నీకెంత చెప్పినా బోధ పడదేమే!'

"మీతో మాట్లాడడం నాదే పొరపాటు, మీ కెప్పుడూ ఒకటే సొద; అదేదో శాస్త్రం చెప్పినట్టు."

ఇంకో సందర్భంలో—

సినిమాలో పాటకాబోలు, వరసలేకుండా, వచనమూ కాకుండా వున్న ధోరణిలో ....

'చిలకా గోరింకలముగా ఆలూ మగలం హాయిగా, ఆ....' అని అతనూ–

'అయ్యో, వుండండీ! ఏమిటండీ మరీ చిన్న పిల్లాళ్ళాగా? చూశారా.ఎలా నలిగి పోయిందో!' అని ఆ అమ్మాయీ

'హోశ్! నా చేతుల్లో నలగడంకంటె పవిత్రమైన పనికూడా వుందిటే, నీ చీరకి;' అని అతనూ,

ఇలాటి సంభాషణలూ వినబడతాయి మాకు.

మాణిక్యం తల వొంచుకుంటుంది. నేను తల తిప్పుకుంటాను. అది సిగ్గు కాదు. ఏదో బాధ. ఆ బాధ నాకూ తెలుసును. గతించిపోయిన కాలాన్ని చూసీ, వొలికిపోయిన పాలని చూసే మనం పడే బాధ అది. మేం ముప్ఫయ్యేళ్ళకే ముసలివాళ్ళమైపోయామే అని చెప్పుకోలేక, ఒప్పుకోలేక పడే బాధ అది, లోకంలో చాల బాధలకంటె, ముసలి వాళ్ళమయిపోయామని ఒప్పుకోవలసి వచ్చి నప్పుడు పడేబాధ దారుణం!

'నువ్వెప్పుడైనా చూశావా, వాళ్ళని?' అన్నాను మాణిక్యంతో ఒకసారి మెల్లిగా, వాళ్ళకి వినబడిపోతుందేమో అనే భయంతో.

'లేదండీ, గోడలు ఎత్తు.'

గోడమీంచి చూడాలని ప్రయత్నం చేసిందన్నమాట లేకపోతే ఆ మాట ఎందు కొస్తుంది? మానవులకి సృష్ట్యాదినించీ వున్న కుతూహాల విశేషమే అది!

'పోనీ ఆ పిల్లయినా కనిపించలేదా?'

ఎలాటి ప్రశ్న! ఆ కుర్రాణ్ని చూడాలనే మాణిక్యం ప్రయత్నించిందనీ, అత నెల్లాపుంటాడో కనిపించకపోతే పోయాడు! పోనీ ఆ అమ్మాయేనా కనిపించ లేదా అనీ గాబోలు దీని అర్థం. మాణిక్యం అతనికోసం చూడడంలో వున్న తప్పునూ, నేను ఆ పిల్ల విషయంలో చూపిన కుతూహలంలో వున్న న్యాయాన్నీ తనలో ఇముడ్చుకున్న ప్రశ్న! మనలో ఇంత కుళ్ళెందుకుంటుందో!

'లేదండీ!'

'సినిమాకి వెళ్ళేటప్పుడు చూడవలసింది. నువ్వెప్పుడూ ఇంటోనే వుంటావుగా!'

'చూడాలనే అనుకుంటాను. కాని అదేమిటో- గప్‌చిప్‌గా వెళ్ళిపోతారు. ఒక అరగంట పోయాక తట్టుంది నాకు, సందడిలేదే అని; అప్పుడు అను కుంటాను; సినిమాకి వెళ్ళేరు గాబోలని; అంది మాణిక్యం.

మేం సాధారణంగా సినిమాకి వెళ్ళలేం. డబ్బులేక కాదు. నాకు. ఏ రోజూ ఆరుగంటల లోపున ఆఫీసుపని తెమలదు. ఇహ ఆరింటికి ఇంటికి వచ్చినా పగలల్లా శ్రమపడి వుండడాన్ని ఈజీచైర్లో కూచో బుద్ధి వేస్తుంది. ఆ జనం మధ్య టిక్కెట్లకి నానా అవస్థా పడి ఇంకో మూడు గంటలు సినిమాలో - కుర్చీలో కూచోక పోతేయేం, అనిపిస్తుంది. పోనీ సెలవొచ్చినా అదో రకంగా వుండి సినిమా తలపు కలగదు.

'రిక్షాలో వెళతారు గాబోలు!' అన్నాను.

'బావుందండీ! రిక్షాలో వెళ్ళక ఇంతదూరం నించీ నడిచి వెళతారా యేమిటి?' అంది మాణిక్యం.

నా ఉద్దేశం అదిగాదు. ఇద్దరూ ఒక్క రిక్షాలోనే కూచుని సరసంగా స్పృశించుకుంటూ ఒకరి నడుంమీద ఒకరు చెయ్యివేసుకుని వెళతారా అని. ఎందుకంటే మా కా భాగ్యం లేదు. మేమిద్దరం వొక్క రిక్షాలో పట్టం. పైగా

నా కెందుకో మాణిక్యం పక్కన రిక్షాలో కూచున్నప్పటి కంటె సైకిలు మీద వొంటరిగా కూచుంటూనే హాయిగా వున్నట్టుంటుంది. కాని ఎందుకో ఆ మాట అనడానికి జంకి వూరుకున్నాను.

* * *

ఒక నెల అయివుంటుంది. మా పొరుగు వాళ్ళతో మేం పరిచయం చేసుకోలేదు. మొదట్లో అశ్రద్ధ చేయటం: కొనకి 'మేం ఈ ఇంట్లో నెల్లాళ్ళ కిందట దిగాం' అని చెప్పడం అంత బాగా అనిపించక పోవడం. మొత్తంమీద అలా అలా మా స్నేహం వాయిదా వడిపోయింది. చివరికి నెలదాటేసరికి వాళ్ళతో స్నేహం చేసుకుందామన్న మా కోరిక అలా అడుగంటిపోయి ఇంకిపోయింది. కారణం ఇదీ అని నే నెక్కడ చెప్పగలను? అదేదో బాధ. ఏ వూరు వెళ్ళినా ఇరుగు పొరుగమ్మల్ని 'అక్కయ్యగారూ' అని పిల్చే మాణిక్యం ఇక్కడ అక్కయ్యగారూ అని పిలిపించుకోవలసి వస్తుందన్న భయం వొకటి వుందనుకుంటాను.

ఇహ, వాళ్ళు గడుపుతున్న కాలం. దాని పేరు చిన్నతనం కాబోలు - అందులో వాళ్ళు అనుభవిస్తున్న కులాసా. దాన్ని మేం వొకరి కొకరు ఎలా తెలియజేసుకొంటాం? వాళ్ళు చాలా అనుచితంగా. అశ్లీలంగా ప్రవర్తిస్తున్నారనీ, పశుప్రవృత్తి తప్ప మానవౌచితి వాళ్ళలో లేదనీ, ఎంతసేపు మాటల్లో, చేతల్లో 'అదే' గొడవ అనీ -- తీసుకున్నట్లు నటించి. వాళ్ళని అసహ్యించుకుంటున్నట్టూ నటిస్తున్నాం. లోపలమాత్రం వాళ్ళు మాకు అందనిదేదో అనుభవిస్తున్నారని అసూయపడుతున్నాం. ఇది మా ఇద్దరికీ వేరే తెలిసినా, ఒకరికొకరు చెప్పుకోలేకపోయినా, ఒకరికి తెలుసునని ఇంకొకరికి తెలియనట్టు నటించి, ఒకరికొకరు ఎప్పుడూ చెప్పుకోలేదు. ఇహమీదట చెప్పుకోం కూడాను,

ఎందుకంటే మొన్న ఆదివారం—

పొద్దున్న పదకొండు గంటలకి నేను స్నానం భోజనంచేసి యథాలాపంగా వీధి గుమ్మంలోకి (అదే, గోడకివేసిన ద్వారం దాటి మెట్టుమీదికి) వచ్చేసరికి పొరుగు ఔట్‌హౌస్ ద్వారంకూడా తెరిచి వుండడమూ, అక్కడ వొకాయన నిలబడ్డమూ జరిగింది. ఆయనకు యాభై ఏళ్ళు వుండొచ్చు. పల్చటి గ్లాస్కో మల్లు పంచె కట్టుకున్నాడు; ఢక్కా మజ్లిన్ కళ్ళీలాల్చీ తొడుక్కున్నాడు. లాల్చీ కాలర్లోంచి బంగారు గుండీలు, చెయినూ కనిపిస్తున్నాయి. అప్పుడే

తాంబూలం సేవించాడు గాబోలు. నోరు ఎర్రగా వుంది. ఇంకా తమలపాకుల ఆఖరిపట్టు నమల్తూ ఓ చేత్తో పళ్ళుగొలుక్కుంటూ నించున్నాడతను. (లోప ల్నించి రేడియో మోగుతూనే వుంది.)

రెండు నిమిషాలు ఇద్దరం వొకర్నొకరం చూసుకున్నాం. ఎవరం మాట్లా డలేదు. ఆఖరికి ఆయనే అడిగాడు.

'ఈ ఔట్ హౌస్‌లో అద్దెకి దిగారా?'

'అవునండీ'

'ఏదైనా వుద్యోగమా?'

'కమ్మర్షియల్ టాక్స్ ఆఫీసులో యూ డీ సీ నండీ!

'బాగానే వుంటుంది. వేరే బాత్రూంకూడా కట్టించినట్టున్నాడు. ఎంతద్దె యిస్తున్నారు?'

'ముప్పై'

'వెధవ? ఇదివరకు ఇరవైకే యిచ్చాడు. ఆ బాత్రూంకోసం పదిరూపా యలా! అద్దెకుండేవాడు ఇంటి కామందైతే ఇలాగే వుంటుంది. ఇంకో డెబ్భై పడేస్తే బంగళా అద్దె అంతా కిట్టుబాటై పోతుంది.'

'ఏదో లెండి, ఊళ్ళో మంచి ఇల్లుదొరికితే మారిపోతాం. ఈ పేట అన్నిటికీ దూరం.... మీ రెవరో తెలుసుకోవచ్చా?'

'ఓ ! .... ఈ బంగళా నాది! మీరుండేదీ, యిదీ వోసారే కట్టించాం. ఒకటే ప్లాను కూడానూ, ఔట్ హౌస్ దగ్గర్నుంచి'

'మీ రెందులో అయినా పనండీ?'

'నాకా? నాకెందుకూ పనీ?'

ప్రశ్న అడిగినందుకు నొచ్చుకున్నాను. డబ్బున్నవాణ్ని వుద్యోగం చేస్తు న్నావా. ఊడిగం చేస్తున్నావా అని అడిగితే అవమాన పడతాడు మరి.

'ఆ ...( అడిగాను. ఏదన్నా ప్రాక్టీసు అదీవుందేమో అని....' అంటూ సర్దుకున్నాను.

'లేదండీ, ఇక్కడికి ఆరుమైళ్ళదూరంలో మా లేండ్సు వున్నాయి. దాని మీద ఊ బంగళా అద్దె వొస్తుంది, ఏదో....'

అదేం ఖర్మమో! ఉన్నవాడు ఉందనీ ఒప్పుకోడు. లేనివాడు లేదనీ ఒప్పుకోడు. ఏదో .... అంటారు; 'ఏదో !' ట!

అసలు ప్రశ్నే వుండిపోయింది; ఈ బోట్ హౌస్‌లోని జంట ఈయన కొడుకూ, కోడలూ అయివుంటారేమో.

'ఈ బోట్ హౌస్‌లో మీ పిల్లలెవరయినా ఉంటున్నారండీ!' అన్నాను.

'మా పిల్లలెవరూ ఇక్కడ లేరండీ! మా పెద్దబ్బాయి హైద్రాబాదులో - గవర్నమెంటులో డిప్యూటీ సెక్రటరీగా వున్నాడు. రెండోవాడు ఈ ఊళ్లోనే వాడున్నాడు. వేరే వుంటున్నాడులెండి. మా అమ్మాయీ అల్లుడూ భిలాయ్‌లో ఉంటున్నారు, ఎలక్ట్రికల్ ఇంజనీర్ అతను.' అన్నాడాయన.

'అయితే ఈ బోట్ హౌస్ అద్దెకిచ్చారా!'

'లేదండీ, ఇందులో నేనూ. నా వైఫ్ ఉంటున్నాంగా!'

ఆ తర్వాత జరిగిన సంభాషణ నాకు జ్ఞాపకం లేదు. ఏదో అవమానం జరిగినట్టూ, దెబ్బ తగిలినట్టూ బాధపడ్డాననుకుంటాను. ఏదో చెప్పి ఇంట్లో దూరాను.

* * *

ఇంక మేం మా పొరుగు బోట్ హౌస్ వాళ్ళతో పరిచయం చేసుకోం. వాళ్ళని చూస్తే మా కిప్పుడు చాలా అసహ్యం.

మా కంటె ఇరవయ్యేసి ఏళ్ళు పెద్దవాళ్ళయి వుండి కూడా - మా అంతేసి కొడుకుల్నీ, కోడళ్ళనీ దేశాల మీదికి వదిలేసి—మా కంటె ఇరవై రెట్లు కులాసాగా, సరదాగా ఆనందం అనుభవిస్తున్నారనీ తెలిస్తే మాత్రం! మేం ఆ దంపతుల్ని క్షమించగలమా? ఏనాటికైనా వాళ్ళలా వుండగలమా! ?

ఛీ ? అది ఎంత తప్పు! ఎంత అసహ్యం! ! ఎవరైనా చూస్తే ఏమను కుంటారు? అలా ప్రవర్తించిన నాడు మనిషికీ, పశువుకీ ఇహ తేడా ఏముంది? ఇంతకీ కాలమహిమ!

ఇంకా ప్రపంచంలో ధర్మమూ, న్యాయమూ, నీతీ ఇలా ఒక్క కాలి మీదైనా నిలబడి వున్నాయంటే, దానిక్కారణం ఎక్కడో కోటికొకరు నాలాంటి వాళ్ళూ, మాణిక్యం లాంటివాళ్ళూ వున్నారు గనుక!

మా కెందుకూ! అలాంటి అసహ్యపు సరదాలూ మాకొద్దు; అలాంటి వాళ్ళతో స్నేహమూ వొద్దు. సిగ్గు ! సిగ్గు ! !

* * *

('త్రిపుర' గారు మెచ్చిన కథ ఇది)

(యువ; మాసపత్రిక - నవంబర్ 1978
చక్రపాణి అవార్డు, రెండో బహుమతి)

# మనోధర్మం

"ఒక్కసారి—." అక్కడికి మాట విరిచేడు రామం.

సరస్వతి మాట్లాడలేదు.

"భోజనానికి రమ్మంటున్నాడు" మళ్ళీ మాట విరిచేడు.

మళ్ళీ సరస్వతి మౌనమే.

"అన్ని విధాలా పెద్దవాడు.... వెళితే యేం అనిపిస్తున్నాది, నాకు!" మాట పూర్తిచేసేనని తెలికపడికూడా, సరస్వతి రియాక్షన్ తెలిస్తే సమాధానమే కనక. అందుకోసం ఆగాడు రామం.

కనీసం సరస్వతి మొహం కనబడినా బావుణ్ను.... అనుకున్నాడు.

అతని రొమ్ముమీద వొత్తుగా పెరిగిన చోట దాక్కొనుంది ఆమె మొహం, ఆ క్షణంలో, అసలేం కనబడదు; అతనిక్కాని, ఆమెక్కాని.

ఐతే సమాధానం దొరికినట్టే అనిపించింది రామానికి—అతని వీపుచుట్టూ వున్న ఆమె చేతులు గట్టిగా బిగుసుకున్నాయి—అంటే—?

—మళ్ళీ మొదటికొచ్చింది కథ.

* * *

"ఎలా వుంది ఉద్యోగం?" అని పదహారు రోజుల క్రిందట వో సాయంకాలం తన రూమ్‌లో కెళిపోతూ రామాన్ని పలకరించేడు మేనేజింగ్ డైరెక్టర్ వాసవ.

"ఏదో సార్, తమ దయవల్ల." అంటూ వెనకాలే వెళ్ళి ఆయన గదిలో ప్రవేశించాడు రామం.

"నాన్సెన్స్, నా దయేమిటి? అలా ఎప్పుడూ అనొద్దు. నీకేం? తెలివైన వాడివి; సమర్థుడివి!" అన్నాడు వాసవ. "కూర్చో!"

కూర్చో కూడదేమో-

"సరేకాని? క్లాస్‌వన్ ఆఫీసర్ పోస్టొకటి శాంక్షనైంది, చూసేవా?"

"నేను అప్లయ్ చేశాన్సార్"

"ఐసీ....నేనింకా చూశ్చేదు. లాస్ట్ డేటు యింకా వుందనుకుంటాను, కదు?....కూర్చోవేం?"

"ఫరవాలేద్సార్."

"నోనో, వాటీజిట్!" అని వాసవ లేచి, రామం కూర్చునేటట్లుగా వొక అంగికం చేశాడు. దాంతో రామానికి కూర్చోక తప్పింది కాదు.

ఓ నిముషంపాటు వాసవ మాట్లాడకుండా ఏవో కాగితాలు చూస్తూ కూచున్నాడు, అతని చేతినున్న ఖరీదైన చిత్రమైన గడియారం వేపు చూస్తూ రామం కూడా మాట్లాడకండా వూరుకున్నాడు. తనూ గడియారంవేపు చూసి వాసవ "ఓ! ఏడుగంటలు కావస్తోందే, టయిమ్!" అన్నాడు.

రామం కుర్చీలో యిబ్బందిగా కదిలి, "నే వెళ్తాను సర్. తమకేదైనా పనుందేమో" అన్నాడు.

"నాటెటాల్!" అని, కుడిచేత్తో అతన్ని లేవ వద్దని సంజ్ఞకూడా చేసి, ఆ చేతిని తన కణత మీద పెట్టుకున్నాడు వాసవ. పది సెకం డ్లలాగే వుంచి, కూర్చునే వెనక్కి తిరిగి అందుబాట్లో వున్న అద్దాల బీరువా తలుపు జరిపి, ఒక్క క్షణం దృష్టి సారించి చూసి అందులోంచి రెండు పుస్తకాలు లాగాడు. వాటిని చిన్న చప్పుడుతో రామం యెదటికి విసిరి "ఇవి చూడు; నీకు పనికొస్తాయి" అన్నాడు.

కంపెనీల చట్టానికి సంబంధించి జాతీయస్థాయిలో ముఖ్యమైన కొన్ని కేసుల వివరాలు, వాటి మీద తీర్పుల సారాంశాలు– వొక పుస్తకం. బిజినెస్ మేనేజ్‌మెంట్ మీద, ప్రపంచం మొత్తం మీద మేధావులనిపించుకున్న వాళ్ళు రాసిన వ్యాసాల సంకలనం రెండో పుస్తకం.

'థాంక్యూ, సర్!' అన్న రామం మాటని వాసవ మాట మింగేసింది.

"సో....హవార్యూ?"

"ఫైన్, సర్."

"అండ్ యువర్ మిసెస్?"

"ఒ. కె. సర్."

"పిల్లల్లేరుగా?"

"లేరు సర్"

"నీకు తెలుసా...." అని, కొంచెం ఆలోచించి, "సరస్వతి మా వూరమ్మాయే.... నాకా అమ్మాయి ఇంతప్పట్నించి తెలుసు!"

"అలాగా సార్? నా కెప్పుడూ చెప్పలేదే, తను!"

"వాళ్ళ ఫాదర్ మా యింటి కెదురుగా వుండేవారు. ఈ కంపెనీలో నేను డైరెక్టుగా బిజినెస్ మేనేజరుగా సెలక్టయ్యాను; నీకు తెలుసో లేదో! అప్పుడా వుద్యోగపు మొదటి నెల జీతంలో, నేను మా వూరెళ్ళినప్పుడు- మా వీధిలో వున్న ప్రతి ఒక్కరికి ఏదో ఒక ప్రజెంటేషన్ చొప్పున పట్టుకెళ్ళాను. మీ మిసెస్- అదే సరస్వతి, అప్పటికి తొమ్మిదేళ్ళ పిల్ల."

"ఆయ-"

"నేనామెకి ఏం కొనిచ్చుంటానో వూహించగలవా!" తియ్యగా నవ్వాడు వాసవ.

—ఒక చాక్లెట్ మొదలు. ఒక రేడియోగ్రామ్ వరకు, ఏం కొని ఇచ్చినా ఇచ్చుండొచ్చు. కాని. పదిహేనేళ్ళనాటి వాత్సల్యం ఇప్పుడతని మొహంలో కన బడింది రామానికి.

"—పోనీ, సరస్వతి బాగా పాడుతుందని తెలుసుగా, నీకు?"

"తెలుస్సార్! అందుకేగా నేనామెని మేరేజీ చేసుకున్నది!" అని తేలిగ్గా, హాయిగా నవ్వాడు రామం.

"ఐ నో-! అప్పుడు నేనామెకి ఒక తంబురా కొనిచ్చేను! పూర్ గర్ల్! మంచి కంఠంతో. అద్భుతంగా-బాలవేత్తలా. కాకపోతే బ్రహ్మవేత్తలా పాడే సేది! కాని శ్రుతి చేసుకోడానికి తంబురాకూడా కొనిపెట్టలేకపోయారు, వాళ్ళ ఫాదరు!....ఆయన పేదరికం వల్ల ఆ అమ్మాయి ప్రతిభ అణగారిపోకూడదని మనసారా అనుకుని, ఎనభై రూపాయలు పెట్టి కొన్నానా తంబురా!"

"అందుకు మిమ్మల్ని నేనుకూడా, ఇప్పుడు తెలిసింది కనక యిప్పుడైనా సరే, థాంక్ చెయ్యాలి సర్" అని పరమానందంతో చెప్పాడు రామం.

"నా పెటాల్!"

"తరవాతండి, అప్పట్నుంచి యిప్పటికీ, ప్రస్తుతంకూడా సరస్వతి సాధన చేసేది ఆ తంబురా శ్రుతితోనేనండి! నాకిప్పుడు తడ్తోంది?"

"వండర్ఫుల్!" అని సంతోషపడ్డాడు వాసవ, "కచేరీలు చేస్తోందిగా!"

"ఔనుసార్, మొన్న హైదరాబాదు స్టేట్ గవర్నమెంటు ఎరేంజ్ చేసిన సంగీత సమ్మేళనంలో తను కూడా పాడింది."

"అందులో ప్రత్యేకత యేం లేదంటాన్నేను. అందువల్ల గవర్నమెంటుకి

ఖ్యాతీ ఆడియన్సుకి తృప్తీ వొచ్చుండొచ్చుగాని ఆమెకి పెద్దగా వొంగిందేం లేదనే నా ఉద్దేశం. అఫ్‌కోర్స్, నాకు సంగీతంలో వోనమాలు రావు. కాని నా ఉద్దేశం మాత్రం అదే!"

"మీ కాంప్లిమెంటుకు థాంక్స్ సర్"

"పీస్ డేస్ ఐ డోన్ట్ సీహర్- ఇప్పుడు సుమారు ఇరవై అయిదేళ్ళుం డాలి- అవునా?"

"ఎస్సార్. మొన్ననే ఇరవయ్యయిదు వెళ్ళేయి సర్."

"యువార్ సో లక్కీ- టు హావ్ హర్."

"నాకు మాట తోచనంత సంతోషంగా వుంది సార్, ఇవాళ."

"మూడేళ్ళయిందా. మీ పెళ్ళయి?"

"అవున్సార్."

"నువ్వు చాలా మంచిపని చేశావు. ఆమెని మారేజ్ చేసుకోడం. ఎందు కంటావా, అఫ్‌కోర్సు, నేను చెప్పకూడదనుకో-సరస్వతికి అంత అందం, అంత టాలెంటు వుండీకూడా. ఆ అందమే, ఆ టాలెంటే ఆమెకి శత్రువులై అదంతా అడివికాచిన వెన్నెల అయిపోతుందేమో అనిపించేయి. కొంతకాలం! దానికి తోడు కొన్ని అపవాదులు!..."

"అపవాదులేమీ లేవు సార్" అన్నాడు రామం, వొక అర్థం దిగమింగి.

"నువ్వలా అనుకోడం గొప్ప విషయం!... నేను కూడా నమ్మను. కాని, తొమ్మిది నెలలపాటు వొకసారి, ఏడాది పాటు రెండోసారి తను వూళ్ళో కని పించకుండా వెళ్ళిపోయినపుడు-ఏమీ సంబంధం లేకపోయినా-ఊరు ఊరంతా కూడా-ఆ సూర్యారావుతో లేచిపోయిందనీ. రామకృష్ణగారితో బెజవాడలో కాపురం పెట్టేసిందనీ పుకార్లు పుట్టించేసేరు. అఫ్‌కోర్స్-అదంతా నాన్సెన్సే. కాని ఎవరాలోచిస్తారలాగ? నువ్వు కాబట్టి-" అని కొంచెం ఆగాడు వాసవ. "ఐ డోంట్ మీన్ టు డిస్కస్ హర్ పాస్ట్...ఎక్కడున్నా తను సుఖంగా వుండడమే నాకిష్టం!" అని రామం కళ్ళలోకి చూశాడు.

"తమ రామెని గురించి ఎంతో దయగా భోగట్టా చేసేరని చెప్తాను సర్, చాలా సంతోషిస్తుంది!"

"ష్యూర్, ష్యూర్! నేనామెని అడ్మైర్ చెయ్యలేకపోయినా అభిమానించ గలను కదా!"

"అటువంటి భావం తమరికుండడం ఆమె అదృష్టం సర్"

"నాన్సెన్స్!... మీ రిద్దరూ కలిసి వోసారి మా యింటికి రాకూడదూ? అఫ్‌కోర్స్-రేపాదివారం మళ్ళీ ఆదివారం నాకు ఖాళీ లేదుగాని-ఆ తరువాతి ఆదివారమయితే నాకు సంతోషం, సదుపాయం కూడాను. ఈవినింగ్ టైమ్ రండి. అక్కడే భోంచేసి, మర్నాడు మాణింగే వెళ్ళిపోవచ్చు."

"అలాగే సార్" అని లేచాడు రామం.

"అలాగే అని నువ్వు మాటిచ్చేడం కాదు. ఆమెకేం యిబ్బందుంటుందో!... యు ఫిక్సప్ విత్ హర్ అండ్ రింగ్ మి అప్"

* * *

అలిసిపోయి నిద్రపోతోంది సరస్వతి. ఎన్నిసార్లు ఎంత నిదానంగా చూసినా ఇంకా ఏదో కొత్త అందం, వింత గ్లేమరు కనబడతాయి, ఆమెలో రామానికి. ఎక్కడా యెవరితోనూ పెళ్ళంటూ కాకండా, అక్షరాలా వైవాహిక జీవితం గడపవలసి రావడంవల్ల చింతతో కొంత వాడిపోయి వుండవలసింది. కాని సంగీత సాధన యిచ్చిన ఆరోగ్య లావణ్యాలు, ఆ జ్ఞానం యిచ్చిన బలం ఆమె మైమెరుపుకి కారణాలై వుండొచ్చు.

మళ్ళీ ఆమెని దగ్గిరికి తీసుకున్నాడు రామం. పరవశపు పరాకాష్ఠను సూచించే సుప్తదరహాసంతో సరస్వతి అతని వీపుమీద చెయ్యివేసి దగ్గరగా జరిగి, పెదవులు కలిపింది, నిద్రపోతూనే. అది నిద్రకాదేమో, ఆ ముద్దు మెలకువలోదేనేమో అని ఆశపడ్డాడు రామం.

"సరూ!"

సరస్వతి కళ్ళు తెరవలేదు! పిలుపు విన్న చిహ్నమే లేదు

అలవాటయిన వాసనను ఆమోదించడానికి, ఆ భావాన్ని అభావసిద్ధంగా చెప్పడానికి. జాగ్రత్‌స్వప్న సుషుప్త్యావస్థల భేదాన్ని పాటించదు కాబోలు, మానవ శరీరం-అనుకున్నాడు రామం.

నిద్రే. మరి మాట్లాడ దీ రాత్రికి. లేపి మాట్లాడించడం అంత మంచిది కాదు.

* * *

నాలుగేళ్ళ కిందట రామకృష్ణగారి సంగీత కచేరీలో చూశాడు రామం సరస్వతిని మొట్టమొదటిసారి.

కంపెనీ వార్షికోత్సవానికి ఆమె కచేరీ యేర్పాటు చేయాలని విజయవాడ వెళితే, "గుంటూర్లో ప్రోగ్రాములో వుంది. అక్కడికెళ్ళి మాట్లాడ్డం మంచి" దన్నారు: గుంటూర్లో కచేరీ వినబడింది. కనబడింది; కాని, మాట్లాడడానికే వీలుపడలేదు. మర్నాటి ఉదయమే వాళ్ళు నాగార్జునసాగర్ వెళ్ళేరని తెలిసి, తరువాతి బస్సెక్కి సాగర్ వెళ్ళాడు రామం.

అక్కడ కచేరిలేదు. అది రామకృష్ణగారితో విహారయాత్ర.

గెస్టుహౌస్ వరండాలో అడ్డేశాడు రామకృష్ణగారు. "కచేరీ విషయం ఆవిడ్తో కాదు, నాతోనే మాట్లాడాలి, ప్రస్తుతం ఆమె నా భార్య" అంటూనూ.... లలితసంగీత కచేరీకి ఆమె వొక్కతెనూ పంపడానికిగాని, యుగళగీత మంజరి నిర్వహించడానికి తను కూడా రావడానికిగాని, రామం యిచ్చిన తేదీ ఎంత మాత్రం నప్పలేదన్నాడు.

ఆ తరువాత యేడాదికి తన భార్య లక్ష్మికీ తనకీ సరిపడక పోవడం. విశాఖపట్నంలో ఆమె చేస్తున్న వుద్యోగం వదిలి తనతో రాజమండ్రి రావడానికి ఆమె నిరాకరించడం జరిగాయి.

మామగారు జబ్బు మనిషి. వీళ్ళతోనే వుండేవాడు, బావమరిది ఊళ్ళోనే వున్నా, అతనెప్పుడు ఆ యింటికొచ్చినా తండ్రిని తనతో తీసుకుపోవడానికి ఉద్దేశం ప్రయత్నం పెట్టుకునే వొచ్చేవాడు. ఆయన పెన్షన్ ఆరువందలు, మరి!... ఆయన రిటైరవగానే కొన్న యింటిఖరీదుకి ఆయన ప్రావిడెంటుఫండూ అవీ సరిపోనప్పుడు, రామం, తన పిత్రార్జితం పూర్వార్జితం అంతా పడవేసి పైమాట ఆ యింటికే పెట్టాడు.

"మీకు వొకందుకు నేనూ, మరొకందుకు మా నాన్నగారూ కావాలి. మీ భార్యని కాబట్టి నాకు మీతో రాకతప్పదని, నా మీది ఆపేక్షచేత మా నాన్నగారూ మీతో వచ్చి తీరతారని మీ అభిప్రాయం. ఆయన పెన్షన్ డబ్బులకి ఆశపడ్డంలో మీరూ మా అన్నయ్యా ఒకరికొకరు తీసిపోవడంలేదు. ఆయన మాత్రం ఇంత పెద్ద ఆస్పత్రివున్న ఈ వూరువదిలి, అల్లుడుగారికి వుద్యోగంకదా అని రాజమండ్రి వొచ్చెయ్యలేరు!" అంది లక్ష్మి.

"నాకోసం నువ్వు మీనాన్నని వదల్లేవు. ఒకవేళ వదలగలిగినా నీ వుద్యోగం మాత్రం వదల్లేవు. ఆ సంగతి నాకు తెలుసు. కాని నాకన్నా ఓ వంద రూపాయలు ఎక్కువ జీతం తెస్తున్న పెళ్ళానివి కదా అని నీకోసం అర్రుస్సు కాద

నడం నా పద్ధతికాదు. మీఅన్నయ్య దఖలుపరుచుకున్న మీ అమ్మగారి బంగారం, ఆవిడ చేత మీ అన్నయ్య తనపేర రాయించుకున్న యింటిలో సంగోరు వాటా, మీ నాన్నగారు నా డబ్బు పోసి కొన్న యిల్లు, ఆయనగారు రేపో నేడో కమ్యూట్ చేయించుకుందామనుకుంటున్న పెన్షన్ మొత్తం, వీటిమీద ఆశకూడా నిన్నిక్కణ్నుంచి కదలనివ్వదు కనక, నువ్విక్కడే వుండు!"

ఆ తరవాత ఎప్పుడు విశాఖపట్నం వెళ్ళినా, లక్ష్మిని కలుసుకోడం-అడ్వకేట్ల ఆఫీసుల్లోనే, మధ్యవర్తుల మందువాల్లోనే!

రాజమండ్రి చేరాక కంపెనీ వార్షికోత్సవాల సందర్భంగా సోలో కచేరీ కొచ్చిన సరస్వతికి వసతి, ఆతిథ్య సౌకర్యాలు చూడవలసిన పనిలో, ఒకే రోజున పదిహేను గంటలపాటు ఆమెతో వుండగలగడంతో, అతనికామెమీద వున్న అభిమానం అడ్మిరేషన్ ఆమె మనసు కెక్కే విధంగా చెప్పగలిగాడు రామం.

ఆ తరవాత పదిరోజులకి కాకినాడలో ప్రోగ్రాం వుందని. అక్కడికి రమ్మంది సరస్వతి.

"రామారావుగారు- మా శ్రీవారు- కె. అండ్. జె. కంపెనీలో ఆఫీస్ సూపరింటెండెంటుగా వున్నారు. సంగీతవిమర్శకులు, మధుర గాయకులున్నూ" అని అక్కడి వాళ్ళకు పరిచయం చేసింది.

"వాళ్ళెవరికో మా వారంటూ పరిచయం చేసేనుకదా అని మీరేం నాకు పుస్తె కట్టనక్కరలేదు. కలిసి వుందామని మనం ఒకరి చేతుల్లో మరొకరు చేతులేసి వో మాట అనుకుందాము. అది వివాహ బంధాన్ని మించిన స్నేహమని నా ఉద్దేశం. నా సంగీతానికి భంగంరాకుండా నాకు తోడుగా వుంటానంటేచాలు. నా శరీరం, మనసు, ఆదాయం ఆనందం అన్నీ మీవే–" అని ఆ రాత్రి గెస్టు హౌసులో బయటపడ్డ సరస్వతి అభిప్రాయమే తామిద్దర్నీ వొకటి చేసింది.

* * *

హఠాత్తుగా లేచి కూర్చుంది సరస్వతి.

రామం మేలుకొని వుండుంటాడని స్ఫురించినట్లు, అతనివేపు చూడకుండానే. చెదిరిన ముంగురులు తొలగిన వస్త్రాలు సరిచేసుకుని మంచం దిగింది. "జాగర్త" అన్న హెచ్చరిక విని రామం వేపు చూసింది. "ఇంకా నిద్ర పోలేదా మేష్టారూ!" అంది నవ్వుతూ అతని మీదికి వొంగి.

రామం "శ్రీ" ఉన్నట్టు తలవూపాడంతే,

విశాలమైన హాల్లాంటి ఆ గదిలో. ఒక మూలగా కట్టించిన ముప్పయి అయిదు చదరపు అడుగుల వేదిక చేరిందామె. తంబురాకీ సరస్వతి పటానికీ నమస్కారం చేసి, కాళ్ళు శుభ్రంగా దులుపుకొని వేదిక యెక్కింది. తంబురా శృతిచేసి "ఇదుగో, మేష్టారూ!" అంది.

రామం కూర్చున్నాడు.

తంబురా నాదం ఒక్క క్షణం ఆపింది సరస్వతి—"నీలాంబరి రాగంలో ఒక కొత్త ప్రయోగం కోసం సాయంకాలం నుంచీ తపన పడుతున్నాను. చిన్న ఆధారం దొరికినట్టుంది. పాడుతాను వినండి" అని, గమపసనిప సనిసమ గమ రిగమ రిగరి సామా; అనే ఆధారంలోంచి సవ్యనాదాన్ని సృజించే ప్రయత్నంలో పడింది.

అది సాధన—

అది తపస్సు—

సమయం మంచిదేగాని తరుణం గొప్పది యిది, కల్ప వృక్షం కిందికి చేరి కప్పు కాఫీ అడిగినట్టుంటుంది, ఇప్పుడు ఎంత పెద్ద లౌకిక విషయం గురించైనా చేసే చర్చ, ప్రార్థన..

ఉచితం కాదు.

"రిసనిప సనిపమ గమపా" చిరునవ్వుతో హస్తవిన్యాసం చేసింది సరస్వతి.

రామం తలవూపాడు.

"రిసనిప సనిపమ గమపా—

గమ పపనిస సనిపమ గమ రిగమ రిగరి సామా"

"ఔను!" అన్నాడు రామం; ఆమెని చూస్తూ ఆమెలోకి చూస్తూ, తల వూపుతూ.

—నీ భార్య గతాన్ని గూర్చి చర్చించడం నా కిష్టం లేదు. అన్నాడు. ఎమ్ డి. వాసవ....బాగానే చెప్పాడు, తన మనసులో కోరిక—ఒక్క పొరపాటు మాటకూడా రానివ్వకుండాను.

"రీసనిప్ప సానిపాప్ప పానిపామ గామపాగ—

—మా వూరమ్మాయే. ఇంతప్పటినుంచి యెరుగుదును. ఆ రోజుల్లో

ఎనభై రూపాయలు పెట్టి తంబురా కొనిచ్చాను!—అని తన అర్హతను ప్రతి ష్ఠించాడు.

"సారిసాన్ని సానిసాప్ప పానిపాప పాపగాప"

"కాలం" మారుతోంది....శభాష్?" అన్నాడు రామం.

సరస్వతి తల నిలువుగా ఆడించింది.

"రీసనిప్ప సానిసాప్ప పానిపాప పాప దాప్ప రిగమ రిగరి పామా"

—అందమే, టాలెంటే ఆమె శత్రువు లౌతాయని, ఆమె సౌందర్యం అడవి కాచిన వెన్నెల అయిపోతుందని భయపడ్డానని అంత సౌందర్యవతిని పొందిన తన అదృష్టాన్ని మెచ్చుకున్నట్టుగా ఆమె అందాన్నే మెచ్చుకున్నాడు.

"గాప పని సనిప నినిపమ పపపుగ పుపుగస- రిగమ రిగరి పామా"

—అపవాదులు బయలుదేరేయని చెబుతూనే అవి ఎంత సమంజసమైనవో వినరిస్తూ ఆమెని తనుకూడా కోరడంలో తప్పులేదని స్ఫురింపచేసేడు. కొత్త వుద్యోగాన్ని సాధించడానికి అత్యవసరమయ్యే అధికారిక గ్రంథాలను అడక్కుండానే యిచ్చి ఈ ప్రయత్నంలో తన సహకారం వుండగలదని సూచించేడు.

"మొన్న రాజారావుగారు రాసిన పాటకి ఈ రాగంలో ఈ మనోధర్మం లోంచి ట్యూను కడదాం మేష్టారూ!"

"అలాగే"

"ఆ సాహిత్యం కొంచెం కాపీ చేసివ్వరూ, ఆయన దస్తూరీ నాకు బోధ పడదు!"

"నేనది కాఫీ చేస్తాను కాని, నువ్వు ఏమనుకోకుండా లేచి నాక్కొంచెం కాఫీ చేసిద్దూ, తల నొస్తుంది!"

"అయ్యో-! చెప్పేరు కారేం?"

సరస్వతి చప్పున వేదిక దిగింది. బైండు పుస్తకం, అందులో ఏర్పాటుగా పెట్టిన కాగితం, కలం, అతని కందించి వంటగదిలోకి వెళ్ళింది.

మంచంమీద కూచ్చునే, తలాపిన రెండుదిండ్లు పేర్చి ఒళ్ళు విరుచుకుని, కలం పక్కనపెట్టి. కాగితం యెగిరిపోకుండా బైండు పుస్తకాన్ని దానిమీద పెట్టి, చేరబడ్డాడు రామం.

వెలిగించిన గాస్టవ్‌మీద పిడికెడు ఆకాశంలా కనిపించే నీలిమంటమీద ఖాళీ గిన్నెపెట్టి, చేతికందిన గ్లాసు పరిశుభ్రంగా లేకపోతే వొక్కసారి తొలిచి,

అరిగ్గాపుడు నీళ్ళు పోసిందండులో సరస్వతి. ఇష్టంలేని పని చెయ్యటానికి తప్పనిసరై వొప్పుకునే మనిషి మనసులా చుంయ్యిమంది గిన్నె.

-అర్థంకాదా,? లేక అర్థంకావడానికి లోపలేమీలేని మూర్ఖుడా? అనుకుంది రామాన్ని తలచి.

ఆనాడు-

టెంపరరీ ఖాళీలో ఇక్కడ సూపరింటెండెంటుగా చేరిన కొన్నాళ్ళకి బిజినెస్ మేనేజరు ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాడు రామం, వాసవ సలహామీద. రామకృష్ణగారితో తెగతెంపులు చేసుకొని కొత్తగావచ్చేసిన రోజులు. కాకతాళీయంగా ఎక్కడో ఎదురై తనని గుర్తుపట్టి పలకరించిన వాసవ, అఫీసు వేళల్లో సరాసరి తన దగ్గరికే వచ్చేసేవాడు. అతనికి బి, ఎమ్. ఉద్యోగం రావాలంటే అది నా చేతుల్లో పని! అంతేకాదు, నీ చేతుల్లో పనికూడాను." అన్నాడు.

"నువ్వంటే నాకెన్నాళ్ళనించి, ఎంత అభిమానమో, ఎంత తమకమో, ఎంత ఆరాధనో-నీకు తెలుసా!"

"మన్ం మనం ఒక వూరివాళ్ళం. ఒకరి ఆశలు నెరవేరడానికి మరొకరు, ఒకరి కోరికలు తీరడానికి రెండోవారు సహకరించుకుంటాం. యిందులో తప్పేముంది?"

"రామానికి లైఫ్‌లో ఇదొక టర్నింగ్ పాయింటు, సరైన నిర్ణయం తీసుకుని అతన్ని నువ్వు ఆదుకోకపోతే ఇదే అతనికి రిటర్నింగ్ పాయింటు అయిపోతుందికూడానూ."

"నన్ను నిరుత్సాహపరిచి ప్రయోజనంలేదు, పైగా నష్టం !....ఈ ఇంటర్వ్యూ నేను జరపను-అని వొక్క ముక్క రాసేస్తే నా బదులు వైజాగ్ నుంచి పర్సనల్ మేనేజరు రంగనాథయ్యరుగారువొచ్చి ఇంటర్వ్యూ జరుపుతాడు. అతనే ఇంటర్వ్యూ చేస్తె ఇతనికి బి.ఎం. ఉద్యోగం ఇవ్వడు సరికదా, ఈ సూపరింటెండెంటు ఉద్యోగానికికూడా ఎసరుపెట్టి వెంటనే సైపిస్టుగా విశాఖపట్నం పంపేసే ఏర్పాటు చేసేస్తాడు. ఇతనక్కడ చేసేది చిన్న ఉద్యోగమే అయినా,ఆ వూళ్ళో యితనికి, ఉద్యోగం చేస్తున్న పెళ్ళాం, నెల కారుపందలు పెన్షన్ తెస్తున్న మామగారు, ఓపెద్ద బంగళాలో సగం వాటా పంచిపెట్టడానికి సిద్ధంగా వున్న బావమరిదీ వున్నారు కనక వెళ్ళిపోతాడంతే! అతనికి ఈ వూళ్ళోనేయింతకంటే పెద్ద వుద్యోగం వొస్తెనే నువ్వీమూరైనా లైఫ్‌లో సెటిలవగలవని నీకుతెలీదా? నా పద్ధతి అంతా లివ్ అండ్ లెట్ లివ్!"

నవ్వేడు, లాలించేడు. బుజ్జగించేడు-బెదిరించేడు. ప్రలోభ పెట్టేడు-చివరికి సాధించేడు!

-అంతా వారం రోజుల్లో అయిపోయింది. విజయనగరంలో గురువు గారికి వొంట్లో బాగులేదని, చూసి రెండు మూడు రోజుల్లో వచ్చేస్తానని తను రైల్లో బయలుదేరింది. వాసవ కార్లో సామర్లకోట జంక్షన్ దగ్గిరకొచ్చి తనని కలుసుకున్నాడు.

....ఒక ఆలాపన సక్రమంగా నడవకపోతే - ఒక గమకం నపకం చెడి తికమక పెడితే, అవేవో తనకే వొచ్చిన చిక్కులుగా భావించి తన అల్లకానికి అందింపును సమకూర్చే రామం-ఇప్పుడు తన "మనోధర్మా" న్నెరిగిన మంచి మిత్రుడు....నిస్సంశయంగా యితనికున్నది నా దేహం మీది ప్రేమ కాదు-అత నికి తన దేహం మీదనే తన సుఖం మీదనే మమకారం వున్నట్టు కనిపించదు! అందుచేతనే కాబోలు-ఆతనికి అసూయలేదు!

సూర్యారావు, రామకృష్ణ తనని అసూయచేతనే దూరం చేసుకున్నారు. తనమీద ఎవరైనా-కాంక్ష చూపడందాకా యెందుకు కన్ను తిప్పితేచాలు; వాడెవడు, వాడు నీవేపు ఎందుకలా చూస్తున్నాడు; అన్న ధోరణిలో తనని వొదులు కోవడానికే ఎప్పుడూ సిద్ధంగా వుండేవారు. తనమీద వాళ్ళ అనుమానాలు, నిఘాలు-తల్చుకుంటేనే రోతగా వుంటుంది!

ఎం. డి. వాసవ బంగళాకి వెడితే నేను నేనుగా తిరిగి రాలేనని తెలిసి రమ్మంటున్నాడో, తెలియక రమ్మంటున్నాడో - తెలిసి రావడంలేదు!.... "భోజనానికి" రమ్మన్నాట్ట; రాత్రంతా వుండి తెల్లారి వెళ్ళమన్నాట్ట! - అపర వాసవుడు!

కాఫీ పట్టుకుని పడక గదిలో కెళ్ళింది సరస్వతి.

రామం నిద్రపోయినట్టు కనబడ్డది. లేపాలా వద్దా అని సందేహిస్తూ నిల బడింది.

కాఫీ చల్లారిపోతోంది.... వేడిగా తాగుతాడు.

చప్పున నిర్ణయించింది. గోడ అలమారులో మాత్రతీసి, తొడుగు వొలిచి సిద్ధం చేసింది, మాత్ర దిగటానికి మంచినీళ్ళూనూ.

"మేష్టారూ!"

"ఊఁ-"

"లెండి; కాఫీ తెచ్చేను!"

"అలమర్లో మాత్ర వుందేమో, చూడు!"

"ఉందని తెచ్చేను."

నిశ్శబ్దంగా కూర్చుంది సరస్వతి. సమస్యని అణువణువూ చీల్చి, నమిలి మింగి జీర్ణం చేసుకుంటున్న పద్ధతిలో– చెమ్చాలో భాగాల చొప్పున, చుక్కల చొప్పున– అరగ్లాసు కాఫీని ఐదునిమిషాలు తాగింది.

"టైమెంతైంది?" రామం కళ్ళు తెరవకుండానే అడిగాడు.

"ఆదివారంలో కొచ్చేసేం–"

పాట కాపీ చెయ్యడానికి తగిలించుకున్న కళ్ళజోడు ఎడంచేత్తో తీసి అందించాడు. తన కళ్ళూ, మొహమూ సరస్వతికేం చెప్పిపోతాయో అన్న భయం వున్న వాళ్ళాగ మొహంమీద తువ్వాల్ని వో నిమిషంపాటు నడిపాడు.

సరస్వతి నవ్వింది. లేచి బట్టల స్టాండుదాకావెళ్ళి, పాంటూ షర్టూ తెచ్చి, మంచం పక్కని నిలబడి "లేవండి" అంది.

చూశాడు.

"వైజాగ్ వెళ్ళండి; ఇంకో గంటలో బస్సుంది."

"........"

"మీ మామగారు పెన్షన్ కమ్యూట్ చేసిన డబ్బు నిన్న తీసుకునుంటారు. అక్కయ్యగారు డబ్బు రేపు బ్యాంకులో వేసీకుండా ఆఖరు ప్రయత్నం చేసి అక్కడో. మరో చోటనో వో అయిదువేలైనా తెచ్చుకోండి."

బట్టలందుకుని. లేవకుండా అలా మళ్ళీ చూశాడు లోతుగా.

సరస్వతి ట్రంకు పెట్టెలు పేర్చిన చోటికి వెళ్ళింది. పైన వున్న బ్రీఫ్ కేసు తెరిచి, మరో జత బట్టలూ, కొన్ని వస్తువులూ అందులో సర్దింది. "మానవుడికి సంపదలూ, భోగాలూ అమృతమూ కూడా యిష్టమే, మిగిలిన ఆనందాలతో బాటు!....డబ్బుంటే యెన్నైనా కొనుక్కోవచ్చుగా!"

"పుచ్చుకుంటా డంటావా?"

"అక్కయ్యగారు మీకిస్తారా, అన్నది కదా, ప్రశ్న యిప్పుడు!"

"అదీ నిజమే."

"లేచి వెళ్ళండి మరి!"

"ఇంతా కష్టపడి తెచ్చేక అతను పుచ్చుకోనంటే?

"పుచ్చుకుంటాడని మీకు తెలుసు, నాకు తెలుసు! వెనక మీ కొలీగ్ నరసింహరాజుకి హైద్రాబాదుకి ట్రాన్స్ఫరు కావాలంటేను, మీ స్టెనో రీటాకి కన్ఫర్మేషను కావాలంటేను మీరే వొసూలుచేసి ఇచ్చేరు కదా!"

"అందరిదగ్గిరా పుచ్చుకుంటూనే వున్నాడనుకో....మన దగ్గిర అతను కోరింది మరోటేమోననీ-డబ్బు పుచ్చుకోడేమోననీ—"

"అతను మీ దగ్గిర డబ్బు పుచ్చుకోకపోతే మీరు ఇలాగే బిజినెస్ మేనేజరుగా కొనసాగుతారు"

"అదే బావుందంటావు?"

"అనే, నేననుకుంటున్నాను!" అంది సరస్వతి.

అప్పటికే అతను బట్టలు తొడిగేసుకుని తల దువ్వుకుంటున్నాడు.

సరస్వతి ట్రంకుపెట్టె తెరిచి అందులోంచి అతని పర్సుతీసి అందిస్తూ "వొక మాట అనుకున్నాం....మొగవారు మీరే తప్పలేదు ఆ మాటకి, నేను మాత్రం యెందుకు తప్పాలి?" అంది; అతని కళ్ళలోకి చూడకండాను.

రామం ఆ మాటకి సంతోషించలేదు. కనీసం అలా అన్లేదు. బ్రీఫ్కేసు తీసుకుని "వస్తా"నన్నైనా చెప్పకుండా వెళ్ళేడు.

"కొన్ని పన్లు-

చెయ్యడం కన్నా-

చెప్పడమే కష్టమన్న మాట!...." అనుకుంది సరస్వతి.

* * *

సోమవారం ఉదయం ఎనిమిది కాకుండానే రామం యిల్లు చేరాడు. తలుపు వోరవాకిలిగా తెరిచివుంచి. సరస్వతి మంచంమీదుంది. మూడురోజుల్నుంచీ నిద్రపోతున్నట్టు మొహం బాగా పొంగుంది.

"సరూ."

"వొచ్చేరా?"

"అరగంటయింది, వూళ్ళో దిగి, సరాసరి ఎమ్. డి. గారి బంగళాకెళ్ళేను. అక్కడ పని అయిదునిమిషాల్లో అయిపోయింది. అయిదువేలు ఇచ్చెయ్యబోయాను. రెండువేలే చాలన్నాడు. పనైపోయినట్టే," అంటూ మంచంమీద కూచుని ఆమెని తన శరీరంతో అభినందించబోయాడు.

"ఆగండి" పేలవంగా నవ్వింది సరస్వతి "పాచిమొహం నేనూనూ!....

స్నానం చేసొస్తాను.... ఫ్లాస్కులో కాఫీ వుంచేను తాగండి.... ఇవాళేగా ఇంటర్వ్యూ?"

"ఏం యింటర్వ్యూ, నా మొహం! అంతా లక్ష్మీకటాక్షమేగా,"

"కాదులెండి. సరస్వతీ కటాక్షం కూడా లేకపోలేదు"

"లేదు. లక్ష్మి సమయానికి డబ్బివ్వకపోతే యిదేదీ అవదు!"

"నే అన్నది అదికాదు. ఇంటర్వ్యూకి పిలిచిన ఆరుగుర్లో మిగతా అందరి కన్నా మీరే ఎక్కువ చదువుకున్న వారుకదా." అని బాత్‌రూంవేపు కదిలింది సరస్వతి.

"అదీ నిజమే అనుకో," అంటూ రామం ఆమె వెంట నడిచాడు.

బాత్‌రూమ్‌లో దూరి తలుపు గడియ వేసింది సరస్వతి అతన్ని అంత వెంటనే భరించలేక.

రెండు నిమిషాలు తలుపు ఒడ్డునే నిలబడితేగాని ఆమెకి బలం రాలేదు, స్నానం చెయ్యడానికి కూడానూ.

* * *

("జ్యోతి" మాసపత్రిక—అక్టోబరు 1963)

# మీ సంబంధం మాకు నచ్చలేదు

రాత్రి తొమ్మిదిన్నరైపోయింది. ఇంటికి చేరేసరికి.

విశాలి తలుపుతీస్తూనే 'బాగా జరిగిందట, సన్మాన సభ?' అంది.

'ఆ- కాని అప్పుడే నీ దాకా యెలా వొచ్చింది?'

'మీరు చెప్పకపోతే తెలియ దనుకున్నారా?'

'ఎవరు చెప్పేరయితే?'

'ఇంటివాళ్ళమ్మాయి, వరం! - పాటలు పాడిన అమ్మాయీ తనూ క్లాసు మేట్సట....'

'సరేలే - ఏవో ఉంటాయ్. బీరకాయ పీచులు'

కాళ్ళూ చేతులూ కడుక్కొని భోజనానికి కూచున్నాను, విశాలి ప్రసంగం మార్చలేదు. కూరా పచ్చడీ నే నడగటానికి వో నిమిషం ముందుగానే ఒడ్డిం చేస్తూ నేనుభోజనం సంగతి మాట్లాడకుండా జాగ్రత్తపడింది.

'అది కాదండీ. ఎన్నాళ్లయింది-అతనీ వూరొచ్చి?'

'అయిదురోజులు దాటింది ఇవాళ్టికి.'

'మకాం కూడా మన వీధిలోనేట? చెప్పేరేకాదు.'

'ఏదో అలా అయిపోయింది—ఇంతకీ నీ అతిథ్యం కవీసం నీ చేత్తో ఓ కప్పు కాఫీ అతనికి ప్రాప్తం లేదేమోలే!'

'అయ్యో పాపం! అలా ఎందుకైపోవాలి?....అడ్డమైన మొహాల్నీ ఇంట్లో పెట్టి మేపినప్పుడీ మాట లెక్కడి కెళతాయండీ?'

'అబ్బ, అలాకాదు విశాలా! అతను. వాళ్ళ స్కూలు తరపున ప్రతినిధిగా వొచ్చేడు. అన్నిజిల్లాల్లోని అన్ని హైస్కూళ్ళ తలో ప్రతినిధినీ పంపేరు. భోజనాలూ, కాఫీలూ అన్నీ స్కూల్లోనే ఏర్పాటు చేసుకున్నారు. కాదని ఇంకో చోటికి వెళ్ళడం సంఘ గౌరవం కాదని, ముందే కట్టుదిట్టం చేసుకున్నారుట. అసలు మకామే స్కూల్లో ఉండవలసింది. ఈ వూళ్ళో కొందరికి అతను నా ఫ్రెండని తెలిసి కథలూ పాటలూ వాట్లగురించి ఏదో నాలుగు ముక్కలేనా

మాట్లాడుకోటాని దర్శ్కుడ పిలుండదని, ఈ వీధిలోనే ఆ ఖాళీ ఇంట్లో అతనొక్క-డికీ మకాం ఏర్పాటు చేసేరు. అంతకన్నా మరేం లేదు.'

'సభలో మిమ్మల్ని కూడా పొగిడేరుట!'

'పొగడ్డానికి నాలో ఏముంది?—ఇంత గొప్ప రచయితకి బాల్యమిత్రుడై నందుకు ఫలానావారి అదృష్టానికి మా అభినందనలు—అని ఏదో అన్నారు; సభల్లో అలా అనడం మామూలేగా!'

"మీకు బాల్యమిత్రుడన్నారూ?"

"అంతేగా మరి ఇప్పుడు నాకు ముప్ఫయి మూడు వెళ్లేయి. పదహార్రో ఏట, అతనికి నాకూ మొట్టమొదట స్నేహం కలిసింది. ఆ వయస్సు వేపు ఇప్పుడు చూస్తే బాల్యం లాగే కనిపిస్తోంది...."

"మరి మనింటి కొక్కసారి—పోనీ భోజనానిక్కాకపోతే ఊరికేనైనా తీసుకు రాలేదేం?"

"చెప్పేనుగా, ఏదో అలా అయిపోయిందని!"

"ఇంకా వుందా. వాళ్ళ మీటింగు?"

"ఇవ్వాళ్టితో సరి.

"అయితే రేపు అతన్ని మనింటికి భోజనానికి పిలవండి"

"అబ్బో-ఏం చెప్మా!"

నేను కంచంలో చెయ్యి వదిలేసి, విశాలివేపు ఎగతాళిగా చూస్తూ నవ్వేను.

"నా యిష్టం."

"అదిగాదు. అంత ఇంట్రెస్టు ఏమిటా నా ఫ్రెండుమీదలని!"

"ఇంట్రెస్టు ఉండదా?- అన్ని పుస్తకాలు రాసిన మనిషి స్వయంగా మనింటి పక్కనే కేంప్ ఒచ్చి వున్నాడంటే, అందులోనూ మీకు బాల్యమిత్రు డంటే, ఓ మారు దగ్గిరగా చూడాలనీ—అతను మాట్లాడితే వినాలని. కుతూహ లంగా వుండదా?—మీ యింట్లో అన్నం ముట్టనని అతనేం శపథం చేసేడా?,

"అయ్యబాబోయ్-కోంపడకు. రేపతన్ని తీసుకొస్తాగా!"

o o o

వంటయిపోయింది - భోజనానికి లెమ్మని చెప్పడానికి నేవెళ్ళేసరికి మురళి ఎవరితోనో ఏదో పిట్టకథ చెబుతున్నాడు. ముగ్గురు శ్రోతలమధ్య అతనికంఠం ఉల్లాసంగా, ప్రముఖంగా వినబడుతోంది.

'ఏమి శేమిటి. నేను లేకుండా ఎదో చెప్పేస్తున్నావే' అన్నాను మళ్ళీ మొదలు పెట్టమని అడగడానికి ఇష్టంలేక!

'ఆ ఏముందీ. మీ రింకా పెళ్ళి చేసుకోలేదేమని అడుగుతున్నా రీయన. దానికి నా ఎడ్వంచర్ ఒకటి చెబుతున్నాను....'

'ఎడ్వెంచరా!'

'ఆఁ ఎడ్వంచరే. పెళ్ళికూతుర్ని చూడ్డానికి వెళ్ళడం అనేది కుర్రాళ్ళకి అంతేగా.'

'కాకేం, ఇప్పుడు మరీనూ. ఆడపిల్లలుకూడా ప్రశ్న లడిగేస్తున్నారట: మీకు చదరంగంవచ్చా. సైకిలు తొక్కడం వచ్చా-ఆఫీసర్ ఎదుటబడి ప్రొమోషన్ అడగ్గలరా- అంటూనూ అంతెందుకు- మొన్నీ మధ్య ఈ ఊళ్ళోనే, వాళ్ళిల్లు మంచి బజార్లో అన్నమాట:- పెళ్ళి కొడుకు ఏదో కొంత నాసిరకంగా కనిపిస్తేనూ, ఈ ట్రాఫిక్‌లో రోడ్డు దాటటానికి మీ కెంతసేపు పడుతుందని అడిగిందిట ఓ అమ్మాయి....!' అన్నాను.

అందరూ నవ్వారు,

'నాకు జరిగింది అలాటిదికాదులే, అయితే చాలా రోజులైందనుకో: అప్పటికింకా మొగపిల్లల్ని ప్రశ్నలడగడందాకా రాలేదు. నేనూ మా చిన్నక్కయ్యాకలిసి వెళ్ళాం పిల్లనిచూడ్డానికి. వాళ్ళసలు మా బంధువులే. అయితే చాలా పీనాసివాళ్ళు. వాళ్ళ ఫేమిలీ హిస్టరీకూడా అంత మంచిదిగాదు. ఆ పిల్ల అక్కగారొకావిడ భర్తతో పోట్లాడి పుట్టింటికి మకాం వచ్చేసింది. ఇంకొకావిడ ఎక్కడో ఉద్యోగం చేసుకుంటున్న భర్తగార్ని ఆ వూరికి ట్రాన్స్‌ఫర్ చేయించింది. అందు కేదో కారణం వుంది. ఆవిడ కేరక్టర్ మంచిది గాదని చెప్పుకునేవారు. అదంతా ఇప్పుడు మన కెందుకులెండి——

'చెప్పే దేమిటంటే- మాకు మీ పిల్ల అక్కర్లేదు మొర్రో అంటున్నా కూడా లక్ష్య పెట్టలేదువాళ్ళు. ఓసారి పిల్లని చూడకూడదా అని కబురూ.... వాళ్ళ పిల్లని చూసీచూడగానే మొహం తిరిగిపోయి బాబోయి: నాకు కట్నం వొద్దు కానుకలూ ఒద్దు, ముందీ అప్సరస నిచ్చి పెళ్ళంటూ చెయ్యండి చాలు, అంటామని వాళ్ళ ఉద్దేశం!'

అని అందరి మొహాలవేపూ చూసేడు మురళి, అందరూ చిరు నవ్వులు విసిరి అతన్ని ప్రోత్సహించేరు.

'ఏదో మరి: కాకిపిల్ల కాకిక్కుముద్దూ'

'ఎవళ్ళ ఆశలు వాళ్ళవీ'

'సరే వెళ్ళాం. మేం వెళ్ళే సరికి సాయంత్రం నాలుగైంది. పొద్దుట ఏ తొమ్మిదింటికో చేసేసిప్లాస్కులో పోసేసిన బాపతు కాఫీ చెరో కప్పు ఇచ్చేరు. మేం వస్తాంమని రాసిన ఉత్తరం అందిన నాడు చేసిన పకోడీలూ, అవి తింటేనేగాని పిల్లని చూపించం అన్నట్టు ఓ పట్టాన పిల్లని ఇవతలికే తీసుకురాలేదు.'

'పాపం ఏదో శక్తికొద్దీ మస్తాబు చేస్తున్నారేమో' అన్నాడొక శ్రోత.

'అదికాదోయ్. ఈ పకోడీలూ-కాఫీ ఆరగించినమీదట-చావు రాలేదన్న ఆశ్చర్యంలో ఎలాంటి ఆకారం కళ్ళబడ్డా ప్రాణానికి హాయిగా తగిలి, సరే కానివ్వండి! అనకపోతారా అవి. అన్నాడు ఆయన.

"సరే అదృష్టవశాత్తూ - పెళ్ళిచూపుల టిఫిన్ అంతా తినక్కర్లేదన్న అనవాయితీ ఒక టుందిగా, దాని మూలంగా మాకు డాక్టరు ఖర్చు తగ్గిందనుకోండి- ఆనక ఊడిపడింది. భామ వేషం! సరిగ్గా నాలుగ్గజాల దూరంలో కూచోబెట్టారు. అక్కణ్ణించే లక్షణాలన్ని కనబడ్డాయి .... చేతులకి. మొహానికి సరిగ్గా అంగుళం పొడుగు రోమాలు!.... రామరామ! వేషం చూదామా అంటే ఇంట్లో ఉన్న వాళ్ళందరివీ తలోటీ తొడి గేశారు. నెక్లెస్ ఒకరిదీ, గాజులు మరొకరివీ చెవుల కమ్మ లింకొకరివీ. జెడలో నాగరం బహుశా పొరుగింటి వాళ్ళదీ జాకెట్టూ చీరా సరే, వాళ్లమ్మ పెళ్ళినాటి వనుకోండి— ఆ విగ్రహం చూడాల్సిందే. వర్ణించడం కష్టం....,

'పాపం ఎంత సేపు కూర్చున్నారో, అలా ఆవిడ కెదురుగా ఆ దృశ్యం చూస్తూ!,

'ఎడ్వెంచర్ అని ఊరికే అన్నారామరి!'

'—సరే. అయింది కాదూ. మా చిన్నక్కయ్య సరసాల మారి. కాసేపు అదీ ఇదీఅడిగి యాథా శక్తి ఏడిపించుకు తింది. కాస్తలో కాస్త ఎంటర్‌టెయిన్‌మెంటనుకోండి.'

అందరూ కళ్ళూ చెవులూ అప్పజెప్పి వింటున్నారు. చెప్పవలసిన మాటలు నోట్లోనే ఉండిపోయి, నాకొంచెం కష్టంగానే ఉంది.

'ఇహ అప్పుడు పాటకచేరీ; నా సామిరంగ!' అన్నాడు మురళి; అసలు పతంగం అంతా ఇందులో ఉంది. చూస్కో, అన్నట్లు.

ఆ సంగతి గ్రహించిన వొక శ్రోత 'చేతులారా చేసుకున్న పాపం; అనుభవించక తప్పుతుందా?— మిమ్మల్నెవరు అడగమన్నారు. పాటొచ్చా!- ఏదీ ఒకటి విందాం!— అంటూను?, అని గడుసుగా నవ్వుతున్నాడు.

'అబ్బెబ్బే— మా వల్ల ఏం తప్పులేదు. కాకపోతే అది మా పూర్వులెవరో చేసుకున్న పాపం అయివుండాలి. అంతే— పాట మొదలు పెట్టక ముందే— మా చిన్నక్కయ్యా నేనూ పోదాం అంటే పోదాం అని గిల్లుకున్నాం మధ్యవర్తివేపు తిరిగి గొంతుక సవరించుకొనే లోపలే ఆ పిల్లతల్లిగారు వుంది, మా తప్పిపోయిన అత్తగారు— 'అమ్మాయికి పాటకూడా ఒచ్చు, అంది మొహం చేటంత చేసుకుని. అక్కడికీ మా చిన్నక్కయ్య తెంచేసి 'ఒస్తే ఏం లెండి; మరోసారి వినొచ్చు., అనేసి సహం లేచింది. ఇంతట్లో మళ్ళీ అందుకుని 'మరోసారీ విందురుగాని. ఎప్పుడు వింటే మాత్రం ఈ సొంపొస్తుందా", అని ఆ తల్లి బలవంతాన ఆర్మణీపెట్టి తెచ్చి కూతురు ముందర పడేసి; 'సిగ్గుబడకమ్మా, ఒక్క టేదేనా పాడు, అని బెత్తాయించింది.....,

'పాపం;' అన్నాడొక శ్రోత.

'—ఇహ ఎత్తుకుందండీ ఆ అమ్మాయి. అది హిందీ పాటో' మరాటీయో లేకపోతే నేపాలీ భాషో తెలీదు. సిరి రామచెంద్ర కృపాళు భజమన హరణ భవభయ దారుణం— ఆ ముక్కలు మాత్రం అలా జ్ఞాపకం వుండిపోయాయి. ఇప్పటికీ జ్ఞాపకం— దారుణం, దారుణం!,

'నిజంగా దారుణమేనండీ' అన్నాడొక శ్రోత.

'అసలది మంచి కీర్తనేనండీ— మొదట్నించీ మా ఫ్రెండుకి హిందూస్తానీ సంగీతం అన్నా హిందీ కీర్తనన్నా నచ్చవు.... కవి స్వార్ధపరుడు కదా! అన్నీ తెలుగే అయివుండాలి; తనే వ్రాసుంటే ఇంకా మంచిది!, అన్నాను నేను,

' ఇది మరీ బాగుందోయ్. నేను రాసిన పాటలు నా పెళ్ళి చూపులకే ఎవరు పాడగలరు?'

'అదేమంత అసాధ్యమా? ఇప్పటికీ నీకు పెళ్ళికాలేదు. నువ్వు రాసిన పాటలు దాదాపు పాతిక ముప్ఫయి వరకూ దేశంలో మంచి ప్రచారంలో వున్నాయి. ఇవాళ్ళనీ పాటలు రాని ఆడపిల్లలు లేనేలేరని నువ్వు అనలేవు. మాట వరసకి నిన్నరాత్రి గోవిందరావుగా రమ్మాయి....అన్నీ నీ పాటలే పాడింది కద!,

'అయితే మాత్రం–మనం ఆదృష్టితో? అన్నాడు మురళి కంగారుగా.

'—— అయింది కదా? సపోజ్ గోవిందరావుగారు ఇవాళ సాయంకాలం నిన్ను టీకి ఇన్వయిట్ చేసినట్టే చేసి- అయ్యా మీ కింకా పెళ్ళికాలేదని విన్నాను. మరి మా అమ్మాయిని చూసేరు కదా! మీ అభిప్రాయం ఏమిటని అడిగేరనుకో——"ఏమోనండీ-ఆ దృష్టితో చూడిలేదు" అంటావా? నన్నడిగితే–ఈ పెళ్ళి చూపులనే సిస్టమ్‌లోనే ఏదో మిస్టరీ ఉంది. ఎక్కువమంది ప్రిజుడిస్ అయిపోతున్నారు. ఏదో బావుందని వెళ్ళి అన్నీ వున్నాయనుకొని తీర్మానించుకోడం, లేకపోతే ఏదో నచ్చలేదనుకొని అన్నిటికీ వంకలు పెట్టుకోడం-పది నిముషాలు మొదలు అరగంట వరకూ జరిగే యీ తతంగంలో షో మధ్య. నిజం తెలుసుకోందుకు అవకాశం చాలా తక్కువ!" అన్నాను.

"అదీ నిజమే లెండి" అన్నాడొక శ్రోత లేని నవ్వు తెచ్చుకుంటూ.

"మొత్తానికి అలా ముగిసిందన్నమాట. మీ ఎడ్వెంచర్!" అని రెండో ఆయన నవ్వాడు.

మూడో ఆయన ఏదీ అనకముందే నేను మురళి వీపు మీదతట్టి, "మరే-చెప్ప మరిచాను!-వంటయిపోయింది. భోంచేసొద్దాం పద" అన్నాను.

"ఓ, యస్. అయామ్ రెడీ."

*　　*　　*　　*

భోజనాలయిపోయి ఇవతల పడ్డాం.

"ఏమిటో నువ్వు సరిగ్గా సహజంగా భోంచేసినట్టు లేదు" అన్నాను.

"అబ్బెబ్బె లేదు–నాకు మీ యింట్లో మొహమాటమా?"

"మొహమాటం అని గాదు, ఏదో పరధ్యానంగా వున్నావు" అన్నాను. అతను భోంచేస్తున్నంత సేపు కూడా అంతే. మాటలు సమయోచితంగా రాలేదు. ఒకదానికొకటి చెప్పడం, మళ్ళీ అది సద్దుకుందికి ఇంకోటేదో చెప్పడం–ఇలా అయింది.

మేం విజయనగరంలో చదువుకున్నాం- కృష్ణమూర్తి హోటలులో భోంచేసి, పక్కనేవున్న పంతులుగారి కిళ్ళీకొట్లో ఉప్పుచెక్క ఏలక్కాయ కిళ్ళీ వేసుకోడం ఆనాటి జీవిత మాధుర్యాలలో ఒకటి. దొరకాలేగాని ఉప్పుచెక్క

మజా ఎప్పటికీ నాకు చాలా అనుభవనీయంగా వుండిపోతుంది. ఈ ఊళ్లో దొర కవుగాని, మొన్నీమధ్య వెంకట్రాజు గజపతి నగరం వెళ్ళితే అతనిద్వారా తెప్పించినవి కొద్దిగా ఉన్నాయి.

"ఇవెక్కడ సంపాదించేవోయ్" అంటూ మురళి సర్వం మరిచి తాంబూల చర్వణంలో పడ్డాడు.

ఆ నిషా దిగి పోకుండానే అందుకున్నాడు. "నీ పెళ్ళయి ఎన్నాళ్ళ యింది?"

"ఆ!. శాన్నాళ్ళయింది. ఐదారేళ్ళయింది."

"అత్తారేవూరు?"

"పిఠాపురం. సుబ్బరామయ్యగారని, ఎస్టేట్లో దివాన్‌గా వుండేవారు మా మామగారు."

ఠక్కుమని ముందుకి వంగాడు మురళి. చిన్న దగ్గు దగ్గాడు.

"డెక్కెట్టిందా? ఈ ఉప్పుచెక్క అలవాట్లేకపోతే ఇంతే. అలాగే ఉండు మంచినీళ్ళు తెస్తాను!" అని వంటింట్లో కెళ్ళాను.

గ్లాసులు ఖాళీ లేవు. అయిదుగ్లాసులు పాయసంతోనూ నీళ్ళతోనూ మా కంచాల దగ్గిర ఎంగిలివి వుండిపోయేయి. విశాల మూడు గ్లాసులు తన భోజనం. దగ్గిర పెట్టేసుకుంది. చేసేదిలేక నా పీట దగ్గిర మంచినీళ్ళగ్లాసుతీసి, వరండాలో కెళ్ళి కడుక్కొచ్చి, బిందెలో ముంచాను.

"ఏమిటంటున్నాడు మీ ఫ్రెండు?" అంది విశాలి.

"అబ్బే! ఏం లేదు. నీ గురించే భోగట్టా చేస్తున్నాడు.ఏ వూరు? ఏం కథ అంటూనూ, ఇంతట్లో వుప్పుచెక్క గొంతుక్కి అడ్డం పడినట్టుంది" అని చిలిపిగా నవ్వేసి, నీళ్ళు పట్టుకొని హాల్లోకొచ్చేను,

మురళి హాల్లో ఫోటోలవేపు చూస్తున్నాడు. మా పెళ్ళి ఫోటో ఒక మంచి ఎన్లార్జిమెంటు, దాని కిటూ అటూ నాదీ విశాలిదీ పెద్దపెద్ద బస్ట్ ఫోటోలూ, అన్నిట్లోకి ఈ మూడే ఆకర్షణీయంగా ఉంటాయి. వాటివేపే చూస్తున్నాడతను.

'పిఠాపురంలో ఇంతమంచి ఫోటోగ్రాఫర్లున్నారుటోయ్.' అని పలకరిం

వాడు మురళి తను ఇంతసేపూ ఫోటోగ్రఫీనే పరిశీలించి చూస్తున్నాడని నేననుకోవాలని కాబోలు!

'మంచినీళ్ళు తాగు.' అన్నాను సమాధానం చెప్పకుండా.

'అక్కర్లేదు; నువ్వలా వెళ్ళగానే సర్దుకుంది' అంటూనే నీళ్ళుతాగేశాడు. చిరునవ్వు తెచ్చుకుంటూ.

అతను ఇందాక హఠాత్తుగా ఒంగి, దగ్గడం ఎందుకో. ఇప్పుడు నీళ్ళు తాగుతూ నవ్వడం ఎందుకో, నాకు తెలుస్తున్నట్టుంది,

అతను ఇంకా నవ్వుతూనే:- 'అది సరేకాని, వీళ్ళకి నువ్వెలా చిక్కావు?' అన్నాడు.

అంటే?- వీళ్ళు నీకెలా తగులుకున్నారు - అనా? పాపం. మోసపోయావు మిత్రమా ! అన్న జాలి ధ్వనించింది.

నాకు తెలిసిపోయింది. నా మిత్రుడు ఎడ్వంచర్ చేసిన పెళ్ళి చూపుల్లోని కన్య ప్రస్తుతం మా 'విశాలి' గా, మా యింట్లో వుంది !

దారుణం, దారుణం !

* * *

'సారీ ! ఇలా అవుతుందనుకో లేదోయ్' అన్నాడు మురళి.

'అరె! నువ్వలా ఎందుకంటున్నావో నా కర్థం కావడం లేదు. ఇందులో ఎవరైనా విచారించ వలసింది ఏముంది అసలు?' అన్నాను.

ఓ నిమిషం పూరుకొని 'నేనేం అన్నానో నాకు గుర్తు రావడం లేదు....' అని తటుముకోసాగాడు మురళి.

ఇందాక ఆ సిగ్గుమాలిన ఉపాఖ్యాన క్రమంలో. తను పొరపాటున ఏదైనా అనరాని మాటలన్నాడా అని అతనిప్పుడు బాధ పడుతున్నట్టుంది.

'నాకూ గుర్తులేదు....' అని నవ్వేసి, 'గనక, నువ్వేదీ గుర్తు తెచ్చుకోడం మంచిది కాదని నా ఉద్దేశం!....' అన్నాను.

మళ్ళీ కాసేపు ఆగాడు మురళి. 'ఐతే ఆల్సో కొంత విచారించ వలసింది కూడా ఉందేమో అని' అన్నాడు.

'నాకలా అనిపించడం లేదు.'

'బాగా కట్నం యిచ్చేరా?'

'నథింగ్ డూయింగ్.'

'మరి, ఎలా జరిగింది? ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది!'

'నేను పొరపాటనుకోలేదన్నానుగా!'

'ఆ విషయంలో నిన్ను నే నభినందించక తప్పదు.'

"నేనుకూడా నన్ను చాలా సార్లు అభినందించుకున్నాను. ఈ విషయంలో"

"అఫ్‌కోర్స్. కొంతమంది జీవితంలో ఏదెలా దొరికితే అలా తీసుకు ఆనందించగలుగుతారు.... అదృష్టవంతులు"

నేను నవ్వాను. 'అలాక్కూడా ఆపలేదు....నువ్వు తెలుసుకో జూడ్డం నాకు చాలా సంతోషంగా ఉంది.... నే నామెని చాలా పరీక్షలకి గురి చేసేను, అన్నిటికీ నిలబడిందని నీకు చెప్పడానికి గర్విస్తున్నాను.'

మురళి మాట్లాడలేదు.

చాలా సున్నితమైన విషయం, విచిత్రమైన సంఘటన. ఇన్ని సంవత్సరాల తరవాత వాళ్ళగురించి తన కప్పుడేర్పడిన భావం చెప్పడం పెద్దమనిషి తరహా కాదు. మిత్రుడింటికి వెళ్ళి మిత్రుడి భార్య మీదా అత్తారిమీదా అభాండాలు వెయ్యడం నాగరికత కాదు. మిత్రుడి శ్రేయస్సుకోరి అతని చుట్టూ ఏదేనా కీడు వున్నపుడు చెప్పగోరడం సహజం, అన్నింటికీమించి పొద్దుటే తను చేసిన వ్యాఖ్యానాలు సమర్థించుకోవడం బహుశా అవసరమేమో: ప్రఖ్యాతి గల మనిషికి. అన్నమాట నిలబెట్టుకోడమే ముఖ్యఅవసరం కద!

అతని స్థితి అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తూ నేనూ మాట్లాడలేదు.

నేను బి. టెక్. అయిన తర్వాత, ఎవరో పిఠాపురం షుగర్ ఫేక్టరీలో వేయించేరు, నా కుద్యోగం. వీళ్ళ యింటికియెదురుగా ఉండేవాణ్ణి. ఆ యింట్లో ఒక సంగీత విద్వాంసురాలు ఉండేది; ఆమె శిష్యురాలీమె. హిందూస్థానీ సంగీతమే ఈమె అభ్యసించింది. కర్ణాటకం అంతకు మునుపే కొద్దిగా వచ్చునట, అంతకంటే హిందూ స్థానీ సంగీతమే తన కిష్టమట, సూర్‌దాస్,

భక్త మీరా, కబీర్ భజన్లు, ఊర్మిల, ఇంకా కొద్దిగా- పారశీక కవుల్లు రచించిన ఘజల్‌లు నేర్చుకుంది. మరీ మరీ పాడించి వినిపించేది. ఆ టీచరు.

నిష్‌దిన్ బర్‌సత్ నైన్ హమారే-జహోరె మన్ రామ్‌నామ్ సుఖ్‌దాయీ-జోరుమె తోడో పియా-చలో మన్ గంగా జమునా తీర్-కోయీ కహియొరె—ఇలాటివి కొన్ని- లాస్ట్ బట్ నాట్ లీస్ట్- శ్రీరామచంద్ర కృపాళ్ భజమన్ హరణ-నాకు కూడా పట్టు బడ్డాయి.... అద్భుతంగా పాడుతుంది విశాలి.

అన్నీ చెప్పాను మురళికి.... '.... 'పెళ్ళయిన వెంటనే సంగీతం మరిచిపోకుండా, సాధనచేసి, కృషిచేసి. మంచి అనుభవం సంపాదించింది.... నువ్వు చెప్పిన రోషాలూ, ఆ నాకారితనం- అవన్నీ నీ బేడ్ ఇమాజినేషనో, లేక మీచిన్నక్కయ్య ప్రభావమో అయివుండవచ్చు. ద్వేషించడంలో ఒకరి సహాయం చాలా సుళువుగా అంగీకరిస్తాం.... ఏ దెలా వున్నా, నువ్వు అర గంట సేపు చూసి నిర్ణయించుకున్నావు; నేను ఆరునెల్ల కాలం చూసి నిశ్చ యించుకున్నాను....'అని కూడా చెప్పేను.

'వాళ్ళు చాలా పీనాసివాళ్ళోయ్.'

నాకు వాళ్ళ డబ్బు కావలసొస్తేకద, ఆసంగతి నన్ను బాధించడం'!

విశాలిచేత ఓ కచేరీ చేయించితే, 'చాలా బావుంది; అనాడు నేనే పొర పాటు పడ్డాను' అంటాడు మురళి, ఇప్పుడు. కాని అది నాకు ఆనవసరం.... అదలా వుంచి, నే నామెను పెళ్ళాడ్డంవల్ల కొంతైనా నష్టపోయానని, కనీసం యింతకన్నా అభివృద్ధిలో కొచ్చే ఛాన్సులు పోగొట్టుకున్నానని చెప్పడానికి కొంత సేపు తాపత్రయ పడ్డాడు, మురళి. అతనికి నా మీదున్నా ప్రేమవల్లో, లేక మరేదైనా కారణం వుందో—

వెళ్ళేడా మీ ఫ్రెండు?'

'ఆఁ. నిన్ను చాలా థేంక్ చేసేనని చెప్పమన్నాడు. వంటలు చాలా బావున్నాయట' అని నవ్వాను.

'ఈ మాత్రం దానికీ మీ తోటి చెప్పిపంపడం ఒకటా. మొహం ఎదట థాంక్సయినా చెప్పలేడా? మళ్ళీ అంత గొప్పవాడు!'

'చెప్పలేక పోడానికో కారణం వుందిలే.,

'ఏమిటో?'

'నీకు తెలీదా–విశాలా?'

'నా కెలా తెలుస్తుందండి?'

'నువ్వతన్ని గుర్తుపట్టలేదా!'

'ఏమో–ఎక్కడో ఓసారి చూసినట్టుంది.'

'ఎక్కడో నువ్వతన్ని చూడ్డంకాదు. మీ ఇంట్లోనే, పెళ్ళి చూపుల కొచ్చేడు. మీకు దూరపు బంధువేటగా!.... వెంకట నరసయ్యగారని, వాళ్ళ నాన్నగారు రాజమండ్రిలో లాయరు....'

'ఆఁ, అతనా– ఇతను? ఆరెరె' అంటూ విశాల కుర్చీలోంచి సగం లేచింది. 'వెళ్ళిపోయాడా– ఇంకా ఉన్నాడా?'

'వెళ్ళిపోయాడు. బండెక్కించి కదా ఒచ్చేను!

'అర్రెర్రె, ఎంత పని జరిగిపోయిందండీ, నాలుగూ మొహాన దులిపేసే దాన్ని కదా! మీరైనా చెప్పారు కారేమండీ?'

'నాకైనా ముందుగా తెలీదు, భోంచేసి లేచేక కొన్ని సంగతులు ఆరాతీసి మరి చెప్పేడు'

అని అతను పొద్దుట కాకతాళీయంగా వాళ్ళ పెళ్ళిచూపుల ఉదంతం చెప్పడం గురించి తెలియజేశాను.

'ఔనౌను! అవేళ, ఇతనూ వీళ్ళక్కగారూ వచ్చేరు. నన్ను పాటపాడ మని, హిందీబోధపడక, నేను సినిమా పాట పాడలేదని వేళాకోళం చేసేరు. సంసారంలోదో– పాతాళభైరవిలోదో పాడమని కూడా వచ్చిన మధ్యవర్తి సలహా యిచ్చేడు.... వీళ్ళక్కగారు లేదూ, అవిడ ఎన్ని షోకులు పోయిందను కున్నారు! భజన పాటలేనా, తత్వాలూ అవీ వచ్చా అంది ' పాటమాత్రం దివ్యంగా వుంది, ఈ పాటికి గ్రామఫోన్లు కొనడం మానెయ్యొచ్చు.' అంటూ ఏమి టేమిటో వాగింది....'

'వీళ్ళింట్లో జరిగినన్ని ఘోరాలు మా బంధువుల్లో ఎక్కడా ఎరగం. పెద్దకోడల్ని–బయటుంటే తాటాకుపాకలో పడుకోబెట్టి, అర్ధరాత్రిపూట నిప్పు పెట్టేశారు. ఆ మానవుడికి మళ్ళీ ఎవరూ పిల్లనివ్వలేదు ఇప్పటికీ అలా సన్యాసి బ్రతుకే అఘోరిస్తున్నాడు రెండో కోడలు వీళ్ళ బాధ భరించలేక కిరసనాయిలు పోసుకొని అంటించేసుకుంది. స్టవ్ పేలిందని కమ్ముకున్నారు. మెడ్రాస్‌లో పని

చేస్తూ ఎవరో ఒక అరవామెని రెండో పెళ్ళి చేసుకున్నాడు.... ఆ తరువాత వాళ్ళింటికి పిల్లనిస్తాం అంటూ బంధువుల్లోగాని, తెలిసిన వాళ్ళలో గాని ఎవరైనా వెళ్ళగా ఎవరూ చూడలేదు, వినలేదు.... చూడరాదూ అయ్యా! ఇప్పటికీ ఘోటక బ్రహ్మచారిగా ఉన్నాడు. మీకంటే ఓ యాడాది పెద్దేమో మళ్ళీను! ఆడ అంతా పెత్తనం, పుంగరి బాజా.... మళ్ళీ అందరికి ఒంకలు పెట్టడమే!

'నాకు 'దారుణం' అని నిక్‌నేమ్ పెట్టేరండీ: విశ్శక్కయ్యా ఇతనూ కలిసి: నే నాఁడోజున పాడిన కీర్తనలో-దారుణం- అని ఓ ముక్క- వచ్చిందిట: ఆ పేరు బంధువుల్లో ప్రచారం చేసేరు, నేను సంగీతాన్ని ఖూనీ చేస్తున్నానుట: దారుణంగానుట'-అయ్యొయ్యో, ఎం... ని జరిగిపోయిందండీ. ఛాన్సు పోయింది!—'

'ఏమిటది?'

'ఇతనికి సన్మానం చేస్తారంటూ నాలుగురోజులనాడు గోవింద రావుగా రమ్మాయి ఇతను రాసిన పాటలు పట్టుకొచ్చి వరసలు కట్టమంది. చాలా బావున్నాయని మెచ్చుకున్నట్టగా,సభలో!లో పది నిమిషాలు ముందుగా చెప్పేరు కాదు, ఆయనే యీయనని- తేల్చి పారేద్దును: సంగీతాన్ని ఖూనీ చేస్తున్నానో ఇంకేం చేస్తున్నానో!'

'నువ్వా, ఆ వరసలు కట్టింది. నాతో చెప్పనేలేదే?'

'ఏం పెద్ద చెప్పేదుంది?-ఆరెరె: చెయ్యిదాటి పోయిందండీ?'

'ఏమీ దాటిపోలేదు- గోవిందరావుగారు ఆ అమ్మాయిని అతనికిచ్చిపెళ్ళి చేస్తారుట. అప్పు డెలాగా నిన్ను పిలుస్తారు: అప్పుడు చెబుదువుగాని?'

విశాలి నా జోక్‌కి నవ్వలేదు... 'ఛీఛీ—యితనికా? ఎత్తెత్తి కాలు ఎంగిలాకుమీద వేసినట్టు ఇతని కివ్వడమేమిటండీ, బంగారం లాంటి పిల్లని!'

'అబ్బబ్బా. ఇది బాగులేదు విశాలీ. మీ రిద్దరూ ఒకర్నొకరు చిన్న పిల్లల కంటే సిల్లీగా ద్వేషించుకుంటున్నారు ! అలగా జనం కంటె దారుణంగా దూషించుకుంటున్నారు. మీరే ఒకర్నొకరు పెళ్ళాడితే ఇద్దరూ ఇద్దరి తప్పుల్నీ క్షమించి—'

'ఛీ ! నేనా ?'

'అబ్బే, అలాక్కాదు. అనుకోడానికేం. పెళ్ళి చూపుల దాకా ఒచ్చింది కదా. పెళ్ళి చేసుకున్నారే, అనుకో. ఇలా మాట్లాడుతారా, ఒకర్ని గురించొకరు?'

'ఏమో; నే నతన్ని పెళ్ళాడి ఉండేదాన్ని కాదు!'

'అది ఇప్పటిమాట!—వాళ్ళ దౌష్ట్యాన్ని ఎత్తిపొడుస్తున్న నీకు, వాటికి కారణాలు కూడా తెలిసుండేవి; అప్పుడు—'

'ఛీ ఛీ—వాళ్ళందరూ...' విశాలి పళ్ళు బిగించింది.

'ఆ మాత్రం అతను కూడా అన్నాడులే. మీరు పీనాసి వాళ్ళట; మీ పెద్దక్క అలాగట; చిన్నక్క ఇలాగట!— ఇలా చెప్పుకుంటూ పోతే కాలం చాలదు !—మీ రిద్దరూ నాకు కావాల్సిన వాళ్ళే. ఇలా అయితే నేనెవర్ని సమర్థించడం ?'

'నిజమైన విలువ ఎవరిదైతే వార్ని !'

'నిజమైన విలువ యిద్దర్లోనూ వుంది. అదంతా ఇప్పుడెందుకు గానీ, ఏదీ ఒక్కసారి ఆ కీర్తన—దారుణం !'

'మీరు మీ ఫ్రెండూ ఎగతాళి చేస్తే మాత్రం ఆ కీర్తన విలువ మాసిపోతుం దనుకుంటున్నారా? దానికేమండీ. రత్నంలాటి కీర్తన! శబ్దం, అర్థం కూడా మంచివి!' అని లేచింది విశాలి.

శ్రీ రామచంద్ర కృపాళ్ భజమన్

హరణ భవభయ దారుణం

నవకంజలోచన కంజ ముఖకర

కంజపద కంజారుణం

అని మెత్తగా—కమ్మగా గానంచేస్తూ విశాలి ఇంట్లో ఏదో పని చూసుకో సాగింది.



("ప్రభవ" మాసపత్రిక ప్రారంభ సంచిక - ఫిబ్రవరి 1978)

# చేతికర్ర

"ఎవరయ్యా ఇక్కడింత సేపూ డ్యూటీలో వున్నది?" అని నిబ్బరంగా అడిగేరు తాసిల్దారుగారు. ఆయనలా తాపీగా మాటాడేరంటే ఎవ్వడికో మూడిందన్నమాటే.

"ఏమైంది సార్" అని వినయంగా అడిగాను. అందులో ఆయనడిగిన ప్రశ్నకి జవాబుంది.

ఒక్కసారి తారాజువ్వలా లేచేరాయన. "ఏమైందని నిమ్మళంగా అడుగుతున్నావా? నీకుద్యోగం పోతే జంధ్యాలు వొడుక్కుని తద్దినాలు పెట్టి బతికేస్తావు. నాకూ కలెక్టరు గారికీ ఉద్యోగాలు పోతే చావొక్కటే మార్గం! నీలాంటి బాధ్యత లేని వ్యక్తుల్ని బంగళా డ్యూటీకి వేస్తే ఇంతే!"

బిక్కచచ్చిపోయినట్టు నటించి "అసలేం జరిగిందిసార్" అన్నాను. అప్పటికే చుట్టూరా జనం చేరుతున్నారు.

జనం అంటే జనంకాదు. పోలీసు సర్కిలినస్పెక్టరొకాయన, ఇద్దరు కాన్‌స్టబుల్స్, ఏనిమల్ హజ్బెండ్రీ ఎ.డి. గారు. ఇలాంటి వాళ్ళు.

అక్కడ మినిస్టరుగారు కేంపువేసిన సందర్భంగా డ్యూటీమీద వచ్చిన వాళ్ళూ పనులు చేయించుకోడాని కొచ్చిన వాళ్ళూనూ.

"ఇంకా ఈ సంగతి కలెక్టర్‌గారికి తెలీదు. తెలిసేముందే పని మొదలు పెట్టండి. మినిస్టరుగారి చేతికర్ర ఎవరో పట్టుకుపోయారు. తెల్లారే లోపుగా అది వారికి వొప్పచెప్పకపోతే ఎవడూ ఉద్యోగంలో వుండడు, ఈ జిల్లామొత్తం మీద!"

చేతికర్ర పోయిందా! ఇంతమందిమి ఇక్కడున్నామే! అదేం నలుసా నల్లపూసా? ఎవడో కళ్ళు గప్పి పట్టుకుపోడానికి ఓ జేబు రుమాలా!"

మూడునెలలకిందట్నించీ ప్రయత్నం, ఈ మినిష్టరుగారి ఈ క్యాంపు ఏర్పాట్లకోసం. ఆయన స్వాతంత్ర్య యోధుడు. వయోవృద్ధుడు, మహాజ్ఞాని, ఎంత జ్ఞానో అంత చండశాసనుడు. ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వంలో రక్షణ మంత్రి. ఈ వూరు రావడం యిదే మొదటిసారి.

అందుకని మూడు నెలల కిందటే తన ప్రోగ్రాం పంపుతూ, తనని చూడ డానికి రావలసినవాళ్ళ, లిస్టొకటి పంపారు. "ఈ లిస్టులో వున్న ప్రతి ఒక్కరికీ తమ కోరిక తెలియజేసి, తాము ఇక్కడ గడపబోయే మూడు రోజులలో ఎవరికి ఎప్పుడు ఎంత సమయం కేటాయించిందీ వివరాలతో నిమిషాలవారీగా కార్యక్రమాన్ని రూపొందించవలసిన బాధ్యత మా జిల్లా కలెక్టర్‌గారికి వొప్ప చెప్పారు మినిస్టరుగారి పి.ఎ.

ఏ-వన్ నుంచి జీ-ట్వల్వ్ వరకుగల గుమాస్తాల్లో ఉద్దండులంతా కూర్చుని డిస్కస్ చేసి రూపొందించిన మినిట్ - టు-మినిట్ ప్రోగ్రాంని జాగ్రత్తగా టైపు చేసి ఇవ్వగా. కలెక్టర్‌గారు ఆ కాగితాలు తమకి చేరిన నాటి సాయంకాలమే ఏదో అర్జంటు పనిమీద హైద్రాబాదు వెళుతూ, ఇవీ అక్కడికి పట్టుకెళ్ళి అక్కడి ముఖ్యమంత్రిగారి ఆమోదం పొంది, అదే తమ ఆమోదం తమ అభిలాషా పని రాసి కేంద్ర మంత్రి గారికి పంపమన్నారు,

మినిస్టరుగా రిచ్చిన లిస్టులో వున్న ఆసామీల్లో ఒకే ఒక వ్యక్తిని మేం పట్టుకోలేకపోయాం. అతని పేరు రంగనాధాచారి. అతనిది ఈ ఊరేనని తెలియ జేస్తూ "జైల్ మేట్" 1920-32, 1941-43 అని మాత్రం చహరా యిచ్చేరు.

రాజకీయ బాధితులుగా భూములు కావాలని, కొడుకులకో, అల్లుళ్ళకో ఉద్యోగాలు యిప్పించమని అర్జీలు పెట్టుకున్న ఈ వూరి పెద్దల్లో ఆయనపేరు లేదు. అయినా కేంద్రమంత్రిగా రిచ్చిన పేరుకదా అని, ఆయనా, ఈయనా కల వకపోతే, ఏం మునుగుతుందోనని అప్పట్లో శాయశక్తులా వెతికి "ఆయన అడ్రస్ దొరకలేదు" అని ఫైల్లో రాసుకున్నా, మినిట్-టు-మినిట్ ప్రోగ్రా ములో ఆ పేరుగల ఆసామిని ఉదహరించకండా దాటవేశాం. అక్కడికి గుం డెలు పీచుమన్నా యందరికీనూ. అయితే ఢిల్లీనించి ఆ ప్రోగ్రాం మీద మరే రిమార్కూ లేకండా ఆమోదముద్ర పడిరాగానే గండం గడిచినట్టే నని వూపిరి పీల్చుకున్నాం.

మూడు రోజుల ప్రోగ్రాం లోనూ ఢిల్లీనుంచి సూచించబడ్డ మార్పు ఒకే ఒక్కటి. రెండో రోజు రాత్రి ఎనిమిదిన్నర నుంచి తొమ్మిదివరకు గల అరగంట కాలాన్నీ "స్థానిక ప్రముఖులతో యిష్టాగోష్ఠి" అని మేం రాస్తే అది "అనుకోని అతిథుల కోసం ప్రత్యేకం" అని మార్చారు. ఈ మార్పు జనానికి

తెలిపేటట్టు ప్రచురించమనీ, ఆ సమయంలో అడ్డమైనవాళ్ళూ వొచ్చేసి తనని హింసించకండా చూడమనీ ప్రత్యేకమైన హెచ్చరిక వొచ్చింది.

ఆ రెండూ మాకు కరతలామలకాలే. ఆ మాటాడితే ఈ "అనుకోని అతిథులు" ఎవరో కూడా మేమే నిర్ణయించి, మేం మొదట అనుకున్న స్థానిక ప్రముఖులనే అక్కడ సమావేశ పరచి, మేం మొదట అనుకున్న ఇష్టాగోష్ఠి కార్యక్రమాన్నే అక్కడ ఏర్పాటు చేయగల సామర్థ్యం మా యంత్రాంగానికుంది.

కాని అలా చెయ్యకండా "ఇందుమూలంగా సమస్త జనులకు తెలియ యడ మేమనగా—" పద్ధతిలో ఈ అరగంట గురించి ప్రచారం చేసి వూరుకున్నాము.

మినిష్టరుగారు పంపిన లిస్టులో వ్యక్తులందరికీ. ఎవరికి కేటాయించిన సమయంలో వారు మినిష్టరుగార్ని చూడడానికి వీలుగా, రానూ పోనూ ప్రయాణపు ఏర్పాట్లు చేయడానికి చాలినన్ని జీపులు, కార్లు సిద్ధంచేసి వుంచుకున్నాం.

ఈ "అనుకోని అతిథులు" మొత్తం నలుగురు తేలారు. వాళ్ళలో ఇద్దరు తొలిరోజు కార్యక్రమంలో సమయం కేటాయించబడిన్నీ సమయానికి లభ్యం కానివారు. ఒకరు ఏదో పుస్తకం రాసి మనిష్టరుగారికి అంకితం యివ్వడం కోసం వారి అనుమతి కోసం వచ్చినవారు.

నాలుగోవ్యక్తి మేం ఆనాడు కనుక్కోలేక వదిలేసిన రంగనాథాచారిగారు. రాత్రి ఎనిమిదిన్నర గంటలకి మొదలయ్యే కార్యక్రమానికి సాయంకాలం ఆరున్నరకే సిద్ధమైపోయి. లౌంజీలో వుండనిస్తారో లేదోనని మొహమాటపడి గెస్టుహౌసు చుట్టూరా వున్న చెట్లలో వొకదానికింద చతికిలపడి కూర్చున్నాడు. ఆ సంగతి నేను ఆరున్నరకే గమనించినా, ఎనిమిదిన్నరకే అతన్ని లోపలికి ఆహ్వానించేను. కాఫీ పుచ్చుకుంటారా అని అడిగితే ఆయన మాట్లాడలేదు.

ఆ తరవాత నేనూ మాట్లాడలేదు.

మొదటి ముగ్గురు "అనుకోని అతిథులూ" మినిష్టరుగారు లౌంజీలోకి రాగానే చకచకా మాట్లాడేసి వాళ్ళ పన్లు నిలబడి పూర్తి చేసుకున్నారు. ఈయన కూర్చున్న చోట కదలకుండా కూర్చున్నాడు. మినిష్టరుగారు ఈయన్ని చూడగానే "అయ్యో. నువ్వొచ్చావా?" అంటూ ఆప్యాయంగా ఆయన్ని పలకరించి,

పక్కన కూచుని "ఇక్కడెందుకు లోపల మాట్లాడుకుందాం రా!" అని లేవదీసి ఆయన్ని తీసుకుపోయారు.

మినిష్టరుగారు, కుటుంబం భోజనాలు చేసేరు; ఆయనా అక్కడే భోం చేశారు.

"భోజనానికి కక్కుర్తి పడేవాళ్ళలో ఎనభై ఏళ్ళ వాళ్ళుకూడా వుంటున్నా రన్న మాట" అని మాలో మేం జోకులేసుకున్నాం. మినిష్టరుగారు మా వూరు సందర్శించే సందర్భంగా భోజనం మొదలైన ఏర్పాట్లకీ, గెస్టుహౌసు మరమ్మత్తులకీ ముప్పై వేల రూపాయలు శాంక్షనై మా చేతుల్లో ఉన్న సంగతీ, మేం అందరంకూడా గెస్టుహౌసులోనే కాఫీలూ, భోజనాలూ కానిస్తున్న సంగతి గుర్తొచ్చింది. కాని పైకి అనుకోలేదు మేం ఎవరమూనూ.

సరిగ్గా తొమ్మిదీఇరవై ఐదుకి ఈయన ఇవతల పడ్డాడు. "అనుకోని అతిథులకి" ఇళ్ళకు వెళ్ళేందుకు వాహనాల ఏర్పాటు చేసే బాధ్యత నెత్తిన వేసుకోలేదు కనక ఆ రాత్రప్పుడు ఆ ఎనభై ఏళ్ళ ముసలాడు నడిచి వెళ్తున్నాడా సిటీబస్సు దొరుకుతుందా అనే విషయం మేం ఎవరమూ పట్టించుకోలేదు.

తొమ్మిదీ నలభైకి మినిష్టరుగారు, తమకి ఆరుబయట కాసేపు కూర్చోవాలని వుందని కుర్చీలు వేయించమని చెప్పారట- వేయించాం.

పదిహేను నిమిషాలైంది. కుర్చీలు ఆరుబైట అలా కాళీగానే వున్నాయి. ఇదిగో వస్తారు, అదిగో వస్తారని చూస్తున్నాం, ఇంతలోనే ఇది——

ఆరుబైట కుర్చీలదాకా వెళ్ళడానికి మినిష్టరుగారు చేతికర్ర కోసం వెతుక్కుంటే అది కనబళ్ళేదు,

క్షణాలమీద వివరాలు వచ్చేశాయి. ఆ చేతికర్ర "ఎబనైట్ బ్రౌన్" రంగుది. మూడడుగులు పొడుగుంటుంది.

మినిస్టరుగారు పన్నెండేళ్ళ క్రితం వెస్టుజర్మనీ వెళ్ళినప్పుడు ఒక సైంటిస్టు ఆయనకా చేతికర్ర ప్రజెంటు చేశారు.

ఆ చేతికర్ర హాండిల్‌కి స్క్రూ పద్ధతి వుంది. నాలుగైదు రకాల హాండిల్స్‌ను ఆ కర్రకి స్క్రూ పద్ధతిని బిగించుకోవచ్చును. అభిరుచిని బట్టి, అవసరాన్ని బట్టీనూ,

జర్మనీలో ఒక కీకారణ్యంలో పెరిగిన ఒకానొక ప్రత్యేక జాతికర్రను, ఏ రెండు వందల ఏళ్ళోదాచి, సీజన్ చేసి, తయారుచేశారా చేతికర్ర.

ఖరీదా? అబ్బో, చాలా వుంటుంది.—ఎంతా అంటే ఎంతని చెప్పడం అరవై ఏళ్ళ రాజకీయజీవితం, ఇరవై ఎనిమిదేళ్ళ మంత్రిత్వ అనుభవం, అఖండ మైన మేధా సంపత్తీ అసలు సంపత్తీకూడా కలిగిన ఒక స్వాతంత్ర్యయోధుడికి, అంతకంటె ఎక్కువ మేధావంతుడు జర్మనీ సైంటిస్టూ అభిమానంగా ఇచ్చిన కానుక అది. అడవిలో వందేళ్ళు పెరిగిన చెట్టుదే కావచ్చు. కొట్టిన తరవాత రెండువందలేళ్ళు దాచింది కావచ్చు, కానీ మినిస్టరుగారి చేతుల్లో పన్నెండేళ్ళ నుంచీ వున్న కర్ర. దాని విలువ యింతా అని ఎలా చెప్పడం!

చచ్చు సంభావన మూడువేలుండొచ్చు.

"చూడండి, చూడండి! ఆ చేతికర్రని మినిష్టరుగారు నేషనల్ మ్యూజి యంకి ప్రెజెంటుచేద్దామనుకుంటున్నారట. పట్టుకుపోయినవాడెవడో తెల్లారి వేలంవేసి ఊళ్ళోంచి జారుకుంటాడో ఏమిటో? టౌనంతా గాలించి రాత్రికిరాత్రే తెచ్చి వొప్పచెప్పండి!" అని తొందర చేశారు తాసిల్దారుగారు.

సర్రుమని డి. ఐ. జీ. గారి కారొచ్చి ఆగింది. అంతకంటె ఫోర్సుగా ఆయనా దిగారందులోంచి.

"అలాంటి వస్తువుని ఎవడో పట్టుకుపోతుంటే అంతా నిద్రపోతున్నా రటయ్యా? అందులో ఏమి ఇంపార్టెంట్ సీక్రెట్సు వున్నాయో! మినిస్టరుగారు చాలా ఆందోళన పడుతున్నారని వారి పియ్యేగారు చెప్తే వొచ్చాను" అన్నా రాయన.

చేతికర్ర స్క్రూ విప్పితే ఒక గొట్టాం వుండడం, అందులో ఒక గొప్ప ప్లానో, ప్రణాళికో కాలనాళికో వుండడం వూహించుకున్నాం. ఆత్మ రక్షణకోసం ఒక కత్తి అయినా చేతికర్రలో నిక్షిప్తమయి వుండకపోతుందా అనికూడ గుస గుస లాడుకున్నాం.

పావుగంట గడిచేలోగా చేతికర్రను వెతికి పట్టుకోడానికి ప్రణాళిక సిద్ధం అయింది. పన్నెండు జీపులు, నాలుగు కార్లు ఎలాట్ చేశారు. నగరం అంతా పదహారు భాగాలుగా విభజించుకుని ఒక్కొక్క పార్టీకి ఒక కానిస్టేబిలు, ఒక సీనియర్ పోలీసు లేక ఇనస్పెక్టరు ఒక సివిల్ అధికారి—

నా పార్టీకి రంగరాజుపేట వచ్చింది.

"తెల్లవారేదాకా వెతకండి. ఉదయం మైకుల్లో ప్రచారం చేద్దాం. చేతికర్ర మీరు తెచ్చిచ్చేదాకా మేం మా బంగళాలో మేలుకుని కూచుంటాం. ఇంటింటికీ

వెళ్ళి తలుపులు కొట్టండి. ఆ ముసలాయనే పట్టుకుపోయి ఉంటాడు.ఎంత అను కోని అతిథి అయినా మినిస్టరుగారు భోజనానికి తీసుకెళ్ళడం, చూసేకయినా అత నెవరో, ఎడ్రసేమిటో తెలుసుకోకుండా ఆయన్ని వొదిలేస్తారటయ్యా?

బయల్దేరాం.

మిగతావాళ్ళంతా ఏం అవస్థలు పడుతున్నారో తెలీదుగాని, రంగరాజు పేట సందుల్లో జీప్ తిప్పుకుంటూ యింటింటి తలుపూ కొట్టి-ఎనభయ్యేళ్ళు పైబడ్డవాడు; స్వాతంత్ర్య పోరాటంలో రెండుసార్లు జైలు కెళ్ళినవాడు;బక్కగా ఎర్రగా వుంటాడు అనే వర్ణనతో ఆయన ఇల్లు వెతకడం మహా కష్టమూ, యమ యాతనా అయిపోయింది మాకు.

చివరకి ఒక ఇరుకు సందులో పట్టుకున్నాం. మా యూనిట్ వాళ్ళమే.

తలుపు తెరిచేసరికి మావాళ్ళు ఆయన మీద పడ్డారు. "ఏమయ్యా! మళ్ళీ జైలు కెళ్ళాలనుందా?" అంటూనూ.

ఆయన వెర్రిమొహం వేశాడు.

పేరు. అడ్రసు అన్నీ రాసుకోడం అయింది. చేతికర్ర సంగతి చెప్పే సరికి ఆయన విపరీతం దా బాధపడిపోయి "అయ్యో! ఎంతపనయిపోయింది! గాభ రాలో నాదే అనుకుని వాడి చేతికర్ర తెచ్చేశానా?" అన్నాడు. మినిస్టర్ గార్ని గురించి వాడూ వీడూ అని మాట్లాడితే పరిస్థితులు బాగుండవని గట్టిగా వార్నింగ్ ఇచ్చారు మావాళ్ళు.చేతికర్ర మా చేతికి చేరగానే ముసలాయనకదా అని అయినా ఆలోచించకుండా. ఆ చేతి కర్రతోనే ఆయన్ని కొట్టినంతపని చేశారు. కాని ఆ కర్రకాస్తా ఆయన నడుంమీద విరిగితే మానడుములు విరుగుతాయన్న భయం చేత కంగారుగా జీప్ ఎక్కాం.

పన్నెండయింది రాత్రి.

కలెక్టర్ గారి బంగాళాలో అక్షరాలా కళ్ళలో వొత్తులేసుకుని మేలుకుని కూచున్నారు జిల్లా ముఖ్యాధికారులంతాను. చేతికర్ర పట్టుకెళ్ళిచ్చేసరికి అధికార తారతమ్యాలు మరిచి షేక్హాండివ్వడానికి చెతులన్నీ ముందుకొచ్చాయి.ఎవరిళ్ళకి వాళ్ళెళ్ళిపోడానికి కాళ్ళు వొచ్చాయి. ఉదయం ఆరింటికి గెస్టుహౌస్ దగ్గర కొస్తామని చెప్పేసి గుడ్ నైట్ లు కొట్టాం.

వుదయం ఆరుంపావుకల్లా గెస్టుహౌస్కి కలెక్టరుగారి కారొచ్చింది.

ఒక పసుపుపచ్చని ముఖమల్ గుడ్డలో జాగ్రత్తగా చుట్టి తెచ్చారు మిని

స్టరుగారి చేతికర్రని. నలిగిపోతుందో విరిగిపోతుందో గెద్ద తన్నుకు పోతుందో మాయమైపోతుందో అన్నట్టు, పసిపాపని పట్టుకున్నట్లు, అల్లుడి కిచ్చే తాంబూల పళ్ళెన్ని పట్టుకున్నట్టు రెండు చేతుల మీదా యెత్తిపట్టుకున్నారు వారు ఆ చేతి కర్ర మూటను. సరాసరి మినిస్టర్‌గారి గదిలో కెళ్ళి వొప్ప చెప్పడానికి ఆయన నింపాదిగా నడుస్తూ వెళుతూ వుంటే దూరదేశాల కెళిపోయే నావను చూసే తీర వాసుల్లా చూస్తూనిలబడ్డాం అందరమూనూ.

మినిస్టర్‌గారు చాలా సంతోషించేరుట. కర్రను వెతికి తెచ్చిన వాళ్ళకి ప్రత్యేకం థాంక్స్ చెప్పమన్నారుట. ఆ కర్ర పట్టుకు పోయినప్పుడు తాను వది లేసిన తన చేతికర్రను రంగానాధాచారిగారికి ఇచ్చేయమన్నారుట.

మినిస్టరుగారి పియ్యేగారు నన్ను పిల్చి రంగనాధాచారిగారి చేతికర్రని చూపించి, "ఇది ఆయనకిచ్చేసి, అందినట్టు రసీదు పట్రండి. మీరేగా, రాత్రి రంగనాధాచారి ఇంటికి వెళ్ళింది!" అని గద్దించారు.

ఔనని తలూపాను.గదిమూలాన నిలబడున్న రంగనాధాచారిగారి చేతికర్రని తీసుకున్నాను.

రాత్రి నాతో వొచ్చిన పోలీసు ఆఫీసర్ రమణయ్యగారూ, నేనూ మళ్ళా రంగరాజుపేట బయలుదేరాం. నన్ను పక్కకినెట్టి రమణయ్యగారు ముందు కెళ్ళాడు. ఒంటిచేత్తో నమస్కారం చెప్తూ రంగనాధాచారిగారికి కర్ర అందిం చాడు.

"చాలా థేంక్స్ బాబూ!" అన్నారాయన.

"చేతికర్ర తమ కందినట్టు రశీదు రాసివ్వండి" అన్నాడు రమణయ్య గారు.

"ఎందుకు! చేతికర్ర నాకు అందిందని చెప్పండి: చాలు" అని రంగ నాధాచారిగారు తలుపు వేసేశాడు.

రమణయ్యగారు తలుపు తట్టాడు. ఆయన తలుపుతీసి "ఏం, ఇంకా నుంచున్నారు?" అన్నాడు.

"అది కాదు్సార్. రశీదు...."

"రశీదెందుకు? నా కర్ర నాకందింది. అతని కర్ర అతని కందింది. మీ డ్యూటీ మీరు చేశారంతే."

"రశీదు ఫైల్లోకి కావాలంటండి."

"ఫైల్లోకి కావాలా? మరి నే నిచ్చిన చేతికఱ్ఱ ఆయన కందిందని ఒక రశీదు నా ఫైల్లోకి అక్కర్లేదు? అదీలేదు, ఇదీ లేదు. వెళ్ళండి, వెళ్ళండి."

"మీ దగ్గర్నుంచి తీసుకెళ్ళింది మినిస్టర్ గారికి స్వయంగా కలెక్టర్ గారు అందజేశారు సార్! వారి కది అందిందండి."

"నే చెప్పేదీ అదే. వారికది అందింది, నాకిది అందింది. ఆ రశీదుతెస్తే ఈ రశీదు ఇస్తాను. నే నా చేతికఱ్ఱను వేలం వేసేసి లక్షలార్జించ బోతున్నానని, నన్ను జైల్లో పెడతానని అన్న పెద్దమనిషిని నువ్వేగా! పోయిరా. ఆయన మీకు మినిస్టర్ అయితే, నేను ఆయనకి స్నేహితుణ్ని, గురువుని. వెళ్ళండి, నాకు పనుంది" అని ఆయన వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

"రాత్రి నేను చెప్పాను. జులుం చెయ్యకండయ్యా బాబూ అని, విన్నారు కాదు!" అని అన్నాను రమణయ్యగారితో.

"మీరోసారి అడిగి చూడండి."

"ఆయనలా ఫైరై పోతూ వుంటే ఎలా అడగను? నావల్ల కాదు."

"రాత్రి ఆ టెన్షన్లో ఏదో నోరు జారాం అనుకోండి" అన్నాడు రమణయ్యగారు.

మళ్ళీ రంగనాథాచారి గారొచ్చేరు. ప్రభుత్వ పద్ధతులనీ, బ్యూరోక్రసీని ఆక్షేపిస్తూ ఆవేశపడ్డారు. రమణయ్య అవన్నీ నిజమే అని వొప్పుకుంటూ రశీదుకోసం కాళ్ళావేళ్ళాపడ్డాడు.

ఆయన ఒక్కపిసరు కూడా బెసగలేదు.నిజమైన స్వాతంత్ర్య యోధుళ్ళా నిలబడిపోయాడు. "ఊళ్ళోకి ఫలానా మినిస్టర్ గారొస్తున్నారు. కావలసినవాళ్ళు కలుసుకోవచ్చు అని ప్రకటించిన వారు, నేను కలుసుకోవాలని ఫోన్ గట్టా అడిగితే దరఖాస్తు పెట్టమన్నారు. రెండు రూపాయల కోర్టు ఫీ స్టాంపు అంటించమన్నారు. నేను పొంపాటున ఆయన కఱ్ఱ తెస్తే అది తీసుకోడానికి అర్ధరాత్రి వాళ్ళో సహాం ఘంధిని లేపారు. మీ పద్ధతులు మంచివికావు. మార్చుకోండి. లేకపోతే దేశం పాడైపోతుంది!"

మేం మాట్లాడకుండా వెనక్కొచ్చేశాం.

***

("జ్యోతి" మాసపత్రిక—దీపావళి 1964)

# వంటొచ్చిన మొగాడు

రఘురామారావు గారింటికి పెళ్ళి కెళ్ళాను. మా సూపర్నెంటుగారి తమ్ముడికి వారమ్మాయి నిచ్చేరన్నమాట. అక్కడ కనబడింది కళ. ఆవిడ నాకు కాలేజ్ మెట్.

కొన్ని కారణాలవల్ల ఆవిడంటే నాకు యిష్టంలేదు. అందుచేత గమనించినా మాట్లాడలేదు నేను. బాగా పొడుగైంది కళ. కొంచెం ఒళ్ళుచేసింది. ఇద్దరు పిల్లలు కనబడుతున్నారు. పిల్లల్ని చూస్తేమాత్రం ఆవిడమీద నాకున్న కోపాన్ని పక్కకి నెట్టేసి ఆవిణ్ణి పలకరింతామన్నంత టెమ్టేషన్ కలుగుతోంది.

అలాగే రెండురోజులు గడిపేశాను.

హడావుడి అయిపోయాక, ఆవిడ భర్త కాబోలు ఆయన, అప్పుడే మా బృందం చేస్తున్న వృథాచర్చలో మాట కలుపుతున్నాడు. ఇంతట్లో యీవిడ ఆ పక్కనుంచి వెళుతు వుంటే, 'కళా! ఎవర్నైనా పంపి అమృతాంజనం తెప్పించూ!' అన్నాడు. ఆవిడ యిటు తిరిగి చూడ్డంలో మా యిద్దరి చూపులూ కలిశాయి.

అప్రయత్నంగా 'మీరు—?' అన్నాను,

'ఓహో! రామదాసుగారా? నమస్కారమండీ! రెండు రోజుల్నుంచీ చూస్తున్నాను—ఎవరోలే. మనిషినిపోలిని మనిషి ఉండరా అని ఊరుకున్నాను' అంది తన మామూలు ధోరణిలో.

'ఎవరోలే' అని ఊరుకుందిట! పొగరేమీ తగ్గలేదు—అనుకున్నాను.

మొగుడికి ఇంట్రడ్యూస్ చేసింది. ఆయన నాగార్జునసాగర్‌లో ఏదో ఇంజినీర్‌ట. కొంతసేపు అక్కడే నిలబడి అన్నీ భోగట్టాచేసింది కళ. ప్రగల్భం ప్రల్లదనంగానే వుండిపోయింది.... ....మిస్చివస్‌గా నవ్వుతూ 'మీ ఫ్రెండ్‌గారెక్కడున్నారు?—వంటొచ్చిన మొగాడు!' అని అడిగేసింది; ఏదో సరదాకి నవ్వుతున్నాన్లే అని తేల్చేస్తూ.

'వంటొచ్చిన మొగాడెవరండోయ్—ఎప్పుడూ చెప్పేరేకాదు!' అని

మిత్రబృందం నన్ను రెచ్చగొట్టారు, నాకు మనసులో ఉడుకుమోత్తనం. పైకి చిరునవ్వు వొచ్చాయి. నవ్వకపోడం స్పోర్ట్ కాదు. నవ్వడం మానవత్వం కాదు. అలాటి సన్నివేశం అది.

కళని చూడగానే రామనాథం జ్ఞాపకాని కొస్తాడు. క్లుప్తంగా చెప్పాలంటే రామనాథం 'పూర్ ఫెలో.'

అతనూ నేనూ కలిసి కాకినాడ పి. ఆర్. కాలేజీలో నాలుగేళ్లు చదువుకున్నాం. అతనిది అమలాపురం, మాది గన్నవరం. ఎలా కలిసేమో చెప్పడం కష్టం; కాని, కలిసిన రోజునించీ ఒక్కటైపోయాం. 'హోటళ్ళకీ హాస్టళ్ళకీ డబ్బు తగలెయ్యొద్దు. మనం చక్కగా వండేసుకుందాం' అని అతనన్నప్పుడు నాకు చాల భయంవేసింది.

కాని, నేనుమాత్రం నాలుగేళ్ళల్లోనూ ఒక్క పూట కూడా వంట చెయ్యలేదు. అక్షరాలా నాలుగేళ్లూ అతనే స్వహస్తాలతో వండిపెట్టాడు.... .... ఎప్పుడేనా ప్రాక్టికల్ క్లాసుకి పొద్దున్నే ఏడింటికి అతను కాలేజీకి వెళ్ళిపోతే టిఫిన్ తినడానికి హోటల్ కి వెళితే అయ్యకు చెట్నీ తినడానికి ఏవుపొచ్చేది, సెలవులకి పదిహేనురోజులు ఇంటికొచ్చేసి తల్లి చేతివంట తింటున్నాకూడా రామనాథం వంటకోసం నాలుక వాచిపోయి ఉండేది; అంత చక్కగా రుచికరంగా చేసేవాడు.

స్టూడెంట్స్ వండుకుంటే ఏముంటుంది మహా, వేపుడు ముక్కలూ ఉడికీ ఉడకని అన్నమేకదా అనుకుంటున్నారేమో— మేం ఉండేది మల్లాదివారి దేవిడీలో. మా రామనాథం రుబ్బు రాయీ, సన్నికల్లూ మూడు రకాల నూరుడురాళ్ళు అన్నీ సరాసరి రూమ్ లోకి రవాణా చేయించాడు. ఉల్లి, మెంతి, మసాలా, పచ్చికారం పెట్టిన కూరలు—వేపుడు, కాల్చుడు, ఉడకబెట్టిన, నానేసిన పచ్చళ్ళు—దోసకాయ, నిమ్మకాయ, దబ్బకాయ, టొమెటోలాంటి టెంపరరీ ఊరగాయలు—రసాలు, సాంబార్లు, పులుసులు—పాయసాలు, పరమాన్నాలు, చిత్రాన్నాలు—అన్నీ చేసేవాడు ఆదివారం వస్తే ఛస్తే ఎక్కడికీ కదిలేవాడు కాదు; కదల్నిచ్చేవాడుగాదు. సన్ డే మనకి ఫన్ డే; కుకింగ్ ఎక్స్ పెరిమెంట్స్ చేద్దాం, అంటూ ఏదో ఓ స్పెషల్ తయారుచేసేవాడు; రుచిగావున్నా చెయ్యడాని కాలస్యం అయ్యేకూర ఏదో ఆవేళ చేసేవాడు. ఆదివారం మా రూమ్ కి రాగలగెస్టుదే అదృష్టం.

అతనికి వంటరావడమే అతని తప్పుగా పరిణమించింది. అతను చేసినవి తినేసి, మెచ్చుకున్నట్టే మెచ్చుకొని, ఆ ధోరణిలోనే అతన్ని హేళన చేసేవారు, చాలామంది.

అతని పాక పాండిత్యం విజృంభించడానికి కారణం అప్పటి ఇంగ్లీషు చీఫ్‌లెక్చరర్‌గారు. ఆయన చేతుల్లో వొక స్కాలర్‌షిప్ వుండేది. అది తనకిప్పించమని అడగడానికి వోరోజు పొద్దుటే వెళ్ళేడు రామనాథం. అతను వెళ్ళేసరికి ఆయన చాలా కంగారుగా ఉన్నారట; ఎవరేనా స్టూడెంట్ కనిపిస్తే బాలునన్నట్టు చెప్పులు చూస్తున్నాట్ట.

'ఏ ఇయర్ అబ్బాయీ నువ్వు?— ఫస్టియరా?— స్కాలర్‌షిప్ కోసం ఒచ్చావా?— సరే, మంచిది; చూద్దాంగానీ, నీకీవూళ్ళో ఎవర్నేనా వంట బ్రాహ్మణ్ణి తెలిస్తే కొంచెం పిల్చుకురా నాయనా— ఇంట్లో ఇవాళ తద్దినం; పొద్దుటేచి ఇంట్లో ఆవిడ అవతల కూచుంది; సాయం ఒస్తానన్న చుట్టపు ఆవిడకి మైలట!' అన్నాట్ట ఆయన.

'సర్లేండి; కాని ఎన్ని విస్తళ్ళు లేస్తాయండి?'

'దానికేముందిలేవోయ్, ఇప్పుడు విస్తళ్ళనిబట్టి రేటు మాట్లాడుకొందుకు టైమ్‌లేదు. పది రూపాయలైనాసరే, ఇచ్చేస్తాను. వెళ్ళి ఎవణ్ణో ఒహణ్ణి అర్జంటుగా లాక్కురా'

'అదిగాదండి! ఓ పాతికమంది లోపలైతే, తమరి కభ్యంతరం లేకపోతే నేనే లాగించేస్తానండి' అన్నాట్ట యితను.

'ఆఁ ఏమన్నావ్? నువ్వా? నిండా పద్దెనిమిదేళ్ళులేని బొట్టికాయివి!' అని ఆశ్చర్యపడ్డాట్ట ఆయన. ఎక్కడా ఏమీ అభాసుకాకుండా పితృకార్యం ఒడ్డెక్కిపోయేసరికి ఆయన మళ్ళీ ఆశ్చర్యపడ్డాట.

కాలేజీకిరాక, ఇంటర్వెల్ సమయానికి ఇంటికీ అఘోరించక పొద్దున్నగా వెళ్ళినవాడు ఏమైపోయాడో అని విచారించుకుంటూ ఇంగ్లీష్ చీఫ్‌గారింటికి వెళితే, అక్కడ గావంచా కట్టుకొని ఆఖరు వాయ గార్లు వేయుచున్నాడు, రామనాథం.

ఆ రోజున నా భోజనం కూడా అక్కడే.

* * *

సెకండియర్ చదువుతూ ఉండగా కార్తీక మాసంలో వుప్పాడకి వన

భోజనానికెళ్ళేం. లెక్కల సెక్షన్లు రెండూ కలిసి మేం నూట పదహారు మంది అబ్బాయిలూ, నల్లటి ఇద్దరు అమ్మాయిలూ. తెలుగు లెక్చరర్‌గారూ సంస్కృతం మేష్టారూ పెద్దలు. ఆ ఏడాది కార్తీక పున్నమి సోమవారం పడింది. పిక్నిక్‌డే అని సెలవిప్పించేశారు. మొత్తం కాలేజీ అందరూ పిక్నిక్స్‌కి వెళ్ళిపోయారు. కోటిపల్లి వెళ్ళినవాళ్ళూ, అంతర్వేది వెళ్ళినవాళ్ళూ, ముక్తేశ్వరం వెళ్ళిన వాళ్ళూ.

సామాన్లూ, వంటబ్రాహ్మలూ, ఇద్దరు లేబరేటరీ అటెండర్లూ ఓరోజు ముందుగానే వెళ్ళారు. మేం నాలుగు బస్సుల్లో సోంవారం పుదయం అయిదింటికి కాకినాడ్లో బయల్దేరి, సరాసరి సముద్రపొడ్డుకెళ్ళి- స్నానాలు చేసి- నిక్కి-నీలిగీ తొమ్మిదిన్నరకి తోటలో కొచ్చేసరికి, ఇంకేముంది! వంట బ్రాహ్మల్లో హెడ్డుని కాస్తా పాము కరిచేసిందట. అందరూ వనంలేదు భోజనాల్లేవంటూ కూర్చున్నారు మేష్టార్లిద్దరూ. అప్రదిష్టకి వెరచి మమ్మల్ని తీసుకొచ్చిన బస్సుల్లో ఓ దానిమీద అతన్నెక్కించి పిఠాపురం మిషనాసుపత్రికి వెళ్ళేరు; అక్కడ కుదరకపోతే పాముల నరసయ్య దగ్గిరికి వెళ్ళాలని వాళ్ళ వుద్దేశం.

అసలే వుషారంతా పాడైపోయింది; పైగా అసిస్టెంటు వంటాయన నేను ససేమిరా వండనన్నాడు. సీనియర్ మీద భక్తేమో అనుకున్నాం. కాదుట వంట తనకి కొత్తట. అందులోనూ కాలేజీపిల్లలు కదా, ఏ మాత్రం బెడిసికొట్టినా పచ్చడికింద తన్నేస్తారని భయంట.

"అంతేకదా!" అన్నాడు రామనాథం. 'నీకేం భయంలేదు; నువ్వు పైపన్లు చూడు. నే నున్నాగా!' అంటూ పంచె బిగించాడు.

పదిహేను నిమిషాల్లో తలాకాస్త వుప్మా కాఫీ; మాకందరికీ పడేసి, కార్యక్రమంలో పడ్డాడు. ఆవేళ ఆడపిల్లలందరూ చేరి, పంక్తిలోకి అతను వెజిటబుల్ పలావు వడ్డించడానికొస్తే 'వంటొచ్చిన మొగాడికీ' అంటే 'జై' అంటూ నినాదాలు చేసేరు. రెండుసార్లు ఆశ్చర్యంలో మునిగిన రామనాథం మూడోసారి కల్లా సద్దుకొని 'చదువొచ్చిన ఆడవాళ్ళకి' అని, 'జై' అనిపించి, అందర్నీ ఆనందంలో ఆహ్లాదంలో ముంచాడు.

*　　　*　　　*

మేం థర్డ్ ఇయర్ చదువుతుండగా కాలేజీలో ప్రవేశించింది కళ ఏమన్నానూ?—కరెక్ట్! ఆయేడు కాలేజీలో 'కళ' ప్రవేశించింది. అసలే చలాకీ అయిన

పిల్ల; అందులోనూ పి.ఆర్.కాలేజీ. మొగపిల్లల కళ్ళెప్పుడూ ఆమెమీదే వుండేవి నిస్సహాయంగా. కళకి ఎవర్నో ఒకర్ని ఏడిపించడం సరదా, అని త్వరలోనే బైట పడిపోయింది,

'అపూర్వశక్తులు' అని వొక వ్యాసం రాసింది కళ. ఆ ఏడాది కాలేజీలో స్వాతంత్ర్య దినోత్సవాలకి పోటీలుపెట్టి, పోటీలో నెగ్గిన కథల్తో, వ్యాసాల్తో, పాటల్తో, పద్యాల్తో ఒక మేగజైన్ అనుబంధం రిలీజ్ చేశారు. అందులో ప్రచురించమని తెలుగు మాష్టారికి ఇచ్చింది కళ, ఆ వ్యాసాన్ని. మొగాళ్ళకి వంట తెలియడం ఓ అపూర్వ విషయం, అంటూ ఓ పేరా. రామనాథం వంట గురించి తను విన్న భోగట్టాలు రాస్తూ స్వయంగా చూడలేక పోయినందుకు తన దురదృష్టాన్ని నిందించుకుంటూ; ఆవిధంగా అతన్ని అభినందిస్తున్నానని వ్రాసింది. తెలుగు మేష్టారికి అందులో ఏదో వ్యంగ్యం గోచరించి. రామనాథాన్ని కేకేసి, ఇది చదివి ప్రచురించడం నీ కిష్టమేనా. కాకపోతే ప్రచురించను అన్నారు. రామనాథం తనకేమీ అభ్యంతరం లేదన్నాడు. అయితే తెలుగుమేష్టారు క్రిందని ఓ పేరా సమాధానంలాగా వ్రాస్తూ వంట విషయంలో మగ - ఆడ అనే తేడా సమాజం కుటుంబాలుగా సంస్కృతి పొందడంవల్ల, డ్యూటీలు పంపకాలయిపోడంవల్ల ఏర్పడ్డదనీ, మొట్టమొదట్నించీ కూడా మొగవాళ్ళే మంచి వంటవాళ్ళనీ, పురాణకాలంలో కూడా నలుడు, భీముడు అనే పురుషుల్నే పాక ప్రవీణులుగా ఉదహరించారుగాని. స్త్రీలుబాగా వండినట్టు ఎక్కడా నిదర్శనమేలేదనీ, నేటికీకూడా భోక్తలు అయిదారు మందికీ మించిపోయే సరికల్లా, స్త్రీలకన్నా పురుషులే విజయవంతమైన పాక ప్రవీణులుగా ప్రపంచం అంతా గుర్తిస్తున్నారనీ చర్చించి వ్రాసేరు.

అక్కణ్నించి రామనాథం విషయంలో అబ్బాయిల్లోనూ, అమ్మాయిల్లోనూ కూడా ఒక చైతన్యవంతమైన చిలిపితనం చెలరేగింది, రామనాథానికి కెప్టెన్ కుక్ అని పేరుపెట్టారు. ఆడపిల్లల కామన్ రూమ్సులో నువ్వు వంటొచ్చిన మొగాణ్ని పెళ్ళాడవే, తీరిపోతుంది! అంటూఒకర్నొకరు హేళన చేసుకోసాగారు.

కళ అమ్మాయిల హాస్టల్లో చేరలేదు, బంధువు లెవరో కాకినాడ్లో ఉంటేను, వాళ్ళింట్లో వుండేది. వాళ్ళిల్లు మేం కాలేజీకి వెళ్ళే దార్లోనే.

ఓ నాడు మే మిద్దరం కాలేజీకి వెళుతూవుంటే, వాళ్ళిల్లు ఇంకా కాస్త

దూరం వుండనగానే కళ మా కెదురొచ్చి, 'చిన్న ఆపదలో వున్నాను, కాస్త సాయం చేస్తారా?' అని చాలా మర్యాదగా అడిగింది.

రామనాథం నా వేపు చూశాడు.

'ఆయన చెయ్యలేరండీ: మీరే—' అంది కళ,

ఇద్దరం ఇంట్లోకి ఆమె వెనకవెళ్ళాం. పొయ్యిమీద ఏదో గిన్నె ఆవిర్లు కక్కుతోంది. పక్కనే కత్తిపీట. సగం తరిగిన బీరకాయ ముక్కలూ. సగం నూరిన ఉల్లి, వేపిన కందిపప్పు—ఇలా ఏమిటేమిటో ఉన్నాయి.

'మా చుట్టాలు ఊరికెళ్ళారండీ. చుట్టుపక్కల తెలిసినవాళ్ళెవరూ లేరు. రెండురోజుల్లై వండేసుకుంటున్నాను. తీరా ఇవాళ సగంలో—' అని సిగ్గు పడ్డది కళ. 'ఇందాకట్నుంచీ కమలా, సరోజా, పద్మ, రామలక్ష్మి ఎవరేనా వస్తారేమో అని చూస్తున్నానండి. ఎవ్వరూ రావల్లేదు. ఇంతట్లో దేవుళ్ళాగా కనిపించేరు మీరు— పొయ్యిమీద్ది ఏమైపోతుందోనని కంగారుపడి మిమ్మల్ని శ్రమ పెట్టవలిసొచ్చిందండి—'

'ఓహో, అలాగా!' అన్నాడు రామనాథం. 'సరేనోయ్, రామదాసూ! నువ్వెళ్లు నేనొక అరగంటలో ఒచ్చేస్తాను" అన్నాడు.

'ప్చ్ ఎందుకులేవోయ్, లేనిపోని గొడవ! అ వుడికేది అన్నమల్లేవుంది; అయిదు నిమిషాల్లో దించేసి అట్లా బజారుకిపోయి ఏదైనా హోటల్నుంచి కాస్త కూరా చెట్నీ సాంబారూ పంపితే పోలా?' అన్నాను.

కాని అతను ఒప్పుకోలేదు,

'అప్టరాల్ ఇందులో ఏముందిలేవోయ్, కూరలు తరిగే వున్నాయి. పొయ్యి వేడిగా ఉంది. అన్నీ సిద్ధంగా ఉన్నాయి. అలా బజారుకి వెళితే మాత్రం అరగంట అవదా ఏమిటీ? ఆ అరగంటలో ఇక్కడే అయిపోతుందిగా. మళ్ళీ ఎందుకూ, సామాన్లు వేస్తు; నువ్వెళ్ళు: నేనొక అరగంటలో వొచ్చేస్తా' అన్నాడు.

'వెళ్ళిపోఅక్కర్లేదండి. కావాలంటే మీరు ఆయనా కూడా ఇక్కడే భోం చెయ్యొచ్చండి: నాకు అంచనా తెలియక కొంచెం బియ్యం ఎక్కువే పోసినట్టున్నాను.' అంది కళ.

'థాంక్స్. మా భోజనాలయ్యాయి.!' అన్నాను నేను కొంచెం తీవ్రంగా

రామనాథం అప్పటికప్పుడే కాళ్ళు కడిగేసుకొని అన్నం గిన్నె మూత

తెరిచి గరిటెవేసి ఒక్కసారి కలిపాడు. అన్నంగిన్నె, గరిటె, సౌయ్యి అతన్ని ఆకర్షించేస్తాయి అలా.

'కొంచెం ఎక్కువ పొయ్యడమేం ఖర్మ! బాగా అయిదారుమందికి సరిపడా పోసేడు. ఇంత అంచనా తెలియక పోడం నేనెక్కడా చూళ్ళేదు!' అన్నాడు రామనాథం నవ్వి.

'ఇంకేం, దించేసి ఓ మూల పడెయ్యి. చక్కగా మూడు రోజులూ సుష్టుగా భోంచేస్తుంది, అమ్మాయిగారు!' అన్నాను కసిగా ఇద్దరివేపూ చూస్తూ. చరాచరా నడిచి ఇవతలి కొచ్చేశాను.

సాయంత్రం రామనాథం చెప్పేడు—అంతా వట్టిదేట. ఐదుగురు అమ్మాయిలట, మొత్తం. మిగిలిన వాళ్ళంతా మేడమీదో ఎక్కడో వుండి వుంటారుట. తను వంట పూర్తిచేసి ఇవతలికొస్తూ వుంటే గలాగలా చప్పట్లు చేసేరుట. 'కంగ్రాచులేషన్స్ కళా! పందెం గెల్చేవు. భోజనాల పార్టీ నీదీ, సాయంత్రం సినిమా పార్టీ మాదీ, అసలింతకీ రుచెలావుందో చూద్దాంపదండే, నలభీమపాతం?' ఇలా అనడం, నవ్వుకోడం వినిపించిందట.

'ఏడుస్తూ కూచో, నీదే తప్పంతాను! నువ్వే వీధినపోయేది తెచ్చి వీపుకు రాసుకున్నావ్,' అన్నాను రామనాథం తెల్ల మొహం వేసేడు. 'సారీ రామనాథం! నాకోపం ఆగలేదు... వాళ్ళు .... డెవిల్స్. వాళ్ళ నెందుకు నమ్మతావ్?' అన్నాను.

* * *

మేం ఫోర్తియర్ చదువుతూ వుండగా రామనాథానికి ఒక వుత్తరం వచ్చింది.

'డియర్ ఫ్రెండ్.

నేను మీ గురించి చాలా వినియున్నాను. మీ రంటే నాకు చాలా యిష్టము. మిమ్మల్ని పెండ్లి చేసుకోవాలని, మీ దగ్గర అనేక విషయములు నేర్చుకొనవలెనని వుండును. కాని, అడిగే టందుకు ధైర్యములేదు. మీరు మా వాళ్ళతో మాట్లాడినచో చాలా సంతోషించెదను. ఎక్కువ వ్రాయుటకు సిగ్గుగా న్నది.

ఇట్లు,
రామప్రియ.

రెండురోజులు భోగట్టా చెయ్యగా తెలిసింది. రామప్రియ అనే అమ్మాయి ఫస్టు ఇయర్ చదువుతోందని. ఫిజిక్స్ లాబొరేటరీలో ఆ అమ్మాయి రికార్డూ తెలుగు ట్యూటర్‌గారి దగ్గిర ట్రాన్స్‌లేషన్ ఎక్సర్‌సైజు పుస్తకం తీయించి. రాత ఆ అమ్మాయిదేనని తెలుసుకున్నాం.

అప్పుడు వాళ్ళవాళ్ళనిగురించి భోగట్టా చేసేం.

వాళ్ళ నాన్నగారు రిటైర్డు టుబాకో ఇన్‌స్పెక్టరుట, వాళ్ళిల్లు జగన్నాథ పురంలో, కరవపెళ్ళే దార్లో బస్సురోడ్డు ప్రక్కనేట.

ఉత్తరం వచ్చేక వరసగా పది పన్నెండు రోజులు రామప్రియ అనే ఆ అమ్మాయి కాలేజీకి రాలేదు.

'బహుశా ఈ ఉత్తరం అందేక తనకోసం వెతుకుతారని ఊహించి, కన బడ్డానికీ సిగ్గుపడుతోందేమోలే!' అన్నాను.

'ఇంతకీ వాళ్ళింటికెళ్ళి మాట్లాడితే తప్పులేదుగా?, అన్నాడు,

'ఇంటికే వెళ్ళి మాట్లాడదాం. తనతో మాట్లాడమని ఆ అమ్మాయి రాయ లేదుగా రాసినా అది సమంజసంకాదు.... మరో కొన్నాళ్ళు చూదాం. నీకు కన బడ్డానికి సిగ్గుపడి కాలేజి ఎన్నాళ్ళని మానేస్తుంది?— అమ్మాయిని చూడకుండా మాటలు జరపడం అనవసరం. ఆమెకు ఎంత నువ్వంటే ఇష్టమైతే మాత్రం నువ్వామెని చూడకుండా ఇష్టపడకుండా మాట్లాడ్డం దేనికి?—ఇంటి కెళితే చూడొచ్చనుకో. అయినా అక్కడికెళ్ళి చూట్టం ఏ ఖర్మ! కాలేజీ లోనే నిజ సర్వూపం కనబడుతుంది. ఇంటిదగ్గర కంటేనూ,' అన్నాను.

రామనాథం వినలేదు. 'త్వరగా తేలిపోతే మంచిది. నా కిలా మేటర్స్ పెండింగ్ పెట్టడం ఇష్టం లేదు,

ఆ ఆదివారం ఉదయం సిటీ బస్ ఎక్కి, జగన్నాథపురం వెళ్ళేం. విష్ణ్వాలయం దగ్గరే దిగిపోయి నడుచుకుంటూ వెళ్ళేం. వాళ్ళిల్లు త్వరలోనే దొరికింది,

వరండాలో నిలబడి గట్టిగా 'ఏమండీ!' అని కేకేశాడు రామనాథం.

ఇరవైయేళ్ళబ్బాయి ఒకతను తలుపు తీసి యివతలికొచ్చి 'ఎవరండీ?' అన్నాడు.

'నా పేరు రామనాథం. ఇతను రామదాసు. మేం ఫోర్తియర్ బి. ఏ. ఈ యింట్లో రామప్రియ అనే అమ్మాయుందా?'

'ఉంది........ !' అన్నాడతను, 'ఉంటే?' అన్న ధోరణిలో.

'మీ రెవరు ?'

'నేను వా ళ్ళన్నని....ఏం గావాలి మీకు?'

'ఇంకా పెద్ద వాళ్ళెవరూ లేరా?'

'లేరు. మా నాన్న బజారుకెళ్ళారు.'

'సరే, మేం మళ్ళీ వస్తాం. మీ నాన్నగా రొస్తె, రామనాథంగా రొచ్చేరని చెప్పండి. రామనాథం ఎవరంటే, రామప్రియని అడగమనండి; చెబుతుంది.... మీ రెప్పుడు కావాలంటే అప్పుడు కబురుచెయ్యొచ్చు. నా ఎడ్రస్ మీ సిస్టర్ దగ్గరుంది!'

లోపల్నుంచి నవ్వులు వినబడ్డాయి. అందరం అటు చూసేం. తెరిచివున్న తలుపులోంచి ఏం కనబడదు. పక్కనుంచి శబ్దాలు వస్తున్నాయి.

'కెప్టెన్ కుక్ కనిపెట్టిన ప్రాంతం ఏదిరా.' అని ఓ అమ్మాయి అడుగుతోంది.

'జగన్నాథపురం!' అని సమాధానం.

'కుక్ జలసంధి ఎక్కడుందిరా?'

'వంటింటికీ గంజి కుండీకి మధ్య!' మళ్ళీ నవ్వులు.

'నోళ్ళు మూసుకోండిరా—ఏమిటా అల్లరి—ఇవతల పెద్ద మనుషులు నిలబడి మాట్లాడుతూ వుంటేను !'

ఇంతలో ఓ పెద్దాయన వీధిలోంచి వచ్చారు. 'ఏమయ్యా?' అంటూ మెల్లెక్కారు.

అప్పటికే రామనాథానికి కొంచెం కోపం వచ్చింది. కాని, అంతకుమించి ఎప్పుడూ రాదు.

'నా పేరు రామనాథం—' అని ప్రారంభించాడు.

లోపల్నుంచి సన్నగా 'వల్లకాట్లో రామనాథాయ !' అని వినిపించింది.

ఇవపైమేళ్ళద్బాయి చకచకా లోపలికెళ్ళి, ఎవర్నో తపీమని కొట్టడం, సన్నగా ఏడుపూ వినబడ్డాయి.

'సారీ సార్. ఇంత అల్లరిమూకని ఎలా భరిస్తున్నారో ! ఈ ఇంట్లో రామప్రియ అని ఓ అమ్మాయి—బహుశా మీ డాటర్ యేమో—నాకు, ఇదుగో ఈ లెటర్ రాసింది—'

పెద్దాయన పుత్తరం అందుకోబోయాడు. కాని, రామనాథం ఇవ్వలేదు. ఆయన దూషించే అంతా చదివేశాడు. కోపంతో, లోపలికి వెళ్ళి, 'చిన్నీ' అన్నాడు. చిన్ని అక్కడే వున్నట్టుంది. 'యేమిటే. ఆ రాతలూ ?' అని గద్దించాడు.

'మరేమోనే చిన్నక్క రాయనంటూంటే కూడా కళక్క రాయమంది నాన్నా. నీకేం భయంలేదు ఎవరూ ఏం అనరూ అని........'

'ఛీ నోర్ముయ్ ఇన్ని తెలిసిన దానివి ఆ రోజే ఎందుకు నాతో చెప్పలేదు ?—మొహం చూడు ! సిగ్గులేదుటే ? అది రాయమందిట, నువ్వు రాశావుట ! అది ఉప్పుటేట్లో దూకమంటే దూకుతావుటే?— అని ఆయన ఇవతలికొచ్చాడు. 'ఆ పుత్తరం ఇటిస్తారా ?'

'ఇవ్వను'

'మీరు క్షమించాలి, పిల్లలు ఏదో; చిన్నతనం—'

'ఇవా చిన్నతనం ఆటలు?'

'క్షమించ మంటున్నాగా!'

'క్షమిస్తారు!- ఇదే ఇంకెవరికన్నా రాస్తే -'

లోపల్నించి నవ్వులు. 'ఇంకెవరికన్నా రాస్తే -' వెక్కిరిస్తున్నారెవరో.

రామనాథం జబర్దస్తీగా లోపలికి వెళ్ళాడు. "ఎవరండీ ఆ ప్రాంప్టింగూ, తమాషా అంతా చేస్తున్నది?-ఓహో తమరా?-' అపూర్వశక్తులు వ్యాసం రాసినవారు మీరే కదూ?- మీ అపూర్వశక్తికి నానమస్కారాలు. మీ దర్శనం ఇక్కడ లభించడం అపూర్వం....

"మీకు నాకన్నా ఎక్కువ డబ్బు వుందికాబోలు; అంతమాత్రాన మాలాంటివాళ్ళతో ఇలా ఆటలాడ్డం అంత మంచిదిగాదు. ఈ ఆటలో ఎల్లప్పుడూ మీరే గెలుస్తూ ఉంటారని భ్రమ పడకండి, నేను తల్చుకుంటే మీకు అపకారం చెయ్యలేక పోను!

"నాకు వంట చేతగావడం మీకంత అపహాస్యంగా వుందా? ఈ దేశం వాళ్ళు రోజుకు రోజూ మరీ ఇంత మూర్ఖులయి పోడం శోచనీయం. అన్ని దేశాలవాళ్ళతో సమంగా చదువుకుంటున్నామని సంబర పడిపోతున్నావా అమ్మడూ!- అయితే మరి చదువులో జ్ఞానం నీ కంట లేదేం?

"వంటొచ్చిన మగాడైతే ఆడ లక్షణాలుంటాయనుకున్నావా? ఆడవాళ్ళ

హార్మోనులతో పుట్టాననుకున్నావా?– అదొక కళ ! పేటకి మాత్రం కళకాదు!– నిజమైన కళ ! అరవై నాలుగు కళలకీ అవకాశం ఇచ్చేది ఆహారం. దాని క్కారణం వంట అనే కళ! దానికివ్వవలసిన గౌరవం యివ్వడం మానేసి, అదొక చాకిరీకింద హీనపర్చేసిన ఈ దేశస్తులదీ తప్పు! రోజుకు రెండు రూపాయలు పారేస్తే చేతకాకపోయినా ఒప్పేనంటూ బయలుదేరి రుచులూ అభిరుచులూ పాడుచేసే ప్రొఫెషనల్సుని కొనుక్కునే మీ పెద్దల్దితప్పు. నిన్నని ప్రయోజనం లేదు!

'కాని, ఒకదానికొకటి కలిపి యిలా మనుష్యులతో వినోదాలాడితే కొంచెం ప్రమాదం ఉంటుంది, జాగ్రత్త!'

ఊసలాగా ఇవతలి కొచ్చాడు రామనాథం, "మీ పెర్మిషన్ లేకుండా మీ ఇంట్లోకి వెళ్ళినందుకు క్షమించండి.......ఇక్కడ మీరు చెబితే వినేదీ, పట్టించుకొనేదీ ఎవరూ లేరని స్పష్టం అయింది కదా; అందుచేత నేనే చెబుదామని వెళ్ళాను." అని ఆ పెద్దాయనతో చెప్పేసి గబగబా మెట్లుదిగి వెళ్ళాడు.

2

నెల్లాళ్ళయింది.

నాలుగు రోజులు ఇక్కడే వుండి, కోర్టుపని కాగానే రోజూ మిగిలిన టైమ్ నాతోనే కులాసాగా గడిపిన బాలాజీ, వెళ్ళిపోతూ, అదీ; రైలుకి గంట కొట్టేశాక ఎత్తాడు రామనాథం సంగతి. "అన్నట్టు మొన్నీమధ్య రామనాథం కనిపించాడోయ్" అన్నాడు.

"అరెరె! ఎక్కడున్నాడు?– ఏం చేస్తున్నాడు?" అన్నాను కంగారుగా.

బాలాజీ పకాపకా నవ్వేసి "ఎక్కడున్నాడో నాకు తెలీదు గాని ఏం చేస్తున్నాడో మాత్రం తెలుసు!" అన్నాడు.

నేను ప్రశ్నార్థకంగా చూసేను.

...."ఇంకేమిటి చేస్తాడు, వాడిబొంద! ఎక్కడో వంట చేస్తూవుండి వుంటాడు!" అని మళ్ళీ వేళాకోళంగా నవ్వాడు బాలాజీ.

నాకు షాక్ తగిలింది. పాపం రామనాథం! దురదృష్టవంతుడు. ఏదీ నిలకడగా చెయ్యలేని మనిషి అయిపోయాడేమో. ఎప్పుడూ నవ్వేస్తూ, నవ్వుల

పాలై పోతూ అందులోనే వొక పట్టుదల పెంచుకొని హటాత్తుగా నలుగురి నోళ్ళ లోనూ పెద్దవాడై పోతాడు. బి. ఏ. ప్యాసయినాక ఆర్నెల్లలో అయిదు ఉద్యోగాలు మారాడు.

వాణ్ణి సక్రమంగా, వాడూ వొక మనిషికింద ఎవరూ జ్ఞాపకం పెట్టుకోరా? ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో !

గార్డు విజిల్ వేసేడు. రైలుకి ఎవర్నైనా దిగబెట్టడానికి వెళితే-ఆనందంలో వున్నా ఆవేదనలోవున్నా ఇదిమాత్రం తప్పక వినబడుతుంది....

"సరే, నే వెళ్ళొస్తానోయ్—మా లాయరుగారి దగ్గరికి మరోసారి వెళ్ళి- ఒక లెటర్ రాయిస్తావుకదూ!" అన్నాడు బాలాజీ.

"ఆఁ ఆఁ, షూర్. నువ్వూ లెటర్స్ రాస్తూవుండు" అని చెయ్యెత్తాను, టాటా చూపిస్తూ.

ఇంక లాయరూ లేదు, డాక్టరూ లేదు. నా మనస్సు మళ్ళీ రామనాధం జ్ఞాపకాల్తో నిండిపోసాగింది. వాడా దిక్కుమాలిన పాకశాస్త్రం మరిచిపోతే బాగుణ్ను. లేకపోతే ప్రతీ చవటా, మగా ఆడా వాణ్ని వంటవాడికిందే గుర్తు పెట్టుకోడమూ। అ మాట వాడితో "నేనేం ఎవరి వంటయినా పాడు చేసేనా? చాతనయితే నే చేసినట్లు చెయ్యమను! అందరూ అన్నిపన్లూ చేస్తున్నారుకారూ? మెకానిక్సు, ఫిట్టర్సు, గుమాస్తా—అందర్నీ మేకుల పురుగులు, పుస్తకాల పురుగులూ అంటున్నారా?"—ఇలా అంటూపోతాడు. ఎవరింటికేనా భోజనా నికి వెళితే "ఈ అవకూర సరిగ్గా కుదరలేదండీ. ఇంకొంచెం ఉడికాక పొయ్య వలసింది", అనీ, లేకపోతే 'ఈ పులిహోరలో పులుసు పచ్చివాసన వేస్తోంది, కొంచెం వెచ్చగిల్లించి తగల్నిస్తె ఇంకా మజాగా ఉండేది—' అనో సలహా లివ్వడమే. ఆడవాళ్ళూ వాళ్ళ మొగవాళ్ళూ ఆశ్చర్యపడ్డట్టు నటించడం, హేళనగా నవ్వుకోడం, 'నా కొచ్చిన శాస్త్రం మరిచిపోడం ఎందుకు? నాకురాని విద్యలు నేర్చుకోడం ఎందుకు?— నాకెవరూ ఉద్యోగాలు చూసిపెట్టక్కర్లేదు. కాస్త పెట్టుబడి పెట్టండి. ఫస్టుక్లాసయిన హోటలుపెట్టి చూపిస్తాను నాతడాఖా' కాని వాడికి తెలిసిన వంట హోటలు వంట కాదని వాడికి తెలియదు.

ప్లాట్ఫారం టికెట్ యిచ్చేసి బైటపడుతూఉంటే 'ఏమండోయ్— కులాసా?' అని మృదువైన పలకరింపు వినబడింది. పక్కకి తిరిగి చూశాను.... ....

'నమస్కారం రమాదేవిగారూ!.... ఏమిటి ఎవర్నైనా దిగబెట్టడాని కొచ్చారా?'

రమాదేవి పెంకెతనంగా నవ్వింది. 'దిగబెట్టడానిక్కాదు బాబూ, సాగనంపడానికి! ఇరవై రోజులైంది. మా అన్నయ్య తోడల్లుడు; కొత్తగా పెళ్ళయిందిగా, పెళ్ళాన్ని తీసుకు చక్కా వొచ్చాడు. హైదరాబాద్ చూడ్డానికని. మా ఒదినగారు ఊళ్ళోలేకపోయినా మాకు తప్పిందిగాదు. వర్షాల, ధర్మమా అనీ గవర్నమెంట్ హాలీడేస్ అనీ మొత్తం ఇరవైరోజులు తీసుకుంది, ఘటాలు కదిలేసరికి'— మన్లో మనమాట సుమండీ— మళ్ళీ మా అన్నయ్యతోగాని ఒదినతోగాని అనేరు!'

'థాంక్స్!'

'అదేమిటండోయ్—?'

'అంతేగా మరి!— మీరు మీ అన్నయ్యతోనూ ఒదినతోనూ చెప్పలేని వొకానొక మాట చెప్పేటందుకు నన్ను సెలెక్ట్ చేసుకున్నందుకు!'

రమాదేవి నవ్వింది.

"అబ్బా. ఏం చుట్టాలోకాని పర్‌ఫెక్ట్ బోర్‌డమ్. ఎన్నాళ్ళు తిని వెళ్ళిపోయినా పర్వాలేదుగాని— ప్రసంగాలు?— గవర్నమెంటు పనీ. సైట్‌సీయింగూ ప్రోగ్రాం వేసుకొని ఆయనగారు ఒచ్చేడు. ఆ కాలక్షేపం సరిపోక మధ్య నా గొడవ ఒకటీ, ఆయనకి'— గడియకోసారి నా స్కూల్ గురించి జీతం సంగతీ అడుగుతాడు. భోంచేస్తున్నంత సేపూ నా వంట మెచ్చుకోడంతో సరిపోతుంది— లేకపోతే ఆయనగారి నూలీమేరీడ్ వైఫ్‌గార్ని వండమంటానని భయం కాబోలు. ఇంక టైమ్ దొరికితే చాలు; నా మేరేజ్ సంగతి ఆయనకో సైడ్ బిజినెస్‌లా అయికూచుంది!"

"మీరలా ఆగ్రహించడం నాకు చాలా సంతోషంగా వుంది." అన్నాను నేనూ పెంకెతనంగానే నవ్వుతూ.

"అదేమిటి, మళ్ళీను?"

"అంటే మరేమీలేదు.... మీకు పెళ్ళి కాలేదన్న విషయాన్ని లోకులు గుర్తిస్తున్నారని మీరు తెలుసుకోడం, వాళ్ళు మీ పెళ్ళి ప్రసక్తి తేవడాన్ని మీరు మృదువుగా ఖండించడం—ఇలాంటివి వుందే, ప్రస్తుతం మీరు పెళ్ళికి చాలా సుముఖంగా వున్నారన్న విషయాన్ని తెలియజేస్తాయి— పదిహేను పదహారేళ్ళ

అమ్మాయిని, ఏమే బావని పెళ్ళాడతావుటే అంటే; "ఛో నాన్నా!" అంటుంది చూసేరూ, అలా లేవూ మీ మాటలు?"

"—సరిపోయింది, సజ్జు!..."

"పోనీలెండి; మీకు లోపల ఆనందం, పైకి ఆగ్రహం తెప్పించే విషయం మాట్లాడ్డం నాకు క్షేమం కాదు...ఇంటికేనా?"

"ఆఁ'— ఒకసారి మీరూ రాకూడదూ?"

వెళ్ళొచ్చు, కాని, వెళితే నరసింహం ఒదిలిపెట్టడు. అతని కిప్పుడు ఈ వయసు పెరిగిన కన్య వివాహసమస్య చాలా బాధాకరంగావుంది. అందులో దింపుతాడు నన్ను. ఏవేనా సంబంధాలు చూస్తున్నావా అంటాడు. లేకపోతే ఫలానా సంబంధం ఎలావుంది. నీ అభిప్రాయ మేమిటి, అంటూ వివరాలు ఏకరువు పెడతాడు.

బస్సెక్కాం.

"చిన్నప్పుడు పెళ్ళి చేసేస్తె బాగుండిపోను" అంటాడు నరసింహం. "ఎందుకు చేసేపుకావూ" అంటే అప్పుడలా అయిపోయిం దంటాడు. పది హేనేళ్ళకి స్కూలు ఫైనల్ ప్యాసై. ఇతను మొట్టమొదటి సంబంధం తెచ్చిన నాడు— "నాకు పెళ్ళొద్దన్నయ్యా, నే చదువుకుంటా" నన్న చెల్లి మాటలు ఎంతో యింపుగా వినిపించివుంటాయి. అప్పుడైతే డబ్బో, చదువో, అందమో, గుణమో ఏదో చూసి తృప్తిపడి అయిందనిపించేసేవాడు... ఏడెనిమిదేళ్ళు గడిచిపోయాయి. ఇప్పుడు రమాదేవి గ్రాడ్యుయేట్ అయి, రివిన్యూ డిపార్టు మెంట్లో టైపిస్టుగా, గుమాస్తాగా రెండేళ్ళు పనిచేసి. బియ్యీడీ అయి, టీచర్గా చేస్తోంది. ఇపుడు చూడబోయే వరుడిలో గుణం కనబడాలి. అందం కనబడాలి, చదువు కనబడాలి. డబ్బుకూడా వీలయినంతగా కనబడాలి. ప్రూడెన్స్ అనే ముసుగు వెనక చంపుకోలేనన్ని కోరికలు వుంటాయి— నిజమే. అప్పుడు పెళ్ళి చేసేస్తె ఆకారం, సంస్కారం, భాషా, భావాలు ఏవీ యిప్పుడామెలో ఉన్నట్లు వుండకపోవచ్చును. కాని. అలా ఆలోచిస్తూ కూచోడం సంప్రదాయం కాదు.

నే ననుకున్నట్టుగానే నరసింహం, ఒక పేపర్లో ఎడ్వర్టైజ్మెంట్ కి, ఎర్రసిరాతో చుట్టూ బోర్డర్ గీసి— రమ కోసం— అని వ్రాశాడు. కుశల ప్రశ్నలు అయ్యీ అవగానే "ఇదిచూడు—" అంటూ నా కందించాడు.

"ఇది మీ కోసంట, మీరే చదవండి" అని రమాదేవి కిచ్చాను.

"ఐతే పైకి చదువు. అతనూ వింటాడు" అన్నాడు నరసింహం.

రమాదేవి చదవసాగింది "కావలెను—"

"గవర్నమెంట్ ఆఫ్ ఇండియాలో ఒక ఉన్నత పదవిలోవున్న ఒక ఆంధ్ర బ్రాహ్మణ యువకునికి వధువు కావలెను. వధువు భారతదేశంలో ఏ రాష్ట్రానికి చెందినా యిబ్బందిలేదు. తగు మాత్రం అందంగావుంటే చాలు.

"కాని వధువుకు ఇరవైయేళ్ళు దాటి వుండాలి. ఇంగ్లీషు, హిందీ, తెలుగు- ఈ మూడు భాషల్లో ఏదో ఒకటి ధారాళంగా మాట్లాడ్డం రావాలి. ముఖ్యమైన అర్హత మరిన్నీ ఏమిటంటే, వధువుకు ఆంధ్ర బ్రాహ్మణ భోజనం బాగా అవగతమై, అది తయారు చెయ్యడం క్షుణ్ణంగా తెలిసుండాలి. ఈ ఆఖరు విషయంలో ఏ మాత్రం వెసులుబాటూ కుదరదు. పరీక్షపెట్టే హక్కును వరుడు పొంది వున్నాడు. పరీక్ష అవమానం అని భావించని కన్యలే ఈ ప్రకటనకి జవాబివ్వడం మంచిది....'

రమాదేవి పేపరు నేలకేసి కొట్టి 'ఎవడో 'పిచ్చివెధవలాగున్నాడు!' అంది.

నరసింహం విచారంగా మొహంపెట్టి 'నువ్వు పెద్ద పెసిమిస్టువి రమా' అన్నాడు.

'ఎక్స్‌క్యూజ్మీ—' అన్నాను నేను. 'మీ పెళ్ళి విషయంలో మళ్ళీ జోక్యం చేసుకుంటున్నాను—ఇందులో అసందర్భం ఏముందండి?'

'అసందర్భానికేముంది?—భారతదేశం మొత్తంమీద ఎందరు యిరవైయేళ్ళు దాటిన పెళ్ళికూతుళ్ళున్నారో తెలుసుకుందికి పేపర్లో వేసినట్టుందిగాని-నిజంగా వధువు కావలసి వేసిన ప్రకటనా ఇది? దీంట్లో పెట్టిన క్వాలిఫికేషన్సు ఇండియాలో అందరికీ సరిపోతాయి!' రమాదేవి.

'అన్‌ది కాంట్రరీ—ఈ ప్రకటనలో స్కోప్ ఆంధ్ర బ్రాహ్మణ అమ్మాయిలకే పరిమితం అయివుందని నా నమ్మకం.' అన్నాడు నరసింహం. 'నువ్వు చెప్పినట్టు ఏ పార్శీ అమ్మాయో సింధీ అమ్మాయో ఎప్లయ్ చేసిందనుకుందాం. ఆవిడకి ఇంగ్లీషు, హిందీ మాట్లాడ్డం ఒచ్చే అనుకో—అయితే ఆంధ్ర బ్రాహ్మణ భోజనం మాటేమిటి?'

'బాగా చెప్పావ్'—ఇంటర్వ్యూలో కూఁ ఇప్పుడూ ఆ పనే చేస్తూ
పెట్టో, ములక్కాడలు ఆవాపిండీ పెట్టో కూరవండమంౘ..కమించేను........
కుంటూ.

'అతను పెట్టే పరీక్ష అలాగే వుంటుందంటారా?' అంది రమాదే.

'అలాగే వుండొచ్చు; ఇంచుమించు....లేకపోతే ఓ థియరీ పేపెర్ని ముందుగా ఇస్తాడో' అన్నాను....నాకూ నవ్వొచ్చేస్తోంది. ఆ సబ్జక్టే అలాటిదా?

'నన్ను అడిగితే అది మంచి పద్ధతేనంటాను—' అన్నాడు నరసింహం. 'మీ అమ్మాయికి పాటొచ్చునన్నారూ?—ఏదీ ఓసారి అమ్మాయిని అలా నడవమనండీ, చూద్దాం! అనే కుంటి వెధవ ప్రశ్నలు వేసే వాళ్ళకంటే ఇదెంతో దర్జాగా వుంది!' అన్నాడు నరసింహం.

'అబ్బబ్బా! మీ ఇద్దరూ బుర్రకథట్రూప్ వాళ్ళలాగా నన్ను ఊదర గొట్టేస్తున్నారు;'

'నిన్ను ఊదర కొట్టాలని కాదు రమా, అలా డిస్కస్ చేస్తుంటే పాయింట్లు ఒస్తాయి—ఇంక అన్నిటికీ మించి, వయస్సు ఇరవై దాటాలన్నాడు. తల్లీ దండ్రీ బంధువులూ అంతా వున్న పిల్లలకైతే శ్రమపడీ భ్రమపడీ తగిన సంబంధం అయినా కాకపోయినా తగిన వయస్సనిపించే యీడులో మూడు ముళ్ళూ వేయించేస్తున్నారు. ఇరవై దాటినవాళ్ళు అరుదే.'

'ఆ విషయం మాత్రం నేనొప్పుకోను. ఇరవై దాటినా పెళ్ళి కానివాళ్ళు కోకొల్లలు! వీధికి ముగ్గురేసి వుంటారు! కట్న పిశాచి మహత్యం ఏమని చెప్పను!'

'సరే సరే—అందులోకి వెళ్ళొద్దు మనం. అదిప్పుడు తేలదు....ఉన్న పళంగా నువ్వు దీనికి ఎప్లయి చెయ్యడమే!'

'ఏమో ఆయన వంట టెస్టు చేస్తానంటే నాకేమిటో దిగులుగానే వుంది.'

నేను నవ్వాను 'ఇందాకే కదండీ, ఆయనెవరో. మీ వంటలు అద్భుతంగా ఉన్నాయంటూ రైలెక్కాడు!'

## 3

పదిహేను రోజులైంది.

ఆ రోజు నేను ఆఫీసుకి పోవాలని తొందర పడుతూవుంటే రమాదేవి వచ్చికూచుంది.

'మీతో పది నిమిషాలు మాట్లాడాలి. ఎక్కడికేనా వెళ్ళి ఆఫీస్‌కి లేటొస్తానని ఫోన్ చేసిరండి' అంది.

'పది నిమిషాలే అయితే ఫోన్ చెయ్యనక్కర్లేదు.'

'ఓ అరగంట ఆలస్యం అయినా కావచ్చు.'

'అలా అయితే మీరు సాయంత్రం రావచ్చు'అన్నాను నవ్వుకుంటూ. 'పదండీ, రోడ్డుమీద నడుచుకుంటూ డిస్కస్ చేసుకుంటూ పోదాం. రహస్యానికి రోడ్డంతా భద్రమైన ప్రదేశం మరొకటి లేదు!'

'రహస్యం అని నేనన్నానా?'

'కాకపోతే మరీ మంచిదీ.'

'మీరిలా మాటకు మాట చెప్పుకుంటూ తాత్సారం చేస్తే అరగంట అవనూ అవుతుంది: నేను మాట్లాడబోయేది అలాగే వుండిపోతుంది. అదీగాక; అలా తొందరగా పంపులోంచి నీళ్ళుపడ్డట్టు మాటాడలేను సుమండీ. ప్లీజ్. వెళ్ళి ఫోను చేసిరండి.'

'సరే వెళ్తానుగాని సంగతేమిటో క్లుప్తంగా చెప్పండి సస్పెన్సు భరించలేక పోతున్నాను.

' ఏం లేదు. మీరు ఢిల్లీకి ఏదోఆఫీసు పనిమీదవెళ్తున్నారటగా! నాకు యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఇరవై ఎనిమిదిన ఇంటర్వ్యూకి రమ్మని ఆర్డర్ పనిపేరు. మొన్నటి పెళ్ళి ఎడ్వర్టైజుమెంటాయన పదిహేను ఇరవై అయిదు తారీకున మధ్య హైదరాబాద్ ఒస్తున్నాను. ఆ తేదీల్లో ఊళ్ళో ఉంటారని భావిస్తున్నాను, అని వ్రాశాడు, అంచేత, ఈ ఇంటర్వ్యూ అయిపోయేదాకా మీ ఆఫీసు పని వాయిదా వెయ్యగలరేమో. అలా అయితే మీరు నేనూ కలసి ఢిల్లీ వెళ్ళచ్చు. లేకపోతేమా అన్నయ్యని తీసుకువెళ్ళాలి—— అని!'

'అబ్బ!—నిజంగా మీరన్నట్టు పంపులోంచి నీళ్ళ పడ్డట్టే మాట్లాడా రండి.... ఉండండి ఫోన్ చేసి వొస్తాను.... ఆ కాయితాలు తీసి ఏదేనా మడత పేచీ వెయ్యడానికి వీలు ఉంటుందేమో చూద్దాం.'

పక్కవాటాలో డాక్టరుగారిఇంట్లో ఫోన్ఉంది. వాళ్ళ ఫోన్ అవసరం ఒచ్చినప్పుడుతప్ప వాళ్ళతో మాట్లాడ్డం కుదరకుండా ఉందే అని వాళ్ళ ఫోన్

అవసరం వచ్చినప్పుడల్లా విచారిస్తూ వుంటాను. ఇప్పుడూ ఆ పనే చేస్తూ డబ్బాలో పదిహేను నయాపైసలు వేసి కార్యక్రమానికి ఉపక్రమించేను........ అయింది.

ప్రయాణం. అందులో గవర్నమెంట్ పని—వాయిదా వెయ్యడాని కేముంది, పెద్ద? డబ్బు ఎడ్వాన్సు కావాలని నోట్ రాస్తేసరి—బిల్లు పాసై ఎకౌంటెంట్ జనరల్‌కి వెళ్ళి వచ్చేసరికి పదిహేనురోజులు కళ్ళు మూసుకుని .... గడిచి పోతాయి.... అనుకుంటూ తిరిగి వొచ్చాను. ద్వారం దగ్గిర్నుంచే 'చెప్పండి.' ఇంటూ లోపలికి అడుగుపెట్టాను.

ఆశ్చర్యం!— లోపల రామనాథం కూచుని ఉన్నాడు!!! రమాదేవి అతన్ని చూసి లోపలికెళ్ళి నట్టుంది. టీపాయ్‌మీద ఆమె వొదిలివెళ్లిన పెన్ను, పెన్సిలు పరీక్షిస్తున్నాడు రామనాథం.

'హల్లో! ఎన్నాళ్ళ కెన్నాళ్ళ కెన్నాళ్ళకి! ఏమి టిలా సడెన్‌గా ఊడి పడ్డావు, మేఘంలేని మెరుపులాగ!!.... ఉత్తరమేనా రాయకూడదా, ఫలానాచోట ఉన్నానని ఫలానాచోట పనిచేస్తున్నానని?' అన్నాను.

రామనాథం తీరుబాటుగా ఊపిరిపీల్చుకుని '—పొద్దుట జి.టి.లో వచ్చాను. పదింటివరకూ కూచుని, మీ ఆఫీసుకి ఫోన్ చేసేను. వాళ్ళు యీ ఎడ్రస్ చెప్పేరు. మళ్ళీ ఆఫీసుకి పారిపోతావేమో అని టాక్సీ వేసుకుచ కా వచ్చాను!' అన్నాడు.

రమాదేవి వెనుక ద్వారం దగ్గిర అవుపడింది. 'నే వెళ్ళిరానా రామ దాసుగారూ? సాయంత్రం మా యింటివేపొస్తారా?'

'ఓ యస్.—కాని. ఇదుగో ఇతను మా ఫ్రెండ్, రామనాథం.... ఎక్కడ్రా ఉంటం?'

'ఢిల్లీ!'

'ఢిల్లీలో ఉంటున్నాట్టండి.... ఈవిడ రమాదేవిగారోయ్. బి. ఏ.. బి. ఇ.డి టీచర్‌గా వుంటున్నారు. మా ఫ్రెండ్ నరిసింహం సిస్టరు. పైగా మాకు వేలువిడిచిన పింతల్లి కూతురుకూడాను—ఢిల్లీలోనే ఈవిడకూడా త్వరలో ఓ వుద్యోగం అయ్యేటట్టుంది. ఈ నెలాఖర్ని ఇంటర్‌వ్యూ వుందిట.'

'ఓ హో, అలాగా!' అని నమస్కారం చేసేడు రామనాథం. 'ఢిల్లీలో బిగ్ విగ్స్‌ని చాలామంది నెరుగుదునండీ. నా వల్ల ఏదైనా సాయముంటే చెప్పండి. తప్పకుండా చేస్తాను!—ఎప్పుడు ప్రయాణం?'

రమాదేవి కృతజ్ఞతతో నవ్వింది. 'మెనీ థాంక్స్— ప్రయాణం సంగతే ఇంకా డిసైడ్ కాలేదండీ. ఈయనక్కూడా ఏదో ఆఫీసుపనుందట ఢిల్లీలో ఆయన్తో కలిసి వెళదా మనుకుంటున్నాను. ఇంతకీ ఇంటర్వ్యూ నెలాఖర్ని లెండి' అంది.

'నేనూ ఇరవై వాటాకే బైల్దేరుతున్నాను. అంతా కలిసే పోవచ్చు.'

'ఔనుగాని, ఎందులో వున్నావు ప్రస్తుతం? ఆ మధ్య రైల్వేలో వున్నా వన్నారు.'

'ఆ రైల్వే ఉద్యోగం అంతా బోగస్' అన్నాడు రామనాథం....'—కేట రింగ్ మేనేజర్స్ కావాలంటే ఎప్లయ్‌చేసి. వెళ్ళాను నీకుతెలుసుగా, నాకుకుకింగ్ మీదే ఇంటరెస్ట్. రైల్వే కేటరింగ్!- వెధవది, కత్తిచెయ్యందే లాభాలు రావను కునే ఘటాలు!- ఆఫ్‌కోర్స్: జీతం నాలుగువందల ఎనభై యిచ్చేవారనుకో రెండేళ్ళు చేసేసరికి మొహం మొత్తింది-అయినా ఓ సంగతి ఒప్పుకోవాలి: నేను విడిచి పెట్టకుండా రెండేళ్ళపాటు చెయ్యగలిగిన మొదటి ఉద్యోగం, అది!-'

'మరి ఇప్పుడో?,

'ఇప్పుడు ఢిల్లీలో అశోకా హోటల్ లేదూ. గవర్నమెంటాఫ్ ఇండియా ది!— దాంట్లో వెజిటేరియన్ సెక్షన్‌కి హెడ్‌కుక్‌గా ఉంటున్నాను. ఎనిమిది వందలిస్తున్నారు, మొన్నే కన్‌ఫర్మ్‌చేసేరు. ......చిన్నప్పుడు అన్నిరకాల వంటలూ తెలుసుగదా అని మహా గర్వపడేవాణ్ణి. కాని మాంసాహారశాఖని నిర్లక్ష్యం చేసేనని తెలియలేదు. అసలు కాంప్లికేటెడ్ థింగ్స్ అన్నీ అందులోనే ఉన్నాయి, పైగా ఈ అశోకా హోటల్‌కి విదేశాలనించొచ్చే అతిథులెక్కువ. వాళ్ళంతా మాంసాహారులే. అంచేత ఆ సెక్షన్ హెడ్డే మొత్తం హోటల్ హెడ్ కింద పరిగణించబడతాడు. అతని జీతం కూడా ఎక్కువే—నాది ఎనిమిది వందలనించి పదహారు వందలవరకు. అతనిది వెయ్యినించి పద్దెనిమిదివందల వరకూను!'

నేనూ రమాదేవీ నోళ్ళు తెరుచుకొని వింటున్నాం.

'—అయితే అక్కడ చేసేది వెజిటేరియన్-అంటే వంకాయకూరా బెండ కాయ వేపుడూ అనుకుంటున్నావేమిటి!—కస్టర్డ్ పుడ్డింగ్, కార్న్ పుడ్డింగు— జెల్లీలూ అవీ యూజ్‌చేసి—అంతా అదోరకరకం, కన్‌ఫ్యూషన్!: ఇంటికొచ్చి ములక్కాడల చారు చెయ్యడం మరిచిపోయి పప్పులో కాలెయ్యడం!—'

'ఏదయితే సేం, పంపేకదా! మొత్తానికి పట్టిన పంతం మానేవుగాదు!" అన్నాను, ఆనందంలో కొట్టుకుపోతూ.

'—మరేం చెయ్యమంటావు? మీ అందర్లాగా నేను ఏక్సిడెంటల్‌గా ఓ డిగ్రీ సంపాదించినా, దాంట్లోనే సేల్సుటాక్స్ ఆఫీసర్ పనీ, టుబాకో ఇనస్పెక్టర్ పనీ, హోండ్లూమ్ ఇన్‌స్పెక్టరు పనీ చేసే తెలివుందని నాకెప్పుడూ అనిపించేది గాదు—చదువులో చదివిందానికన్నా నాకు మొదట్నుంచీ ఒచ్చిన శాస్త్రం గొప్ప దని నా విశ్వాసం! ఇందులో బాగా కృషిచేసేను. ఇప్పటికి అయిదారు పుస్తకాలు రాశాను. 'ఇండియన్ స్టఫ్; అండ్ హౌ ఇటీజ్ కుక్డ్' అన్న పుస్తకం ఒకటి రాసేను. అందులో మన దేశవాళీ కాయగూరల్లోంచి ఎలాంటి పుడ్డింగ్స్ తయారు చెయ్యొచ్చో వుదహరిస్తూ వివరించేను. దాన్ని ఒక అమెరికన్ పబ్లిషర్ పాతిక వేలకి కొనుక్కున్నాడు. ఆ పుస్తకం ఇండియాలో రిలీజ్ చెయ్యలేదింకాను— అమెరికన్స్ ఆ పుస్తకంలో సూత్రాల్ని రికగ్నైజ్ చేస్తే మన గోదారి కాలవ గట్లంటే కాదు; పొలాలన్నిట్లో కూడా వంకాయలు పండించినా సరే, పౌను రూపాయి చొప్పున పంపినాసరే, అమెరికన్ డిమాండ్ మీటవలేం....'

'పెళ్ళి చేసుకున్నావా?'

'ఏమిటి చేసుకోడం?— ఎంతసేపూ సినీమా పాటలు పాడుతాను; డేన్సులు చేస్తాను; అల్లికలూ, కుట్లూ, చదువూ సంధ్యా అంటారేగాని నాకు వంట బాగా ఒచ్చునన్న పిల్ల తటస్థపడలేదు దాసూ!—ఫర్ ఎగ్జాంపుల్ విసుగెత్తి ఆ మధ్య ఒక ప్రకటన వేసేను—బాబోయ్, నాకు చదువూ, సంధ్యా, కులం, భాషా, ఆఖరికి అందం వీట్లతో పనిలేదు. ఇంత అన్నం, వంకాయకూరా కొబ్బరికాయ పెరుగుపచ్చడీ చేసి పెట్టగల పిల్లకావాలి, అని!— హోల్ ఇండియాకి ఆరు అప్లికేషన్లు ఒచ్చాయి! ఇద్దరు అరవ అమ్మాయిలూ, ఇద్దరు ఆంధ్రులూ, ఒక కన్నడం అమ్మాయీ, ఒక పంజాబీ ఆవిడా!'

నేను రమాదేవి వేపు చూశాను. ఎర్రగా అయిపోయింది ఆమె మొహం. తల దించేసుకుని, మళ్ళీ ఏమనుకుందో మామూలుగానే ఉందామని ప్రయత్నిం చింది.

మావాడు దంచేస్తూనే ఉన్నాడు. '—పంజాబీ ఆవిడని ఢిల్లీలోనే చూసేను. ఏం లాభంలేదు. కన్నడం అమ్మాయిని మద్రాస్ రమ్మని, అక్కడికి వెళ్ళేను. అక్కడే అరవమ్మాయిలిద్దర్నీ చూసేను. అఫ్‌కోర్స్ అరవ్వాళ్ళిద్దర్లోనూ ఒకా

మెకి మన వంట బాగా తెలుసు. మనవీ వాళ్ళవీ వంటలు ఒకటేననుకుంటుందామె; అది రైటు కాదనుకో. కాని, తెలుగువాళ్ళ పులుసుకీ-అరవ్వాళ్ళ సాంబారుకీ; తెలుగువాళ్ళ పచ్చడికీ అరవవాళ్ళ చెట్నీకీ, తేడాలు చాలా డిటెయిల్డుగా ఆ అమ్మాయికి తెలుసు. అయ్యంగార్ల పిల్ల. వైజాగ్‌లో ఆనర్స్ సగంచదివి వాళ్ళ నాన్నగారు పోవడంవల్ల మధ్యలో మానేసిందట. ఎంత అందంగా ఉందను కున్నావ్! చిదిపి దీపం పెట్టొచ్చునన్న మాట పుట్టడానికలాంటివాళ్ళే కారణం —ఐతే ఆ అమ్మాయి తెలుగుగాని, ఇంగ్లీషుగాని కర్ణకఠోరంగా వున్నాయి.... ఎలాగో భరించొచ్చు, వేరే దారి లేకపోతేను—ఇహ నిన్న నెల్లూర్లో ఒకమ్మా యిని చూసేను. శ్రీహరి! నెల్లూరు ములుగొలుకులు తప్ప వేరే బియ్యమే ఉండ వంటుంది—దోసావకాయ పెట్టడం ఎలాగా అంతే తెలీలేదు. రెడ్ల అమ్మాయి- ఇంకేం లేదబ్బాయ్ ఈ ఊళ్ళో ఒక కేండిడేట్ ఉంది. ఆవిణ్ని చూసి, నాకు తగిన పిల్ల లేదనుకొని, ఢిల్లీ వెళ్ళిపోతాను. లేకపోతే ఆ అయ్యంగార్ల పిల్లే నాకు రాసిపెట్టుందో—!'

నేను గొంతుక సర్దుకున్నాను. రమాదేవివేపు చూశాను, ఎందుకేనా మంచి దని. 'చెప్పెయ్యమంటారా?' అన్నట్టు కళ్ళెగరేశాను. ఆమె 'పోదురూ'అన్నట్టు నవ్వింది. నాక్కావలసిందదే.

'నువ్వు వేశావన్నమాట ఐతే, ఆ ఎడ్వర్టైజ్‌మెంట్!'

'ఆఁ! నేనే, నువ్వు చూశావా?'

'చూడ్డమేమిటి, ఓ అమ్మాయిచేత ఎప్లయ్ చేయించాను.'

'అలాగా? అర్థం రాలేనా!—ఐతే నన్ను దృష్టిలో పెట్టుకునుండవు.'

'నిన్ను దృష్టిలో పెట్టుకోలేదనుకో, ఐనా అర్థం రాలే. నువ్వు కూడా అర్థాడివే'

మళ్ళీ రమాదేవివేపు చూశాను, ఆమె అలా సిగ్గుపడ్డం నాకు చాలా ఆహ్లా దాన్ని కలిగించింది. కొంచెం వినోదంకూడా.

'సరే చూద్దాం. ఆవిడకి పదిహేనునించి ఇరవై అయిదు లోపుగా వస్తా నని వ్రాసేను' అన్నాడు రామనాథం.

'నాకదీ తెలుసు—ఆవిడ ఎవరో కాదు—ఎదురుగా ఉన్నావిడే.'

'వ్వాట్!' అని, పర్స్‌తీసి, అందులో ఓ కాయితం బైటికిలాగి, 'పి. రమ'

అన్నారు, మీరేనా? మరి మీరు బి.ఏ, బి.ఇడి కదా, అవన్నీ అందులో చెప్ప లేదే!' అన్నాడు రామనాథం.

'అవన్నీ రాసుకోమని అందులో లేదుగా!' అంది రమాదేవి. కంఠం గుర గురలాడి, మాట బోధపడలేదు.

'సో! మీకు టైమివ్వకుండా ఇంటర్వ్యూ చెయ్యబోవడం నాది పొరపాటే ....ఆల్‌రైట్. సాయంత్రం మీరు సిద్ధమేనా? మీ యింటికి భోజనానికొస్తాం. అది, నేనూ వీడూ కలిసి!' అన్నాడు రామనాథం రమాదేవితో.

రమాదేవి తల అంగీకరించింది.

'ఏమేం వండమంటావో చెప్పూ!' అన్నాను.

'ఏదైనా ఫర్వాలేదు!'

'అలా అయితే వంట కుదరకేం జేస్తుంది?'

'ఎందుక్కుదురుతుంది?—ఒకవేళ కుదిరినా అది కేవలం యాక్సిడెంటల్. నిజంగా సబ్జక్టు తెలిసి వొండుతున్న స్త్రీలు చాలా తక్కువ భాయ్. కుదిరితే యాక్సిడెంట్. కుదరకపోతే నేచురల్. అంతే—మాటవరసకి చారుతీసుకో. ఆంధ్రదేశంలో వున్న ఎనభై లక్షల కుటుంబాల్లో రోజూ ఏ పూటకాపూట చేసే ఎక్స్పెరిమెంట్ అవునంటావా-కాదంటావా?'

'దుష్టుడా!' అన్నాను. కాని, ఏదో నిజంలాగానే వుందా వాక్యం.

'ఇంతకీ ఆయనకోసం యేం వండాలో నాకు తెలుసులెండి- వంకాయ కూరా. కొబ్బరికాయ పచ్చడి, ములక్కాడల చారూ' అంది రమాదేవి ధైర్యంగా, సిగ్గుపడుతూనే.

'కరెక్ట్. అవే చెయ్యండి, చూద్దాం....వంకాయ కూరైతే మాత్రం అంత తేలికనుకోకండి!'

రమాదేవి యిప్పట్నించే వండేస్తుందా అన్నంత తొందరగా లేచి, తడ బిడే అడుగుల్తో వెళ్ళింది. రామనాథం ప్రగల్భంగా నవ్వాడు, 'పేపరు ఈజీగా యిచ్చేసినట్టున్నావురా!' అన్నాను,

'పేపర్ ఈజీ అయినా వేల్యుయేషన్ స్ట్రిక్టుగానే ఉంటుందోయ్. రిక మెండేషన్లూ అవీ పని చెయ్యవ్' అన్నాడు రామనాథం.

***

("జ్యోతి" మాసపత్రిక-ఫిబ్రవరి 1968)

# పూర్ క్రీచర్స్

సాయంత్రం అయిదు దాటింది.

జనం హోటలుకి ముమ్మరంగానే వస్తున్నారు, కళ్ళకి చేతులకీ తీరుబాటు వుండడమే లేదు. అలా అంతపనిలో కౌంటర్ దగ్గర కూచున్నా సరే ఎందుకో నిద్దర ముంచుకొస్తున్నాది. అంతలా అలిసిపోయున్నాను. ఎప్పుడో పన్నెండున్నరకనగా వెళ్ళేడు, మా అల్లుడు ఇంటికి. "ఇప్పుడే వొస్తాను మామయ్యా, చిన్న నిద్దరతీసి; రాత్తిరి రెండో ఆట కెళ్ళేంకదూ. నిద్దర్లేదు" అని. అలాగే నిద్ద రోతున్నాడు గాబోలు, ఇప్పటిదాకానూ.

"ఏంటయ్యా! ఎక్కడ సంపాదించేవు, ఈ సెర్వర్లూ ఈ సజ్జూను!" అని విసుక్కుంటూ ఇచ్చ రూపాయి టేబిల్ మీదున్న గాజుపలకమీద ఫెడీమని కొట్టేడు, వో పెద్దమనిషి. దాంతో ఈ లోకంలో పడ్డాను.

మా హోటలుకి రోజూ వాడుకగా వొచ్చే మనుషుల్లో వొకడూ అతను. పోల్చేను.

"ఏం బాబూ? ఏమైంది?" అన్నా; వీలైనంత అణకువ నటిస్తూనూ.

"ఏమిటైందంటా వేమిటయ్యా, మెల్లిగాను. ఈ మాత్రం ఆ మాత్రం బేరం వుండేసరికల్లా ఏదో గుడ్డిలో మెల్ల అన్నట్టుగా మీ పొప్రయిటర్లు బాగా మర్యాదగానే వుంటారుగాని సెర్వర్లకి కళంభూమ్మీదుంటాయా? రవ్వదోసెతెచ్చి కాఫీ యివ్వరా నాయనా అంటే క్షాఫీ ముందిచ్చేసి రవ్వదోసె కాలుస్తున్నాదండీ అంటాడు! నాయిగున్నరకనగా దూరేను, ఈ గూభ్యంలో. ఇప్పుడూ, బయట పడ్డం!—ఎప్పుడొచ్చినా నేరకపోయి ఒచ్చాంరా బాబూ అనిపించేస్తే ఇంకెందుకూ హోటళ్ళు?" అంటూ మధ్యలో రిస్టువాచీ నా కళ్ళముందు ఆడిస్తూ నేనిచ్చిన చిల్లర లెక్కపెట్టుకోకుండా జేబులో పడేసుకుని వెళ్ళిపోయాడు. అది చిరాకన్న మాట.

అతనింతసేపూ కూచుని వెళ్ళిన చోటువేపు అనుకోకుండా చూసేను. అక్కడ వీరయ్య సప్లయ్ చేస్తున్నాడు. వీరయ్య అసలు వసంత విహార్ సప్లయరు; రిలీవర్‌గా వొచ్చేడు. లేకపోతే అక్కడ నటేశన్ వుండవలసింది.

నటేశన్ వున్నా మురుగన్ వున్నా నేనింక హోల్లోకి తిరిగి చూసుకోనక్కర లేదు. ఒచ్చేవాళ్ళ మొహాలూ- వెళ్ళేవాళ్ళ బిల్లులూ శ్రద్ధగా చూసుకుంటే చాలును. ఇవాళ శనివారం- వాళ్ళిద్దరికీ ఆఫ్.

నటేశనూ, మురుగనూ మాణిక్యాల్లాంటివాళ్ళు. కస్టమర్స్ కిచ్చిన మర్యాద, నా వ్యాపారానికి ఎంత సాయం చేసిందో మాటల్లో చెప్పడం కష్టం. ఇద్దరూ వో రోజే ఆఫ్ ఎందుకర్రా బాబూ అని నేను ఒప్పుకోలేదు. మా అన్న దమ్ములిద్దర్నీ విడదీస్తారాసార్ అని వాళ్ళూ ఒప్పుకోలేదు. సరేపొండి అని నేనే ఒప్పుకున్నాను, ఆఖరికి.

వాళ్ళిద్దరూ అన్నదమ్ములుకారు. ఒక ఊరివాళ్ళేమో అంటే అదీ కాదుటా, పోనీ ఒక స్కూల్లో ఒక క్లాస్‌లో చదువుకున్న వాళ్ళు, ఒక ఆఫీసులో పనిచేసిన వాళ్ళు, ఒక రూమ్‌లో అద్దె కుండినవాళ్ళు—ఇలాంటి వాళ్ళెవరేనా సరే, అంత స్నేహంగా వుండడం మీ రెవరూ యెక్కడా చూసుండరు. ఒక్క హోటల్లో సెర్వర్లుగా వుండడంవల్ల ఇలాంటి గొప్ప స్నేహం ఏర్పడుతుందని నేను చెప్పడంలేదు- నేనేమీ చెప్పలేను. వాళ్ళ స్నేహం, ఆత్మీయతా యింతలా బలపడిపోడానిక్కారణం నేనూహించలేను, అసలు.

వాళ్ళు మా హోటలుకి సెర్వర్లుగా వచ్చిన పన్నెండేళ్ళలో కొద్దిసార్లు ఎప్పుడో అప్పుడప్పుడు—వాళ్ళింత స్నేహంగా వుండటానికి కారణం ఏమిటో కనుక్కోవాలని నాకు మహా అనిపించింది. నేనడిగినప్పుడల్లా పళ్ళన్నీ బైట పెట్టి నవ్వేసేవాళ్ళు. మరెవరు అడిగినా అంతేట. వాళ్ళ భాషలో ఏదేదో అనుకుంటారుట; పైగానూ.

వాళ్ళ మైత్రికి మా రుబ్బింగు భద్రయ్య చెప్పే భాష్యం చాలా పౌరాణికంగా వుంటుంది. ఎప్పుడో ఎక్కడో వీళ్ళిద్దరూ వొకరికి తెలియకుండా వొకరు ఓ పిల్లని, ఒకే పిల్లని ప్రేమించారు; ఆ పిల్ల వీళ్ళిద్దర్నీ ఆట్లాడించి చివరికి వీళ్ళిద్దరికీ మధ్య తగూ పెట్టింది; ఇద్దరూ కొట్టుకున్నారు; మళ్ళీ వాళ్ళలో వాళ్ళే ఇదంతా ఆ పిల్ల చేసిన కుతంత్రం అని కనిపెట్టి రాజీకి వొచ్చేరు— అంటాడు.

కొట్టుకొని రాజీకొచ్చిన తరువాత ఏర్పడ్డ స్నేహం మామూలు స్నేహం కంటె దిట్టంగా వుంటుందనే అభిప్రాయం మామూలు మనుషుల్లో చాలా ప్రచారంలో వుంది. అరెరె, కొట్టుకున్నాం సుమా అని పశ్చాత్తాపపడ్డ తరవాత

హఠాత్తుగా విలువలు తెలిసిపోయి ఇనుమడించిన ప్రేమాభిమానాలతో ఒకరొక్కరు చూసుకొంటారన్న మాట దీని కాధారం కాబోలు. ఏమైనా సరే, భద్రయ్య చెప్పిన భాష్యం చాలామంది నమ్మేరు. ఎందుకంటే, ఇద్దరు మొగాళ్ళు కొట్టుకుందికి ఆడదంత బలమైన కారణంలేదు, అంతస్తునిబట్టి ఆ కొట్టుకోడం పద్ధతీ, అది సృష్టించే చరిత్రా మారొచ్చు. ఆవేశంమాత్రం అంతటా వొకటే.

మొత్తంమీద ఇరవై నాలుగ్గంటలూ ఒకేచోట వుంటూ, ఒకేచోట తింటూ ఒకేచోటికి తిరుగుతూ వుండే ఈ మురుగన్ నటేశన్లు మా హోటలుకి సంబంధించిన జనం అందర్లోను ఉత్తమ స్నేహానికి వొక ఉత్కృష్టమైన ఉదాహరణ ఏర్పరచేరు.

రిక్షాలోంచి మా అల్లుడు దిగేడు. అమ్మయ్య అనుకున్నాను.

అతను చేసిన ఆలస్యానికి అతన్నెలా చివాట్లు పెడితే బావుంటుందా అని మాటలు వెతుక్కుంటున్నాను; అతను మెట్లెక్కి లోపలి కొస్తున్నంత సేపూ తీక్షణంగా అతనివేపు చూస్తున్నాను. అతను మాత్రం నా చూపులు లక్ష్య పెట్టక గబగబా గల్లాపెట్టి దగ్గిరకొచ్చి. 'వేగిరం రెడ్డిగారి హాస్పిటలుకి వెళ్ళు మామయ్యా' అన్నాడు. 'ఆ వెధవలిద్దరూ చిత్తుగా తన్నుకున్నారు.'

నా చెవుల్ని నేనే నమ్మలేక పోయేను. నటేశన్, మురుగన్– స్నేహానికి ఉత్తమమైన ఉదాహరణ– వాళ్ళిద్దరూ— కొట్టుకున్నారుట. చర్మాలు గీసుకు పోయి. నెత్తుర్లు కారుకుంటూ, బుర్రలు బద్ధలై హాస్పిటల్లో వున్నారుట.

* * *

'ఉండుండి. మా మంచిపని చేసేర్లెండి, మీ వాలి సుగ్రీవులిద్దరూను!' అన్నాడు డాక్టర్ రెడ్డి, నన్ను చూడగానే.

నా ప్రాణం ఉసూరు మంది.

'కొట్టుకుంటే కొట్టుకున్నారుగాని వాళ్ళనలా అనకయ్యాబాబూ' అన్నాను.

'మరేమి టనమంటారు? రామ లక్ష్మణు లనమంటారా, బలరామ కృష్ణు లనమంటారా?'

అతని పరిహాసానికి నొచ్చుకున్నాను. 'రామలక్ష్మణు లనవలసిందే. ఇవాళ ఏదో కొట్టుకున్నారని ఇన్నాళ్ళనించీ నేను చూస్తున్న వాళ్ళ స్నేహమంతా అబద్ధమయి పోతుందిటయ్యా?'

'సరేలే. 'ఏడో' కొట్టుకోడమా అది!' అంటూ డాక్టర్ రెడ్డి లేచేడు. 'పదండి, మీ రామ లక్ష్మణుల్ని చూద్దురుగాని' అన్నాడు వేళాకోళంగా నవ్వుతూ.

అతని వెనకాతలే వెళ్ళేను.

'వాళ్ళని వాలి సుగ్రీవులంటూనే పక్కపక్కని పడుకో బెట్టేరే!.... వేరే చోటుకి నో మంచం మార్చండి బాబూ మీకు పుణ్యముంటుంది! లేకపోతే ఒంటిమీద తెలివి రాగానే మళ్ళీ తన్నుకుంటారేమో' అన్నాను.

'అవునండోయ్!' అన్నాడు రెడ్డి, కళ్ళు పెద్దవి చేసుకుంటూ.

వాళ్ళిద్దరి మంచాలకీ మధ్య మా సర్వయర్ సుబ్బయ్య స్టూల్ వేసుకుని కూచున్నాడు. మమ్మల్ని చూసి లేచేడు.

'ఏమయ్యా, సుబ్బయ్యా! నువ్వు- నువ్వేనేమిటి, వాళ్ళిద్దర్నీ హాస్పిటలుకి తీసుకొచ్చేవు?' అని వాణ్ణి పలకరించేను.

'లేదండీ........ నే నుట్టినే. వాళ్ళిక్కడున్నారని కబురు తెలిసొచ్చేను.'

'నేనండీ, తీసుకొచ్చేను!' అంటూ మా పక్కనించి ఓ నల్లటి కుర్రాడు ముందు కొచ్చాడు. పాతికేళ్ళుండవు.

'సోమయ్యగారి మామిడితోట్లో నూతి దగ్గిరండీ, వీళ్ళిద్దరూ కొట్టుకోడం, మధ్యాహ్నం మూడున్నరకి-' అన్నాడా అబ్బాయి.

నేను ఆశ్చర్యంగా చూసి 'చెప్పు' అన్నట్టు కళ్ళూ బుర్రా ఆడించేను. 'ఊఁ' అన్నాను.

'నేను సమంగా అదే టైముకి రోడ్డుమీంచి సైకిల్ తొక్కుకుని వొచ్చేస్తున్నానండీ. తోట్లోంచి ఏవో అరుపులు వినిపిస్తూవుంటే ఏమిట్రా అని సైకి లాపి చెట్లల్లోంచి తొంగి చూసేనండీ. అఘార్తుగా వాడు (మురుగన్) వీడిమీదికి ఒక్క ఎగురు ఎగిరేడిండీ. ఇంకేమున్నాది, ఇద్దరూ కలబడ్డారు. సైకిలుకి తాళం వేసి తోట్లోకెళ్ళేను. ఇద్దర్నీ విడదీద్దామని మధ్యకెళ్ళేను. ఇద్దరూ నన్నడ్డు లెమ్మని గోలచేసేరు. అరె, మీకేమన్నా బుద్ధుందాలేదా, పదండి అవతలికని చెరో రెక్కా పట్టుకున్నానో లేదో, ఇద్దరూ వొక్కమాటు నన్ను దులిపేసేరు. దాంతో కిందపడ్డాను. ఇదుగో, కాలి మోకు గీసుకు పోయింది— పెద్దదెబ్బ కాదులెండి—'

'అసలెందుకు కొట్టుకున్నార్ట!'

'ఏమో!'

'మరి నువ్వు అంత దగ్గిరగా వెళ్ళేవుకదా, అడగలేకపోయావూ?'

'అడక్కపోవడమేం, అడిగేను!.... నాకు దెబ్బ తగలకముందేమో అసలు వాళ్ళని విడిపిస్తే చాలనుకున్నాను. వెంటనే ఎందుకో కనుక్కోవాలని నాకూ అనిపించింది, అసలేమిటర్రా, చెప్పండని మళ్ళీ వాళ్ళ మధ్య దూరేను.. నాతో మాట్లాడ్డం సంగతటుంచి, వాళ్ళలో వాళ్ళైనా అసలు మాట్లాడుకున్నారు గాదు.... ఫెడీ అంటే ఫెడీ అని వొకటే గుద్దుకోడం, ఒకటే కిందపడి దొర్లడం.... ఇంతట్లో వీడు (మురుగన్) వాణ్ణి నూతి చప్టామీదికి ఒక్క దెబ్బని విసిరికొట్టేడండి. దాంతో వాడిబుర్రబద్దలైపోయింద నుకున్నాను. వాడు పడి పోతూ పడిపోతూకూడా, గబుక్కునలేచి, అక్కడ ఇంత వలం దుడ్డుకర్ర ఒక టుంటే దాంతో వీడి బుర్రమీద ఒక్కటేసేడు. కొట్టుకుని కొట్టుకుని అలిసి పోయున్నారేమో, వాళ్ళ దెబ్బలు వాళ్ళే తప్పించుకోలేకపోయేరు .... ఇద్దరూ తెలివితప్పి పడిపోయేరు—'

"ఇంతకీ ఎందుక్కొట్టుకుంటున్నారో తెలీదంటావు."

"నాకు తెలీదు. తెలివొస్తే వాళ్ళే చెప్పాలి. అంతవరకూ బ్రహ్మరుద్రుల క్కూడా తెలీదు."

"అక్కడింకెవళ్లూ లేరా?"

"ఇంకొహడుంటే ఇంతలా కొట్టుకో నిద్దుం'వా? ఇద్దరం చెరోణ్ణీ పట్టు కొని పోలీస్ స్టేషన్‌కి తీసుకొచ్చి అప్ప చెప్పేద్దుం!"

"తరవాతేమిటైంది?"

"తరవాత ఇంకేముంది! రోడ్డుమీది కొచ్చి నలుగుర్నీ కేకేసి, ఓ రిక్షా ఆపి, మీ యిల్లు దార్లోనేకదా, అని మీ కప్ప జెబ్దామని తీసికెళ్ళేం—— వీళ్ళిద్దరూ మీ హోటల్లో సెర్వర్లని మాకు తెలుసున్లెండి—అక్కడ మీ అల్లుడుగారు కన పడి ఇక్కడికి తీసుకొచ్చేరు. అంతే."

"పోనీలే నాయనా; మంచి పని చేసేవు" అన్నాను. "పాపం, వీళ్ళ మూలంగా నీ క్కూడా దెబ్బలు తగిల్నట్టున్నాయ్."

"ఆఁ, దానికేముంది లెండి."

"ఊరంతా ఎక్కడా చోటైనట్టు ఎక్కడో ఆ సోమయ్యగారి మామిడి తోట్లో ఎందుకూ. ఈ కొట్టుకోడం?"

నా కెవరూ సమాధానం చెప్పలేదు.

డాక్టర్‌తో చెప్పవలసిన మాటలు చెప్పేసి ఈవెనింగ్ వాక్‌కి బయల్దేరేను.

* * *

చిరాకుగా వుంది. నిద్దరొస్తున్నట్టుంది. చల్లటి నీళ్లలో స్నానం చెయ్యాలని కోరిగ్గా వుంది. డాగా ఆకలేస్తున్నాది. ఇవన్నీ కాక మనస్సులో బాధ ఏదో పుట్టి ఒళ్ళంతా చిట చిట లాడుతున్నట్టుంది. వేగిరం వెళ్లొచ్చేయాలి.

వెధవలిద్దరూ పదిరోజులు హాస్పిటల్లో వుండాలిట. వ్యాపారం బాగా దెబ్బ తింటుంది, ఒక్కరోజు లేక పోయీ సరికల్లా ఇందాక అయిందిగా, శృంగభంగం ? .... అనుభవం వున్న పనివాళ్ళు. అలా వంటశాల్లోంచి ఇలా హాల్లోకి తెచ్చి అందించడమే కదా అనుకుంటాం గానీ, దానిలో ఇబ్బందులు దాన్లోనూ వున్నాయి. పాత సెర్వర్లు ....వీళ్ళతో పాత పేసింజెర్లకి చాలామందికి అలవాటు....ఎవడికి ఉల్లి చెట్నీయో ఎవడికి శనగ చెట్నీయో మొహం చూసి తెచ్చిచ్చేస్తారు. వాళ్ళు గుప్ చప్‌గా తినేసి ముచ్చటగా మూత్తుడునుకుంటూ కాతా బుక్కు అందుకొని రాసేసి వెళ్ళిపోతారు, ఏ రోజు కారోజు కొత్త పేసింజర్లే ఎక్కువైనా పాతవాళ్ళలో వొక్కడికియిబ్బంది కలిగితే వాళ్లూ ఊరుకోరు, మాకూ బాధే.

ఇవాళ తీరి కూర్చుని ఇంత ఘోరానికి తలపడ్డారు.

వ్యాపారం సంగతి అలా వుంచి, ఏమిటో వాళ్ళకి ఇంతలేసి దెబ్బలు తగిలేయంటే బాధగా వుంది. పన్నెండేళ్ళనుంచి వాళ్ళు మా హోటల్లో పని చేస్తున్నారు. పదేళ్ళనుంచీ వాళ్ళని మా యింట్లో మనుషుల్లా చూసుకుంటున్నాం. సరుకు మాష్టర్ని నమ్మం; వంట వాళ్ళనీ నమ్మం: పాలవాళ్ళని అసలేనమ్మం. వాళ్ళందరిమీదా వీళ్ళిద్దరి నిఘా ఉంటేనేగాని రోజు వెళ్ళదు. ఎక్కడో ఏదో

తగలడిపోతుంది. పంటవాళ్ళూ సప్లయర్లూ కుట్రలు చేస్తారు. వేళాకోళానికి చేసినా, సరుకులూ, సామాన్లూ దూబరా ధ్వంసం చేసేస్తారు. నేనా, మునపట్లా ఓపిగ్గా అన్నీ చూసుకోలేక పోతున్నాను. పెర్మిట్లూ డబ్బూ ఏర్పాటు చేసుకోడం, గల్లా పెట్టె దగ్గిర కూచోడం తప్ప, పొగలోకీ ఉక్కలోకీ వెళ్ళలేకపోతున్నాను. అల్లుడు సరేసరి. ఎప్పుడూ తనకి సరిగ్గా మర్యాద జరగడం లేదన్నట్టే పెడ తాడు, మొహం.

ఎందుకో, వీళ్ళిద్దరూ ఇలాగ కొట్టుకోడం !

భద్రయ్య చెప్తున్నట్టు ఏదేనా భామాకలాపం ఇందేమో. నా కెలా తెలియ నిస్తారు ?....కాఫీ హోటల్ ప్రొప్రయిటరు దగ్గిర సెర్వర్లు కూడా గవర్నమెంట్ డిపార్ట్ మెంట్ లో డైరెక్టర్ దగ్గిర యల్ డీ సీలాగ బెదిరిపోతూ అనుబంధానికి వ్యక్తిగత స్పర్శ లేకుండా చేసుకుంటే ఇలాటి వివరా లందవు.

పోతే—డబ్బు విషయంలో ఏదేనా పేచీ వొచ్చుంటుందా? అలా జరి గుండదు. వీళ్ళు సంపాదిస్తున్నదెంత, అందులో మిగిల్చే దెంతుంటుంది? ఏద్రో కారణం చెప్పి నెలజీతం సగం ముందే ఎడ్వాన్స్ తీసేసుకుంటారు— అది కూడా యిద్దరూ వొక్కరోజునే యిమ్మంటారు. ఏం చేస్తారో. ఎవరో వాళ్ళ దేశంలో ఉన్న వాళ్ళకి సంపుతారు గాబోలు.

కారణం ఏదైనా, మొత్తంమీద అజన్మ విరోధుల్లా కొట్టుకున్నారు.... వాళ్ళు మళ్ళా కలుసుకోవాలి.... ఒకర్నొకరు క్షమాపణ అడిగి క్షమించు కోవాలి.... ....అప్పుడు నా మనస్సు కుదుట పడుతుంది— వీళ్ళిద్దరూ ఈ కారణంమీద విడిపోతే చూస్తూ ఊరుకోగలనా!

నడిచి నడిచి సోమయ్యగారి మామిడితోట దాటేనని తెలుసు కున్నాను. టైమ్ చూసేను. ఆరు గావస్తోంది. రోడ్డు తూరుపు పడమర్లుగా వుంది. ముందుకి చూసుకొని నడుస్తూ వుంటే తిన్నగా కళ్ళలో పడుతున్నాయి సూర్య కిరణాలు. రోజూ ఇలాగే నడుస్తూ వుంటాను. రోజూ యిదే వేళ. రోజూ, ఇవాళ లాగే, అస్తమించ బోతున్న సూర్యబింబంలోకి చూడాలని అంతులేని కుతూ హలంగా వుంటుంది. చూస్తాను. చూస్తే సన్నటి మెరుగు పొలుసులు కళ్ళలో జీరాడి కళ్ళని అందమైన బాధలో పెడుతున్నాయి. కాని ఈ ఆకర్షణ ధన వ్యామోహంలా ఎప్పటికప్పుడే కొత్తగా వుంటుంది.

పాకలోకి వొంగి చూశాను. ఒక చాప పరిచి వుంది, గోడకి దగ్గిరి సాను ఆ చాపమీద గోడ వేపొకటీ ఇవతలి వేపొకటీ రెండు తల గడాలు అడ్డదిడ్డంగా పడేసున్నాయి. ఇంకొకటి నిలువుగా గోడకి నిలబెట్టుంది. పేకాట ఆడి వెళ్ళేరు ఎవరోను, పేక ముక్కలు ఎత్తలేదు. అలాగే పరిచేసి వున్నాయి.

ఇంత బతుకూ బతికి ఇంటి వెనకాతల చచ్చినట్టు ఈ మురుగనూ నటేశనూ ఆఖరికి పేకాటాడి కొట్టుకున్నారా? ఇది సంభవమా? వాళ్ళ స్నేహానికి ఈ సంఘటనకీ అనుపాతం కుదరడం లేదే!

పాకలో కెళ్ళేను. డబ్బులేసి పేకాటాడుకొనే వాళ్ళు కొట్టుకోడం దాకా వొస్తే, పేక ముక్కలు ఎత్తడం మరిచిపోతే డబ్బులు కూడా తీసి జేబుల్లో పెట్టుకొనే తెలివుండదు. ఈ పేకాట వెనకాతల ఏవేనా సీసాలూ గ్లాసులూ కూడ ఉన్నాయేమో చూడాలి.

చాప మీద నే ననుకున్నట్టు గానే చిల్లర డబ్బులు కూడా వున్నాయి. గూట్లోగాని మరెక్కడా గాని సీసాల వాసనలేదు. వీళ్ళు ఇంకా అ స్థాయి కి రా లే ద న్న మట.... ....

గోడకి చేరవేసిన తలగడా వెనకాతల ఏదో పంచిలాంటిది ఉన్నట్టుందే?....తలగడాని చిన్న తావు తన్నేను. ఘల్లున చప్పుడు చేస్తూ తోలు సంచి నిస్సహాయంగా చాప మీద పడ్డది.

డబ్బు....

సందేహంలేదు, ఈ డబ్బే, ఈ తోలు సంచే, కారణం....

తోలు సంచి చాలా తమాషాగా వుంది. చుట్టూరా పకడ్ బందీగా కుట్టేసి వుంది. ఒక వేపు నుంచి సన్నటి సందుంది, దాంటోంచి డబ్బులు వెయ్యొచ్చునేగాని తియ్యడానికి వీల్లేదు, లోపల సన్నటి తోలు పొర వొకటి డబ్బులువేస్తే తెరుచుకోడానికి చాలినంత స్ప్రింగ్ ఏక్షన్‌తో వుంది, డబ్బులు తియ్యాలంటే అ పొర గట్టిగా అడ్డొస్తుంది. అటూ ఇటూ తిప్పి, దులిపి, బలాత్కారం చేసేను, ఒక్క నయాపైసా కూడా రాలలేదు, మంచి పనివాడితనం పుపయోగించి అందంగా క్లిష్టంగా కుట్టేరు.

తోలుసంచికి ఓ వేపు మలయాళంలోనూ ఇంకోవేపు ఇంగ్లీషులోనూ,

ఆర్. నటేశన్, కె మురుగన్ అని గిల్టు అక్షరాలతో అందంగా రాయబడి వుంది.

పాపం, పూర్ క్రీచర్స్-ఈ డబ్బు కోసం కొట్టుకున్నారన్న మాట.... అయినా ఈ ఇరవయ్యో శతాబ్దంలో కూడా ఆషాడభూతి కథలో సన్యాసి లాగ డబ్బు ఇలా సంచీలో పోసి దాచుకుంటారా?

ఏది ఏమయితేనేం-ఈ డబ్బు కోసం- పవిత్రమైన సుదీర్ఘ స్నేహ బంధాన్ని క్షణంలో మరచిపోయి చావుబెబ్బలు కొట్టుకున్నారు.... వెధవ డబ్బు-అ_ ఎంతుంటుంది. మహా వుంటే యాభై ఉంటుంది. నూరుంటుంది? లక్ష రూపాయలున్నా మాత్రం- అలా కొట్టుకోడమా? ఛీ!

ఆలోచించుకుంటూ రోడ్డుమీది కొచ్చేను.

ఇది వాళ్ళిద్దరి జాయింట్ బ్యాంక్. దీంట్లో ఎన్నో స్వేదబిందువుల ఫలం వుంది. దీనిమీద వాళ్ళ కెన్నో ఆశలున్నాయి. దీని కొక లెక్క ఉన్నాదో లేదో! లెక్కా డొక్కా వున్నా లేకపోయినా దీంతోఏంచెయ్యాలో వాళ్ళు ముందే అనుకొని వుంటారు-ఏముంది, హోటలు సెర్వర్లిలాగే కష్టపడి దాచి దాచి స్వంతంగా హోటలు పెడతారు. ఈ మూల ధనంమీద ఆశలు ఆధారంగా వాళ్ళిద్దరూ అహర్నిశలూ కష్టపడ్డమే కాక ఒకర్నొకరు అంటిపెట్టుకుని కూడా వుంటున్నారు. దీనివల్ల వాళ్ళ లోపల ఒకరిమీద ఒకరికి అనుమానం కాబోలు - అయినా, దీనివల్ల వాళ్ళ స్నేహం చిక్కబడింది. స్నేహబంధంవల్ల యిది పవిత్రమైంది.

అయినా, ఇవాళ వాళ్ళిద్దరికీ దెబ్బలాట పెట్టిందీ యిదే—చెప్పలేం-ఎంత విచిత్రం!

డాక్టరుకి చాలా డబ్బు ఇవ్వవలసొస్తుంది. గ్లూకోజ్ ఇంజక్షన్లూ, రక్తం ఎక్కించడం ఆలాటి వేవో చాలా చెప్పేడు రెడ్డి. వంద రూపాయలు దాటొచ్చు వాళ్ళని నా కుటుంబంలో మనుషుల్లా చూడమన్నాను. అంత జాగర్తగా చూసి మరీ వైద్యం చెయ్యమని రెడ్డికి చెప్పేను. ఎంత డబ్బైనా సరే నేనే యిస్తాను.

పాపం-పూర్ క్రీచర్స్-క్షణంలో ఒళ్ళు మరచిపోయారు....వాళ్ళకేదేనా ఉపకారం కూడా చెయ్యాలి. నిజానికి ఈ సంచితో ఈ డబ్బు మళ్ళీ వాళ్ళకి ఇచ్చెయ్యడం కూడా ఓ వుపకారమే. కాని అది నా విషయంలో కేవలం డ్యూటీ. ఇది వాళ్ళకి జాగ్రత్తగా అందజేస్తాను. ఇదే కాదు. వాళ్ళు హోటలు పెట్టుకోడానికి మూలధనం తక్కువయ్యేటట్లయితే మరో యాభయ్యో వందో - ఎంత కావలిస్తే అంతకూడా నేనే యిస్తాను....

ఈ విధంగా వాళ్ళు నా వ్యాపారానికి చేసినమేలుకి బదులు తీర్చుకుంటాను.

నయం— ఇది ఇంకెవరి చేతుల్లోనైనా పడితే ఎంత ప్రమాదం జరిగి పోయేది!

ఒరే అబ్బాయిలూ, డబ్బు పాపిష్టిది; ఈ డబ్బుకోసం ఇంకెప్పుడూ కొట్టు కోమని ప్రమాణం చెయ్యండి— అని చెప్పి ఈ సంచి వాళ్ళకి వొప్పచెప్తాను. బాగా బుద్ధి చెప్తాను.

అదే మంచిది.

* * *

స్నానం చేసొచ్చేసరికి; మా మనవడు (తొమ్మిదేళ్ళవాడు) నేను నాపరుపు మీద దుప్పటీ కింద పెట్టిన ఆ తోలుసంచిని ఎప్పుడు కనిపెట్టేశాడో! కనిపెట్టి, పరుపుమీద మఠం వేసుక్కూచుని, ఆ సంచీ ఎలా తెరవడమా అని తికమక పడుతున్నాడు. వాడి గడుసుతనానికి ఏదో పుత్రోత్సాహం లాంటి నవ్వొచ్చింది. కొడుకైనా వాడే, మనవడైనా వాడే, నాకు. వాడికి ఇప్పట్నుంచే డబ్బూ, ఆ జాగర్తా అవన్నీ—ఊఁ—

'ఒరే, గోవిందు! అవలా పెట్టి వెళ్ళు!'

'ఇందులో ఎంతుంది తాతా'

'వెళ్ళరా, అంటే!'

'ఎంతుందో చెప్తే!'

అమ్మాయిని పిల్చి వాణ్ణి తీసికెళ్ళ మన్నాను.

జాగర్తగా చూసేసరికల్లా వాడాసంచినిబ్లేడుతో కొద్దిగా కోసేడేని తెలి సింది. నేనింకో రెండు నిమిషాలు రాకపోతే వాడు ఆ సంచీని పూర్తిగా తెరిచే వుండేవాడు.

అది సరే—ఇప్పుడిదెలాగ! పాపం, వాళ్ళ సంచి—ఎన్నాళ్ళనించో వాళ్ళ క్కూడా లెక్క తెలియని పద్ధతిలో డబ్బు దాచుకుంటున్న ఈ తోలుసంచి ఇలా కోసేశాడే, వీడు! దీనికి వాళ్ళ కేమని చెప్పడం?

—అఁ దానికేముంది బ్రహ్మాండం. ఇలా యిలా, మా మనవడు ఏదో తెలీక బ్లేడుతో చిన్న గంటు పెట్టేడని చెబితే సరి.

కాని, అసహ్యంగా వుంది. ఆగంటు.

పోనీ, పూర్తిగా కోసేసి, ఆ లోపలున్నదంతా తీసి వేరే సంచీలోనో, డబ్బీలోనో జాగర్త పెడితేసరి—

అప్పుడు అందులో వున్న డబ్బు ఎంతో కూడా సరిగ్గా లెక్క తెలుస్తుంది. లేకపోతే ఈ గోవిందుగాడు మళ్ళా వొచ్చి చులుపుకుంటే కొంత రాలి పడొచ్చు.

ఎంత సొమ్ముందో, అందులో?
ఎంత సొమ్ముకోసం వాళ్ళిద్దరూ అంత ఆవేశంలో పడ్డారో?
ఎంత, ఆ సొమ్మెంత?
గబగబా తలుపేసి బ్లేడు తీసి జాగ్రత్తగా ఆ తోలుసంచీ అంచు కోసేశాను. పరుపుమీద అంతకన్నా జాగ్రత్తగా మఠం వేసుకు కూర్చుని అందులో వున్న వన్నీ వొలకబోసేను.
అందులో—
నే నిందాక తాటాకు పాకలో నా చేత్తో పోసిన చిల్లర యధాతథంగా వుంది.
తొమ్మిది అర్ధరూపాయి నాణేలు........
పన్నెండు విచ్చ రూపాయలు....
ఇరవై మూడు బంగారు సవర్నులు.
రాళ్ళు పొదిగిన ఉంగరాలు; నాలుగు సాదావి మూడు—
ఇవి కాక
నోట్లు- మడతపెట్టి దారంవేసి కట్టి వున్నాయి.
అవి ముందుగా అక్కడ పెట్టి సంచీ అంచులు కుట్టినట్టున్నారు. లేకపోతే అవి ఆ సన్నటి సందులోంచి దూరవు.
పది రూపాయిల నోట్లు....ఒకటీ....రెండూ....అబ్బ! ముప్పైఒక్కటి —ఓరిబాబో—యాభై రెండు—!
నూరు రూపాయల నోట్లు....ఒకటీ....రెండూ....మూడూ....నాలుగూ....పదీ....పదిహేడు—ఇరవై నాలుగూ....ముప్ఫయి మూడూ....ముప్ఫయ్యేడు!
మొత్తం-అమ్మబాబోయ్-
వీళ్ళ దగ్గిరింత డబ్బుందా?- వాళ్ళకి తెలుసునా. ఇంతుందని?- ఇంత డబ్బుంటీకూడా నా హోటల్లో పనిచేస్తున్నారా!?
వాళ్ళ సిగ్గోసిరి- సమయానికి నాకు తెలిసిందిగాని లేకపోతే రేపో నేడో వేరే హోటలు పెట్టేసేవాళ్ళే- నాకు టోకరా యిచ్చేవాళ్ళే.
నే నెంత అదృష్టవంతుణ్ని!
ఎవరికేనా తెలుస్తుందేమో!
ఎలా తెలుస్తుంది? వాళ్ళకి నేను అక్కణ్నించి తీసి తెచ్చేనని తెలియాలి; వాళ్ళు ఎవరితోనైనా చెప్పాలి. అప్పుడు కదా, తెలియడం!
వాళ్ళెవరికీ పోయిందన్న సంగతేనా చెప్పరు....చెప్పలేరు!
నాకు తెలుసు- అది ఎక్కడో ఎత్తుకొచ్చిన సొమ్మే!
నయం- ఇది ఇంకెవరి ఛేతుల్లోనైనాపడింది కాదు।

* * *

(తరుణ; మాసపత్రిక; ఆగస్టు 1973)

# ఉత్తరకుమార ప్రజ్ఞ

"అక్కరకు రాని చట్టము" అదీ, ఆ వ్యాసం పేరు. రచయిత, డాక్టరాఫ్ లెటర్స్.

'అక్కరకు రాని చుట్టము' అనుండాలి కాబోలని కొమ్ము పెడదామని కలం తీసేను. కాని వార పత్రికాఫీసులో ఇలాటి (ప్రూఫ్) రీడర్లుంటారని ముందే తెలిసిన వాడిలా, ఆ ఒక్క అక్షరం మిగతా వాటికన్నా కాస్త పెద్దదిగా, రెండు మూడుసార్లు దిద్ది వ్రాసేను. కనక, దిద్దేముందు కొంచెం ఆగి, వ్యాసం చదివేను.

కుటుంబ నియంత్రణ !

ఆ విషయంపై మా పత్రిక ఇంతవరకు నిశ్శబ్దంగా వుంటూ వచ్చింది. ఎడ్వర్టైజుమెంట్లు తప్ప మరోటి ఏదీ బుది పూర్వకంగా వెయ్యడం లేదు; పర ధ్యానంగానూ లేదు!

స్త్రీలశీర్షిక ద్వారా ఈ సబ్జక్టు మా పత్రికలో చొరబడి పోదామని చేసిన ప్రయత్నం ఇంతా అంతాకాదు. స్త్రీలు రాసే వ్యాసాల్లో (వాళ్ళు దేన్ని గురించి రాసినాసరే) తెలియకుండా ఈ సబ్జక్టు మీద ఒకటి రెండు వాక్యాలు దొర్లడం నేను తరుచుగా గమనిస్తూవుంటాను.

మాట వరసకి. ఒకావిడ కాశ్మీరో కైలాసమో విహారయాత్రకి వెళ్ళిం దనుకోండి, వాళ్ళాయనగారు కష్టపడి తీసిన ఫొటోల్తో సహా ఆ అనుభవాలు వ్యాసంగా రాసి పంపిస్తూ, "మాకిద్దరేగా పిల్లలు! అది చూసి అక్కడి వాళ్ళెంతో ముచ్చట పడ్డారు. చిన్న కుటుంబానికి మించిన సుఖం ఏముంది, జీవితంలో? తృప్తిని మించిన ఆదర్శం లేదని మన భారతీయ సంస్కృతి ప్రబోధిస్తూ వుంటుంది. గాని ఇద్దరు పిల్లల్తో తృప్తిచెందడం మన వెనకటి తరాల వాళ్ళకి ఎందుకు అలవాటవలేదో?"— ఇలా రాసుకుంటూ పోతారు. పూబోణికి ఈ బాణి నేర్పిన వాణిని మౌనంగా స్మరించుకుంటూ ఆ వాక్యాలను ఎర్రపెన్సిలుకి ఆహుతి చేస్తూ వుండడం నాకు మామూలు.

కాని, ఈ విషయంమీద ఈ డాక్టరాఫ్ లెటర్స్‌గారు సరాసరి వ్యాసం రాసి పంపేరు. అది ఎందుకో నన్ను బాగా ఆకర్షించింది. అలవాటుగా ప్రక్కన పెట్టేసిందాన్నే మళ్ళా తీసి చదివాను,

కేరళ రాష్ట్రంలో నట—

వివాహానికి కనీసవయోపరిమితిని నిర్ణయిస్తూ ప్రభుత్వం వొక చట్టం చెయ్యాలని సంకల్పించిందట. అది, దాదాపు పది పన్నెండు రోజుల క్రితం అన్ని ప్రముఖ దిన పత్రికలలోను వచ్చిన ఒక వార్త.

వధువుకు ఇరవై ఒకటి, వరునికి ఇరవై ఏడు సంవత్సరాలు కనీసం వుంటేగాని పెళ్ళిళ్ళు జరగటానికి వీల్లేదని చట్టం తేవాలని ఆ ప్రయత్నం.

అలా చట్టం తెచ్చిన తరువాత, పదహారేళ్ళ ఆడపిల్ల తల్లి కావడానికీ, ఇరవై ఏళ్ళ బాలుడు తండ్రి అయిపోడానికీ ఇప్పట్లా అవకాశం వుండదని, అందువల్ల ఏ మనిషి పుట్టుకు ఆ మనిషికి సంతానోత్పత్తి అవకాశం చాలా తక్కువయిపోతుందని, జనాభా సమస్యను ఈలోగా వధూవరులు పరిపూర్ణంగా ఆకళింపు చేసుకోగలరు గనుక "కళ్ళు మూసితెరిచేలోగా తల్లిదండ్రులు అయిపోవడ"మనే సాంఘిక దురాచారం నశిస్తుందని; ఈ ముఖ్యమైన వుపయోగం వల్ల ఈ చట్టం బహుళ జనాదరణ పొందే అవకాశంవుందని, ఆ చట్టం వెనుక కలగిన చెలగిన ఆలోచన. అదికూడా ఆ న్యూస్ ఐటమ్‌లో సూచన ప్రాయంగా ఎవరో ఉద్ఘాటించారని ప్రచురింప బడింది.

"డాక్టరాఫ్ లెటర్స్" గారు ఈ వ్యాసంలో, ఆ చట్టము "అక్కరకురాని చట్టము" అని అభివర్ణించారు:-

"దేశమంటే మనుషులోయ్" అన్న మహాకవి వాక్యంతో నేనేకీభవిస్తాను. కాని, దేశం సమస్య మనుష్యులది కాదు మనుష్యుల సమస్యే దేశానిది అని గమనించ ప్రార్థన" అని రచయిత ప్రారంభించేరు ఆ వ్యాసాన్ని....

ఈ దేశంలోని మనుష్యులకు ఒకరకం జీవనం ధర్మప్రాయమైనప్పుడు ఆ ధర్మ పరిరక్షణార్థం, జాతి, దానికి తగిన పథకాలు రూపొందించుకోవాలే తప్ప; కృత్రిమమైన పద్ధతులతో అవినీతికరమైన పథకాలు అమలుచేసి, ప్రజలు శతాబ్దాల తరబడి అనుష్ఠిస్తున్న ధర్మానికి ఘావుదెబ్బతీస్తూ కొత్త సమస్యల్ని వుత్పన్నం చేయరాదని ఆయన ఖండించారు.

భౌతిక, భౌగోళిక పరిస్థితుల వలన, ఈ దేశస్థులకి శారీరక, మానసిక అవసరాలు. ఇవి అని లక్షల కొద్ది ఏళ్ళక్రితం నిశ్చయమైనాయి. పదకొండు-పద్నాలు గేళ్ళ మధ్య ఆడబిడ్డ రజస్వల కావడం ఇక్కడి శీతోష్ణస్థితి నిర్ణయం. వివాహానికి కనీస వయోపరిమితిగా ప్రభుత్వం నిర్ణయించబోతున్న ఇరవ య్యొకటనే వయసు వచ్చేవేళకు, ఆడపిల్ల స్త్రీ అయిపోయి ఎనిమిది నుంచి పదేళ్ళ వరకు అవవచ్చు. శారీరక అవసరాల్ని పదేళ్ళు మరుగుపెట్టి మనస్సును అదుపులో పెట్టుకోడం అనేది ఎంతకష్టమో, అనుభవించే వోపిక లేకపోతే వూహించి చూడొచ్చు. చట్టరీత్యా వివాహం సాంసారిక జీవితం వీల్లేని పెద్ద వయసు వాళ్ళు, ఆ చట్టం రాకముందు వివాహితులైపోయి సాంసారిక జీవితాన్ని నడుపుతున్న చిన్నవాళ్ళని చూడ గలుగుతారు. మనసు కట్టుకోలేని వారు మార్గం తప్పిఅధర్మ వర్తనులైతే జాతి పురోగమనం వ్యక్తి జీవనాన్ని అభివృద్ధిలోకి తేలేకపోగా, వ్యక్తిజీవితం ద్వారా జాతి పురోగమనానికి, సంస్కృతికి, ధర్మా నికి ముప్పు సంభవించడం అనివార్యం. కనుక, మీ చట్టం వివాహాన్ని నిషేధిం చిన చేతుల్తోటే వివాహేతూర్వ వ్యభిచారాన్ని ప్రోత్సహిస్తుంది; ఇప్పటికే పాశ్చాత్య ప్రభావం వల్ల దిగజారిపోతున్న నైతిక విలువల్ని ఇంకా అథః పతితం చేయబూనడంశోచనీయం, నీచం.

*  *  *

"అక్కరకురాని చట్టము" మా వార పత్రికలో ప్రచురించాను. పత్రిక వెలువడి ఐదురోజులైంది. మరుసటివారం పత్రిక దాదాపు అంతా అచ్చు అయి పోయింది. ఉత్తరాలపేజి, సంపాదకీయం ఇలాంటివేవో ఉన్నాయి, ఉత్తరాలన్నీ వాకచోట పోగుచేసి. మంచీచెడూ ఎంచుకుంటూ ,ఎర్రపెనిసిలు తీసుకుని ఉత్త రాల పొడవును తగ్గించుకొంటూ వున్నాను.

"ఇవాళ్టి ఉత్తరాలు సార్" అని ఆఫీసుబోయ్ ఒక చిన్నకట్ట ఇచ్చాడు.

"ఇదేదో కథలా వుంది" అనుకుంటూ అందులోంచి ఒక కాగితాల మడత తీశాను.

కథకాదు, ఉత్తరమే.

ఐదు పేజీలుంది-

"'"అక్కరపరాని చట్టము మీ పత్రికలో ప్రచురించేరు. ఇది చాలా తొందరపాటుతో కూడిన చర్య" అని మొదలైనది, ఆ ఉత్తరం-

డాక్టరాఫ్ లెటర్స్‌గారు ఇచ్చిన వాదం అంతా అభివృద్ధి నిరోధకంగా వుందని ఆ ఉత్తరంలో ఆరోపించ బడింది.

మానవజాతి మీద ప్రకృతి, ప్రకృతి మీద మానవజాతి, తమతమ ఆధిక్యతలను నిరూపించుకోడానికి నిరంతరం జరిగే సంఘర్షణే లక్షలాది సంవత్సరాల నుంచి ఈ భూగ్రహంలో జరుగుతున్న ప్రపంచ వ్యాపారం. ఎప్పటికప్పుడు మానవజాతి ప్రకృతిమీద చిన్నచిన్న విజయాలు సాధిస్తూవచ్చినా,అవి ప్రకృతిలో రహస్యాలు కనుక్కోడం క్రిందికే వస్తాయి, అంతిమ విజయం ప్రకృతిదే. ఎందుకంటే మానవజాతి తాము పెరిగినంతగా ప్రకృతిలో ఆహార వసతులు పెంచలేక పోవడమే. ఈ విషయం అందరు శాస్త్రజ్ఞులు అంగీకరించిందే. ఎప్పటికైనా తిండిలేక మలమల మాడిపోయే ఆపద మానవజాతికి రానున్నది. ఆ దుష్ట దినాన్ని వాయిదా వెయ్యడమే కుటుంబనియంత్రణ పథకాల ఉద్దేశం.

కనుక. కుటుంబనియంత్రణ ఏదో ఒక దేశానికి చెందిన సమస్యఅని గాని ఒక జాతి సంస్కృతికి పరిమితమైన సవాలు అనిగాని అనుకోవడం కేవలం మూర్ఖత్వం.

—ఈ విధంగా సాగింది, ఆ ఉత్తరం

రచయిత-

కాదు రచయిత్రి - శ్రీమతి- ఆర్. శకుంతలా రాణి... బి.ఎ.

అటూ ఇటూ తిప్పి ఎడ్రసు వుందేమోనని చూశాను.... ఉన్నది. కేరాఫ్. కుటుంబ నియంత్రణ అసిస్టెంట్ డైరెక్టరు గారి ఆఫీసులో అప్పర్ డివిజన్ గుమాస్తా... హంసవాడ.

ఉత్తరం చివరంటా చదివాను. ఆవిడ ఆర్గుమెంటు చాలా సాధికారికంగా వుంది. రచనకూడా, కొంచెం గడ్డుగా వున్నప్పటికీ పదునుగానే వుంది.

ఇంతవరకు వచ్చిన ఉత్తరాల్లో ఒకటి రెండు. మాపత్రికను కుటుంబ నియంత్రణా వ్యతిరేక పత్రికగా వుదహరించాయి. పాఠకుల అభిప్రాయాలకి, రచయితల రచనలకి సంపాదక వర్గం ఏకీభావం గాని బాధ్యతగాని లేకపోవచ్చునని, ఎక్కువమంది అనుకోకపోవచ్చు. ప్రభుత్వమే అలా అనుకోకపోవచ్చును.

ఎలాగా ముగ్గులోకి దిగాం కదా, కుటుంబనియంత్రణా వ్యతిరేకత మాత్రమే ఎందుకు?

అని—ఇలా ఆలోచించి. శకుంతలా రాణీగారి ఉత్తరం అచ్చు వేశాను.

* * *

ఆరు వారాలయింది.

అక్కరకురాని చట్టము వ్యాసం మీద అటూ ఇటూ ఉత్తరాలు చాలా ఎక్కువగా వస్తున్నాయి, వెనకెప్పుడో ఒక ప్రముఖ రచయిత్రి రాసిన ఉద్వేగ పూరితమైన నవల సీరియల్‌గా వేస్తున్నప్పటి కంటెకూడా ఎక్కువగా వస్తున్నాయి.

ఆ ఉత్తరాలు సామాన్య పాఠకులూ రాస్తున్నారు. డాక్టర్లు, లాయర్లు, ఫిలాసఫీ: సోషియాలజీ చెప్పే లెక్చరర్లు కూడా రాస్తున్నారు. వారందరితో బాటు "డాక్టరాఫ్ లెటర్స్" గారు, శకుంతలారాణి గారు కూడా రాస్తున్నారు. అందరితోబాటు రాసినా, డాక్టరాఫ్ లెటర్స్‌గారూ శకుంతలారాణిగారు మాత్రం సరికొత్త ఆర్గుమెంట్స్‌తో. పరిమిత కుటుంబాల వుదాహరణల వుదంతాలతో వ్రాస్తూ, ఇవి ఉత్త ఉత్తరాలుకావు పంచవర్ష ప్రణాళికలు అనిపించేస్తున్నారు. చాలా ఇంటలిజెంట్‌గా, ఇంటరెస్టింగ్‌గా వుంటున్నాయి. అవన్నీ.

ఈ వారం డాక్టరాఫ్ లెటర్స్‌గారి వాదానికి సంబంధించినవి వేస్తే, మరుచటి వారం శకుంతలారాణిగారి వాదానికి సంబంధించినవి వేస్తూ, ఆ కలన్ అలా నిలుపుకొంటూ వస్తున్నాను.

"బిజీగా వున్నారా?" అంటూ వచ్చి ఎదురుగా కూర్చున్నాడు. మా బిజినెస్ మేనేజర్ రావుగారు.

"అబ్బే లేదండీ" అన్నాను, చిరునవ్వు తెచ్చుకొని "వారపత్రిక రేపు విడుదలకదా;" అన్నాను; ఒకవేళ బిజీగా వున్నా, నాతప్పులేదని తెలియబరుస్తూ.

"అది కాదూ, ఉత్తరాల శీర్షికలో ప్రచురిస్తున్న వాటికి పారిషికంతో యిస్తున్నామా, మనం?" అని సూటిగా అడిగారు రావుగారు.

"అన్నిటికీ ఇవ్వడం లేదు-"

"అదే, నేను అడగాలనొచ్చాను. అన్నిటికీ ఇవ్వనప్పుడు-?" సిగరెట్ దమ్ములాగుతూ ప్రశ్న వెయ్యకుండా తప్పించుకున్నారు బిజినెస్ మేనేజరు గారు.

డొంకతిరుగుడు అనవసరం.

"-కుటుంబ నియంత్రణ గురించి వాద ప్రతివాదాలు జరుగుతున్నాయి. మన పత్రికలో అవి స్వీకరించాం. వాటిల్లో మౌలికంగా, నిర్మాణాత్మకంగా వున్న వాటికి పారితోషికం ఇవ్వాలని (అదీ చాలా స్వల్పం) నేను నిర్ణయించేను. నిజానికి అవి ఉత్తరాలుకావు అవన్నీ వ్యాసాలు. కాని విడిగా వ్యాసాల్లాగా వాట్ని స్వీకరించి ప్రచురిస్తే కొన్ని ఇబ్బందులున్నాయని నేను వాటికి పాఠకుల పేజీ ఇచ్చాను. రచనకి మనం యిచ్చిన ప్రాధాన్యాన్ని బట్టికాక, రచనలో సరుకును బట్టి పారితోషికం యివ్వడం ఆరోగ్యం కదా." అన్నాను "ఐ ఎగ్రీ" అన్నారు మేనేజర్‌గారు; అలవోకగా, నా చేతిలో కాగితం అందుకుంటూ; ఈ వారం పత్రికలోకి అచ్చుకిస్తున్న శకుంతలారాణిగారి ఉత్తరం అది-క్రింద. "ఈ చర్చ ఇంతటితో ఆఖరు" అని ఒక రిమార్కు అప్పుడే రాశాను, నేను.

"అరెరె! "అని లేచారు రావుగారు "ఇదేమిటి, ఈ అన్యాయం!?" అని కంగారు పడ్డారు.

"అన్యాయం ఏముంది? ఎనిమిది వారాలై జరుగుతోంది, ఇంకా ఎందుకు?"

"మీకు బోర్‌గా వుందా?"

"నాకు లేక పోవచ్చు, కాని పాఠకులకి బోర్‌గా ఉండొచ్చు కదా."

"పాఠకులకి బోర్‌గా లేకపోతే?" అని పెంకెనవ్వు నవ్వారు రావుగారు.

"లేదని ఎలా?"

"లేదు బాబూ, లేదు! ఎనిమిది వారాల కిందట కదూ, మీరీ ఫోరమ్ ఓపెన్ చేసేరు! సేల్సు గ్రాఫ్ చూడండి-అలా అలా పైకి వెళ్ళిపోతోంది. ఈ వ్యాసాలు వెయ్యకముందు మన వారపత్రిక వారానికి ఇరవై ఎనిమిదివేలు అమ్మాం. ఇప్పుడు ముప్పయ్యారువేలు - సర్క్యులేషన్ ఎలా పెరుగుతోందా అని పేజీలు తిరగేసి చూశాను, నాలుగో వారంనుంచే. కొత్త సీరియల్స్ లేవు. సినిమాలు కథలు, వ్యాసాలూ అన్నీ మామూలే. కనక ఈ ఉత్తరాలతోనే

సర్క్యులేషన్ పెరిగిందని నేను మీకు మనవి చేస్తున్నాను-" అన్నారు మేనేజర్‌గారు.

నేను ఆశ్చర్యపడ్డాను. జనంలో ప్రభుత్వ ప్రచారాల ద్వారా, ఆకాశవాణి ద్వారా, బస్సుల వెనకా రైళ్ళలోను, అక్కడా ఇక్కడా విశ్వరూపం దాల్చిన ఈ సబ్జక్టు, సర్క్యులేషన్ పెంచేటంత సజీవమైనదా!....దానికి కారణం ఆ ఉత్తరాలలోని శక్తి తప్ప, విషయంలో బలం కాదు!

"కనక, వాళ్ళకి పదో పదిహేనో రూపాయలు పంపడానికి మీకు ఇబ్బందేం వుండ కూడదు." అన్నాను మేనేజరు గారి కళ్ళలోకి నవ్వుతూచూస్తూ.

బిజినెస్ మేనేజరు రావుగారు నమస్కారం చేసి, "మీరే గెల్చారు గాని- ఈ వాక్యం కొట్టేయండి మరి!" అన్నారు.

* * *

పన్నెండువారాలు సాగిన ఆ చర్చ డాక్టరాఫ్ లెటర్స్ గార్నుంచి ఉత్తరం లేక పోవడంవల్ల, చివరికి ఆగిపోయింది.

మరో పదిహేను రోజులు గడిచాయి. ఒకనాడు విజయవాడ నుంచి పుస్తక ప్రచురణ కర్త ఒకాయన వచ్చి, కుటుంబ నియంత్రణ- సంగతీ సందర్భం" అని చేత్తో టైటిల్ రాసిన ఒక అచ్చు పుస్తకం పట్టుకొచ్చి నా చేతిలో పెట్టాడు" ఈ పుస్తకంలో, మీ పత్రికలో వచ్చిన వాదోపవాదాలన్నీ వరసగా అచ్చువేశాం, రేపు ఇరవైనాలుగో తేదీని ఈవూళ్ళో ఈ పుస్తకం ఆవిష్కరణ మహోత్సవం ఉన్నది! డాక్టరాఫ్ లెటర్స్‌గారూ, శకుంతలా రాణి గారూ కూడా. అవిష్కరణ మహోత్సవంనాడు మీరు వచ్చి మాట్లాడితే బావుంటుందని అంటున్నారు. మీరు అంగీకరించాలి" అన్నాడు, ఆ ప్రచురణకర్త.

"ఆవిష్కరణ ఎవరిచేత చేయిస్తున్నారు?"

"ఇరవైనాలుగో తేదీని ఈ వూరికి ఆంధ్రప్రదేశ కుటుంబనియంత్రణ శాఖ డైరెక్టర్‌గారు వస్తున్నారు- వారు ఆవిష్కరిస్తారు. జిల్లా అధికారులు వస్తారు, ఈ సభకి."

నేను సరేనన్నాను.

* * *

"ఈ పుస్తకాన్ని ఆవిష్కరించడానికి నాకు చాలా గర్వంగా వుంది"

అన్నారు, కుటుంబనియంత్రణ శాఖ డైరెక్టర్‌గారు. ఎర్ర రిబ్బన్‌తో కట్టిన పుస్తకం చేత్తో పుచ్చుకుని మాట్లాడుతూ.

"మొదటి రెండువారాలూ నేనంతగా పట్టించుకోలేదుగాని. క్రమంగా ఈ ఉత్తరాలు నా దృష్టిలో పడ్డాయి. అవన్నీ చాలా గొప్పవి. మన జాతికి అత్యవసరమైనవిన్నూ. మా డిపార్ట్‌మెంట్ చేయవలసిన పని ఈ లేఖలు రాసిన డాక్టర్ రాఫ్ లెటర్స్‌గారు, శ్రీమతి శకుంతలా రాణీగారు చేశారు. అలా చెయ్యడంలో నున్నూ, మామూలు పద్ధతికి భిన్నంగా, అంకెలతో శాస్త్రీయ వివరాలతో బోరు కొట్టకుండా, ఎంతో ఇంటరెస్ట్‌గా కబుర్లూ కథలూ చెబుతూ వ్రాసేరు. ఈ ఉత్తరాలను ఒక గ్రంథంగా రూపొందించాలని సంకల్పం కలిగిన ప్రచురణకర్తలు చాలా సంఘసేవ చేస్తున్నట్టు నేను భావిస్తున్నాను. ఈ గ్రంథాన్ని అన్ని గ్రంథాలయాలకు నేను రికమెండు చేస్తున్నాను. మీకు అత్యంత సంతోషకరమైన మరొకవార్త ఏమిటంటే, ఈ ఉత్తరాలు రాసినందుకు, ఈ ప్రచురణకర్తగారు ఇచ్చే రాయల్టీ కాక, ప్రభుత్వంవారు, ఈ డాక్టరాఫ్ లెటర్స్‌గారికి, శ్రీమతి శకుంతలా రాణీగారికి, చెరి ఐదువందల రూపాయల అవార్డ్ కుటుంబనియంత్రణ శాఖ నిధుల్నుంచి ఇవ్వాలని నిశ్చయించాలు. వారిద్దరు వేదికపైకివచ్చి, చెక్కులు స్వీకరించాలని ప్రార్ధన!" అని, కుటుంబనియంత్రణ శాఖ డైరెక్టర్‌గారు రిబ్బన్ కోసి, పుస్తకం ఆవిష్కరింప బడిందని ప్రకటించారు.

ఫోటోలు, చప్పట్లు అయ్యాయి.

వేదిక కుటుంబనియంత్రణశాఖ డైరెక్టర్, పుస్తక ప్రచురణకర్త, నేను, జిల్లాకలెక్టరు, -లతో నిండిపోయింది. డాక్టరాఫ్‌లెటర్స్‌గారు, శకుంతలా రాణీగారు, ఆడియన్స్‌లో వుండిపోయి వుంటారు. కార్యక్రమంలో "రచయితల పరిచయం" అనివొక ఐటమ్‌వుంది.

కాని, అనుకోకుండా వచ్చిన ప్రభుత్వ అవార్డ్ అందుకోడానికి వారిద్దరూ కూడా వేదిక మీదికి రావలసి వుంది.

మగవాళ్ళ వరసల్లోంచి సన్నగా , పొడుగ్గా, తెల్లటి పైజమా, తెల్లటి చొక్కా వేసుకున్న ముప్పయేళ్ళవ్యక్తి ఒకాయన వేదికమీదికి వచ్చాడు. వేదిక మీద పెద్దలకు నమస్కరించాడు. సభకున్నూ నమస్కారం చేశాడు.

"శ్రీమతి శకుంతలా రాణీగారు వేదికమీదికి రావాలి". అని డైరెక్టర్. గారు అర్థించేరు.

సభలో ఆడవాళ్ళ వరసల్లో, శకుంతలా రాణీ నువ్వా, అంటే నువ్వా, అన్నట్టుగా, ఎరిగున్నవాళ్ళే వొకరినొకరు అనుమానంగా చూసుకోసాగారు.

కాసేపు కంతాల కలకలం వినిపించినా, గాజుల గలగల ఏమీలేదు,

డాక్టరాఫ్‌లెటర్స్ అనబడే ఆయన గొంతు సవరించుకున్నాడు.

"నా పేరు ఆర్. రంగారావు. నేను హంసవాడలో ఒక ప్రయివేటు స్కూల్లో ఉపాధ్యాయుణ్ణి. నేను రచయితను కాను. కాని చిన్నప్పట్నుంచీ వివిధ పత్రికలకు ఉత్తరాలు వ్రాయడం అలవాటుంది. ఇప్పటికినావి నాలుగువందల ఎనభై రెండు ఉత్తరాలు అచ్చయ్యాయి- మాణిక్యవీణమీద. ఇల్లాలి ముచ్చట్ల మీదే కాక, సీరియల్స్, ముఖచిత్రం మొదలైన వాటిమీదకూడా ఉత్తరాలునావి అనేకం అచ్చయ్యాయి. నా సహోధ్యాయులైన ఉపాధ్యాయులు కొందరు నాకు ఉత్తరకుమారుడని 'నిక్‌నేమ్' పెట్టగా అది మా హంసవాడ అంతటా సంశయం లేని గుర్తుగా తయారైంది; అదేనాకు హింస, అదే ప్రశంస!

"కుటుంబనియంత్రణ గురించి నేను బాగా చదివాను కాని ఎన్ని మార్లు ఉత్తరాలు, వ్యాసాలు రాసినా అవి అచ్చుకాలేదు. నా ఆలోచనలు అశేష పాఠక జనానికి తెలియజెయ్యలేక పోయానే అనే చింత నన్నెంతో బాధపెట్టగా వచ్చిన ఫలితమే ఈ పుస్తకం.

"డాక్టరాఫ్ లెటర్స్ అనేపేరుతోను, ఆర్. శకుంతలారాణి అనే పేరు తోను, ఈ ఉత్తరాలన్ని నేను ఒక్కణ్ణే రాశాను—" అని కాసేపు ఆగాడు, రంగారావు గారు. హాలు చప్పట్లతో మారుమోగింది.

"అదేమిటి?" అని తెల్లబోయి నిలబడి పోయారు, కుటుంబనియంత్రణ శాఖ డైరెక్టరుగారు.

"ఏవమన్యనైరా రెండువేపులా పరిశీలించగలగాలి, అప్పుడే దాని సంగతి సందర్భాలు ప్రజలకి తెలుస్తాయి. కాని. ఈ వేపు వాదన జరిగినప్పుడు వీరికి తల లూపి, ఆవేపు వాదన జరిగినప్పుడు వారికీ తలలూపేసేరకం మనుష్యులే ఎక్కువ మనలో. పైగా, ఏదో వొకవాదాన్ని సమర్థించేవారు రెండోది ఒటి ఖాళీకుండగా తీసి పారేస్తారు, అలాటి ధోరణి నన్నెంతో బాధించగా. రెరడువైపులా నేనేఎందుకు ఆలోచించి వ్రాయకూడదు అన్న

జిజ్ఞాస నాలో కలిగింది. అందుకని, క్రమ శిక్షణలో సాగిన నా ఆలోచనల్ని రెండురకాల వాదాలుగా విడదీసి దీనిమీద అరడజను, దానిమీద అరడజను వ్యాసాలు ముందుగానే సిద్ధంచేసి పెట్టుకుని. ఒకటి అచ్చవగానే మరొకటి చొప్పున వారపత్రికకి పంపించాను. అన్నీ అచ్చువేసినందుకు ఎడిటర్‌గారికి నా ధన్యవాదాలు.

"మారుపేరు పెట్టి రచన చెయ్యడం నేరం అయితే నన్ను శిక్షించండి. కాని ఈ వాదోపవాదాలు, ఈ బహుళ జనాదరణ వట్టి ఉత్తరకుమార ప్రజ్ఞలుకావన్న గర్వం నాకు చాలు" అని ముగించాడు రంగారావుగారు.

"ఎక్స్‌క్యూజ్ మీ" అని నేను లేచాను. "నేనేమీ ఒక యూనివర్శిటీ వైస్ ఛాన్సెలర్‌ని కాను. కేవలం ఒక పత్రికకు ఎడిటర్ని. అయినా, ఈయన పెట్టుకున్నపేరు. డాక్టరాఫ్ లెటర్స్ "అ నేది ఈయనకెంతో సముచితంగా వుందని నా ఉద్దేశం."

జనం మళ్ళీ చప్పట్లు కొట్టారు.

"అదిసరే-మార్చి 31 వచ్చేస్తోందే, ఆర్. శకుంతలారాణి పేర వ్రాసిన ఈ చెక్కు ఈయనకి ఇవ్వాలా వద్దా? అని నిస్సహాయంగా చతికిల బడ్డారు కుటుంబ నియన్త్రణశాఖ డైరెక్టర్‌గారు.

* * *

("జ్యోతి" మాసపత్రిక; దీపావళి 198?)

# చక్రం

"సార్!"

నెమ్మదిగా పలకరించాను, మా జోనల్ ఆఫీసర్ చక్రారావుని.

"యెస్?" చక్రారావు; చూస్తున్న కాగితాల్లో పేజీ యెగిరిపోకుండా మోచెయ్యి అడ్డంపెట్టి, తలెత్తి, కళ్ళజోడు పై అంచుల మీది నుంచి చూసేడు; గడుగ్గాయి మిరాసీదారు కరణంగారు అమాయక నిశానీదారు పేదరైతువేపు చూసినట్టు.

"కమలాకర్రావు పోయాట్టకదండీ–" అని ఆగాను.

"ఔనండీ పాపం; నాకూ ఇంతకు ముందే తెల్సింది."

"శవం ఇంకా కదల్లేదండి. వాళ్ళ తమ్ముడికోసం చూస్తున్నారు. అతను ఇప్పుడో ఇహనో రావాలి.... తీసేసేలోపుగా మన స్టాఫ్ నలుగురూ ఓసారి వెళ్ళి చూదామంటున్నారండి...."

"ఓ షూర్!....అలాగే వెళ్ళిరండి....కాని: అంతా ఒక్కసారే వెడతారా? ....ఆఁహఁ. మరేం లేదూ; గబుక్కున హెడ్డాఫీసు నించి ఏదైనా సమాచారం కావాలని ఫోను వచ్చిందనుకోండీ: నేను ఒక్కణ్నే అయిపోతానే!" అని కిటికీ లోంచి బైటికి చూడసాగాడు చక్రారావు.

నేను నా వెనకాల నిలబడి వున్న బలగంవైపు చూశాను. మళ్ళీ యిటు తిరిగి "తమర్రారాండీ?" అన్నాను జాలిగా.

చక్రారావు అంతకంటే అమాయకంగా, జాలిగా నవ్వేడు. రెండు క్షణాల్లో ఆ నవ్వుని మింగేసి, చేతిలో వున్న కలాన్ని పెన్ స్టాండులో బిగించేడు' కుర్చీలో వెనక్కి చారబడి ఒక్కసారిగా ఆఫీసరైపోయాడు.

"డోంటుయు మీన్? మీలో ఎవరో ఒకరిద్దరు ఆఫీస్‌లో వుండి ఏదైనా యెమర్జన్సీ వస్తే నాకు తోడ్పడుతారని నేననుకుంటూ ఉంటే మీరేమో ఆఫీస్‌కి

తాళం వేసేసి నన్నుకూడా లాగేద్దామని చూస్తున్నారా?— నో!—నేను రావడం కొశ్చన్ లేదసలు....ఆల్‌రైట్! హెడ్డాఫీసు నించి ఫోనొస్తే నేనే ఎల్లాగో తంటాలు పడతాల్లెండి, మీరందరు వెళ్ళండి....రమణారావున్నారా?"

"యస్సార్" అని వెనక నించి ఓ హొడాగిపోయిన గొంతు:

"మన ఆఫీస్ కొత్త బిల్డింగ్ ఫైల్ తెచ్చి ఇక్కడ పెట్టండి."

"ఆయ్."

"వామన్రావు గారూ; ఎక్స్‌పోర్టు లైసెన్సు రద్దు చేస్తామంటూ నిన్న వొచ్చిన లెటర్ వెంటనే పెట్టమన్నాను, పెట్టేరే కాదు! అది కూడ ఆ ఫైలతో పాటు తెచ్చిక్కడ పడేంది; నేనే రాసుకుంటాను!.... ....ఈ ఎకౌంట్స్ మాస్టర్ పంతులు గారేరీ? బ్యాంకెక్కెళ్ళి పోయారా, దొరగారు? ఇహనివాల్టికి ఇంతే సంగతులు గాబోలు....అక్కణ్నించలా కమలాకర్రావింటి కెళ్ళి స్మశానానికెళ్ళి అంచి కెళ్ళి ఇంక మధ్యాహ్నం వారి దయుంటే ఏ మూడింటికో దయ చేస్తారు లేక పోతే—

"అన్యాయం సార్; అతను కేష్ పట్టుకుని అలా షికార్లు కొట్టే మనిషి కాద్సార్" అన్నారు వెనకనించి ఎవరో.

"ఏమో—"

"మరి అతను కూడా అక్కడొకసారి కనిపించాలి కదండి సార్? పైగా అతను కమలాకర్రావుకి కొంచెం బంధువు కూడా కదండి?" అన్నాను.

చక్రారావు తను అంతసేపూ మోచేతుల్తో అణిచిపెట్టిన ఫైల్ మూసేసాడు. దాన్ని తాళ్ళేసి కట్టేస్తూ చేతులు తిప్పుతూ అన్నాడు "అదికాదు బంగారాజుగారూ! నేనొకటంటే మీరింకోటేదో అంటున్నారు! ....బ్యాంకెక్కెళ్ళిన మనిషి అంత హెవీకాష్ పట్టుకుని ఫ్రెండ్సిళ్ళకీ,శ్మశానానికీ ఎందుకండీవెళ్ళడం? తిన్నగా ఆఫీసుకొచ్చి ఆ కేషేదో చెస్ట్‌లో పెట్టేసి వెళ్ళొచ్చుగా....బంధువే. నేనేం కాదన్లేదు. ఆ మాటకొస్తే కమలాకర్రావుకి బంధువులో స్నేహితులోకాని వాళ్ళు ఎవరున్నారో చెప్పండి? సూర్యారావుగారూ ఆయన ఒక వీధిలో ఉంటున్నారు. అవునా కాదా? సత్యనారాయణగారు ఆయన క్లాస్మేటు– ఇంక మీరూ ఆయనా ఎన్ని విషయాల్లో ఎంత క్లోజ్‌గా ఉంటారో అన్నది ఎవరికి తెలియని రహస్యమూ కాదుకదా! ఓ విధంగా చెప్పాలంటే కమలాకర్రావు నాకూ బంధువే,

మరి! కాని ఈ ఆఫీసులో మనకందరికీ కొన్నికొన్ని బాధ్యతన్నాయి కదండీ! మన హెడ్డాఫీసు మనల్నందరినీ యిక్కడెందుకు వేసింది? పన్లన్నీ టైమ్ వేస్ట్ కాకుండా చేస్తామనే కదా. అలాంటప్పుడు ఇలాంటి ఫార్మాలిటీస్ కోసం మన అమూల్యమైన కాలాన్ని- అందులో డ్యూటీ అవర్స్ని- వేస్ట్ చెయ్యడం తప్పా కాదా; పోనీ మీరే చెప్పండి?"

తప్పే సార్; నిజమే సార్ మీరన్నది" అన్నదే ఆ సమయంలో మాట. అంతేగాని "అదేంటి సార్: అలా అంటారు? ఇలాంటి ట్రాజెడీ వొచ్చినప్పుడే కదా, ఆత్మీయులైన వాళ్ళనించి రెండు కన్నీటి చుక్కలు ఆశిస్తారు యెవరైనా!" అని చెప్పలేదెవరూ.

"అయితే సార్; పోనీ, మనందరి తరపునా బంగార్రాజుని పంపిద్దామండి?" అన్నాడు సూర్యారావు.

చక్రారావు ఓసారి కళ్ళు మూసుకొని తెరిచాడు. ఏదో నాటకంలో అభినయిస్తున్న వాడిలాగా తల అడ్డంగా ఆడించి చేతులు ఇటూ అటూ వూపాడు. "నో, నో!" అన్నాడు మళ్ళీ నాలుగు క్షణాలు వ్యవధిచ్చి. "అందరూ వెళ్ళండి, నేనిందాకా అడిగిన ఫైల్సన్నీ మాత్రం తెచ్చిక్కడ పడేండి. అవతలి రూంలో టెలిఫోనుకి ప్లగ్ తీసేండి" అని చెప్పేసి ఆ పెద్దఫైలు మళ్ళా తెరిచి చదువుకొంటూ కూర్చున్నాడు.

ఉద్యోగులు ఒక్కొక్కరూ. శవాన్ని చూడ్డానికి వెళుతున్న వాళ్ళలా కాకుండా శవాన్ని వొదిలి వెళుతున్నంత నెమ్మదిగా బైటికి నడిచారు. ముందొచ్చాను కనక ఆఖరికి మిగిలిపోయాను.

వెళ్ళిపోడానికి ఓ అడుగు అటు చేస్తూ చక్రారావు వేపుజాలిగా చూసేను. చక్రారావు క్షణంలో సగంపాటు నా చూపులో చూపు కలిపి; అ మరుసటి సగంలో ఆగమన్నట్టు చేత్తో ఓ సంజ్ఞ చేసి; ఆ చేతితో టేబిల్ మీద ఒక్క దెబ్బ కొట్టి, "అన్నట్టు మర్చిపోయాను!" అన్నాడు.

స్విచ్ వేస్తె లైటారిపోయినంత వేగం ఆగిపోయాను. ఎక్కడున్న వాణ్ణక్కడ.

"అక్కడ పంతులుగారు కనబడితే ఆ క్యాష్ బ్యాగ్ పట్టుకుని వెంటనే ఆఫీసుకు రమ్మరండి." అని; నావేపు ప్రత్యేకమైన అభిమానంతో చూస్తూ

చెయ్యి వూపి తనకి చాలా దగ్గిరిగా రమ్మంటూ సంజ్ఞ చేసేడు. నేను అతనికి చాలా దగ్గిరిగా వచ్చి అతని మీదికి వంగాల్సి వచ్చింది. చక్రారావు గొంతు బాగా తగ్గించి చెప్పాడు: నే చెప్పేది జాగ్రత్తగా వినండి. ఏంటంటే, అక్కడ పరిస్థితి ఎలా వుంటుందో మనం చెప్పలేం....ఏమంటా?....గబుక్కుని డబ్బు అవసరం రావొచ్చు. ఎలాంటెలాంటి తెగింపులు పుడతాయంటే చేతిలో ఉన్న డబ్బు మనదా, నలుగురిదీనా. గవర్నమెంటుదా అనే విచక్షణ ఉండదు. నే చెప్పేది బోధపడుతోందా? అంచేత....ఏది?....అతను—అంటే పంతులుగారన్నమాట —అక్కడ గానీ వుండిపోయాడంటే; ఒక మూమెంట్‌లో అతను గోతులో పడ్డమేగాదు; మనందర్నీ గోతులో తోసీగల్డు....తెలిసిందా? అంచేత ముందు తన్ని క్యాష్‌బ్యాగ్ పట్టుకొని ఇటొచ్చేమనండి. అది సేఫ్‌తో పెట్టేసీ;కావాలంటే మళ్ళీ వెళ్ళి సాయంకాలం దాకావుంటాడో రాత్రల్లా కూడా వుంటాడో అతనిష్టం! తెల్సిందా?"

చక్రారావు తెలిపే ప్రతి మాటకీ ఆమోదం తెలిపే ఆంగికం ఒకటి; కళ్ళతో, చేతుల్తో, తలతో చేస్తూ విధేయతని కూడా పన్లో పనిగా ప్రకటించేను.

చక్రారావు మళ్ళీ మొదలెట్టాడు. "పాపం; నిజమే, డబ్బు అవసరం పడ్తుంది. నిజానికి కమలాకర్రావు జీతం అంతా కూడా ఇవాళ అక్కడ అవసరమయ్యే ఖర్చుకి చాలకపోవచ్చు. కానీ మనమేం చేస్తాం? పోనీ మనం ఏదైనా జాలిగా చేసేసినప్పటికి దాని ఫలితం ఈ నెలంతా మనల్నందర్నీ బాధ పెడ్తుంది. కాదంటారా?"

"ఔనండౌనండి.... కానీ, ఇందులో రెండు పాయింట్లున్నాయండి. కమలాకర్రావు నిన్నటివరకు డ్యూటీలో ఉన్నాడు కాబట్టండి, అతని జీతంకూడ అందరితో బాటు బిల్లేసి తెచ్చేమండి. ఆ డబ్బు అతనికో అతని పెళ్ళానికో ఇచ్చెయ్యాలండి. దానికే రూలూ అడ్డం రాదండి. ఒక వేళ ఆవిడ; చట్టరీత్యా తనే కమలాకర్రావుకి వారసురాల్నని సర్టిఫికేటు తెచ్చుకునే దాకా ఆ డబ్బు ఆవిడకివ్వకూడదనుకుంటే ఉంకోటుందండి. ఉద్యోగస్తుడెవరైనా చనిపోతేనండి, శవ వహనానికి, ఆ సంబంధంగా అయ్యే ఖర్చులకనండీ; అయిదు వందల రూపాయలు కసురే శాంక్షన్‌చేసి డైరెక్టుగా ఆవిడకిచ్చియొచ్చండి. [illegible]అంచాతండి—"

చక్రారావు నోటికి చెయ్యడ్డం పెట్టుకుని "అయ్యో, అయ్యో!" అన్నాడు. "అతను చనిపోయాడని మనకి కాగితంమీద రిపోర్టు లేదండీ బాబూ అవునూ! ఎవరిచ్చేరు, రిపోర్టు? నేనిలా మాటాడుతున్నానని మరోలా అనుకోకండి. మీరు చెప్పారు; రైటే. కమలాకర్రావు చనిపోయాడనడానికి సందేహంలేదు. కానీ మరి ఆఫీసన్నప్పుడు ఏవో కొన్ని రూల్సుంటాయికదా. రేపొద్దున్న ఏ ఆడిట్ బాబో వచ్చి పార్టీ చనిపోయినట్టు రిపోర్టులేదు. శవ దహనానికి గ్రాంట్ ఇమ్మని అప్లికేషన్ లేదు; డబ్బు ఎలా డ్రా చేసి ఇచ్చేసేవు నాయనా అని నా పీక పట్టుకుంటాడు. బాబ్బాబూ ఏదో తొందర్లో అలా చెయ్యవలిసొచ్చిందయ్యా అంటే వాడూరుకుంటాడా?" అని అలసిపోయాడు.

లోపలి అసహ్యం ఆగ్రహం వ్యక్తపరచకండా వుండడానికి ఒకటే మార్గం.

దీర్ఘంగా "ఆయ్...." అని; మరి తిరిగి చూడకుండా దాటేశానక్కణ్ణించి.

o o o

పదిహేను రోజులైంది.

చక్రారావులాంటి క్రూరులు దయాహీనులు భూప్రపంచకం మొత్తంమీద ఎవరూ ఉండరనీ ఉద్భవించరనీ నిశ్చయానికి రాదగిన సంఘటనలు జరిగాయి.

ఆరోజు కమలాకర్రావు అంతిమ యాత్రకి ముందు ఆఫీస్ స్టాఫ్ అంతా అక్కడికి వెళ్ళేంకదా. అప్పటికే అక్కడ కేషియర్ పంతులు ఉన్నాడు; కమలాకర్రావు తమ్ముడు రామనాథం రానూ వొచ్చాడు. అన్నగారు పోయాడని టెలిగ్రాం రాగానే అతను ఎలా ఉన్నవాడు అలాగే బయల్దేరి వొచ్చేశాడు. కాకినాడ నుంచి విశాఖపట్నానికి రావడానికి అతనికి ఆ కబురందిన వేళకి బస్సుగాని రైలుగాని లేని కారణంగా పాపం; కత్తిపూడి జంక్షన్ వరకు ఎవరో కార్లో లిఫ్ట్ ఇవ్వగా చేరుకుని, అక్కణ్ణుంచి లారీ ఎక్కి విశాఖపట్నం వచ్చేడుట. అందరికీ నెలాఖరే కదా. అతనుకూడా ఏమంత స్థితిలో లేడు. కాలేజీలో లెక్చరరే గాని పద్ధతిగా జీతాలు చెల్లించే కాలేజీ కాదది. వాళ్ళావిడ, కూతురు "మేమూ వస్తాం"మని లబో దిబో అంటే ప్రయాణం ఖర్చులకి ఎక్కడో ఏదో ఏర్పాటు చేసుకుని మర్నాడు రమ్మని చెప్పేసి తను ఒక్కడూ అతి కష్టం మీద అలా వొచ్చేడుట. కమలాకర్రావు కొడుక్కి ఆరేళ్ళ వయస్సు. అంచేత తల కొరివి

పెట్టడం నుంచి పది పన్నెండు రోజుల శ్రాద్ధ శౌచ కర్మలన్నీ కమలాకర్రావు తమ్ముడు రామనాథమే చెయ్యాలన్నారు. కర్మలన్నిటికీ డబ్బు ఖర్చవుతుంది. అలాగా ఇలాగా కాదు. వందలు, వందలు! అందరికీ ప్రావిడెంటు ఫండు వుంటుంది. కాని దాంట్లోంచి డబ్బు కావాలంటే అదో పెద్ద పరమపద సోపాన పటం. దాన్నిండా ఎక్కడికక్కడ పాములూనూ.

ముందు శవం కదలాలి.

కిందటి రాత్రి పదకొండున్నరకి పోయాడు కమలాకర్రావు. ఈ జనం అంతా పోగయ్యేసరికి పూర్నాడు మధ్యాహ్నం ఒంటి గంట అయింది. ఈ ఇంట్లోనే కాక ఇరుగూ పొరుగూ వాటాల్లో కాపరాలున్న వాళ్ళు కూడా వంటా పెంటా చేసుకోకూడదని లెఖ్ఖ. ఏదో నగర సంస్కృతి ఇరుగు పొరుగు లెవరో వాళ్ళ కష్టసుఖాలేమిటో యెవరూ పట్టించుకోరని పేరయితే పడిపోయారు గాని నిజానికి ఇలాంటి సందర్భాల్లో సంప్రదాయానికి వ్యతిరేకంగానూ దానికి ఎదురు తిరిగ్గానీ ప్రవర్తించడం లేదెక్కువ మంది, ఇప్పటికి కూడానూ.

స్టాఫ్‌కి జీతాలివ్వవలసిన సొమ్ము బ్యాంకునుంచి డ్రా చేసి తెచ్చిన కేషియర్ పంతులు ఆసంచితో సహా అక్కడున్నాడు. అపర కర్మలు చేసే బ్రాహ్మలు ఎక్కడ దొరుకుతారు, శ్మశానంలోకి కట్టెలు ఎవరు రవాణా చేస్తారు అనేవి కనుక్కొని ఆ పన్లు జరగడానికి రూఢి చేసింది అతనే. ఆ క్యాషంతా పుచ్చుకుని తన మోపెడ్ మీద నాలుగైదు చోట్లకి తిరిగి తిరిగి వొచ్చాడు.

కమలాకర్రావుతో మా పరిచయం గట్టిదే. ఇక్కడ జోనల్ ఆఫీస్ పెట్టినప్పట్నించీ మేం అందరం సహోద్యోగులమే. కాని అతని భార్యనిగాని తల్లిని గాని ఆఖరికి పిల్లల్ని గాని మాకెవరికీ గట్టిగా తెలీదు. కాకినాడ నించొచ్చిన కమలాకర్రావు తమ్ముడు రామనాథం మాకు మొదటిసారిగా అక్కడే పరిచయం. ఊళ్ళో కమలాకర్రావు మేనత్త ఒకావిడ ఉంది. ఆవిడ, ఇద్దరు కొడుకులు వచ్చారు. ఇరుగూ పొరుపల్లో కమలాకర్రావు కులానికి చెందినవాళ్ళూ అయిన వాళ్ళనదగినవాళ్ళూ ఈ సన్నివేశానికి తగిన వేషాల్లో ముఖకవళికల్తో అక్కడ వుండిపోయారు, జీతాల రోజైనా ఆఫీసుల కెళ్ళడం మానేసి.— "ఏం గురూ, పొజిషనెలాగుంది అని అడిగాను పంతుల్ని విడిగా పిల్చి సన్నని గొంతుతో.

"కొంపలో తంతే దమ్మిడీ లేదు, ఆ తమ్ముడు కూడా దారి కర్చులికి

ఏక్కడో అప్పు గోక్కుని వొచ్చాడు. ఇదంతా ఇల్లా వుండగా ఈ రాత్రినుంచీ భోజనానికి మెంబర్లు పెరుగుతారు."

"ఇరుగూ పొరుగూ, ఆ మేనత్తగారు?"

"సడేలే—ఏదో సామెత చెప్పినట్టు!" అని మూతి విరిచేడు పంతులు.

"మరిప్పుడెలాగ? దగ్గిర దగ్గిర ఐదారు పందలు కర్చుంటుందే. ఇప్పుడు?"

"అదే అదే. నేను సూర్యారావుని ముందు అడిగాను. బ్రదరూ! నీకు జీతంతో పెద్దగా పన్లేదు కదా; ఓ సంతకం నా మొహాన పడీ; సరిగ్గా ఆరువందల యాభై రూపాయలు రొండు ఫిగరు కదా! అదిక్కడ పడేసి మన పన్లమీద మనం పోదాం. నీకా సొమ్ము నింపాదిగా సర్దేస్తాం ఒరే, అని!....కానీ వాడికి ఈ నెల్లోనే వచ్చిందట ఏదో యిబ్బంది. చెల్లెలు పురుటికొచ్చింది; వాళ్ళత్తగారు ఐశ్వర్యవంతులు కావడంచేత గవర్నమెంట్ ఆస్పత్రిలో కాకండా ప్రయివేట్ నర్సింగ్ హోంలో చేర్చవలసొచ్చింది; రేపు ఉదయం డిశ్చార్జి చేస్తారు; బిల్లు కట్టి తీసుకు రావాలి; నాన్నగారు బిజినెస్ పనిమీద కలకత్తా వెళ్ళేరు! అంటూ కథలు చెప్పుకొచ్చేడు త్యాష్టుడు. పంతులూ పంతులూ తలా కాస్త యిచ్చుకుంటాం గానీ అంతా నా వొక్కడి నెత్తిని మాత్రం రుద్దకురా అంటూ తగులుకున్నాడు. ఏం చేద్దాం? వాళ్ళప్పుడే లోపల లజ్జుగుజ్జులు పడుతున్నారు" అని చెప్పేడు పంతులు.

అంతా వెంటనే సెటిల్ చేసేసేనని అనుకున్నాను. "కమలాకర్రావు జీతం కటింగులు పోను నాలుగువందల తొంభై రెండు రూపాయలు కదా; ఆ సొమ్ము లెక్కేట్టేసి ఇచ్చీ. ఓ రెవెన్యూ స్టాంపు తీసుకుని తెల్లకాయితం మీద అంటించీ, మన జోనల్ ఆఫీసర్ గారికి ఒక ధరకాస్తు రాసీ; ఏమనీ; అయ్యా నా భర్త అయిన ఫలానా కమలాకర్రావు నిన్న అనగా 1985వ సంవత్సరం జూన్ నెల 30వ తేదీ అర్ధరాత్రి చనిపోయారు. వారికి మీ ఆఫీసులో పని చేసినందుకు గాను 1985 జూన్ నెలకు జీతం కటింగులు పోను నాలుగు వందల తొంభై రెండు రూపాయలు వచ్చినట్లు తెలిసింది గాన; వారికి చట్టరీత్యా నేనే వారసురాలను గనుక సదరు సొమ్ము నాలుగు వందల తొంభై రెండు రూపాయలు నాకు చెల్లించ ప్రార్థన. ఆ అప్లికేషన్ మీద, ఈ రెవెన్యూ స్టాంపుమీద ఎలాగో ఓలాగ రెండు సంతకాలు ఆవిడవి తీసేసుకో. అన్నట్టు మర్చిపోయేను. మరో తెల్ల కాయితం తీసుకుని మన జోనల్ ఆఫీసర్ గారి పేరిట

ఇంకో అప్లికేషన్ తీసుకో.అయ్యా: మీ ఆఫీసులో పనిచేస్తూ నిన్న రాత్రి హఠాత్తుగా చనిపోయినటువంటి ఆర్. కమలాకరరావు నా భర్త. ఇటీవల వచ్చిన ఒకానొక నిబంధన ప్రకారం సర్వీసులో ఉండగా హఠాన్మరణం చెందిన ఉద్యోగి యొక్క అంత్యక్రియలు నిమిత్తము ఐదువందల రూపాయల వరకు శాంక్షన్ చేస్తారని తెలుస్తున్నది. ఈ నిబంధన ప్రకారం తమరు నా పేరిట తొందరగా ఐదు వందల రూపాయలు శాంక్షను చేసి చెల్లించవలసిందిగా ప్రార్థిస్తున్నాను——అని రాయించి ఆ అప్లికేషన్ కూడా తీసుకో. రేపు ఆ ఐదు వందలూ కూడా ఇప్పిద్దాం" అన్నాను.

కానీ అందరం పప్పులో కాలేశాం.

"నా భర్త జీతం నాకిప్పించండి" అని రాసిన అప్లికేషన్ మీద "మీరే ఆయనకి చట్టరీత్యా వారసురాలని తాలూకా ఆఫీసు నుంచి సర్టిఫికేట్ తెచ్చుకుంటే తప్ప ఆయన జీతం మీకివ్వడానికి వీలుపడదు" అని ఆర్డరేశాడు మా జోనల్ ఆఫీసర్ చక్రారావు.

"దహన సంస్కారానికి గ్రాంటు ఇవ్వాలంటే డెత్ సర్టిఫికేట్ ఉండి తీరా"లని ఆ కాగితం తిప్పేశాడు.

కమలాకర్రావు భార్యకి అక్కడికక్కడే చెల్లించిన నాలుగు వందలతొంభై రెండు రూపాయలు నేను. సూర్యారావు, రమణారావు, పంతులు నలుగురం పెట్టుకున్నాం తరువాత ఎప్పుడో ఆవిడ ఇస్తే ఇచ్చినట్టు: లేకపోతే ఇక అంతే సంగతులనుకున్నాం.

నాటికీ నేటికీ ఆవిడ లీగల్ హేర్ సర్టిఫికేట్ తెచ్చుకోనే లేదు.పన్నెండో రోజు కర్మ అయ్యేదాకా ఆవిడ ఇల్లు కదలకూడదన్నారు. పోనీ ఇంకెవరైనా వెళ్ళొచ్చు కదా అంటే పుట్టెడు దుఃఖంలో ఉన్నారు ఎవర్నని వెళ్ళమంటారు చెప్పండి అని తేల్చేశారు. దహన సంస్కారానికి ఇచ్చే గ్రాంటు అయిదు వందలకి బిల్లు వేసేనంటాడు పంతులు కాని క్యాష్ చెయ్యలేదంటున్నాడు.

మా డబ్బులు పోయాయని కాదు బాధ.కమలాకర్రావు భార్యకి న్యాయంగా రావలసిన డబ్బు ఇవ్వనీడం లేదు మా జోనల్ ఆఫీసర్ చక్రారావు. ఆ రోజు శవం కదిలేలోపుని ఓసారి వెళ్ళి ఆవిణ్ని పరామర్శ కూడా చెయ్యలేదు.అప్పుడు నాలుగువందల తొంభై రెండు రూపాయలు ఇచ్చేశాక మేమంతా వెంటనే వొచ్చే

శాము. ఆ తరువాత ఈయన ఎవరి ఫైళ్ళు వాళ్ళకిచ్చేసి తన జీతం తీసేసుకుని నాకు బైట పనుంది వెడతానని వెళ్ళిపోయాడు. బైటికి ఏదో పని మీద వెళ్ళిపోతూనైనా సరే ఓసారి ఆవిణ్ణి పలకరించి వెళ్ళొచ్చుగా" అని అందరం తిట్టుకోవడం మిగిలింది.

అలా ఈ పదిహేను రోజుల్నుంచీ అతని మానవద్వేష ప్రవృత్తినీ సానుభూతి రాహిత్యాన్నీ విమర్శించుకోడంలో ఇప్పుడే కాదు ఇతనెప్పుడూ ఇంతే అన్న సంగతి కూడా తెలిసింది. జోనల్ ఆఫీసు ఇక్కడ ఏర్పడక ముందు ఈ చక్రారావు మాలాగనే చిరుద్యోగే. అప్పుడు కూడా ఇతనింతే. సాటి మనిషి మీద సానుభూతి ఎన్నడూ లేదు. పనిలో రాక్షసుడు. దానికెవరూ మరోమాట చెప్పలేరు. కాని అతని నిజాయితీ కఠోర పరిశ్రమ యంత్రవత్‌గా వచ్చేవేతప్ప దాంట్లో యెక్కడా మానవాంశ ఉండేది గాదు.

ఈ పదిహేను రోజులూ అలా చక్రారావుని తిట్టుకుంటూనే దినచర్య ప్రారంభిస్తున్నాం. ఇలా అయితే ఎంతకాలం పని చెయ్యగలం? ఇవాళ కమలాకర్రావు కుటుంబానికి వొచ్చిన ఆపదలాంటిది రేపు మరెవరికైనా వొచ్చినా ఇంతే కదా.

ఈ పదిహేను రోజుల కాలంలో మాలో ప్రతి ఒక్కరు కమలాకర్రావు భార్యని పలకరించి ధైర్యం చెబుదామని విడివిడిగా వెళ్ళాం. ఆవిడకి కలిగిన నష్టాన్ని మాలో ఏ ఒక్కరైనాగాని అందరం కలిసికట్టుగా గాని తీర్చలేంఅన్నది ఖాయం. కాని అతను సర్వీసులో ఉండగా చనిపోవడం మూలాన్ని ఆవిడకి ప్రావిడెంట్ ఫండు గ్రాడ్యుయిటీ, కుటుంబ పెన్షను లాంటివి డబ్బురూపంలో వస్తాయని కూడా మాలో ప్రతి ఒక్కరికీ తెలుసు. ఒక్కొక్క బాపతు సొమ్ము ఎంతెంత వస్తుంది. దాన్ని రాబట్టుకోడానికి దరఖాస్తులు ఎలా రాయాలి రూల్ పొజిషన్ ఏమిటి అన్నీ చెప్పడానికి సిద్ధంగా మేం వెళ్ళాం. కాని ఆవిడ మమ్మల్నెవర్నీ చూడలేదు.

అభినందనో అభిశంసనో తెలీకుండా "ఈ కాలపు మనిషి కాదు!" అని ఒక రిమార్కు పాస్‌చేసి నిట్టూర్పు విడిచి వూరుకున్నాం.

o o o

కమలాకర్రావు పోయిన ఇరవైనాలుగో రోజు ఉదయం పదిగంటలు కాకముందే నేను ఆఫీస్‌కొచ్చేను. వరండాలో వాచ్‌మన్ రెస్టు డీసుకోడానికి. విజీ

టర్స్ కూర్చోడానికి వేసిన బెంచీమీద ఓ అమ్మాయి కూర్చుని వుంది. చేతిలో చిన్న వేనిటీ బాగ్ ఉంది. నన్ను చూడగానే లేచి నుంచుని "నమస్కారం" అనేసి కూర్చుంది.

ఇరవై అయిదేళ్ళు దాటుంటాయి. పొడుగ్గా వుం.. చామనచాయ. ఆకర్ష ణీయమైన పాలిస్టర్ చీర కట్టుకుంది. మెడలో ఒకటిపేట గొలుసు. నుదుట చిన్న నల్లచాదు బొట్టు. ఓ చేతికి బంగారు గాజులు రెండు రెండో చేతికి వాచి.

"నమస్కారం" అనేసి కూర్చోకపోతే "ఏం వచ్చావు, ఎవరు నువ్వు?" అని అడగవలసిందే. కాని ఆమె ముభావంగా కూర్చుండిపోతే నేనెందుకు పల కరించాలన్న ఉదాసీనత తెచ్చుకుని నేను మెయిన్‌హాలు తలుపు తెరిచి లోపలికి వెళ్ళిపోయాను.

ఓ నిమిషం గడిచేలోపుగా బైట వరండాలో వాచ్‌మన్ గవరయ్య అక్కడ కూర్చున్న అమ్మాయితో మాట్లాడుతున్న అలికిడి అయింది. "ఆయ నేనమ్మా ఎడ్ గుమస్తాగారు. ఎళ్ళి ంనపడండి." అన్న వాక్యంతో ఆ సంభా షణ ముగిసింది.

"నమస్కారం సార్. నా పేరు పద్మావతి. నన్ను గుర్తు పట్టలేదనుకుం టాను తమరు. నేను కమలాకర్రావుగారి భార్యని" అంది లోపలికి వచ్చి నా సీట్ కెదురుగా నిలబడి.

"అయ్యో, అలాగా! సారీ." అన్నాను, కూర్చోమని సంజ్ఞచేసి.

"ఫరవాలేదండి" అని కూర్చుంది.

"నేను కాగితాలేవో చూస్తూ "మీకు చాలా అన్యాయం జరిగిపోయింది. ఇంకా జరుగుతూనే ఉంది కూడాను. ఆఖరికి మీకు రావలసిన డబ్బు విషయంలో కూడా తొందరగా పన్లు జరగడంలేదు. ఎన్నోసార్లు మా ఆఫీసర్‌గారికి చెప్పాను. ఆయన వేరే పన్లమీద శ్రద్ధ పెట్టాల్సి వచ్చి కాబోలు; మీ పన్లు చూడలేకపోతు న్నారు. ఇవాళ మళ్ళా చెబుదామనే అనుకొంటున్నాను.సరే మీరే వచ్చారు కదా ఓసారి కనిపించి వెళ్ళండి, ఆయనింకో అరగంటలో వచ్చేస్తారు" అన్నాను, చక్రారావు కఠినుడని క్రూరుడని ఈవిడ కష్టంపట్ల అమానుషంగా ప్రవర్తించే డనీ డైరెక్టుగా మా సహోద్యోగుల మధ్య మాట్లాడినట్టు మాట్లాడలేకపోయినా నాధోరణి నాకు సంతృప్తిగానేవుంది. ఆవిడకి ఏ మాత్రం బుర్రవున్నా అతని పద్ధతి, సానుభూతి రాహిత్యం అర్థమైపోతుంది కదా అని సంతోషించేసేను.

"అది కాదండి. నన్నిక్కడ కమలాకర్రావుగారి పోస్టులో జాయినవమని హైద్రాబాద్‌నించి ఆర్డర్సొచ్చేయండి. ఈ ఉదయం మా మరిదిగారు పట్టుకొచ్చి చ్చేరండి. ఆ అమ్మాయి, పద్మావతి.

చేతిలో వున్నవానిటీ బాగ్ వెతికి, ఒక కవరు, విడికాగితం ఒకటి తీసి నా చేతికి ఇచ్చింది.

"ఇదండి, ఎపాయింట్ మెంట్ ఆర్డరు. ఈ కవర్లోనండి. ఇట్లాంటిదే ఇంకోకాపీ ఉందటండి, అది మన ఆఫీసు ఫైల్లో పెట్టించమన్నారండి." అంది. విడికాగితం కవరు వేర్వేరుగా అందిస్తూ,

"ఐసీ-" అని ఒక్కచూపులో చదివేశాను.

అర్డరు- రైటే. రీజినల్ ఆఫీసునుంచి వచ్చినట్టు రబ్బరుస్టాంపు. జోనల్ ఆఫీసు విశాఖపట్నానికి చిరునామా,

"పోనీలెండి. పెద్ద ఆపదకి చిన్న ఊరడింపు." అన్నాను. "కంగ్రాచులేషన్స్" అని భారీగా నవ్వుతూ చెప్పవలసిన మాట కాదు, రెండు విధాలుగా కూడాను. "ఎంతమంది అడ్డుపడినా దేవుడు మేలు చెయ్యాలనుకున్నప్పుడు ఆగదు, మా స్టాఫ్‌మెంబర్లు ఎంతమందిమి ఎన్నిరకాలుగా అనుకున్నామో మీకేదైనా సహాయంచేస్తే బాగుండునని. మా జోనల్ ఆఫీసర్‌గారికి పని వొత్తిడి వల్లనో మరే కారణం చేతనో మీకు సహాయపడ్డానికీ సానుభూతి చూపించడానికీ తీరుబాటు లేదు. మీరు మంచి యుక్తిగా పై అధికార్లని వప్పించి మీ సంసారం ఛిన్నం అయిపోకుండా ఓ ఆధారం సంపాదించుకున్నారు."

ఆ అమ్మాయి తల అడ్డంగా ఆడించింది "అబ్బే అదేం మాటండి. చక్రారావుగారు తల్చుకోకపోతే ఇదేదీ అయ్యేదే కాదండి. వారే స్వయంగా మా ఇంటికొచ్చి నాదగ్గర దరఖాస్తు తీసుకుని దానిమీద గట్టిగా రికమండుచేసి హైద్రాబాదువెళ్ళి ఆర్డరేయించుకొచ్చేరండి. అసలు కమలాకర్రావుగారు ఉన్నప్పుడే నేనొక అప్లికేషను పెట్టేనండి; ఈ ఆఫీసులో ఏదైనా ఉద్యోగం యిప్పించమని. అబ్బో: రెండేళ్ళ నాటి మాటండి. దాని మీద కూడా చక్రారావు గారు గట్టిగా రికమెండు చేసేరండి. హైద్రాబాద్ వాళ్ళు ప్రస్తుతం కాళీల్లేవని తిప్పేస్తారేమోనని; ఈ ఆఫీస్‌లో పనెక్కువైంది: మరో మనిషి కావాలని కూడా

రాసేరండి. ఆ రోజు ఆ కాగితం రాయాలని వారికి గట్టిగా తోచినా ఆఫీసుకి సెలవై పోయిందని; మర్నాడే తనకి క్యాంపని; ఆయనే స్వయంగా డ్రైవు చేసి తీసుకెళ్ళారండి. సర్లే చూస్తాం వెళ్ళమంటే అక్కడ ఎవరితోటో గట్టిగా చెప్పి వచ్చారటండి. ఈ ఆర్డర్ నాకొచ్చినట్టు వారికింకా తెలీదండి."

ఆమె ఈ మాటలు చెప్తుండగనే ఆఫీస్‌లోకి ఒకరొకరూ వస్తున్నారు సూర్యారావు కంటికి ఆనగానే చెయ్యి ఊపి, పిలిచి, "ఎస్టాబిష్‌మెంటు ఫైలు పట్రా" అన్నాను. ఎవరికీ తెలియకుండా చక్రారావు ఈ కేసు ఎలా డీల్ చేసాడో చూద్దామని.

"ఆ ఫైలు పది రోజుల్నించి కనబడ్డం లేదు గురూ. ఒకవేళ జె.ఓ.గారి కేబినెట్లో ఉందేమో. చూడాలివాళ." అన్నాడు సూర్యారావు.

"చూడు చూడు!" అన్నాను.

***

(ఆంధ్రజ్యోతి వీక్లీ 5-8-1975)

# హయ్యెస్టు టెండరు

“ఎందాకండీ” అనే పులకరింపు విని పక్కకి తిరిగి చూసేను.

ఇరవై నిమిషాలించి సిటీ బస్సుకోసం చూస్తూ నిలబడ్డానక్కడ. నేనెళ్ళబోయే వైపుగా కార్లో వెడుతూ, కారాపి అడిగాడు.

నన్నే అడుగుతున్నాడని తెలియనట్టు అటూ ఇటూ చూశాను.

“మిమ్మల్నే” అన్నాడు కార్లో ఆయన.

వెర్రినవ్వు నవ్వి వూరుకున్నాను.

“ఇంటికేనా? నేను కార్లో దిగబెడతాను రండి” అన్నాడు. నావైపు చూస్తూ, చూపిస్తూ.

“సారీ- మీకు శ్రమ యిస్తున్నాను” అంటూ కారు దగ్గరకి చేరాను.

“శ్రమేం లేదు. నేనూ అటే వెడుతున్నాను” అని, కారు తలుపు తెరిచి, రండి! అన్నాడాయన.

నేను లోపల కూర్చోగానే కారు స్టార్ట్ చేశాడు. “మీ ఇంటికి వద్దామనుకుంటున్నాను. రెండు రోజులై!”

“మా యిల్లు కూడా తెలుసన్నమాట” అనుకొని వూరుకొన్నాను.

“మిమ్మల్ని అక్కడక్కడ చూస్తూనే వుంటాను. నేను లాయర్ని. నా పేరు బాలకృష్ణమూర్తి. మీరుంటున్న వీధికి అవతల వీధిలో వుంటాం మేం.”

“అలాగా? చాలా సంతోషం. మిమ్మల్ని తెలుసుకున్నందుకు” అంటూ చేయి కలిపాను. ఆయన కారు నడుపుతూనే నా చేతిని అందుకొని, క్షణంపాటు నొక్కి వదిలాడు.

నేను ఫలానా అని పరిచయం చేసుకున్నాను.

“అవును! తెలుసు. మీ ఇంటిముందు బోర్డుంటుందిగా, అక్కడ మిమ్మల్ని చాలాసార్లు చూశాను.”

“అయ!”

రెండు రిక్షాలని తప్పుకోడం, ఓ సిటీబస్సుని ఓవర్ టేక్ చెయ్యడం

నెత్తిమీద కేరేజీల తట్టతో ఉన్న వో ఆడమనిషి కారుకింద పడకుండా చూసు కోడం ఇలాంటివేవో తగిల్తే ఆయన ఓ అర నిమిషంపాటు చక్రంమీద ఏకాగ్ర దృష్టి పెట్టుకుని వూరుకున్నాడు.

"మాకో చిన్న సమస్య వొచ్చి పడ్డాదండీ" అన్నాడు బాలకృష్ణమూర్తి గారు. ఖాళీకాగానే.

"చెప్పండి!"

"లాయర్స్ మేం యాభై మందిమి కలిసి మద్దెలపాలెంలో పదెకరాల భూమి కొన్నామండి. దాన్ని మా యాభైమందికీ అయిదేసి వందల గజాల చొప్పున పంపకాలు వెయ్యాలి."

"వెయ్యొచ్చు" అన్నాను మనసులోనే గుణకారం చేసుకుని.

"ప్రతి జాగా చుట్టూ భూమ్మీద రాళ్ళు పాతించాలండి"

"అదీ చెయ్యొచ్చు"

"రోడ్లకి, పార్కులకి జాగాలు వొదిలిపెట్టి ఇళ్ళస్థలాలు వేర్వేరుగా చూపిస్తూ లేఔట్ ప్లాన్ తయారు చెయ్యాలి."

"అయ—"

"ఆ ప్లాన్ని మునిసిపాలిటీ ఆఫీసులోను, అవసరమైతే టవున్ ప్లానింగ్ ఆఫీసులోను అప్రూవ్ చేయించాలి."

"అయ"

ఆ తర్వాత భూమ్మీద రోడ్లు, సైడు కాలువలు ఏర్పాటుచేసి, రోడ్లమీద సహం మేర కంకరా. కాలవలకి కానాలు వెయ్యాలి.

"అయ—"

"అంతే. మేంమీకు, క్రయ చీటీదాఖలా భూమి. ముక్కామోడీ మిట్టా పల్లం చూపిస్తాం. అంతే కాలవలు తవ్వించడం, కానాలు కట్టించడం రోడ్లు వేయించి కంకరపోయించి సాపు చేయించడం అన్నీ చేసి. ఎవరి ప్లానుప్రకారం వారు ఇళ్ళు కట్టుకుందికి వీలుగా జాగాలు చూపించాలి. ఏజాగాలో ఎవరు ఇల్లు కట్టాలనేది మేం లాటరీవేసి నిర్ణయించుకుంటామనుకోండి— అది మీకు సమ్మంధం లేదు."

"అద్సరే అనుకోండి.... ఎన్నాళ్ళలో కావాలండి!" అన్నాను.

"ఎన్నాళ్ళేముంది? ఇందులో కొన్ని అర్జంటుగా చెయ్యగలిగినవి

వున్నాయి. కొన్ని తీరుబాటుగా చెయ్యవలసినవివున్నాయి. కొన్ని" అని నా వేపు భావగర్భితంగా చూసి, చిన్న వెటకారపు నవ్వుకూడా నవ్వి. "కొన్ని అసలు అవుతాయో అవవో తెలీనివి వున్నాయి కదా మరి" అన్నాడు.

"అవునవును. కాని తీరా మోసి స్థలాలు కొన్నారు గనక ఇళ్ళు కట్టుకోవా లని మీలో కొందరికి ఆదుర్దాగా వుంటుందేమో కదా" అన్నాను.

"ఆ మాటా నిజమే. ఈ సొసైటి మెంబర్లు యాభై మందిలో సంగోరు మంది అప్పుడే సిమ్మెంటూ ఇనుమూ సిద్ధంచేసి పెట్టుకున్నారు కూడాను!"

కనకఏదో ఇంత టైం అని అనుకోడం మంచిది కదా!"

"ఓ మూడు నెలల్లో చేయించగలిగితే సంచిపనుకుంటాను" అన్నాడాయన

కారు మా యింటి కెదురుగుండా ఆగింది.

"మీరు ఎస్టిమేటువేసి ఇచ్చేస్తే, అర్జంటుగా సొసైటీ మీటింగుపెట్టి మిగతాపన్లు చేయించేడమే" అని కారులోంచి దిగాడాయన.

నేను నా వేపునించి కారు దిగి క్షణం ఆలోచించేను. "మిట్టాపల్లం చెట్టూ చేమా అంటున్నారు. నేల చూడందే ఎస్టిమేటు వెయ్యడం కష్టమండి" అన్నాను.

"మా ఆలస్యం ఏమీలేదు. మీకిప్పుడు ఖాళీఅయితే ఇలాగే వెళ్ళిచూసేద్దాం రండి" అని కార్లోదూరి, నావేపు మూసిన కారు తలుపు తెరిచాడు బాలకృష్ణ మూర్తిగారు.

* * *

పొంగి బోర్లాపడ్డాను.

యల్. సీ. ఈ. చదువుకొని, ఆర్. ఎండ్. బి. డిపార్టుమెంట్లో ఓవర్ సీరుగా పనిచేసుకుంటున్నాను. పఛ్ఛాలుగేళ్ళ సర్వీసులో పట్టుమని పదిరూపా యలు సేవింగ్సు బాంకులో నైనా వేసుకున్న పాపాన్నిపోలేదు. పుచ్చు నాలుగు వందలేభై రూపాయల జీతంతో కిందా మీదాపడి సంసారాన్ని అలా అలా నెట్టు కొస్తున్నాను. అప్పుడో మాటూ అప్పుడో మాటూ ఏ కాంట్రాక్టరు బాబో దయ తలిస్తే పైవాళ్ళు తినగా మిగిలినవి పదో పాతికో నామీద పడుతున్నాయి. పని మనిషికి పండుగ మామూళ్ళొచ్చినట్టు. నేను, నా భార్య ముగ్గురు పిల్లలు. ఎది గొచ్చి ఎల్లెమ్మెయీ చేత్తోపుచ్చుకొని ఉద్యోగం దొరక్క బాధపడుతూ బాధ పెడుతున్న మా తమ్ముడు- ఈతకిమించిన లోతైపోయింది, బతుకు.

బాలకృష్ణమూర్తిగారి పుణ్యమా అని కొంచెం బతికి బైటపడే అవకాశం కలిగేటట్టు కనిపిస్తున్నాది.

నిజమే. బాలకృష్ణమూర్తిగారు వొప్ప చెప్తున్నపని నేను ఒక్కణ్ణే చెయ్య లేను. మరొక ఓ వర్సీర్ని కలుపుకోవాలి సరే. రామనాథం వున్నాడుగా– కలు స్తాడు, చిన్నవాటా పారెయ్యొచ్చు. ఒకరిద్దరు మేస్త్రీలు కావాలి. డిపార్టుమెంటు చల్లగా వుండాలిగాని మనుషులే దొరక్కపోతారా?

రాత్రంతా కూచుని ఎస్టిమేట్లు వేసేను.

పదెకరాల ప్లాటులో నూట ఇరవై రెండు మామిడి చెట్లు, ఆరు చింతచెట్లు నలభయ్యారు తాటిచెట్లూ వున్నాయి.

అవన్నీ కొట్టించాలి.

చదును చేయించవలసిన భాగం ఎకరంనర దాకా వుంటుంది.

బుల్‌డోజరుకి వొక్కరోజు పని.

యాభై ప్లాట్లతో లేఔట్ కొల్తకి రెండువందల నలభయ్యయిదు రాళ్లు పడతాయి. రాయి రూపాయన్నర పెట్టి కొనాలి. మరో అర్ధరూపాయి పాతడానికి ఖర్చవుతుంది, ఒక్కొక్క రాయికీను.

ఎనిమిది వందల యనభై అడుగుల పొడుగు, అయిదువందల అడుగుల వెడల్పు వుంది జాగా. మూడువేల అయిదువంపల అడుగుల పొడుగు కాలు వలు వస్తాయి. పన్నెండుచోట్ల కానాలు కట్టాలి.

అరవై అడుగుల వెడల్పు రోడ్లు రెండు, నలభై అడుగుల వెడల్పు రోడ్లు నాలుగు. రోడ్లకి సహంమేర, తొమ్మిదంగుళాల మందాన్ని కంకర పొయ్యాలి.

సర్వే చేయించడం

ప్లాను తయారు చెయ్యడం

బ్లూప్రింట్లు తీయించడం

మునిసిపాలిటి ఆఫీసులోను, టవున్ ప్లానింగు ఆఫీసులోను, లేఔట్ అప్రూవ్ చేయించడం–

తిరగడానికీ కనపడానికీ–

దానికీ దీనికీ బాగా ఖర్చవుతుంది.

అన్నీ కలుపుకొని, దానిమీద నూటికి పది లాభం వేసుకుని, నూటికి రెండు సాదర్లు వేసుకుని ఎస్టిమేటు తయారుచేశాను.

లక్షతొంభయ్యేనిమిది వేల ఆరువందల కొచ్చింది. ఇరవై వేలు మిగుల్తాయి. రామనాథానికీ, మిగతా పన్లు సాయం చేసేవాళ్ళకీ ఎంత గరిటెజారుగా పారేసినా పదివేలు ఖరాగా నా వాటాకి మిగుల్తాయి. ఐదువేలు అప్పులు తీర్చుకుని అయిదువేలు పెట్టుబడితో ఓ ఆటోరిక్షాకొని మా తమ్ముణ్ణి తిప్పమంటే, అక్కణ్నించి వాడికీ రోజుకి నలభై యాభై రూపాయలదాకా కిట్టుబాటవుతుంది రోజుకి.

రోజూ పనితో సాయపడ్డానికి. కూలివాళ్ళు పని ఎగ్గొట్టకుండా చూడ్డానికి. సాయంకాలం అయ్యేసరికి చిల్లరతోసహా కూలి నివాడా చెయ్యడానికి ఆ లెక్కలూ అవీ చూసుకోడానికి మా తమ్ముడు ఉండనే ఉన్నాడు.ఈ ప్రాజెక్టులో వాడికి కొంచెం ఆర్గనైజేషనూ అదమాయింపూ పట్టుబడితే ముందు ముందు ఎందుకేనా పనికొస్తాడు.

* * *

ఒకటికి నాలుగుసార్లు ఎస్టిమేటుని చెక్ చేసుకుని, రామనాథంచేత కూడా స్క్రూటినీ చేయించి, ధోకా లేదని నిశ్చయించుకుని బాలకృష్ణమూర్తిగారి చేతుల్లో పెట్టేను.

* * *

ఐదు రోజులయింది.

బాలకృష్ణమూర్తిగారు కార్లో వెళుతూ మా యింటి కెదురుగా ఆగినట్టున్నారు. కారు హారన్ వినబడింది.

లుంగీ సద్దుకుంటూ ఇంట్లోంచి బైటికెళ్ళాను.

"నమస్తేండీ" అని ఆయనే పలకరించేరు.

"అయ్యో. నమస్కారమండి" అన్నాను.

"ఆఫీసు లేదాండి, ఇవ్వాళ?"

"వుందండి. పొద్దుట ఔట్ డోర్ కెళ్ళొచ్చేను. మధ్యాహ్నం ఆఫీసు కెళ్తాను."

"ఆఁ. ఏం లేదు. ఇవాళ మా లాయర్స్ సొసైటీ మీటింగున్నాది. అందులో మీ ఎస్టిమేటుని డిస్కషన్‌కి పెడుతున్నాను" అన్నాడు.

"ఏదీ మొన్న మీ కిచ్చిందా?—సరిసరి" అన్నాను.

నా అంతట నేనేం ఉత్సాహం చూపించకుండా ఉందామని ప్రయత్నంతో అలా మాట్లాడాను.

"దాని విషయం—" అని కళ్ళు చికిలించి ఆగాడాయన.

"చెప్పండి."

"ఆఁ. ఏంలేదు—మా మెంబర్సుకి ఆ ఎస్టిమేటు విషయంలో ఏవైనా సందేహాలొస్తాయేమోనని—మీరు ఖాళీగా వుంటే మా మీటింగుకి రాకూడదు, పోనీ?"

"బావుండదండి. ఏదో గవర్నమెంటు జాబ్ చేస్తున్నాను కదా. ఇదేదో గుట్టుగా జరిగితే బావుంటుందనుకుంటున్నానండి!"

"ఐసీ-" అని, తలపైకెత్తి, కొంచెం ఆలోచించినట్టు నటించి "ఆ ఎస్టిమేటు గురించి మీరు మరో మాట ఏమీ చెప్పలేరా?" అనడిగాడు.

"చెప్పేదేముందండి" కనీసపక్షం అయ్యే ఖర్చు మీకు రాసిచ్చేను.అంతకంటే తక్కువకి ఎవరూ చెయ్యలేరు. ఒకవేళ చేస్తే రోడ్లమీద కంకరకి బదులు ఇసకా,కాలవలు రెండడుగుల్లోతు తియ్యడానికి బదులు ఏ అడుగున్నరో తీసి వొదిలేడం-అలా జరుగుతుందండి."

"సో! అంతకంటె ఎవరేసినా తగ్గదంటారా?" అన్నాడాయన.

"తగ్గడం అసాధ్యమండి. నా వరకు చెప్పాలంటే, లక్షా తొంభయ్యెనిమిది వేల ఆరువందలని వేసేనుకదా. రౌండ్ ఫిగర్ కోసం రెండు లక్షలు చూపించేను. కావాలంటే ఆ పధ్నాలుగు వందలు తగ్గచ్చు. అంతకంటే తక్కువ ఎవడన్నా వేసేడంటే పని నాసిరకం అయిపోడమే తప్ప ఉపయోగం ఏమీలేదండి" అన్నాను.

"సర్లెండి. నేను చూసుకుంటాను. ఓ.కె!"

* * *

ఆ తరవాత బాలకృష్ణమూర్తిగారి దగ్గిర్నుంచి కబురొస్తుందని చూస్తున్నాను కబుర్రాలేదు సరిగదా ఆయన కారు మా ఇంటి పక్కనించి వెళ్ళిపోతున్నప్పుడు కూడా తీక్షణంగా రోడ్డు చూసుకుంటూ వెళ్ళిపోతున్నాడే కాని మా ఇంటివేపు తల తిప్పిచూడ్డం కూడా లేదు.

ఆయన కారాపి ల సంగతి ఏమయిందని అడుగుదామని అనిపిస్తుంది. నాకే కాకండా వాళ్ళకూ్కడా వుపయోగమయిన పని కదా. ఆయనే చెబుతాడులే అని అనిపిస్తుంది.

రోజూ రామనాధం నేనూ ఆఫీసులో కలుస్తూనే వుంటాం. ఏదో పనికీ పనికీ మధ్య ఈ సంగతి వస్తుంది—శెలవు పెట్టాలి—రెండు నెలలు పెడితేతప్ప పని పూర్తికాదు. నేనొక నెల పెడతాను నువ్వొక నెలపెట్టు సరిపోతుంది- అని రామనాథం అన్నాడు. సరే అంటే సరే అనుకున్నాం. ఏమీతోచక గోళ్ళు కొరుక్కునేటయిమప్పుడు శలవు కాయితం ఎలా రాస్తే బావుంటుందీ అని ముసాయిదా రాసుకోడం కూడా జరిగింది.

మేం యిచ్చిన టెండరుమీద అంగీకారం తెలుపుతూ పని ప్రారంభించమని కాయితమూ రాలేదు. కబురూ రాలేదు. నా టెండర్లో వేసిన సొమ్ము కన్నా తక్కువకి ఎవరయినా చేస్తామని వేరే టెండర్ ఇచ్చేరేమో అని అనుమానం పీకడం మొదలుపెట్టింది. మళ్ళా మా ఎస్టిమేటూ ఆ రఫ్ కాయితాలూ అన్నీ తిరగేసి చూశాను అంతా అత్తెసరు గానే వేశాను. గవర్నమెంటు జీతం నాలుగు వందల యాభై రూపాయలు వొస్తుండబట్టి పెద్ద లాభం వేసుకోకుండా యిచ్చేను. మరొకరయితే నూటికి మూడురూపాయలు వడ్డీ కింద కూడా వెయ్యాలి గనక నా టెండర్ కన్నా తక్కువ చేసి ఎవరూ ఇవ్వలేదనే తేల్చుకున్నాను.

అలా పదిహేనురోజులు దాటుంటుంది.

* * *

సైకిల్ తొక్కుకుంటూ ఎల్లమ్మతోట జంక్షన్ దగ్గర ఒక పెద్ద లోడ్ లారీని తప్పించుకోబోయి ఒక స్కూటర్‌కి తగిలించాను సైకిల్ని.

"ఏమయ్యా ఇంటిదగ్గర చెప్పే వొచ్చావా?" అని స్కూటరాయన దయగా పలకరించాడు.

"రోజూ అదే అలవాటు మరి; ఈరోడ్ల ధర్మమా అని." అంటూ అతన్ని తేరిపార చూసి "నువ్వు రాజారావు కదు?" అన్నాను. "హోరి-నువ్వట్రా" అని, స్కూటర్ దిగి పక్కకి తీసి. "రా, రా! ఎక్కడుంటున్నావు?" అని పలకరించేడు రాజారావు.

"నువ్వు దయతలిచేవు కనక ఇంకా ఇక్కడే వున్నాను! లేకుంటే ఈపాటికి" అని పైకి ఓ వేలు చూపించేను.

రాజారావు స్కూటర్‌కి స్టాండేసి నా భుజమ్మీద చెయ్యేసి "మంచివాడివే పొద్దుట యవడి మొహం చూసేనో కాని పెద్ద యాక్సిడెంటు క్షణంలోతప్పింది' అన్నాడు.

"నువ్వు కనపడి ఐదేళ్ళయింది, లోగడ స్టేట్ గవర్నమెంట్లో సర్వేయర్‌గా వుండేవాడివి" అన్నాను.

"అవును. ఆ తరవాత టవున్ ప్లానింగ్‌కి వెళ్ళిపోయేను,అక్కడుండగా నలుగురు పెద్ద మనుష్యుల్తోనూ పరిచయం ఏర్పడి—" అని ఆగేడు రాజారావు.

"కొంచెం సంపాదించుకుని—" అని స్కూటర్‌వేపూ, వాడు నాలుగు వేళ్ళకీ తగిలించుకున్న ఉంగరాలవేపూ చూపిస్తూ "ఉద్యోగం మానేసుంటావు" అన్నాను.

"ఎగ్‌జాక్ట్‌లీ— టవున్ ప్లానింగ్‌లో ఉద్యోగం మానేసినా, వాళ్ళపనే చేస్తున్నాను- కంట్రాక్ట్‌లు" అన్నాడు.

"ఇల్లెక్కడ?"

"ఇల్లిదుగో ఇల్లీసందులోనే, రా, పోదాం. నీకు పార్టీ ఇస్తాను!" అని స్కూటర్‌స్టాండు ఊడదీసేడు.

"పార్టీ యెందుకు!" అన్నాను, మరేదో గొప్ప విషయం చెప్తాడని,

"ఎందుకేమిటి! ఉన్నపళంగా జెయిలు కెళ్ళవలసిన వాణ్ని కాపాడేవు; పద, పద!"

అలా వెళ్ళి వాడింట్లో కాఫీతాగి ఆ కబురూ ఈ కబురూ చెప్పుకున్నాం. వాడు టౌన్ ప్లానింగ్ కంట్రాక్టులు చేస్తున్నానన్న దగ్గర్నించీ నా ప్రాజెక్ట్ సంగతి వారితో చెబ్దామని కోరిక మొదలయింది. అంచేత వాడితో వాడింటి కెళ్ళాను.

"ప్రస్తుతం ఎక్కడ, నీ ఏరియా ఆఫ్ అపరేషన్?" అన్నాను.

"ప్రస్తుతమా?—ఏదో వో అణా కానీ బేరం వోటి తగిలిందిలే, అది చేస్తున్నాను." అని, నేనడక్కండానే బాలకృష్ణమూర్తిగారి సేరు. ఆప్రాజెక్ట్. అన్నీ చెప్పాడు. 'వాఃమైంది మొదలెట్టి!' అన్నాడు.

"ఎంత కిడుతుంది, ఇందులో?" అన్నాను.

"కడుతున్నది లక్షరూపాయల్దాకా వుంటుంది. కాని మడుతున్నది మాత్రం యిరవై వేలకి మించి ఉండదు" అన్నాడు చిన్న నవ్వొ ఓ సిగరెట్టూ వెలిగిస్తూ.

"అదేంటలాగ? ఇన్‌కమ్‌టాక్స్ లెక్కల్లాగ బోధపడకుండా చెప్పేవు." అన్నాను.

"అదంతేలే. నేను పెట్టింది హయ్యెష్టు టెండరు. ఆ లాయర్స్ సొసైటీ అక్కడ గజం అయిదు రూపాయలచొప్పున జాగా కొన్నారు. రోడ్లూ కాలవలూ యేర్పాటు చేసి ఇల్లు కట్టడానికి జాగా వొప్పచెప్తే, గజానికి పదిహేన్నుంచి పదిహేడు రూపాయల దాకా వుంది టౌన్ ప్లానింగ్ వాళ్ళరేటు. ఆ రేటుకి నేను మూడురూపాయలు తక్కువ చేసి చెప్పేసరికి సొసైటీ చాలా సంతోషంతో వొప్పు కుంది. కాని ఈ బాలకృష్ణమూర్తి గారున్నాడే, దేవాంతకుడు. నా టెండర్ని అలా నీట్లో నానబెట్టి: దాన్ని వాడి చేతా వీడిచేత తిరగా మరగా లెక్కలు కట్టించి, నేను రెండులక్షల యనభై ఆరువేలన్న దాన్ని ఎవడో లక్షా తొంభ య్యేనిమది వేలకి చేస్తానన్నాడంటూ వొక యెష్టిమేటు పట్టుగొచ్చేడు!—అది చూసి నేను నిర్ఘాంతపోయేను. కించ ఉడు నాకు అనుకున్నదానికంటే యాభై వేలు తక్కువ వొచ్చింది. ఈ వర్కొస్తే ఆ నష్టాన్ని పూడ్చుకొని మరో యాభై వేలు చేసుకోవచ్చుకదా అని నే చూస్తుంటే పులిమీద పుట్రలా వీడొకడు తగి లేడు. నా పీకల మీదికి!"

నాకు చమట్లుపోశాయి. ఆ టెండర్ నేనే యిచ్చేనని ముందుగా తెలిస్తే ఇందాక స్కూటర్ మీదుండగా నన్ను దయ తల్చుండే వాడా, రాజారావు; అను కొని కేజీ గాలి లోపలికి పీల్చేశాను.

"మరి వాడెవడో అంత తక్కువకి చేస్తానన్న పని, లక్షరూపాయల తేడాతో నీకెలా వొప్పు చెప్పాడీ బాలకృష్ణమూర్తిగారు!" అన్నాను.

"సరిపోయింది!" అని తల వేళాకోళంగా ఆడించేడు రాజారావు. "లోకం మీద నేనే పెర్రి వెధవని అనుకున్నాను" అన్నాడు. నాకన్నా వెర్రి వెధవ్వి నువ్వొకడి వున్నావని స్ఫురణకి తెస్తూ.

"చూడు భాయ్ రైల్వే టయిమ్ టేబిళ్ళ పుపయోగం ఏమిటి?" అని అడిగేడు: కొంచెం ఆగి.

"అదేమిటా ప్రశ్న?"

"రెయిళ్ళు వొచ్చేక, ఎంత లేటుగా వొచ్చేయో తెలుసుకోడానికి. అలాగే, హయ్యెస్టు టెండర్ నా దగ్గర తీసుకుని, లోయెస్టు టెండరు ఇంకోడి దగ్గిర తీసుకుని ఈ వర్కులో ఎంత మిగల్చొచ్చో లెక్క చూసుకున్నాడయ్యా, బాలకృష్ణమూర్తిగారు. లక్ష మిగుల్తుంది అని తేలిం తరవాత, ఆ వర్కు నీకివ్వడానికి వీల్లేదంటూ మొదలుపెట్టి. చివరికి, ఈ వర్కు నీకే యిస్తాను. మరి నాకేమిస్తావు అంటూ బేరం పెట్టేడు."

"అదా!" అని తెల్లమొహం వేసేను.

"ఈ వర్కు సొసైటీ అంగీకారంతో ఆయన నాకు వొప్పచెప్పేటట్టు. నా హయ్యెస్టు టెండరు ప్రకారం సొసైటీచేత నాకు డబ్బు యిప్పించేటట్టు. ఈ లక్షలో డెబ్బయివేల మేరకి ఈ ప్లాట్లలో వొక దాంట్లో బాలకృష్ణమూర్తిగారికి ఒక యిల్లు నేను కట్టించి ఇచ్చేటట్టూ మా యిద్దరి మధ్యా ఏర్పాటు" అని రాజారావు కథ ముగించాడు,

***

(జ్యోతి మాసపత్రిక; దీపావళి 1966)

# 22

సాయంత్రం ఆరు దాకా పరధ్యానంగా ఆఫీసులో కూచుని ఏదో పాత ఫైల్సు తెగ్గొట్టేస్తూ ఆనందం పొందుతూ ఉంటే ఎవరోవచ్చి అడిగారు; ఫలానా సినిమా చూసేరా, ఇవాళ ఆఖ్రరోజు సుమండీ అని. అప్పుడు జ్ఞాపకం వచ్చింది; ఊళ్ళో ఒక ప్రెసిడెంట్ ఎవార్డ్ సినిమా ఆడుతోందని. వెంటనే విశాలికి, సరాసరి ఫలానా సినిమాహాలు దగ్గరకొచ్చెయ్యమని కబురుచేసేను. టిఫిన్ తిని హాలు దగ్గరకెళ్ళేసరికి నాకన్నా ముందుగానే ఆవిడగారు అక్కడ చేరి చేటంత మొహంతో. నూరు వాట్ల బల్బులా వెలిగే కళ్ళతో, విశాల హాసంతో నన్ను ఆహ్వానిస్తోంది. అంత కులాసాకి కారణమేమిటో అడిగెయ్యా లనిపించింది. అడిగేస్తే 'ఆఁ, యేంలేదులెండి.' అనేసి మామూలుగా తయారయి పోతుందేమోనని భయంవేసి చిన్నబుచ్చుకుండానే కుశల ప్రశ్నలేసి కాలం గడిపే శాను. ఆ ప్రసన్నవదనం పదేపదే చూడబుద్ధేసింది. నలుగుర్లో ఉండిపోయామే, ప్రశంసించి అభినందించే అవకాశం జారిపోతోందే అని దిగులేసింది.

మత్తు వదిలింతరువాత తెలిసింది; ఈ వదనంలో పచ్చదనం అదనంగా రావడనికొ్కారణం కొత్తకొత్త నగలేవో మెళ్ళో మెరవడమేనని. మెళ్ళోనే కాదు; చేతులకీనూ, మెడలో పెడల్పాటి జాజిమొగ్గల నెక్లేసేకాక. చేతులు రెండింటికీ రెండేసి జతల గాజులు పెట్టుకొచ్చింది. ఎవరివో!....ఎంత చెప్పినా ఈ భారత స్త్రీలకి ఎరుపు నగలు పెట్టుకోడం, ఎరుపు చీరలు కట్టుకోడం, ఈ అలవాట్లు తప్పవు కాబోలు!....భారతస్త్రీ సంస్కృతిలో యివి ప్రత్యేక లక్ష ణాలుగా మిగిలిపోతాయి....ఏది ఏమైనా ఎరుపునగలు పెట్టుకుని అంతగా అంత మొహం చేసుకోవడం అనవసరం అనిపించింది.

సినిమా చూసేం. ఇంటికొచ్చేం. భోజనాలుకూడా కులాసాగా కబుర్లు చెప్పుకుంటూనే చేసేం. అయినా ఎరుపు నగలు ఎందుకు తెచ్చేవు, ఎవరివి; ఎరుపు నగల్తో అంత ఆనందం ఎలా పొందగలుగుతున్నావు—ఇలాంటి ప్రశ్నలు నేను వెయ్యలేదు, ఆవిడ తనంతట తాను ఈ విషయం ఎత్తకపోగా, అవి తన

శరీరంమీద ఉన్నాయన్న చైతన్యంవల్ల ఈ ఆనందం అనే విషయం చూపుల్లో కూడా సూచితం కాకుండా గడుసుగా జాగ్రత్తగా కాలం గడిపేసింది; కాని చివరికి ఓడిపోయింది.

వెనకటికి ఓ బంగారమ్మగారు రవ్వల ఉంగరం చేయించుకొని, మధ్యాన్నంపూట కబుర్లకొచ్చిన అమ్మలక్కలు పులుసులూ కూరలూ సినిమాలూ పంపువగ్గిర తగాదాలూ మాట్లాడేసుకుంటూ ఉంగరం విషయం ఎవ్వరూ అడక్కపోతే, అబ్బా! ఉక్కపోస్తోంది; కాసేపు ఈ రవ్వల ఉంగరం తీసేస్తానందిట అలా మా విశాలి రాత్రి పడుకోబోయేటప్పుడు; "ఇవితీసి పెట్లోదాచి తాళం వెయ్యండి; ఆరుబైట పడుకుంటాం కూడాను; ఎందుకేనా మంచిది!" అని అవన్నీ నాకిచ్చింది. అప్పుడేనా నేను 'ఎవరివి?' అనీ 'ఎందుకుతెచ్చే'వనీ, 'ఎరువు బరువుతో సరదాలు తీర్తాయా' అనీ అడుగుతానని కాబోలు. నాకు తెలుసు ; "అవును మీరు చెప్పింది నిజం; ఎరువుతెస్తె సరదా తీరదు; కనక కరువుతీరా మీరే చేయించండి" అంటుందని. అందుకని మాట్లాడకుండా వాటిని పెట్లోపెట్టేసి, తాళం వేసొచ్చి నా మంచం దగ్గిర కెళ్ళిపోతున్నాను.

"ఏమండీ—" అన్నది విశాలి గోముగా.

వెనక్కి తిరిగాను; తనే నాదగ్గరగా వొచ్చింది.

"బాగులేవాండీ, నెక్లెసూ అవీ?"

"ఎవరివవి?"

"ఎవరివో—బాగున్నాయో లేదో చెప్పమంటే!"

"ఎవరి వస్తువులమీదో మనభిప్రాయాలు చెప్పడం అంత మంచిది కాదేమో"?

"వాళ్ళతో చెప్పొద్దులెండి. ఏదో మన్లో మన మాట!"

"నువ్వు వాళ్ళతో చెప్పవని హామీ ఏమిటో?"

"చెబుదురూ! ఇంతట్లో మించిపోయిందేమీలేదు."

"సుందరమ్మగారివేనా?" అని అవతలి వాటావేపు వేలు చూపించేను. తల నిలువుగా ఆడించింది విశాల. "ఆ ఉన్న నగలు చాలవుటే ఆవిడకి. ఇంకా ఎన్ని మోస్తుందేమిటి?"

"అయనిష్టం, ఆవిడ అదృష్టమున్నూ. ఎలా ఉన్నాయో చెప్పండీ అంటే యీ కామెంట్లెందుకు?"

"బరువుగానే ఉన్నాయి. సేల్సుటాక్సు ఆఫీస్‌లోకదూ, అయనకుద్యోగం!"

"పోనీలెండి పాపం! ఏదో ఒక ఆఫీస్. అందరికీ మీ డిపార్టుమెంట్లోనే కావాలంటే వీలవుతుందా?"

"ఇహ అయినట్టేనా?" అని కదలబోయాను. చెయ్యి పట్టుకు ఆపింది.

"అదిగాదండీ, ఆ నెక్లెసూ, నాలుగు జతల గాజులూ అన్నీ కలిపి నాలుగు వందల యెనభై అటండీ."

"మంచి బంగారమేనా?"

"మరీ బావుందండీ. పట్టుకుని చూసినా తెలియలేదేమిటి? అచ్చం ఇరవై రెండు కేరట్ల బంగారమైతేనూ!"

"ఈవూళ్ళోనే చేయించేరా?"

"అఁ!"

"చేసిన పనివాడెవరో!"

"పనితనం బావుంది కదండీ. ఎవరో వీరభద్రమట. సినిమాహాల్ దగ్గిరెక్కడోట"

"రిపోర్టు చేస్తానని చెప్పు, మీ సుందరమ్మగారికి. తెలిసిందా! ఈయనా ఆయనాకూడా గవర్నమెంటుకి అతిథులుగా వెళ్ళిపోతారు. దేశంలో బంగారం నిలవ లెంతున్నాయో తెలీక గవర్నమెంటు చస్తూవుంటే, గవర్నమెంటు ఉద్యోగి అయిఉండి కూడా పెళ్ళానికి ఇరవై రెండు కేరట్ల బంగారంతో నగలు చేయిస్తాడా! చేసినవాడు ఏదో భుక్తి గడవక కూలికి కక్కుర్తి పడ్డాడే అనుకో! చదువుకున్నవాడుగదా; ఈయన బుద్దేమైందిట?" కోప్పడ్డాను.

"సరేలెండి—" బుంగమూతి పెట్టింది విశాలి."మిమ్మల్ని కొనమంటానేమో అని ముందర కాళ్ళకి బందాలు వేస్తున్నారు...."

"నేనేం కొననని చెప్పలేదే! పద్నాలుగు కేరట్లవి కావాలంటే నేను రెడీ—"

"చాల్లెండి, నిర్వాకం! ఎంతసేపూ పద్నాలుగు కారట్లు వస్తువులూ నలభయ్యో నెంబరు నూలుచీరలూ అంటూ కూచుంటారు...."

ఒక్కసారిగా ఆవేశం వచ్చింది. దేశం ఆర్థిక పరిస్థితి. గోల్డు స్టాండర్డు రిజర్వు బ్యాంకికీ బంగారపు నిలవలకి ఉండే అనుబంధం—ఈ విషయాలమీద ఉపన్యాసం యివ్వాలని. కాని అప్పటికే రాత్రయిపోయింది. తీక్షణంగా విశాలి

కళ్ళల్లోకి చూసేసి గట్టిగా ఊపిరి పీల్చేశాను. దాంతో నా అయిష్టం వ్యక్తమై పోతుందనుకొని.

కాని విశాలి మళ్ళా నెమ్మదిగా, గోముగా గొంతు మార్చుకుని అంది. "అంత డబ్బూ ఒక్కసారే యిచ్చేయక్కర్లేదటండీ. మొదట నూరో నూట యాభయ్యో ఇచ్చి ఆ తరువాత నెలకింతా అని ఇవ్వొచ్చుట. అలా ఇచ్చేటట్టు ఏర్పాటు చేస్తానందండీ రుక్మిణమ్మగారు."

"ఓహో, ఇందులో ఈవిడగారు కూడా ఉందన్నమాట. హుం! పిచ్చి పిచ్చి వేషాలు మానేసి తెచ్చినవి తెచ్చినట్టిచ్చేయ్ ఎరువు సొమ్ము బరువు చేటు—" అనేసి గబగబా వెళ్ళాను.

రుక్మిణమ్మగారిని, మా యింటావిడ—అదే. మా యింటిగలావిడే అనుకోండి—పంధొమ్మిది వందల ముప్ఫయిరెండులో అనగా ఆవిడకి పన్నెండేళ్ళప్పుడు పెళ్ళయింది; మరుసటేడే, అనగా ఆవిడికి పదమూడేళ్ళప్పుడే ఆయన పోయారుట. అప్పట్నించీ ఆవిడ తను ఓ గదిలో ఉండి. మిగతా యింటికి రెండు వాటాలు చేసి అద్దెకిచ్చి కాలక్షేపం చేస్తూంది. మొగుడు పోయినాక కొద్దిగా చదువుకొని పంతులమ్మైంది. ఆవిడికీ మా విశాలికీ అంత స్నేహం అయిపోవడ చిత్రం బదిలీ అయినప్పుడు క్షణమేనా ఆగకుండా వొచ్చి జాలున్ కావలసొచ్చింధి. సరే. ఏ సత్రంలోనైనా దిగుదాంతే అని. ఎకాయెకీ సతీ మణితో సామానుతో సహా వొచ్చేశాను. ఆఖరురైల్లో ఆవిడా మేమూ వో కంపార్ట్మెంట్లో యెక్కాం. అంతే. యిహ సత్రమూ లేదు, సన్యాసమూ లేదు. "కొత్తగా మా వూరికి బదిలీ ఐ వొస్తున్నారా అమ్మడూ" అని ఆవిడ ముచ్చట పడడమూ:

"ఇల్లేనా చూసుగోకుండా వొచ్చేస్తున్నా మండీ" అని యీవిడ దిగులు పడ్డమూ.

"చూసుకోకపోతే యేంలే అమ్మా, మా యింట్లో వో వాటా ఖాళీగా వుందమ్మా" అని ఆవిడ అర్ధోక్తిలో ఆగడమూ

దాం తరువాత యీవిడ అర్థ గర్వితంగా నావేపు ఓసారి చూడ్డంతప్ప వేరే యేం అనకపోవడం,

ఆవిడ గడుసుగా నవ్వేసి "మాలాంటి వాళ్ళెళ్ళలో మీరుండరు

గాబోల్లెండి" అని తను నొచ్చుకున్నట్లు తెలియకుండా యీనిణ్ణి మెల్లిగా వొప్పించడం.

అంతలో యీవిడ యిదైపోయి, "అయ్యో ఎంతమాటన్నారు! వెళ్ళగానే మీ యిల్లు చూసి గాని యింకెక్కడా అద్దిళ్ళ కోసం బోగట్టా చెయ్యంలెండి" అని హామీ యివ్వడం.

ఆలా అలా, మేం స్టేషన్నించి సరాసరి వాళ్ళింటికే వెళ్ళి అక్కడే ఈ ఎనిమిది నెల్ల బట్టీ సద్దుకుని వుండిపోవడం వరకూ వచ్చింది.

ఆ నాట్నించీ విశాలి; యిటు నా భార్యగా ఉండవలసిన బాధ్యతొకటి తననెత్తిమీదుంచుకునీ కూడా. అటు అవిడ స్నేహంతో మత్తెక్కిపోయి. వొక్కమాటలో చెప్పాలంటే-పిలిస్తే పలక్కుండా తయారైందనుకోండి. ఆవిడతో బజార్లు షికార్లు చెలాయిస్తుంది. కూర్లెంచుకోడాల దగ్గిర మొదలెట్టి చీర్లెంచుకోడాల దాకా వొచ్చింది. వంటలూ వార్పుల్లో సాయం చేసుకోడాల దగ్గిర్నించీ యక్స్పెరిమెంట్లు చేయించడం వరకూ నడిచింది. తలంట్లూ అవీ తటస్తపడ్డప్పుడు పులుసులు పోసుకోడాల దగ్గిర్నించి ఆ తలుపుల్లేని బాత్రూమ్కి కాపలా వుండడాల వరకూ వెళ్ళి వీపులు రుద్దుకోడాల దాకాసాగింది. ఆ బాత్రూమ్ నించి యీ పడగ్గది వరకూ బాతాఖానీలు నిరాటంకంగా నిరవధికంగా సాగుతాయి. పైగా యిల్లు చిన్నది గదూ (ఆమాటంటేనే, మా ఆవిడకోపం ముంచుకొస్తుంది) ఎవరెక్కణ్ణించి మాట్లాడినా అందరికీ వినిపిస్తుంది. గోడల మీంచీ తడికెలమీంచీ మాట్లాడేసు కోవడం, అర్ధరాత్రయి దీపాలార్పేసుకు మంచాలమీద చేరినాకూడా చీకటి గదుల్లోంచి చిన్నమెత్తు విలువచెయ్యని చిన్న చిన్న విషయాలమీద చేట భారతాలు పెరిగిపొయ్యేడం. వినుగుపుడ్తుంది. రెండు మూడు సార్లు"ఏమే ఈ యిల్లు చాలడంలేదే; ఎక్కడికేనా మారి పోదామే" అని నేను సూచిస్తే కూడా "ఎందుకు లెద్దురూ, చిన్న లుల్లయినా ఏదో సర్దుకుంటున్నాంగా" అని సద్దేసేది.

ఏం కూర లొండుకోవడం అనే విషయం దగ్గిర్నుంచీ పక్క లెక్కడ వేసుకోవడం అనే సమస్య వరకూ ఆవిడ సలహాలు ఇవ్వకా మానదు; ఈవిడ అడక్కా మానదు. అదేమిటమ్మా చిలకా గోరింకల్లాగ యిద్ద రున్నప్పుడే ఒళ్ళు పచ్చగా యింత బంగారం పెట్టుకోవాలిగాని ఆనక నలుగురైదుగురు పుట్టాక చేయించుకుందాం అనుకుంటే మాత్రం అవుతుందా? అని మా విశాలిని

ఆవిడే పురికొల్పింది. ఒకటి రెండుసార్లు నాతోనే అంది కూడాను—బంగారం ఎలాగైనా కొనుక్కోవాలన్న ఈ పట్టుదల విశాలి క్కలగడానికి కారణం ఈవిడ ప్రోద్బలమే! ఇలాంటి నగలు తనకీ చేయించమని పీకలమీద కూచుం టుంది కాబోలు ఈవిడ.

చివరికి ఈవిడ మా సంసారంలో చీదర ప్రవేశ పెట్టడానికి ఉద్యమించిం దన్నమాట. ఎనిమిదేళ్ళయింది మాకు పెళ్ళయి. ఎప్పుడూ దేని విషయం కూడా మేం రెండు మాటలనుకోలేదు. అన్లేదు. చివరికి ఈవిడద్వారా ఈ రకం అనుభవాలు కూడా ప్రాప్తమౌతాయని స్ఫురించి భయం కలుగుతోంది.

ఇంకో యింట్లోకి మారిపోవాలి. తప్పదు.

విశాలి ఇంటికీ తాళం వేసొచ్చి పక్కమంచమీద పడుకుంది. అందరూ ఆరుబైట మంచా లేసుకున్నారు. నా కివతల పక్క మా కమర్షియల్ టా క్సాఫీసు రాక్షసుడు. ఆయన కవతల సుందరమ్మ అనేపేరు గల బంగారపు హిడింబి. ఆవిడ కవతల రెండు మంచాలమీద వాళ్ళ నలుగురు పిల్లలూ. నాకు రెండోవెపు మా విశాలి. అవతలగా మా యింటి గలావిడ, ఇంకా అవ తల ఈ ఊళ్ళోనే రికామీగా తిరుగుతున్న ఆవిడ పింతల్లి కొడుకూ. వాళ్ళందరూ మేం సినిమా నుంచొచ్చేలోగా ఒక నిద్ర తీసినవాళ్ళే. మేం రావడం, భోజనాలు చెయ్యడం ఈ హడావుడికి మెలకువ లొచ్చేయి గాబోలు. మళ్ళా కబుర్లకి లంకించుకున్నారు. వరసగా తీవ్రంగా కాకపోయినా అప్పుడో మాటా అప్పుడో మాటగాఅనుకుంటున్నారు. నేను వాళ్ళతో ఎక్కువగా మాట్లాడనని వాళ్ళ కందరికీ తెలుసు. అంచేత పలకరించలేదు. విశాలి రాగానే వాళ్ళు సినిమా ఏమిటి ఎలా వుందన్న నెపంతో సంభాషణ ప్రారంభించి నగ లెల్లా ఉన్నా యన్నారు మీ ఆయన? అని అడిగేసి. మరి మీకు చేయించడం మా టేమన్నారు అని పంచాయితీ చేస్తారేమో, వాళ్ళతో ఎలా యుద్ధం చెయ్యడమని ఎప్పుడో చదివిన ఎకనామిక్స్ పాఠాలు గుర్తుతెచ్చుకుంటున్నాను.

ఏదో పనిమీద ఈ వూరొచ్చి మూడు రోజులుండి, అప్పుడే వెళ్ళి పోయాడు రాధా కృష్ణమూర్తి. వెళ్తూవెళ్తూ వాడాడిన మాటలు వింటూవుంటే నాకు విశాలిమీద చాలా కోపం వచ్చింది. "ఒరే హోటల్లో దిగితే యేడుస్తావని మీ యింటికొచ్చినందుకు మా బాగా చేసేవురా. ఈమా రొచ్చినప్పుడు

హోటల్లో దిగుతాన్లే. బుద్ధొచ్చింది" అన్నాడు. "ఇల్లు కొంచెం ఇరుకే అనుకో; కాని మాకు సరిపోతుందిగదుట్రా!" అని అప్రయత్నంగా విశాలిని సమర్థించేను "పోరా! ఇల్లు మార్చాలని నీకున్నా ఆవిడ మార్చనిస్తుందేమిటి? నేనంతాచూసే న్లేరా!" అనేశాడు. మూడు రోజులూ వాడు సణుగుతూనే ఉన్నాడుగాని నేనట్టే పట్టించుకోలేదు; పైగా మేమిద్దరం కలిసి విశాలితో వాదించి ఈ విషయంలో వో మంచి నిర్ణయానికి రాగలిగిన అవకాశం చేతులారా జార విడిచేను. ఓ పూట మావాడేదో సణుగుతూ వుంటే విన్నట్టుంది, విశాలి: "అన్నగారు మాకీ యిల్లు చాలదని యిదవుతున్నట్టుంది. పెద్దలు చెప్పినట్లు ఆలిమర్కటం యెలాగూ చెయ్యలేకపోయారు మీ ఫ్రెండు; అందుకని యిల్లు చిన్నది తీసుకున్నార్లెండి. అయినా పదిమంది ఒచ్చి పోయీ సంసారం కాదుగదండీ. ఏదో సర్దుకుపోతు న్నాం" అని వో చిన్న భాషణ నిరోధక ఉపన్యాసం యిచ్చేసి, వాడిచేత "దానికేముందిలెండి. మీరు బాగా ఎడ్జస్ట్ మెంటాలిటీ. దాని ప్రభావమే యిది" అనిపించుకొని. నావేపు గర్వంగా చూసేసింది.

"విశాలీ! నేను వేరే యిల్లు చూసుకుంటున్నాను. ఇంచక్కా నువ్వూ మీ రుక్మిణమ్మగారూ యిందులో చిలకా గోరింకల్లా కలకాలం కాపరం చెయ్యండి. ఇదే ఆశీర్వదిస్తున్నాను. నీకేమో, పుత్రపౌత్రాభివృద్ధిరస్తు; ఆవిడకేమో దీర్ఘ సుమంగళీ భవ!"

"స్ స్స్! ఊరుకోండి. ఆవిడింట్లోనే ఉంది కూడానూ. వినబడగల్దు!"

"వినబడితే? నాకేం. ఇంక్రిమెంటు స్టాప్ చేస్తుందా?"

"చాల్చాల్లెండి. ఏమిటా మాటలు? ఆవిణ్ణి పట్టుకొని దీర్ఘ సుమంగళీ అనొచ్చండీ మీరు?, పాపం, ఆవిణ్ణి భగవంతుడు తిన్నగా చూసేడు కాదుగనక ఆవిడ ఖర్మ అలా అయిపోయిందిగానీ—" అని ఆవిడ తరపున విశాలి ఏకంగా కంటతడి పెట్టుకోడానికే సిద్ధమైపోయింది.

మళ్ళీ ఆరాత్రి తనే సంభాషణ ప్రారంభించింది.

"అన్నిటికీ ఇమ్ముగా వుంది సుమండీ ఈ యిల్లు. అద్దె తక్కువ. మీరే చెప్పండి; నెలకి యాభయ్యో, అరవయ్యోపోసి పెద్ద బంగళాలోకి వెళిపోతే మాత్రం డబ్బు దండుగ తప్ప ఏమేనావుందీ?— ఇంతకూ మీకు జీతంలో

విశాలి నింపాదిగా "నేనేం చూడక్కర్లేదు" అంది.

"అంటే నేనే ఏదో యిల్లు చూసొచ్చేక, ప్రవేశించిన మర్నాట్నుంచీ ఈ యిల్లు నాకు నచ్చలేదండీ అని రోజూ పోరు పెడదామని గాబోలు నీ ఉద్దేశం. అదేం కుదర్దు." అన్నాను: యుద్ధానికి సిద్ధమైన వాళ్ళాగ.

"మనం ఈ ఇంట్లోంచి ఇంత వేగం మారిపోవటానికి వీల్లేదండీ." అంది విశాలి; నా ఆవేశం ఏమీ పంచుకోకుండా.

"ఏం మూఢమి వుందా?" తీవ్రంగా అని, మంచంమీద వాలాను.

"మీరు అయిదు నిమిషాలు శాంతంగా ఉంటే నేను మాట్లాడతాను." అని విశాలి లేచింది. బావిదగ్గర కెళ్ళింది, అనవసరంగా కాళ్ళూ చేతులూ మొహం కడుక్కుంది. కాలయాపన చెయ్యడానికని తెలుస్తూనే ఉంది. ఇంట్లోకొచ్చి అద్దం దగ్గిర చేరి ముస్తాబు చేసుకోడం మొదలెట్టింది.

నేను నిశ్శబ్దంగా ఉండగలిగాను; కాని ఒక్కసారిగా 'శాంతం' రాలేదు. ఈ యింటిలో ఉండడానికి విశాలికి ఎందుకు పట్టుదలగా ఉండి ఉండవచ్చు? బహుశా సుందరమ్మగారూ రుక్మిణమ్మగారూ తనకి మంచి సహవాసస్తురాళ్ళుగా ఉండి వున్నారేమో. ఇరుగూ పొరుగులను ఆ దృష్టితో చూస్తే అవి చాలా అవసరమైనవే. అయితే చాలా స్వల్పమైన విలువ; అల్పమైన తాత్కాలికమైన అనుబంధం. ఏ యింటికి వెళ్ళినా ఈ మాత్రం స్నేహితురాళ్ళని సుళువుగా సంపాదించుకోవచ్చును. ఇంతకీ ఏమంత విదుషీమణులు, ఈ మహిళలు! ఒకావిడకి తన భర్తనీ అతని వుద్యోగాన్నీ చూసి గర్వం; రెండో ఆవిడకి తన భర్త లేకపోడం, తన ఉద్యోగం చూసి గర్వం కాబోలు. నాకే అర్థం కావటం లేదా? ఒకవేళ విశాలివీ, వాళ్ళవీ అభిరుచులు సరిపోయి స్నేహం తియ్యగా వుందేమో! ఏమి అభిరుచులు! పురాణాలు మెచ్చుతారు. పౌరాణిక నాయకుల్లా సత్యకాలంగా ప్రవర్తించే భర్తలు నచ్చరు. సాహసంతో సంస్కార పంథా తొక్కిన నవలల్లోని పాత్రలు చూసి ఆనందిస్తారు. పొరుగింటి అబ్బాయో, అమ్మాయో అలాటి పనేదైనా చేస్తే బుగ్గలు నొక్కుకుని చెవులు కొరుక్కుంటారు. సినిమాలు చూసి మెచ్చుతారు. అలా డ్రెస్ చేసుకున్న వాళ్ళనీ అలా మాట్లాడే వాళ్ళనీ చూసి మెటికలు విరుస్తారు....ఇలాంటి నేలబారు అభిరుచులు కలిగిన వాళ్ళని ఒక్క దగ్గర వదిలిపెడ్తే సంఘర్షణ తటస్థించదు. ప్రగతికి అవకాశమే లేదు. పరస్పర

ప్రశంసల వల్ల స్నేహాలు బలపడతాయి. ఈ సామాన్య సంసార నాయికలు ఒక రొన్నొకరు ప్రశంసించుకోడానికి వీళ్ళకున్న చరిత్రేమిటి? సంఘానికి వీళ్ళు చేసిన సేవేమిటి? భర్తలమీదా, పిల్లలమీదా గొప్పలు చెప్పుకుంటారు. మా ఆయన ఇంత డబ్బు సంపాదిస్తున్నాడంటే మా పిల్లలు అంతంత బుద్ధిమంతులని, మా ఆయన బంగారం కొన్నారంటే మా ఆయనే బంగారం అనీనూ.

"ఏమిటండీ ఆలోచిస్తున్నారు?" అంది విశాలి, నా పక్కనొచ్చి పడుకొని.

"ఏం లేదు." నేనటు తిరగలేదు. మా యిద్దరి మధ్యా యెక్కువ ఖాళీలేదు. అందుకని ఎడంగా జరిగేను. "తల ఎత్తయి పోయిం" దంటూ వొక దిండు తీసి యిద్దరి మధ్యా వేసేను.

"దిండు కాదు వెయ్యడం, కత్తి వెయ్యాలి. అప్పుడు భర్తృహరి చెప్పినంత గొప్పవారవుతారు మీరు." విశాలి ఎగతాళిగా నవ్వి, ఇంతసేపూ నావేపు తిరిగున్నదల్లా, అటు తిరిగిపోయింది,

కొంతసేపు నేను మాట్లాడలేదు.

"నామీద కోపం పోయిందాండి?"

"నీమీద కోపం నాకెందుకూ?"

"ఊఁహూఁ !....అంటే కోపం పోలేదన్నమాటే. అయినా మీరు 'కోపం లేదంటున్నారు కనక, నే నడిగినదానికల్లా సమాధానాలు చెప్తారా?....అంటే నే నడిగేదాన్నీ మీరు చెప్పేవాళ్ళు అన్న దృష్టితో కాదనుకోండీ——" అదొక రకం గడుసుతనం: దభాయిస్తూనే, బతిమాలుకుంటున్నట్టు స్వరం పోసుకోడం: ఆ మాటలూ అలాంటివే వుపయోగించడం.

"అడుగుమా!"అన్నాను,వినుకుఁంటున్నట్టు, కుతూహలం తెలియకుండా వుండడానికి.

"మనం ఈ యింటి కొచ్చి ఎన్నాళ్ళయింధండీ?"

"ఎనిమిది నెల్లూ!"

"ఎనిమి దిరవయ్యాయిదు లెంత ?"

"రెండు పందలు!" అబ్బా! రుక్మిణమ్మ గారికి మా మూలంగా రెండు వందలు ముట్టాయన్నమాట!

"ఆర్నెల్ల కిందట మా తమ్ముడొచ్చాడు మీకు జ్ఞాపకం ఉందా?"

"ఉందీ!"

మా తమ్ముడు మనకెంత ఇవ్వాలి?"

"నూట యెనభై !"

"మొత్తం ఎంతయింది ?"

"నీకేమైనా మతిగాని పోయిందేమిటి విశాలీ! రుక్మిణమ్మగారికి అద్దెకింద నెల్నెలా యిచ్చిన అద్దేన్నూ, మీ తమ్ముడు నాలుగేళ్ళ బట్టీ ఇదుగో ఇస్తా నదుగో ఇస్తానని తిప్పుతున్న సొమ్మూ మొత్తమేమిటే?" అని యిటు తిరిగాను.

విశాలి నావేపు తిరిగి ఒక్కక్షణం చూపు కలిపి, మా మధ్య ఉన్న దిండు మొహానికి అడ్డం పెట్టుకుని అల్లరిగా నవ్వుతూ "అవునండీ. రెండూ మొత్తం చేసేను" అంది.

"అంటే?"

"చెప్పుకోవాలి."

"నెల్నెలా ఇంటావిడకి అద్దె యివ్వడం లేదుటే ?"

"మీ రిచ్చేరు, నేను పుచ్చుకున్నాను."

"మీ తమ్ముడు ఆ డబ్బు నీ చేతికి ఇచ్చేసేడు కూడానా ?"

"ఆఁ !"

"అదీ ఇదీ కలిపి నువ్వు బంగారంకాని కొన్లేదు గద!"

".... .... .... ...."

"మాట్లాడవేమే?"

"..... ...."

దిండు అడ్డం తీశాను. మొహంమీద రెండు చేతులూ కప్పుకుని దొంగ చూపు చూస్తోంది.... "మీరు .... .... కొనుక్కోమన్నారు కదండీ?"

"నేనా?"

"ఇప్పుడు కాదులెండీ. మనం కాకినాడలో ఉన్నప్పుడు మా అమ్మ మనింటికొస్తే" అంది.

అత్తగారు అడిగింది: ఏమయ్యా ఇలా డబ్బు బ్యాంకిలో వేసే బదులు ముచ్చటకేనా ఒకటో, రెండో వస్తువులు చేయించరాదుటయ్యా అని. "మిగుల్చి

కుని దాచుకొని కొనుక్కోమనండి. నే వద్దన్నానా !" అనో యేదో, అప్పటి కెయ్యది ప్రస్తుతమో- చెప్పినట్టున్నాను.

నేను మంచమ్మీద లేచి కూర్చున్నాను. "అంచేత? నువ్వు నా కళ్ళుగప్పి బంగారం కొంటావా! ఎంత తెగింపు; మీ తమ్ముడిచ్చింది తీసుకుని ఎలాగో వాడి నోరు మూశావు బాగానే ఉంది. కాని ఇంటావిడకి ప్రతినెలా నేనే స్వయంగా నా చేత్తో ఇస్తున్నానే, అదెలా తీసుకుంటున్నావే!"

"మీరే అంటారు కదండీ. ఇష్టం ఉంటే మార్గం ఉంటుందని!"

"ఔనౌను." అన్నాను గట్టిగా. "వస్తువులు చేయించుకో మన్నానే అనుకో, దేశంలో నలుగురూ ఎలా చేస్తున్నారో చూసుకుని నువ్వు పధ్నాలుగు కారెట్ల వస్తువులు చేయించుకోవలసింది!"

"ఇంకా నయం ! ఇత్తడివో, గిల్టువో పెట్టుకోమన్నారు కాదు."

"గిల్టువీ, పధ్నాలుగు కారెట్లవీ ఒకటేనా ఏమిటి ! ఎందుకు అడ్డదిడ్డగాం మాట్లాడతావు ?"

"ఇంకా ఆ మాటకొస్తే గిల్టువే నయం! ఈ పధ్నాలుక్కారెట్ల వస్తువులు పెట్టుకుంటే వాళ్ళంతా మంటలుట ! మొన్న నొకావిడ చూపించింది: పాపం, మెడమీదా గుండెలమీదా ఎర్రెర్రగా పెద్ద పెద్ద మచ్చలు పడ్డాయి..... ఒకటే దురదలట, ఆ మచ్చలు పడ్డ చోటల్లాను. అదంతా రాగి ఎక్కువగా కలపడం వల్లేనుట !"

"ఇలాంటి కాశీమజిలీ కధలు నా దగ్గిర చెప్పకు.... సరే. జరిగిందేదో జరిగింది. రేపు పొద్దుటే లేచి ఆ వస్తువులు మర్యాదగా నా కప్పచెప్పు... నాకు విరుద్ధంగా నువ్వు చేసిందంతా ఎలాగో సర్దుకుందాంగాని, చట్టానికి విరుద్ధంగా నువ్వు చేసిందాన్ని క్షమించడానికి నాకు పవర్సు లేవు. ఆ ఇరవై రెండు కారెట్ల బంగారం స్టేట్ బ్యాంకి ద్వారా గవర్నమెంటు పరం చెయ్యవలసిందేను."

ఎంత ప్లాను! రుక్మిణమ్మగారి డబ్బు తరవాత ఎప్పుడో నెలకింతా అని యిచ్చేటట్టు ఒప్పందమట. మొత్తం పడ్డది మూడువందలు. నెలకి ఇరవయ్యో, పాతికో యిమ్మందిట. నాకు తెలిసిపోయిన తర్వాత ఎంత ఇవ్వాలో, ఎలా ఇవ్వాలో నేనే చూసుకుంటానని ధైర్యమట.... అందుకని ఆవిడకి నమ్మకం ఉండ

డానికి వీలుగా, మేం ఆ అప్పు తీరేదాకా ఈ ఇంట్లోనే ఉండాలట. పైగా, మాకు ఆ మాత్రం సాయం చేసినందుకు తనకి ఈ మాత్రం సాయం చెయ్యాలా అని. మేం వెళ్ళిపోతే ఈ ఇంటికి మళ్ళీ ఎలాంటి వాళ్ళొస్తారో- అద్దె తిన్నగా ఇస్తారో ఇవ్వరో, రాత్రీ పగలూ ఎలాంటెలాంటి మనుషులు ఎలాంటెలాంటి జులుం చేస్తారో- ఇలా భయపడి చాలా ఇదైందిట-

"ఆల్ రైట్. ఆవిడ అప్పురేపే బ్యాంకులోంచి డ్రా చేసి తెచ్చి మొహ మ్మీద కొట్టాను. వడ్డీకూడా కావాలంటే ఇద్దాం, కాని రెండు షరతులు. ఒకటి. ఇలాంటి ఇంటిలో మనం ఒక్క రోజుకూడా ఉండడానికి మాత్రం వీల్లేదు. రెండు: చట్టానికి వ్యతిరేకంగా నా కస్టడీలో, అంటే నీ దగ్గిర; ఇరవై రెండు కేరట్ల బంగారం ఉండడానికి అసలే వీల్లేదు. రేపే పట్టుకెళ్ళి స్టేట్ బ్యాంక్‌లో."

విశాలి హఠాత్తుగా మంచందిగింది. "ఏమిటండీ, మీ చట్టాలూ మీరూనూ; నాకర్థం కాలేదు!... నేను ఏ ప్రభుత్వానికీ, ఏ చట్టానికీ వెరవను. మీకు విరుద్ధంగా చేసిందే మీరు క్షమించేనన్నారు నాకదేచాలు, నేను మీకు జడవాలిగాని ప్రభుత్వా నికి నేనెందుకు జడుస్తాను?..." అని పెట్టె తెరిచి, తక్షణం నెక్లెసూ, గాజులూ తగిలించేసుకుంది. "మీరు ఒప్పుకున్నారుగనక ఈ క్షణంనించీ ఇవి నావి. ఒంటి మీదున్న బంగారం తీసేసుకోమని ఏ చట్టంలో వుందో ఆ చట్టం చేసినవాణ్ని రమ్మనండి!" అంది; మేమిద్దరం ఓపార్టీ అయిపోయినట్టూ తనతోబాటుగా నేను గోల్డ్ కంట్రోల్ యాక్ట్‌ని వ్యతిరేకించడానికి సిద్ధమని తనకి తెలిసిపోయి నట్టూనూ.

* * *

పొద్దుట కాఫీతాగాక, కాసేపు ద్వైధీభావంలో పడ్డాను. చట్టానికి వ్యతిరే కంగా ఈ నగలు నా ఇంటిలో వుండడం భారత పౌరుడిగా నా బాధ్యతను నేను సరిగ్గా నిర్వర్తించ లేదనడానికి ఒక ఉదాహరణ. అయితే ఒంటిమీదున్న బంగారం తీసుకోమని ఏ చట్టంలో ఉందో, ఆ చట్టం చేసినవాణ్ని రమ్మనండి; అనే సవాలు కూడా బలంగానే ఉన్నట్టుంది. కొన్ని రకాల చీదరలు, వాటిని ఒదుల్చుకోవాలని ప్రయత్నించి ఫలితాలు అనుభవించటంకంటె ఆ చీదరలే భరించడం సుళువు. చివరికి ఒక నిశ్చయానికి త్వరగానే వచ్చాను. ఆ వస్తువులు తీసుకెళ్ళి స్టేట్ బ్యాంక్ ఏజెంటు నడగాలి. అవి ఎలా, ఎవరికి, ఎక్కడ ఒప్ప

గిస్తే నేరం తప్పుతుందో అసలు పద్ధతేమిటో....! విశాలికోసం చూశాను. ఏదో మంత్రాంగం కోసం పక్కవాటాలో కెళ్ళినట్టుంది, కేకేశాను.

గల గల్లాడుతూ వచ్చింది విశాలి. మొహం కలకల్లాడుతోంది. ఒళ్ళంతా మిలమిల్లాడుతోంది. సంతోషం రెండు రెట్లయినట్టుంది. కారణమేమిటో!

"పాపం ఆడప్రాణం గనక, ఆడవాళ్ళ కష్టసుఖాలు గుర్తుంచుకుంది. మహనీయురాలు!" అని చేతిలో వార్తాపత్రిక నా చేతికిచ్చి, రెండు చేతులూ నడుముకి రెండు వేపులా మడిచిపెట్టుకుని "ఇప్పుడేమంటారు" అన్న ప్రశ్న కనుబొమ ఎగరేస్తూ అడక్కుండా అడిగింది.

పేపరు తెరిచాను. " ఇరవై రెండు క్యారట్ల బంగారంతోనగలతయారీకి ప్రధాని అనుమతి"

కాసేపు గోల్డ్‌కంట్రోలు యొక్క సంస్మరణార్థం మౌనం వహించాను.

బజారు కెళ్ళబోతూ గుమ్మం దాటేను. "బజార్లో క్యారట్లు దొరుకుతే తీసుకురండీ. మాంచి ఇరవై రెండు క్యారట్ల హల్వా చేసి పెడతాను. తిందురు గాని!" అని విశాలి కేకేసినట్టయింది.

*

(ఆంధ్రజ్యోతి వీక్లీ దీపావళి, 1983)

# 'సర్వే' జనాః సుఖినోభవంతు

చెప్పవలసినవన్నీ పనివాళ్ళకి చెప్పేసి; టౌనెళ్ళిపోదామని రోడ్డు పక్కని నిలబెట్టిన జీపులో డ్రయివర్ సీటులో కూర్చుంటున్నాను. ఇంతలోకే "నమస్కారం సార్" అని కొత్త గొంతుతో పలకరింపు. జీపుపక్కనే సైకిల్ ఆగడం— దానిమీంచి "సింహాచలం" దిగడం—

వెనక నేను సర్వేడిపార్ట్‌మెంట్‌లో పని చేసినప్పుడు పొలాలూ, స్థలాలూ కొలవడానికి వుపయోగించే గొలుసు పట్టుకుంటూ వుండే చైన్‌మన్లో ఒకడు- సింహాచలం.

"ఏంట్రోయ్ సంగతి?" అన్నాను మొహానికి నవ్వు పులుముకుని.

"పెందుర్తి బంగళాకాడ మా యినస్పెట్రు సుబ్బారావుగోరు క్యాంపు సార్- ఆరితో వొచ్చామండి నీనూ అప్పలసాఁవీఁనీ—"

"ఊఁ హూ."

"బాగున్నారా సార్ తమరూ- అమ్మగారూ, అమ్మాయిగారూ?"

"మరేరా. సుబ్బారావుగారున్నారా, బంగళాలో?"

"బంగళాకాడ నేరండి, అయిస్కూలు జాగవ లున్నరండి."

"అక్కడేమిటుంది కొత్త?"

"కొత్త గాదండి...." నవ్వాపుకోలేక పోయాడు సింహాచలం. "చయికిలింగు నేరుస్తన్రండి."

సుబ్బారావుగారు, నేను సర్వే డిపార్ట్‌మెంట్లో వున్నప్పుడు నాకు పై అధికారి. నేను డిప్యూటీ సర్వేయర్‌గా చేరినప్పటికి ఆయన సర్వేయర్. నేను సర్వేయర్‌గా ప్రమోషన్ తెచ్చుకునే నాటికి ఆయనకి ఆయనకి హెడ్ సర్వేయర్ ప్రమోషనొచ్చింది. నేను సర్వేయర్‌గా వున్నప్పుడే ఆయన "ఇన్‌స్పెక్టర్" కూడా అయ్యాడు. ఈ లోపుగా నాకు అందులో విసుగుపుట్టి గొట్టపు బావుల

తవ్వకం కంట్రాక్టులు తీసుకుంటూ ఆ వుద్యోగం మానేశాను. ఆయనకి న యేళ్ళు దాటుంటాయి.

హైస్కూలు గ్రవుండ్స్‌లో సుబ్బారావుగారు సైకిలు తొక్కడం నేర్చుకుంటున్నారు.... ముందు హాండిల్ ఒక "చైన్‌మన్" పట్టుకున్నాడు. వెనకాల సీటూ కారేజి కలిసి ఇంకోడు-సర్కస్‌లో గొడుగు పట్టుకుని వైరుమీద నడిచే అమ్మాయిలా ఊగుతూ, జోగుతు పెడలింగ్ చేస్తున్నారు సుబ్బారావుగారు.

సుబ్బారావుగారు వ్యక్తిగా "చాలా మంచాయన." తన సిబ్బందిని "క్రింది వాళ్ళుగా" కాక, "తోటి వాళ్ళుగా" చూసేవాడు.

'సర్వే' ఉద్యోగం చెయ్యడానికి గొడ్డులా కష్టపడగలగడం ప్రధానం. రెండోది చక్కని వస్తూరి, ముచ్చటైన అంకెలు. మూడోది- కరణంగారి అరుగు మీదగానీ, మున్సబుగారి పశువుల కొట్టంలోగాని, పాత్రుడుగారి కళ్ళాల్లోగానీ— ఓపిగ్గా వంట చేసుకుని సుష్టుగా భోజనం చెయ్యగలగాలి.

"శీతల జలక స్నానము
భూతల శయనంబు, ఒంటిపూట అశనంబున్,
నాతిగల బ్రహ్మచర్యము—" అని వొచ్చే చాటు పద్యానికి నాలుగో చరణంగా—

"నాతరమా సర్వేపార్టి నౌకరిచేయన్" అని కలిపి దాన్ని సర్వేకి అనువర్తితం చేసింది సుబ్బారావుగారే.

అలా, "నాతరమా. సర్వే సాగర మీదను, నళినదళేక్షణ రామా" అనుకోకుండా సుబ్బారావుగారు తాను స్వయంగా కష్టపడుతూ తను నిర్దేశించిన విధంగా కష్టపడగల ప్రతి ఒక్కర్నీ అభిమానించేవాడు- అది గదాధర పట్నాయక్‌గానీ, చార్లెస్ ఓబడుగానీ, సయ్యద్ అహమ్మద్‌గానీ—

ఎంత దూరమైనాసరే, నడిచెయ్యడమే ఆయన కలవాటు. "బస్సుంది సార్, ఇంకో గంటలో" నంటే, "ఆ గంటసేపట్లోనూ నాలుగు మైళ్ళు నడవచ్చు, ఆ తరవాత ఎలాగూ నాటు దారేకదా. ఆ మాత్రం దానికి బస్సెక్కడం యెందుకూ? పదండి సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నడుద్దాం—" అనేవాడాయన. ముందుగా అడుగేస్తూనూ.

ఇప్పటి కథకాదిది—

1958 నాటిది—

విశాఖపట్నం నుంచి చోడవరానికి శృంగవరపు కోటకి, అనకాపల్లికి, విజయనగరానికి — ఈ పెందుర్తి నాలుగురోడ్ల జంక్షన్ ద్వారా రోజుకి రెండేసి బస్సు లిటూ, రెండు అటూనూ. మళ్ళా పొద్దుపోయేలాగా అవే వెనక్కి రావాలి. అందుకే సుబ్బారావుగారు నడక మేలనేవాడు.

అలాంటి సుబ్బారావుగారికి నలభై ఏళ్ళు వెళ్ళేక సైకిల్ తొక్కడం నేర్చుకోవలసొచ్చిందా?

"కీళ్ళ నొప్పులా?" అని అడిగాను.

"కీళ్ళ నొప్పులూ లేవు, కాళ్ళ నొప్పులూ లేవు, అంతా రాత!"

"మీ రాత బాగానే వుంటుందికదా!"

"చేతిరాత బాగానే వుంటుంది కాని తలరాతే యిలా తగలడుతోంది. ఎప్పటికప్పుడు! లేకపోతే అరవయ్యోయేట అగ్నిగండం అన్నట్టుగా ఇదేమిటి చెప్పు, నాకీ పాట్లు?"

"రా. బంగళా కెళ్దాం" అని నన్ను లాగాడు సుబ్బారావుగారు.

"భోజనం పెడతారా?" అన్నాను నవ్వుతూ.

"ఓ! అదెంత భాగ్యం?"

"నిజంగానే నండోయ్ గురూగారూ, హాస్యం కాదు.... మీ చేతి భోజనం రుచి చూసి యన్నాళ్ళయిందో! సర్వే ఉద్యోగానికి రాజీనామా చేసి పోగొట్టుకున్న మహద్భాగ్యాల్లో అదొకటి!"

"పోవయ్యా మరీ వెక్కిరిస్తావు! సర్వే ఉద్యోగంలో భాగ్యాలొహటా? బాధలే. అన్నీను!— నడు, నడు!.... ఎంతకొన్నావీ జీపు?.... నువ్వే నడిపేస్తున్నావా?" అంటూ జీపెక్కి కూర్చున్నాడు.

"ఆం నేనే — డ్రయివరున్నాడనుకోండి. ఐనా నాకు సరదా."

*　　　*　　　*

"ఏమేటీ, గోపాళంగారే?" అంటూ బంగళాలోకి చేరక ముందే జీపు చప్పుడు విని మళ్ళీ ఏ మొగుడొచ్చాడో అనుకుంటూ కాబోలు పరుగులాంటి నడకతో ఎదురొచ్చిన రామచంద్రరాజుగారు పలకరించారు.

రామచంద్రరాజుగారు మా అందరికన్నా వయసులో పెద్దవాడు, కాని

ప్రాథమిక విద్య తప్ప అర్హత లేకపోడాన్ని సర్వేయర్‌గానే మిగిలిపోయాడు. అయితే యేం? మున్సర్దీ రాత, ముద్దులొలికే అంకెలు! కొత్త కొల్చాదం చే 'లింకు' తేడా రాదు!

"అర్దిగదీ.... ఈ జీపేటి, ఈ యట్ట హాసమేటి, చెప్పేరేగాదు!.... మొత్తా నికి మా డిపార్మెంటొదిలి దాగుపడ్డారెండి మీరైనా!"

"ఈ జీపులాంటివి పొద్దుటే దొరికుంటే యెంత బాగుణ్ణోకదా" అన్నారు సుబ్బారావుగారు.

0 0 0

ఆ ఉదయం—

తెల్లారగట్ల మూడింటికి విజయనగరంలో రైలెక్కి, పెందుర్తిలో దిగి, సరాసరి నాలుగురోడ్ల జంక్షన్ దగ్గిరికి నడిచొచ్చేసిన ఆఫీసరు— (అసిస్టెంట్ డైరెక్టర్ అంటారతన్ని. ఉద్యోగపరంగా) బంగళాలో తన కొదిలిపెట్టిన భాగంలో ప్రవేశించి: ఇన్‌స్పెక్షన్ వేపగుంట గ్రామంలోనని ప్రకటించాడట.

సరేకదా అని; ఉన్న బంట్రోతుల్లోనూ చైన్‌మన్‌ల్లోనూ కాస్త దిట్టమైన వాళ్ళని గొలుసులూ క్రాస్‌స్టాఫ్‌లూ. జెండాలూ సుత్తీ పేనాం పగైరా యిచ్చి వేపగుంట పంపించేసి, ఒక ముసలి ప్యూన్ని కాఫీ హోటల్నించి ఇడ్లెన్లు తెమ్మని పురమాయించి మరో కిళ్ళవాత ప్పినుగని వేణ్నీళ్ళు కాగబెట్టమని కూచోబెట్టి; కాలకృత్యాలు తీర్చుకున్నారట రామచంద్రరాజుగారూ, సుబ్బారావు గారూనూ,

అరున్నర కాకుండానే నాలుగురోడ్ల జంక్షన్ కొచ్చి విశాఖపట్నం వెళ్ళే బస్సులకోసం చూస్తే—

ఇంకేముంది? ప్రతి బస్సులోనూ కిక్కిరిసి జనం నిలబడ్డవాళ్ళు, వేళ్ళాడే వాళ్ళు—టాప్‌మీద కూర్చున్నవాళ్ళూనూ.

"వాటీజ్ దిస్? ఈ బ్రేకినస్పెక్టర్లూ. ఆర్ టీవోలూ నిద్దరోతున్నారా? ఏమిటీ అరాజకం?" అని వీళ్ళమీద కేకలకి తగులుతున్నాడట— సర్వే డిపార్ట్ మెంట్ ఆఫీసరు.

"సార్, ఇవాళ సింహాచల పుణ్యక్షేత్రంలో చందనయాత్ర సార్.అంచేత సార్. అటువేపు వెళ్ళే బస్సులూ రైళ్ళూ కంపల్సరిగా ఇలా రద్దీగానే ఉంటా యండి సార్!"

"మరైతే యెలా వెళ్ళడం; ఇన్స్పెక్షనుకి?"

"జట్కా యేర్పాటు చేస్తాన్సార్," అని సుబ్బారావు పక్కకి జారుకో బోగా.

"ఆగు!" అని గద్దించి; "ఏంటనుకుంటున్నావు నా గురించి నీ మనసులోకి? నేను, అసిస్టెంట్ డైరెక్టరాఫ్ సర్వేని; నాలుగువందల యాభైమంది సిబ్బంది మీద ఏకైక అధికారిని; జట్కాలో ప్రయాణం చెయ్యాలా?" అని జట్లా విరుచుకుపడ్డాడట.

"సార్: మరేం చేయమంటార్సార్; బస్సులన్నీ ఇవాళ్లా ఇలాగే ఉంటాయి సార్" అని సుబ్బారావు బిక్కమొహం వెయ్యగా;

"మన ముగ్గురికీ మూడు సైకిళ్ళు బెత్తాయించండి.వెళ్దాం!" అని ప్రసన్నులయ్యేరట; ఆఫీసరుగారు.

కాని, సుబ్బారావుగారికి సైకిల్ తొక్కడం రాదు.

రాజుగారు పెద్దవాడు. తనొక్కడే అయితే ఎలాగో ఈడుస్తాడుగానీ, 'డబుల్సు' లాభం లేదు.

"నాన్సెన్స్! ఎవడయ్యా మీకీ ఉద్యోగాలిచ్చింది?" అని అగ్నిరుద్రుడై పోయి, ఆఫీసర్ నడిరోడ్డుమీద నానా గంతులూ వేసేసి; అల్లంత దూరాన్న నిలబడి ఇటు చూస్తే ఏం తప్పో అన్నట్టుగా పరధ్యానం నటిస్తున్న బంట్రోతుని అంతకంటే భీకరమైన అరుపుతో పిల్చి: వాడి చేతిలో ఉన్న మూటలోంచి కాగితాలు పూడపెరికి; అప్పటి కప్పుడు అక్కడికక్కడ ఒక 'మిమో' రాసిచ్చేడు సుబ్బారావుగారికి,

"అందింది" అని రాయించి సంతకం తీసుకున్నాడు.

"ఇందుమూలంగా తెలియజేయడమేమనగా, మన విజయనగరం సర్వే పార్టీ నెంబర్ ఫోర్‌లో ఎగ్జిక్యూటివ్ (బయట తిరిగి పనిచేసే) ఉద్యోగుల్లో కొందరికి సైకిల్ తొక్కడంరాదని దిగువ సంతకం చేసినవారి దృష్టికి తీసుకురాబడింది. ఇది చాలా పెద్ద లోటు; గొప్ప వెలితి, కనుక; శ్రీ వి. సుబ్బారావు అనే ఇనస్పెక్టర్ నెంబర్ టూ; ఈ మిమో అందిన ఇరవై నాలుగు గంటల లోగా సైకిల్ తొక్కడం నేర్చుకున్నట్టు మాకు ధృవపడకపోతే ఈ విషయం రెవెన్యూ బోర్డుకి రిపోర్టు పంపి, సదరు సుబ్బారావును హెడ్ సర్వేయర్‌గా రివర్షన్ చెయ్యమని సిఫార్సు చేయబడుతుంది"-అని, ఆ మిమో.

అలా మిమో ఇచ్చిందేకాక-

"సాయంకాలం లోపుగా సైకిల్ తొక్కుతూ కనిపించేవో సరేసరి, లేక పోతే నా సంగతెరుగుదువుకదా! రేపు తెల్లారి ఆరుగంటలకి ఇక్కణ్నించే రిపోర్టు పంపేస్తా నేమనుకున్నావో!" అని ముఖ స్తంగా కూడా హెచ్చరించి-

"అదుగో. ఆ బస్సు ఖాళీగా వెడుతోంది, దాంటో నేను అనకాపల్లి వెళ్ళిపోతాను, అనకాపల్లి తాసిల్దార్‌తో నాకు రెండు మూడు ఫైళ్ళమీద డిస్కషన్ ఉంది," అని చెప్పేసి; "ఎక్కు అప్పల్సామీ; ఆ బస్సెక్కు!" అని గదమాయించి అదే పోక-

* * *

అంతా విని, పకపకా నవ్వాను, "గొప్ప యముడే దొరికాడు మీకు; గురుగారూ."

సుబ్బారావుగారు కుంపటిమీద ఉడుకుతున్న కూర దించి; పోపు పెట్టడంలో పడ్డాడు.

"ఇక్కడే కాదండి, ఇలా రెండు మూడు సోట్ల యెగిరెగిరి పడ్డాడండీ యన; సైకిల్ తొక్కడం రానోళ్ళమీద కిందటేడు డిశంబర్లోగావాల; శ్రీకాకుళం జిల్లా రాజాంలో కాంపేసి; పొందూరు దగ్గిర సిరిపురానికి పది మైళ్ళు సైకిలుమీద పయనమయ్యాడండి. నేనండి, మొయిద సింహాచెలం గారండి, మరే సామిరాజండి, అల్లాడు లేడండి, సివరాం పట్నాయకండి. ఇంత మంది నమ్మనా్నడండి- ఏటీ; బంట్రోతులు పది మందికాక; మేమంతాను-

సామిరాజు లేడండీ; పొట్టి పంతులు- ఇంగ్లాండ్ రాలీ తీసేడండీ, అది జూసి ఈయనగారు సంబరపడిపోయి. ఆ సైకిల్ నేను తొక్కుతాను; నువ్వేరే సైకిలుచ్చుకురా అని- రూపాయ తీసిచ్చాడండి సామిరాజుకి. ఇంక అతగాడు జేసేదేముందండి? సామిరాజు అద్దె సైకిల్కొచ్చాడండి.

ముందేమో యే.డీ. గారు రైంమని ఎల్తన్నడండి, మేం యెనక ఫాలో అయిపోతన్నమండి, వావిలివలస పొలిమేర్లో చెరువు గట్టుంది గదండి; అంది మీర సైకిల్ తొక్కుతూ ఏ.డీ.గారు పడ్డాడండి సైకిలుమీంచి పడి గట్టుమీద పట్టుదొరక్క గట్టంటే జారిపోయి ఉడుపుచేను గట్టుదాకా దేకిరీశీడండి. అయ్యయ్యో అంటే అయ్యయ్యో అనుకొని మేం అందరం టకటకా సైకిళ్ళకి స్టాండ్లేసి దిగెళ్ళి ఆయన్ని లెగదీశామండి. ఆయన తొక్కిన సైకిలు ఇటుకాసి

దొర్లిపోయింది గదండి. దానికోసం స్వామిరాజుగారేమో పాంటు ఎగ్గట్టి గట్టు అరగడికి దిగి నింపాదిగా సైకిల్ని గట్టెక్కించాడండి. ఎంత ఇంగ్లాండ్ రేలీ అయితేమటుకు మణిశంత మణిసి పడిపోయి సైకిల్ దొర్లిపోతే హాండిల్ బెండ వదా? ఆడికది అర్ధంకాక సైకిలుకేటో అయిపోయిందనుకని ఎర్రిమొగం ఏసీసి నాడు. ఓ ఖండవయ్యా పొట్టిపంతులూ అలాగెప్పి; ముందు చక్రం రెండుకాళ్ళ మద్దినీ సెట్ చేసి, హాండిల్ వొంపు తీర్చి వొప్పగించినాను. ఆ మయంలో యేటైందోమరి. మొయిద సింవాచలంగారికి పక్కుమని నవ్వొచ్చీసిందండి. దాంతో యే.డీ.గారు అగ్గిపోరైపోయి ఇంగిలీషులో తగులుకున్నడండి."

జరిగిన సంఘటన కొంత నవ్వు పుట్టించేది: దానికితోడు రామచంద్రరాజు గారి కథనం ధోరణి.

కాసేపు గట్టిగా నవ్వుకున్నాం.

రాజుగారు కానిచ్చాడు. "నాకింగిలీసు రాదు గాదండీ, ఏ.డీ. గారన్న మాటలకి అర్ధం నేను కనిపెట్టేశానండి. 'నాకొడకల్లారా, నేను జమ్ జమామని ముందు సైకిల్ మీదొస్తూ, పరిశిపాటులేని దార్లో పడిపోతేమటుకు నన్జూసి నవుతార్రా? మీకెన్ని గుండెల్రా యదవర్లారా! ఎడ్క్వార్టర్స్ కెల్నీండి: మీ సంగతేలుస్తాను! మీ తోకలు కోశేత్తానేమనుకున్నారో' అనేదో అనుంటాడాయన."

-సరే. ఈ కోపం బుర్రలో పెట్టుకొని ఏం జేస్తాడో అని "సార్ తమకి సింవాచలం చెప్పేడో లేదోగానీ, కిందటినెల్లో సిరిపురం ఫస్టు ఖండం పైనలిన స్పెషను కెల్లేటప్పుడు మన సింహాచెలంగారుకూడా సరిగ్గా ఇక్కడే సైకిలుమీంచి పడిపోయారండి- అని చెప్పానండి. దాంతో యే.డీ.గారు కూలైపోయి సైకిల్ తొక్కడమంటే యేంటి, అదెంత గొప్ప విద్య. ఎంత మంచి ఎక్సర్సయిజు, ఇయన్నీ లెక్చరిచ్చి. ఆయనగారు సైకిల్ పందాల్లో గెలవడం అయన్నీ కతలు జెప్పుకొచ్చేడండి."

మళ్ళీ కాసేపు నవ్వుకున్నాం.

సుబ్బారావుగారు వంటపని పూర్తిచేసి వేదాంత ధోరణిలో పడ్డాడు. "అసలు నాకు ప్రత్యేకంగా మిమో ఇచ్చింది ఇవాళే అయినా, అసలిలాగ, అందరికీ సైకిల్ తొక్కడం రావాలని ఆర్నెల్లనాడే సర్కులర్గా రూపొందించి యిచ్చాడయ్యా. అప్పుడు నేను అసలు సెలవులో ఉండిపోడాన్ని మనకీ బేరం యిప్పుడు తగిలింది! అప్పుడు డ్యూటీలో ఉండుంటే ఈ పిడుగు పడకముందే ఆ తంటాలు పడుందును!"

"ఆ సర్క్యులరిచ్చిన కొత్తలోనండీ—" రాజుగారు చెప్పాడు! "పాలకొండ తాలూకా ఉంగరాడ, చాటాయవలస, ఉప్పరినాయుడువలస, వెన్నెలగ్రామాల్లో నన్ను టెంపరరీగా ఇన్‌స్పెక్షన్‌లకే శారండి. ఓరోజు ఈయనగారు ఉంగరాడ మెట్టదగ్గిర బస్సు దిగుతాననీ, అక్కణ్నించి ఈ ఉల్లోపు గ్రామాల్లోకి సైకిళ్ళమీద ఎళదామనీ కబురెట్టారండి. వారికోసం ప్రత్యేకంగా ఉంగరాడ సావుకారొకాయన్నడిగి సైకిల్ తెచ్చామండి అయితే ఇంతలోకీ, కామేశ్వర శర్మ లేడండీ, అతగాడు 'సార్, ఈ సైకిల్ తమరు తొక్కండి సార్' అంటూ తన బి.యస్సే.బండి అందించాడండీ. యేటీ అది అతగాడు పెళ్ళిలో పేచీపెట్టి మామగారిచేత కొనిపించిన కొత్త సైకిలండి. సరే ఆయన అదీ ఈయ నిదీ యెక్కారండి, ఇహ జూసుకోండీ ఈ శర్మ తొక్కుతున్నది. రువు సైకిల్ గదండి; గడీకి కరకర్లాడ తది: కుంచేపటికి జణజణలాడ్తాది, డౌన్ దిగేతప్పటికి చైన్ జారిపోయిందండి. అలాగలాగ అతగాడు ఎనక్కుండి పోయాడు. ఏ.డీ.గారు సైకిలాపి యనక్కి తిరిగి, "ఏటీ, శర్మగారు ఎనక్కుండి పోయార"న్నాడు. అందరు అటు దిక్కు చూస్తూ నిలబడిపోయాం. శర్మగారు దగ్గిరాగానే "ఏటయ్యా ఎనక్కెనక్కి వస్తున్నావు, సైకిలు కొత్తేటి?" అనడిగారండి. దానికి శెర్మగారు పెళ్ళికూతుర్లాగ సిగ్గుపడిపోతూ "మరేండిసార్ తమరు సర్క్యులర్ యిచ్చేరని నేర్చుకున్నాన్సార్" అన్నాడండి. దాంతో యే.డీ.గారు ఐసైపోయి, "మై గుడ్ బోయ్: అలాగుండాలి:" అని ఒతగాడి బుజంమీద తట్టి: "మరటు వంటప్పుడు నువ్వు కొత్త సైకిల్ తొక్కు" అన్జెప్పి తను పాత సైకిల్ తీసుకొన్నాడండి."

"అవునూ; మన సర్వే పార్టీకి జీపు ఉండాలికదా." అన్నాను.

"సరి-రా!" అన్నాడు విసుగ్గా, సుబ్బారావుగారు. "అదెప్పటి జీపయ్యా బాబూ: రెండో ప్రపంచయుద్ధం ప్రారంభించి నప్పటిది, శత్రురాజ్యాల వారెవరో వాదిలేస్తే యుద్ధరంగం లోంచి దాన్ని బ్రిటిష్ గవర్నమెంటువాళ్ళు జాగ్రత్తగా తెచ్చి నొప్ప చెప్పిన బాపతు. ఆర్నెల్లు రోడ్డుమీద వుంటే ఏడాది వర్క్‌షాపులో ఉంటుంది. ఇప్పటికి పదహారు నెల్లనుంచీ షెడ్లోనే వుంది. దీన్ని వేలం వేసేసి కొత్త జీపు కొనుక్కుంటాం పర్మిషనూ శాంక్షనూ ఇమ్మని రాశారు."

"మరి డ్రయివర్ పోస్టు పర్మనెంటు కాబోలు...."

"డ్రయివరూ మిలట్రీ నుంచొచ్చిన వాడే. వాడు డ్రైవ్ చెయ్యడానికి

బండేదీ లేక ఈయన్ని బస్ స్టాండ్ దాకానూ, రైలుస్టేషను దాకానూ "డ్రైవ్ చేస్తూంటాడంతే." అని సుబ్బారావుగారు నవ్వాడు.

0 0 0

నెలరోజులు కాలేదింకాను.

గొట్టపు బావులు తవ్వించడం కాంట్రాక్టులుచేసుకుంటూ విశాఖపట్నంలో ఉండి పరిసరగ్రామాలకి అలా తిరుగుతూనే వున్నాను. పెందుర్తి జంక్షన్‌కి చుట్టూరా బోలెడుపని. అటు మంగలిపాలెంనుంచి వేపగుంట వరకూ, ఇటు సొంట్యాంనుంచి సబ్బవరంవరకూ అలా పన్లు వస్తూనే ఉన్నాయి, ఆ హైస్కూల్ గ్రౌండ్సు పక్కనుంచి వెళుతున్నప్పుడల్లా సుబ్బారావుగారు సైకిల్ నేర్చుకోడం సంఘటన గుర్తొచ్చి కులాసా కలుగుతూనే వుంది. వినోదిస్తూనే ఉన్నాను.

ఒకటి మాత్రం నిజం. సుబ్బారావుగారు ఈ మాటు కనిపిస్తె నడుస్తూ మాత్రం కనిపించడు, అది నిజం. వాహనంలో సుఖమే అలాంటిది!

సైకిల్ తొక్కేవాడు సోడా తాగడానికి కిళ్ళీ కొట్టుదగ్గర ఆపుతాడు గానీ, దిగడు. స్కూటర్ ఆ సామి బజారు కెళ్ళినా స్కూటర్ తీస్తాడు, బహిర్భూమి కెళ్ళాలన్నా స్కూటరే తీస్తాడు. అంతెందుకు? రిక్షాతొక్కే పైడితల్లి కూడా బేరం లేకపోతే సరదాగా ట్రాఫిక్ సెంటర్లలో రౌండ్లు కొడతాడు తప్ప చెట్టుకింద కూచుని బీడీ కాల్చుకోడు.

అ రోజు జిల్లాబోర్డు ఇంజనీర్‌గారికీ, నాకూ ఏదో వాదనలాంటిది వచ్చింది. విసుక్కొంటూ వచ్చేశాను. హాస్పిటల్ డవున్లో పోలీసు క్వార్టర్స్ వేపు సుబ్బారావుగారు నడుస్తూ నా కెదురొస్తూ కనిపించారు.

ఠక్కుమని సడెన్‌బ్రేకేసి జీపాపాను.

"అమ్మయ్య: నువ్వటయ్యా: శాన్నాళ్ళకి." అని పలకరించారాయనే.

"ఇదేంటి సార్. నడుస్తున్నారు? ఏదో అద్దెసైకిల్ తీసుకుని తొక్కుతూ కనిపిస్తారని చూస్తున్నాను!" అన్నాను.

చాలా విశాలంగా నవ్వాడు సుబ్బారావుగారు, "అది సరేలేగాని: నన్ను నీ జీపులో ఎక్కించుకుని హాస్పిటల్లోకి అర్జంటుగా తీసుకెళ్ళాలయ్యా."

"ఎంత దూరం వుంది కనక? నడిచి వెళ్ళలేరు?— అందులో మీలాంటి వాకింగ్ టైగర్?"

"వేళాకోళానికి టైంలేదు. పదకొండు దాటిపోయింది టైము. ఆయన గారికి పదిన్నర—పదకొండు లోపునే భోజనం అలవాటు—" అని బ్రతిమి లాడే ధోరణిలో పడ్డాడాయన.

"ఆయనా? అంటే?"

"అదేనయ్యా బాబూ, మా ఏ.డీ గారు! ఇప్పుడందరూ అతన్ని సైకిల్ స్పెషలిస్టు అని వేళాకోళం చేస్తున్నారు పాపం!"

"పాపమా? ఏం?"

"చచ్చిపోవాల్సింది గదయ్యా........"

మూడువారాలైందిట ఆనాటికి—

చోడవరం తాలూకా, వెంకన్నపాలెంలో క్యాంపు: అనకాపల్లితాలూకా గ్రామాల సర్వే, గెజిటెడ్ ఆఫీసరు ఫైనల్ ఇన్స్పెక్షన్లు, ఆ రోజు తుమ్మ పాలలో ఇన్స్పెక్షను.

మామూలే—సైకిళ్ళు తియ్యమన్నాడు సర్వేశ్వరరావుగారు: అదే, సర్వే పార్టీ అసిస్టెంట్ డైరెక్టరేగారు.

రెండుమూడు మైళ్ళవరకు బాగానే వెళ్ళారు.

'తన వెంటన్ సిరి లచ్చి వెంట అవరోధ వ్రాతమున్' అన్నట్టు....

ముందు సర్వేశ్వర్రావుగారు—

వెనక ఒక ఇన్స్పెక్టరూ, ఇద్దరు హెడ్ సర్వేయర్లు-

ఆ వెనక ఇద్దరేసి డిప్యూటీ సర్వేయర్లు—సర్వేయర్లు.

వాళ్ళ వెనక ఏ పదిమందో. చెయిన్మన్లు, ప్యూన్లు,

సర్వేశ్వర్రావుగారు అందరికంటే ముందు ఝుం మని వెడుతున్నాడు.

అసలే అధికారి: సైకిల్ ప్రవీణుడు. అందులో మాంచి సిమెంట్ రోడ్డు.

ఆఘమేఘాలమీద వెళ్ళిపోతున్నాడు.

మూడు మైళ్ళవరకు బాగ్గానే వెళ్ళారందరూనూ.

ఇంతలోకే. ఎక్కణ్ణుంచొచ్చేడో వెంకన్నపాలెం వైపునుంచే. ఒక సైకిల్ వీరుడు చకచకా అందర్నీ దాటుకుని ముందుకెళ్ళిపోతున్నాడు. ఓ పక్క బెల్ కొడ్తూ ఓ పక్క నోటితో సైడూ, సైడూ అని కేకలు పెడ్తూ మహా తొందరగా వెళ్తున్నాడు.

"ఎవడయ్యా వీడు? మన ఏ.డీ.గారి కంటే ఎక్స్పర్టులాగున్నాడు!" అని వాడి కంటా వెనకపడి వుండే, జోకులేసుకున్నారు. ఉద్యోగుల బృందం.

"అవునండి. ఆడు గొప్ప కరోడా అండి. ఆడిది రాయిపురాజుపేటండి. తుంపాల పందార మిల్లులో పనిజేత్తన్నాడండి. ఆడు రోజూ యింతేనండి.ఆళ్ళా

రికీ మిల్లుకీ ఆరుమైళ్ళ తోవండి. పావుగంటలో ఎలిపోతాడండి," అని ఐంట్రో తొకడు సమాచారం అందించాడు.

ఆ క్షణం వాడు ఏ.డీ.గార్ని దాటేశాడు!

అంతే! ఏ.డీ.గారికి వేడెక్కిపోయింది. ఇహవాణ్ని ఎలాగైనా దాటెయ్యాలని వేడెక్కి స్పీడెక్కాడు.

వాడొక్కసారి వెనక్కి తిరిగి చూసి, పరిస్థితి అర్థంచేసుకున్నాడు 'ఈన గారెవరో ప్యాంటూ బుష్షర్టూ వేసుకుని—సన్నగా-తనని దాటాలని చూస్తున్నాడు. వెనకాల పదిమందీ ఈసమనుషులే అయ్యుంటారు. తననిగాని దాటనిస్తే ఇంక పరువేముంది?'

అంతే. మాటల్లో చెప్పని పందెం ప్రారంభమైంది.

అంతవేగాన్నీ నిదానంగా అట్టేపెట్టుకుని ఏ.డీ.గార్ని ఎప్పటికప్పుడు సరిగ్గా పదిగజాల దూరంలో వుంచేస్తూ వాడు ముందే వున్నాడు.

ఈయన వెనకే వున్నాడు. పుంజాలు తెంపుకుని తొక్కినా వాడి పరుగు అందుకోనే లేకపోతున్నాడు.

అలా మైలున్నర పాటు ఈయన్ని అలవగొట్టేసి-

ఎదర లారీ వస్తుంటే హఠాత్తుగా సైడిచ్చేశాడు.

క్షణంలో సర్వే డిపార్ట్మెంటు ఆఫీసర్ సర్వేశ్వర్రావుగారు ఇన్సూరెన్స్ వాళ్ళ డెబిట్ పద్దులో కెళ్ళిపోయేవాడే-

లారీవాడు సడెన్ బ్రేక్ వెయ్యడం. సర్వేశ్వర్రావుగారు ఎడంపక్కకి తప్పుకోడంలో ఒక పెరుగుతట్ట ముసలావిడ మీదుగా రోడ్డుదిగి రోడ్డుప్రక్కని గడ్డిలో పడిపోడం జరిగిపోయాయి!..........తుమ్మపాల గ్రామంలో గెజిటెడ్ ఆఫీసర్గారి ఇన్స్పెక్షన్ ఆగిపోయింది.

అనకాపల్లి డాక్టర్గారు ఫ్రాక్చరుంది నీ,వైజాగ్ పెద్దాస్పత్రికి తీసుకెళ్ళమనీ చెప్పేశాడు!

"అయితే ఇప్పుడు తన సిబ్బంది కందరికీ సైకిలింగ్ కంపల్సరీ అని పట్టుపట్టడం లేదన్నమాట-మీ ఏ.డీ.గారు." అన్నాను హాస్పిటల్లో వార్డు దగ్గిర జీప్ ఆపి.

"ఈ మూడు వారాల నుంచీ తన పొరపాటుకి ఎంత ఇదవుతున్నారో పాపం" అంటూ అప్పలస్వామితో సహా జీప్ దిగారు సుబ్బారావుగారు

"సర్వేజనాః సుఖినోభవంతు!...." అనుకుంటూ జీప్ వెనక్కి మళ్ళించాను.

[కీ॥ శే॥ కొమరవోలు నాగభూషణ రామారావుగారి జ్ఞాపకార్థం]

("జ్యోతి" మాసపత్రిక-దీపావళి 1980)

# దయచెయ్యండి

తలుపు తెరిచింది పార్వతి.

ఎదురుగా ఎవరూ లేరు.

క్షణంసేపు "మనింటికి కాదేమోలే" అనుకుంది. అందుకు ఆధారంగా అంతకుముందు తలుపు తీయడానికి చేసిన ఆలస్యంలో ఆలోచన నిలిచింది. కాలింగ్ బెల్ పెట్టించి నాలుగేళ్ళు దాటింది. ఇన్నాళ్ళు ఈ యింటితో ఇంట్లో వాళ్ళతో పరిచయం పనీ వున్నవాళ్ళందరికీ తెలిసిన ఈ కాలింగ్ బెల్, ఇప్పు డొచ్చిన ఆగంతకుడికి తెలీకపోయిందా? ఈతలుపు చప్పుడు మనింటిదే అయినా ఈ మనిషి మనింటికోసం రాలేదేమో....

కొద్దిగా తెరిచిన తలుపులోంచి తల యివతల పెట్టి వరండాలోకి దృష్టి సారించింది పార్వతి. వరండాకి అవతలి చివర్ని ఓ మనిషి నుంచుని వున్నాడు. మసకచీకట్లో కూడా మొగాడి రూపు తెలుస్తోంది. గుండు చేయించుకొని వున్నాడు.

లైటు వేసింది పార్వతి. అది వెలగలేదు. అప్పుడు గుర్తొచ్చినట్టయింది. వొచ్చిన మనిషి కాలింగ్ బెల్ మీట నొక్కక తలుపు చప్పుడు చెయ్యడ మెందుకో. దాదాపు అరగంట అయింది. విద్యుత్ సరఫరా ఆగిపోయి.

"ఎవరూ?" అని కొంచెంగా కలిగిన భయాన్ని సందేహంగా మారుస్తూ దీర్ఘంతీసి అడిగింది పార్వతి.

అప్పటికి సుందర్రావు వరండాకున్న సన్నటి పొట్టికర్ర జాలరిమీద ఒక కాలువేసి, సిగరెట్టు వెలిగించుకుంటున్నాడు. అంతే! పార్వతి నిలువునా రక్తపు పోటు వచ్చినట్టు అల్లాడిపోయింది.

"పిల్లలెవరూ లేరా?" అని యిటుతిరిగాడు సుందర్రావు.

ఆ ప్రశ్నకి జవాబు చెప్పలేదు పార్వతి. ఆమెకి ఒక్క ఉదుటున దుఃఖం ముంచుకొచ్చేసింది. కాని, దుఃఖాన్ని మింగేసి వెంటనే దాని నివారణకి ఏదో చేసెయ్యడం ఆమెకి ఎన్నాళ్ళనించో అలవాటైపోయింది. వెంటనే మాట్లాడ కుండా లోపలికి వెళ్ళి, ఈ మధ్యనే తనకి అలవాటవుతున్న పడకకుర్చీ తీసు

కొచ్చి అంతవరకూ మూసివున్న రెండో తలుపు తెరిచి, పూర్తిగా తెరిచున్న ద్వారంలోంచి కుర్చీ బైటికితెచ్చి వరండాలో వేసింది.

ఆ నాలుగడుగులూ నెమ్మదిగావేసి, కుర్చీ దాకావచ్చి. "అంతా బాగున్నారా?" అంటూ కూర్చుని "నువుకూడా కూర్చో" అన్నాడు సుందర్రావు.

పార్వతి ఇటువేపు వచ్చి. కర్రజాలరికి ఆనుకొని నిలబడింది. "ఎప్పుడు, రావడం?" అంది.

కాలుస్తున్న సిగరెట్టులోంచి మరోమాటు పొగపీల్చి "నేనీ వూరొచ్చి నాలుగురోజులైంది......—" అన్నాడు సుందర్రావు. పార్వతి మరేమి అడగలేదు. "నిన్న చూశాను నిన్ను! గ్రంథాలయం భవనంలో స్వామి దరహాసానంద గారి ఉపన్యాసం వినడానికొచ్చేవు కదా. అక్కడ నన్నుచూసేవు! గుర్తుపట్టేవనే అనుకున్నాను. కాని గుర్తు పట్టలేదని ఇప్పుడే తెలిసింది........"

"ఆయన గుర్తుపట్టలేనంతగా మారిపోలేదు. కాని,ఆయన మళ్ళీ ఈ యింటికి వస్తారని అనుకోడం మెదడులో ఏ ఒక్క గ్రంధికీ యిష్టంలేదు. అంచేత ఎవరిలోనూ కూడా ఆయన్ని చూడ్డంలేదు నేను—" అనుకుంది పార్వతి.

"అబ్బాయీ కోడలూ కులాసా?"

"ఆ!"

"ఎక్కడికి వెళ్ళేరు?"

"సినిమాకి"

"పాప దగ్గర్నుంచి వుత్తరాలొస్తున్నాయా?"

"ఆ!"

"మనవలూ మనవరాళ్ళూ—?"

"ఇంకా లేరు........"

"నువ్వు కూర్చున్నావుకాదు!"

—"నన్ను మీరెప్పుడైనా కూర్చోనిచ్చారా?" అనుకుంది పార్వతి.

........కూర్చోనిచ్చేరు ....పెళ్ళిలోనూ, పెళ్ళయిన ఆ కొత్తలోనూ, ఏడాది కాపరం పూర్తవకముందే కొడుకూ.మూడోఏడాది వెళ్ళకముందే కూతురూ పుట్టేరు. మరో ఏడాది గడిచేసరికి ఆయన వెళ్ళిపోయారు, ట్రాన్స్ఫర్ మీద. అంతే? అవాల్టినుంచి ఇవాల్టిదాకా నేను కూర్చోలేదు. నడుస్తూనే వున్నాను. తరిమి తరిమి కొడుతున్న జీవితానికి భయపడి పరుగులు పెడుతూనే వున్నాను.

కూర్చుని తినడానికి యోగ్యతలేదు. కూర్చో పడిపోకుండా, చతికిల్లా పడి పోకుండా నిలబడే వున్నాను. మీ ధర్మమా అని ఆ ఇద్దరు బిడ్డల్నీ ప్రసాదించేరు. లేకపోతే కూర్చునే ఉందునో కూరుకుపోయే ఉందునో?

ఆ నిశ్శబ్దం సాయంతో సిగరెట్టుని పూర్తిగా కాల్చేసి, అప్యాయమైన ఆఖరి దమ్ము పీల్చేసి, దూరంగా పారేశాడు సుందర్రావు. కుర్చీలో వెనక్కివాలి, కాళ్ళు రెండూ కుర్చీ కుడికాలిమీద పెట్టుకుని మళ్ళీ ఏదో మాట్లాడతా నన్నట్టు గొంతు సవరించుకున్నాడు.

పార్వతికి హటాత్తుగా పొయ్యిమీది పాలూ, వంటింట్లో ఇందాకటికే అయిపోతానూ ఆరిపోతానూ అంటూ బెదిరించిన కొవ్వొత్తీ జ్ఞాపకం వచ్చాయి. వెంటనే లోపలికి వెళ్ళింది.

సుందర్రావుకి నిన్న స్వామి దరహాసానంద చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. "శిష్యా! ఈ నగరంలో నువ్వు పుట్టి, పెరిగి వివాహితుడవై, ఉద్యోగస్తుడవై, ఇల్లుకట్టి బిడ్డల్ని కన్నానని చెప్పావు. బహుశా ఇందాక సభలో మొదటి వరసలో చివర్న కూర్చున్న భద్రి నీ పూర్వాశ్రమపు ఇల్లాలై ఉంటుంది. నాకు నువ్వు పరిచయమై, శుశ్రూషలో ఉండిన ఈ నాలుగేళ్ళ కాలంలో నువ్వు ఏ స్త్రీని అలాంటి ఆచంచలమైన విలక్షణమైన సామీప్యం కళ్ళలోకి తెచ్చుకుని చూడడం నేను చూడలేదు. వెళ్ళిపో. సంకోచించకు. నీకు తగినది గృహస్థాశ్రమమే, బాధ్యతలకి భయపడో, సంసారపు నలస్గారానికి విసుగు చెందో నువ్వు సన్యాసం అనుకుని వానప్రస్థం స్వీకరించావు. ఇంకా నీ పూర్వాశ్రమపు కుటుంబానికి నువ్వు చెయ్యగలిగింది ఏదో ఉంటుంది. వెళ్ళి అది నెరవేర్చుకో. అదే నీకు పరమావధి. సెలవు!"

స్వామికి తను పూర్తిగా అర్థం కాలేదు. చెప్పిన సూత్రం చప్పున తెలుసుకోగలడని తెలుసుకున్నారే తప్ప. తన బహుగుణ గ్రహణ పారీణత వారికి గ్రాహ్యం కాలేదు.

ఆ చురుకుతనం తాను పుట్టిన నేలలోదేమో. ఇరవై ఎనిమిదో యేట అంత పెద్ద కంపెనీకి అంత ముఖ్యమైన అధికారి కాగలిగాడు తను. తను వేసిన ఎరలను మింగి, ఎంతోమంది ప్రభుత్వాధికారులు, ఇతర వ్యాపార సంస్థల యజమానులు తన గాలాలకు చిక్కుకుని, తను పని చేసిన కంపెనీకి బాగా మేలు చేసేరు, చాలా కాలంపాటు.

హైదరాబాదులో తను ఒక్కడూ వుంటూ కంపెనీకి బిజినెస్ సంపాదించ డానికి చేసిన ఖర్చుకి, ముందే తీసుకున్న మొత్తానికి వివరణగా పంపిన ఒక బిల్లు మీద ఇక్కడి అకౌంట్స్ మేనేజర్ పెట్టిన అభ్యంతరాలు అతి సమంజస మైనవి. అయితే కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు ఆ బిల్లును పూర్తిగా ఆమోదిస్తూ అన్నమాటలు; "మర్రిచెట్టున వ్రేలాడే గబ్బిలం మర్రికాయలు తింటే అది తప్పు కాకూడదు. ఎంచేతంటే దానికి మామిడికాయలు దొరకవు కనక. అంచేత, ఏ ఎరలు ఉపయోగించి సుందర్రావు ఇతరుల్ని వశం చేసుకుంటున్నాడో ఆ ఎరలకి సుందర్రావే ఎర ఐపోతే, ఆ వ్యసనాలు అతన్నే మింగేస్తే మనం కంపెనీ బాగుపడిందా లేదా అన్నదే చూసుకోవాలిగాని. మిగతా వేవీ పట్టించుకో కూడదు!

ఆ రోజులు ఎంత వర్ణ పూర్ణాలు! ఆ రంగుల కలలన్నీ ఓ విధంగా అబద్ధాలే. కాని అవి నిజంగా జరిగాయి! తను కబురు చేస్తే ఇతరుల ఆనందం కోసమా తన సౌఖ్యంకోసమా అని అడక్కుండా వొచ్చి పాత్రధారణ చేసిన సుందరీమణుల్లో ఇద్దరు ముగ్గురు, కావ్యాల్లోనూ పురాణాల్లోనూ కూడా చెప్ప లేనంత అందం వుండిన బంగారు శలాకలు కాదూ?....వాళ్ళ శీల ప్రవర్తనల నైజం తెలిసీకూడా తనకి వాళ్ళలో ఏ ఒక్కరితోనైనా సహజీవనం ఏర్పడితే బాగుండునని ఎన్నిసార్లు అనిపించలేదు!.........తన జీవితంలో ఆ భాగం. పాద రసం లాంటిదీ, ఏకచక్ర రథం లాంటిదీ అయిన తన చురుకు తనం, స్వామి పూర్తిగా ఊహించగలరా?

పార్వతి అలికిడైతే అటు చూశాడు సుందర్రావు ఒక చిన్న స్టూల్ తెచ్చి అతనికి ఎడంవేపున పెట్టింది. మళ్ళాలోపలికెళ్ళి ఒకచేత్తో గ్లాసూ, మరొక లాంతరుతెచ్చింది. గ్లాసు స్టూలుమీద వుంచి, లాంతరును ద్వారం పక్కన మేకుకి తగిలించింది; "పుచ్చుకోండి" అన్నది.

"ఏమిటది?"

"పాలు?"

సుందర్రావు నవ్వాడు. "పాలు పుచ్చుకోడానికి దీపం వుండాలా?"

"మేమింకా సన్యాసులం కాలేదుకదా. మాకు చేతికీ నోటికీ మధ్య చీకటి వుంటుంది"

"కాళ్ళూ చేతులూ కడుక్కోవాలి–" అన్నాడు సుందర్రావు, ఇబ్బందిగా.

సిగరెట్టు తాగొచ్చు. కాని కాళ్ళూ చేతులూ కడుక్కోకుండా పాలగ్లాసు ముట్టరు!....ఏదో ఒక అబద్ధపు నీతి!....అనుకుంటూ లోపలికెళ్ళింది పార్వతి.

........ఐదేళ్ళనాడు హైదరాబాదులో—అప్పుడూ యిలాగే.

తననీ పిల్లల్నీ తమపాటికి వదిలేసి వెళ్ళిపోయి, పదేళ్ళకి ఆ కన బడ్డం....ఆ పదేళ్ళు ఎంత కష్టంగా గడిచాయి!

తాగుతున్నారు, తిరుగుతున్నారు—అని తెలిసిననాడే తను అడిగింది—అదేం ఖర్మమో, ఏ అడదానికైనా. తన మొగుడు యిలాగా అని ఊరూ వాడా తెలిసేక అందరికంటె ఆఖర్ని తెలుస్తుంది కాబోలు....అంతే-ఆ మర్నాడే, హైదరా బాదులో కొత్తగా ఆఫీసు పెట్టాలి, ఇవాళే ప్రయాణం అన్నారు. ఆ ప్రయాణమే ప్రయాణం. అటు వెళ్ళిన మనిషి మరి ఇటు రాలేదు. ఉత్తరాలకి సమాధానం లేదు. రమ్మని టెలిగ్రాములిస్తే ఫికర్ లేదు. నేనే వస్తున్నానని రాస్తే టెలి గ్రాములిస్తే, సరిగ్గా అదే రోజున క్యాంపు, నెల్లాళ్ళవరకు రారని ఎవర్తో చెప్పడం.

కొన్నాళ్ళు నెలనెలా ఇంత అని డబ్బు పంపించేరు. ఇంక ఆర్నెల్లే ఇలా పంపుతాను సుమా అని సూచించేరు వోసారి. ఆ ఆరునెలల్లో చేసిన ఉద్యోగ ప్రయత్నాలే ఈ జీవితానికి రూపాన్నిచ్చేయి. ఆ మౌనం అలా పదేళ్ళు!.... పిల్లాడు గ్రాడ్యుయేట్ అయ్యాడు. ఉద్యోగం సంపాదించుకున్నాడు. పిల్ల ఎదిగింది, పెళ్ళి అయింది, హైదరాబాదులోనే అల్లుడికి వుద్యోగం. తొలిసారి పిల్లని అత్తారింటికి దిగబెట్టి వొచ్చేస్తున్న రోజున: హైదరాబాదు స్టేషన్‌లో ఆ పదేళ్ళ తరవాత మళ్ళీ కనబడ్డారు........ఉద్యోగం పోయింది........ఎవడో పాత పరిచయస్తుడు ఆరోజు ప్రయాణం చేస్తాడని తెలిసి- అతడిదగ్గిర కొంత డబ్బు తీసుకొందామని వొచ్చినట్టుంది ఈయన, స్టేషన్‌కి, అవతలి మనిషి పార్వతి ఎక్కిన రైల్లోనే, అదే కంపార్టుమెంటులో ఆమె ఎదుటి బెర్త్‌లోనే ఉన్నారు. ఈయన వొచ్చి డబ్బు అడగ్గానే అతగాడు, "ఛీ కుక్కా! బ్రోకర్ వెధవా" అంటూ తిట్టిపదేశాడు........ఆ ప్రయాణానికి కొనుక్కున్న టిక్కెట్టు కాన్సిల్ చేయించుకుని, ఆయన్ని తీసుకొని ఒక హోటల్‌కి వెళ్ళింది పార్వతి. రూమ్‌లో ప్రవేశించాక-ఏమిటండీ, ఈ ఘోరపరిస్థితి—అంటూ కావలించుకొని ఏడవబోయింది పార్వతి"........స్నానం చేసివస్తాను, అంతవరకు నన్ను ముట్టుకోవద్దు—అన్నారు: దూరంగా జరిగిపోయి,

"కూర్చో" అన్నాడు సుందర్రావు.

నిండా నీళ్ళతో తెచ్చిన చిన్నబాల్చీ, చెంబు, అక్కడ రెండో మెట్టుమీద పెట్టింది. పార్వతి తువ్వాలు మోచేతిమీద వేలాడేసుకొని వుంది. అతని మాట విని ఇటు తిరిగింది. స్టూల్ మీద గ్లాసు కిందని దూరంగా పెట్టి, ఉత్తరీయంతో స్టూల్ తుడుస్తున్నాడు సుందర్రావు.

కాళ్ళు కడుక్కుంటూ చూశాడు. పార్వతి స్టూల్ మీద కూర్చుంది. మోకాలి మీద మోచెయ్యి. అరి చేతులో చుబుకం.

"కళ్ళజోడేమిటి: చత్వారమే?"

చిన్న నవ్వొచ్చింది పార్వతికి. ఆ! చత్వారమే. ఒక ఆఫీసు. కాయితాలు చదవడం. రాయడం వున్నాక చత్వారం రాక తప్పుతుందా? బియ్యంలో రాళ్ళేరితేనే గుడ్డుగూటిలో కొస్తున్నాయి."

మెట్లెక్కి వొచ్చాడు సుందర్రావు. తువ్వాలు అందుకుని ముందు చేతులూ తరవాత కాళ్ళూ తుడుచుకున్నాడు. "ఒకవాటా యిల్లు అద్దెకివ్వలేదా?"

"ఇచ్చేను."

"మేడమీద గదులు రెండూ?"

"అవీనీ."

"వాళ్ళెవరూ కనబడరేం?"

"ఈ వాటాలో వాళ్ళు ఏదోవూరు పెళ్ళికి వెళ్ళారు. మేడమీద హైస్కూలు హెడ్ మిస్ట్రెస్ రాత్రి ఎనిమిదింటికి భోజనం చేసిగాని రాదు."

—"మామూలుగా మాట్లాడేస్తోంది. ఇందాకున్న బింకం లేదు," అనుకున్నాడు సుందర్రావు.

కాని పూర్తిగా క్షమిస్తుందని, మనస్ఫూర్తిగా స్వీకరిస్తుందని నమ్మకం లేదు......పదేళ్ళపాటు కనిపించకుండా హైదరాబాదులో ఉండిపోయినపుడు, తిరిగి కలుసుకోగానే బేల అయిపోయింది. హోటల్ గదిలో రాత్రి తెల్లవార్లూ ఏడుస్తూ కూర్చుంది. తన శరీరంలో ప్రతి భాగాన్ని ఆత్మీయతతో, కాపీర్నంతో స్పృశించింది, తను ఉద్యోగం పోగొట్టుకున్నందుకు బహిరంగంగా సంతోషించింది. తనకి అంటూ ఇలా మిగలడం ఆమె అదృష్టంగా భావించింది. అయితే తిరిగి ఇంటికొచ్చాక—

మళ్ళీ తనకి ఒక ట్రాన్స్‌పోర్టు కంపెనీలో ఉద్యోగం వచ్చేక,

"నాన్నగారూ నేనూ యిద్దరం సంపాదిస్తున్నాం కదా, నువ్వు ఉద్యోగం మానేయమ్మా!" అని కొడుకు అన్నాడు, తను ఒప్పుకోలేదు. అంచేత ఆమె కూడా ఒప్పుకోలేదు. కాని అప్పుడామె చూసిన చూపు, అది రాముడి అక్షయ తూణీరం నుంచొచ్చిన నారాయణాస్త్రమేకాని మరొకటి కాదు!...." అలా నెల రోజులు గడిచాయి అంతే—

ఆ సాయంకాలం సుందర్రావు తల్లి హఠాత్తుగా చచ్చిపోయిందని తెలియక డ్యూటీ అయిపోయాక ఇంటికి రాకుండా ఎవరో మిత్రుడితో, ఆ నెల్లాళ్ళకీ మొదటి సారిగా ఒక బార్‌లో కాలక్షేపం చేస్తూ వుండగా. తన కోపం వెతికి వెతికి అక్కడ పట్టుకొని ఇంటికి తీసుకెళ్ళాడు కొడుకు. పార్వతితో ఏం చెప్పాడో మరి—

మర్నాడు ఉదయం తల్లికి తలకొరివి పెట్టడానికి ఇల్లు వదిలేదాకా— పార్వతి తనవేపు చూడలేదు. తనతో అన్యాపదేశంగానైనా మాట్లాడలేదు....

అలాంటప్పుడు అట్నుంచి అలాగే, అస్తి సంచయనం చేసుకుని కాశీ వెళ్ళి గంగలో వాటిని నిమజ్జనం చేసి—మరి రాకపోడం తప్ప వేరే దారి ఏముంది తనకి? కాశీలో దీక్ష! హృషీకేశ్‌లో నిష్ఠ, గయలో తపస్సు, పూరీలో ధ్యానం, కంచిలో సన్న్యాసం, స్వామి దరహాసానంద శిష్యత్వం....

పాలు పుచ్చుకోడానికి ముందు ఒక మంత్రం చదివాడు సుందర్రావు. కొంచెం చల్లారి ఉన్నాయేమో, గటగటా తాగేశాడు.

"నేను ధ్యానం చేసుకోవాలి. రెండు మూడు గంటలు పడుతుంది. ఆ మూల వీలవుతుందా?" అన్నాడు.

పార్వతికేమీ తోచలేదు, ఆ క్షణంలో. ఈయన ఓ సారి చూసిపోదామని వచ్చారా, లేక మళ్ళీ కొన్నాళ్ళు (శాశ్వతంగా ఒకచోట ఒక వృత్తిలో, ఒక ప్రవృత్తిలో ఉండడం ఆయనకి ఎలాగూ అసాధ్యమే కనక) యిక్కడ వుందామని వచ్చారా? ఈయన రావడం విషయంలో. కొన్నాళ్ళు యిక్కడ ఉండడం విషయంలో, కొడుకూ, కోడలూ ఏ అభిప్రాయంలోకి వస్తారో? ఇంట్లో అద్దెలకున్న వాళ్ళు, ఇరుగు పొరుగు—అంతా ఈయన్ని గురించి ఏమనుకుంటారు, ఏం అడుగుతారు, వాళ్ళకి ఏమిటి చెప్పి మరిన్ని

...న్నా, ఇంత అనేక సమస్యలు ఆమెని బాధిస్తున్నాయి.

"నేను ఆ మూల ధ్యానం చేసుకోవచ్చా?"

పార్వతి మాట్లాడలేదు. లోపలికెళ్ళి ఎప్పుడో పూర్వులు జాగ్రత్తచేసిన లేడిచర్మం- గోడ నున్నందువల్ల పట్టిన దుమ్ముదులిపి- తెచ్చి అక్కడ "ఆ మూలని" పరిచింది. "ఇంకేమైనా కావాలా?"

సుందర్రావు తల అడ్డంగా ఆడించాడు. వెంటనే లేచి, తొడుక్కున్న కమీజూ చుట్ట బెట్టుకున్న గూడకట్టు పంచే విప్పేశాడు. సన్యాసులు కట్టుకునే కచ్చడం మాత్రం ఉంచుకున్నాడు. "ఈ దీపం వొద్దు. ఏ దీపమూ వొద్దు" అన్నాడు. జింకచర్మం మీద నిలబడి, ముందు పశ్చిమంగా తిరిగి నమస్కారం చేసి, మంత్రం చదివి, అదయిపోయాక పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు.

0 0 0

రాత్రి పదిగంటలయింది,

రమణ, విజయ-రిక్షాదిగి లోపలికొచ్చారు.

వరండాలో ఆ మూలని ఒక ఆజానుబాహువైన పురుషుడు దేవమానవ దూష్యమైన వస్త్రంలో, శీర్షాసనంలో ఉండడాన్ని ముందుగా చూసింది విజయ. నోటికి మాట ఏదీరాలేదు. ఒకవేలితో చూపించి రమణకి దగ్గరగా జరిగింది.

"ఏయ్! ఎవరక్కడ?" అని గట్టిగా అడిగాడు రమణ. సమాధానం లేక పోడం చూసి. కాలింగ్ బెల్ మీట నొక్కాడు—పార్వతి తలుపు తెరిచింది. హడావుడిగా లోపలికెళ్ళి వరండా మీద వెలిగే దీపం మీట నొక్కబోతే పార్వతి అతన్ని ఆపేసింది. "మీ నాన్నగారు" అంది, అతి తక్కువ స్వరంతో, కొడుకు కళ్ళలోకి నిర్లిప్తంగా చూస్తూనూ.

"ఇదో కొత్త అవతారం కాబోలు. మళ్ళీ ఏ మొహం—"

పార్వతి కొడుకు నోరు తన చేత్తో మూసేసింది.

"నువ్వు కూడా మొగాడివే నాయనా. నీకూ ఆ హక్కులన్నీ వున్నాయి. తాగినా, తిరిగినా, ఆనందం అయిపోయాక ఇంటికి చేరుకోవచ్చు. అలాక్కాకుండా వైరాగ్యం పుట్టిందీ, సన్న్యాసుల్లో కలిసి పోయీ కూడా! అక్కడా విసుగనిపిస్తే అప్పుడు కూడా మళ్ళీ ఇంటికి చేరుకోవచ్చు. ఒకసారి ఇల్లు విడిచి మంచికో చెడ్డకో వెళ్ళిపోయిన ఆడదైతే మాత్రం మళ్ళీ ఆ గడప తొక్కడానికి వీలుండదు. మొగాడికి తన యింటికి తను చేరుకోడానికి ఎప్పుడూ హక్కుంటుంది. ఈ హక్కు తీసెయ్యడానికి ఎవరికీ హక్కులేదు" అంది పార్వతి శాంతంగా, కొడుకునీ, కోడల్నీ మార్చి మార్చి చూస్తూ.

విజయ తలవంచుకుంది.

రమణ తీవ్రంగా ఏదో అనబోయిన వాడిలాగ పెదవులు విప్పి ఒకసారి గాలి పోసుకున్నాడు.

పార్వతి, కొడుకు చేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకుని, "ఆయన ఒకప్పుడు నాకు, అందరికంటేనూ ఎక్కువ వారు. ఇప్పుడు నాకేమీకారు. కాని, ఆయన, ఎప్పుడూ మీ నాన్నగారే గ్రా నాయనా!" అంది పూడుకుపోయిన గొంతుతో.

రమణకి బోధ పడిందల్లా ఒక్కటి. ఈ ఇల్లు ఇంకా ఆయన పేరును మోస్తున్నది.

***

("జ్యోతి" మాసపత్రిక; జనవరి 1966)

# త్రివర్ణ చిత్రం

సరళాదేవి రిస్టువాచీ చూసుకుంది.

పదిన్నర!

వర్షం అలా పడుతూనే ఉంది, తెరిపి లేకుండాను. 'వెధవ వర్షం' అని పైకే విసుక్కుంది సరళాదేవి.

రామకోటి ఆమెని గమనించకుండా బల్లమీద చతురంగ బలాలు పేరుస్తు న్నాడు.

"మరో ఆట వేద్దామంటావా!" అంది సరళాదేవి ఆవలిస్తూ చిటికలేస్తూ.

"అయ నొచ్చేవరకూ ఆడుతానంటివిగా!.... నీ ఇష్టం, పోయి పండు కుంటానంటే వెళ్ళు. నాదేం లేదు!" అని రామకోటి ఆమెవెళ్ళిపోడం తన కిష్టం లేదని తెలియజేశాడు.

వరండాలో కుర్చీలో కూర్చున్నారు. రామకోటీ, సరళాదేవీను, టేబిల్ పొడుగుపైపు ఒక కుర్చీ, వెడల్పుపైపు మరొకటీ, టేబిలుమీద చతురంగ బలాలూ యుద్ధానికి సిద్ధంగా ఉన్నాయి.

"ఆయనింకా ఎప్పుడొస్తారో.... వూరంతా నిద్రపోయిందిగాని ఇంకా ఇంటికి జేరటానికి వేళకుదర్లా." అని పైకే అనుకొని, రామకోటి కళ్ళలోకి చూసి "నాదా?" అని, యాదాలాపంగా బంట్లు తోసింది సరళాదేవి. మరుక్షణం ఆమె దృష్టి గేటువేపు మళ్ళింది.

అక్కడింకా ఎవరూ ఒచ్చిన అలికిడిగాలేదు.

సరళాదేవి ఆనందరావు భార్య, అతను ఎడ్వకేట్. రామకోటి ఆరు నెలలక్రితం ఇన్‌కమ్‌టేక్స్ ఆఫీసరుగా వొచ్చాడు.... ఇంతకు ముందుండే ఆఫీసరు, అదే ఇంటిలో, క్రింది వాటాలో ఉండేవాడు. ఆయన వెళ్ళిన తర్వాత పదిహేనురోజులకి రామకోటి ఈ వూరు వొచ్చాడు. ఆ పదిహేను రోజుల్లోనూ ఆనందరావు ఇంటివాళ్ళతో మాట్లాడి తను మేడమీది వాటాలోంచి క్రింది వాటా లోకి మారిపోయాడు.

"మేడమీది వాటా అయినాసరే, నా కభ్యంతరం లేదు!" అని రామకోటి ఇల్లు చూసుకున్నాడు; చేరేడు.

మర్నాడు పొద్దున్నే అతను దగ్గిరుండి నేమ్‌బోర్డు కొట్టిస్తూ వుండగా సరళాదేవి అటొచ్చి అతన్ని గుర్తుపట్టింది.

"హల్లో—ల్లో— రాంకోటీ! నువ్వా, ఈ ఇన్‌కమ్‌టేక్సాఫీసరు? బలే! ఎంత చిత్రం!" అన్నది. మొహం అంతా ఆశ్చర్యం ఆనంధం, నవ్వూ చేసుకొని.

కడుపునిండా ఒచ్చిన సంతోషం రామకోటి కూడా మొహంనిండా కన బర్చాడు. "— అరె! మీరా? ఈ క్రింది వాటాలో ఉంది? —ఆనందరావు, బియ్యే బియల్, అంటే పరధ్యాన్నంగా ఎవరో అనుకుంటున్నాను. జస్ట్ వండర్ ఫుల్!—ఆనందరావు ఈ వూళ్ళో పెట్టాడా ప్రాక్టీసు?"

"బందర్లో బాగులేదని యిక్కడి కొచ్చేశాంగా! ఐదేళ్ళయింది."

—ఆనందరావూ, రామకోటీ, సరళా, వొక్క కాలేజీలోనే చదువు కున్నారు. అందరికీ అందరూ తెలుసు. అందరూ తెలియడమే కాదు; అంతా తెలుసు.

రామకోటి ఆ రోజుల్లో సరళని కోరేడు; ప్రేమించాడు, ఆరాధించేడు.... తీర్చిదిద్దిన బొమ్మలా వుండేది సరళ. అంతేకాదు. చూసిన వాళ్ళందర్నీ వెర్రె త్తించేటంత చలాకీగా, దూకుడుగా వుండేది. ఇంకొంచెం అయితే ఎబ్బెట్టుగా వుంటుందన్నంతగా సౌందర్య ప్రదర్శన చేసేసేది....బట్ట కట్టడంలో, బొట్టు పెట్టడంలో, జుట్టు దువ్వుకోడంలో సరళాదేవి కళే వేరు. నడవడంలో, నవ్వ డంలో పరుగెత్తడంలో పడిపోతుందేమో చూదాం అనిపించిజనాన్ని నిలబెట్టే యడంలోసరళాదేవి పద్ధతే వేరు. ఆమెని అనుకరిద్దామని ఆడపిల్లలూ, అను సరిద్దామని మగపిల్లలూ ఊరేవాళ్లు.

.... అది అప్పటి మాటే— అప్పటి సరళ యిప్పటి సరళలో యెక్క డేనా కనబడుతుందేమో అని వెతుకుతున్నాడు రామకోటి....ఇప్పుడైతే మట్టుకేం? —సరళ అప్పటికంటె ఎక్కువ నిండుతనం ప్రదర్శిస్తూ, అప్పటికంటె ఎక్కువ ఆదరం చూపిస్తూ; అప్పటికంటె ఎక్కువ అందంగా కనిపిస్తోంది.... ఈ నిండుతనంలో, ఆదరంలో, ఆత్మసౌందర్యం ఎక్కువగా ఉన్నట్టుంది.

పరిణతి పొందిన ఆనందానుభవం సరళ— అప్పుడేదో అజ్ఞానంలో, అడిగితే అవునూ కాదూ అనలేకపోయింది.... ఇప్పుడేమనుకుంటోందో, సరళ?

రామకోటి ఆమె కళ్ళల్లోకి చూశాడు. అవి అస్పష్టంగా అటూ యిటూ కదిలేయి. ఎటో యెటో చూసి వెతికి, ఎక్కడా ఏమీలేదని గ్రహించినట్టు మళ్ళీ యిటొచ్చేయి.

"ఏంటో—అదోలా వున్నావు సరళా!"

"ఏం లా" అనవసరంగా నవ్వింది సరళ.

"అతను రాలేదనేగా!........ ఒస్తాడులే....యిదేంకొత్తా?"

సరళ నవ్వేకుంది. ఏదో ఓదార్పు చెప్పాలని చెబుతున్నాడు రాంకోటి. అంతే, అదొక ఫార్మాలిటీ. ఆడదానికి మొగుడో ఎవడో రక్షణ వుండాలి.రక్షణ దొరుకుతుందిలే అని అభయం యివ్వడం సిల్లీ ఫార్మాలిటీ!

—కాని, పార్మాలిటీస్ దాటగలిగిన స్నేహం తపది....ఆ మాటకొస్తే అన్ని అవరోధాలూ అతిక్రమించగల అనుబంధం— మొగ్గలోనే తుంపేసినా మోడే చిగురించగల ఆనందానుబంధం. అమృతం, అనంతం; అది అనుభవంతో ఆరిపోయేదిగాదు.

తన అందాన్ని—అమ్మకంటే బహిరంగంగా, అద్దంకంటే స్పష్టంగా, చెప్పగలిగిన రాంకోటి తన ఆనందాన్ని- ఆనందరావు కంటె అభిమానంగా, ఆత్మకంటే ఆప్యాయంగా ఆకాంక్షించి ఆవేశపడ్డ రాంకోటి; తనే సర్వస్వమను కునేవాడు ఒక్కడైవా ఉన్నాడన్న గర్వం తనకలగజేసిన రాంకోటి-అతన్ని చూస్తూ వుంటే, అతని సమక్షంలో వుంటే, అనుభవానికి ఆత్మమీద అనవస రంగా యింత ఆగ్రహమూ అసూయా ఎందుకూ అన్న మీమాంస కలుగుతుంది.

"సరళా; నువ్వందంగా ఉన్నావు.... నువ్వంటే నాకెంతో యిష్టం" అన్నాడు రామకోటి. అంత తియ్యటి మాటల్ని అంత స్పష్టంగా చెప్పిన మొదటివాడు (ఆఖరువాడు కూడా) అతనే........ఇప్పుడు అనడేం?—ఇప్పుడూ అంటూనే ఉన్నాడేమో! ఆ మాటల్ని వాతావరణం మింగేస్తోంది గావును! అతని నోటంట ఆ మాటలు అలకించే అర్హత పోగొట్టుకుంది తను.

"నన్ను పెళ్ళిచేసుకో సరళా....అలాచేస్తే నీ కంకితం చేసి నాబ్రతుకు సార్ధకమైన 'సరళ రేఖ'గా తీర్చి దిద్దుకుంటాను. అన్నాడు ........ఇప్పుడు

కాదు, ఎప్పుడూ. ఆనందరావుగాని, మరొకరు గాని మళ్ళీ ఆ మాట అన కుండానే అంతా జరిగిపోయింది.

—ఆరోజు—అతను తనకి వ్రాసిన లేఖని, మెస్‌వార్డెనూ, ప్రిన్సిపాల్ గారూ పంచాయితీకి పెట్టినరోజు— వాళ్ళు చేసిన ఫస్ చూసి- 'ఆయన నా కుత్తరం రాసేడని అంత యిదేం, మీ కందరికి! నేను ఆయన్నే పెళ్లాడుతాను. ఊరేగండి!, అని పైకే అనేద్దామన్నంత ప్రేరేపణ కలిగింది- కాని అనలేక పోయింది.

—అదొక చిత్రమైన లేఖ— పెళ్ళినే పెళ్ళి సార్లు పెద్దగా ఉద హరించిన ప్రేమలేఖ- ఆస్తులూ అవకాశాలూ వర్ణించాడు. తండ్రి కొక్కడే కొడుకు, ఒక్క తల్లికి కాదు. పెద్దమ్మకూ, చనిపోయిన సవతి తల్లికీ ముగ్గురు తల్లులకు- ముచ్చట పంటైన ముద్దుబిడ్డ. కలిగినింటివారి గారాబుపట్టి.... ఏం చేసినా సహించడమేకాక మెచ్చుకోవడం నేర్చిన పెద్దలు....చురుకుతనంతో, జ్ఞానంతో ఆకట్టుకున్న స్నేహితులూ, ఉపాధ్యాయులూ- చూడు సరళా, ఇదీ నా ప్రపంచం. నా చుట్టూ మనుష్యులు ఇంతలాంటి దేవతలు.... వీళ్ళనిబట్టి నన్ను తెలుసుకోగలవు- ఈ జనంలోకి. ఈ మనస్సులోకి నీలాంటి సుందరి. సుమతి. గృహలక్ష్మిగా, రాణిగా ఉంటే తప్ప నిండుతనం రాదు- నీవేపు ఏ మాత్రం అయినా దురదృష్టం, అనుమానం, సందేహం వుంటే, యెంత పెద్దవైనాసరే, ఎంత మొండివైనా సరే, వెంటనే తెలియజెయ్యి, దాటడానికి మార్గం, పోనీ తప్పించుకోడానికి తరుణోపాయం చూసి తెలియజేస్తాను-

'ఇందులో వొక్క అక్షరం అబద్ధం లేదండీ....ఏదో వుద్రేకంలో తాత్కాలిక వుల్లాసంలో, అర్ధరాత్రిపూట అరకప్పుటీ కొట్టేసి అప్పటికప్పుడు లెచ్చుకున్న అవేశంలో రాసినబాపతు కాదండీ. అంతా ఫీలై, అన్నిటికీ సిద్ధమై వ్రాసేనండీ-'అన్నాడు; ఆనాడు ప్రిన్స్‌పాల్‌గారు, కొందరు లెక్చరర్లు, అతన్ని నిలబెట్టి సంజాయిషీ అడిగితే.

'డిస్మిస్ హిమ్!' అంది మెస్ వార్డెను; నలభై రెండేళ్ళ ఆజన్మ బ్రహ్మచారిణి, పదేళ్ళ మెస్‌సర్వీసులో-వెయ్యిన్నొక్క ప్రేమ లేఖల్లో- వొక్కటికూడా తనది కాకపోయెనే అన్న కసివెళ్ళగక్కుతూ,

'పోనీ ఆ అబ్బాయికే యివ్వరాదటమ్మా, పిల్లనూ!-అంతగా యిష్టపడు కున్నారాయె!' అని ప్రిన్సిపాల్ గారంటే-

........ 'అన్నీ బాగానే వున్నైగానండీ. కోడవ(ట్లబ్బాయి కెట్లా యిచ్చ
నండీ అమ్మాయినీ?- కమ్మోరంతా నామీద ఉయ్యరూ?'- అమ్మ....త
ఆదరణాతిరేకంతో, తండ్రిగారు లేకపోవడమే అదృష్టమనిపించిన అమ్మ
కలలో కనబడ్డది యిలలోకి తెచ్చిచ్చి లాలించి. కన్నవారుగాని ఉన్నవారుగా
కనీవినీ యెరక్కపోయినా, కల్యాణం కాదు కాలేజీయే కావాలన్నప్పుడు క
కరించిన కన్నతల్లి, కాకూడని సమయంలో కరుగ్గా అయిపోయింది.

'అతన్నే పెళ్లాడతానమ్మా. కులం గోత్రం కూడు బెడతాయా? కులము
పాడూ!,' అనలేకపోయింది తను. పోనీ యింకో విధంగా అతన్తో చెప్పాల:
పించినా, అంత మర్యాద మనిషికి యింత హీనమైన సలహా యివ్వడమా అ:
పించింది....ముగ్ధత్వం వొదలనినాడు మొహమాటం ఎలావదుల్తుంది?

అలా జరుగుతాయి పెళ్ళిళ్ళు- ఇరవై ఏళ్ళకి చేసినా బాల్యవివాహమే
తనది!....

ఆ సరళని చూస్తూ యిప్పుడు మనస్సు నవ్వుతున్న చిరునవ్వును దాచు
కొంటూ. ఏవేనా వాక్యాలు నోరుజారి వచ్చేస్తాయేమోనని బెదిరిపోతూ రామకోటి
వేపు దొంగతనంగా చూసింది సరళ.

0 0 0

ఆనందరావు ఆమెని పెళ్లాడాడు.... 'లా'పూర్తి చేసుకొని ఎప్రెంటిస్
షిప్ కోసం బందరు ఒచ్చిన ఆనందరావు, రామకోటి కలిసి ఓ యిల్లు అద్దెకి
తీసుకున్నారు. సరళనిచూసి, రామకోటి కధంతా తెలుసుకొని 'కులం వొక్కటే
నీ డిస్క్వాలిఫికేషనైతే ఆ అమ్మాయిని నే చేసుకోవల్సిందే- అన్నివిలువలున్న
మనిషినిపైకి పోనియ్యటానికి లేదు.' అన్నాడు.

-తరవాత కూడా రామకోటి వాళ్ళింట్లో ఉన్నాడు. 'ట్రియో' కలిసే
కనబడేవారు,ఎక్కడచూసినా! కాఫీహోటల్సులోనూ, పార్కుల్లోనూ, షాపు
ల్లోనూ, రోడ్లమీదా- ముగ్గురూ కలిసే కనబడి జనానికి ముక్కులమీద వేళ్ళూ
చెవులమీద చేతులూ వేయించే వాళ్ళు. సినిమాల్లో సరళవి మధ్యన కూచోబెట్టి
ఇటొకరూ అటొకరూ కూచుని జనాన్ని ఏడిపించుకుతీనేవారు.

ఈ ఎనిమిదేళ్ళ తరవాత, మళ్ళీ నాటికి నేడు ఇక్కడ కలిసివుండడం
టస్థించి, మళ్ళీ కూలాసాగా కాలం గడుపుతున్నారు వాళ్ళు. ఆరునెలలలో,

క్లబ్బులూ. పేకాటలూ. షికార్లూ, సినిమాలూ, పిక్నిక్‌లూ. పార్టీలూ, ఎన్నో చోట్ల ఎన్నో రకాలుగా ఎంతోమందికి ముగ్గురూ విడిపోకుండా కనబడి ఆశ్చర్య పరిచేరు. ఎవరికి పరిచయం చేసినా, మా 'ఫ్రెండ్'! అంటారు రామకోటిని, ఇద్దరూనూ. వాళ్ళమధ్య బంధుత్వం కలవలేదు. అది వాళ్ళకి అవసరంలా కన బళ్ళేదు. ఇలా పెళ్ళయిపోగానే అలా అన్నయ్యగారూ అంటూ పిలవడం ప్రారంభించలేదు సరళ. అది వాళ్ళు ముగ్గురూ అనుకోకుండా అవలంబిస్తున్న ఆనంద బాంధవ్యం.

రామకోటి, పెళ్లాడేడు, ఇద్దరు పిల్లలు. మూడోమారు కనటానికి ఆమె పుట్టిల్లూ అత్తిల్లూవున్న వూరు వెళ్ళింది.

'ఆమె వొచ్చేంత వరకన్నా మా ఇంట్లో తిను. ఆనక నువ్వెట్లాగూ మడిగట్టేసు కుంటావు' అన్నది సరళాదేవి, ఎంత ఫేవూపవ్వా ఉర్లగడ్డలేగా. ఆమెగారు నీకు బెట్టేది?'

0 0 0

'ఎత్తు వెనక్కి తీసుకుంటావా! ఇదిగో, ఈ స్క్వేర్‌లో వుండేది నీక్వీన్ వేలుపెట్టి చూపించాడు రామకోటి,

సరళ గడిలో చూస్తూ ఒడిలో చూసుకుంది- పైట ఎప్పుడు జారి పోయిందో....పూర్ణత్వాన్ని పొందిన యవ్వనం ఆచ్ఛాదన లేక నిండుగా గుండ్రంగా కనబడిపోతోంది.

చటుక్కునపైట సర్దుకొని రామకోటి మొహం చూసింది సరళాదేవి. అంతసేపూ ఆటుచూస్తూన్న రామకోటి హటాత్తుగా రోడ్డువేపు దృష్టి మళ్ళించేడు. 'అక్కడ విశ్రాంతి తీసుకునే తల- ఎన్ని వేల విలువ చేసునో-?'

వర్షంపడుతోంది....వర్షం చిందిన వరదలో.... హర్షంపొందిన యెడదలో ....పరప చిమ్మినబురదతో....ఎడదకమ్మినబెడదలో....ఎక్కడచూసినా చూసిన దృశ్యమే సుందరతరంగా కనబడుతోంది....దృష్టి మరల్చుకున్నా కళ్ళకి కనబడుతూనే ఉంది, ఆ దృశ్యం అదృశ్యం కాకుండాను- మనస్సునుమాపిన హృదయం....ఆనందరావు రాలేదు....అనవసరంగా ఆలస్యం చెయ్యడం అల వాటు చేసుకున్నాడు. ఆమెని కాల్చుకు తింటున్నాడు. ఎప్పుడూ ఏదో గొడవ ....పార్టీలూ, సాక్షులూ, వ్యాజ్యాలూ. అప్పీళ్ళూ, మేజిస్ట్రేట్లూ, జడ్జీలూ, బార్

ఎసోసియేషన్ మీటింగులూ అనుకుంటూను....నల్లకోట్లు రెపరెపలు....నల్లగౌన్ల పరంపరలు....తనకీ వుంది-నల్లబజారు ప్రాపకం....నల్లధనం వైభవం....నల్ల భార్య సౌరభం........

'ఇంకా రాలేదెందుకో-?' అంది సరళ.

'బహుశా వర్షానికి ఆగాడేమో—'

'వర్షమైతే ఆగిపోవాల్సిందేనా యేంటి?'

'బలేపనే: అటు చూడ్డాదూ, ఎట్లావుందో, జోరు?'

'ఔననుకో....ఐతే మాత్రం?—ఏ రిక్షావాడికో మరో పావలా పారేసి రారాదా యేం?'

వర్షంకేసి చూస్తూ అనవసరంగా మాట్లాడుకుంటున్నామని యిద్దరూ తెలుసుకున్నారు. ఒక్క నిమిషం మౌనంగా వొకరి మొహం వొకరు చూస్తూ కూచుండిపోయారు. ఆ సమయంలో వాళ్ళ మనస్సుల్లో ఏం భావాలు కదలాడేయో చెప్పడం కష్టం-హటాత్తుగా మెరుపు మెరిసింది: పెద్దగా వురిమింది.

మెరుపులో సరళ మొహం కనబడ్డది రామకోటికి. వెంటనే ఆమె మొహం మళ్ళీ చూశాడు. సరళ మొహంలో మెరుపు కనబడ్డది, సినిమాల్లో ఉపయోగించే లైబ్రరీషాట్స్‌లోని పిచ్చిగీతలు ఆమె మొహంమీద కాంతివంతమైన రేఖలుగా క్షణం- భయంకరమైన కొలరేడో లోయల్లా మరుక్షణంముద్రించబడ్డట్టు కనుపించింది.... మొహాలు మనస్సులకి సూచికలంటారు. ఈ మొహం సరళ మనస్సుది కాదు. సరళ....సరళ....సరళాదేవి! ఎదురుగా కనబడుతున్న బెదురు చూపుల మొహంలో, హృదయంలో పదిలపరచుకొన్న వదులైన జ్ఞాపకాలేవైనా చెదురుమదురుగా కనబడతాయేమోనని వెదకి వెదకి చూసేడు రామకోటి. కాని మరు నిమిషంలోనే, అవి తనని కుదురుగా కూర్చోనివ్వవని తెలిసి, అదిరిపడ్డాడతను, ఆ జ్ఞాపకాలు బరువైన అడుగుల్తో ఎదమీద నృత్యం చేస్తాయి.

అతనలా చూస్తూనే ఉన్నాడు. సరళాదేవి మూడుసార్లు చూపు నేలమీదకి మళ్ళించి మళ్ళీ మూడుసార్లూ అతని మొహంలోకే చూస్తూ కూచుంది, మళ్ళీ మెరుపు మెరిసింది. రామకోటి మెరుపు చూశాడు. సరళాదేవి అటు చూడలేదు. 'ఇంక నే నాళ్ళేనబ్బా!' అన్నది: ఉరుం చప్పుడులో బలంకలిపిన గలగల కలగా

పులగం అయిపోయింది. అతను మళ్ళీ యిటు చూసేసరికి ఆట మధ్యలో సమాప్తమైనంత విచారం కలిగింది.

"అరె! కలిపేశావా?'

'ఏం?' సిల్లీగా నవ్వింది. సరళాదేవి.

'నీ ప్రాబ్లెమ్‌కి నేను సొల్యూషన్ చూపిద్దామనుకున్నాను. మొన్న-ఆ రష్యా ఛాంపియనుండ్లా-వాడికీ యిట్టాంటి ప్రాబ్లెమే ఒచ్చింది.... సన్‌డే హిండూలో కామెంట్ చేసేడు....

'నాకు ప్రాబ్లెమూలేదు, నీ సొల్యూషనూ అక్కర్లేదు!' అంది సరళ, అతన్ని వంకరగా చూస్తూ, మిస్చివస్‌గా నవ్వుతూ, శ్లేషించాన్లేవోయ్ అన్నట్టు.

'అబ్బా! అదేంటి సరళా అట్లా మాట్లాడతావు! నే నేమన్నానని?' అన్నట్టు నిర్దోషి మొహంపెట్టి మాట్లాడకుండా కూచున్నాడు రామకోటి.

సరళ పక పకా నవ్వింది. 'నేను మాత్రం ఏమన్నాను?' అన్నట్టు తేల్చేస్తూ, చదరంగం బలం భరిణెలో పోస్తోంది.

వీధిలో కారాగింది. గేటు తెరచుకొని వో అబ్బాయి, ఆనందరావుని గొడుగులో వరండా మెట్లదాకా తెచ్చి విడిచాడు.

'పొద్దున నాలుగింటికే వస్తానండోయ్!' అని వెళ్ళాడు.

'ఓ, కే!' అని వరండా ఎక్కాడు ఆనందరావు.

0 0 0

జేబులోంచి రుమాలు తీశాడు ఆనందరావు. నెత్తి తుడుచుకొని, మొహంలోకి చిన్న నవ్వు తెచ్చుకొని, ఓసారి సరళవేపూ ఓసారి రామకోటివేపూ చూశాడు దర్జాగా నిలబడుండే.

'ఎట్లా అయితేనేం యింటికి చేరారే' అన్నది సరళ కసిగా,

'ఆ. చేరినట్టే, లేకుంటే కొంప మునిగేదే....' చైల్డిష్‌గా నవ్వుతూ అన్నాడు ఆనందరావు '....ఇట్టా నాకోసం చూస్తూ తెల్లవార్లూ వరండాలో కూర్చుని జాగారం చేసేవారేగా యిద్దరూ!'

"ఇంతకీ ఏం చేస్తున్నారట. ఇంత సేపూ?"

"టాట్టా లేం రేవు. బార్ ఎసోసియేషన్ మీటింగ్!"

"నే ననుకుంటూనే ఉన్నాను!" అన్నట్టుగా కుర్చీలోకదిలి సర్దుకున్నాడు రామకోటి.

"చాల్లెండి, చెబుతున్నారు—హాయిగా ప్రయివేట్ ప్రాక్టీసు పెట్టుకుని కూడా అర్ధరాత్రి వరకూ పనులు!....గవర్న మెంటుద్యోగస్తులు నయం: పెంద రాళే కొంపకు జేరుకుంటున్నారు!—ఎండనాడులేదు:వర్షంనాడు మొదలేలేదు!" అంది సరళ ఉక్రోషం తగ్గక.

"వర్షంకదా అనే మరి కాస్సేపు కంటిన్యూ చేసి మరిన్ని పాయింట్సు డిస్కస్ చేసేం మీటింగులో!" అన్నాడు ఆనందరావు మరింత సరదాగా,

"వెళ్ళి బట్టలు మార్చుకు రావోయ్, భోంచేద్దాం!" అన్నాడు రామకోటి, మాటల్లో కొచ్చిన విసుగు చేత్తో చూపిస్తూ.

"అరే! భోం చెయ్యలా?"

"మీరు రాకుండా ఎప్పుడన్నా భోంచేశారా ఏమిటి?....తొమ్మిదిలేదు, పదిలేదు, పదకొండూ లేదు!....అట్లా నిమిషాలు లెక్క బెట్టుకుంటూ కూర్చు న్నాం," ఆనందరావు ఆలస్యం చేసినందుకు పశ్చాత్తాప పడకపోయేసరికి సరళకి ఉడుకుబోతుతనం వొచ్చి మాటలు తడబడుతున్నాయి.

ఆనందరావు ఈలేసుకుంటూ లోపలికెళ్ళాడు, సరళ చదరంగంబలంలో ఆఖరు పాన్లు ఒకటో రెండో వుండిపోతే అవి భరిణెలోపోసి, మూతపెట్టేసి రామకోటి వేపు చూసింది, అతను ఆమె చూపునుంచి తప్పించుకొని, వాచీ వేపు చూసి, రాని ఆవలింతకోసం ప్రయత్నించాడు. సరళ తనుకూడా అనుకో కుండా వాచీకేసి చూసింది. పదకొండూ ఇరవై, లేచి, "రా, రాంకోటీ, భోం చేద్దాం!" అన్నది వీలైనంత మృదువుగా, వెనక్కి తిరిగి ఇంట్లోకి వెళ్ళి పోయింది. నడుస్తున్నప్పుడు నాట్యం చేసే ఆమె జడవేపూ, నడుంవేపూ, పిరుదులవేపూ చూస్తూ స్తబ్ధుడై మత్తుగా కూచుండిపోయాడు రామకోటి. గది ద్వారం వరకూ వెళ్ళి సరళాదేవి గిరుక్కున వెనక్కి తిరిగి చూసింది. ఏదో తెలుసుకుందామన్నట్లుగా.

రామకోటి ఇంకా అలా చూస్తూనే ఉన్నాడు.....

0 0 0

ముగ్గురూ భోంచేస్తున్నారు,ఆనందరావు టేబుల్‌కి వెడల్పువేపు ఒక్కడూ కూచున్నాడు; సరళా రామకోటీ టేబిలు పొడుగు వేపు ఎదురెదురుగా కూచు న్నారు. ఆనందరావు తీరుబాటుగా, దర్జాగా, ఆకలిగా తింటూ కోర్టులో అడిగిన

ధోరణిలో రెండువేపులా వున్న యిద్దర్నీ ప్రశ్న లడుగుతూ కాలక్షేపం చేస్తు న్నాడు.

'సో—నువ్వెన్నిగంటల కొచ్చావు, ఇంటికి?' రామకోటిని.

'ఏడుంబావుకి.'

'క్లబ్బుకి పోలేదన్నమాట....!'

'పోలా. అప్పటికే చినుకు లొస్తున్నాయి. ఇహ క్లబ్బూలేదు పాడూలేదని వొచ్చేశా.'

'అత నొచ్చేంతవరకూ నువ్వేంజేశావ్?' సరళాదేవిని.

'ఏముందేం మహా, చెయ్యటానికి!—వంట పూర్తిచేసుకుని రేడియో పెట్టుకూర్చున్నాను. అంతలోకే అతను రానేవొచ్చాడు....!'

'ఇహ ఎంతకీ నే రాకపోతే చదరంగం వేసుకున్నారేం?' ఇద్దర్నీ.

'అట్లా యేం లేదు....ఎనిమిదిన్నరకేమో రాంకోటి మెట్లుదిగి వొచ్చాడు. భోంచేస్తాడేమోనని వడ్డించబోయాను. మీరు రాలేదని తను తిననన్నాడు.ఎవడో పార్టీ వొచ్చి ఆఫీసులో పేద్దసీన్ క్రియేట్ చేసేడంటూ అదంతా చెప్పుకొచ్చేడు....ఆ మీన చదరంగం వేసుకున్నాం,' జవాబు చెప్తూ సరళాదేవి రామ కోటివేపు చూసింది 'ఏం, అంతేకదూ?' అని అతన్ని సంప్రదించినట్టుంది, ఆ చూపు సందర్భం.

"చదరంగం వేద్దామని యెవరికి తట్టింది?" అన్నాడు ఆనందరావు, వేళా కోళంగా నవ్వుతూ; వాళ్ళిద్దరూ అలా మొహాలు చూసుకుంటున్నారని.

"ఏమిటి, నీ క్రాసెగ్జామినేషను, చస్తున్నాం!" అన్నాడు రామకోటి నవ్వుతూ.

"అది కాదోయ్-" ఆనందరావు విశాలంగా నవ్వేడు. "వర్షం....ఉరుములూ మెరుపులూ భయంకరంగా వుంది....నేనేమో నిష్కారణంగా అక్కడ చిక్కుపడిపోతిని-రిక్షాల వాళ్ళేమో. నీ రూపాయకో నమస్కారం బాబూ మేం రాం పో" అంటున్నారాయె....నేనొచ్చేసరికి మీరిద్దరూ....భోంచేసి వెచ్చగా పడుకొంటారేమో, ఇల్లు ప్రోగ్రాంలేని డ్రామా హాల్లా ఉంటుందేమో భగవంతుడా— అనుకుంటూనే అక్కడ వుండిపోవలిసొచ్చె,-అందుకు—అయామ్ సో గ్లాడ్!— మీ రిద్దరూ మేలుకొని, పైగా భోజనమయినా చెయ్యకుండా నా కోసం యెదురు

చూడ్డం నాకెంత గౌరవం, ఎంత అదృష్టం?" అన్నాడతను. మొదటినుంచీ చివరిదాకా నవ్వుతూ.

ఆ మాటలు అట్లా చెప్పవలసింది కాదనీ, అందులో ఏదో వ్యంగ్యం ఉందనీ అనిపించింది రామకోటికి. "వెచ్చగా" పడుకుంటారేమో అని భయ పడ్డం-భోజనాలయినా చెయ్యకుండా యెదురు చూడ్డం- అదృష్టం. ఇవి సరిగ్గా ప్రయోగించలేదేమో!-అలా కాకుండా "అరెరె, పాపం! నాకోసం నిష్కారణంగా ఆకలితో కూచున్నారా. వెరీ సారీ-" అని ఏదో తేలిగ్గా అంటే బాగుండేదేమో—లాయరు! మాటలకి అర్థాలుంటాయని తెలుసుకోవడం వృత్తిధర్మం. మరి అర్థమున్న మాటలు ప్రయోగించడం యిక్కడ ధర్మమూ అనిపిస్తోంది- అతని ఉద్దేశమేమిటో-? ఆ మాటలు సాధారణమైనవిగా తీసుకొనేటంత మూర్ఖులిక్కడ లేరని తెలీదూ?

"ఎన్ని గేమ్స్ వేశారు?" సరళాదేవి నడిగాడు ఆనందరావు.

"లెక్క బెట్టలేదు-" సరళ,

"నువ్వు-?" అన్నట్టు, టీచరు చూసినట్టు, రామకోటివేపు చూశాడు ఆనందరావు.

"మూడు—కాదు నాలుగూ."

"అన్నిసార్లూ నువ్వే గెల్చావుగా."

"లేదు, ఓసారి తను గెల్చుకుంది" అంటూ సరళవేపు చూశాడు రామకోటి. "ఏమిటి, ఇలా అడుగుతున్నాడు, దీనికి అంతూ పొంతూ లేదా?" అన్నట్టుంది ఆ చూపు.

"అబ్బా, ఏమిటి. మీరిద్దరూ?-లేదూ, ఔనూ, కాదూ-! ఇవేనా కబుర్లు?-బోరింగ్."

"భలే! మీరా. మేమా, బోర్ చేస్తోంది?"

"మీరే! ఏమడిగినా సమాధానాలు చెప్పరు, వివరం మాట్లాడరు- మొహాలు చూసుకుంటూ కూచుంటారు'-నాకూ చెస్ తెలుసుగా, చెప్పరాదూ?- పోనీ నేను మా బార్ ఎసోసియేషన్ మీటింగ్ సంగతులు చెబుతానంటే వినరు!- అన్నం తినటం అయ్యేవరకన్నా కాస్త మాట్లాడరాదా యేం, అయినాలస్యం ఎట్లానూ అయిపాయె!"

"ఇప్పుడా సంగతులన్నీ దేనికి లేవోయ్, పదకొండున్నర దాటిందిగా! చప్పున భోంచేస్తె పడుకోవచ్చుగదా, చలిగా కూడా ఉంది."

"ఎప్పుడైతే మాత్రం, నాకు తెలీకడుగుతాను, మీ బార్ ఎసోసియేషన్ మీటింగులో ముచ్చట్లు మిగిలిన వాళ్ళకి రుచిగా వుంటాయటండి?" అమాయకం నటిస్తూ అడిగింది సరళ.

"ఉండవు! ఏం చేస్తాం? పాలకోసం రాళ్ళు మొయ్యాలి! నేనున్నంత కాలం నాతోబాటు వార్నూ, బార్ ఎసోసియేషనూ, ఎసోసియేషన్ మీటింగ్సూ, మీటింగు ముచ్చట్లూ అన్నీ వుంటూ ఉంటాయి. నేనేకాదు, నీకూ అంతే.-నీవన్నీ నీకుంటాయి—రామకోటి వన్నీ రామకోటి కుంటాయి—అత నాఫీసులోయెవడో పార్టీ వొచ్చి ఆగంచేస్తె ఆ సంగతి వొచ్చిందా లేదా? మీరిద్దరూ చదరంగం ఆడటం, ఆ చదరంగంలో ఎత్తులూ, ఎత్తుకు పైఎత్తులూ-అన్నీ ఉండాల్సిందే! అట్లా! వుయ్ హేవ్ టు పుటప్ విత్ అవర్ సెల్వ్స్-ఇన్ షార్ట్ ఒకరి న్యూసెన్స్ ఒకరు భరిస్తామని చేసుకునే ఎటర్నల్ అగ్రిమెంటే కదా, మేరేజ్ అంటే! అట్లాంటప్పుడు నా కబుర్లు విననంటంలో జస్టిస్ ఏముంది?"

సరళాదేవి నిస్సహాయంగా రామకోటివేపు చూసింది. ఆమె అట్లా చూడక పోతే రామకోటి పట్టించుకోక పోయేవాడు. వ్యంగ్యం తగిలి గుచ్చుకుంది, ఆ చూపులో తూపు ఎరుపు తెచ్చుకొని—మీరిద్దరూ చదరంగం ఆట్టం, ఎత్తుకుపై ఎత్తూ-ఏం టిదంతా!

కాని అతను తొందరగానే తేరుకున్నాడు.

చిరునవ్వు నవ్వి "-లాయర్ ననిపించుకున్నావోయ్." అన్నాడు.

సరళాదేవికి బలం ఒచ్చింది, దాంతో. ఆమె కూడా నవ్వింది. "కోర్టులో ఈ ధార రాదులే. ఒస్తె నీకు మేం కూడా దొంగ యకౌంట్లు చూపించి లంచా లిచ్చుకోవల్సిందే!" అన్నది.

"ఇస్తూనే ఉన్నానుగా!" పకపకా నవ్వాడు ఆనందరావు—"ఎటొచ్చీ కేష్‌కాదు—కైండ్!"

మళ్ళీ—

'అబ్బ'- ఇవాళ ఎంత అసందర్భంగా మాట్లాడుతున్నావోయ్.' అని నోటిదాకా వచ్చింది రామకోటికి. బలవంతాన నోరు కట్టుగోగలిగాడు....

గుప్తంగా ఉండిపోయిన అశ్లీలాన్ని గుర్తించడం కూడా అశ్లీలతే.... అదట్లా వది లేస్తేనే మంచిది.

o o o

ఎవరు కావాలనుకున్నారు, ఇదంతా?

అప్పట్లో అనుకున్న మాటైతే-సరళే సర్వమని- నిజమే, వ్యవహారంలో ఆనందరావు అడుగు పెట్టాక, ముఖ్యంగా అతను చేసిన ఎప్రోచ్ మాడగానే- చిన్నదైనా శాశ్వతమైన మార్పు ఒచ్చింది. కక్కలేక మింగుకోవలసిన పరిస్థితి ఏర్పడ్డది.

ఇప్పుడతను సరళని ఆ దృష్టితో చూస్తున్నాడా అంటే- అదీ వొక ప్రశ్నే!- అయినా అది చాలా దారుణం— చూపులూ, ఆలోచనలూ మన కంట్రోల్‌లో ఉండమంటే మటుకు ఉంటాయా? ఒక్కొక్క చూపు అనుకో నంత అన్యాయంగా ప్రసరిస్తుంది. ఒక్కొక్క ఆలోచన అనుకోనంత దారు ణంగా మెదడుని క్రాస్‌చేసి జుట్టు నిక్కబొడిపించి వెళ్ళిపోతుంది, దానికీ ప్రవ ర్తనకీ ఏమీ సంబంధంలేదు. ఆత్మని ఎనలైజ్ చేస్తే ఇవి దొరకవు. ఏదో పని మీద బ్యాంక్‌కి వెళితే ఎవరో చెక్కు మార్చి లెఖ్ఖపెట్టుకుంటున్న డబ్బు కాజెయ్యాలని. ఎవర్నో రిసీవ్ చేసుకోడానికి రైలుస్టేషన్‌కి వెళితే ప్లాట్‌ఫారం మీద కనబడ్డ అందమైన అమ్మాయిని లేవదీసుకుపోవాలని, అర్ధరాత్రిపూట భార్య పట్ల అన్యాయంగా ప్రవర్తిస్తున్న- మొహమేనా యెరుగని- ఘోరుగాయన్ని అప్పటికప్పుడు గోడ పగలగొట్టి చితకొ్కడదామని- ఎక్కడో ఓచోట, ఏదో దారుణమైన ఆలోచన కలుగుతూనే ఉంటుంది! మాటల్లో అనువదించి చెప్పడ మనే ప్రక్రియ లేకుండా ఆలోచన నిజస్వరూపంలో బైటపడ్డం సంభవమైతే ప్రపంచంలో ఇంత మంచీ, మన్ననా మిగుల్తాయా?, అనేకం అనుకుంటాం, ఒక్కటైనా చేస్తామా?.... చెయ్యడం వరకూ ఎందుకు, చెబుతామా?

వాళ్ళు ఈ ఊళ్ళో ఉండడం: ఆదరం ఫార్మాలిటీ కావడం, ఈ కాక తాళీయపు చెలిమి కలిమి కలకాలం నిలుస్తుందా, కాకుంటే ఏదేనా ఆగిపో తుందా? ఇందులో ఏదీ లేకపోయినా జీవితానికి లోటురాదు! మరి?- ఈ నిరర్థక మైన అశాశ్వతమైన అర్థాలు తీసుకోవడం, ఈ అనర్థాలు ఎందుకని?

సరళ....తను ఏ క్షణం ఆమెని బలాత్కరిస్తాడో అన్నట్టు చూస్తున్నట్టుం టుంది....ఆమె చనువూ ధైర్యం మేకపోతు గాంభీర్యంలాగా....పిరికితనం

సంస్కార లక్షణం కాదు....తనని చూడగానే ఆయనింట్లో పేరు రాంకోటీ, తర వాత రా: అనే సరళ సంస్కారంలో తనకి నమ్మకం కుదరదు!——.... ఆమె మాటలు— అప్పుడప్పుడు ఏదో అంటూనే వుంటుంది, వ్యంగ్యంగా— నాకు ప్రాబ్లెమూలేదు, నువ్వు సాల్వూ చెయ్యనక్కర్లేదు!—ఏమో, ఆలోచించకుండా వొచ్చిన మాటలేనేమో?

మరి అతనో?— అతనేది మాట్లాడినా రెండేసి అర్థాలు సుళువుగా తియ్యొచ్చు'— ఇట్లా ఎందుకన్నావు, దీనర్థం యిదికాదా, అని నిలదీస్తే?— అబ్బే, అదేమిటి; నేనట్లా అనుకొని అన్లేదు, నీ కిట్లా తోచిందా?— ఈ పాడు అర్థం నీకే తోచిందా, ఎవరన్నా చెప్పారా? అని తేలగొట్టే హక్కు వుంది, చాతుర్యమూ వుంది అతనికి!

—సరళని తనకిచ్చి పెళ్ళి చెయ్యనని వాళ్ళమ్మ చెప్పగానే తనదార్ని తను పోయి ఆమెని మరిచిపోయుంటే?— చాలా అన్యాయమైన ఆలోచన. కాని అట్లా చేసుంటే ఆమె ఎక్కడుండేదో. ఎట్టా వుండేదో, ఎవర్ని పెళ్ళాడేదో! —అయినా ఆనందరావు కామెని చూసించడం, అదంతా చెప్పడం, అతను పెళ్ళాడతానంటే చేసిన సారధ్యం, ఆ సారధ్యంలో స్వార్థ త్యాగాడంబరం,— తన నిలాగా శిక్షించడం? ఇట్లా వెంటాడి వెక్కిరించి వోడించడమా?

ఇది చాలా అనవసరం....దీనికి ఫుల్‌స్టాప్ పెట్టేందుకు ఏదేనా చెయ్యగలిగితే బాగుణ్ణు....

o o o

భోజనం పూర్తిచేసి, తమలపాకులు వేసుకోకుండా చకచకా మేడ మెట్లెక్కి వెళ్ళిపోయాడు రామకోటి.

"వక్కపొడైనా తీసుకోవేం?" అంది సరళ. హాలుదాకా వచ్చి, అతన్నుద్దేశించి.

అతను వినిపించుకునీ కూడా వెనక్కిరాలేదు.

"వక్కపొడేం ఖర్మం!....కిల్లీ వే యిద్దాం ఉండు!....మనకి అతన్తో పనుంది!" అన్నాడు ఆనందరావు, ఆమె వెనకే హాల్లోకొచ్చి.

సరళ అతని మొహంలోకి చూసింది.

వంకీనున్న కోటుజేబులోంచి వో పొట్లాం తీసి, మూడు కిల్లీలు తీశాడు

ఆనందరావు. "ఇందాక, వర్షమప్పుడు....ఆ కిల్లీ దుకాణం దగ్గర నిలబడి జాతా ఖానీ కొడుతూ వుంటే, దుకాణం అతనిచ్చాడు!" అన్నాడు, దుకాణం అతను ఏదో ఫ్రీగా ఇచ్చినంత దర్పంగా.

"నా కక్కర్లా!" అంది సరళ, మూతిముడిచి.

"ఏమో-?"

"నల్లకోట్లో వేసి తెస్తారు; కిళ్ళీలూ, పువ్వులూ, స్వీట్సూనూ!....ఎట్లా తాకబుద్ధౌతుందేం-? ఛీ, పాడు!"

ఆనందరావు పకపకా నవ్వాడు. తమ యిద్దరి మధ్య అలవాటయిన చనువైన ధోరణి అంది పుచ్చుకుని అన్నాడు;

"—నల్ల రంగులో మహిమ తెలియక దాన్నట్లా చిన్నబుచ్చుతున్నావు సరళా! అంతే....ఇట్లా చూడు, నా కళ్ళల్లోకి! నల్లనివాడు పద్మ నయనమ్ముల వాడు!!....ఆ రష్యా అమెరికా పర్యంకం కావ్యాల దగ్గిర్నుంచీ కాస్మిక్ సైన్సెస్ వరకూ నల్లని అచ్చులో కదంటే, వేస్తారు! నల్లని రాత్రిలోనే చల్లని అల్లర్లు జరుగుతాయన్నది తేటతెల్లం కదే. పిల్లా! లాస్ట్ బట్ నాట్ లీస్ట్!— నల్లకోటు న్యాయానికీ నిజానికీ ప్రతినిధని తెల్లవాడే ఒప్పుకొని ఫిక్స్ చేసేడు సరళా!"

ధోరణిలో చనువూ, మెత్తదనం సరళని స్వాధీనపర్చుకోగా ఆమె కళ్ళ నిండా ఆహ్లాదం నింపుకొని, నోరు నిండుగా తెరిచింది, ఆనందరావు కిళ్ళీచుట్టూ వున్న కాగితాన్ని సుతారంగా, ఆలస్యంగా తెరుస్తూ ఆమె నోటిని సాధ్యమైనంత సేపు తెరిపించి ఉంచినట్టు ఆ చర్యద్వారా వ్యక్తంచేసేడు, తరవాత అతను కిళ్ళీ ఆమె నోటిలో స్వయంగా వుంచాడు. ఊరించి నోరు తెరిపించి ఉంచినందుకు కసితో లటుక్కున అతని వేలు కాటు వెయ్యబోయింది సరళ. ఆనందరావు తెలివిగా చటుక్కున లాగేశాడు.

నవ్వుతూ- "పద మీ ఫ్రెండు నిద్రబోతాడో యేమో! అతన్తో పనుంది నాకు!" అన్నాడతను, ఆమె నడుంమీద చెయ్యేసి లాక్కెళుతూ.

"నేనుకూడా యెందుకులే, మీరెళ్ళండి—ఊళ్ళో పన్లన్నీ నిశిరాత్రివరకూ ఒక్కళ్ళూ చక్కబెట్టుకొస్తారుగానీ, మా ఫ్రెండు దగ్గిర ఇంతపని బడేసరికేమో నే గావాలి!" అని మురిపించి వెనక్కి బరువు వేసింది సరళ.

"పోనీవోయ్! రేపట్నుంచీ ఊళ్ళో పన్లకిక్కూడా నువ్వు సాయం ఒస్తే పోలా!"అంటూ మరి కొంచెం బలంతో ఆమెను నెట్టుకుపోయాడుఆనందరావు.

వాళ్ళిద్దరూ వెళ్ళే సరికి రామకోటి మంచంమీద పడుకొని వున్నాడు. టేబిల్ లైటు వేసుకొని నిద్రకోసం ఏదో మేగజైన్ తెరిచి చూస్తున్నాడు. వాళ్ళని చూడగానే అతను మంచంమీద లేచి కూర్చుని ట్యూబ్‌లైట్ స్విచ్ వేశాడు. ఆనంగారావు కిళ్ళీ యిచ్చాడు. అతను "థేంక్స్" అని నోట్లో వేసుకున్నాడు.

"కూర్చోండి!" అన్నట్లు ఎదురుగావున్న సోఫా చూపించేడు రామకోటి.

"కూర్చోటం గాదు నువ్వే లేచిరావాలి....ఆ రాజమ్మగారి ట్రంకుపెట్టెలు —(రేదర్) భోషాణాలు -కింది వసారాలో పెట్టాలి."

"ఇప్పుడా? పొద్దున పెట్టరాదూ?"

"లేదులేదిప్పుడే....ఇంతకుముందు నన్ను కార్లో డ్రాప్‌చేసి వెళ్లాడుగా. అతను రాజమ్మగారబ్బాయే....పొద్దున నాలుగ్గంటలకు లారీ తీసుకు వస్తాట్ట. అప్పుడు మళ్ళీ నువ్వు నిద్ర లేవటం దేనికి!—ఎట్లాగో యిప్పుడే కింది వసారాలో పెట్టేస్తిమా, పొద్దుట వాళ్లు లారీ కెత్తుకుపోతారు."

రాజమ్మగారు ఇంటి వోనర్. రెండు భోషాణా లంతేసి ట్రంకుపెట్టెలు పూర్వం ఆనందరావు మేడమీది వాటాలో ఉండే రోజుల్లో అతని కష్టడీలో వుంచేరు. బరువూ, ఎవరైనా మేడమీది వాటాకొచ్చాక అంతగా తీసెయ్యమంటే అప్పుడే తియ్యొచ్చులే అని వుంచేసిన పెట్టెలు; ఆ వాటాలోకి రామకోటి రావడాన్నీ, అంతగా ఖాళీ చెయ్యవలసిన వొత్తిడి లేకపోవడాన్నీ అక్కడే విడిచి పెట్టేశారు.

"సరే, పద!".

ముగ్గురూ మధ్యగదిలోకి వెళ్లారు. ఆ పెట్టెలమీద ఏవో చిల్లర వస్తువులుంటే తీసేశాడు రామకోటి. వెంటనే ప్రక్కఉన్న హేండిల్స్ పట్టుకొని పెట్టె ఎత్తడానికి ప్రయత్నించాడు ఆనందరావు. "ముదనష్టం పెట్టె! ఆ రాజమ్మకంటే బరువుగా వుందే దీని సిగ్గొయ్య!" అన్నాడు.

రామకోటి నవ్వాడు. "ఆమెనికూడా వోసారి ఎత్తుకుని చూశావట్టుందే!"

"ఆమెనా?-ఎత్తుకుని చూడాల్సిందేగాని ఈమె యామంటుందోనని ఊరుకొన్నా." ఆనందరావు సరళకేసి చూసి నవ్వుతూ అన్నాడు...." అట్లా పూరికే చూస్తూ నుంచోకపోతే వోచెయ్యి వెయ్యరాదు?"

"ఎందుకులే; వుండు!" రామకోటి అవతలి గొళ్లెం పట్టుకుని ఎత్తి "ఇప్పుడు లేపు." అన్నాడు.

"ఇందులో ఏం పెట్టిందబ్బా; ఇంత బరువుంది!" అన్నాడు ఆనందరావు. నాలుగడుగులు నడిచారు; "అబ్బా!నా చేతులు నొప్పుతున్నాయ్. ఉండుండు....దించుకొంట!" అన్నాడు.

అరిచేతులు రెండూ వొకదాంతో వొకటి రాసుకుంటూ నోటితో వూదుకుంటూ "అబ్బా ! ఎట్లా కందినయ్యో;" అన్నాడు అనందరావు. "ఇదే పూర్వకాలంలో అయితేనా?" అన్నాడు సరళకేసి చూస్తూ.

సరళ నవ్వుకుంటూ అన్నది; "నాథా! మీసుకుమార హస్తంబులు నొచ్చుచున్నవా?-అయ్యో! ఈ పాపిష్టి కన్నులతో ఎట్టి విపత్కర దృశ్యము జూడవలసివచ్చె!-ఈ సమయంబున నుపయోగపడని నా యీ పెర్లిన్‌చీర యేల; కాల్చనా? -హా! దుర్విధీ!?"

"ఆగాగు: నాకో అయిడియా తట్టింది!" అన్నాడు ఆనందరావు. "ఇక్కడే ఉండండి" చరచరా క్రిందికి వెళ్ళాడు.

రామకోటీ సరళాదేవి అతను వెళ్తున్న వేపుకి క్షణకాలం ఆశ్చర్యపడుతున్నట్టు చూసేరు. వెంటనే ఒకరి కళ్ళలో కొకరు చూసుకొని, వెనువెంటనే చూపులు మళ్ళించుకున్నారు.

పది హేను సెకన్లు గడిచాయి. ఎక్కడో గడియారం పన్నెండు గంటలు కొడుతోంది....వులిక్కిపడ్డా రిద్దరూ, అనుకోకుండా, అనవసరంగా అర్ధరాత్రి పన్నెండు కావడం. అప్పుడు మెలకువగా వుండడం; విశేషించి ఏకాంతంగా ఉండడం; వారిద్దరికీ ఇదివరకెన్నడూ జరగకపోలేదుగాని, ఇందులో ఏం ప్రత్యేకత లేనట్టు గుర్తించే చైతన్యం ఒకరికీ కలగలేదు....మళ్ళీ యిద్దరూ మొహాలు చూసుకున్నారు.

సరళాదేవి తనవేపు చూడగానే, భోజనం దగ్గిర అనందరావాడిన మాటలు జ్ఞాపకం వొచ్చాయి రామకోటికి. వాటిని గురించి ఆమెతో చర్చిద్దామన్నంత ప్రేరణ కలిగింది. కాని అదీ మంచిదిగాదన్న నిశ్చయాన్నికూడా వెంటనే వచ్చేశాడతను....ఎంతైనా వాళ్ళిద్దరూ వొకటి, తను వేరు!—భరించటమే సభ్యత! నీచమైన భావాన్ని మనసులో చర్చించడం కంటే బహిరంగంగా చర్చించడమే యెక్కువ నీచంగా పరిగణించబడుతోంది....ఆ సంగతి గుర్తించి భయపడి అతను బొమ్మలా నిలబడి బాధపడసాగాడు.

రామకోటి అలా నుంచోడం చూసి సరళ ఏమీ తోచనివాళ్లా అయి

పోయింది. ఓసారి ఆ పెట్టె హేండిల్‌లో చెయ్యిమార్చి ఎత్తబోయింది, పెట్టె కదల్లేదసలు. "అబ్బ! ఏం దాచిందో, ఇందుట్లో" అంది.

ఆమె పైటచెంగు బిగించుకోడం, వంగోడం దగ్గర్నుంచీ హేండిల్లోంచి చెయ్యి తీసెయ్యడం వరకూ అన్నీ చూసి; ఆమె విడుస్తున్న నిట్టూర్పు దగ్గర్నుంచీ అన్నమాటవరకూ అంతా వినికూడా, సమాధానం చెప్పక్కర్లేదన్నట్టు నుంచున్నాడు రామకోటి.

ఒకసారి ఆమెవేపు చూసి వెంటనే ఇద్దరిమధ్యా నిర్జీవమైనా శక్తివంతంగా పడున్న ఆ పెట్టెవేపు చూశాడు రామకోటి. తామిద్దర్వూరూ ఇంత నిశ్శబ్దంగా ఉండవలసిన పరిస్థితికాదు; అప్పుడూ ఇప్పుడూ కూడాను; కాని నేదేదో జరగరానిది జరిగినట్లు, తన్మూలంగా, అనే ప్రతీమాటా అశ్లీలమై పోతుందేమో అన్నట్లూ ఇద్దరూ సంకోచిస్తూ వుండడం అతన్ని చాలా దుఃఖపెట్టింది. ఇంతలా నేరంలేని శిక్ష కెవ్వరూ అంగీకరించలేరు.

సరళాదేవి కేమీ తోచలేదు. ఆమె రెండో పెట్టె దగ్గరకెళ్ళింది. అది ఎత్తుదామనో, ఏమో. ఆమె ఉద్దేశం ఆమెకే తెలియదు!....

చప్పుడైంది — ఆనందరావు కాళ్ళా గొంతూ చప్పుడు చేసుకుంటూ ఎవరో పిలుస్తున్నట్టు; "ఆఁ....వొచ్చేస్తున్నా" అంటూ వొచ్చాడు.

"అట్లా యెందుకూ, గొడవచేసుకుంటూ రావటం? —అతను లేని యీ ఒక్క నిమిషంలోనూ మనం యిద్దరం ఏమన్నా-?" అన్నట్టు, సరళాదేవి అతని గొడవైనా భరించగలదుగాని నీ చూపు భరించలేనన్నట్లు భయంగా చూస్తూ చీర చెంగు చేతుల్లో జోరుగా మెలితిప్పేస్తోంది.

"అట్లా టెరిలిన్ చీరలు మెలిత్రిప్పకోరు ఫ్రెండూ- పూర్వకాలంలో నూలు చీరలట్లా-" అని సరళాదేవిని వేళాకోళం చేసి, ఆనందరావు; "ఇదుగో రాంకోటీ;— ఈ గుడ్డచేతికి చుట్టుకొని ఎత్తు, ఇది నీకు; యిది నాకు!" రెండు మాసిన తుండు గుడ్డలు తెచ్చాడు; అవి పంచాడు యిద్దరికీ.

గుడ్డలు చేతులకి చుట్టుకున్నాక పని తేలికైంది.

మెట్ల చివరిదాకా దిగేసిన తర్వాత "అమ్మయ్య!" అన్నాడు ఆనందరావు.... "భలే చావొచ్చి పడిందే, దీందుంపతెగా!"

రెండో పెట్టె ఇంకా కొంచెం ఎక్కువ బరువే అనిపించింది, ఈసారి ఆనందరావు ముందుగా దిగుతున్నాడు మెట్లు.

"పాత పగలుంటే బలే తీర్చుకో వచ్చులే, ఈ పెట్టెల్తో!.... ఏముందీ, ఆ మెట్లు టర్నింగ్ తిరిగిన దగ్గర కాస్త వెనక "హేండిల్ ఒదిలిపెట్టేది— దెబ్బతో సాఫ్!-" అన్నాడు ఆనందరావు నవ్వుతూ. "జాగర్త సుమా రాంకోటి; టర్నింగ్ దగ్గిర కొస్తున్నాం, హేండిల్ ఒదిలిపెట్టావంటే యింకేంలా.... ఒక్కసారిగా అడ్డుతీరిపోవాల్సిందే!"

"అంత సుళువుగా ఎట్లా తీరిపోతాయి, అడ్లు? అవతల నా పెళ్ళామో-?" అనుకున్నాడు రామకోటి.

అనుకోడమేమిటి, ప్రమాదవశాన అతని చెయ్యిజారిపోవడమేమిటి!- పెట్టె ధడ్‌మని ఆనందరావు మీదికి తూలింది. మోకాళ్ళ మీద అంచు బలంగా అనుకొని, ఆ దెబ్బకు చతికిల పడిపోయాడు. కూర్చున్న మనిషిమీద పెట్టె బరువంతా ఆనుకోగా అతను తట్టుకోలేక, క్రింద మెట్టుమీదికి, తరువాతి మెట్టు మీదికి, ఆ తరువాతి మెట్టుమీదికి, దాంతరువాత మెట్టుమీదికి, అట్లా, ఒరిగి, జరిగిపోవడం, పెట్టెకి వేరే ఆధారంలేక పెనుభూతంలా ఎప్పటికప్పుడు మీద పడుతూ వుండడం!- ఒళ్ళు, పెట్టెకీ గోడలకీ మధ్యపడి నలిగిపోవడం ఇలా జరిగిపోతోంది,

ఇంతలోకే తన చేతులు స్వాధీనంలోకి తెచ్చుకొని, అతన్ని కాపాడదామని ఆదుర్దాగా వొస్తున్న రామకోటి మొహంలో, ఈ హత్యాకాండ పూర్తి చేసేందు కేర్పడిన క్రౌర్యం కనబడింది ఆనందరావుకి. ఆ గాభరాలో, ప్రాణ రక్షణకోసం జీవిచేసే అంతిమప్రళయ ప్రయత్నంలో, ఆనందరావు పెట్టె హేండిల్లోంచి చెయ్యి వదలడం, పెట్టె జోరుకన్నా రెండడుగులు ఎక్కువగా వెయ్యడం; పెట్టె అతనికి మూడు మెట్లు మీదుగా అస్తవ్యస్తంగా నిల్చిపోవడం జరిగాయి, పడ్డపాటూ, తిన్నదెబ్బలూ, అనుభవిస్తున్న అవమాన రోషాలూ, ఆవహించిన మృత్యుభయం, ఆనందరావు ముఖాన్ని చాలా వికృతంగా చేశాయి.

"సారీ ఆనంద్: పొరపాటైంది, చెయ్యి జారింది." అన్న రామకోటి మాటలు అతనికి వినిపించలేదు, అతను నిటారుగా నుంచొని చొక్కా జెబ్బల మీదికి లాక్కుని, పిడికిలి గట్టిగా బిగించి "ఏరా!" అని ఊపిరి పీల్చి మూతి బిగించాడు. రామకోటి తనకి అందీ అందనంత దూరం రాగానే అతని మీదికి లంఘించి, "కావాలనే చేస్తావుగా!.... రాస్కెల్?" అని మాట కొక గుద్దు

చొప్పున, సెకండు కొక గుద్దు చొప్పున, మొహంమీద, మెడమీద బలంగా గుద్దేశాడు. రామకోటికి ఆశ్చర్య పడేటందుకు టైమ్‌లేనట్టు స్ఫురించింది. ఆరో పణలో దూషణకంటె, అఘాతంలో శిక్ష బలంగా తగిలి, అతన్ని మరుక్షణం ప్రతీకారానికి పురికొల్పింది.... అతను ఎడం చేత్తో ఆనందరావు జుట్టుపట్టుకుని, కుడిచెయ్యి పిడికిలి బిగించి అతని డొక్కలో బలంగా పొడిచాడు.

"అమ్మా!" అన్నాడు ఆనందరావు "అవకాశం కోసం చూస్తున్నావురా!.. ఇడియట్!" అని అతను మళ్ళీ తిరగబడి రామకోటి వీపుమీద, నెత్తిమీద, రెండు గుద్దులు వేశాడు, రామకోటి కిందబడి, మళ్ళీ లేచాడు. రెండుచేతులూ కలిపి వాలీబాల్ ఆడినప్పట్లా బాదసాగాడు.

నిర్ఘాంతపడి చూస్తున్న సరళ, చూస్తున్నది నమ్మలేనంత చిత్రంగా, అసహ్యంగా తోచి మేడ వసారాలో పిట్టగోడ ప్రక్కన వొక్కక్షణం ఆట్టే నుంచుంది. చకచకా మెట్లుదిగి వచ్చేలోగా ఆమెకి భోరున ఏడుపొచ్చేసింది. "అమ్మో!.... ఇద్దరూ బలిష్ఠులు; ఆరోగ్యవంతులు. పొట్టేళ్ళలా ఢీ కొంటు న్నారు. వాళ్ళని ఎవరేనా ఆపగలరా? ఆ మధ్యకి వెళితే ప్రాణాలు పోతాయేమో? పోతే పోనీ!".... ఏడ్చేస్తూ సరళ- వాళ్ళిద్దరూ మళ్ళీ తలపడే వేళకి ఇద్దరి మధ్యా యిరుక్కొని, రెండు చేతులు బారజాపి, యిద్దర్నీ కౌగలించుకొంది. "బాబోయ్ ఆపండి, నే చచ్చిపోతా!" అని పెద్ద కేక పెట్టింది: ఏడుస్తూనే,

ఆనందరావు యిక తట్టుకోలేని నీరసంలో ఆమె మీద ఒరిగాడు.

రామకోటికి తెలివొచ్చింది.... త్రిభుజం మూడు బిందువులూ ఒక్కచోట కలుసుకున్నాయి. నూటఎనభై డిగ్రీలు మూడువందల అరవై అయ్యాయి, అక్కడున్నది వొక ఆడదీ, ఆమె భర్తా, ఆమె మాజీ ప్రేమికుడూ కాదు.... ఆమె స్పర్శలో తల్లీ, చెల్లీ, పెళ్ళాం, పిల్లా ఒక్కసారే చూపట్టేరు. ఆత్మ చేసిన పరాభవాగ్నిలో అతను దగ్ధమై పశ్చాత్తాప తేజస్సులో పునఃప్రభవిం చేడు.... వెంటనే ఆమెని ఆ త్రిహృదయ పరిష్వంగంలోంచి తప్పించాడు. "లే సరళా" అన్నాడు మెత్తగా- సరళ అనుమానంగా చూసి అంతలోనే నమ్మకం తెచ్చుకొంది.

మరుక్షణంలో అతను ఆనందరావుని ఎత్తుకొని. మోసుకొని, పడక గది లోకి తీసుకుపోయాడు.... సరళ కంగారుగా అతన్ని ఆనుసరించింది. రామ

కోటిని ఉద్దేశించి తిట్లూ, కృతజ్ఞతా వాక్యాలూ ఆమె గొంతులో కలగాపులగంగా గుర గుర మంటున్నాయి. ఒక్కటీ బైటి కూడిపడ్డంలేదు.

మంచంమీద పడుకోబెట్టాడు ఆనందరావుని. పెట్టెకీ, మెట్లకూ, గోడకూ మధ్యపడి, నలిగిపోయిన గీరుకుపోయిన అతని చర్మ భాగాల్ని చేత్తో నిమిరాడు. స్రవిస్తున్న రక్త బిందువుల్ని అరిచేత్తో తుడిచేశాడు తొందరగా. క్షణంలో సగంసేపు సరళవేపు చూసి, "దూది, అయొడీన్ ఉండాలే, తెలుసా?- తే." అన్నాడు.

సరళకి జవాబు చెప్పడానిక్కూడా తోచలేదు. ఇక్కడ నీ చేతుల్లో ఈయన్నొదిలి నే వెళతానా అని మూర్ఖంగా క్షణకాలం నుంచుని, అలాంటి భావం కలిగినందుకు సిగ్గు పడింది. రామకోటి కిదంతా తెలుసా అన్నట్టు అతని కళ్ళల్లోకి భయంగా ఆందోళనగా చూసింది. రామకోటి పైజమా జేబులోంచి రుమాలు తీశాడు, చించేటట్టు పట్టుకున్నాడు, ముక్కలుగా చింపుతాడని స్ఫురించగానే తన చీరవేపు చూసుకుంది సరళ. క్షణకాలం ఆమెకి కొద్దిసేపటి క్రితం తానాడిన మాటలు వృథాగా జ్ఞాపకం వొచ్చాయి. అశుభం సూచించినానేమో అని అనుమానం కలిగింది. ఇంతకీ సరైన సమయంలో చీర చించి గాయాలకి కట్టేందుకు ఉపయోగించలేక పోతున్నానే అని చిన్నబుచ్చుకుంది. ఇదేమిటీ నీరసం అని హేళన చేసుకుంది:- చివరికి ఆ అనవసర ప్రసంగంమీద, అంతకంటే అనవసరమైన ఈ సంఘర్షణమీద అసహ్యంవేసి, తనమీద తనకే విసుగు పుట్టింది, ఆ విసుగులో చిరాకుపడి, అలమారు దగ్గిరకెళ్ళి, తలుపు తెరిచి, బాక్సులో దూదీ, అయొడిన్, పుడకా తెచ్చింది.

గాయాలన్నీ వోపిగ్గా తెరిచి, ఒకొక్కదానికే శ్రద్ధగా అయొడిన్ పూశాడు రామకోటి .... ఒళ్ళంతా నెప్పులుగా ఉంది, మధ్య మధ్య తడుముకుంటూ సిగ్గుపడ్డాడు .... అయినా చేసేదేం లేదు...."మొహం పగలకొట్టాడు ఆనందరావు!"....కళ్ళకింద చర్మం పొంగి, కళ్లకే కనబడిపోతోంది....అటు చూస్తే, అలా అనుకుంటే, కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి .... తుడుచుకోడానిక్కూడా టైమ్‌లేదు.... వ్యవధివున్నా, సమయం కాని సమయం....

ఆనందరావు గాయాలపని అయిపోగానే మాట్లాడకుండా బైటికొచ్చేశాడు రామకోటి. అతనేమైనా చెబుతాడేమో! అతనికేమైనా చెప్పాలో యేమో, ముఖ్యంగా అతని దెబ్బల మాటేమైనా చూడాలేమోనని, సందేహంగా, అను

మానంగా, ఆశగా, అతనివేపు చూస్తూ అతని ప్రతీ చర్యనీ గమనిస్తూ అలా నుంచుండిపోయింది సరళ.... చివరికతనేమీ మాట్లాడకనే వెళ్ళిపోయేసరికి, ఆమె చాలా చిన్నబుచ్చుకుంది, అవును! నా అంత వ్యర్థురాలి కోసం చావు దెబ్బలు కొట్టుకొని, ఇంకా నన్నీ మొగాళ్ళిద్దరూ ఏం గౌరవిస్తారు - అనుకొంది. మరు క్షణంలో ఈ ఆత్మనిందకు ఎంతో ఖేదపడింది ఆమె.

మేడమెట్ల దగ్గరకొచ్చాడు రామకోటి. మూడో మెట్టుకీ, నాలుగో మెట్టుకీ, మధ్య, రెండింటిమీదా ఆ బరువైన ట్రంకుపెట్టె అడ్డంగా అస్తవ్యస్తంగా పడి వుంది. దాన్నలా వదిలి తన దారిని తను పోలేక పోయాడు. తెల్లారుజామున వాళ్ళొస్తారు, ఇది గమ్యస్థానానికి రెండడుగులు ముందుగానే ఆగిపోడం గురించి వాళ్ళు ఏదేనా ఎందుకు అనుకోవాలసలు ? - అని. ఒక్క చేతిమీదుగానే పెట్టెని ఈడ్చేసి, దిగువకి లాగి, మొదటి పెట్టె వుండేవేపు తోసేసాడు. పెద్ద చప్పు డైంది, చేతినిండా దుమ్ము - రక్తం మరకలు....

హాల్లో వాష్‌బేసిన్ దగ్గరకెళ్ళి, అద్దంలో చితికిన, పొంగిన, తన మొహం చూసుకుంటూ, సబ్బురాసి చేతులు కడిగేసుకున్నాడు! అద్దంలోంచి, గదిలో మంచం కనిపిస్తోంది, సరళ, మంచంమీద ఏటవాలుగా కూర్చునివుంది. ఆనంద రావుతలని ఆమె తన రొమ్ముమీద పెట్టుకొని, అతనివీపుమీద నిమురుతోంది.... అద్దంలో చూసిందీ, బైట చూసేదీ వొక్కటే .... అయినా అతను గదివేపుకు తిరిగి, క్షణకాలం, ఆ సుందరదృశ్యాన్ని తనకి చేతనైనంత ఎప్రీసియేషన్‌తో చూశాడు. .... ఆ వక్షంమీద విశ్రాంతి తీసుకునేతల .... ఎన్నివేల విలువ చేసునో !!

0 0 0

తెల్లవారింది.

రామకోటి డ్రెస్ చేసుకున్నాడు. ప్రొద్దున్నే ఎక్కడికీ వెళ్ళే అలవాటు లేదు .... చేసుకోవాలి అలవాటు....ఈ కాఫీలూ భోజనాలూ మానేస్తే — చాలా మానంగా ఉండొచ్చును ! .... తన ప్రశ్నకి ప్రమాదంలేని పద్ధతిలో సమాధానం కుదిరినట్టు తాత్కాలికంగా తృప్తిగా ఉంది.... రేపణ్ణుంచీ ప్యూన్‌ని పొద్దుటే ఆరింటికి రమ్మని చెప్పాలి,

మెట్లు దిగుతూ వోరగా చూశాడు, ఆనందరావు గదిలో కూర్చున్నాడు అతన్ని చూసి వెళ్లాలిసిందే.

"గుడ్ మార్నింగ్,రా!" అన్నాడు ఆనందరావు, చిరునవ్వుతో. "అయామ్. సారీ, రాంకోటీ!— ఇద్దరి కిద్దరం అంత బ్రూట్స్‌లా ప్రవర్తిస్తామనుకోలేదు... చదువూ సంస్కారం ఒక్కసారి ఎక్కడికి పోయినయ్యో-ఆశ్చర్యం !"

రామకోటి రెండు ట్రంకుపెట్టెలు నెత్తిమీంచి దిగినంత రిలీఫ్ పొందేడు. అతని మొహం నవ్వు పోసుకొంది.

"అంటే-ఆ మాత్రం పోట్లాడే శక్తికూడా, ఐమీన్ ప్రాక్టీస్- ఉండా లేమో ?"

"చాలా థేంక్సోయ్ .... రాత్రి చాలా శ్రమపడ్డావు, ఈగాయాల కోసం!"

మళ్ళీ శ్లేష? — ఛీ ! — ఇది తన వ్యాధేనేమో ఒకవేళ! — రామకోటి నో మెన్షన్ చెప్పడం మరిచిపోయాడు.

గదిలో అలికిడి విని, సరళాదేవి గది గుమ్మందాకా వొచ్చి తొంగి చూసింది. ఆమె తొంగిచూడ్డం రామకోటి చూశాడు. ఎవరి కళ్లల్లోనూ ఏ భావం లేకుండా మళ్ళీ చూపులు కలుసుకున్నాయి. ఏదో పని స్ఫురించి సరళ లోపలి కెళ్లింది.

"అట్లా బైటికి పోయొస్తా" లేచి వెళ్లాడు రామకోటి.

సరళ డైనింగ్ హాల్లోనించివస్తూ అతన్ని చూసింది. పిలవడాని కామెకి నోరు విడలేదు. కంగారుగా సరాసరి గదిలోకి వెళ్లిపోయింది, భర్తతో చెబుదామని. కాని తీరా అక్కడికెళ్ళాక ఆయనతోనైనా ఎట్లా చెప్పాలో తెలియక, అతనివేపు తెల్లమొహం వేసి చూస్తూ నుంచుంది.

అతను చూశాడు - కాని ఏమిటలా ఉన్నావని అడగలేదు. పది పదిహేను సెకన్లు ఆగింది.

"రాంకోటి —" అని గోడవేపు తిరిగిపోయింది సరళాదేవి-"హోటలుకి పోతున్నాడు కాఫీకి!"

"అరెరె !" అని నవ్వుకుంటూ లేచాడు ఆనందరావు. కుంటుతూ అయినా చక చకా నడిచి వెళ్ళాడు. గేటు దగ్గిర రిక్షాపిల్చి నుంచున్న రామకోటిని కలుసుకున్నాడు, నడుంమీద చెయ్యేసి అతన్ని పట్టుకుని. మృదువుగా "లోపలికిరా రాంకోటీ." అన్నాడు - లాక్కొచ్చేశాడు — ఇద్దరూ వరండాలో కొచ్చారు,

"వొదిలిపెట్టు, గిలిగింత లవుతున్నాయి,"

నడుం ఒదిలిపెట్టి చేతులు రెండూ పట్టుకున్నాడు ఆనందరావు- "రాత్రి ఏదో నిషాలో — బ్రూట్స్ అయ్యామని — పగలు — ఇప్పుడు కూడానా రాంకోటీ!"

"ఏదో కాలు జారింది. తీసుకున్నాం - మనిద్దరం; పోనీ మనం ముగ్గురం నోరుజారితే ఎంత ఆక్వర్డుగా వుంటుందో నేన్నీకు చెప్పాలా రాంకోటీ-చెప్పు? మన మధ్య ఏం జరిగిందంటావు, అసలు?"

ప్రతిమాటా రామకోటి మనస్సును సున్నితంగా తాకింది. స్నేహంతో మత్తెక్కిన అతని మనస్సులో, ఆ మాటల్ని వేరే విధంగా అర్థం చేసుకోడానికి కావలసిన రెసిస్టెన్స్ లేదు.

"అవును —— ఏమీ జరగలేదు."

మళ్ళీ నడుంమీద చెయ్యివేసి, తన నడుంమీదుగా అతనిచెయ్యి లాక్కుని గది గుమ్మందాకా తెచ్చి విడిచాడు ఆనందరావు. చాలా మర్యాదగా. "ఇదుగో నమ్మా, నీ మిత్రుడు, నువ్వు నావల్ల అతన్నెప్పుడూ పోగొట్టుకోలేవు" అన్నాడు. సరళ ఇటు తిరుగుతూనే రామకోటి కళ్ళలోకి చూసింది కృతజ్ఞతతో, స్నేహాభిలాషతో, ఆమె కన్నులు మెరుస్తున్నాయి, చెమరుస్తున్నాయి.

"కాఫీకి లేటయ్యావు రాంకోటీ! వెళ్లు!" అన్నాడు ఆనందరావు, మంచం ఎక్కి న్యూస్ పేపర్లో మునిగిపోతూ.

0 0 0

రెండు నిమిషాల తరవాత డైనింగ్ టేబిల్ దగ్గర నుంచుంది సరళ. ఎదురుగా కుర్చీలో కూర్చుని రామకోటి టిఫిన్ తింటున్నాడు. ఆమె అతన్ని చూస్తూ తనని తాను చూసుకుంటోంది.

"——ఇంకా ప్రేమిస్తున్నాడు. నన్ను! - నన్నే కాదు, నన్ను పెళ్ళాడిన వాణ్నికూడా ప్రేమిస్తున్నాడితను! —— నన్ను క్షమించాలి రాంకోటీ - నీ విషయంలో దిద్దుకోలేని పొరపాటు చేసేను.-రాత్రి నీకు జరిగిన అన్యాయాన్నీ, నీ మీద పడ్డ ఆరోపణనీ మరిచి మళ్ళీ ఈ జన్మలో నన్ను నీ మనస్సులో పెట్టుకుంటావనుకోలేదు.—— నిన్ను పోగొట్టుకోడానికి నా కెన్నడూ బలం చాలదు. నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోకు రాంకోటీ-"

హటాత్తుగా రామకోటి తలెత్తి చూశాడు. అతననుకున్నది నిజమే. అమె చేతిమీద రాలినవి అశ్రువులే, అమె కన్నులనుంచి ధారగా వస్తున్నాయి——అతను ఏం చెయ్యాలో తోచక జేబులోంచి రుమాలు తీసి ఇచ్చి ఆ కళ్ళవేపే చూస్తూ కూచున్నాడు.

కన్నుల చెరువుల్లో, కన్నీళ్ళలోతుల్లో,కనరాని రహస్యాల్ని, కన్నార్పక కనిపెడుతున్నాడని గమనించింది సరళ. వెంటనే అక్కణ్నుంచి వెళ్ళిపోయింది.

0 0 0

రామకోటి నవ్వుకున్నాడు.

ఈ బంధం యింతేగాబోలు ! ఇది తెలుసుకుందామని చేసే ప్రయత్నం దీన్ని పెంచి ఊరుకొంటోంది. చిత్రం ! — తెగదు—ఇంతకన్నా పెరగదు. ఒకవేళ పెంచుకుంటే తెంచుకోవడం సాధ్యమేమో. ఈ పెంచుకోడం-తెంచు కోవడం దీంట్లో ఏది మంచో ఎంచుకోడం తెలీడం లేదు !

లోకుల దృష్టిలో "ఏమిటో తమ అనుబంధం" అన్న జిజ్ఞాస వుండేది పూర్వం ! తామేమిటో తమకి తెలిసిపోయినట్టు ! నిజానికి అది ఇప్పటివరకూ తెలియనే లేదు. సామాన్యంలో సమున్నతమైన సంస్కారమా యిది? ముగ్గురికీ స్నేహమే ఆహారం. స్నేహమే వ్యసనం. రంగు రంగుల స్నేహం! - ముగ్గురిలో ప్రతీ ఒక్కరికీ మిగతా ఇద్దరిమీదా ఈ అనుమానాలేమిటో మరి!— ఆనందరావుకి - తనని చంపెయ్యాలని కుట్రచేస్తున్నారని అనుమానం ? ఆ హుషారులో ఆ హాస్య ప్రియత్వంలో - యింత ప్రాణభయం దాగి ఉందా?- సరళకీ వుంది - ఈ మొగాళ్ళిద్దరూ కలిసి తనకి పాతివ్రత్య పరీక్షపెట్టి తను వేసే ప్రతి అడుగూ పరీక్షిస్తూ తను ఎక్కడ తప్పటడుగు వేస్తుందో కనిపెడు తున్నట్టుంటుంది. తనచేత తప్పు చేయించేందుకు తగిన సన్నివేశాలు కల్పిస్తు న్నట్టు ఆమెకి ఎప్పటికప్పుడే అనుమానం. — ఇద్దరి వేపూ భయంగా, సందే హంగా చూడకుండా వొక్క సమాధానం చెప్పదు. ఒక్క అడుగు వెయ్యదు !- తనమాట చెప్పనే అక్కర్లేదు - ఎరవేసి లాగుతున్నట్టు వుంటుంది యెకాయెకి! వాళ్ళకేం, హాయిగా పెళ్ళయిన వాళ్ళు, వాళ్ళు తప్పే చెయ్యరు! వాళ్ళకి ఈపాటికి ప్రేమలో థ్రిల్ తగ్గి, తనచేత తప్పు చేయించడానికీ, దాంతో ఆనందం పొందడానికీ - ప్రయత్నిస్తున్నట్టే వుంటుంది. ప్రతీరోజూ పరీక్షే, ప్రతీ నవ్వూ, ప్రతీ మాటా ఎరే. పంజరంలో పక్షినిలా, మ్యూజియమ్‌లో వస్తువునిలా, వాళ్ళు చివరికి తన్ను వినోదం కోసం, ఎక్స్‌పెరిమెంట్ చెయ్యడం కోసం చేరదీసి నట్టుంది !

కాని - ఈ అవమానాల అవకాశాల మధ్య, నీతి అవినీతుల పరీక్షల మధ్య - ఏదో. సృష్టికెల్లా తీయని ఆనందం, వర్ణ వర్ణాల మైత్రీ మాధుర్యం కల కాలం కలిసి వున్నందుకు గర్వకారణం — ఉన్నట్టున్నాయి! ఇది తెంచుకోడం మంచిదేకాని సులభం కాదు; ఒకవేళ సులభమే అయితే మంచిది కాదు!

ఈ త్రివర్ణ చిత్రం శాశ్వతంగా చెదరక చెరగక నిలవాల్సిందే!

***

(ఆంధ్రజ్యోతి వీక్లీ, ఆగస్టు 1968)

# ఇట్లు, మీ విధేయుడు

"వాణ్ణి చెడగొడుతున్నావు నాన్నా!" అన్నాడు మా అబ్బాయి. మా మనవడు వేణుగోపాలాన్ని హైదరాబాదు పంపించేనని.

నాకు తెలుసు.

వాడిలా అనడం మొదటిసారికాదిది. వేణు గురించి ఏ మంచిపని తల పెట్టి అమలు చేసినా వాడిలాగే అంటున్నాడు.

వేణుకి నేనేం చేసినా వాడు వృద్ధిలోకి రావడానికే చేస్తాను. కాని, వీడున్నాడే, మావాడు, వాడు తన కొడుకేదో నా మాటలు విని చెడిపోతున్నాడన్నట్టుగా మాట్లాడతాడు

అదంతా నామీద కచ్చ; వేణుమీద అసూయానూ, కాకపోతే మరేమిటి?

వేణుగాణ్ణి బి,ఎస్సీ ఆనర్స్ చదవమని వాల్తేరు పంపేను.వీణ్ణి పంపేనా? ........వేణుకి మంత్రిగారి మనవరాలి సంబంధం మాట్లాడాను. వీడికి మాట్లాడేనా?....అదుగో, అందుకూ, వాడికా గుర్రు.

అసూయ వుందే; ఒక్కొక్కప్పుడు ఎవరి మీదికి ఒరుగుతుందో చెప్పలేం. కన్నకొడుకుమీదికే మళ్ళొచ్చు. కచ్చవుందే, ఎవరిమీద కలగొచ్చో ఒక్కొక్కప్పుడు చెప్పలేం. కన్నతండ్రి మీదికే తిరిగొచ్చు....చెప్పలేం కదా!

అలాగే, పాపం. మావాడు....కొడుకు అభివృద్ధిలో కొచ్చేస్తున్నాడని.... ఆ అభివృద్ధికి సాక్షాత్తూ వాడితాత! అంటే వీడి తండ్రే కారకుడని తెలిసికూడా- ఎప్పుడూ దేనికో ఉహూ గింజుకుపోతూ వుంటాడు.

అంతెందుకు?

వాణ్ని "ఒరే బి. ఎస్సీ ఆనర్సుకి వెళ్ళరా" అన్నాను.-సరే, తాతయ్యా- అన్నాడు- న్యూక్లియర్ ఫిజిక్స్ చదవరా- అన్నాను. అనగానే వీడు-పానకంలా అడ్డొచ్చేసి న్యూక్లియర్ ఫిజిక్స్ ఎందుకు నాన్నా అవి న్యూ అయితే కావచ్చుగాని క్లియర్ కాదు గదా....అన్నాడు.

వాడలా ఏదో సొడ్డు పెడతాడని నాకు తెలుసును.

కాని నేనేమీ జవాబు చెప్పఖ్ఖర్లేక పోయింది.

మా వేణుగాడు ఠకీమని చెప్పేడు సమాధానం "మనం చదివి పారేద్దాం నాన్నా. అప్పుడది న్యూకాదు, క్లియర్ కూడా అయిపోతుంది."

"శభాష్‌రా! నా పేరు నిలబెట్ట గలిగినవాడివి, నా మనవడివి నువ్వురా!" అని ఆనాడే అనుకున్నాను, నేను. "....నీలాగే అందరూ ఆ సబ్జక్టు చదవడానికి ఉత్సాహం చూపించి అణుశక్తిని అభివృద్ధి చేస్తె ఆ చైనావాడు మనమీదికి దండయాత్రకి రాకనే పోనుగదా" అని వాణ్ణి పబ్లిగ్గానే మెచ్చుకొని వాడికి హుషారిచ్చేను.

"కరెక్ట్ తాతయ్యా".... అంటాడు వాడు, నేను వాడి మంచి ఆలోచించి ఏం చెప్పినా సరే...

అంతేగాదు. వాడికి నా గురించి సదభిప్రాయం వుంది. "తాతయ్యా! నువ్వు అ రోజుల్లో పుట్టవలసినవాడివికాదు తాతయ్యా ఈ రోజుక్కూడా నీ మేధ నీ చురుకుతనం యిలా వున్నాయంటే అప్పుడింకెంతలా వుండేవాడివో కదా!" అన్నాడు వాడోసారి.

"వోర్....వోరి! పొగడ్డం ఆపరా. మీ నాన్న చల్లగావుండ! ఏమిటో కావాలి గాబోలు. తిన్నగా చెప్పేడువు!" అన్నాను.

"అదికాదు తాతయ్యా. అసలు నిన్ను తాతయ్యా అనడానికీ నోర్రాదు, బాబాయ్ అనాలనిపిస్తోంది. పంటకాలవ పదకొండడుగులూ ఒక్కగెంతులో దాటేస్తావు. అరవై బాల్చీల నీళ్ళు సునాయాసంగా తోడుకొని అవలీలగా నెత్తిన పోసుకుంటావు, నాన్న ఆఫీసు వ్యవహారాల దగ్గర్నుంచీ అమ్మ అంట్లు తోమించడందాకా నీ సలహాలేందే క్షణం వెళ్ళదు. ఇప్పటి వాళ్ళల్లో ఇంత ఓపికేది, ఓర్పేది"

మంచిదే. ఒకరిమీన ఒకరికి సదభిప్రాయం వుండడం, అది అభివృద్ధికి కారణం అయినంతకాలం.

వాడు....

మొన్న ఆనర్స్ ఆన్సర్స్‌రాసి అనకాపల్లి వచ్చాడు కదా.

"బనారస్ కాజాలాంటి కుర్రాడు లెండి, ఐస్‌క్రీమ్‌లాంటివాడు. తియ్యటివాడు! మెత్తటివాడు. చల్లటివాడు." అది వాడిని గురించి మనవరాళ్ళు చెప్పిన మాటలు, అందులో నిర్మల ఒకతె.

అయితే మాత్రం వాణ్ని ఆ శిఖండికి అంత సుళువుగా అందనిస్తానా! వెర్రిపిల్ల, వాడెవడను కుంటున్నాది. దాని మనస్సులోకి ? వేణుగోపాలంగారి మనవడంటే నా పరువు, నా ప్రతిష్ఠ, నా ఆశ. నా తపస్సు కదా!

వాణ్ని లాకాయి లూకాయి వాళ్ళచేతికి చిక్కనిస్తానా? అంత మాత్రం పిల్లలెవరూ వాడికి తగరు,

మొన్నటికి మొన్న....

వాడు తిన్నగా పరీక్షలు రాసి ఆరోగ్యంగా ఇంటికొస్తైచాలు తిరుపతి వొస్తానని, దర్శనం చేసుకుంటానని మొక్కుకున్నానా?

వెళ్ళేనా లేదా.

వాణ్ణీ రమ్మన్నాను-వాడు- "రాలేను తాతయ్యా" అన్నాడు. "కొన్ని పుస్తకాలు చదవాలి తతయ్యా. మామూలుగా పాసయినా క్లాసొచ్చినా అవి చదవాలి తాతయ్యా. అవసరం" అన్నాడు "సరే వుండిపోరా" అన్నాను.

తిరుపతి. కాళహస్తి, కంచి. రామేశ్వరం అన్నీ తిరిగొచ్చేను.

అందరు దేవుళ్ళ కటాక్షం నా మీదున్నాది.

నా మీదుంటే వాడి మీదున్నట్టే కదా.

అలా వున్నప్పటికీ వాణ్ని చెడగొట్టటానికి ఏవో ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయంటే – ఏమిటనుకోవాలి?

ఏదీ. మొత్తం నేనింట్లో లేకుండాపోయింది సరిగ్గా పద్దెనిమిది రోజులు సుమండి....అంతే?

ఆ పద్దెనిమిది రోజులకీ వెర్రిబాగులాడు తోటకూర మొక్కనీళ్ళు పొయ్యకపోతే వాడి పోయినట్టు, నా సహవాసం, సలహాలేక—ఎలాగో అయిపోయాడు.

అల్లంత దూరాన్ని నేను కనబడగానే—"వొచ్చేవా తాతయ్యా—నువ్వింక రావే అనుకున్నాను. అక్కడెక్కడో సన్యాసుల్లో కలిసిపోతావనుకున్నాను." అంటూ మాటల్లో విచారం వ్యక్తపరుస్తున్నా మొహం మాత్రం వచ్చే సంవత్సరం కేలండర్లాగ పెట్టేశాడు.

నీ అభివృద్ధి పూర్తికాకుండా ఎలా వెళ్ళిపోతాన్రా అనుకుని "ఏమిట్రా నాయనా" అన్నాను వాణ్ని దగ్గిరికి తీసుకొని, కొంచెం అనునయ వాక్యాలు చెప్పేను.

కానీ, వాడికవి చాల్లేదు.

అవును మరి. అంత షాకు తిన్నాడు వాడు.

"పాహిమాం కృపయా తాతయ్యా అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమా" అంటూ నామీద పడిపోయేడు.

"ఏమిట్రా సంగతీ" అని తీరుబాటుగా విచారిస్తై—నమ్మరు. నేచెబితే.

కన్న తల్లిదండ్రులే అంత అన్యాయం చేస్తారా అని ముక్కుమీద వేలేసుకుంటారు. ఇందులో ఏదో మాయుంది-అంటారు.

మాయాలేదు మర్మంలేదు. జరిగిందిదిటా—నేనలా తిరుపతికి బండెక్కగానే ఇలా ఎక్కణ్ణించో వో సమ్మంధం తీసుకొచ్చేట్ట వాళ్ళ నాన్న వాడికి,

"ఇంకేమున్నాది తాతయ్యా, లగ్గాలు పెట్టుగోడం ఆలిస్యం" అని భోరుమన్నాడు కుర్రాడు.

"పిల్లని చూశ్ళేదంటున్నావు కదురా. ఇంకా అవకాశం వుందిరా. పిల్ల నచ్చలేదు పొమ్మంటే సరి. తీరిపోతుంది." అని వోదార్చేను.

"ఫోటో చూపించేరు తాతయ్యా. పిల్లబాగానే వుంది."

"వోరి పెర్రికుట్టా! ఫోటోచూసి పిల్ల బాగున్నాదని చేప్పేస్తేవా. ఇంక నిన్ను ఒడ్డెక్కించడంపెలాగరా?" అని కసిరీశాను వాణ్ణి.

"అదికాదు తాతయ్యా...."

"ఏదీకాదు; ఫో...." అని వాణ్ణి దులిపేసినా నేనూళ్ళో లేని సమయం చూసి తనకొడుకీగదా అని స్వతంత్రించి యింతపనిచేసిన మావాడిమీద నాకరికాలిమంట నెత్తికెక్కింది. వీడికిలావుందా అనుకొని ఈ సంబంధం ఎలాగేనా చెడగొడతానని శపథం పెట్టేను.

పట్టకపోతే నేననుకున్న పని కాదుకదా మరి!

నేను రామేశ్వరం కంచీగించీ వెళ్లొస్తున్నప్పుడు మెడ్రాసులో వోరోజు ఆగేను. అక్కడ రంగనాథం కనబడి హరి గురించి చెప్పేడు.

హరి గురించి వాడు చెప్పేదేమిటి? వాడు గొప్పవాడయ్యేడని; మంత్రైపోయేడని నాకు పేపరు చదివితే తెలియలేదా యేమిటి—?

మేం చదువుకొనేటప్పుడు; మా ముగ్గురం వొక జట్టు! ఒక సెట్టు; నిడిపోతే ఒట్టు—అన్నట్టు.

అదొక పురాణయుగం— ఆ రోజులూ ఆ వూసూ ఎందుగ్గాని, ఓనాడు ఉన్నట్టే ఉండి హరిగాడు- ఒరే అబ్బాయిలూ మనం ముగ్గురం వొక్కటే కదా అన్నాడు.

అవునా మరి- అంతే కదా అన్నాం మేం.

"మీరు చూస్తూ వుండండి నేను మీకన్నా ఎంతో ఎంతో గొప్పవాణ్ణి అయిపోతాను" అన్నాడు హరి.

చదువు సహంలో మానేసి వాడు రాజకీయాల్లో దిగిపోయేడు. జైల్లో కూచుని దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే స్వాతంత్ర్యమోయ్ అని పుస్త

కాలు రాశేశాడు. స్వతంత్రం ఒచ్చింది; ఏడిసిందిలే అని వాణ్ని కొట్టిపారేసేం మేం... ఆ తరువాత ఓసారి వాడెక్కడో కనబడితే కూడా నువ్వు గొప్పవాడివి కాకేమిట్రా కృష్ణుడు పుట్టిన పవిత్రస్థలంలో ఏళ్ళతరబడి గడిపేవు అని వేళా కోళంకూడా ఆడేసేను.

వాడు: ఆ హరిగాడు ఇప్పుడు గౌరవనీయుడైపోయి, మంత్రై హైదరాబాదులో కూచున్నాడు.

రంగనాథం చెప్పిన రహస్యమేమిటి, మరి,

—అదే- హరిపునవరాలు ఒక జవానాలు మూటకట్టిన వరాలు పెళ్ళికెదిగి సిద్ధంగా ఉన్నాదిట, దానికి పెళ్ళిచేదామని తలపెట్టేట్ట హరి-

వాడ్డు మంత్రి అవడం, ఒంటినిండా డబ్బు పూసుకున్న ఆ అమ్మాయి ఆటోమేటిగ్గా అందంగా కనపడ్డం అదీ యిదీ చూసి ఆ అమ్మాయిని నే చేసుకుంటానంటే నేనే ఎందుకు చేసుకోకూడదంటూ చుట్టాలి పిల్లలూ బంధువుల అబ్బాయిలూ ఎగబడ్డారుట.

అటూ యిటూ చూసి- నేను ఆదర్శవాదిని; నాకు, అందరూ సమానులే అంటూ పేపర్లో వరుడు కావలెను మార్కు ప్రకటన వోటి వేయించేడు, అది నాకు చూపించేడు రంగనాథం.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది—

ఆవేళ హరి "హరిగాడు"గా వుంటున్నప్పుడు ఒరే నేను గొప్పవాణ్నయి పోతానర్రా అంటే— నేను నీకన్నా గొప్పవాణ్ని అయిపోతాను చూస్తూవుండ్రా అని నేనూ అన్నాను.

ఆవేళ సరదాకే అనుండచ్చు.

అది ఇవాళ నిజం చెయ్యొచ్చు కదా!

ఆ పిల్ల, నాకొడుక్కు కోడలైతే; మా వేణుగాడు నాపేరు నిలబెట్టగలిగితే నేను వాడికన్నా గొప్పవాణ్ణయినట్టే కదా.

అప్పుడు హరిమీద గిరి పడ్డట్టే కదా.

అందుకని—

"ఒరే; నువ్వు గుప్‌చప్‌గా ఈ ప్రకటనకి జవాబుగా నీ దరఖాస్తుపంపరా" అన్నాను.

"మరి ఆ పాలకొండ సమ్మంధమో" అన్నాడు వాడు.

"పాలకుండా లేదు నీళ్ళకుండాలేదు.... అన్నట్టు వాళ్ళదీ మందీ గోత్రం వొకటే కదురా; సంబంధం ఎలా కలుపుకుంటారు?" అని కోప్పడ్డాను.

ఒకచే అయ్యుంటుంది, గోత్రం.

లేకపోతే ఆ సంబంధం అలా పుసిగిపోతుందా?

0 0 0

"డియర్ తాతయ్యా!"

నీకు అనేక నమస్కారాలు— నువ్వెంత మంచివాడవో ఇక్కణ్నించి చూస్తే కూడా కనబడుతున్నాది. నీకు నా థాంక్స్....

ఉత్తరం రాయమన్నాను, రాశాడు బాగానేవుంది. కాని ఈ సోదంతా ఎందుకు, నాకు తెలీదా! వాడికి నామీద సద్భావం గౌరవం ఉన్నాయని?

"సరే— ఇక్కడ దిగగానే ఒహడు అవుపించాడు. వాడు ఆరడుగుల ఎత్తున్నాడు. ఆ ఆరడుగులూ చాల్లేదన్నట్టు వాడి నెత్తిమీద మూరెడు తలపాగా చుట్టబెట్టేడు, దానిమీద మళ్ళా— కోడిపుంజుకి బుర్రమీదుంటుంది చూసేవూ, కుచ్చిళ్ళు పోసినట్టు కుచ్చు— అలాంటిదొక పింఛం కట్టేడు. వాడు మరి రైల్లోంచి దిగుతున్నవాళ్ళ నందర్నీ అడుగుతున్నాడో యేమో— నన్నూ అడిగేడు- వేణుగోపాలంగారు తమరేనా" అని,

నేను నువ్వు చెప్పినట్లుగా, దర్జాగా బిగుసుకుపోయి "నీపేరేమి?" అన్నాను. దానికి వాడు సహంగాకా వంగిపోయి, నాపేరప్పలసాఁవిఁ బాబూ, తఁవఁరనకాపిల్లి నించే గడండి రాడం" అనేసేడు. ఓరి వెధవా! నువ్వా మా వేపు వాడివేనా. అయితే నీ దగ్గర నా పప్పులెలా వుడుకుతాయిరా అనుకొని వెంటనే ప్లేటు మార్చేసేను.

"పేద్ద కారొకటి తెచ్చేడు తాతయ్యా, వాడు, ఆ పెద్దకారులో, ఈ హైదరాబాదులో చాలా వాట్లోకి పెద్దదయిన ఈ బిల్డింగులోకీ నన్ను లాక్కొచ్చాడు తాతయ్యా వాడు. నీ సలహాలు అమూల్యం. అన్నీ పాటిస్తున్నాను.

"మూడురోజులయిందా! ఇంకా నాలుగు రోజులుండమంటున్నారు వీళ్ళు ముఖ్యంగా, మీ హరిగారు,

"రాగానే యింట్లో వాళ్ళందరికీ ఆయనే స్వయంగా పరిచయం చేసేరు. మంత్రి అంతటివాడు నన్ను అంత గౌరవంగా చూస్తున్నా నాకు మతిపోకుండా వున్నదంటే అది నీ సలహాలు జ్ఞాపకం వుంచుకోడంవల్లనే కదా— నువ్వు అన్నావు కదా— ఎక్కడా తలవంచవద్దు, అడిగితేనేగాని కులం గోత్రం పితృ పితామహ నామాలు చెప్పొద్దు- అన్నావు. వాళ్ళు అడగాలేదు. నేను చెప్పా

లేదు. ఇంత సంస్కారం అంతస్తూ వున్నవాళ్ళు అలాంటి సిల్లీ డిటేల్స్ అడుగుతారా! ఊరూ, ఆస్తులూ, చదువూ సంధ్యా జ్ఞానం దర్పం యివే చూసేరు,వాళ్ళు. మిస్టర్ వేణు. బి. ఎస్సీ ఆనర్స్ (న్యూక్లియర్ ఫిజిక్స్) అనే గుర్తించేరు నన్ను వీళ్ళు, నాకు మాత్రం ఫలానా మా తాతయ్య మనవణ్ణిరా అని చెప్పేయాలని మహా వుంది.

"ఆ అమ్మాయి పేరు ప్రమీల. పేరుకుతగ్గ పిల్లలే.... ఉండడానికేమో మహా అందంగా వుంది. పూర్తిగా వర్ణించిరాస్తే, తాతయ్యా నువ్వు దెబ్బలాటకొస్తావు. నేను వాళ్ళ వల్లో పడిపోయేనని నామీద కస్సుమంటావు. వాళ్ళ ప్రలోభానికి లొంగిపోయేనని తిడతావు.

"పేరుకుతగ్గ పిల్ల అన్నాను కదూ—— అంతచొరవా ధైర్యం యెక్కడా చూళ్ళేదు నేను! ఆఖరికి మా క్లాస్ మేట్ ప్రసన్న కూడా ఎప్పుడో వోసారి మొగాణ్ని చూసి బెదిరినట్టు తలవంచినట్టు, అధికుడే నని అంగీకరించినట్టు జ్ఞాపకం. కాని ఈ ప్రమీలా—?అమ్మ నాయినో——"

ఉత్తరం చదువుతూంటే నాకు ఆనందబాష్పాలొస్తున్నాయి. మా మనవడు వేణుగోపాలం మణిపూస! వాడు హరికేఅల్లుడు కావలసినవాడు. చిన్నవాడయి పోడంచేత వాడి మనవరాలికి మొగుడవుతున్నాడు. వాడు నా పరువు నిలబెడతాడు. నా ప్రతిజ్ఞకి ప్రాణం పోస్తాడు.

"నన్ను స్వయంగా కార్లో పెట్టుకు తిప్పుతోంది తాతయ్యా. అంటే డ్రైవరూ ప్యూన్ గీన్ ఎవ్వరూ వుండరన్న మాట,నన్ను ముందు సీట్లో కూర్చోబెడుతుంది. కబుర్లు చెప్పమంటుంది. మాట్లాడుతుంది. ఎదురుగావచ్చే బిల్డింగులూ, దృశ్యాలూ అన్నీ వర్ణించి చెబుతుంది. నాకు డ్రైవింగు రాదనిచెప్తే వినుకోలేదు. నీకేం ఖర్మ డ్రైవింగు నేర్చుకోడాని కన్నాది. ఎన్ని కబుర్లు చెప్పింది. నే చెప్పినవెన్ని విన్నాది..ఇవన్నీ నేను రాయలేను తాతయ్యా. రాయకపోతే నువ్వు దెబ్బలాటకొస్తావుగాని నా వల్ల కాదుబాబూ.

"నన్ను వాళ్ళ క్లాస్ మేట్స్, ఫ్రెండ్స్, టీచర్సు అందరికి పరిచయం చేసింది. తను సంగీతం నేర్చుకున్న హిందుస్తానీ విద్వాంసురాలు— ఇంగ్లీషు డాన్స్ నేర్చుకున్న క్లబ్, కొన్నాళ్ళు సరదాగా అభ్యసించి మానేసిన స్కల్ప్చర్ సెంటర్, మరో మంత్రిగారి మేనకోడళ్ళు చీఫ్ సెక్రెటరీ మనవరాళ్ళు; తమ్ముడి కూతుళ్ళు కొత్తగా ఐ. ఎ. ఎస్ పాసై స్టాఫ్ కాలేజీ కొచ్చిన బ్రైట్

యంగ్మెన్ అండ్ విమెన్–ఎంత మందో! మూడురోజుల్లో వెయ్యిమందికి పైగా ఇంతింతలేసి గొప్ప వాళ్ళని పరిచయం చేసింది. నేను చాలా అల్పుణ్ణి అనుకుంటూవుండే వాణ్ణి తాతయ్యా. కాని అలాకానే కాదు.

"నేను ఉండడానికిట ఆ పెద్దభవంతిలో వొక ఏర్ కండిషండ్ గది యిచ్చేరు తాతయ్యా. అక్కడ నాకొక్కడికే ప్రత్యేకం. మీట నొక్కితే వెంటనే రావడానికూడా ఎవడూ ఉండడు. నిమిషంన్నర పడుతుంది ఔట్ హౌస్‌లోంచి ప్యూన్ రావడానికి. వాడు నా పిలుపు వినగలడుగాని, నేను గదిలో మాట్లాడేది విన్లేడన్న మాట. ఆ గదిలో రాత్రి పదీ, పదకొండూ పన్నెండూ– ఎన్ని గంటలవుతున్నా ఒక్కత్తీ నాతో కబుర్లు చెబుతూ వొంటరిగా కూర్చుండి పోతుంది ప్రమీల. బాగుందా?.... అబ్బే. ఏం లేదు తాతయ్యా! నీమాట దాటుతానా? నేనంత తొందరపడతానా?"

అయింది. వీడి బాధ్యత ఇన్నాళ్ళకి వదిలింది.

* * *

ఆ అయిదురోజులూ మావాణ్ణి తిడుతూనే వున్నాను. మా వేణుగాణ్ణి మెచ్చుకుంటూనే వున్నాను.

అయిదోరోజున "వచ్చేశాను తాతయ్యా" అంటూ వచ్చేశాడు. నా జీవన దీపం, నా ప్రతిజ్ఞా పాటవం; మా వంశప్రతిష్టా పాలకుడు, మా మనవడు వేణుగోపాలుడు.

వెనకాతల అప్సరసలాంటి అమ్మాయి సిగ్గులొలకబోస్తూ లోపలికొస్తోంది

"ఆరి నీ దారుణం తగలెయ్యా! వెంట పెట్టుకు మరీ వొచ్చావా యేమిటి?" అనుకుని గుడ్లు తేలేశాను.

"కమిన్ సరస్వతి! ఈయన మా తాతగారు. నన్నింతవాణ్ణి చేసిందీయనే!" అన్నాడు వేణు నన్ను చూపెడుతూ.

"నమస్కారమండీ" అని ఆపిల్ల వినయంగా నవ్వింది. మా వాడికి తగిన ఈడూ జోడూ, వొడ్డూపొడుగూనూ.

కాని సరస్వతంటున్నా డేమిటి– అని మొహం వేలేశాను. ఒహవేళ పేరూ గట్రా మార్చుకోలేదుగద!

అయినా పీడితో యిలా పంపేదేమిటి. హరి! అని యిబ్బందిగానే వుంది. ఏమో ఇదీ వొక రకం గొప్ప సంప్రదాయమేమో!

"ఏమిట్రా వేణూ యిది? నేనెవరో ఆ పిల్లకి చెప్పేవు; బాగానేవుంది; కాని ఆ పిల్లెవరో, కథా కమామీషూ నాకు చెప్పక్కర్లేదుట్రా?" అన్నాను లేని నవ్వు తెచ్చుకుంటూ.

"చెప్తాగా!" మా వేణుగాడు; అప్పుడుడప్పుడు నేను నవ్వుతూ వుంటానే అంత గడుసుగా నవ్వేడు. అటు తిరిగి "పద, సరస్వతీ? లోపలికెళ్ళు. అమ్మ ఉంటుంది. నమస్కారం చేసి నిన్ను నువ్వు పరిచయం చేసుకో. నే నిప్పుడే తాతయ్యతో మాట్లాడి వచ్చేస్తాను. అమ్మ దగ్గిర దేనికీ మొహమాటపడకు మీ.. కాఫీ అదీ తయారు చేయించు. అత్తా కోడలూ వొకటైపోండి" అన్నాడు,

ఎన్ని నేర్చేడు, వేణుగాడు! పైగా ఆ అమ్మాయి పెంపుడు పావురంలా వాడి మాటలకి మెత్తగా అందంగా ముడుచుకుంటూ. లోపలి కెళ్ళింది.

"ఊఁ," అన్నాను. కథ చెప్పు! అన్నట్లు.

"ఈ సరస్వతీ వాళ్ళది– పాలకొండ తాతయ్యా. అప్పుడు ఫోటో చూసే నని చెప్పేనే– ఆ పిల్లే అన్నమాట, హైద్రాబాదులో వీళ్ళన్నయ్య ఉద్యోగం చేస్తున్నాట్ట, ఇంటికి దిగబెట్టమన్నాడు. కొన్నాళ్ళు మనింట్లో అలవాటయ్యేక వెళుతుంది."

"షటప్ర్కా–సెల్?" అందామని వుంది. కాని అల్లారుముద్దుగా పెంచానే అంతమాట అననా?

"ఇదేంట్రా నాయనా ఇది;" అన్నాను.

"అంతే తాతయ్యా. ఇంకేమీ అనకు. నువ్వు కోప్పడతావేమోనని హడిలిపోయాననుకో. మా తాతయ్య బంగారు."అంటూ నామీదకొచ్చేడు వేణు. "ఈ ఒక్క విషయంలో మాత్రం నువ్వు చెప్పినట్టు చెయ్యలేకపోయాను తాతయ్యా" అని గుస గుసలాడేడు.

"మరి ప్రమీల– ఆ అమ్మాయి మంచిదే అన్నావు కదురా, నువ్వు?... ఆ ఉత్తరం– అదంతా?" అని రాళ్ళు తన్నుకున్నట్టు తడబడ్డాను.

"అదంతా నిజమే తాతయ్యా. ఆ అమ్మాయి నాకెన్నో నేర్పింది.... కాని నాక్కావలసింది– పెళ్ళాం(వాం– మొగుడా?"

***

("నివేదిత" మాసపత్రిక- ఫిబ్రవరి- మార్చి 1979)

# చదివించే కథ

"ఎదుగుతున్న కొడుకుల్ని స్నేహితుల్లా చూడు" అన్న ఆంగ్ల సూక్తిమీద నమ్మకం అని నా ఉద్దేశం.

"తాబేతాళ్లని గాని.కుటుంబ సభ్యుల్నిగాని తప్పుచేసినా అదమాయించలేని అపమర్ధత" అని మా ఆవిడ ఉద్దేశం.

"నీ నెత్తిమీద చేతులు పెట్టేస్తున్నాసరే. అవతలివాడిపట్ల క్రోధం తెచ్చుకోలేని మంచితనం" అని నా స్నేహితుల ఉద్ధేశం.

ఏదో ఒకటి—కారణం; కాని కార్యం యేమిటంటే. వెతికి వెతికి ఇంగ్లీషు మీడియంలో బోధించే కాలేజీ కనిపెట్టి, దాంట్లో చదవ్వేసిన మా అబ్బాయి బొత్తిగా 'క్రమశిక్షణా రహితంగా ప్రవర్తిస్తూ వుంటే చదువును నిర్లక్ష్యం చేస్తూ వుంటేనేను పల్లెత్తుమాట అనకండా వూరుకోడం జరిగింది కొన్నాళ్ళ పాటు.

చివరకి షష్టియరు హాఫియర్లీలో వాడికి చివర్నుంచి ఐదో స్థానం వచ్చిందనితెలిసీ కూడా వాణ్ణి నేనేమీ అనలేకపోడం సంభవించింది.

ఏమీ అనకపోడం— అంటే బొత్తిగా యేమీ అనకపోడం కాదు. నేను ఆ రోజు వాణ్ణి దగ్గర కూచోబెట్టి చేసిన పనికి మా ఆవిడికి నా మీద చిర్రెత్తుకొచ్చింది.

ఏం చేశానంటే—

భమిడిపాటి కామేశ్వరావుగారి 'కాలక్షేపం' పుస్తం తీసి. అందులో ఒక జోక్ చదవమని యిచ్చేను. మా వాడికి—

తండ్రి: ఏమిట్రోయ్, నీ చదువు రోజు రోజుకీ యిల్లా గుంట పువ్వులు పూస్తోంది?

కొడుకు: ఇప్పుడేం జరిగిందని నీ యిది?

తండ్రి- ఏమీ లేదు. నువ్వు క్లాసులో చివరివాడివటగా!

కొడుకు: తప్పంతా గుర్నాధానిది నాన్నా!

తండ్రి: వాడేం చేశాడు. మధ్యన?

కొడుకు: ఇన్నాళ్లూ క్లాసులో చివరివాడు వాడే, అసలు!

తండ్రి: ఐతే?

కొడుకు! వాడీ మధ్యనే టి. సి పుచ్చుకు పోయాడు మరి.

ఈ జోక్ చదివాక మా అబ్బాయిలో నేను ఆశించిన రియాక్షన్ వొచ్చిందని నే ననుకున్నాను, ఎందుకంటే. మర్నాటినుంచీ కొంత యింటిపట్టున వుండడం, వాళ్ళమ్మ సరుకులో కూరలో తెమ్మంటే "నేను చదువుకోవాలమ్మా!" అంటూ బజారుకైనా వెళ్ళకపోడం జరిగింది, ఎలాగో ఫస్టియరు చివర్న జరిగిన పరీక్షల్లో డిటెన్ కాకుండా వొడ్డెక్కాడు.

"ఇంగ్లీషు మీడియం అంటేనే క్రమశిక్షణ. వాడు చదవకపోడమేమిటి? ఏదో ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క సమయంలో కొంత నిర్లక్ష్యం. అంతే!" అని నేను తృప్తిపడి మా ఆవిడతో అనడం జరిగింది.

మళ్లీ సెకండియర్ 'క్వార్టర్లీ'లో గురికి జానెడు దూరంలో పాస్ మార్కులు తప్పి మా పాడు వెనకబట్టాడు."ఇదేమిట్రా నాయనా?" అని అడగడానికి నాకేదో అడ్డు వచ్చింది. దాన్ని నా నమ్మకంతో ముడెట్టాలో, మా ఆవిడ ఉద్దేశానికి భాష్యంలా వాడాలో, మా స్నేహితుల అభిప్రాయానికి ఫలశ్రుతిగా పేర్కొనాలో నాకు అర్థం కాక కాబోలు, నానోట మాట రాలేదు.

0 0 0

"పక్క వాటాలో ఉమాపతి శాస్త్రిగారికి వప్పచెప్పండి పిల్లాణ్ని" అంది మా ఆవిడ.

నాకు కొంచెం భయం వేసింది.

ఆయన కరుకైన మనిషి.

రిటైరవడానికి పదేళ్ళ ముందర పెళ్ళి చేసుకున్న ఉమాపతి శాస్త్రిగారు; ఆ వయసులో ప్రారంభించి, మరీ లేటయిపోతోందని భయపడిపోయినవాళ్ళాగ; వరసగా ముగ్గుర్ని కన్నాడు, హైస్కూలు హెడ్మాస్టర్‌గా రిటైరై. పిల్లల చదువులకి కాన్వెంట్లు పుష్కలంగా వున్నాయని యీ వూరు చేరారు వాళ్ళు. ఉన్న వూళ్ళో పొలాలు కవులు కిచ్చీ, ఇల్లు అమ్మేసుకునీ, మా పక్కవాటాలో చేరి ఆరునెలలు అయింది.

ఆయన పిల్లల్ని అనే మాటలూ, కొట్టే దెబ్బలూ— ఈ గోడలు అడ్డం లేకండా నా కంట పడితే—ఒక్కపూట కూడా తృప్తిగా అన్నం తినలేనేమో —అనిపిస్తుంది.

గట్టిగా పన్నెండేళ్ళుండవు పెద్దవాడికి. "ముష్టి లమ్డికొడకా అన్నం తినగానే నిద్దరేమిట్రా? లేచి చదువు, పిలక్కి తాను కట్టమంటావా? చదువెలా వస్తుందిరా భాంచేత్? సరస్వతీదేవి నీకే మైనా బాకీ అట్రా?"- (రాయగలిగినంత మర్యాదగా లాసేను)-ఇలాగ, పిల్లాణ్ణి చదువుకు కూర్చోపెట్టే మార్గం.

తొమ్మిదోయేడు, ఆడపిల్లకి "బాత్‌రూమ్‌లోకి తువ్వాలు పట్టికెళ్ళకుండా వెళ్తావుటే దొమ్మరి ముండా, ఈ మాటు బాత్‌రూమ్‌లోంచి తువ్వాలడిగేవో చూడు. బుర్ర గొరిగించి, పిండి చుక్కలు పెట్టించేస్తాను."- ఇదీ ఆ పిల్ల ముండతో సంభాషణ.

ఎనిమిదో యేడు రెండోవాడికి. "కళ్ళు నెత్తిమీద పెట్టుకు నడుస్తే యేమౌతుంది, రాయి తగలక! మళ్ళీ ఏడుపొకటీ, సిగ్గు లేకుండాను. నోరు మూస్తావా, పీక నొక్కమంటావా, పింజారీవెధవా."- ఆ విధంగాను- వాణ్ని సముదాయించడం.

ఆయనకి-కుర్రాణ్ని వప్పగించమంది మా ఆవిడ, వాడికి క్రమశిక్షణా- చదివే అలవాటూ యేర్పడ్డానికని.

వాళ్ళ పిల్లలు ముగ్గురికీ ఉదయం ఏడింటికి క్లాసులు. ఆ వెళ్ళడం మధ్యాన్నం పన్నెండు గంటలవరకూ రారు. మా వాడికి పది గంటలకి కాలేజీ. ఉదయం ఏడు నుంచి తొమ్మిదిన్నర దాకా వాణ్ని ఆయన అజమాయిషీలో పెట్టేస్తే ఒక్క నిమిషం కూడా దిక్కులు చూడనియ్యకుండా యమ కాపలా కాస్తాడు. అది మాత్రం నిజం.

"గుర్రాన్ని నీళ్ళదాకా తీసికెళ్ళగలం. కాని నీళ్ళు తాగించలేమేమో?" అని సందేహం వెలిబుచ్చాను. మా ఆవిడతో.

"గుర్రమో గాడిదో; ముందు వాడు చెడిపోకుండా చూడండి. ఆ తరువాత వాడికి యోగ్యత వుంటే బాగుపడతాడు. లేకపోతే లేదు!"

ఆ విధంగా జరిగింది: నేను మావాణ్ణి ఉమాపతి శాస్త్రిగారి కొప్పగించడానికి వప్పుకోడం.

-"మీరేమీ ట్యూషన్ చెప్పక్కర్లేదండి. ఊరికే కనిపెట్టుంటే చాలు, రోజూ వోగంటపాటు ఉదయం. వోగంటపాటు సాయంకాలమూనూ." అన్నాను.

"ట్యూషన్ చెప్పమన్నా చెబుతాను. ఏం: మనకి రానిచదువులా యేమిటి? మీడియం ఇంగ్లీషన్న మాట కాని చదువంతా వొకటేను!" అన్నారాయన.

"అబ్బే. వాడికి ఇష్టం వుండదేమోనండీ" అని మొహ మాటపడ్డాను.

"ఇష్టం లేకపోతే వాణ్ణి వాడిగదిలో కూర్చొమనండి. నాకు అచ్చుపుస్తకం యిమ్మనండి. లెక్కల్లో స్టెప్పుల్తోసహా యిక్కణ్ణించే చెప్పేస్తాను."

అంతవాడు కాడని నా కెప్పుడూ అనుమానంలేదు. పాతకాలంనాటి హెడ్మాస్టరు. మైకుల్లేనప్పటి నాటకం యాక్టర్లలా అలుపులేని గొంతుక ఆయనది.

"ఏం నాన్నా, నన్ను 'అరుపువీరుడు' గారి దగ్గర ట్యూషనుకి పెడుతున్నావా?" అన్నాడు మావాడు ఆ సాయంత్రం.

"అరుపు వీరుడా?" అన్నాను బోధపడక, జవాబు చెప్పొచ్చా లేదా అని ఆలోచించో, లేక నాకు ఇబ్బందికరంగా వుండబోయే ఆ జవాబుని అహ్లాదకరంగా చెయ్యడానికో, మావాడు చిరునవ్వు నవ్వాడు.

"మెరుపువీరుడు— అన్న సినిమా వొచ్చిందికదా. దాంతో రైమ్ చేస్తూ మా ఫ్రెండ్స్ శాస్త్రిగారికి 'అరుపువీరుడు' అని నిక్నేమ్ పెట్టేర్నాన్నా"

"ఇంకవాడు ఆయన దగ్గిర ఏం చదువుతాడు?" అనుకున్నాను. కాని ఆశ వదలక అన్నాను! "ఆయన నీ దగ్గిరకి రాకండా, నువ్వు ఆయన దగ్గిరకెళ్ళకుండా చెప్తాడు తెల్సా?"

"ఎలా చెప్తారు?"

"అదే తమాషా, ఆయనకి టెలిపతీ తెలుసు."

మావాడి మొహం హటాత్తుగా తెల్లబడిపోయింది. "అయ్యబాబోయ్" అన్నాడు.

నేను విజృంభించాను, "అంటే తెలుసుగా, నువ్విక్కడ లెక్కలు చేస్తూ వుంటావు. పరధ్యానంగా ఎనిమిది తొమ్మిదులు డెబ్బయ్యేరు అని వేసేవనుకో, ఆయన అక్కణ్నించి డెబ్బయిరెండు వెయ్యమని అరవడమో, లేకపోతే ఆయన అలా చెబుతున్నట్టు నీకు స్పురించడమో జరుగుతుందన్నమాట."

మావాడు నిశ్శబ్దంగా తలవూపాడు. కొన్నిక్షణాల క్రింపట ఉమాపతి శాస్త్రిగారికి నిక్నేమ్ 'అరుపువీరుడు' పెట్టిన సాహసి వీడేనా అనిపించింది.

"నీకు నమ్మకంలేదు గావును, టెలిపతీమీద" అన్నాను మళ్ళీ నేను.

"అబ్బే, అదికాదు నాన్నా...చదివాననుకో, టెలిపతీ, క్లెయిర్ వాయిన్స్ యిలాంటి వాటిమీద. కాని ఉమాపతిశాస్త్రి గారికి—"

"ఏం ఆయనకి ఉండకూడదా అలాంటి శక్తి? అంత చవగ్గా కనబడుతున్నారా, ఆయన నీకంటికి?"

"సారీ నాన్నా. నేనన్నది అధికాదు" అని మావాడు తప్పుకున్నాడు.

* * *

నాలుగు రోజులయింది.

ఆఫీసునుంచి త్వరగా వచ్చేశాను. తలనొప్పిగా ఉంటేను. డాష్లోఆస్ప్రో మింగి కాఫీతాగి మరీవొచ్చాను,

మావాడు లెక్కల పుస్తకం ముందేసుకుని రఫ్‌బుక్కు పాడుచేస్తున్నాడు.

"నాలుగోలెక్క రాగానే సంబరం కాదు. ఐదోది చేసిచూడు తెలుస్తుంది" అని శాస్త్రిగారు పొరుగువాటాలోంచి గట్టిగా అరిచాడు.

మావాడు ఉలిక్కి పడ్డాడు.

ఏమిటా అని రఫ్‌బుక్కులోకి చూశాను. ఐదోలెక్క చెయ్యడానికిగాను అంకెవేసి, అచ్చుపుస్తకంలో లెక్క అర్థంగాక గుడ్లు మిటకరిస్తున్నాడు ఇంత సేపూను.

నేను నవ్వుకుంటూ ఇంట్లోకెళ్ళాను. మా ఆవిడ లోపలేదో పనిచేసుకుంటోంది. "లెక్కల పుస్తకం యింకో కాపీ కొని ఉమాపతి శాస్త్రిగారికిచ్చేవా?" అని అడగాలని నా ఉద్దేశం.

* * *

మళ్ళీ రెండురోజులైంది.

ఆదివారం, ఉదయం పదిగంటలు కాలేదు.

మావాడు న్యూస్‌పేపర్లో మేగజైన్ శెక్షన్ చూస్తున్నాడు.

"ఆ పనికిరాని రాతలు చదవకపోతే ఇంగ్లీషు పుస్తకం చదవరాదురా, భ్రష్టు వెధవా! మొన్న పరీక్షలో ఎన్నొచ్చేయి మార్కులు, నూటికి తొమ్మిది" అని అరిచాడు ఉమాపతి శాస్త్రిగారు గోడ అవతల్నుంచి.

నేను మా ఆవిడకోసం కళ్ళతో వెతికాను.

రెండో డోసు కాఫీ గ్లాసులో పోసుకుని ఏమీ యెరగనట్టు హంసనడకల్తో వస్తోంది, ముందు గదిలోకి.

మావాడు నిశ్శబ్దంగా ఇంగ్లీషు పుస్తకంతీసి చదవడం గమనించి నవ్వుకున్నాను.

కాఫీ తాగి గ్లాసు అక్కడ పెట్టాను.

మావాడు పుస్తకం మూసి వెనకింటిలోకి వెళ్ళబోతూంటే గ్లాసుకి కాలు తగిలి పెద్ద చప్పుడుతో దూరంగా పడింది.

"కళ్ళు నెత్తిమీద పెట్టుకుని నడుస్తాడు వెధవ" అని పక్కవాటాలోంచి శాస్త్రిగారి కేక.

*　　　*　　　*

"బాగా చదువుతున్నట్టున్నాడే, కొడుకు?" అన్నాను. ఆ మర్నాడు మా ఆవిడతో.

"మన ప్రతాపం యేం లేదు. ఉమాపతి శాస్త్రిగారే చదివిస్తున్నారు" అంది మా ఆవిడ, నవ్వుతుండానూ.

"నువ్వు ఆయనకి ఎప్పటికప్పుడు వీడేం చేస్తున్నదీ చెబుతున్నావా?"

"నా మొహం, నాకంత తీరుబాటేది?"

"ఆయనా యింటిదగ్గిరే వుంటారు, నువ్వూ ఇంటిదగ్గిరే వుంటావు ఏం, చెప్పలేక?"

"నేనేం చెప్పలేదు సుమండీ, ఆయనే, సమయానికి సరిపోయేటట్టు ఏదో కేకపెడతారు. మొన్నొకసారి ఏమయిందంటే, మనవాడు కాలేజి నుంచి వొస్తూనే చెప్పులు స్పీడుగా విసిరాడు, కాలితో. ఆ స్పీడుకి ఒకటివెళ్ళి మంచం మీద పడింది. సరిగ్గా సమయానికి—అప్రాచ్యపువెధవా, చెప్పులు మెడకి కట్టుకుంటావుట్రా? అని పెద్దకేక పెట్టారాయన. హడిలిపోయి మనవాడు వెంటనే దాన్నితీసి కిటికీ క్రిందగూటిలో పొందిగ్గాపెట్టి మంచంమీది దుప్పటీ దులిపాడు. వాడు మొహం కడుక్కోడానికి బాత్ రూంలోకెళ్ళగానే కిటికీ తలుపుతీసి పక్కవాటాలోకి చూశాను. వాళ్ళ పెద్దవాడు బూట్లు పాలిష్ చేసుకుంటున్నాడు..."

"అంటే అంతకు ముందు వాడా చెప్పుల్తో ఏదో కోతిపని చేశాడన్నమాటేగా"

"మనవాడికి గురేదో తెలిపతీ అంటూ చెప్పార్టగా. అంతకు ముందు నుంచీ జరుగుతోందిలాగ. ఓసారి వీడు సైకిలుకి ఆయిలువేస్తూ ప్రెద్దబ్రష్‌తో గేర్ కేస్ లోపల తుడుస్తున్నాడు. అది కొంచెం దబడబలాడింది. ఇంతల్లోకే ఆయన—జెష్టపెధవా, సైకిలు చంకనాకిపోతుందిరా—అని అరిచాడు. మరో మాటు మనవాడు డాబామెట్లు దిగుతూ పిట్టగోడని బూటుకాలితో తంతూ వస్తున్నాడు—ఇవ్వాళ్టితో ఆ గోడపుణ్యం కట్టుకో! అని అరిచాడు ఉమాపతి శాస్త్రిగారు—సరిగ్గా సమయానికి వాళ్ళబ్బాయి గోడలో మేకులుకొడుతూ వున్నట్టు వీడికి తెలీక, తెలిపతీతోనే ఈ వార్నింగులూ ఈ చివాట్లూ వస్తున్నాయని; తనేం చేస్తున్నా ఒకశక్తి కనిపెడుతోందనీ భయపడ్డం జరుగుతోంది" అని మా ఆవిడ వివరించింది.

0　　　0　　　0

ఇంటర్మీడియెట్ పరీక్షలు చాలా బాగా రాసేదు మావాడు. ఆ తరవాత వాడు అలా హింసపడ్డం భరించలేక టెలిపతీ లేదు ఏంలేదు. అంతావట్టిది. అను కోని సారూప్యం—అంటూ వివరించే ఒక పుస్తకం తెచ్చి వాడి దృష్టినాకర్షించే విధంగా పెట్టాను.

ఆ సాయంకాలం ఆ పుస్తకం అక్కడే బోర్లించి వుంది. చదవడం ఐపో యిన సూచనగా.

దాంట్లో మావాడి దస్తూరీలో పెన్సిల్‌తో రాసివుంది లాగ. "మొదట్లో దివ్యదృష్టి అనే మంచి పేరు వుండేది దీనికి. కాలక్రమాన నాస్తికత్వం పెరిగి ఈశక్తి, క్షుద్రశక్తిగా ప్రచారం అయింది. మామూలు మనిషికి అందుబాటులో వుండి మంచిని సాధించగల ఈ శక్తి గురించి తెలుసుకోడం, దీన్ని పొందడానికి ప్రయత్నించడం మన కర్తవ్యం."

"టెలిపతీ గురించి చదవాలి. వీలుంటే ప్రాక్టీస్ కూడా చెయ్యాలి" అను కున్నాను ఆ కొత్తతరం నమ్మకం స్వీకరించి. *

(కాకినాడ లిటరరీ ఎసోసియేషన్ శతవార్షికోత్సవ ప్రత్యేక సంచిక 1978)

# "సరిగపద-మని-" మోహ(న)రాగం

**ఆరోహణ**

నవ్వింది!

"ఫరవాలేదు! లైన్లో పడ్డట్టే" అనుకున్నాడు మోహనరావు.

సాయంకాలంనించీ ఈమాత్రం నవ్వు దొరకలేదు.

తేరి పారచూసిన వాళ్ళున్నా.

పక్కకి తిరిగి ఉమ్మేసిన వాళ్ళూ,

మరుచటి చూపులో నిప్పు చిమ్మినవాళ్ళూ వున్నారే కాని

ఆదర దరహాసం వెదజల్లినవాళ్లు లేరు!

చంపేస్తున్నారు, రకరకాలుగానూ,

మూడు గంటల టైం వృధా అయిపోయింది. ఇహ కాళ్ళీడ్చుకుంటూ యింటికెళ్ళి పోవలసిందే కాబోలనుకుంటూ వుంటే.

తన పాలిటి దేవతలాగ; నూట ఎనభయ్యేనిమిదో నెంబరు బస్సులో ముందు నుంచి ఎక్కుతూ తనని పరీక్షగా చూసింది, నవ్వింది!

తనూ ఎక్కాలా వద్దా అనుకుంటూ వుంటే కిటికీలోంచి తనవేపు తొంగి చూసింది.

ఎక్కళ్ళేని బలమూ వొచ్చింది దాంతో,

ఎక్కలేనివాడే; ఎలాగో యెక్కేశాడా బస్సులో మోహన్రావు.

మోచేతుల్తో జనాన్ని పొడుచుకుంటూ ముందుకి చొచ్చుకు పోయా డభిమన్యుళ్ళాగ.

అభిమన్యుళ్ళాగ వెనకొచ్చేసే వుద్దేశం పెట్టుకుని ఎక్కలేదు.

ముందుకే వెళిపోవాలి ఎంతదూరమైనా ఈ ఎఫయిర్‌లో నని తెగించే యెక్కాడు. 'నభయం, నలజ్జా!'.... అంటే అర్థం- వెనక చూస్తే వెనకేనోయ్ అని కదా.

అలా ముందు కెళిపోయి ఆమె కూచున్న చోటికి కొద్దిగా వెనగ్గా నుంచున్నాడు మోహనరావు,

అంతరంటా ముందు కెళ్ళడానికి పీల్లేదు.

అక్కడంతా యితర స్త్రీలు.

వాళ్ళంతా ప్రస్తుతానికి పర స్త్రీలుగా అవుపించారు. ఎవరిమీదికీ చూపు వెళ్ళడంలేదు.

తన నెవరెలా చూస్తున్నదీ గమనిస్తున్నదీ పట్టింపుకి రాలేదసలు.

స్టాపు స్టాపుకీ వెనక్కి తిరిగి తనవేపు చూస్తూనే వుందామె.

'నేనున్నానా లేదా అని చూస్తోంది' అనుకున్నాడు,

ఆమె యెప్పుడు చూస్తుందా అని కళ్ళు అటేపే పెట్టి వుంచాడు. తను దిగిపోతే వెనకాతలే దిగిపోతుంది; అది గ్యారంటీ.

కాని—ఈ రూట్‌లో ఎక్కడ దిగీ లాభం లేదు. ఒంటరి స్నేహితుల రూములు లేవు. ఎరిగున్న లాడ్జీలూ లేవు.

ఆమె యెక్కడ దిగుతుందో అక్కడే తనూ దిగి, వీలుంటే కూడా వెళి పోవాలి. అదేతక్షణ కర్తవ్యం.

ఇంటి కెళ్తుంది కాబోలు- చేతిలో కూరల సజ్జా వుంది ఆమెకి. అదీ మంచిదే- 'సంసారపక్షంగా' వుంటుంది!

ఇల్లెక్కడో కనుక్కుంటే- యెందుకైనా మంచిది; ఎప్పటికైనా మంచిది!

ఆరు స్టాపులు దాటేక అయిదు సెకండ్లపాటు తన చూపులో చూపు కలిపి వుంచింది; నవ్వుతో ముగించిందాచూపుని,

అంటే— అంతసేపూ తనకా దృష్టి వుందా లేదా అని చూసి చూసి, ఆలోచించి, ఆ సుదీర్ఘ వీక్షణంలో ఇతను నా కోసమే వస్తున్నాడు అని రూఢి చేసుకుందన్నమాట—

అలా రూఢి చేసుకుందని తనకి తెలియడానికి, తన అంగీకారం తెలపడానికి నవ్విందన్నమాట!

తరువాతి స్టాపులో తను దిగిపోతానన్నట్టుగా ఆమె కండక్టర్‌తో చెబుతోంది. అది రిక్వెస్టు స్టాపు. ఆపమని అడిగితే తప్ప ఆపరు.

తనకి తెలియాలని కూడా, ఎదర ఆపమని మరీ మరీ అంగికంచేసి చెబుతోంది.

"గైడా, భయపడకుము;
నేను నీ వెంటనే వున్నాను!"

అనుకుంటూ తరవాతి స్టాపులో దిగిపోడానికి బస్సులో జనాన్ని నెట్టుకుంటూ వెనక గేటు వరకు వొచ్చేశాడు మోహనరావు.

ఆ తోపుడులో ఆదుర్దాకి అనేకమంది హేళన చేసేరు; కోప్పడ్డారుకూడా, వొకరో యిద్దరోనూ.

ఏదీ లక్ష్యం చెయ్యలేదతను.

ఆతని 'లక్ష్య మే' వేరుకదా.

తోసుకుని గేటుదగ్గిరి కొచ్చేసరికి బస్సాగింది.

ఆమె చటుక్కున లేచి ముందునించి దిగడం గమనించి చకచకా దిగి పోయాడు మోహనరావు. దిగినవాళ్ళు యిద్దరే—

బస్సెళ్ళిపోయింది—

**అవరోహణ**

చిరునవ్వుతో ఆమెని సమీపించాడు మోహనరావు.

"మీ ఇల్లెక్కడండీ?" అనడిగిందామె.

"మా ఇల్లు— బర్కత్‌పురాలోనండి— అయినా ఇంట్లో బాగాలేదండి"

"బాగాలేకపోవడమేమిటి?" కళ్ళలోకి చూస్తూ అడిగింది, అసలేమీ అర్థం కానట్టే. ఆ ప్రశ్న అర్థం!

"దెబ్బ తినేసాను!" అనుకున్నాడు మోహనరావు.

ఆ ప్రతిపాదన తననించి రావాలని ఆమె ఎదురు చూస్తోందన్నమాట!— సహజమే కదా............ రెడ్డొచ్చినట్టయింది— మళ్ళీ మొదలెట్టాలి.

"టైమెంతైందండి; నా వాచీ ఆగిపోయింది."

'ఎనిమిదీ ఇరవై,' ఆమె వాచీచూసి చెప్పింది.

"మీ ఇల్లు ఇక్కడేనా?"

"ఔనండీ— ఎర్రంమంజిల్ కాలనీలో వుంటున్నాం. వస్తారా? మా వార్లేరు—.... నైట్ డ్యూటీ యివాళ"

"హాయ్, హాయ్! మంచి సమయం— నక్కని తొక్కి వొచ్చేను" అనుకున్నాడు మోహనరావు.

"ఇంకెవరుంటా రింట్లో?"

"పిల్లాడుంటాడు........ నాలుగో క్లాసు"

మెల్లిగా నడుస్తున్నారు. కాలనీ గేటు దాటి లోపలికొచ్చేరు.

"ఓ యింటికి రావచ్చా?"

"రేపు పొద్దుటే రాండి; నెంబరు—" చెప్పింది. "అప్పుడైతే ఆయ నుంటారు."

కొంపదీసి తెలిసినవాళ్ళా యేమిటి? ఖంగుతిన్నాడు,

"ఇప్పుడోసారి వొచ్చి ఇల్లు చూసి వెళతాను. రేపు మళ్ళీ వస్తాను. పొద్దుట మళ్ళీ నెంబర్లు వెతుక్కోడం కష్టంకదా!"

"రేపంటే రేపొద్దుటే కాదనుకోండి- ఆదివారం అయితే ఆయనకి ఆఫ్— పూర్తిగా యింటిదగ్గిరే వుంటారు. నెంబరుంటే మా ఇల్లు సుళువుగా నే కనిపెట్టొచ్చు. ఇక్కడ నెంబర్లు అంత అస్తవ్యస్తంగా వుండవ్."

"పోనీ మీ అబ్బాయిని వోసారి చూసి వెళ్తాను. ఎందుకో మీ ఇంటివరకు రావాలని నాకుంది. మీకేమో యిష్టం లేనట్టుంది. ఇంతదూరం తీసుకొచ్చి వెనక్కి పంపేడం అన్యాయం."

"ఇష్టం లేకపోడమేం? తప్పకుండా రండి." ఆమె నడక జోరు చేసింది.

అమ్మయ్య! కనికరించింది— ఇంక వీళ్ళింటి కెళ్ళేలోగా మరిన్ని మాటలు పొయ్యాలి!

"అప్పుడప్పుడు కనిపిస్తూనే వుంటారు మీరు, కాని మాటాడ్డానికి అవ కాశం యివ్వలేదెప్పుడూనూ. ఇవాళ నా అదృష్టం బావుంది కనక నే నెక్కిన బస్సులోనే మీరూ యెక్కడం జరిగింది—" అన్నాడు.

ఆమె ఆగింది. అతనూ యాంత్రికంగా ఆగాడు.

"నే నెవరో గుర్తు పట్టేరా, అసలు మీరు?"

"మీరు— నేను— గుర్తు పట్టానుగాని—" నీళ్ళు నమిలాడు.

వాళ్ళిద్దరూ ఆగినచోట వున్న ఎలక్ట్రిక్ లైట్ కాంతిలో ఆమె కళ్ళు కన బడ్డాయి. కాని కనిపించిందల్లా చూడగలిగే కళ్ళు అతనికప్పుడు లేవు.

"నే నెవరో అనుకుని నావెమ్మట వచ్చేస్తున్నట్టుంది, మీరు. అయ్యో. రామ!" అని దీర్ఘం తీసిందామె.

"................"

"బస్సు ఎక్కేముందు, బస్సెక్కాక అప్పుడప్పుడూ నేను మీవేపు చూశానని అట్లా అనుకున్నారేమో........ పరీక్షగా చూసేవరకు నాకూ మీరె వరో గుర్తు రాలా."

"అలాగే మరి!"

"ఇప్పటికన్నా నేనెవరో మీకు గుర్తుకొచ్చానా?" దబాయించి అడిగింది.

తల అడ్డంగా ఆడించాడు; విధిలేక.

"నాలుగు నెలల కిందట మీరు ఏక్సిడెంటయి ఉస్మానియా ఆస్పత్రిలో చేరారా?"

"అవునండి, మీరక్కడ నర్సాండి?"

"నర్సూగాదు, ఆయాగాదు! నేనూ అప్పుడు ఉస్మానియాలో పేషెంటుగా చేరాను. నాకోసం రోజూ మావారు వచ్చేవారు. ఓరోజు రాత్రి డాక్టర్‌గారు నన్ను చూడ్డానికి లేటుగా వస్తే మావారు ఆయన్ని అడిగారు—, ఏం సార్ లేటుగా వచ్చేరని." "పాపం వొక అబ్బాయి ఏక్సిడెంటై కేజువాల్టీలో అడ్మిట య్యాడు; అతనికి బ్లడ్ కావాల్సొచ్చింది; ఆ విషయంలో కొంచెం తర్జన భర్జన జరిగింది; హాస్పిటల్లో ఆగ్రూపుబ్లడ్ అసలు స్టాకులేకపోతే డోనర్లకి అర్జంటుగా కబురెట్టి రాడంవల్ల లేటైంది." అన్నారు డాక్టరుగారు. ఇంతకీ బ్లడ్ దొరికిందా అని మావారు ఆదుర్దాగా అడిగారు. దొరకడం కష్టం. ఈ రాత్రి 12 గంటల లోగా బ్లడ్ ఇవ్వకపోతే అతని పరిస్థితి ప్రమాదకరంగా తయారవ్వొచ్చు అని చెప్పారు డాక్టరుగారు. వెంటనే మావారు లేచి, పదండి. నా బ్లడ్ సరిపోతే యిస్తానని ఆఫర్ చేశారు. గ్రూపు సరిపోయింది. ఆయన మీకు వొక సీసా రక్తం యిచ్చి మిమ్మల్ని ప్రమాదంనుంచి తప్పించారు. మర్నాడు నేను కుతూ హలంకొద్దీ డాక్టరుగార్ని పర్మిషన్ అడిగి, మీ బెడ్ దగ్గరకొచ్చి అప్పుడే స్పృహ వస్తున్న మిమ్మల్ని పలకరించాను;—

"అదీ మన పరిచయం!"

మళ్లీ ఆమె కళ్లలోకి చూద్దామని ప్రయత్నించీకూడా,

తల లేవక—

దించిన మొహంలో లోతుకుపోయిన కళ్లలోకి సూటిగా పడుతున్న ఆమె కాళ్లనున్న మట్టెల కాంతి పరావర్తన కిరణాల ఘాటికి తట్టుకోలేక—

"థాంక్సండి: వస్తాను"— అని వచ్చినదార్నే వెళిపోయాడు మోహన రావు; తప్పంతా నాలో ప్రవహిస్తున్న ఆమె భర్త రక్తానిది" అని సమర్థించు కుంటూ.

*

(జ్యోతి మాసపత్రిక; జులై 1981)

# మంచివాళ్ళు కూడా ఉంటారు

నాన్నగారు మా కంపెనీని పెంచిన విధానంలో, పోలీసు అధికారులతో నిత్యం సత్సంబంధాలు కలిగివుండడం ఒక అంశంగా పరిగణించి అనుసరిస్తూ వొచ్చారు. అంతేకాక, సుబ్బనర్సయ్యగారు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌గా ఇటీవల చేరిన సందర్భంగా జంటనగరాల్లోని కొందరు ముఖ్య పారిశ్రామిక వేత్తలు ఆయనకిస్తున్న ఈ విందులోనే సందుచూసుకుని నాపని ఒకటి ఆయనకి అప్పగించగలనని అనిపించింది.

అంచేత వెళ్ళాను, ఆ విందుకి.

"నమస్కారం సార్, నా పేరు లలిత" అన్నాను.

"నన్ను చెప్పనివ్వండి." అంటూ ఖైర్ల కంపెనీ రాజేశ్వరరావుగారు ముందుకొచ్చేరు "మిస్ లలితాంబ; ఎం.కాం; ఎమ్.బి.ఏ. జాల్ట్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు—"

'నమస్కారం!' అన్నారు సుబ్బనర్సయ్యగారు. "జాల్ట్ కంపెనీయా? పేరేదో తమాషాగా వుందే! జోల్ట్ కాదుకదూ?

"పేరేకాదు," రాజేశ్వరరావుగారు మళ్ళా అందుకున్నారు. "అ కంపెనీ చెరిత్రేఒక తమాషా....లలితాంబగారు క్షమిస్తానంటే చెప్పేస్తాను" నేను చిరునవ్వుతో అంగీకారం ఇచ్చేపాటి వ్యవధిలో మళ్ళా— జాల్ట్‌కంపెనీ–అంటే **Z.A.L.T.** అన్నమాట. అనగా జింకు, అల్యూమినియం, సీసం, తగరం.... ....ఈ నాలుగు లోహాలూ. వాటితో అవీ మిగతావాటితో అవీ కలిపి, ఎలెక్ట్రానిక్స్ నుంచి వంటపాత్రల వరకు రకరకాల సామగ్రి తయారు చెయ్యడానికుపయోగించే మిశ్రమాన్ని ఉత్పత్తి చేస్తారు వీరు. 1958లో వీరి తండ్రిగారు, ధన్వంతరిగారని, కేవలం ఇరవై వేల పెట్టుబడిలో స్థాపించిన ఈ కంపెనీ క్రమంగా లిమిటెడ్ కంపెనీ ఐ, ప్రస్తుతం ఏడాదికి రెండున్నరకోట్ల నికరాదాయంతో నడుస్తోంది. రెండేళ్ళ కిందట ధన్వంతరిగారు పోయినప్పట్నుంచి లలితాంబగారే జాల్ట్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు. ఇదంతా మీకు తమాషాగా

కనిపించకపోవచ్చు. కాని ధన్వంతరిగారు ఎనిమిదేళ్ళనాడు అర్డర్ చేసిన జెకోస్లో వేకియన్ యంత్రాలు కొన్ని; ఆరేళ్ళకిందటన్నుంచీ దరకాస్తు చేస్తున్న కేంద్ర ప్రభుత్వ భారీరుణం: ఈవిడ ఎం.డి. అవగానే ఒకేసారి రావడం తమాషా. అప్పటికి ఈవిడకి గట్టిగా పాతికేళ్ళు వెళ్ళలేదు. అయితే ఆవిడలా కఠోర పరిశ్రమ చేసి కంపెనీని ఇంతలా వృద్ధిలోకి తేవడం తమాషాకాదు........ఒక్కటి చెబుతాను సుబ్బనర్సయ్యగారూ. ధన్వంతరిగారు ఆనాడు ఇక్కడ నేల చవగ్గా దొరికిందని కొనిపడేశారు. కాని ఆయన కాలంలో అందులో పావువంతుకూడా వినియోగించలేదు. ఇప్పుడు ఆ వందెకరాలూ చాలక; సరుకుల నిల్వకీ గోడౌన్లకీ స్థలాలకోసం వెతుకుతున్నారు. మాలాగా వ్యాపారవేత్తలమని చెప్పుకునేవాళ్ళకి, ఒక స్త్రీ నిర్వహణలో ఉన్న కంపెనీ ఇలా దినదినాభివృద్ధి చెందడం తమాషాగానే కనిపిస్తుంది" అని వీలయినంత తమాషాగా మాట్లాడుతూ రాజేశ్వరరావు గారు సుబ్బనర్సయ్యగార్ని అలా బాల్కనీ మీదికి నడిపించేశారు. ఇంకేముంది ....అక్కణ్నుంచి ఆయన టైర్ల ఫ్యాక్టరీ స్పష్టంగా కనబడుతుంది—ఏదో ఆయన సోది మొదలెడతాడు....

"తమరు నాకో చిన్న సాయం చేసిపెట్టాలిసార్" అన్నాను సుబ్బనర్సయ్యగారితో.

"చెప్పండి—"

"ఇన్నాళ్ళూ ఈ కంపెనీని ఆరుగురు కావలా సిపాయిలతో నడిపించుకొచ్చాను. ముగ్గురు గూర్ఖాలుకూడా ఉన్నారనుకోండి.... రెండు గేట్లు, ప్రహరీ గోడ. యంత్రాగారం—అన్నీ వాళ్ళే చూసుకుంటున్నారు. ఇప్పుడు కంపెనీ విస్తరణ దృష్ట్యా వీళ్ళు చాలరని ఇరవయి మంది సెక్యూరిటీ గార్డులతో, ఆరుగురు ఇన్స్పెక్టర్లతో ఒక సెక్యూరిటీ ఆఫీసర్తో ఆ శాఖని పటిష్టం చేయాలని నిర్ణయించాం. సరే, ఆఫీసర్ని ముందుగా నియమిస్తే మిగిలినవాళ్ళ నియామకంలో ఆయన సాయం వుంటుందికదా అని; సెక్యూరిటీ ఆఫీసర్ ఉద్యోగానికి దరఖాస్తులు కోరుతూ ప్రకటన వేశాం. సుమారు నలభై వచ్చాయి.... పోలీస్ శాఖలో మీరు చేసిన అమూల్యమైనసేవ, సాధించిన అపూర్వ విజయాలు, మీకై మీరు నిర్మించుకున్న ఉత్తమ పాత్రతా గుణాలు విని, ఈ ఇంటర్వ్యూ మీరు నిర్వహిస్తే మా కంపెనీకి మేలని మేం భావిస్తున్నాం" అన్నాను.

"అంతేనా? మీ కంపెనీకి సెక్యూరిటీ ఆఫీసర్గా నన్నే ఏమ్మంటారేమోనని ఆశపడ్డాను!" అని నవ్వారు సుబ్బనర్సయ్యగారు.

"అదీ ఇదీ ఒకటే కదండి సార్" అన్నాను నవ్వి.

సుబ్బనర్సయ్యగారు కొంచెం ఆలోచించి, "అబ్బ! అబ్బ! పడగొట్టేశారు!" అన్నాడు.

o o o

సెక్యూరిటీ ఆఫీసర్ ఉద్యోగానికి ఇంటర్వ్యూకి పిలవడానికి ఐదుగురు అభ్యర్థులను ఎంపిక చేశాం; నేనూ మా బోర్డాఫ్ డైరెక్టర్స్తో కూర్చుని దరఖాస్తు అన్నీ పరిశీలించి,

నేనూ, సుబ్బనర్సయ్యగారూ; నా స్వంత నౌకరు కమల సాయంతో నా రూంలో ఇంటర్వ్యూ జరుపుతున్నాం.

ఒకొక్కక్క అభ్యర్థి పంపిన 'బయోడేటా' కాగితాన్ని ఫైల్లోంచి ఊడదీసి సుబ్బనర్సయ్యగారికి ఇస్తోంది కమల. అది ఆయన చదివేక, తలుపు తెరిచి. ఆ పేరుగల అభ్యర్థిని లోపలికి పిలుస్తోంది,

వచ్చిన వ్యక్తి కాగితంలో రాయని వివరాలు; అంటే స్వంత వూరేది, తల్లిదండ్రులున్నారా, తండ్రిగారు ఏ వృత్తిలో ఉండేవారు? పెండ్లయిందా. పిల్లలున్నారా? మిగిలిన కుటుంబం ఎవరెవరు? ఇలాంటివి నేను ఆత్మీయంగా అడుగుతున్నాను.

సెక్యూరిటీ ఆఫీసర్గా తాను పనికొస్తానని అభ్యర్థి అనుకోడానికి కారణాలు; ఎలాంటి సందర్భాల్లో ఎలాంటి ప్రవర్తన నిర్ణయం అని తన అభిలాష, జీతం ఎంత కావాలి? జీపు కావాలా మోటార్ సైకిలా? ఫ్యాక్టరీ ఆవరణలో నివసిస్తారా, అద్దెయింట్లో ఉండదలచుకొన్నారా? ఇలాంటి ప్రశ్నలు సుబ్బనర్సయ్యగారు అడుగుతున్నారు.

ఈ ప్రశ్నలూ, ఆ ప్రశ్నలూ జమిలిగా వస్తున్నాయి. అభ్యర్థి కులాసాగా, అప్రమత్తంగా జవాబులు చెబుతున్నాడా అని నేను గమనిస్తున్నాను. అంతా రికార్డవుతోంది. మధ్యలో కమల లోపలి గదిలోకెళ్ళి సాఫ్ట్ డ్రింక్ తెచ్చి అభ్యర్థికి అందిస్తోంది. దానికి అతని ప్రవర్తన కూడా చూస్తున్నాను.

నలుగురైపోయారు. ఇంకొక్క అభ్యర్థి వున్నాడు. సుబ్బనర్సయ్యగారు ఏదైనా నిర్ణయానికి వచ్చారేమోనని చూశాను. ఆయన ఏమీ తేలలేదు.

ఐదో అభ్యర్థి 'బయొడేటా' కాగితాన్ని ఫైల్లోంచి ఊడదీసి సుబ్బనరసయ్యగారికి అందించింది కమల.

"మిస్ కమలా; నాకొక సిగరెట్ ప్యాకెట్ తెప్పించి పెట్టమ్మా" అన్నా రాయన కాగితం వైపు చూడకుండా, కమల వెనకగది గుండా వెళ్ళింది,

కాగితాన్ని అరనిమిషంలో చూసి, చదివి, తల అడించి, "లలితాంబ గారూ, ఈ అభ్యర్థిని మనం చూడక్కర్లేదు!" అన్నాడు సుబ్బనరసయ్యగారు.

"అదేం? మొదటి నలుగుర్లో వొకర్ని ఎంపిక చేసేశారా? అయినా ఇతన్ని పిలిచాం కదా" అన్నాను.

"అదికాదు—ఇతను రవివర్మ...."

"అవును!"

"ఐ. సి. యస్. కి సెలక్టయ్యాడు. కొంత్తకాలం ఒక స్టేషన్‌కి అధికారిగా ఉంటూ—"

"చూశా నందులో ఉంది...."

"శిక్షణకాలం పూర్తవకముందే రాజీనామా చేశాడు."

"అమాట కూడా రాశాడుగా"

"అలా ఎందుకు చేశాడో మీకు తెలుసా?" అన్నాడు సుబ్బనరసయ్యగారు; కుర్చీలో వెనక్కి వారబడి; కాళ్ళు టేబిల్ కానించి వెనక్కి వూగి.

"అందులో రాయలేదు...." అన్నాను; అయనేదో చెబుతాడని నాకు తెలిసీ కూడా ఆ సంగతి ఆయనకు స్ఫురించకుండాను.

"ఎందుకో నేను చెప్పగలను!"

నాకు ఇంతకుముందే తట్టింది. ఈయన హైదరాబాదుకి డిప్యూటీ ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసుగా నెలరోజులకిందట వొచ్చే వరకు ఒక జిల్లాకి సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసుగా ఉండేవారు, బాహుశా రవివర్మ అనే అతను ఆ జిల్లాలోనే ట్రెయినింగ్ అవుతూ ఉండేవాడేమో! అటువంటప్పుడు అతను తన బంగారు భవిష్యత్తుకి నీళ్ళు వదులుకొని రాజీనామా చెయ్యడానికి ఈయనగారి ప్రోత్సాహమో. బలాత్కారమో ఉండకుండా ఎలా వుంటుంది?.... చూడనే అక్కర్లేదంటున్నాడు కనక ఈయనకీ అతనికీ కుదర్లేదన్న మాటే.

"నాకు తెలియనివి మీరు చెబుతారనేగా; మీ సహాయం కోరాను?" అన్నాను, "చెప్పండి. అత నెలాంటి వాడు?"

"ఒక్కమాటలో చెప్పాలంటే వాడొక బాధ్యతారహితుడైన బాలకుడు.లేకపోతే ఏమిటి, మేడమ్? ఛీఫ్ మినిస్టర్ ప్రోగ్రాం చేతుల్లో వుంచుకుని, మూడు రోజులపాటు సెలవూ దిబ్బా లేకండా ఓ అమ్మాయితో ఎక్కడికో షికార్లు చెలాయించి, సరిగ్గా ఆయన దిగిన రైల్లోనే ఆ అమ్మాయితో సహా దిగాడు. ఊళ్ళోను పరిసరాల్లోను ఛీఫ్ మినిస్టర్ ఉన్నారన్న ధ్యాసే లేకండా, ఆరోజూ మర్నాడూ కూడా డ్యూటీకి హాజరు కాలేదు, పైగా తను ఆ అమ్మాయిని ఫలానా చట్టం

ఫలానా సెక్షన్ కింద నేరం జరగకుండా రక్షించానంటూ రహస్యపు విన్నపం రాసి మద్రాసుకి తనకి ప్రయాణభత్యాల బిల్లు పెట్టి, ఆ అమ్మాయికి తిరుగు ప్రయాణానికి కూడా బిల్ పెట్టాడు. అలాంటి బోగస్ బిల్స్ ఓకే చెయ్యడానికి నేనేం కె. ఎల్. పతిని కాను, ఎం. ఎస్. నరసయ్యను!" అన్నారాయన గుండె మీద ఎడం చేతో తట్టుకుంటూ.

"కె. ఎల్ పతిగారెవరు? మీకంటె ముందుగా అక్కడ ఎస్. పి. చేశారా?"

సుబ్బనరసయ్యగారు బిగ్గరగా నవ్వారు. "ఎస్. యస్. మీ మోడెస్టీ కమెండబుల్‌గా వుంది. అంతేగాని మీకది తెలీదనుకోనేటంత అమాయకుణ్ని కాదు. అదేదో నానోటిమీదుగా చెప్పించాలని మీరు సూచించడంలో మీ హాస్య ప్రియత్వం వెల్లడవుతోంది— సరే— కె. ఎల్. పతి—కొండూరి లక్ష్మీపతి—అంటే జస్ట్ నోబడి—లేక ఒక ఆల్ టైమ్ ఫూల్."

నేను శాల్యూట్ చేసి "హాట్సాఫ్‌టుది జోక్" అన్నాను.

"సరే—అతను ఆ విధంగా డ్యూటీకి ఎగనామం పెట్టి తిరిగి డ్యూటీలో చేరాక, అతని ఇన్‌ఛార్జిలో వున్న ఆ స్టేషన్‌లో, మర్నాడు ప్రశ్నించడానికి ఉంచిన ఒక అనుమానితురాలిని, ఒక కాన్‌స్టేబుల్ రేప్ చేశాడు, దాని మీద పేపర్లలో పెద్ద గొడవ, అసెంబ్లీలో స్వల్పవ్యవధి ప్రశ్నలూ ఇవన్నీ మీరుఫాలో అయ్యేవుంటారు, దానికీ అతన్ని బాధ్యుడుగా చేశాం. ఎలా వుందంటారు— మన శిక్షాపద్ధతి?" అని, నేను ఆయన్ని మెచ్చుకోడానికి ఇంటర్ వెల్ ఇచ్చారు.

"బ్రహ్మభేద్యంగా వుంది?" అన్నాను. నా భావాలన్నీ దాచేసుకుంటూ.

"ఇడియట్— అడసిల్లని రక్షించానంటాడు! ఆ అమ్మాయి తప్పిపోయి నట్టు కంప్లెయింట్ లేదు.ఎఫ్. ఐ.ఆర్.అసలే లేదు. వాడి దగ్గరున్నదల్లా,మద్రాసు నుంచి ఎవడో సౌందరరాజన్ అనేవాడు, ఆ సోకాల్డ్ అమ్మాయి గార్డియన్ పేర రాసిన ఉత్తరం తాలూకు కాపీమాత్రం, దాంతో అతనేం సాధించగలడు? ఆటోమాటిక్‌గా కేసంతా అతనికి ఎదురు తిరిగింది. ఇక చేసేది లేక రాజీనామా ఇచ్చేడు."

"సరే అతన్ని ఇంటర్‌వ్యూకి రమ్మన్నాం. ఖర్చులిస్తున్నాం కనక ఓసారి చూసి మ పొమ్మందాం. ఏమంటారు?"

"అలా చెయ్యొచ్చు"

కమల సిగరెట్ పాకెట్‌తో వచ్చింది.

"సరే: ఈ అబద్ధపు పెళ్ళికి నా సాక్ష్యం కూడా ఎందుకు? పైగా ఇంత

అంద మైన శుభ్రమైన రూంలో పొగ పెట్టడం కూడా నాకు భావ్యం కాదు." అని సుబ్బనరసయ్యగారు లేచాడు. కమల అతన్ని లోపలి రూమ్‌లోకి తీసు కెళ్ళింది.

నేను బయటహాల్లో మోగే బజర్ నొక్కాను. అప్పారావు వచ్చేడు. "రవివర్మ గారుట. ఇంటర్వ్యూ కొచ్చారు. లోపలికి పంపించు" అన్నాను.

o o o o

"ప్లీజ్ కమిన్" అన్నాను.

ఆరడుగులు పొడుగున్నాడు. తెల్లటి పంట్లాంలో తెల్లటిపుల్ చేతుల చొక్కా టక్ చేసుకున్నాడు. గోధుమరంగు శరీరం. మొహం చాలా పెద్దది. మీసాలు ఒత్తుగా వున్నాయి. కళ్ళు చాలా చిన్నవి. నీపు వెనకాతల బల్ల చెక్క కట్టినట్టు నిటారుగా నడుచుకుంటూ వచ్చేడు.

ఒకచేత్తో శాల్యూట్ చేశాడు.

"కూర్చోండి"

"థాంక్యూ మేడమ్"

మామూలు పద్ధతిలో, ఒకప్రశ్న వ్యక్తిగత వివరాలమీద, తరవాతది డ్యూటీ గురించి అడుగుతూ, ఒకనిమిషం అతన్ని పరిశీలించాను—మాట స్పష్టంగా వుంది. చూపు ఖాళీగావుంది.

"మీరు ఐ. పి. ఎస్.కి సెలెక్టయి. అసిస్టెంట్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్‌గా పనిచేస్తూకూడా, కనుచూపు మేరలో మంచి భవిష్యత్తు, అధికారం కనబడుతూ కూడా ఎందుకు రాజీనామా చెయ్యవల సొచ్చిందో అడగొచ్చా?" అన్నాను.

"మీ కంపెనీలో సెక్యూరిటీ ఆఫీసర్ పోస్టుకి నా అర్హతలు పరిశీలిద్దా మని నన్ను ఇంటర్వ్యూ చేస్తున్నారు. అంచేత మీరు ఏ ప్రశ్న అయినా అడ గొచ్చు నన్ను. కానీ, జవాబులు చెప్పాలనిపించకపోతే కొన్ని ప్రశ్నలకి, నేను చెప్పకపోవచ్చు. దానికి మీరేమీ అనుకోరని ఆశిస్తాను."

నేను చిరునవ్వు నవ్వాను. "మీరిక్కడ నియమించబడితే మీ ఉద్యోగ బాధ్యతల సంగతి అలావుంచి, మీరు మా ఆప్తుల్లో, కుటుంబ సభ్యుల్లో ఒకరుగా పరిగణించబడతారు. అలాంటప్పుడు మనమధ్య, జవాబులు చెప్పకూడని ప్రశ్న లంటూ ఉండకూడదుకదా."

అతను కళ్ళు సన్నగాచేసి నవ్వాడు. "చాలా సంతోషం మేడమ్. మీరు మీ కంపెనీ ఉద్యోగులపట్ల చూపే అభిమాన విధానం తెలుసు కొన్నందుకు చాలా సంతోషంగా వుంది——"

ఒక అరనిమిషం అతని కాగితాలు చూస్తూ నిశ్శబ్దంగా ఊరుకున్నాను.

"ఇంకేమైనా అడుగుతారా మేడమ్?" అని లేచాడతను.

నాన్నగారు పోయాక జాల్ట్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టరుగా ఈ కుర్చీలో కూర్చుని వివిధ ఉద్యోగాలకు వందల మందిని ఇంటర్వ్యూ చేశాను.

"ఇహ మీరు వెళ్ళొచ్చు" అని నేననడమే గాని—

"దయచేసి కూర్చోండి. టీ తీసుకెళుదురుగాని— నో. ఎక్కువ సేపు పట్టదు." లోపలి గదిలో మోగే బజర్ నొక్కాను, 'ఆఫ్‌కోర్స్ మిమ్మల్ని చాలాసేపు బయట కూర్చోపెట్టాను. అయినా—' చిరునవ్వు నవ్వాను. 'మీరంత తొందర పనిలో ఉన్నారని నేననుకోవడంలేదు," అన్నాను.

ఖర్చులు పుచ్చుకొని ఇంటర్వ్యూకొచ్చి, నేను పొమ్మనకుండా తనే వెళతానంటాడా, అన్నకసి ఆ మాటతో కొంత తీరింది.

'థాంక్యూ మేడమ్' అని కూర్చున్నాడు తను, కనపడీ కనపడని చిరునవ్వు మొహాన పూసుకుని.

ఒక్క నిమిషం గడిచేలోగా కమల లోపలి గదిలోంచి వస్తున్నట్టు అధునాతనమైన తలుపుగడియ చేసిన మృదువైన చప్పుడు. ఆ వెనకే కమల టీకప్పులతో తెచ్చిన ట్రేని దూరంగా టీపాయ్ మీద పెట్టి, వినయం, నైపుణ్యం, పరిశుభ్రం ఉట్టిపడేట్టుగా, కప్పులు సాసర్లలో టేబిల్ మీదున్న రబ్బరు పలకల మీద పెట్టింది.

"టీ తీసుకోండి" అన్నాను, నా కప్పు అందుకుంటూ.

అతను కప్పు అందుకొంటూ కమల వేపు చూశాడు "బాగున్నావా, డియర్ లోటస్?" అన్నాడతను వొక్కపిల్చి.

"మరేండీ" అంది కమల అతన్ని ఖాళీగా చూస్తూ.

"మా కమల మీకు తెలుసా?"

"ఔను మేడమ్. తనపేరు 'కమల'-కాదు 'కమలం' అనినాకు జ్ఞాపకం. కాని ఆమె నన్ను మరచిపోయినట్టుంది. అంచేత, అదే- తను నన్ను మరిచిపోడమే తనకి ఆరోగ్యం-అంచేత-" చిరునవ్వు నవ్వాడు "ఆ ప్రశ్నకి కూడా నేను సమాధానం చెప్పడంలేదు." అని లేచాడు రవివర్మ. "థాంక్యూ మేడమ్" అని, ఒకసారి 'బౌ' చేసి వెళ్ళిపోయాడతను,

o o o

ఆరాత్రి నాకు భోజనం పెట్టడానికిగాని పళ్ళరసం అందించడానికి గాని కమల నా గదికి రాలేదు.

ఏ మొహం పెట్టుకు వస్తుంది?

సుబ్బనరసయ్యగారు చెప్పిన కథలో అమ్మాయి కమలేనని స్పష్టమై పోయింది.

సరిగ్గా ఏడాదికిందట-

అల్యూమినియం శ్క్రాప్ కొనడం విషయంలో కాంట్రాక్ట్ సంతకం చెయ్యడానికి రాజమండ్రి క్యాంప్ వెళ్ళాను.

అక్కడికి వచ్చాడు; కమలని తీసుకుని. ఆమెని పన్నెండేళ్ళ పాటు పెంచిన వాళ్ళ చిన్నాన్న కరుణాకరంగారు. ఆయన ఒకప్పుడు నాన్నగారి దగ్గర పి.ఏ.గా ఉండేవాడు. 'దీన్నినే నిన్నాళ్ళూ నా పిల్లలతో సమంగా పెంచాను. పి.యు.సి. పాస్ చేయించాను. టైపూ షార్ట్‌హాండూ నేర్పించాను. ఏదైనా ఉద్యోగంలో పడేస్తే కట్నాలూ కానుకలూ లేకండా ఎవడో పెళ్ళాడొచ్చని ఐడియా. కాని నా పలుకుబడితో మావూళ్ళో దీనికి ఉద్యోగం రావడంలేదు. పైగా నా కూతురూ కొడుకూ కూడా ఎదిగి పెళ్ళికీ ఉత్యోగానికీ ఉన్నారు. ఈ సమయంలో వాళ్ళని వెనకపెట్టి దీని సంగతిచూడ్డం ఇంట్లోనూ ఊళ్ళోనూ కూడా కంటకం ఆవుతోంది....అంచేత నీకంపెనీలో దీనికేదో చిన్న వుద్యోగం యిచ్చి పుణ్యంకట్టుకో అమ్మా' అన్నాడు కరుణాకరంగారు, కమలని నాకు అప్పగించి. 'నువ్వు దీనికి క్లర్కు. టైపిస్టు, స్టెనో ఇలాంటి పన్లేం యివ్వ క్కర్లేదు. ఇంటిపనికో వంటపనికో పెట్టుకున్నా చేస్తుంది....ఏమ్మా?' అన్నాడు. కమల సరేనని తలవూపింది. ఆ విధంగా కమలని నా దగ్గర స్వంత నౌకరుగా కుదుర్చుకున్నాను-

ఈ ఏడాది పాటూ ఎక్కడా గోరెత్తి చూపించగల తప్పు చెయ్యకుండా నా వేళలూ అవసరాలూ అభిరుచులూ కనిపెట్టి పని చేస్తూంది....

'బుద్ధొచ్చుంటుంది.......'

మళ్ళీ యివాళ రవివర్మని చూసింది....అతనికి నేను ఉద్యోగం యివ్వ బోడంలేదని దానికి తెలీదు. తెలిశాక, అతనిమీద సానుభూతితో అతని సామీప్యం పోయిందని నా పన్లమీద ఆలక్ష్యం పెంచుకుంటే నాకాసంగతి నిశి షాలమీద తెలిసిపోతుంది. ఈ మాత్రం వుద్యోగం, ఇంతరక్షణ. దానికి దొర కడం అసాధ్యం. ఈ యింట్లో ఇలాంటి నౌకర్లు కొందరు ఇప్పటికే మారేరు. ఇదిపోతే నాకు ఇలాంటిదో దీని బాబులాంటిదో మరొకర్తి వస్తుంది.

అయినా సరే, ఈ క్షణంలో కమల ఏమనుకుంటూందో నాకు తెలి యాలి.......ఒక్కసారి రవి వర్మ మొహం కనబడగానే నన్ను మరిచి

పోయింది....'కమలం'ట, దీని అసలు పేరు!—నాకన్నా వాడికే ఎక్కువ తెలుసు!—ఎక్కడేడుస్తోందో?—ఏడుస్తోందా?

మేడమీది నా గదిలోంచి బయలుదేరి, కిందని వంటగదికి ఆనుకొని వున్న కమల గదికి వెళ్ళాను.,. తలుపు తీసేవుంది.

లైటు ఆర్పేసివుంది. ఫాన్ తిరగటంలేదు.

"కమలా!"

జవాబులేదు.

లోపలికెళ్ళి స్విచ్ వేశాను. లైటు వెలిగింది.

"ఏంటమ్మగారూ?" నా వెనకనుంచి పిలుపు....

వంటావిడ.

ఇటుతిరిగాను.

"కమలేది?"

"ఇప్పుడే అట్లా వెళ్ళిందమ్మా."

హాల్లోకొచ్చి చౌకీదార్ కోసం బెల్ స్విచ్ నొక్కాను. ఒక నిమిషంలో వాడి పెళ్ళాం పరుగెత్తుకొచ్చింది.

"కమలేది?"

"ఆఫీసు కెళ్ళిందమ్మా. ఏవో అర్జంటు కాయితాలు కావాలటగా! ఇంతకు ముందే వెళ్ళింది."

"కారు తీసికెళ్ళిందా?"

లేదని నాకు తెలుసు, డ్రయివరు ఎనిమిది గంటలకే తాళాలు నాకిచ్చి వెళ్ళిపోయాడు.

"లేదమ్మా. నడిచే వెళ్ళింది."

"సరే"

నా వేషం చూసుకున్నాను. బాగానే వుంది. మార్చక్కర్లేదు. గబగబా మేడమీదికెళ్ళి తాళాలు తీసుకున్నాను.

నిజంగా ఆఫీస్ కే వెళ్ళుంటుందా?....

అతను తన అడ్రస్ ఇచ్చివుంటాడేమో. అక్కడికి పోయిందేమో, భ్రష్ట!........

అతనూ కమలా ఇవాళ మళ్లా ఎక్కడ కలుసుకొని వుంటారు? ఫలానా చోట కలుసుకుందాం అని అనుకోడానికి ఇంటర్వ్యూ అయిపోయాక ఎక్కడో కలుసుకోవాలి కదా....అతగాడు ఇంటర్వ్యూ అవగానే టీ తాగి వెళ్ళాడు.... తరవాత? ఈ కమల నాతోనే ఉందికదా!

మెట్లుదిగి కమల రూం వేపు చూశాను. నేను వేసిన లైటు ఇంకా వెలుగుతూనే వుంది. ఆ లైటు ఆర్పడం అవసరంలా నా కాళ్ళు అటు దారి తీశాయి....కొంపదీసి ఈ జెష్ట ఏదైనా అఘాయిత్యం తలపెట్టలేదు కదా—!

అక్కడ, కమల ఉపయోగించే చిన్న టేబిల్ మీద ఒక కాగితం ఉంది!....అమ్మా. అమ్మా!—ఎగిరిపోకుండా కప్పతాళం వుంచింది.

"అమ్మగారికి, నమస్కారం!

"మీరు డి.ఐ.జి.గారిని సాగనంపడానికి వెళ్ళినప్పుడు టేపు రికార్డర్ విన్నాను. రవివర్మగార్ని డి.ఐ.జి.గారు అప్పుడు అనుమానించేరు. ఇప్పుడు అవమానించేరు—

మీకు నిజం తెలిసే అవకాశంలేదు. మీరెంతో గొప్పమనసు కలవారు, అయినా ఒక కన్నెపిల్ల ఒక దుష్టుడి చేతుల్లో మోసపోతూవుంటే సకాలంలో ఆమెని రక్షించి ఇల్లుచేర్చి అందుకు ఫలితంగా తన గొప్ప ఉద్యోగాన్ని పోగొట్టుకున్న ఒక సన్మార్గుడిని తెలుసుకోలేకపోయారు——

అనాడు మద్రాస్ మెయిల్లో సౌందరరాజన్‌గారు, నన్ను సినిమాల్లో జేర్పిస్తానని (అన్నెల్లపాటు ఊదరగొట్టి) మాయ మాటలతో మద్రాస్ ప్రయాణం కట్టించిన జయకరరావును భయపెట్టి తన యింటికి తీసుకువెళ్ళి సురక్షితంగా కాపాడారు—నన్ను తీసుకు వెళ్ళవలసిందని బాబాయిగారికి వ్రాస్తే రాలేదు: సరికదా, జవాబులేదు.

అప్పుడు రవివర్మగారు, సౌందరరాజన్‌గారు బాబాయిగారికి రాసిన ఉత్తరం కాపీ సహాయంతో—స్వంత ఖర్చులమీద మద్రాసు వచ్చి నన్ను తిరిగి తీసుకువెళ్ళి భద్రంగా బాబాయిగారికి వొప్పగించారు. అతను రక్షకుడు. కాని ఆనాడు బాబాయిగారు పిన్నిగారు అన్నమాటలే పోలీసు అధికారులు అన్నారు; అంటున్నారు.

రవివర్మగారు, తన ఉద్యోగం పోకుండా ఉండేటందుకు, నేను ఐదు రోజులపాటు కనిపించలేదని, ఫలాని వ్యక్తిమీద అనుమానం అని రిపోర్టు ఇమ్మని బాబాయిగార్ని ఎన్నో విధాల అడిగారు. రిపోర్టు ఇస్తె పరువు ప్రతిష్టలకు భంగం అనీ, పోలీస్ విచారణల బాధపడలేం అనీ బాబాయిగారు తప్పించుకున్నారు. నేను చెడిపోయానని బంధువుల్లో తామే ప్రచారంచేసి నన్ను మీకు వొప్పగించారు.

విజయవాడ స్టేషన్‌లో సౌందరరాజన్‌గారు మా కంపార్ట్‌మెంటులో ఎక్కడంనుంచి, మీరు ఏడాదికిందట రాజమండ్రి క్యాంపు రావడం వరకు అన్నీ నాకు అదృష్ట సంఘటనలే. సుభాలే.

రవివర్మగారు నన్ను ఆ విధంగా మద్రాసునుంచి తిరిగి తీసుకురాక

పోయివుంటే, సౌందరరాజన్‌గారు నన్ను———సినిమా కంపెనీలకంటె అధమ స్థితిలో వున్న అనాధ శరణాలయం దేంట్లోనో వప్పగించి ఉండేవారు—

రవివర్మగారు ఏతప్పూ చెయ్యకనే శాపంపొందిన దేవుడు. నా మూలంగా ఆయన రెండుసార్లు ఉద్యోగానికి దూరమైనారు.

మీకూ, డి.ఐ.జి.గారికీ రవివర్మగార్ని గురించి జరిగిన సంభాషణ టేప్ ద్వారా విని చాలా దుఃఖపడ్డాను—కాని ఆయనకు నేనే క్షమాపణ చెప్పు కోవాలని అనిపించింది—నా అదృష్టవశాత్తు ఆయన, తనకి కంపెనీ నుంచి రావలసిన ప్రయాణపు ఖర్చులు రాబట్టుకోడానికని ఎకవుంట్ సెక్షన్‌లో వున్నారు. అక్కడ నా ఏడ్పు ఆయనకు వినిపించలేక, రాత్రి ఆఫీస్‌వద్దకు రమ్మన్నాను.

నేనుగాని రవివర్మగారుగాని ఏ తప్పూ చేయలేదు. అయినా మీరు నన్ను ఏమీ అడగరు. డి.ఐ.జి.గారు పెద్దమనిషి. ఆయన చెప్పిన మాటతే నమ్మ్మతారు. నన్ను మీరు గౌరవంగానే చూస్తారు. కాని నేను చెడిపోయాననే భావిస్తారు. ఆ భావం మీలో ఉన్నంత కాలం మీ దగ్గర నేను మనలేను.

కనుక నాకు సెలవిప్పించమని కోరుతున్నాను—

* * *

ఆఫీస్ గేటు దగ్గిర బిత్తరచూపులు చూస్తూ నిలుచుంది కమల. కారు హెడ్‌లైట్లు ఆఫ్‌చేసి, కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా వున్నాను. ఏ టాక్సీలోనో, అతనేవచ్చాడనుకుందో ఏమో, పరుగెత్తు కొచ్చింది.

"అతనింకా రాలేదా?" కిటికీలోంచి తల బైటపెట్టి అడిగాను.

భయంతో వెనక్కి జరిగింది కమల.

కారు దిగాను.

దగ్గిరగా వెళ్ళి కమలని కావిలించుకున్నాను. "నువ్వు నా గదికి రాలేదు. భోజనం పెట్టలేదు. పళ్ళరసం యివ్వలేదు. నాకు నిద్రెలా పడుతుందను కున్నావు కమలా?—పోనీలే—ఉత్తరం రాసి పెట్టావు. లేకపోతే నాకెప్పుడు తెలుస్తుంది. ఎలా తెలుస్తుంది—"

అలా ఏదో మాట్లాడసాగాను.

నా ఉద్దేశం "నీ కథంతా నమ్మాను. నిన్ను క్షమిస్తున్నాను. అదే, ఇవాళంతా నాకు దూరంగా వున్నందుకు. అతను ఒక్కసారే ఉద్యోగానికి దూరమయ్యాడు" అలా ఏదో చెబుదామని.

కాని, నేను అనబోయిన మాటలే తనకి వినిపించినట్టు—

"కమలని కమలం" కౌగిట్లోంచి కాళ్ళమీదికి జారింది.

("సౌమ్య"—మాసపత్రిక-ప్రారంభసంచిక-నవంబర్ 1978)

# తృతీయం

ఆరుమైళ్ళ నాటుతోవన స్కూటర్ మీద తీసుకొచ్చి పాలెం చేర్చారు సూర్యంగారు. ఇక ఇక్కణ్ణించి ఒక బస్సులో తుని వెళ్ళి అక్కణ్ణించి మరో బస్సులో విశాఖపట్నం వెళ్ళాలి. మధ్యాహ్నం మూడు గంటల్లోగా డ్యూటీకి రిపోర్టు కాకపోతే పీకలమీది కొస్తుంది. టైం పదకొండవుతోంది. "స్కూటర్ చేతిలో వుంది గదాని తాత్సారం చేసేసేరు. ఈపాటికి తున్లో ఉంటే మెయిల్ అందేది. హాయిగా రెండు గంటలయ్యేసరికి ఇంటికీ, మూడింటికి డ్యూటీకి వెళ్ళేవాడిని" అని విసుక్కున్నాను. సూర్యంగారు నా వేపు చూడ్డంలేదు. "ఏరా సూరయ్యా ఇక్కడున్నావు?" అని ఎవణ్ణో పలకరిస్తున్నారు. ఎడ్లబండి తోలుకుంటూ పాలెం నుంచి తిరిగిపోతున్నాడు వాడు.

"చిత్తంబాబు. పెద్దయ్యగోర్ని దిగబెట్టొత్తన్నానండి."

"ఏమిటి? కొండబాబు గార్నే?"

"చితంబాబు."

"పాలెంలో ఉన్నారా?"

"మరేనండి, మున్సిబుగారింట కబుర్లాడుత[న్]ను."

"చెప్పవేం!?" అని స్కూటర్ స్టార్టుచేశారు సూర్యంగారు "ఎక్కండి."

"ఎందుకు?"

"చెప్తాగా! మీకు మెయిల్ దాటిపోయిందని బెంగక్కర్లేదు-కార్లో పంపిస్తాను విశాఖపట్నం"

మునసబు గారింట్లోంచి మల్లు పంచె. కళ్ళలాల్చీ. కండువా ధరించిన ఒక పెద్దాయన ఒప్పుడే బయటికొస్తున్నారు. రోడ్డు మీద కారుంది.

"వైజాగేనా, కొండబాబుగారూ?"

"వైజాగే యెళ్ళాలనుకోండి—" అని నసిగాడాయన. "ఏం? వస్తారా?"

"నేను కాదు. మా ఫ్రెండు. వైజాగ్‌లో దింపేద్దురూ."

"నేను డైరెక్టుగా యెళ్ళనండి. తున్లో లేటవుద్ది."

"మీ మిసెస్ కెలా వుంది?"

"బాగలేదట, ఉదయమే కబురొచ్చింది, రమ్మని."

"మరి ఆ లెక్కని తున్లో ఆలస్యమెందుకు? త్వరగా వెళ్ళండి—"

కొండబాబుగారు నవ్వాడు. "మనం యెళ్తే ఒచ్చే ఆపద ఆగిపోద్దేటండి! రాతెలాగుంటే అలా జరుగుద్ది, పైగా అక్కడ అబ్బాయున్నాడుగా."

"పోనీ తునిలో దింపెయ్యండి మా ఫ్రెండుని. మెయిల్ ఏమైనా లేటయితే పట్టుకుంటాడు. మీరు బయల్దేరేలోగా బస్సు దొరికితే యెక్కిపోతాడు. ఇంకా తప్పితే వైజాగ్‌లో దింపెయ్యండి, మీతో తీసుకెళ్ళి."

"ఎక్కువనండి!"

సూర్యంగారు దయతలచి పక్కకి తీసికెళ్ళి చెప్పాడు. లేకపోతే కొండబాబుగారి ధోరణికి కొత్తతో, అసహ్యంతో ఇబ్బంది పడిపోదును—

కొండబాబుగారు రైల్వే కాంట్రాక్టరు. అరవై ఏళ్ళుంటాయి. మూడో పెళ్ళాం విశాఖపట్నం ఆస్పత్రిలో ఉంది. లక్షల మీద ఆస్తి. కొడుకు రత్నరాజని—విశాఖపట్నంలో హార్బరు కాంట్రాక్టులు చేస్తున్నాడు. రత్నరాజ్ చారిటీస్ పేరిట పేదలకి తోడ్పడుతున్నది ఆయనే.

ముందు సీటులో యెక్కాను. సూర్యంగారికి వీడ్కోలు చెప్పి, కారు కదిలింది.

"వైజాగ్‌లో ఏం పనండి?"

వెనక్కి తిరిగి చూశాను. పేపరు అడ్డం ఉంది. కొండబాబుగారికి నాకూ మధ్య. మాట్లాడుతున్నది నాతోనే నని గ్రహించాను.

"జాబ్ చేస్తున్నానండి—"

"అదే—ఎందులోనని అడుగుతున్నాను."

చెప్పాను.

"మంచి ఎండప్పుడు బయలెల్లేరు—"

ఏదో అయిష్టత కనబడుతోంది నేనతనితో ప్రయాణం చెయ్యడంలో అతనికి. కాని తప్పదు ఎలాగో భరించి ఎంతవరకు వీలయితే అంతవరకు అతన్తో వెళ్ళాలి. ఆయన మాటలో ప్రశ్నలేదు. అంచేత మాట్లాడలేదు నేను.

"కారు వైజాగ్ దాకా యెళ్ళదండి."

"పోన్లెండి. మీరెక్కడ దింపేస్తే అక్కడ దిగిపోతాను. అక్కణ్నించి ఎలాగో వెళతాను!" అన్నాను వీలైనంత వినయంగా.

"అలాగెందుకు దిగిపోవాలి? నేను తున్లో ఆగుతాను. అక్కడ దిగిపోదురు గాని." పేపరు చాటునుంచి పొడినవ్వు వినిపించింది.

"సూర్యంగారికీ మీకూ ఏటి పరిచయం?"—"ఎప్పుడొచ్చేరు?"—

"ఎందుకు?"– "అంత టయం ప్రకారం యెళ్ళిపోవాల్సిన వార్ని పొద్దుట పూట స్కూటర్ మీద తునిదాకా దిగబెట్టరాదా?"–"మీకు జీతమెంత?" "పిల్లలెందరు?– "స్వంత యిల్లా అద్దె ఇల్లా?"

ఆరుమైళ్ళు వెళ్ళాలి ఈయనతో.

బ్రాంచిరోడ్డు ట్రంకురోడ్డుని కలిపే దగ్గిర కొండబాబుగారు ఏదో అస్పష్టంగా గొణిగాడు. కారాగింది.

"ఆ వొచ్చేలారీ ఆపు."

డ్రయివర్ దిగాడు లారీ కడ్డంగా చెయ్యి పెట్టాడు. ఆగలేదు.

"ఆ యెనకాల్లారీ గూడా చూడు."

"ఇంక రెండుమైళ్ళే గదండీ ఉంది. తుని!" అన్నాను.

"పావలా పారేస్తే తీసుకుపోతాడు లారీ వోడు."

"అదికాదు నేనన్నది. మీరెలాగా తునిదాకా వస్తారుగా."

"నేనూ లారీలోనే వస్తానయ్యా రంకు మగడా! నిన్నిక్కడొదిలేసి నేను కార్లో యెళ్ళిపోతాననుకున్నావా?"

నిర్ఘాంత పోయాను ఆయన ధోరణికి, అయితే నా భావం ఆయనకి కనబడదు. పేపరు అడ్డం ఉంది.

డ్రయివరు కొద్దిగా కదిలి నాకు కనబడేటట్టు, ఆయనకి కనబడనట్టు వొచ్చాడు. 'దిగు' అన్నట్టు సంజ్ఞ చేసేడు. దిగాను.

ఇద్దరం వున్నాం లారీ ఆపడానికి. మా మాటలు కొండబాబుగారికి వినపడనంత దూరం వెళ్లాం.

రెండో లారీ మరో నిమిషం పోయాక వచ్చింది స్లో చేశాడు. "తుని" అన్నాడు డ్రయివరు. లారీ డ్రయివర్ "ఖాళీ లేదు" అంటూ తొక్కేశాడు.

"ఈ పాటికి తుని చేరేవాళ్ళం?" అన్నాడు కొండబాబుగారి డ్రయివర్.

"ఆయన లారీ ఎక్కుతానంటారేమిటి?" అన్నాను.

"రోజూ యింతేనండి, ఈ జంక్షన్ దగ్గిర. కారు ప్రయాణం–ఇక్కణ్నుంచి పాలెనికి. పాలెంనించి ఇక్కడికేనండి—" అని; గొంతు కొంచెం తగ్గించి "లేకపోతే తున్లో ఎవరో తగిలి కారు అడుగుతారు గదండి–" అన్నాడు డ్రయివర్.

మొత్తం అయిదు లారీలు వెళ్ళిపోయాయి.

కారు హారన్ మోగింది. డ్రయివర్ పరుగెత్తాడు. వెనకసీటు దగ్గిర వొంగాడు. కొండబాబుగారు ఏదో చెప్పాడు, కార్లోనే తునివరకు వెళదాం అని

నిర్ణయం తీసుకొన్నారేమో, నన్ను రమ్మంటారేమో అని చూశాను, కాదు-కార్లో వాళ్ళిద్దరూ వెళ్ళిపోతారేమో అనుకొన్నాను కానేకాదు.

మైలు దూరంలో బస్సు.

మళ్ళీ రెండు నిముషాలు—బస్సు ఆపడానికి ఇద్దరు-

ఆర్. టి. సి. స్టేజికాదు. పైగా వేళ్ళాడుతున్నారు-ఆగలేదు బస్సు.

మళ్ళీ కారు హారన్,

"తుని పోదాం పద."

"ఎస్సార్."

"ఎక్కువయ్యా.... ఏంటి నీ పేరూ!"

తునిలో రైల్వే ఐ. ఓ. డబ్ల్యు. ఆఫీసుకి కొంచెం దూరంలో ఆపాలి అక్కడ ఆయన దిగి పోతారు. కారు నారాయణరాజుగారింటిదగ్గర ఉంచాలి ఆయన వైజాగ్ వెళ్ళి రాత్రి తొమ్మిదిలోగా వచ్చేస్తారు. బస్‌స్టాండ్‌కి డ్రయివర్ రావాలి. ఆయన వస్తే అప్పుడు వెళ్ళి కారు తేవాలి. నిస్పష్టంగా చెప్పారు కొండబాబుగారు.

కారు ఆగిన చోటినుంచి బస్సులు ఆగేచోటు ఫర్లాంగుంది.కొండబాబుగారి దగ్గిర సెలవు పుచ్చుకొని డ్రయివర్‌కి థాంక్స్ చెప్పి నడిచాను. ఇందాక మేం ఆపితే ఆగని బస్సు అక్కడుంది. ఐతే ఖాళీ లేదు. "ఐదు నిమిషాల్లో ఎక్స్‌ప్రెస్ బస్ వుందన్నా"డు కండక్టరు. ఈ బస్సును నక్కపల్లి జంక్షన్ దాటే లోగా తొక్కేస్తుందిట. "అందులో ఖాళీ లేకపోతేనో?" అన్నాను. "ఐతే రండి. ఇందులో అనకాపల్లిదాకా నుంచోవాలి."

కొండబాబుగారు నడిచి వచ్చేరు. ఆయనతోబాటే చేరింది ఎక్స్‌ప్రెస్ బస్సు. జనం దిగుతున్నారు. నేను బస్ తలుపు దగ్గిర చేరాను-ఎక్కటానికి ఫస్టు. "ఆళ్ళంతా కాఫీలకి దిగుతున్నారు-" అంటున్నారు కొండబాబుగారు. "ఒకటే ఖాళీ" అన్నాడు కండక్టరు నా ప్రశ్నకి బదులుగా. "ఖాళీ ఉందిట, ఎక్కండి" అన్నాను కొండబాబుగారితో.అయన భార్య హాస్పిటల్లో ఉండడాన్ని తలుచుకుని. "ఎంత ఛార్జీ! వైజాగ్ కిందులో?" కండక్టరు చెప్పాడు. "అందులో నాలుగు రూపాయలేగా" అంటూ ముందు బస్సు ఎక్కాడాయన ఎక్కడమేమిటి, బస్సు కదిలింది.

సీట్లో సెటిలయ్యాను టైం-పదకొండుంపావు, "టైముందా?" అన్నాను.

"ఎళ్ళిపోదాం. ఫైవ్ మినిట్స్, దిగబాకండి" కండక్టరు జవాబు.

పాయకరావు పేట దాటి రెండు మైళ్ళు వచ్చాం. ముందు బస్సు ఆగి ఉంది. కండక్టరూ డ్రైవరూ ఈ బస్సును ఆపారు.

"బ్రేక్ డౌన్."

"ఇందులో ఖాళీలేదు."

"కొందర్ని తీసుకుపోండి."

"సరే రమ్మను. ఎగస్ట్రా అవుద్ది."

"ఇచ్చేవోళ్ళే వస్తారు."

"త్వరగా రమ్మను. ఇప్పటికి పది నిమిషాలు లేటు!"

"ఎగస్ట్రా కట్టేవారు. అడ్డరోడ్డు ఎలమంచిలి, అనకాపల్లి, వైజాగ్ పాసింజర్లు దిగాల!" అవతలి బస్సు కండక్టరు బిగ్గరగా కేకేశాడు. "సీట్లులెవ్వు నిలబడాలి!....చిన్న చిన్న స్టేజీలవారు ఈ బస్సు ఎక్కబోకండి!"

అంత నిరుత్సాహమైన నిబంధనలకి లోబడి పన్నెండుమంది వొచ్చారు. ఒక పచ్చి బాలింతరాలు బిడ్డతో ఎక్కింది, ఆమె తల్లి కాబోలు, లేకపోతే అత్తగారో-ముసలావిడ-ఎక్కింది - నేనూ నా పక్కనున్నాయనా మొహమొహాలు చూసుకున్నాం. మరుక్షణం నిలబడిపోయాం. వాళ్ళకా సీటువదలి.

కొండబాబుగారు చివరి క్షణంలో ఎక్కారు........"మొత్తానికి రూపాయి పావలా కాజేశావు గదయ్యా" అన్నారు కండక్టరుతో. "భలేవారే, ఇదంతా నేనే మూటగట్టుకు పోతానంటారా?" అని నవ్వాడు కండక్టరు.

బ్రీఫ్‌కేసు ఎక్కడ పెట్టాలా అని బస్సంతా చూశారు కొండబాబుగారు.

అరలు ఖాళీలేవు. నేనే అందుకొని పట్టుకున్నాను-నా పక్కకొచ్చి నుంచున్నాడాయన.

ఎలమంచిలిలో కూడా ఎవ్వరూ దిగలేదు. ఎవర్నీ ఎక్కనివ్వలేదు కండక్టరు.

తాళ్ళపాలెం దాటాక వచ్చిన లెవెల్ క్రాసింగు దగ్గర బస్సాగింది. మద్రాసు వెళ్ళే మెయిల్‌కోసం-గేటు.

అయిదారు మంది దిగారు. అందులో ఒక దగ్గిర కూర్చోమని సంజ్ఞ చేశాను కొండబాబుగారికి. "ఆళ్ళు మళ్ళీ వస్తారు."

"ఒస్తే రానివ్వండి. మీరు పెద్దవారు. సర్దుకోమని రిక్వెస్టు చేద్దాం."

ఆయన మొహం తిప్పేశాడు. మెయిల్‌ని గమనించేవాడిలాగా.

అందరూ బిలబిలమంటూ దూరేశారు.

అనకాపల్లిలో ముందున్న లేడీస్ సీటు ఖాళీ అయింది. కాని ముగ్గురు ఆడవాళ్ళు పకచకా ఎక్కి సర్దుకున్నారక్కడ.

అగనంపూడి దాటాక నామీద ఏదో బరువు వాల్తున్నట్టు స్ఫురించి.దృష్టిని కిటికిలోంచి బస్సులోకి తిప్పాను. కొండబాబు గారు స్ట్రాప్ వదిలేసి కూలబడి పోయారు.

"ఆపాలి, ఆపాలి" అరిచాను.

"అయ్యో ముసలాయన!"-"నీళ్ళు జల్లండి"-"పల్స్ చెక్ చెయ్యండి"-"ఆయన తాలూకెవరూ లేరా?"-సీటు ఖాళీ చెయ్యండయ్యా బాబూ, ఏం మను షులు!" - "ఏం ప్రమాదంలేదు. హి ఈజ్ ఆల్‌రైట్. కొంచెం నీర్సం అంతే-"

అయన్ని కూర్చోపెట్టారు. మళ్ళీ ఏమీ అనకుండా ఆయన్ని చూస్తుండే బాధ్యత తీసుకోడానికి గాను నాకూ్కడా సీటు.

గాజువాక దాటేక కళ్లు తెరిచాడు. "కొండబాబుగారూ! ఎలా వుంది?"

ఆయన రెప్ప అల్లార్చాడు. అంతే. మళ్ళా నామీద వాలిపోయాడు.

కుడిచెయ్యి పైకెత్తి వాసన చూశాను. ఈ పూట ఫోంచేసినట్టులేదు.

చావులమదుం జంక్షన్ దగ్గిర పదిహేను మంది దాకా దిగిపోయారు. కొండబాబుగార్ని మూడు ప్లేసుల సీటులో పడుకోబెట్టి నేనూ దిగాను. కంపెనీ బస్సు కలిసే టైం. "అదుగో!"....పరుగెత్తాను. బస్సాపి, కనబడ్డ సహోద్యో యుల్లో నా వేపు చూసినవాడికి చెప్పాను. "మా అంకుల్ ఒకరు ఆ బస్సులో ఫెయింటయియ్యారు.ఆయన్ని హాస్పిటల్‌కి తీసికెళ్ళాలి.ఎస్. ఇ. తో చెప్పండి. ఇంటికి ఫోన్‌చేస్తే తరవాతి షిఫ్టుకి రాగలను-అక్కర్లేకపోతే లీవ్ గ్రాంట్ చెయ్యమనండి."

"ఓకే ఓకే-కేరీ ఆన్;"

అక్కడే ఆటో దొరికింది. కండక్టర్ సాయం చేశాడు.

కాజువాల్టీ ఓ, పీ. లో ఉమాపతి వున్నాడు-వెంటనే చూశాడు.

"నథింగ్ టు వర్రీ."

"అసలేమైంది?" అన్నాను. హార్ట్ ఎటాకేమోనని అనుమానం తగిలి.

"అది నువ్వు చెప్పాలి!" అన్నాడు ఉమాపతి. లెంపకాయ కొట్టినట్టు.

చెప్పవలసినంత చెప్పాను. కొండబాబుగార్ని బెడ్‌మీద సెటిల్ చేశారు. "నేను బయటికెళ్ళి వీళ్ళబ్బాయికి ఫోన్‌చేస్తాను" అన్నాను.

అప్పుడే వొచ్చాడు డాక్టర్ నరసింహారావు. "ఇదేటీ? కొండబాబుగారే! ఏమైంది రా యీనికి?"

"ఫెయింటయ్యారండి" అన్నాను.

వెంటనే ఫోన్ తీసి హాస్పిటల్లోనే ఒక నెంబరు చెప్పాడు. "ఆఁ చూడూ, మేరీయా? నేను డాక్టరు నరసింహారావుని. కాజువాల్టీనుంచి మాట్లాడుతున్నాను. అక్కడ సీతాయమ్మగారని పేషంటు-స్పెషల్ రూం. ఆరో నెంబరు, అక్కడ పోర్టు కంట్రాక్టరు రత్నరాజుగారుంటారు. అర్జంటుగా యిక్కడికి పంపించు. హాలో?"

బతికించారు.

"మీరు తీసుకొచ్చేరా?"

"ఔనండి. బస్సులో వొచ్చాం. తున్నించి"

కారేమైంది?....తున్లో వదిలేశారా?" నవ్వాడు. "ఆవిణ్ని చూడ్డానికి బయ ల్దేరి వుంటాడు....వారంనాడు కబురుచేశాం!"

"ఆవిడకెలా వుంది?"

"రికవర్ అయిపోయింది....లక్కీ వుమన్" ఉమాపతి వేపు తిరిగి నవ్వాడు.

"అదృష్టం ఆవిడదికాదు...." ఉమాపతి వెకిలిగా నవ్వాడు. "ప్రొఫెసర్ నారాయణమూర్తిది" అంటూ, ముసలాడు వింటున్నాడా అన్నట్టు అను మానంగా చూశాడు. లేదని రూఢి చేసుకున్నట్టున్నాడు - "రెండుసార్లు ఫారిన్ పంపింది...."

"చిన్నప్పుడు, గురువుగారాయె. మరి!" నరసింహారావు నవ్వాడు.

"చిన్నప్పుడా యిప్పుడా?" ఉమాపతి నవ్వు వెకిలిగా వుంది. "అయినా ఆవిడ ఏమంత పెద్దదై పోయిందని! గట్టిగా ముప్ఫయ్యేళ్ళుండవు!"

నేను గొంతు సవరించుకున్నాను. "నేనెళ్లొచ్చాండి?" అన్నాను.

"వెళ్ళండి. రత్నరాజుగారొస్తారుగా ఫర్లేదు!"

నాలుగు రోజుల తర్వాత పేపర్లో 'ప్రముఖ కాంట్రాక్టర్ కొండబాబు హృద్రోగంతో మృతి'-అన్న ఐటమ్ పేపర్లో చదివాను. "దానము భోగము నెరుగని దీనుని ధనమునకు గతి తృతీయమెపొసగున్" అన్న పద్యం గుర్తొచ్చింది——

***

("జ్యోతి" మాసపత్రిక; దీపావళి 1967)

# పెళ్ళాన్ని ప్రేమించు

హఠాత్తుగా నరసింహం భార్య తలుపు తోసుకొని చకచకా లోపలి కొచ్చింది. దాంతో అతను చేతిలో వున్న పేకముక్కల్ని అలా పడేసి, తన ముందున్న చిల్లర డబ్బుల్ని ఏరుకొని జేబులో పోసుకున్నాడు. 'ఒస్తానర్రా. పనుంది' అనైనా చెప్పకుండా (పైగా సిగ్గులేక ముసి ముసి నవ్వొహటి మొగాన పోసుగుని) వెళ్ళిపోయేడు. అతనేమీ చెప్పకపోతే పోయేడుగాని, మిగతా నలుగురం ఎందుకు మాట్లాడలేకుండా అయిపోవాలని అనిపించినట్టుంది. 'అరె!' అన్నాను. రంగారావు నా చెయ్యి నొక్కాడు. నేనేదో తొందరపడి నరసింహాన్నో అతని భార్యనో ఏదేనా అంటానని గాబోలు రంగారావు భయం. రంగారావనుకున్నది రైటే. నేను 'అరె' అంటున్నప్పటికి ఆవిడ చీరచెంగు ఇంకా గదిలోనే ఉంది. ఆవిడ తటాలున ఇటు చూసి 'ఎవరు అరే అన్నది?' అన్నట్టు మొహం పైకెత్తి 'మీ మొహం. మీలో సమాధానం చెప్పేధైర్యం ఉన్న వాళ్ళున్నారా?' అన్నట్టు తలెగరేసి నిర్లక్ష్యంగా వెళ్ళిపోయింది.

'ఛ! పెళ్ళి చేసుకోకూడదండీ!' అన్నాడు మల్లిక్ తన ముక్కలు కింద బోర్లాపడేసి. 'లేకపోతే ఏమిటీ న్యూసెన్సు? మనం చేస్తున్నపని సుమతీశతకంలో లేదుగదా అని—ఈ మాత్రం చిల్లర డబ్బుల చీట్లాటకే ఆ సత్యభామగారు అంత యిదై పోవాలా?' అని 'ముఖ పూర్వకంగా' వాపోయాడు.

'వాళ్ళ సంసారానికి ఇతగాడు ఓడిపోతున్న చిల్లరడబ్బులేగొప్పేమో నోయ్. అందులోనూ ఎప్పుడూ మనవాడిది లెదరు హాండాయెను. మనం పంచితే వాడికి పడదు. వాడు పంచితే ఎవడికీ పడదు—ఎందుకు పోనిస్తూగొడవ?' అన్నాను.

'ఏమన్నా అనండి గురువుగారూ. జీవితంలో ప్రతిక్షణం ఈ పెళ్ళానికి భయపడి నర్సింహం ఎంతకాలం కాపరం చెయ్యగలడు?' అన్నాడు మల్లిక్.

'పెళ్ళానికి భయపడి కాదోయ్— పెళ్ళాన్ని ప్రేమించి!' అన్నాడు రంగారావు.

'ఆ. ఇహ అడిగినట్టే. ప్రేమించడానికి ఈ మహాంకాళే దొరికిందా! పెళ్ళామైతే ఆశేపోయెను—ఈమె నుంచి స్వేచ్ఛ పొందటం నరిసింహం కనీస కర్తవ్యం.'

'అబ్బబ్బా-అది కాదయ్యా.ఇందులో శరీర స్పర్శలూ, పర స్త్రీ చైతన్యం సవతుల మధ్య అసూయ ఇన్నోటి లేవయ్యా కుర్రాడా. ఇతను పేకాట ఆడు తున్నాడని—ఓడిపోకపోయినాసరే—ఆవిడి మనస్సులో బాధపడుతున్నాదనుకో. ఆ బాధ ఆవిడికి లేకుండా చెయ్యడం కూడా ఆవిడిని ప్రేమించడమే అంటా న్నేను—, అన్నాడు రంగారావు.

నాకు థీరీలమీద నమ్మకం తక్కువ. ఏదెలా జరిగిపోతే దాన్నలాగే తీసు కుంటాను. ఏదో జరగడం, దానికి అర్థం చెప్పడంకోసం వెనక్కెళ్ళి, యింకా వెనక్కెళ్ళి ఆ వ్యక్తి చిన్నతనంలో ఎలాంటి వాతావరణంలో పెరిగాడో ఏ ఆయా దగ్గర ఏ పాలు తాగేశాడో ఆరా తీసేసి "అల్లా చెప్పూమరి! అందుకే యిదీ!" అని అరచెయ్యి వెనక్కి విరిచే శ్రీకృష్ణుళ్ళంటే నాకు భయం,

"ఆహా! ఏమి సమర్థన! దీని ప్రకారం ఇంకో స్త్రీతో సంబంధం వుండీ కూడా పెళ్ళాన్ని ప్రేమించడం సాధ్యమేకద! అంత మర్యాదగా లేదేమోనండి," అని రంగారావును వెక్కిరించాను.

"రమాకాంతం మేష్టారు మాట్లాడ్డంలేదు. ఆయనేదంటే దాంతో నేనేకీభ విస్తాను. అంటే అఫ్‌కోర్స్ పాలిసీ మేటర్స్ కాదనుకోండి—ఈ నరిసింహం సత్యభామగారు; అంతవరకూ సుమండీ" అని మల్లిక్ బాసిపట్టు వేసుక్కూర్చు న్నాడు.

రమాకాంతం చిరునవ్వు నవ్వాడు. సిగరెట్ నుసి దులిపి చిరుహాసాన్ని చిద్విలాసంగా చేసి "నేనూ పెళ్ళాన్ని ప్రేమించే వాళ్ళలోకే ఒస్తానోయ్" అన్నాడు.

"అయితే మరి నే వెళ్ళొస్తానోయ్. మీ అందరూ పెళ్ళాలున్న వాళ్ళు. వీలయితే ఇక్కణ్నుంచే వాళ్ళని ప్రేమించుకోండి" అని మల్లిక్, కష్టపడి వేసు కున్న బాసింపట్టు విప్పేసి లేవబోయాడు.

రమాకాంతం మందహాసంతో ఏదో ఉపన్యాసం ఇచ్చే ధోరణి కనబడు తోంది. కనీసం ఓ వృత్తాంతమైనా చెప్పక పోతాడా అని ఆశగా ఉంది. ముఖ్య మైన ఆడియన్స్ మల్లిక్. అతను వెళ్ళిపోతే మేమంతా మల్లిక్ చెప్పినట్టు ముగ్గురం ఒకే సెక్ట్. రక్తిగట్టదు. అంచేత అతన్ని జెబ్బపట్టుకు కూచో బెట్టేను.

"పెళ్ళాన్ని ప్రేమించడం సంగతుంది చూశావూ! దానిలో ఒక చిన్న తికమకుందోయ్. ఇతరుల దగ్గిర ఏది శృంగారమో ఏది బూతో స్పష్టంగా చెప్పగలం; ఏర్పాటుగా వేరు చేసుకొని అవసరమైనంత వరకూ ప్రవర్తించ గలం, భార్య దగ్గర కొచ్చేటప్పటికి వాటిమధ్య తేడా పెంట్రుకవాసంత అయి పోయి విడదీసుకోలేక రెండూ కలగాపులగం చేసేస్తాం."

"ఏమిటో, అంతా మీ బైనామియల్ థియరమ్‌లా గొడవగా ఉంది మేష్టారూ!" అన్నాడు మల్లిక్ తల గోక్కుని.

"నాకూ మొదట్లో అట్లాగే ఉండేది; శాపమో వరమో గాని, అప్పట్లో నా కొచ్చిన అపర్ట్యూనిటీస్ రంగారావుకొస్తే శత-మానం దాటి వుండేవాడేమో!"

మల్లిక్ 'శత-మానా'నికి నవ్వాడు. "అయితే, గురువుగారు, శీలమే కాపాడుకున్నానంటారా. మానం కూడానా?"

అందులో వెటకారం రమాకాంతానికి తగిలినా అతను చెక్కు చెదరలేదు. "మానం కాపాడుకోవలిసే ఒచ్చిందోయ్, ఎప్పుడూకూడానూ, ఒకనాడు, దీనమ్మా సిగాతరగా, మూడు పరీక్షలు వొక్కరోజునే తగలడ్డాయయ్యా."

"మూడా? — అంటే ముగ్గురమ్మాయిలు వొకరోజునే వలచానండీ అంటూ తగులుకున్నా రేమిటి, కొంతదీసి?—సారీ - తటస్థ పడ్డారేమిటి?" అన్నాడు మల్లిక్ కవ్వించడాని కన్నట్టు.

'ఎబ్ సర్డ్!' అన్నాడు రంగారావు అసూయ ధ్వనించే కంఠంతో. పైగా నా వేపు చూసి నన్ను తనకి మద్దత్తుండమని తనతోబాటుగా నన్నూ అసూయ పడమని తలెగరేశాడు.

నాకేం వొరుగుతుంది ?

సరే. ఏవరు చెప్పమని వొత్తిడి చేస్తేనేం; చెబుతున్నప్పుడు ఎవరు అడ్డు తగిల్తేనేం; ఆ తరువాత రమాకాంతం చెప్పిన కథ యిదీ.

* * *

1961 నాటిమాట—అప్పట్లో బెజవాళ్ళో ఏదోదిక్కుమాలిన హైస్కూల్లో ఫస్టు అసిస్టెంటుద్యోగం వెలిగిస్తున్నానన్నమాట. హఠాత్తుగా ఓ రోజున ఆ స్కూల్ హెడ్మాస్టరు పూర్తిగా దిక్కుమాలినవాడై దేవుడి దగ్గిరి కెళ్ళిపోయేడు. నేనేగదా తరవాత హెడ్మాస్టరు గావలసినవాణ్ని అని నేను యిదవుతూ వుండ గానే ఆ ప్రాంతంలో కొంచెం దన్నున్న మేష్టారింకొహాయన, ఈ ఫస్టు అసి

స్టెంటుగారు, నే నుండగా, ఫలానా పరీక్ష ప్యాసుకాకుండా హెడ్మాష్టరెలా అవు డంటూ పై అధికార్లకి కాయితాలు పంపేడు, దాంతో అతని మొర తక్షణం వినకపోయినా, నాకు ఓ తాఖీదు పంపేరు. 'గబుక్కున పరీక్ష ప్యాసవుతావా, లేకపోతే దించేసుంటావా? అని,

అందుకు, వెళ్ళేనన్నమాట; గుంటూరు, మొదటి పరీక్షకి. వింటున్నావా. రంగారావ్?

సరే, పొద్దున్న పరీక్ష రాశాను, ఒకళ్ళో ఇద్దరో ఫ్రెండ్స్ వున్నారు చూడ్డానికి. ఎండలో ఏం వెళతానని నిద్దర్లేచాక చూసుకుందామని హోటల్లో తీసు కున్న రూమ్‌లో పడుకున్నానన్న మాట.

తలుపు దబదబా కొడుతున్నట్టొచ్చిన కలతో తెలివొచ్చింది....కలగాదు. ఎవరో నిజంగానే తలుపు కొడుతున్నారు. ముందుగా 'ఒస్తున్నా' అని కేకేసి కిటికీ తలుపు తెరిచేను. ఎండ!

వాచీ చూసుకున్నాను, మూడున్నర! నాలుగైనా లేదు,ఆరైనా లేదు;రాత్రి పదైనా కొన్ని వూళ్ళలో గాడ్పు తగ్గదసలు.

వడగాలి కెరటం తగిలి మొహం మండి ఎవరో అనవసరంగా తిట్టినట్ట యింది. భయంతో కిటికీ మూసేను, ఇంత ఎండా మరిచి నేన్నిద్దరపోతూవుంటే బంగార్లాటి నిద్ర పాడుచేసి దీన్ని జ్ఞాపకం చెయ్యడానికి పనిగట్టుకుని ఇంత ఎండలోనూకష్టపడి ఇంతదూరంవొచ్చిన మహానుభావులు.(పాపాత్ములు)ఎవరో? క్షణంసేపు విసుక్కున్నాను. బహుశా ఆ క్షణమే మంచంమీంచి చురుగ్గా వొక్క గెంతు గెంతి తలుపు తెరిచేను.

రమాదేవి !

వెనక్కి తిరిగిపోయాను. బహుశా; నా కావిడతో వున్న పరిచయం, స్నేహం, ఆవిడకి నా నిద్దర మొహం ఫస్టు హేండ్‌గా చూపెట్టడాని కంగీకరించ లేదనుకుంటాను. అనుబంధ తటాకపు ఆఖరు సోపానం దిగేవరకూ అసలు స్వరూపం చూపించడానికి బుద్ధి పుట్టదు కాబోలు, మరి ఇంత ఎండలోనూ తిరి గొచ్చికూడా ఆవిడ అప్పుడే విడిన మల్లెపువ్వులా ఫ్రెష్‌గా వుండగలగడంలో రహస్యం ఏమిటో!

'రహస్యం ఏముందీ! నేను దినమూ లక్స్ టాయిలెట్ సోపునే వాడు దును. అది మీకు కూడా' అంటుందేమో. హతోస్మి. ఆవిడ సుప్రసన్నంగా

వుండడానికి చేసిన స్వల్పదరహాసంలో కూడా ఆవిడ ముక్కు సంపంగిలాగా బుగ్గలు గులాబీల్లాగా వింతగా ప్రకాశించి పరిమళించేయి.

భళిరా, ఈమె సౌందర్యం ! నాటికి నేటికీ; అరగదియ్యని నబ్బుబిళ్ళలా నున్నగా గట్టిగా వుండి పోయిందే, ఈ రమాదేవి ! అనిపించింది—

తువాలు అందుకుని మొహం ఆవిడ వేపు తిప్పీతిప్పీనట్టు పెట్టి 'కూచోండి వొస్తాను' అని బాత్రూమ్‌లోకి వెళ్ళేను.

మొహం కడుక్కున్నాను. పంపులోంచి పడే నీళ్ళు నిర్దాక్షిణ్యంగా వేడిగా వున్నాయి. కర్మకాండ ముగించి అద్దంలో చూసుకున్నాను. నిద్రమీద పొంగి నిండుగా కనబడుతున్న మొహం ఎండకి రక్తమంతా పోసుకుని పడుచు వాడి కోరికలా ఎర్రగా కఠినంగా వుంది. కళ్ళు చిన్నవై సన్నవై పోయాయి ఛా; యిలాంటప్పు డొచ్చిం దేమిటీ రమాదేవి ! కొంచెం పొద్దుపోయాక; పోనీ వాలేక రారాదూ!

గదిలో అడుగు పెట్టేను; రమాదేవి మాట్లాడ్డం మొదలు పెట్టింది. నేను దువ్వెన తీసి అద్దం దగ్గరికెళ్ళిపోయి చెరిగిన క్రాపు సరిచేసుకుంటూ చెదిరిన ఆలోచనల్ని కూడగట్టుకుంటూ రమాదేవిని నా ఆలోచనా పరిధిలో బిగించు కుంటున్నాను.

'వచ్చేననుకోండి; మీ రూమ్ కనుక్కుందికీ !....వసంత విహార్లు ఈ వూళ్ళో మూడున్నాయట. నాకేం తెలుసు? రిక్షాఎక్కి వసంత విహారుకి తీసికెళ్ళ మంటే ముందిక్కడికే తీసుకు రాకూడదూ, చచ్చినాడు ! ఆ రైలుస్టేషన్ దగ్గిర కాఫీ హోటలుకి తగలడ్డాడు. ఒరే నాయనా, నేను వసంతవిహార్ లాడ్జింగ్ హౌసుకి వెళ్ళాలి; అంచేత శాకాహార భోజన – ఫలహార–విశ్రాంతి–శాలకి–తీసి కెళ్ళరా అని చెప్పేను. అక్కణ్ణించి సరేనమ్మా అంటూ కొత్తపేటో, వాడి మొహం పేటో!....అక్కడికి లాక్కెళ్ళేడు. తీరా మోసి కనుక్కునేసరికి అది లాడ్జింగేగాని మాంసాహార భోజనశాలట....మీ సంగతి నాకు బాగా తెలుసుగా; మొదట్నించీ ఒక మాట – ఒద్దన్నమాట; ఒక కూర – వంకాయ వేపుడు కూర, ఒక బాణం 'నువ్వు చాలా మంచి' బాణం కదా! — అప్పుడు ఆ హోటలతను ఆడకూతుర్ని ఎండలో ఇంతసేపు తిప్పుతావా అని గట్టిగా నాలుగు చీవాట్లు పెట్టేసరికి ఇక్కడికి లాక్కొచ్చేడు. ఎండలో ఇంతదూరం తిప్పి చంపినందుకు మీ దగ్గిర రిక్షాడబ్బులు వసూలు చెయ్యాలివాళ.'

నేను నవ్వుకుంటూ "పోన్లెండి ఇస్తాను. మహా అయితే రూపాయిన్నరో రెండో యిచ్చుంటారు" అన్నాను.

"చాల్చాల్లెండి సరసం .... ఏమిటండీ యింకా నిద్దరే పోతున్నారా?"

అప్పటికి నా పొరపాటు తెలిసింది,....

ఆరేళ్ళయింది రమాదేవీ నేనూ ఆ రోజున కలుసుకొని. అక్కడ ఆ గుంటూర్లో అలా మళ్ళీ కలుస్తామని అనుకోలేదు. ఆ మాట కొస్తే అసలు విడి పోతామనే ఎవ్వరూ అనుకోలేదు,

ముందు రోజునే హోటల్లో రూమ్ తీసుకొని సాయంత్రం గవర్నమెంట్ వుమెన్స్ కాలేజీకి వెళ్ళి నా నెంబరు ఏ హాల్లో ఏ బెంచీమీద వేసేరో చూసు కున్నానుగా, వెస్టు గ్యాలరీలో కిందినుంచి మూడో వరసలో మధ్యన వేసేరు నన్ను. పరీక్ష తొమ్మిది గంటలకిట. ఏ పరీక్షకైనా పావుగంట ముందుండడమే నాకు అలవాటు. ఎనిమిదిమ్ముప్పావుకే సీట్లో చేరేను. అటూ యిటూ ఎవరూ రాలేదు. పైకి కిందికీ చూసేను. గేలరీలో పైన ఆఖరువరసలో నించుని నవ్వుతూ విష్ చేసేడు కామేశ్వర్రావు. అతనూ నేనూ విజయనగరంలో క్లాస్ మేట్సుం. అతనూ ఈ గుంటూర్లోనే ఎలా తటస్థపడ్డాడా అని ఆశ్చర్య పడుతూనే వున్నాను: ఇంతలోనే కిందినుంచి వెయ్యిరకాల పువ్వుల కలగలుపు గుబాళింపుతో వొచ్చే సింది రమాదేవి. 'మళ్ళా మీ పక్కనే నండోయ్, నేను!' అన్నాది, పలకరింపు లోనే చిలిపినవ్వు వొలక బోసుకుని.

నా నోటి మీదుగా 'అరె!' అన్న రెండక్షరాలూ ఆక్షణం వినీ, నామొహం మీద- ముఖ్యంగా ఎక్కువ తెరుచుకున్న నా రెండు కళ్ళమీద; చూపు నిలిపి కామేశ్వర్రావు గమనిస్తున్నట్టున్నా, 'ఏమిటీ అదృష్టం!....మళ్ళీ ఇన్నాళ్ళకి- ఇన్నేళ్ళకి' అన్నాను.

'ఆఁ ఆఁ - ఆగండి, పూర్తి చెయ్యకండి, పళ్ళూడిన ముసలిది కుచ్చిళ్ళను సవరించుకొంట అనొస్తుంది కదూ, దాం తరవాత? అమ్మబాబోయ్ అది నామీద ప్రయోగించకండి' అని పకపకా నవ్వేసి, 'నిజానికి అదృష్టం నాది కదండీ-' అన్నది రమాదేవి.

కామేశ్వర్రావు దగ్గిరగావొచ్చి చేతులు కలిపి పలకరించి, "నా ఆశ నెరవేరేనా యింక!" అన్నాడు,

"ఏమిట్రా నీ ఆశ?"

"మరేమీలేదు, ఆ ఇన్విజిలేషన్‌కి వొచ్చే అతను మనకి తెలిసినవాడే కదా; హాయిగా నిన్ను నా పక్కకో నన్ను నీ పక్కకో మార్పించుకుందామను కున్నాను. ఈవిడ పక్క చేరాక ఇంక నువ్వొప్పుకుంటావా!" అన్నాడు.

"అయినా కామేశ్వర్రావూ! నీ వెర్రిగానీ, ఇన్విజిలేషన్ కొచ్చే అతను తెలిసినవాడైనప్పుడు ఇంక నా ప్రమేయం దేనికిరా! నువ్వెక్కడున్నా గుప్పెడు తెచ్చుకోగలవు! (మార్కులు) అసలు వొడ్డించేవాడు మనవాడైతే కొసవరసలో కదా కూర్చోవాలి; సరే, సరిపోయింది! నిన్నెలాగూ గేలరీ చివర్ని వెయ్యనే వేసేరు!"

"పోన్లేరా!—— ఏమి, రమాదేవిగారూ; నమస్కారం! జ్ఞాపకం వున్నామా?"

సరే; పరీక్షల్లో నా పక్కన కూచున్న వాళ్ళెన్నడూ చెడిపోలేదు. అప్పుడూ అప్పుడూ రమాదేవికి నోటితోనూ పుస్తకాల్లో గుర్తులు పెట్టీ కాపీ లందిస్తూ మూడు గంటలూ కూర్చుని రాశాను. నా మాటలు సరిగ్గా అర్థంగాక, పుస్తకాల్లో గుర్తులు ఎక్కణ్ణించెక్కడికో అర్థంగాక రమాదేవి స్వంత పైత్యం కొంత జతచేసి రాసినట్టుంది. "మధ్యాహ్నం మీరుంటే మీ రూమ్‌కొచ్చి పేపర్లు వాల్యూ చేయించుకోవాలండీ-మీ అడ్రస్ చెప్పండి...." అన్నాది రమాదేవి. నేనేదో యాదాలాపంగా, ఒస్తుందా ఏమిట్లే అన్నట్టుగా వసంతవిహారు, రూమ్ నెంబరు ఆరు అని చెప్పేను. అప్పుడావిడ అంతమందిలోనూ పకపకా నవ్వేసి ఏమిటండీ మీ పరధ్యానం! నే నొస్తానంటే అయ్యో మీర్రావడమేమిటి నేనే వొస్తాను; మీ ఎడ్రసివ్వమని మాటవరసకైనా అన్నారుగాదు!" అని; "సరే లెండి; మా చుట్టాలింటికి మీర్రావడం దేనికి; మీ హోటలుకే నేనొస్తాను!" అన్నది.

ఇప్పుడిలా ఇంత ఎండలో ఆవిడ అన్ని వీధులూ తిరిగి తిరిగి వస్తే ఆవిడిని నిలబెట్టి మాట్లాడించడమే కాక పోనీలే రిక్షాడబ్బులు ఇచ్చేస్తాననడం ఆవిడికి కష్టంగానే వుంటుంది మరి.

"సారీ మిస్ రమాదేవీ! మిమ్మల్ని చాలా శ్రమపెట్టేను.... అయినా అంత ఎండకన్నా ఎరురనట్టి రాచముద్దుల గుమ్మవి కాదుగదా" అని నేనూ పెంకెతనంగా నవ్వి "ఒస్తానుండండి. మంచి కూల్డ్రింక్ ఆర్డరిస్తాను. అంత మంచివి కావనుకోండి; ఏదో-మనం వెళ్ళక్కర్లేకుండా ఒస్తాయి" అని గది లోంచి ఇవతలి కొచ్చేను. వరండాలో ఎవ్వరూలేరు. చకచకా మెట్లుదిగి కింద

కొచ్చి ఆర్డర్ చేసి పైకి వెళ్ళేసరికి రమాదేవి మంచంమీద మఠంవేసుకు కూచుని నా పిక్టోరియల్ డైరీ తీసి చూస్తోంది.

అది కొనుక్కోడం పొరపాటేనని ఆ సంవత్సరానికి నూటడెభై ఒకటో సారి అనుకున్నాను. రోజూ అది రాయడం కోసం నేను పెట్లోంచితీసి పైన పెట్టకా తప్పదు; ఎవరొస్తే వాళ్ళు దాన్ని బొమ్మలకోసం అనేమిషతో చూడకా తప్పదు. బొమ్మలు చూసేవాళ్ళు ఆ పక్కనే రాసున్నది చదవరని నమ్మక మేమిటి!

"బొమ్మలు బావున్నాయండీ! గవర్నమెంటు పబ్లికేషనా వుందే!" అని తాను చూస్తున్న పేజీ (జూన్ 20) నుంచి అరడజను పేజీలు ఒక్కసారిగా తిప్పేసింది. ఇహ నేనే ఆరోపణ చేసినా చెల్లదన్నమాట.

"రాసిందింతా బావుంటుంది. చూశ్శేక పోయారా?" అన్నాను. రాసిన రాత విషయం ఆవిడికి జ్ఞాపకం చెయ్యడం ద్వారా తాను చదివిందీ లేందీ వంకర టింకరగా కనుక్కుందామని గాబోలు.

"రాసిందేమోగాని, మీరాత బావుందండీ" అని పుస్తకం నేను తీసు కుంటానేమో అన్నట్టు ముందుకి వంగి కూర్చుంది. అ కూరోడంలో ఆమె శరీరంలోని చిలిపి వంపులు కనబడి కళ్ళూ మనసూ పని చెయ్యడంలో నా నోరు మూతపడింది.

జూన్ 20; ఆ రోజు పొద్దున్న పరీక్ష నుంచి రాగానే రాశాను. ఆ డైరీలో ఒక్కొక్క పేజీలో ఏడురోజుల సంఘటనలు ఇమడ్చాలి. నిజానికి ప్రతిరోజూ డైరీలో రాసుకోవలసినంత విశేషం ఏమీ జరగదు. ఏదేనా జరి గింది రాసుకోవాలంటే పేజీలో ఏడోవంతు ఎక్కడేనా సరిపోతుందా? రాయవల సిందేమీ జరక్క కొన్ని నెలలు ఖాళీగా వుండిపోతాయి. కాని రాసే రోజొస్తే వారాలు వారాలు నిండిపోతాయి.

జూన్ 20. అని వున్నచోట మొదలు పెట్టి రాసింది నాలుగు పేజీలు ఆక్రమించుకుంది. చాలాకాలం తరవాత రమాదేవి పునర్దర్శనం అదృష్టం నాదని నేనంటే తమదని ఆమె అంది. ఒక్కసారి, పాతరోజులు—రాజ మండ్రిలో మేం బియ్యేడీ చదవడం; మేమిద్దరం గోదావరి గట్లంట్ల షికార్లు; ఇంగ్లీషు సినిమాల కెళ్ళిపోడాలూ, ఆదివారాలు యిద్దరం కలిసి ఏ బొబ్బర్లంకకో, అమలాపురానికో, కొవ్వూరికో మాయమైపోతూ వుండడం; మా విహారాలనీ,

వ్యవహారాల్ని మనస్ఫూర్తిగా ఆమోదించి ప్రోత్సహించే రాజుగారూ వారి ధాన్యం మిల్లూ—అన్నీ జ్ఞాపకం వచ్చాయి.

అప్పట్లో ఒక చిత్రమైన సంఘర్షణలో పడ్డాను. అది సంఘర్షణ అనే సంగతి నాకు తెలియక ఒక తమాషా అయిన మనస్తత్వంలో పడిపోయాను. అదెలాటిదంటే ఇప్పుడు పొడిమాటల్లో చెప్పడం కష్టం. థియరీ ఆఫ్ ఇండక్షన్ ఫ్రాయిడ్‌కి తెలిస్తే ముందుగా మనస్తత్వ శాస్త్రంలో దానిమీద చర్చించే వాడేమో.

మా బియ్యేడీ బేచ్‌లో ఇంగ్లీషూ, లెక్కలూ తీసుకున్నవాళ్ళం మొత్తం యాభయ్యారు మందిలో ముచ్చగా ముగ్గురే లేడీ స్టూడెంట్సు. రమాదేవి నాతో అధికమైన చనువుతో ఉండి దాదాపు ఆ తొమ్మిదినెలలూ నా పక్కనే వుండేది. మగిలిన ఇద్దరూ అసలు మగవాళ్ళతో కలిసి తాము చదువుకుంటున్నామనే చైతన్యం కూడా లేనట్టుండేవారు. పలకరిస్తే ఘస్టుఫారం అమ్మాయిల్లా ముడుచుకు పోయేవాళ్ళు.

నాకూ రాధకీ కొత్తగా పెళ్ళైంది. దానవాయిపేటలో కొత్త కాపురం. కొబ్బరిచెట్లగాలి ఇంటివాళ్ళు మాకోసం ప్రత్యేకంగా వదిలిన డాబా మీది గదీ—చూసేదంతా నునులేత ఆకుపచ్చ రంగులో కనబడే దనుకొంటాను. మహా సరదాగా ఉండేవాణ్ణి. రాత్రయితే ఎప్పుడు తెల్లవారుతుందా అని, పగలైతే ఎప్పుడు రాత్రవుతుందా అనీ మహా ఆదుర్దా పడిపోయే వాణ్ణని జ్ఞాపకం.

నాకెంత సరదాగా ఉత్సాహంగా వుండేదో రాధ కంత కొత్తగా మొహమాటంగా ఉండేది. నా సరదాకీ, ఉత్సాహానికీ రమాదేవే కారణమని తెలియనంత పారవశ్యంలో ఉండేవాణ్ణి. నాలో కావలసినంత శృంగారభావం, మృదువైన హాస్యం, చొరవా, చెవుల్లో గుసగుసలాడుకొందుకు తియ్యటి పోసుకోలు కబుర్లూ నాకు రమాదేవి సరఫరా చేసేది. ఆవిడ నాకు నేర్పిందని గాదు నా తాత్పర్యం. అవన్నీ అక్కడ పుట్టి పెరిగేవి. ఆ తెచ్చికోలు ఉత్సాహంతో రాధను మైమరపించి గెల్చుకొని ఆమెకు నాపట్ల విశ్వాసం, గౌరవం, భయం, అపేక్ష ఆర్జించుకొన్నాను. రమాదేవి నన్ను బులిపించి మురిపించి చీవాట్లు పెట్టేది. చిన్న చిన్న దెబ్బలు కొట్టేది, తొడపాశాలు పెట్టేది! నవ్వించి రెచ్చగొట్టేది. పరుగెత్తి వెంట బెట్టించుకొనేది. ఎప్పుడు చూచినా నేనామెని ఏదో చెయ్యబోయినట్టు మొహం భయంతో చూసేది. ఓ పక్క రాసుకు పూసుకు

తిరుగుతూ నేను ఆ చొరవ సద్వినియోగం చేసుకోవడం లేదని గుర్తు చేసేది. ఆవిణ్ణి నేను చాలా నిర్లక్ష్యం చేసేవాణ్ణి. చెయ్యాలనికాదు; పరధ్యానమే; భార్యా ధ్యానమేమో ఒకవేళ. ఏమైనాసరే ఆవిడ నన్ను 'ఏడిపించడం'– (అదే, నవ్విం చడం)– మానలేదు. ఏదేనా చిన్న కథలో అయితే, ఆడది తాను నవ్వించిన మొగవాడు ఎంతకీ దారికి రాకపోతే వాడిని పురుగు కింద జమకట్టడం లేదా హఠాత్తుగా పుత్రప్రేమ చూపించడం మామూలు. అలా చెయ్యలేదు రమాదేవి.

పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సుల్లోనూ ప్రొఫెషనల్ కోర్సుల్లోనూ ఇలాంటి చనువూ, ఫ్రీడమ్– కొంత వుండడం నేను బాగా యెరుగుదును గాని, ఇంత లాగ ఆకర్షణకి పూనుకోడం అనుభవం అయినా అవగతం కానంత పర ధ్యానంలో పడ్డానే అని ఈ జూన్ 20వ తేదీని చింతిస్తున్నాను– క్లాసులో, ఊళ్లో మెలాపున్నా సిటిజన్‌షిప్ క్యాంపుల్లో మహా జోరుగా ఉండేది. నా ఉపేక్షంతా కట్టుబాటుగా సంయమ విద్యగా స్వీకరించే వాడిని. రోజూ చూస్తున్న మొహాన్నే పైచోట దూరంగా ఎక్కడో చూస్తే కలగని రసోత్పత్తి ఏదో కలుగుతుంది గాబోలు, అక్కడినించి మురిపెంగా గారంగా పెట్టింది మొహం.

ఆ డైరీలో అవన్నీ రాశాను జూన్ 20 తేదీని, జూన్ 20వ తేదీ క్రింద. 1953 డైరీ తీసి చూస్తె వాటన్నిటికీ మూలం ఉంటుంది. కాని ఇప్పుడు నేరాసుకున్నది ఎంత అందంగా పరిపూర్ణంగా వుంది– అని మురిసిపోతూ మండు టెండలో వెచ్చటి ఫాన్ గాలిలో కూడా మధురమైన కోరికల్లో ఈదుకుంటూ నిద్రపోయాను.

కబుర్లు చెప్పుకుంటూ టిఫిన్ తిని కూల్‌డ్రింక్ తాగేం. తరవాత కూడా కబుర్లు చెప్పుకున్నాం. గోడకి రెండు దిండ్లు జారేసుకుని నేను సగం మంచం మీద ఏటవాలుగా పడుకున్నాను.రమాదేవి మిగిలిన సగం మంచం మీద కాసేపు మఠం వేసుకునీ కాసేపు కాళ్ళు జాపి కుర్చీమీద పెట్టుకునీ కూర్చుంది. ఇంత దగ్గరగా ఇంత సేపు, ఇన్నాళ్ళ తరవాత కూచోడం, ఈ ఆత్మీయతా, పొద్దున్న పేపర్లు కాపీలు కొట్టుకోడం; ఇదంతా ఎంతో బావుంది. అడగవలసిన వరం అడగవలసిన తరుణం ఇది.చెయ్యవలసిన చొరవ చెయ్యవలసిన సమయం ఇది. తయారవుతున్నాను. రమాదేవి నా మాట కాదంటుందన్న భయం ఎప్పుడూ లేదు.

టైమ్ చూశాను, ఇంత సేపటికి, ఐదూ, నలభై నిమిషాలు.

"ఏం; బోరుకొడుతున్నానా, పొమ్మంటారా?"

నేను చటుక్కున ముందుకొంగి, చెయ్యడ్డం పెట్టి "ఛీఛీ-ఎవరన్నారు?" అన్నాను.

"మరి వాచీ చూసుకోడం, ఆవలించడం, ఇవన్నీ ఏమిటి?" పకపకా నవ్వింది.

"ఆవలించలేదే!"

"పోనీ వాచీ చూడ్డం——"

"అదా? సినిమాకి వెళ్దాం అనుకున్నాను-"

"నే ననుకోలేదే!"

"నేననుకుంటే ఒక్కడినీ వెళ్ళాలనుకుంటానా, మీరూ వస్తారు."

"సినిమా నుంచొచ్చి నేను మా వాళ్ళింటికి వెళ్ళడం కష్టం. వాళ్ళది ఎక్కడో లోపలి వాటా. తలుపు తియ్యడానికి ముందు వాటాల వాళ్ళు విసుక్కుంటారు"

"అక్కడికి మీరు వెళ్ళనే వద్దు-"

"మరి?"

"మీరిప్పుడే రిక్షలో వెళ్ళి మీ వాళ్ళతో ఊరుకెళ్ళి పోతున్నానని చెప్పేసి సినిమాకి రండి. అక్కడ్నుంచి సినిమా అయిపోగానే యిక్కడి కొచ్చేద్దాం, ఇక్కడే భోంచేసి-"

"భోంచేసి-?" కొంటెగా చూసి నవ్వుతోంది,

"అదే; భోంచేసి, ఇక్కడే పడుకుని, పొద్దున్న ఎవరి ఊరు వారు వెళ్ళచ్చు."

"మా వూరికి రాత్రి పదకొండున్నరకి రైలుంది."

"అంతరాత్రప్పుడు వెళ్ళిపోనక్కర్లేదు. రాత్రి కిక్కడ హాయిగా-"

"చూద్దాం. ఇలాంటి రాత్రుళ్ళు ఎన్ని గడపలేదు కనుక!"

తలుపు దగ్గర అలికిడైంది. ఒకడవాలా బంట్రోతు కనబడ్డాడు. "నమస్కారం అమ్మగారూ!" అన్నాడు.

నాకేం అర్థం గాలేదు.

"ఏం పోతరాజూ?" అన్నది రమాదేవి.

"అయ్యగారు జీపేసుకుని వచ్చారమ్మా. కిందున్నారు"

"నేను రేపొద్దున్న వస్తాను. మీరెళ్ళండి" అంది రమాదేవి నవ్వుతూ. మొహంలో ఏదో బెదురు కన్పిస్తోంది.

వాడు వెళ్ళాడు.

"ఎవడీ కపోతరాజు?"

"మా బీ. డీ. వో. బంట్రోతు."

"బీ. డీ, వో. ఎవరు?" అన్నాను.

"అబ్బబ్బ!-నేను వర్క్ చేసేది జడ్. పి. హైస్కూల్లోనండీ బాబూ! మా చుట్టూ బీడీవోలూ, జడ్. పి. అధికార్లూ, అనధికార్లూ అన్ని రకరకాల కార్లూ పరిభ్రమిస్తూ వుంటాయి."

"ఎక్స్‌క్యూజ్మీ-" అంటూ రేయాన్ బ్లాక్ షర్టూ, ఖాకీ ప్యాంటూ తొడుక్కున్న ఒక నీటైన యువకుడు గదిద్వారం దగ్గరికొచ్చాడు.

అతన్ని చూడగానే రమాదేవి లేచి నిలబడి "గుడ్‌మార్నింగ్ సార్, రండి" అన్నది.

అతను రాగానే "వీరు రమాకాంత్‌గారని మాకు చాలా ఆప్తులు, క్లాస్ మేట్ కూడాను" అని చెప్పింది నవ్వుతూ.

"గ్లాట్టు సీయూ.... రేపు జడ్. పీ. సెక్రటరీ. డియ్యీవో మనూరొస్తున్నారు. మీరు రిటర్న్ జర్నీకి జీప్ పంపమన్నారని వస్తే, వాళ్ళు కనబడి ప్రోగ్రాం చెప్పేరు. పొద్దున్న టెలిగ్రాం యిచ్చేరుట...."

"నేను పొద్దున్నేవస్తాన్లెండి."

"మేం రాత్రే వెళ్ళిపోతున్నాం. మీరు మాతో అయితే వాళ్లొచ్చేలోగా విలేజ్ చేరగలరు. పొద్దున్న ఫస్టుబస్‌లో వచ్చినా మీరు తెనాల్లో కనెక్షన్ దొరక్క బాధపడతారు. టైమ్‌కి చేరలేరు."

"అదికాదు సార్! వీరూ నేనూ ఎనిమిదేళ్ళకు మీటయ్యాం. సినిమాకి వెళ్ళి పదకొండున్నర ట్రయిన్‌కి తెనాలొచ్చి అక్కణ్నించి పొద్దున్నే ఫస్టుబస్‌లో వస్తాగా! మీరెళ్ళండి. సారీ. మీరు జీప్ నాకోసం తీసుకొచ్చినట్టున్నారు-"

"మేమూ వెడుతున్నాంగా, సినిమాకి! పదిగంటల కిక్కడి కొచ్చి పికప్ చెయ్యమంటారా?"

"ఎందుకులెండి సార్. నే వస్తాగా! మీరు వెళ్ళండి. నే నెలాగో ఎనిమిది లోపల కొల్లూరు చేరుతాను."

అతను వదల్లేదు. "ఇంత దూరంవచ్చి నేనువేరే. మీరు వేరే ఎందుకు రమాదేవీ. తీరా మీరు ఏ బస్సో ఫెయిలై రాలేకపోతే చాలా కష్టం. రేపొద్దుట

వాళ్ళ యన్‌క్త్వైరీ....మీరు లేకపోతే అంతా బూడిదలో పోసిన పన్నీరయి పోతుంది. మీరెప్పుడు రమ్మంటే అప్పుడొచ్చి పికప్ చేస్తాను, చెప్పండి."

రమాదేవి క్షణం ఆలోచించింది. "ఇప్పుడే వెళ్ళిపోదాం పదండి.... సినిమా మానేస్తాను."

"ఓ. కే!....క్రింద వెయిట్ చేస్తాను త్వరగారండి, గుడ్ బై జంటిల్ మన్" అని బూట్లు టకటక లాడించుకొంటూ వెళ్ళాడు.

"యూస్ లెస్ రోగ్!" అంది రమాదేవి మంచం మీదనుంచి లేచి. అంతే. అదే వీడ్కోలు. అసలు రమాదేవి అక్కడ వుందని వాళ్ళకి ఎలా తెలిసిందా అన్న నా సందేహం తీరనేలేదు.

*  *  *

ఈనగాచి నక్కలపాలు చేసినట్టయింది. అక్కడ నేను కూడా ఐదునిమిషాలకంటె ఎక్కువ ఉండలేకపోయాను. గబగబా బ్యాగ్‌లో బట్టలూ అవీ సర్దేసుకొని కిందకెళ్ళి హోటలు బిల్లిచ్చేసి బైట వొచ్చి రిక్షాకోసం ఫుట్‌పాత్ మీద నిలబడ్డాను. ఏదో జరిగింది....జరగవలసింది జరగలేదు. అదే జరిగింది.... పూర్తిగా ఈ ఆశాభంగాన్ని భరించే ఓపికలేనట్లుంది. రమాదేవి అల్లక్కడ దాకా వెళ్ళి వాళ్ళకి ఏదో చెప్పి మోసగించి మళ్ళా హోటలు కొస్తుందేమో. వాళ్ళ బంధువులింటికి తన సామాను కోసం వెళ్ళుంటుంది, జీప్‌మీద. అక్కడ ఏదేనా సాకు చెప్పి వాళ్ళని పంపించే సమర్ధతవుంది ఆమెకి. వాళ్ళిల్లెక్కడో!

"బావా!" అన్న పిలుపు. పరిచితమైన ఆడగొంతుక,

"శాంత కాదూ?" అనుకుని పక్కకి తిరిగాను.

"అదేమిటి బావా! అప్పుడే మరిచిపోయావా? నేనే!"

"అబ్బబ్బా! మరిచిపోలేదే! మీరీ వూళ్ళో ఉంటున్నారా?" నాకాశ్చర్యంలో నోటమాట రావడం లేదు....ఛీ, ఛీ! రెండ్రోజులూ హోటల్లోవుండిపోయానే—

"ఉండు" అని రిక్షా అబ్బికి డబ్బులిచ్చి దిగింది.

"ఎక్కడికో బయల్దేరినట్టున్నావు" అన్నాను.

"ఎక్కడికీలేదు. బజారుకే, రా, వెళదాం."

ఇద్దరం నడుస్తున్నాం. "ఎప్పుడొచ్చేవు? చేతిలో సంచీ నువ్వూ—ఇదేనా, రావడం?"

నాకు నవ్వొచ్చింది "ఇదా?-రావడం కాదు; ఇది వెళ్లిపోడానికి ప్రయత్నం. రెండ్రోజులైంది వచ్చి. పరీక్ష కని వొచ్చాను."

"సెలవు లేదా?"

"ఉంది కాని పరీక్షయిపోయింది ఇవాళతో. వెళ్ళిపోదామని—"

"ఓస్! శెలవుగాని లెద్దూ! మా ఇంటిలో రెండ్రోజులుండెళ్లు. అస లెప్పుడూ వొచ్చేవేకాదు—ఇక్కడి దాకా వొచ్చి మా యింటికి రాకుండా ఎలా వెళ్ళిపోతావోయ్!"

"ఈ మారెప్పుడేనా వొస్తాన్లెద్దూ, బెజవాళ్లోనే గదా, ఉన్నాను."

"ఇన్నాళ్ళొచ్చేవు, ఇప్పుడెళ్ళిపోతే ఇంకొస్తావు—ఏమిటో-అన్నీమాయ మాట్లు."

"మీ పాప నడుస్తోందా?"

"ఏదీ, నువ్వొచ్చి చూస్తెగా, అసలు?"

"అసలేదీ? నీతో రాలేదేం? ఇంటి దగ్గిరొదిలేసేటంత పెద్దది కాదను కుంటానే!"

"సా—రే!—దాన్ని బజారుకి తీసుకొచ్చి నేనెక్కడ భరించన్రాబాబూ! ప్రాణాలు పీకెయ్యదూ. బజారంతా కొనీమని -ఇవాళ తీసుకు రావలసింది.నువ్వొ స్తున్నావని తెలుస్తెను!-తడాఖా చూపించేది—"

శాంతని అంత వేగిరం మళ్లీ చూస్తాననుకోలేదు.

"అది సరేలేవే-మీ ఆయనకి ద్రోణాచెలంలోనో, ఎక్కడో కదే, పని?"

"అంతేలే. మేం ఎక్కడ జ్ఞాపకం వుంటాం. నీకు- ద్రోణాచెలం నించి గుంటూరు ట్రాన్స్ఫరయ్యేక కాకినాడెళుతూవుంటే ఆ వేళ నువ్వు ఏలూర్లో కనబడి-"

"ఔనౌ నుస్మీ: మర్చేపోయేను."

శాంతని అసలు నేనే పెళ్లిచేసుకోవలిసింది. నాకది వేలు విడిచిన మేన మామ కూతురు. చిన్నప్పుడందరూ మమ్మల్ని మొగుడూ పెళ్లాలంటూ గోల చేసేవాళ్లు. శాంత వాళ్ళనాన్నకి ఒకర్తె కూతురు. నేను వాళ్ళ ఇంటిలోనే వుండి బి. యస్సీ. వరకూ చదువుకున్నాను.

చిన్నప్పట్నుంచీ దాన్నీ నన్నూ మొగుడూ పెళ్ళాలని ఎంత తరుచుగా అనే వాళ్ళంటే నన్ను మీరు మీరంటూ మన్నించడం అలవాటు చేసుకుంది శాంత.

బొత్తిగా తేడాలేదని-దానికీ నాకూ ఏణ్ణర్ధమే, వార-పెళ్లి చెయ్యలేదు.

ఇంకొక చిత్రమైన సంగతి ఏమిటంటే చిన్నప్పట్నుంచీ మమ్మన్ని అందరూ అలా అనడం మూలాన్నీ, నాతో చనువు తప్పనిసరి అయిపోడాన్నీ "మొగు"డంటే బావేనన్న నమ్మకం వొంటబట్టి ముద్రపడిపోయి వేరే మని షితో పెళ్లంటే ఏమీ అర్థం గాలేదనుకుంటాను. వాళ్ళాయన పెళ్ళి చూపుల కొచ్చి, చూసి వెళ్ళి, అంతా రైటు చేసుకున్నాక; "మరి బావకిచ్చి చేద్దామను కున్నారు కదే అమ్మా; బావ నన్ను చేసుకోనంటున్నాడా?" అని అడిగిందిట. పద్దెనిమిదేళ్ళ శాంత. ఇది ఆ అమ్మ లక్కా ఈ అమ్మలక్కల మధ్య ప్రచారమై వాళ్ళాయన చెవిని కూడా పడిందని గొడవగా చెప్పుకున్నారు. శాంతకి మొగు డంటే ఇష్టం లేదంటూనూ.

మాట్లాడుకుంటూ బజారు తిరిగి ఇంటి కొచ్చేం. నాకు కొంచెం ఇబ్బంది గానే వుంది. శాంత మొగుడూ నేనూ ఎన్నడూ కలుసుకోలేదు, నేను ఫలానా అని తెలిస్తే ఆయనేమనుకుంటాడో-?—అయినా ఆ ప్రశ్న శాంతనెలా అడ గడం.—మాట్లాడకుండా దాని వెనక నడిచి, ఇక ఇల్లు చేరేమని తెలిశాక "అది కాదు శాంతా? నేనెప్పుడూ ఆయన్ని చూళ్ళేదుకద" అన్నాను.

"చూడకపోతే ఆయనకి తెలీదనుకున్నావా? నిన్నక్కడ నిలబెట్టి ఇత నెవరో చెప్పుకోండి చూద్దాం అంటే ఆయన మీ రమాకాంతం బావ కదూ, అంటారు ఠకీమని- తెలుసునా?"

పిల్లని ఇంటిగల వాళ్ళకి అప్పజెప్పినట్టుంది. దాన్ని తీసుకొచ్చింది. వీళ్ళది మేడమీద వాటా.

మెట్లెక్కి పర్సులోంచి తాళం తీసింది. "మీ ఆయన ఇంట్లోలేరా?" అన్నాను. "ఇంట్లో కాదు, ఊళ్ళోనే లేరు. ఇందాక మూడుగంటల బండికి బందరు వెళ్ళేరు. మళ్ళీ రేపొద్దుటకొస్తారు.... అయినా, అదేదో సామ్యం చెప్పి నట్టు ఆయనుంటే నేను బజారు కెళ్ళడమెందుకూ?"

"అరె! అయితే ఎందుకు, నన్నిక్కడిదాకా వెంటబెట్టుకొచ్చేవు! పోనీ. ఆయన్ని చూడొచ్చుకదా అని నేనొచ్చేను!"

"ఇప్పుడు మాత్రం ఏం పోయింది? రాత్రుండు, రేపొద్దున్న కాయ నొచ్చేస్తారుగా!"

చీకటి పడుతోంది, వెళ్ళిపోతే బావుణ్ణు-అనుకుంటున్నాను.

వాళ్ళమ్మ తెచ్చిన చాక్లెట్లు అయిపోయినట్టున్నాయి. "నువ్వేం తెచ్చా వోయ్!" అంటూ శాంత కూతురు నామీదికి గెంతింది.

"వెర్రితల్లీ, నీ సంగతే జ్ఞాపకం లేదే! నేనేం తేలేదమ్మా" అన్నాను.

"ఇప్పుడెల్లి తే" అన్నది, ఆ పాప.

"అయిందా, నీ పని!" అని శాంత నవ్వింది.

'మొత్తానికి తల్లికి కూతురేనేవ్' అని శాంతని పరిహాసంచేసి; "ఇదొక్క-త్తేనా, ఏమిటీ?" అన్నాను.

"ఆ(-ఇప్పటికి ఇదొక్క-త్తే బాబూ, నా పీకల మీదికి! చాలు! ఇరలై మంచి పెట్టు!.... నీకు?"

"ఒక 'డు'!"

"పోన్లే-నీకూ నాకూ గాకపోయినా వాళ్ళిద్దరేనా—" అని గబుక్కున నాలిక కరుచుకొని- "వెధవలు వీళ్ళిద్దరూ అన్నా చెల్లెళ్ళవుతారు గాబోలు, మీ వాడు దీనికన్నా పెద్దేనా, అసలు?" అంది శాంత,

తను బజార్నించి తెచ్చినవన్నీ వేరే పెట్టుకుంటోంది శాంత. ఎన్నాళ్ళకి చూసినా కొత్తమనిషిలాగ లేనేలేదు. అంతా పాతమనిషే; అంతా జ్ఞాపకాలే. చూస్తేకాదు చూడకుండానే జ్ఞాపకం రావలసిన ఘట్టాలు; ధానికీ నాకూ మధ్యవి. శృంగారం జీవితంలో ఒక భాగంగా నిరూపించుకొని అమలుపరచుకోగల స్త్రీలుంటారని నేను శాంతని చూసే తెలుసుకున్నాను,

వాత్స్యాయన సరసుడైతే మహా సుఖపడుతూ వుండాలి.

వాళ్ళింట్లో నేనుండి చదువుకుంటున్న రోజుల్లో— మొగుడిని కదా అని నేనెప్పుడూ ప్రత్యేకమైన చొరవ తీసుకోలేదు. పరిహాసాలు చెయ్యడం వరకే గాని స్పర్శలూ వస్త్రాపహరణాలు లేవే లేవు.

నాకు బి. యస్సీ, ఫైనలియరు పరీక్షలప్పుడు వాళ్ళమ్మా నాన్నా ఎక్కడికో పెళ్ళికి వెళ్ళేరు. దానికీ యస్సెస్సెల్సీ పరీక్షలు,

"బుద్ధిగా చదువుకోండి, సినీమాలనీ అదనీ ఇదనీ వేషాలు వెయ్యక! రెణ్ణెల్లలో సోమనాథం పెళ్ళుంది, అప్పుడు చూద్దురుగాని బంధువులందర్నీనూ" అని పుష్కల్నిద్దర్నీ వొదిలి వెళ్ళేరు.

అంత పెద్దయింట్లో మేం ఇద్దరం విడిగా రెండు రోజులుండవలసీ, వండుకు తినవలసీ వచ్చింది.

ఇద్దరం ఈ మళ్ళీ కలుసుకున్న నాటికన్నా పదేళ్ళు చిన్నవాళ్ళం.

లోపల బులబాటంగా వున్నా తావత్రయానికి ధైర్యం చాలని రోజులన్న మాట, అవి.

మేం అప్పటికింకా. ఎప్పుడో ఓ ఇంటివాళ్ళు కావలసిన వాళ్ళమే; అందరి దృష్టిలోనూ కూడాను.

సరే; మొదట్రోజేమీ కాలేదు. ఏదో తెచ్చి పెట్టుకున్న హుషార్‌తోటీ, మర్యాద తోటీ కాలం గడిపేశాం.

రెండోరోజు మధ్యాహ్నంనించీ ఇద్దరికీ ఏమీ తోచడం మానేసినట్టుంది. నేను చదువుకొంటూ మేడమీదివరండామీంచి చూడ్డం. శాంత కింది వసారాలో నేను చూసీచూడ్డంలోనే కనబడేటట్టు పుస్తకం పట్టుకొని మేడమీదికి చూస్తూ వుండడం.

"నువ్వు దొంగ" అంటే "నువ్వే దొంగ" అన్నట్టుగా చూసుకోవడం.

ఇద్దరం దొంగలమే అని ఇద్దరికీ తెలిసిపోడమే; లోపల ఇద్దరం తియ్యటి బాధపడిపోడమే.

'నీ పరీక్ష ఈ ఏడాది సున్నా' అని నేనంటే–

'నీ కెలాగూ సెప్టెంబరు తప్పదూ' అని శాంత అన్నాది.

సాయంత్రం ఏడయ్యేసరికి వంటచేసేసింది శాంత. మార్చి నెల ఎండలు సబ్బు సగానికి అరగదీసి శుభ్రంగా 'ఒళ్ళు కడిగేసుకొని' దానికి నచ్చిన బట్టలు కట్టేసుకుంది.

వేణ్ణీళ్ళు– దండుగైపోతున్నాయన్న మిషతో అలవాటు గాకపోయినా నన్నూ స్నానం చేసేమంది.

ఎండాకాలం సాయంకాలం, మైసూర్ శాండల్ డబ్బుతో వేణ్ణీళ్ళస్నానం ఒక ప్రత్యేకమైన అనుభవం.... అప్పట్నుంచే నాకు.

ఎడ్వర్టైజ్‌మెంట్ కాదు. అలవాటైన వాసనే ఒక అనుభవం లాంటిది. మీకు ఇది కాకపోతే ఇంకొకటి; ఇంకోలాంటి దుండొచ్చు.

మజ్జిగ ఒలికిపోయాయని పాలు వొడ్డించి అన్నం పెట్టింది.

అన్నం తిని నేను మామూలుగా మేడెక్కి వెళ్ళిపోతూ ఉంటే'నన్నొక్కర్తినీ వొదిలేసి వెళ్ళిపోతున్నారు కదూ' అంది గోముగా,

'సారీ' అని తన భోజనం అయిపోయే దాకా ఉండి సామాన్లు సద్దడంలో సాయంకూడా చేసేను.

మేడమీదికొచ్చి తమలపాకులూ, వక్కలూ, సున్నం అవన్నీ అక్కడ టేబిలుమీద పెట్టింది: భావగర్భితంగా పెట్టినట్టు,

కిళ్ళీలు బజార్లోకెళ్ళి వేసుకోడం ఇంచుమించు రోజూ అనుభవమే అయినా ఇంట్లో తమలపాకు లేసుకోడమనేది ఒక ప్రత్యేక డిగ్రీ పొందడం లాంటిది. దానికి మేం అప్పటికి ఇంకా చిన్నవాళ్ళమే. పెళ్ళికాని వాళ్ళంతా చిన్నవాళ్ళే. ఇంట్లో తాంబూలం పెళ్ళయిన వాళ్ళకే.

ఎక్కడా వ్రాయబడని ఆ నికార్సయిన నిబంధనకి మేం అప్పటిదాకా కట్టుబడే ఉన్నాం. చాలామంది ఉంటారు కూడానూ.

నా కప్పటికే ఆదర వైపరీత్యంతో చేయంగల విన్నపాలైంది.

దీపం దగ్గిర మళ్ళీ దాగుడుమూతలు ప్రారంభం. చదువుతున్నట్టు నటించడం. 'నావేపు చూడకు' అనడం. వెధవపాఠం కంఠతా రావడాని కేడిపిస్తున్నా దని విసుక్కోడం. నే నేమయినా అనేసరికి నీకు మహా అన్నీ ఒచ్చేసి నట్టు అని విసిరికొట్టడం,

తొమ్మిదవగానే "ఇహ లైటుతీసేసి పడుకుందురూ బాబూ" అని తేచి పోయింది.

అర్థరాత్రి తెలివొచ్చి చూస్తే శాంత, తన మంచాన్ని నా మంచానికి తగిలేటంత దగ్గరగా వేసుకు పడుకుని ఉంది, భయంవేసి దగ్గిరగా ఈడ్చుకుందను కున్నాను,

పొద్దుట మొహం కడుక్కొనేసరికి కాఫీ అందిస్తూ 'యక్షప్రశ్నల్లో వోటి అడుగుతాను చెబుతారూ, బావా!' అంది.

'ఏమిటే అదీ?' అన్నాను, హుషారుగానే.

'వెళ్ళిపోయింది: మళ్ళీరాదుట, ఏమిటదీ?'

'ఏమోనే! దాంట్లో వెంటనే రాస్తాడనుకుంటాను, చూడ్రాదు!'

'ఛీస్, ఇంతేనా, తెలివి? నేచెప్పనా? కాలం!" అని గిర్రునో తిరిగి వెళ్ళి పోయింది.

అ తరవాత, నాకెన్నో సార్లు ఆ సందేశం మేలు చేసింది, 'కాలం!.... వెళ్తోంది!' అని స్ఫురించగానే చెయ్యవలసిన పని వెంటనే మేలుకొని చేసేసు కొనేవాడిని.

ఎలాంటి సందర్భంలో చేసిన వుపదేశం! అని ఆశ్చర్యపడేవాడిని కూడా.

ఇంకోసారి___

వాళ్ళ పిన్నికూతురి పెళ్ళికి వెళితే-

పెళ్ళిలోనే 'కార్యం'ఏర్పాటుచేశారు. అమ్మలక్కలు సరదాగా అక్కడ చేరేరు. గలభా చెయ్యడానికి,

పేకాట మూకలూ పక్లమీద ఉండేవాళ్ళు, సందళ్ళన్నీ తగ్గేయని సినిమాలకీ. షికార్లకీ జారుకున్నారు. ప్రయాణాలవుతున్న వాళ్ళు సరేసరి.

నేను ఏదో పుస్తకం దొరికితే ఏదో మూల గదిలో కూర్చుని పరుపుచుట్ట బెట్టి గోడకి చారేసి దానిమీద అనుకొని చదువుతున్నాను. నిశ్శబ్దంగా ఉందేమో జోరుగా వెళ్ళిపోతోంది.

ఎక్కడినించొచ్చిందో, శాంత: నిశ్శబ్దంగానే వచ్చింది. 'అమ్మదొంగా! ఇక్కడా, ఉన్నావు?' అంటూ పలకరించింది.

నేను సర్దుకొని కూర్చున్నాను.

అప్పటికి రాత్రి తొమ్మిది దాటింది.

'చూసేవా, సందడంతా ఎలా మాయమైపోయిందోను! ఎక్కడా పిట్ట మనిషి లేరు! అనకూడదుగాని ఈ సమయంలో ఎవరేనా దొంగాడు పడ్డా చూసే వాళ్లెవ్వరూ లేరు!' అన్నాను,

'సరేలే. దొంగాడంటావు. ఇంకోటేదేనా అయితే కూడా....' అని అర్థోక్తిలో ఆగిపోయి పకపక నవ్వసాగింది శాంత.

పూర్తిచెయ్యడం అనవసరం.

అప్పటికి శాంత పెళ్ళయి ఏడాది దాటింది. అప్పుడే యింతలాగ గిడస దేది పోయిందా అని నేను ఆశ్చర్యపడుతున్నాను.

'ఏమంటావు! ఇప్పుడు ఎవరెవరు ఎక్కడెక్కడున్నారని ఎవరేనా లెక్క చూసుకుంటారా అని!'

మరోసారి....

నా పెళ్ళిలో—

స్థాలీపాకం అయిపోయింది, "ఇహ ఇప్పట్లో తతంగమేదీ లేదు, పెళ్ళి కుమారుడుగారు కావాలంటే కొంచెం విశ్రాంతి తీసుకోవొచ్చు" అన్నారు.

వెళ్లేను. నాకని ఓగది వుందిగా. అందులో మంచంమీద తలవాల్చాను. అయిదునిమిషాలు నిద్రకోసం అటూ ఇటూ దొర్లాను, నిదర పట్టీ పట్టడం. నిద్రా మెలకువల సంధి.

ఠపీమని తలుపు తెరుచుకుంది. ఎవరో చూదామన్నా, నిద్దరొచ్చే కళ్ళు. తెరవడానికి సాధ్యమైనా యిష్టపడని కళ్ళు. తెరుస్తే నిద్ర దూరమై మళ్ళీ ఎంత ప్రయత్నంగావాలో?—అదీ ఆ అవస్త,

ఒచ్చిందెవరో స్త్రీ,

తలుపు గడియవేసింది.

అవుతున్న చప్పుడును బట్టి జరుగుతున్న దేమిటో తెలిసింది.

శివశివా అనుకున్నాను.

నిద్ర తేలిపోయింది. కుతూహలం కళ్ళు తెరవమంటోంది. కళ్ళు ఎవరై ఉంటారో, ఎంత అపచారం జరుగుతుందోనని భయపడుతున్నాయి.

నేను నిద్రపోతున్నా నన్న ధైర్యంతో ఆ స్త్రీ గదిలో బట్టలు మార్చు కొంటోందని స్ఫురించింది.అంత ధైర్యంతో తీరుబాటుగా బట్టలు మార్చుకుంటో దన్న ఆ స్త్రీ ఎవరైందీ నేను తెలుసుకోవాలి!

ఒక్క మూలుగు మూలిగాను; వార్నింగ్ ఇచ్చినట్లు.

కళ్ళు తెరిచాను....ఇంకెవరు....శాంతే!

'బుద్ధిమంతుడివే లేవోయ్, బావ!' అని ఓచేతిలో కుచ్చెళ్ళు పట్టుకుని, ఓ చేత్తో నా బుగ్గమీద చిన్న దెబ్బవేసి, 'సారీబావా! నిద్దర పాడుచేసేను!' అని చరచరా వెళ్ళిపోయింది.

ఈ మూడు ఉదంతాలతోటీ శాంత మీద మీ గౌరవాన్ని పోగొట్టానని మీ రనుకుంటే అది నా దురదృష్టం.

లలిత రసవత్తర శృంగార సంభాషణలకీ చేష్టలకీ శాంత ఇవ్వగల స్థానం మీకు నిరూపిద్దామని నా ప్రయత్నం.

మరొక్క సంగతి. ఈ అనుభవాల అవకాశాల తీపిని శాంత నాకివ్వడాని కున్న కారణం ఇంకెవరికైనా ఇవ్వడానిక్కూడా ఉంటుందని నా కనుమానం లేదు. ఈ లోకంలో శాంత శృంగారంకోసం పరువు పోగొట్టుకుందికీ అలా ఎన్నిసార్లు పోగొట్టినా మన్నించి మళ్ళీ అవకాశం ఇవ్వడానికీ సిద్ధపడ్డం ఒక్క నా దగ్గరే అని నాకు తెలుసు.

పిల్లని ముచ్చటగా ముస్తాబుచేసింది. తనూ సాధ్యమైనంత ఆధునిక పద్ధతిలో- అంటే ఇంకోవీసం ఎక్కువయితే ఎబ్బెట్టుగా ఉండేటంతలా— తయారైంది. పొట్టి జాకెట్టు, (వెనకాతల స్క్వేర్ కట్), ఏ పరిస్థితిలోనూ వీపుమీద ఉండని పైటచెంగు జబ్బకింది కొచ్చేసి దాక్కుంది. పల్చటి జాకెట్లోంచి శరీర కాంతి స్ఫురణాత్మకంగా కనిపిస్తోంది. తెచ్చిన నిజం పువ్వులన్నీ తనే పెట్టేసు కొని, ప్లాస్టిక్ పువ్వు మాత్రం కూతురికి పెట్టింది.

'మా ఆయన రాత్రిపూట మజ్జిగోసుకోరు. పాలున్నాయి పోసుకుంటావా, పుచ్చుకుంటావా?' రాత్రౌ క్షీరాన్న భోజనమ్....ఆయుర్వృద్ధి కాబోలు—

డాబామీద తెల్లారుజామున మంచు కురుస్తుందని నాకూ లోపలే పక్క ఏర్పాటు చేసింది. వాళ్ళ పాపని వేరే చిన్న మంచంమీద పడుకోబెట్టి, ఒకే సైజు, ఒకే ఎత్తున్న మంచాలు రెండిటిమీద మా కిద్దరికీ పక్కలేసింది. వాటిని విడదీసి, మధ్య చిన్న స్టూల్ మీద కిరసనాయిల్ బుడ్డిదీపం పెట్టింది.

అంతా బాగుంది గాని మధ్య ఆ దీపం ఆ స్టూలూ నాకు నచ్చలేదు.

శాంత నాకేదో అన్యాయం తలపెట్టినట్టూ, ఆ బుడ్డిదీపం నన్ను అసిధారా వ్రతం చెయ్యమన్నట్టూ బాధపడసాగాను. అన్నీ సర్దుతూ హడావుడిగా గదంతా తిరుగుతోంది శాంత.

శాంత తల్లోని మల్లెపువ్వుల వాసనా, వస్తువులు సర్దటంలో పుడుతున్న గాజుల చప్పుడూ, విశేషించి గదంతా తిరుగుతున్న మంచుముద్దలాంటి ఆమె దేహకాంతీ నాలోని అత్యాశా శిఖరాల్ని పంచేంద్రియాలద్వారా మేల్కొలుపు తున్నాయి. దీనికి శాంత పూర్వ ప్రవర్తన సగం కారణమైతే కావచ్చు గాని, రమాదేవి నేటి ప్రవర్తన మాత్రం సగానికెక్కువ కారణం.

ఇంతాచేసి, ఆయన ఊళ్ళోలేని ఈ రాత్రి నన్ను శాంత ఇలా ఆహ్వానించి ఇలా అవమానించడానికని స్ఫురించి ఇదేదో నా చాతనైనతనానికి సవాలుగా కన బడింది. ఆ మాత్రం దానికి సాయంత్రం నుంచీ నాతో తను రకరకాల సర సోక్తులాడడ మెందుకు?

నాకు డాబా మీదినో, మధ్య గదిలోనో, వేరేగా పక్క ఏర్పాటుచేసి, ఈ పాటికల్లా మధ్య తలుపు బిగించి కిటికీ ద్వారా సంభాషణ సాగిస్తూ ఉంటే సమస్య తీవ్రత తగ్గుతుందని అనిపించింది.

ఏ మాటా అనడానికి శాంత పరాయిదై పోతున్నట్టు బాధగా ఉంది.

"కూచో! ఇప్పుడే వస్తాను" అని శాంత మధ్యగదిలో కెళ్ళింది. ఆ మాటతో నేను మేల్కొన్నట్లయింది.

నాలో విద్యుత్తు ప్రసరించింది. శాంత పరాయిది కావడానికి వీల్లేదు. నన్నెన్నిసార్లయినా సరే వేళాకోళం చేసుకోనీ, కాని నన్ను ఒక్కసారికూడా అవమానం చెయ్యడానికి శాంతకి అధికారంలేదు!

గబ గబా మధ్యగదిలో కెళ్ళాను.

అక్కడ శాంత చీర మార్చుకుంటోంది. దీపం వెల్తుర్లో తన తనూశోభను నేను చూడడం శాంత సహించలేకపోయిందనుకుంటాను, దగ్గరే వున్న స్విచ్ ఆఫ్ చేసేసింది.

ఎవరెంత దూరం జరిగామో తెలియదు. మరుక్షణం శాంత నా చేతుల్లో వుంది. కడుతూ కడుతూవున్న చీర శాంత చేతుల్లో వుంది.

అంతే. ఆ నిశ్శబ్దంలో ఏదో మాలిన్యం వుంది. అది శృంగారం కాదు, కానిది నేనక్కడ తీసుకోలేను. శాంత శరీరం, అందుకే, వెయ్యి సూదులు గుచ్చినట్టు నన్ను బాధ పెట్టసాగింది. 'బావా' అన్న శాంతస్వరం, అందుకే కఠోరంగా వినపడ్డాది. తటాలున విడిచి విడిపించుకుని ఇవతలికి వొచ్చేశాను.

ఎనిమిదింముప్పావయింది. ఇంకా లాస్టు బస్సుంటుంది.

0 0 0

ఇంటికి చేరేసరికి తొమ్మిదీముప్పావయింది. రాధ నాకోసం ఎదురుచూస్తూ దీపం వేసుకుని వుంది; కళ్ళల్లో, గదుల్లో.

"అన్నం తిన్నావా?"

"ఆఁ! ఇప్పటిదాకా చూసి ఇప్పుడే తిన్నాను. మీరో?"

"తినే బయల్దేరాను, జగ్గుగాడిని అమ్మకి అప్పచెప్పి సినిమాకెళదాం బయల్దేరు!" అన్నాను.

రాధకి నవ్వొచ్చింది. అందులో- శాంత ఎగతాళీ, రమాదేవి కవ్వింపుకాక ఇంకా ఏవో కనబడ్డాయి.

"ఇప్పుడేమి సినిమాలెద్దురూ; దేశాలన్నీ తిరిగొచ్చి? రేపటిదాకా ఉండదా ఏమిటి, ఆ సినిమా ఏదోను! అందులోనూ. రెండో ఆట, నిద్దర కాగలేనేమో!"

"మరేం చచ్చిపోవులే. బయల్దేరు! అన్నాను.

మళ్ళీ అనుమానంగా చూసింది.

"బయల్దేరుతున్నావా, లేదా?"అన్నాను చిరాగ్గా.

తుళ్ళిపడింది రాధ, "అబ్బ! వొస్తున్నానండీ! ఏమిటా తొందర! కూచోనైనా కూచోకుండా వొచ్చిన మనిషి వొచ్చినట్టే సినిమాకా? ఇంతకీ పరీక్షలెలా చేశారు? ఉద్యోగం నిలబడుతుందా లేక యథా మూషిక మూషికా అవుతుందా?"

"పోవే పిచ్చిదానా! అపశకునాలూ నువ్వూనూ. ఇంతవరకూ ఏ పరీక్షా ఫెయిలవలేదు; ఇదీ అవను-అసలందుకే, ఇదంతా!"

ఆనాడు మనసుకి కలిగిన మత్తు అలాంటిది. రాధని సినిమా చూడనివ్వలేదు, గాథాలహరితో సరిపోయింది. రాత్రి ఆమెని నిద్దరా పోనివ్వలేదు-శృంగార లహరిలో మునిగిపోయింది.

(అవసరాల రామకృష్ణారావుకోసం రాసిన కథ)

("జ్యోతి" మాసపత్రిక: ఏప్రిల్ 1963)

# గుండెల మీద కుంపటి

మధ్యాన్నం పన్నెండు గంటలు కావస్తోంది. రైలు మావూరి స్టేషన్లో ఆగేసరికి. ఎండ పెళ్ళుమని కాస్తోంది. వర్షాకాలపు ఎండేమో, ఉక్కపోసి కిత కితలు పెడుతోంది.

టెలిగ్రామిచ్చినా స్టేషనుకి రాలేదీయన. ఆర్నెల్లయింది, నేను పుట్టింటికి వెళ్ళి, పాపాయి నెత్తుకుని ఇదే రావడం. అసలింకా రావాలని లేకపోయినా శ్రావణమాసం నోము మా యింటిలో నోచుకోవడమే ఆనవాయితీ అవడాన్ని ఒచ్చేశాను.

ఎలా లేదనుకున్నా సామాన్లు ఎక్కువయ్యాయి. వెళ్ళేటప్పుడు పెట్టె హోల్డాలే పట్టుకెళ్ళేను. మా వాళ్ళిచ్చిన ఊరగాయజాడీ ఒకటీ, పాపాయి సామానుతో ప్లాస్టిక్‌బుట్ట ఒకటీ, వేణ్ణీళ్ళతో ధర్మాస్‌ప్లాస్కు-ఇలా ఓ చిన్న ట్రాన్స్ఫర్‌కి అయినంత సామానైంది. కూలివాళ్ళూ, రిక్షావాళ్ళూ ఒంటరి ఆడదాన్ని చూసీ, సామాను చూసీ నా దగ్గిర రావలిసిన దానికంటె ఎక్కువ డబ్బులు గుంజుకుందికి ప్రయత్నిస్తున్నారు.

పావుగంటసేపు చూశాను. ఇంకా రాలేదు ఈయన. రిక్షా మాట్లాడుకొని ఆయనమీద విసుక్కుంటూ అందులో కూచున్నాను.

పోనీ ఇంటిదగ్గిరైనా ఉంటారన్న ధైర్యంతో వస్తే, ఇల్లు తాళంపెట్టేసి వుంది. నాప నిస్సహాయతపల్ల కోపం పట్టలేనంతగా ఒచ్చేసింది. వీధి వసారాలో సామాను పెట్టించి ఏడుస్తున్న పాపాయిని సముదాయిస్తూ దిక్కులు చూస్తున్నాను.

ఇంతలో ఎవరో వొకావిడ వచ్చి పొరుగింటామెనని చెప్పింది. ఇంతకు ముందు ఉండేవాళ్ళు మారిపోయినట్టున్నారు. ఆవిడైనా పాపని ముద్దులాడుతూ కూచుందేకాని తాళం తన దగ్గిరుందని బైట పెట్టనేలేదు. నేను ఆయనమీద విసుక్కుంటూ వుంటే 'అయ్యో ఈ యింటి తాళంచెవి వొకటి నాదగ్గర వుందమ్మా, పనిమనిషి వొస్తే యిమ్మన్నారు' అంటూ కొంగుముడి విప్పి తాళం చెవి నా చేతికిచ్చి వెళ్ళింది.

పోనీ ఎలాగో తాళం వుంచేరని సంతోషిస్తూ, తలుపుతీసి లోపలికి వెళ్లేను, పాపని మంచంమీద పడుకోబెట్టాను. బారసాలకి వొచ్చిననాడు "నువ్వు మళ్ళీ ఇంటికొచ్చేనాటికి చూసో్కి, ఫస్టు క్లాసయిన ఉయ్యాలా మంచంకొని ఇంటిలో వేలగడుతున్నామ్" అని డాబులు కొట్టిన పెద్దమనిషి- ఉయ్యాలాలేదు మంచమూలేదు!

అయితే, ఆయన ధర్మ(వా( అని యిల్లు మాత్రం అరణ్యంలా చెయ్య లేదు. సామానంతా వొక్క- చేతిమీద ఇంటిలో పెట్టుకున్నాను ... వీధి తలుపు గడియవేసి అలా బాత్రూమ్‌కేసి పెడదామని అనుకుంటున్నాను.

"సార్!" అని వొక ఆడ గొంతుక.

తలుపు తీశాను.

చేతిలో కేరియర్ లేకపోతే ఎవరో పొరుగమ్మ కాబోలనుకునేదాన్నే.

హవాయి చెప్పులు, పద్దెనిమిది రూపాయల వెరైటీ కాశ్మీరు సిల్కు-చీరా, కుడిచేతికి రెండు బంగారపు గాజులూ, ఎడంచేతికి దాదాపు డజను ఎర్రటి మట్టి గాజులూ, నడుంమీదికి వాయిల్ జాకెట్టూ ధరించిందా మనిషి. తల నున్నగా దువ్వుకుంది. తల్లో పెట్టుకున్న చేమంతులు నేను పక్కకి వొంగి చూడక పోయినా, అవే తొంగిచూస్తున్నాయి! కొత్తగా, ఒత్తుగా, నల్లగా వున్నా మంచి నిగనిగా, అందం వున్నాయా మనిషికి....

"ఎవరు నువ్వూ?" అన్నాను.

"పనిమనిషినండి" చిరునవ్వుతో "నువ్వెవరు?" అన్న ధీమాతో అంది.

"ఊ(హూ(!" ఈ వేళప్పుడొచ్చావేం?"

"మరి- అన్నం తేవద్దండీ?"

"అయితే ఆ పిలుపే(వి(టి, సార్ అంటూను!—— అయ్యగారూ అని పిలవలేవూ?-"

"మా కట్టాగే అలవాటండి" మళ్ళీ నవ్వింది.

"ఎంత నిర్లక్ష్యం- పైగా ఆ నవ్వు నా ప్రాణాలు తోడేస్తోంది. 'మాకు'ట 'అలవాటు'——ట——!

"నీ పేరు?"

"రంగమ్మండి, "రంగూ" అని పిలుత్తారండి."

రంగులాగే వుంది! దాని దర్జా చురుకూ చూచి దారి తప్పుకోవడం మరచి

పోయి, బాత్రూమ్ కేసి వెడదామనుకున్నదీ మరచిపోయి అలాగే నిలబడి పోయాను.

"అరు లేరాండీ?" అంది మళ్ళీ ఆ పనిమనిషి— 'నీతో నాకేం పని!' అన్నట్టు; నేను "అమ్మగా"ర్నని గ్రహించడానికి ఇష్టం లేనట్టు.

నా ఆలోచనలు విపరీతంగా పరుగులెడుతున్నాయి. దానికి జవాబు చెప్ప కుండా లోనికి వెళ్ళాను——

దీంతో పేచీల్లేకుండా అంట్లు తోమించుకొని యిల్లు తుడిపించుకో గలిస్తే నేను భారత ప్రభుత్వంలో ఏదేనా ఉన్నతోద్యోగం సంపాదించగలనని అనిపిస్తోంది. ఏది ఎలా వున్నా ఇప్పుడు ఆ కేరియర్లో అన్నం తినాలి కాబోలు.... ముళ్ళమీద నుంచున్నట్టుంది.... ఆ మనిషి శుభ్రంగా లేదని కాదు.... ఎందుకో— నాకది నచ్చలేదు!

కాళ్ళుకడుక్కొని యింట్లోకొచ్చాను. 'పనిమనిషి' అప్పటికప్పుడే కేరియర్ టేబిల్ మీద పెట్టింది. చీపురు పుచ్చుకు గది వూడ్చింది.

చూడ్డం మరచిపోలేదు నేను— దాని పసుప్పచ్చని హవాయ్ చెప్పులు— అదుగో— ఆ మూల పెట్టింది; మా జోళ్ళు పెట్టుకునే చోట!

చిన్న మంచంవాల్చి, దానిమీద పక్కవేసి పాపని జాగ్రత్తగా పడుకో బెడుతోంది నేను వెళ్ళేసరికి. 'అరెరె!' అన్నాను కంగారుగా. నా పాపని ఈ మనిషి ముట్టుకోడం యిదే మొదటిమాటు. కేరియర్ తెచ్చిన చేతులు కడుక్కో కుండా పాపని తీసిందని చిరాకు వేసింది నాకు.

గోల చెయ్యొద్దన్నట్టుగా సంజ్ఞ చేసింది నాకు పనిమనిషి. పాపను జోకొడ్తూ. నేను మాట్లాడలేకపోయాను.

నా దృష్టి కేరియర్ మీదపడింది. మళ్ళీ 'ఇక్కడ పెట్టావేమే? వంటింట్లో పెట్టక పోయినావా?' అన్నాను.

'ఇయ్యాలకిక్కడ టేబిలిమీద భోంచెయ్యండమ్మగోరూ. సాయంకాలం కొత్త పెందలకాడే హొచ్చి ఒంటిల్లు కడిగి ముగ్గెడతాను. ఒంట సేద్దురుగాని.

'సరే ఇహ అదొక్కటే తరవాయి. వొంటిల్లు కూడా కడగాలీ.... అన్నం తింటున్నది చాలక?' అన్నాను.

'కడుక్కోకుండానే ఒంట సేస్తారెట్టా!'

నాకు నసాళం అంటుతోంది కోపం.... నాకు శుభ్రాలు మప్పుతోంది. ఇదెక్కడి పనిమనిషి!

ఇటు తిరిగి, పెద్ద మంచం దగ్గిరకొచ్చింది. దుప్పటి దుళుపుదామని కాబోలు నడుం బిగించింది.

"సరేలే, అదలా వుంచు." అన్నాను.

వీధిలో అడుగుల చప్పుడైంది.

ఆయనొచ్చేరు.

"హల్లో లక్ష్మి, ఒచ్చేశావా—వెరీసారీ— టెలిగ్రాం యింతకుముందే అందింది. రైలు ఆమాత్రం లేటవకపోతుందా అని స్టేషనుకెళ్ళాను.... పాపాయి నిద్రపోతోందా?" ఇదీ పలకరింపు.... క్షేమంగా వొచ్చేవా అనిలేదు! అవస్థ పడ్డావా అనిలేదు!.... కోపం వొస్తోంది.

అటువేపు తిరిగారాయన. పనిమనిషి చిరునవ్వు అటువేపు ప్రసరించింది. ఆయన దాన్నేమేనా అనడంపోయింది; తనూ చిరునవ్వు వెలిగిస్తూ, "నువ్వు ఉన్నావా అమ్మగారొచ్చేసరికి ఇంట్లోనూ?"

"లేదండి. ఆరే ముందొచ్చినారండి.......ఎల్తానండి." అనడమేమిటి, చెప్పులు తొడిగేసుకుని చకచకా నడిచెయ్యడమేమిటి; క్షణంలో అవతలికెళ్ళింది.

"అరె! వెడుతున్నావా? రంగూ!—" అంటూ ఈయన వీధి గుమ్మం దాకా వెళ్లేరు. "నీళ్ళు అనీ పెట్టేవా అమ్మగారికి! అమ్మగారు స్నానం చేసిందా?- కాసేపుండి వెళుదువుగాని,-రా!"

నా ఒళ్ళంతా చెమట్లు పోస్తున్నాయి.

* * *

మర్నాడు—

సాయంకాలం అయిదు దాటేసరికి ఆయన ఆఫీసునుంచి వచ్చేశారు. పనిమనిషి పెరట్లో పని పూర్తిచేసేసి గదులు రెండూ వూడ్చింది. పడక గదిలో కొచ్చి పెద్ద మంచంమీద పడక సరిచెయ్యబోతోంది.

"అదలా వుంచు" అన్నాను.

"ఏత్తా లెండమ్మా, తమరి కెందుకు శ్రమ!" అంటూ దుప్పటి తీసింది.

నా కిష్టంలేదు.

పనిమనిషి చేత గిన్నెలు తోమించడం, యిల్లు వూడ్పించడం, పోతే దుకాణానికి పంపి ఏవేనా వెచ్చాలు తెప్పించుకోవడం - యిలాంటి పన్లే తప్ప పక్కలు నే నెప్పుడూ వేయించలేదు.

నెలకి నాలుగైదు రూపాయలిచ్చి పని మనిషిని పెట్టుకుంటాం. పెట్టుకునే టప్పుడే వాళ్లు చెయ్యవలసిన పన్లు నిర్ణయించుకుంటాం. అందులో పక్కలు వెయ్యడం, కట్టునిళుపు గుడ్డలు తడపడం, తాగేనీళ్ళు తేవడం, ఇలాటివి కొన్ని వెళ్ళవు మా యింట్లో, దానికి ప్రత్యేకమైన కారణం లేకపోయినా, పనిమనుషులు శుభ్రంగా వుండరనీ, వాళ్లుచేసే ప్రతిపనీ మళ్ళీ మనం ఫినిష్ చేసుకుంటేగాని పనికిరాదనీ-అమల్లో వుండే సామాన్యమైన కారణం. మాట వరసకి, పనిమనిషి తోమిఇచ్చిన గిన్నెలు మళ్ళీ కడిగితే కాని వంటింట్లో పెట్టుకోను నేను.

ఆదీగాక మా పక్కలు నేను వేసుకోగలను. "శయ్య సవరించడం" ప్రత్యేకం నావల్ల జరగవలసిన పని అని నానమ్మకం, "పడక" మీద నాకొక ప్రత్యేక గౌరవం వుంది.

"ఏ శ్రమాలేదు. అల్లా వుంచు. వేరే పనేదైనా చూసుకో."

"పన్లన్నీ అయిపోయినై గదండీ," అని నవ్వింది పనిమనిషి.

అది నవ్వితే నా కెలాగో వుంటోంది...

"నవ్వుతా వేంట-పిచ్చెక్కిందా?"అన్నాను.

మొత్తంమీద అలా వదిలి ఇవతల నిలబడింది.

ఆయన ఇదంతా గ్రహించాను సుమా అన్నట్టు- "రంగమ్మ శుభ్రంగానే చేస్తుంది. పక్కలూ వేయించేస్తూ వుండు. ఇన్నాళ్ళూ అదే వేస్తోందిగా!- దాని పని నీకు నచ్చలేదా?" అన్నారు.

"మునుపటి పనిమనిషేమైంది? అన్నాను జవాబు చెప్పక.

"నువ్వెళ్ళిన తరవాత మానేసిందది.మధ్యాహ్నం పన్నెండు దాటేక కేరి యరుతెమ్మంటేనాకా హోటళ్లు తెలియవంది-ఓరోజు దాన్ని రిక్షాలో కూర్చోబెట్టి కూడా సైకిలేసుకెళ్లి చూపించేను. ఆ రాత్రి దారి మరచిపోయానయ్యగారూ అంటూ తొమ్మిదిన్నర చేసింది. అప్పుడు దీన్ని పెట్టానన్నమాట. కొంచెం ఎక్కువే అడుగుతూంది గాని శుభ్రంగా చేస్తుందిలే. మంచి చురుకైన మనిషి కూడానూ."

"ఎంతిస్తున్నారేమిటి?"

"ఎనిమిదీ."

"అ....వ్వ!. ఎనిమిదే?. ఆ సిల్కుచేర నాదేనా?. మీరే యిచ్చారా?"

"ఆఁ. చేర ఆరెన్నెల్లయింది గాదూ! మొన్ననొచ్చి అడిగితే. సరే పాతచీరే గదాని యిచ్చాను!"

"ఎంత పాపుందండీ!. ఇంతోటి పనికీ నెల కెనిమిది రూపాయలు గాక సిల్కు చీరలు గూడానా!. ఇంతకీ ఏమిటి, పని, మహా!"

"పొద్దున్నే వొస్తుందీ. స్నానానికి నీళ్ళు కాచడం, తోడడం, మంచినీళ్ళు తేవడం రాత్రి తిన్న కారియర్ కడగడం,ఇల్లు వూడ్చడం!మధ్యాన్నం నేనొచ్చే సరికి కేరియర్ తెచ్చిపెట్టడం."

"మరీ తోమడానికి వంటగిన్నెలైనా లేకుండా ఎనిమిది రూపాయలేమిటండీ! ఇదివరకు పనిమనిషికి అయిదేగా ఇచ్చాం?"

"ఆ కండిషన్‌మీదే ఎపాయింట్ చేసేను. నువ్వొవస్తే వంటగిన్నెలూ తోముతానంది."

"ఎంతపనైనా పొద్దుటే ఒక్కపూట పనికి ఎనిమిదా?"

"పొద్దుటేమీ? సాయంకాలం మాత్రం- అయిదుదాటేక ఒచ్చి, మధ్యాన్నం తిన్న కేరియర్ కడగడం, హోటలుకెళ్ళి భోజనం తేవడం-" అంటూ చదువుతున్నారాయన.

"-పక్క వెయ్యడం-!" అన్నాను నేను, ఒళ్ళుమండి.

"మరి పక్క వెయ్యద్దుటే?-నేను వేసుకుంటానా యేఁవిఁటి,లేకపోతేను!"

"చాల్చాల్లెండి. పక్కలు ఆదేఁవీఁ వెయ్యక్కర్లేదు. నేనే వేసుకుంటాని.— ఇంకానయం!...." ఆ తరవాత మాట అన్లేదు నేను.

'సరే నీ యిష్టం. నాకేం పోయింది-? ఇంతా పన్లేదని నన్ను దెప్పిపొడిచీ దాన్ని ఊరికే కూచోబెట్టి ఎనిమిది రూపాయలూ ఇచ్చేటట్టున్నావు! అని అవతలి కెళ్ళారాయన.

పక్క తీసి దులిపాను. దిండు గలీబు మాసినట్టుంటేను మార్చి ఇంకోటి తొడుగుదామని వొంగాను. మంచానికీ గోడకీ మధ్యన దుమ్ము పేరుకొని వుంది....ఏమిటి దీని శుభ్రం? అని వెటకారంగా అనుకుంటూ చీపురు తెచ్చి, మంచాన్ని కొద్దిగా ఇవతలికి లాగి, మూలనుంచి మొదలు పెట్టి తుడవసాగాను.... అక్కడేవో గాజు పెంకులు... కాదు, చేతిగాజుల ముక్కలు.... ిన్నెల్లనాడెప్పుడో నా చేతివి పగిలిపడ్డాయి కాబోలు, ఇంకా అలాగే న్నాయి... శుభ్రం శుభ్రం అనుకోడఁవేఁగాని పనిమనిషి శుభ్రవేఁవిఁటి. నా ముహం'- అంతా రంగు'- పైపూత'- తుడుస్తున్నాను.... వెలుగులో పడ్డాయి జు ముక్కలు....

ఏమని చెప్పను।.... అవి నా చేతిగాజుల ముక్కలు కావు!.... అయ్యో, అవి ఆ పని మనిషి చేతిని నేను చూస్తున్న ఎర్రటి గాజులముక్కలు?

ఛీ-!

నా మనస్సులో తుపాకులు పేల్తున్నాయి. పడక గదిలో, మా ఆయన పడుకొనే మంచం సందున అలాటి గాజు ముక్కలు. ఆ మనిషివి.అ "రంగు"వి ఉండడమా?- దీనర్థం ఏమిటి?

చేతిలో చీపురుకట్ట జారిపోయింది. ద్వారంవరకు చీపురుతో తరుము కొచ్చిన దుమ్మూ. అందులోంచి ఎర్రగా మెరుస్తూన్న అ గాజుముక్కలూ నన్ను వెక్కిరిస్తున్నాయి. అవి ఎత్తి అవతల పారబొయ్యడానికి చేతులు రావ డం లేదు. ఏవో చెప్పరాని ఆలోచనల్తో మనస్సంతా మలినమై పోతోంది, కోపంతో ఒళ్ళంతా చెమటలు పోస్తున్నాయి.

అయిదు నిమిషాలైంది, చేసుకోవల్సిన పని చూసుకొని పొంగుతున్న ఉద్వేగాన్ని అణుచుకున్నాను. కొంచెం తేరుకున్నాను. బట్టలపెట్టె తెరిచి రెండు గలీబు ఒకటితీపి, మళ్ళీ మంచం దగ్గరికొచ్చాను. మాసిన గలీబు విప్పు తున్నాను.... ఏమిటోగాని ముడి ఊడొచ్చినా తాళ్లు వేళ్ళ అలాపట్టుకున్నాయి.

ఏమిటా అని గట్టిగా లాగాను. ఒక వెంట్రుక- తెగి రెండు ముక్కలూ రెండు చేతుల్లోకి వచ్చాయి.... అప్రయత్నంగా ఆ వెంట్రుక పొడుగుని పరిశీ లించుకొన్నాను. అది పొడుగాటిది....నాది అంత పొడుగైన జడ కాదు.

అది ఎవరి తల్లోది అయిందీ ఊహించ డానికి నా కాట్టేసేపు పట్టలేదు.

నాకు నిస్సత్తువ వచ్చింది.అలాగేచతికిలబడిపోయాను. ఏడుపువచ్చేస్తోంది.

0 0 0

నాలుగు రోజులైంది.

మర్నాటికి పేరంటానికి నలుగుర్నీ పిలవడానికి వెళ్ళి ఆరుగంటలు దాటాక ఇంటికొచ్చాను, తలుపుకొట్టాను. ఎంత సేపటికీ తియ్యలేదు, మా ఆయన.... దబదబా కొట్టడం, కాసేపు నుంచోడం- ఇలా పదినిముషాలకి పైగా అయ్యాక అప్పుడు తలుపు తెరిచారు.

"ఎంతసేపయింది వొచ్చి-?- పెరట్లో వున్నాను" అన్నారాయన.

"ఎంత సేపేమిటీ?- అరగంటైనట్టుంది? ఇంతసేపుటండి, ఎంత పెర ట్లోకి వెళ్ళినా!- బ్రహ్మదేముడి పెద్దన్నయ్యలాగ?" అన్నాను విసుక్కుంటూ.

కుంకం బరిణా, పట్టు రుమాలూ పెట్టెలో పెడదామని పడక గదిలోకి వెళ్ళాను, ఈవేళ్ళప్పుడు అగరొత్తుల వాసన. వేస్తోందేమా అని ఆశ్చర్య పడ్డాను.

ఆయన "పిలవటాలన్నీ అయినట్టేనా!" అని ఏదో పరామర్శిస్తూ లోపలికి రాబోయారు. "అవతలుండండి'" అని తలుపు గడియవేశాను. సాదా చీర వొకటి తీసి కట్టుకున్నాను. కిందపడ్డ పట్టుచీర తీసి మడత పెట్టుకుంటూ వుండగా మంచం కింద తలవేపున పడివున్న రెండు చేమంతి పువ్వులు నాదృష్టి నాకర్షించాయి.... అప్రయత్నంగా నా మనస్సు ఆలోచనలో తేలిపోసాగింది— చేమంతులు నేనూ పెట్టుకున్నానుగాని, నా తల్లోవి రాలడానికి వీల్లేదే?— దండ గుచ్చుకునేలోగా పడ్డాయా?.... ఏమో? అవి ఎవరి తల్లోవి?

నా కాలోచించడానికి భయం వేసింది— ఈయన తలుపు తియ్యడానికి అంత ఆలస్యమెందుకైంది? ఈ చేమంతులకీ, ఈ అగరొత్తులకీ ఆ అలస్యానికీ కారణం ఒకటేనా?— గబగబా తలుపుతీసి అవతలకి వెళ్ళి ఇటూ అటూ చూశాను. రోడ్డు మీద అనుమానించతగ్గ వ్యక్తి కనిపించ లేదు— భ్రమా!— అర్థంలేని అనుమానంవా?— సందు తిరిగి వెళ్ళిపోయిందేమో.?

దడదడా కొట్టుకుటోంది గుండె. కోపం, అసహ్యం, అసూయా, నన్ను వెర్రెత్తించేస్తున్నాయి. ఆయన్ని అడగడానికి అనేక ప్రశ్నలు మస్తిష్కంలో తయారై నాట్యమాడుతున్నాయి. ఆయన నాకేసి వెర్రిగా చూస్తున్నారప్పుడే.

"ఏమిటి లక్ష్మి?"

"టయిమ్ ఎంతయిందండీ?" అన్నాను గబుక్కున,

"ఆరు!"

"ఈ పనిమనిషి ఇంకా వొచ్చినట్లు లేదు!–షోకులు యిదీనూ" అన్నాను, దొంగ చాటుగా ఆయనవేపు చూస్తూ,

ఆయన నిర్లక్ష్యంగా "పనిమనిషా?– రానూ వచ్చింది, వెళ్ళనూ వెళ్ళింది!" అన్నారు.

"ఎంత సేపైంది?"

"అబ్బో. చాలసేపైందే" అని క్షణం ఆలోచించి "నువ్వు వెళ్ళిన పది నిమిషాలకి ఒచ్చింది. ఒచ్చిన పదినిమిషాలకి వెళ్ళింది" అన్నారాయన.

అబద్ధాలాడుతున్నారు. రంకు నేర్చింది బొంక నేరుస్తుందట– సామ్యం నిజం చేస్తున్నారు.... తెలుస్తూనే వుంది....

కాళ్ళూ చేతులూ కడుక్కొని వంటింటిలోకి వెళ్ళాను. అగ్గిపెట్టె కోసం చూశాను. లేదు. అగరొత్తులు వెలిగించారుగా! గదిలో వుండేమో చూదామని వెళ్ళేను.

నా వెనకాలే పెరటిలోకి వచ్చారాయన. మళ్ళీ నావెనకాలే గదిలోకి వచ్చారు. నా చర్యలూ భావాలూ గమనించి నేనాయన్ని అనుమానిస్తున్నానో లేదో తెలుసుకోవాలని కాబోలు!

డ్రెసింగ్ టేబిల్ మీద వుంది అగ్గిపెట్టె. కాటుక మరకలు సరిదిద్దుకునే నెపంతో అక్కడే కాసేపు కూచున్నాను. ఆయన గది ద్వారం దగ్గిర నుంచున్నారు....ఏదో జరుగుతుందనీ, జరగాలనీ ఉంది నాకు. ఎవరు ప్రారంభిస్తారో! నేను సిగ్గు విడిచి ఎలా ప్రారంభించేది?

అద్దంలో చూసుకున్నాను.

పురుడు పోసుకుని రావడం, ఎండలూ నన్ను పాడు చేశాయి....బుగ్గలు తీసేశాయి. పై పెదవి పైకి లేచిపోయినట్టై, పళ్ళు కనిపిస్తామని బెదిరిస్తున్నాయి —జ్యోతుల్లా వెలిగే కళ్ళు తెలుపుపడి తాటికన్నుల్లా వున్నాయి.

మరీ యివాళ- రెండుగంటలసేపుతిరిగి తిరిగి రావడమూ. రాగానేఆ పని మనిషితో ఆయన జరిపిన ఆ అమానుష అన్యాయ చర్య తెలియడమూ, ఈ నాలుగు రోజుల్నించీ నేను పడుతున్న బాధని బైటికి తెచ్చి బల్లేలతో పొడుస్తున్నట్లుంది.

ఆరునెలలు నేను లేకపోయేసరికి ఎంత పనిచేశారీయన!— ఎంత సిగ్గు మాలిన పని!— ఎవరితో చెప్పుకోను?— ఏమని చెప్పను!

ఆ పనిమనిషి! "రంగు"ట దాని పేరు రంగు— మెరిసేదంతా మేలిమిగాదని. రంగొచ్చిందంతా బంగారంకాదని, ఎప్పటికి తెలుస్తుందో ఈ మొగాళ్ళకి!

ఆ మనిషి నా కంటే బాగుందా?— ఏమో? బాగుండడమంటే ఏమిటి? —బాగుండడం అనే మాటకి ఎవరర్థం వారిది! తావలచింది రంభ-అన్నారు అందుకే కాబోలు!— నా సంసారంలో చిచ్చు పెట్టడానికి ఆ రంగులేని రంభ ఎక్కడ దాపరించిందో!— ఈయన బుద్ధేమైంది?— నేనంటే ప్రాణాలు వదిలేస్తానన్నట్లుగా వుండే ఈయన- దానిల్లో ఎలా పడ్డారో!— మళ్ళీ నన్ను

మునపట్లా చూసుకుంటారా, ఈయన?— నేనాయన్ని ఆకర్షించగలనా? నాకేమిటి దారి?

పనిమనిషిని మార్చేస్తే?— ఎవరైనా ముసలిదాన్ని వెతికి తెచ్చి పెట్టుకుంటే బాగుణ్ణు— ఈ పనిమనిషి గుండెలమీద కుంపటిలా నా సంసారంలో ప్రవేశించింది. మొగుడూ, మొద్దులూ లేనట్టుంది దీనికి. ఆ చెప్పులూ, సిల్కు చీర్లూ, బంగారపు గాజులూ, దాని షోకులూనూ. పనిమనిషి లక్షణాలు వెతికినా లేవు దానికి. జమీందారు లక్షణాలు తప్ప. డబ్బెలా వస్తోందో దానికి వీటన్నిటికీను?

డబ్బు కూడా యిస్తున్నారేమో ఈయన దానికి— సేవింగ్సు బ్యాంకి ఎకౌంట్ చూడాలి— ఎంత సిగ్గులేని పని? పరువుగా పెద్ద ఉద్యోగం చేసుకుంటూ కూడా ఇలాంటి నీచమైన పని చెయ్యడానికి ఈయనకి మనసెలా ఒప్పిందో;

నేను వచ్చి నాలుగైదు రోజులైంది కద!— పోనీ నేను లేనప్పుడేదో మనస్సు సరిలేక ఏదో పొరపాటు చేసేరేమో అనుకుంటే— నేనుండగానే— నేనలా పేరంటానికి వెళ్ళి వెళ్ళగానే— ఇక్కడ ఈ భాగోతం— ఎంత అసహ్యాకరమైన పని— ఎంతకైనా తెగించారన్నమాట!— ఈయన మొహం ఎలా చూడను!

మొహం తువ్వాలులో తుడుచుకొని అద్దంలోకి చూస్తె అందులో నావేపు చూసి నవ్వుతున్నారాయన. అది తప్పించుకుందా మని దృష్టి ఇటు మళ్ళించేను, ఇక్కడా ఆయనే; ఆ నవ్వే.... చూసుకున్నావా, నీ అందం? చూశావా, నీకన్నా అది ఎంత అందమైందోను!—ఇప్పుడేమంటావు? అణిగిందా నీ పొగరు!— అన్నట్టుంది. ఆ నవ్వు....సిగ్గులేని మొహానికి నవ్వే శృంగారమట—ఆ నవ్వుకి బదులు నేను నవ్వుతానా?— చురుగ్గా మొహం యింకోవేపుకి తిప్పేసుకున్నాను— నా మొహంలో అసహ్యం ఆయనకి కనబడే వుండాలి,

"చాలా బావున్నావు లక్ష్మి, నువ్వివాళ!" అన్నారాయన.

నేను మాట్లాడలేదు, నన్ను పొంగవెయ్యడానికే అలా అన్నారు, అంత మాత్రంలో జరుగుతున్నదంతా మరిచిపోతానని గాబోలు. ఆయన ఉద్దేశం!

"ఎలాగో అయిపోతావని భయపడిపోయాను సుమా!" అంటూ దగ్గరికొచ్చేరు.

'నేనెలా అయిపోతే మీకేఁవిఁ?' అని విసిరికొట్టాను మాట.

మళ్ళీ నవ్వారాయన. "కోపం వొస్తే యింకా బావుంటావు సుమీ!"

ఎంతమంది పురుషులు ఎంతమంది స్త్రీలతో అన్నారో, ఈ మాట! ఈ అర్థంలేని మాట–కోపం వొస్తె ఇంకా బావుండడం–అసలీయనే ఎంతమందితో అన్నారో.

"నిజం, వొట్టు–శ్రావణలక్ష్మిలా ఉన్నా వివాళ!" అంటూ నా నడుంచుట్టూ చేతులువేశారు.... నిండా అరగంట కాలేదు: ఆ చేతుల్తోటే ఆ పవిమనిషిని.... రామరామ.... నాకు ముళ్ళకంచె గుచ్చుతున్నట్టుంది గాని ప్రియపురుష స్పర్శలా లేదు.... ఆ మనిషి మా యిద్దరిమధ్యా ఎంతదూరం సృష్టించకపోతే ఆయన చేతుల్ని అంత వెంటనే తొలగించగలిగాను.... ఆ చేతుల్లో పరవశం పొందే నా హక్కు పోగొట్టేస్తున్న పాపాత్మురాలు, దుర్మార్గురాలు. రంగమ్మ–నవ్వుతుంది, మళ్ళీనూ, ఏమీ ఎరగనట్టు———ఎరగనట్టేం? దాని నవ్వు నన్ను సవాల్ చేస్తున్నట్టే వుంటుంది!– చూశావా, నా తడాఖా!– అని.

ఆయన చిరునవ్వుతో మళ్ళీ నన్ను పొదివి పట్టుకున్నారు, ఎడంచెయ్యి నా వీపుమీదుంచి కుడిచేత్తో గడ్డం ఎత్తుతున్నారు——బలీయమైన కోర్కె. విపరీతమైన అసహ్యం "నే" నంటే "నే"నని నాలో విజృంభించి యుద్ధం చేసుకుంటున్నాయి. నేను నీరస పడిపోతున్నాను.... నా తల వాలిపోయింది.

"లేవండి, నేను వొంట చేసుకోవాలి!" అంటూ విడిపించుకున్నాను.

"ఇంకా ఒంట్లో సరీగా ఉండడంలేదా!" అని లాలిస్తూ అడిగి విడిచిపెట్టారాయన....: అంతా నటన; నిర్లక్ష్యం!

"భగవంతుడా! నాకీ కాన్పొకటి సృష్టించి పుట్టింటికి పంపించే ఏర్పాటు చేసి ఇంత అన్యాయం చేశావా?– ఈ వూళ్ళో ఆసుపత్రుల్లేనట్టు అక్కడికెందుకు వెళ్ళాను. తెలివితక్కువ పెద్దమ్మనై! ఆసుపత్రుల్లేకపోతే ఆరడుగుల తాడు లేకపోయిందా?" అని నాలో నేనే బొగ్గుల కుంపటి దగ్గిర కూచుని కుమిలిపోయాను.

*  *  *

రోజులు గడుస్తున్నకొద్దీ ఆయనకి నాకూ మధ్య పెరుగుతున్న దూరం భయంకరమై పోతోంది.... నా వంట్లో "ఇంకా సరిగాలేదని" తేల్చేశాఁవుగా. ఆయన! ఇదంతా ఎందుకో తెలుస్తూనే ఉంది!

రాత్రి భోజనం కాగానే "కిళ్ళీ వేసుకొస్తానే" అంటూ ఆ పంచెతోటే

ఎటో వెళ్తారు ఆయన తొందరగానే వస్తారుగాని....ఏమో! దానిల్లు దగ్గిరేనేమో! ....ఎంతసేపు కావాలి!.... ఆపైన వూహించడానికే భయమూ, సిగ్గూ, అసహ్యమూ వేస్తాయి.

రాత్రిళ్ళు చాలాసేపటివరకూ నిద్ర రావడంలేదు, పాపాయి పక్కన పడుకోడం కొత్త అలవాటు...పాపాయిమీద కాలో చెయ్యో వేసేస్తానేమో....అదెక్కడ నలిగిపోతుందో అని దిగులూ; పైగా మంచం మరీ చిన్నదిగా ఉండడం ....పెద్ద మంచం మీద చాలా ఖాళీ వుంటుందిగాని- సమయానికి అభిజాత్యమో అసహ్యమో ప్రాణాంతకంగా ఆవేశిస్తాయి.... యాదాలాభంగా ఆయన స్పర్శ తగిల్తేనే ఉలిక్కిపడుతున్నాను. పవిత్రమైన ఆ స్పర్శ ఇప్పుడేదీ?

ఎలాగో కళ్ళు మూసుకుంటే ఏ కల్లోనో కనిపిస్తుంది ఆ "రంగు!" దాని వికటాట్టహాసంతో హేళనా పూర్వం సంభాషణతో నామనస్సు ప్రతిధ్వనించి బీభత్సమయిపోతుంది.

* * *

వారం రోజులైంది.

ఆయనెక్కడికో క్యాంపు వెళ్ళారు. అయిదు రోజులవరకూ రారు.

ఏమీ తోచక కొత్తపేట వెళ్దామని బయల్దేరాను. ఎక్కడో ఊరికి అవతలవేపు చివర్న ఉంది ఈ కొత్తపేట, మామూలుగా వెళ్ళడం వేం పడదు, మా మేనమామకూతురు గారిల్లు వెతుక్కుంటూ రిక్షాలో వెళ్ళాను. నాలుగునెళ్ళక్రితమే వాళ్ళివూరు ట్రాన్స్ఫరై వొచ్చేరు. ఒక పెద్దయిల్లు చూపించి ఇదేనండీ వారిల్లు అని చెప్పాడొక అబ్బాయి.

ఆ పెద్ద యింట్లో వాళ్ళొక్కరే వుంటున్నారట ప్రస్తుతం. ఎవరో వొక ఆఫీసరు గారూ, వీళ్ళూ కలిసి మొత్తంగా ఇల్లంతా డెబ్భై రూపాయలకి తీసుకున్నారుట, అంతా ముడురోజులై వాళ్ళు ట్రాన్స్ఫరై వెళ్ళారట...."ఈ నెలాఖరు వరకూ అద్దెయిచ్చే వెళ్ళేరు వాళ్ళు. మేం ఈలోగా ఇంకో ఇంటికి మారాలి. మీ వేపు ఏవైనా ఇళ్లువుంటే చూడు...." అంది మా ఒదిన.

"మీరెంత యిస్తున్నారు?"

"ముప్ఫయ్యాయిదు,"

నా సమస్య పరిష్కారమయ్యే మార్గం కనబడ్డట్టు ఆనందం కలిగింది....

ఒకటి రెండుసార్లు ఆయనతో అన్నాను...."పనిమనిషిని మార్చేద్దాం పండీ" అని. ఆయన వొప్పుకోలేదు.

"నిష్కారణంగా ఎందుకు మాన్పించాలి?....పని శుభ్రంగానే చేస్తోందం టావు. ఆలస్యంగా రావడంలేదు. దొంగతనం యెరగదంటావు. చురుకైందే అవి వొప్పుకున్నావు. పోసీ నాగాలు పెట్టడంలేదు....ఎందుకు మార్చాలి?.... ఇంతా చేస్తే పాపాయిక్కూడా అలవాటైపోయి అదొస్తే వూరుకోడం, అది తీసు కెళ్తే ఏడవకపోవడం తెలిశాయి. ఉట్టి పుణ్యానికి దాని నోటిదగ్గర అన్నం ఎందుకు పడగొట్టాలి?" అన్నారాయన.

అన్నీ నిజమే.

పైకి చెప్పదగ్గ కారణం లేదు.

కాని నేను వాళ్ళిద్దరి మధ్యావున్న కలుషిత బాంధవ్యాన్ని క్షమించలేను. మార్చలేను, రుజువు చెయ్యలేను....వాళ్ళు ఏ మాత్రం అజాగ్రత్తగా ప్రవర్తించ డంలేదు—కాని నేను కలగజేసుకొని యేదో ఒకటి చెయ్యకపోతే దీనికి అంతూ పొంతూ ఉండదు.

అయితే ఆయన సంగతి నాకు బాగా తెలుసును. చెయ్యదల్చుకున్నది ధైర్యంగా చెయ్యడమూ, చెప్పదల్చుకున్నది నిర్మొహమాటంగా చెప్పడమూ ఆయనకి బాగా చేతనవును. "నా యిష్టమ్" అన్న సమాధానం ఆయన నాలుక చివర్నే రెడీగా ఉంటుంది. అంతేగాదు, ఎవరైనా అలా నిర్మొహమాటంగా, నిర్భయంగా ప్రవర్తిస్తే చాలా మెచ్చుకుంటారు కూడానూ!

నేనాయనతో కజ్జా పెట్టుకొని ఎన్నడూ ఏదీ సాధించలేను—దేనిమాట ఎలావున్నా ఈ విషయం అసలే వీల్లేదు; "నిజమే! నీకు గనక గ్రహించడాని కైనా యిన్నాళ్ళు పట్టింది.—నా యిష్టం! ఏం చేస్తావు? నువ్వెక్కడ, ఆదెక్కడ దాని అందంలోగాని, బలంలోగానీ పదోవంతయినా నీకున్నాయా?" అని ఆయన అనేస్తే?

వెర్రెత్తిపోయీ, కోపంచేసుకుని, అలిగీ, ముభావంగా వుండీ నేను చేయ గలిగిందేమీలేదు—ఒక సీన్ క్రియేట్ అవుతుంది. అంతే—ఎవరితో చెప్పినా మరింత ప్రచారం. దాని మూలంగా అవమానం తప్ప వేరే ప్రయోజనంలేదు. పనిమనిషి నాకన్నా అందంగా వుందన్న కారణంచేత అల్లరి జరగడం- వూహించడానికే భయంగావుంది అలస్యం చేయడానికి వీల్లేదు—అలస్యం అవు

తున్నకొద్దీ ఆయన నాకెంత దూరమయ్యేదీ, దానివలన నేనెంత నష్టం పొందేదీ కనిపిస్తూనేవుంది.

"ముప్ఫయ్యయిదు మీరిస్తే మిగిలిన ముప్ఫయ్యయిదూ మేఁవిఁచ్చి యీ వాటాలో ఉంటామే. అంచక్కా యిద్దరం కలిసుందాం—మీరిల్లు మార్చెకండే" అని చెప్పేను.

ఆ సాయంత్రం దగ్గిరుండి యిల్లు వాళ్ళ పనిమనిషిచేత కడిగించేసి, మర్నాడు ఆఫీసుకి కబురుచేసి జవాను సాయంతో యిల్లు మార్చేశాను.

మా ఒదిన ఆశ్చర్యపడింది! "అదేమిటే. మీ ఆయన్ని అడక్కుండానే?"

"మా ఆయన సంగతి నీకు తెలీదు," అన్నాను.

ఈ యింటికి రంగమ్మ యిల్లు చాలాదూరం. ఎనిమిది రూపాయలకోసం ఆశించి అది పనికి యింతదూరం రాదు, "కిళ్ళీ వేసుకొస్తానే" అని ఆయన వెళ్ళి రాగల దూరం కాదిది—పైగా,మా యిల్లూ దానిల్లూ ఒక పేటలో వున్నట్టయితే ఆయన దానింటిదగ్గర తిరిగితే తప్పుపట్టరు కాని, యింతదూరంనుంచి కూడా ఆయన అక్కడికి వెళ్తే జనం మొహంమీదే అడుగుతారు—మొహం తప్పిపోతే మోహం తప్పుకుంటుంది. వ్యామోహం తగ్గిపోతే తరవాత ఆయనకే తెలుస్తుంది—నిజమైన విలువ ఏమిటో.

ఆయన్ని నేనేమీ అనకుండా, ఘర్షణ పడక్కర్లేకుండా నిశ్శబ్దంగా గడుసుగా సమస్య పరిష్కరించుకున్నందుకు నన్ను నేనెంతో మెచ్చుకున్నాను.

* * *

"ఏమిటి లక్ష్మీ ఇలా చేశావు. సడన్‌గా!"అన్నారాయన యింట్లోకివస్తూనే. నేను నవ్వాను.

ఆయనా నవ్వారు. "నీకా యిల్లు నచ్చలేదా?-నాతో మాటవరసకైనా చెప్పేవుకాదేం?"

"ఈ ఇల్లుచూసి చెప్పండి మీరు. బావుందా.లేదా?-మూడుగదులూ వంటిల్లు ఇంట్లోనే పంపూ. అద్దె అక్కడా యిక్కడా ఒకటే—పైగా మీ ఆఫీసుకీ దగ్గిర; వేసంకాలం ఒస్తే డాబాకూడా వుంది, బావులేదూ?"

"బాగానే ఉంది-" అని, మళ్ళీ నవ్వారాయన. ఆ నవ్వులో ఆశ్చర్యమే

వుంది. "నేను క్యాంప్ నుంచి వొచ్చేవరకైనా అగలేకపోయావా?– పోనీ నీ మాట ఎప్పుడైనా కాదన్నాను గనకనా?"

"కాదంటారని కాదుగాని.... అసలు కాదనరనేగా! ఊరికే మా ఒదిన్ని చూద్దామనొస్తే పోర్షన్ ఖాళీగా వుంది— పోనీ ఒకళ్ళకొకళ్ళు సాయంగా ఉంటాంకదా అని– ఇంతకీ మీకు నచ్చిందంటారా లేదా?"

"నచ్చిందిలే— ఇక్కడ దోమలుకూడా అట్టే లేనట్టున్నాయ్" అంటూ దూలాలవేపూ, కిటికీలవేపూ పరీక్షగ చూస్తున్నారు ఆయన. ఆయనతో ఏదో చెప్పాలని మహా వుంది నాకు.... ఆయన మొహంలో మార్పేమీ లేకపోవడం నాకు ఆశ్చర్యంగా వుంది— ఆ పనిమనిషిని పూర్వంలా కలుసుకునే అవకాశం లేకుండా చేసినందుకు ఆయన మొహంలో నేననుకున్న మార్పు రాదేం? స్వతంత్రించి యింత పని చేసినందుకు నన్నేమీ అడగరేం?— ఏం అడుగుతారా, ఎంత గట్టిగా అడుగుతారా, దానికెలా సమాధానం చెప్పాలా, అని నాలుగురోజుల్నుంచీ నా ఆలోచన.

ఆ సాయంత్రమంతా ఆయన నన్నేమీ అడక్కపోతే ఆశ్చర్యం వేసింది; రాత్రి భోజనాలుచేసి ప్రక్కదగ్గిర చేరాక నవ్వే ఒచ్చేసింది నాకు.

మంచంమీద ఏటవాలుగా శేషతల్పశాయిలా పడుక్కొని, విలాసంగా తమలపాకు లందుకొంటున్నా రాయన. సున్నం రాసి ఈనెలు తీసి చిలకలు చుట్టి అందిస్తున్నాను నేను. అఖరాకు అందిస్తూ" అసలు ఇల్లెందుకు మార్చానో చెప్పనాండీ?" అన్నాను సన్నగా నవ్వుతూ.

ఆయన నవ్వారు. "ఎందుకేమిటి?"

"పార్శ్వపు నొప్పికి భాస్కరలవణం–" అన్నాను, మంచంమీద చోటు చేసుకు కూచుని, పొడుపు కథ పొడిచిన చిలిపితనంలో.

"అదేమిటది?" అన్నారాయన; నా చెయ్యిపట్టుకుని, గాజులు వెనక్కీ ముందుకి సర్దుతూ.

"చెప్పుకోండి చూద్దాం!"

"....ఏమిటి చెప్పుకోవడం!— వెనకెప్పుడో నాకు పార్శ్వపు నొప్పి వొస్తే అజీర్ణంమీద ఒచ్చిందని భాస్కర లవణం యిచ్చేరు.... దానిమాటేనా నువ్వు చెబుతున్నావ్?.... దానికీ దీనికీ సంబంధమేమిటి."

"అదే, చెప్పుకోవాలి మరి!"

"నువ్వే చెబుదూ నాకలా కలపడం చేతగాదు!"

"—చెప్పమంటారా?....అక్కడ మీరు చిక్కిపోయారండీ. హోటలు మెతుకులూ, పనిమనిషి చేతి నీళ్ళూ.... ఆర్నెల్లలో ఎంత మార్చేసిందండీ మిమ్మల్ని! ఛీ, పాడుమనిషి!" అన్నాను. నవ్వుతూ గోముగా ఆయన మీదికి వొంగుతూ.

మా అయన వొక్క నిమిషం మాట్లాడకుండా వూరుకున్నారు. నేనూ ఊరుకున్నాను,

ఆయన లేచారు. కిటికీలోంచి తమలపాకుల పిప్పి వుమ్మేసి, లైట్ ఆఫ్ చేసి మంచంమీద కూచున్నారు—

"అర్థంలేని అనుమానంవే పడ్డావుగాని తెలివితేటలేమీ ఉపయోగించావు కాదు— నేనెలాటివాణ్ణో తెలుసుకోలేక పోయావన్నమాట. అసలలాంటివి నేను ఆలోచించుకోవాలే గాని— ఏదేనా అయితే, నన్ను నువ్వు ఆపగలననే అనుకున్నావా?"

అందులో నిజమెంతో, ఆయన మొహంలో భావం ఎలాంటిదుందో తెలుసుకోవాలని, చూడాలనీ ఉంది నాకు....

కాని నేను లేచి దీపం వెయ్యలేదు. కనుక్కోవాలని నాకేం పట్టుదలా ఏమిటి? నేను చీకట్లోనే నవ్వుకున్నాను.

*

("తరుణ" మాసపత్రిక; ఆగస్టు 1972)

# మూడు గదులు

"మీ మొహంమీద ఎండ పడుతోంది"

నల్లకళ్ళజోడులోంచి చూస్తూ గళ్ళచొక్కా తొడుక్కున్న ఆ యువకుడు గిరిజకి చెప్పేడు.

"థాంక్స్! నాకు తెలుసు!" గిరిజ అప్రయత్నంగా అతనివేపు, షెడ్ లోకి, షేడ్ లోకి జరిగింది.

సాయంకాలం ఆరుకాలేదింకాను.

గిరిజ నలభయ్యోనెంబరు బస్సుకోసం చూస్తోంది. బస్సులు సికింద్రాబాదు వేపునించి వొస్తున్నాయి, వెళుతున్నాయి. అన్నిటినిండా వేళ్ళాడుతూ జెనం.

అంత జనంలోనూ ఎలాగో ఓలాగ వెళిపోయితీరాలన్న ఒత్తిడీ గంత కత్తెరా ఏమీలేవు గిరిజకి. ఎవరేనా పలకరిస్తే ఓగంట అటో యిటో ఖాళీగా తిరిగొచ్చినా యిబ్బందిలేదు.

ఇరవై ఏళ్ళు నాలుగేళ్ళకిందటే వెళ్ళిన గిరిజ నలభయ్యో నెంబరు బస్సుకోసం చూస్తూ అరవై సెకండ్లు గల ఒక్కొక్క నిమిషంలోనూ ఎనభయ్యేసి గాలిమేడలు కడుతూ నూరు సంవత్సరాలు గడిపినట్టు అలిసిపోగలదు. కలల్లో కూడా జీవితమే కొట్టొచ్చినట్టు. కనబడిపోతుందని గిరిజకి ఉత్సాహం నీరుకారిపోతుంది తరుచూనూ.

జీవితం ముళ్ళపందిరి!

నీడగానే ఉంటుంది. ఒదిగి ఒదిగి నడుచుకుంటూ ఎలాగో ఎత్తుకీ ఎదగాలి. కాని ఏమాత్రం ఆవేశపడ్డా ఎదలో ఎరగరానన్ని; తలలో తలచరానన్ని ముళ్ళు దిగుతాయి.

ఈ చదువు ఈ ఏడాది అవదు. మళ్ళీ ఏడాది కూడా వుంది, తద్దినం—చదవాలి— తిరగాలి— రెస్టు తీసుకోవాలి— సంపాదించుకోవాలి— సరదాలు తీర్చుకోవాలి— "రోజూ ఇదే" నని నిర్ధారణైపోయిన జీవితంలోంచే ఏదో కొత్త రుచీ వెరైటీ సంపాదించుకోవాలి.

"వాంట్స్ ఆర్ అన్ లిమిటెడ్" అన్నాడు ఎకానమిస్టు.

కోరికలు అసంఖ్యాకం. వాటిని తీర్చుకోడానికి అవకాశాలు బహుకొద్ది. అది ఎకనామిక్స్‌లో ఇంచుమించు మొదటిపాఠం. ఆ పాఠపు సారాంశాన్ని ఆధారం చేసుకుని ప్రపంచం అంతా నడుస్తోందిట.

ప్రపంచం అంతటిమాటా యెలావున్నా తనపట్ల ఈ సిద్ధాంతం జీవిత సత్యం— కోరికలు— అన్ లిమిటెడ్! ఈ కోరికలు ఇక్కడ కనబడే జనం మొహల్లా అంతులేకుండా ఒక దానితరవాతొకటి— వేరే వేరే ఆకారాల్లో సిద్ధ మవుతూ వుంటాయి. వాటన్నిటిన్నీ తీర్చుకునేలోగా జీవితమైనా ఆగిపోతుంది; వయస్సైనా చెల్లిపోతుంది. అంచేత కొన్నిమాత్రం తీర్చుకుని— తరవాత ఏదో విధంగా జీవితంతో రాజీపడి— బహుశా పెళ్ళి చేసుకొని—

పెళ్ళి చేసుకోకముందే డిగ్రీ తీసుకోవాలి. పెళ్ళి చేసుకొనే నాటికీ బ్యాంక్‌లో నాలుగువేలయినా ఉండాలి.

ఆమాత్రం డబ్బు నాదగ్గిర లేకపోతే నన్ను శాశ్వతంగా భరించడానికి ఏ మొగమహారాజూ ముందుకి రాడు.

పెళ్ళికూడా చేసుకోవాలి!

ఎవడో, అదృష్టవంతుడు?— లేక దురదృష్టవంతుడా, నిమ్మి అన్నట్టు!

నిమ్మి పెళ్ళయ్యాక కట్టూ, బొట్టూ తిరుగుడూ, మాటా మనసూ మొత్తం మార్చేసి ఏకపత్నీవ్రత అయిపోయింది. ఆఖరికి శ్రావణమాసం నోములూ శని వారాలూ కూడా చేసేస్తోంది.

నేనొక ఆర్టిస్టుని పెళ్ళాడతాను!

ఆర్టిస్టంటే బొమ్మ వేసేవాడే కానక్కర్లేదు. కవి,నావలిస్ట్, మ్యూజిషియన్ ఎవడైనా.... సౌందర్యారాధన తెలిసిన, కళాకారుడు— నా అందాన్ని మెచ్చు కుని నేనివ్వగల ఆనందాన్ని అందుకొని నా తప్పుల్ని తన విశాల హృదయంతో ఎక్కడో ఓమూల దాచేసి మిగతా అంతజాగా నేనే, నాస్మరణ నారూపమే నిలుపుకోగలవాడు—

వాడెవడో—?

ఈ పక్కనున్న గళ్ళ షర్టబ్బాయి—?

సైడ్ బర్న్సూ, నల్లకళ్ళద్దాలూ కుడిచేతికి వాచీ— ఆర్భాటంగానే ఉన్నాడు.

కాని వీడు ఆర్టిస్టు కాదు.

ఎవడో వాడ్డీ వ్యాపారస్థుడి కొడుకులా ఉన్నాడు. వ్యాపారస్థుడులా వున్నాడు—వ్యాపారం ఆర్టు కాదు.... సైన్సా?—అదీ కాదేమో?—ఆర్టిస్టుల కంటే, సైంటిస్టులకంటే వ్యాపారస్థులే గొప్ప వాళ్ళలా మెసులుతారు.

"మీరు—" అన్నాడు.

గిరిజ చూసింది.

అతను తడబాటు నటిస్తూ "ఎక్కడో చూసినట్టు—" అన్నాడు.

"అవును; ఎక్కడో చూసినట్టే వుంది—"

"ఎంతవరకు వెళ్ళాలి?"

"టీగం బజార్."

"నేనూ అటే.......ఆటోలో పోదామా, పోనీ—?"

—ఇచ్చట స్నేహములు చేయబడును....మతము, కులము, భాష, ప్రాంతం, కొండొకచో వయసు; వీటి ప్రమేయం లేకండా—అని కొంతమంది మొహాలమీద రాసినట్టు కనబడుతూ వుంటుంది. కాని ఈ సిటీల్లో కొంతమందికి మాత్రమే ఆ మొహాలమీది రాత చదవడం చాతనవుతుంది. ఆ కొంతమంది లోనూ బహుకొద్దిమందికి మాత్రమే ఆ చదువుల సందేశం సఫలం చేసుకోడానికి కావలసిన తీరికా తాహతూ వుంటాయి.

"రెండు నిమిషాలీ హోటల్లో ఆగి ఓ కప్పు కాఫీ తాగితే యేం?" అన్నాడతను; రెండడుగులు వేసి, ఆగి.

"ఇద్దరం వెడుతున్నాం—ఒక్క కప్పు కాఫీట—" అనుకుంది గిరిజ; అతనికి చిరునవ్వు విసిరి. "ఫిఫ్టీ— ఫిఫ్టీ"—అని చెవుల్లో యేదో గింగురుమంది. ఫిఫ్టీ-యాభై-పచాస్...! ఎక్కడ చెప్పడం, ఎలా చెప్పడం—? ఎప్పటికప్పుడే కొత్త! ఓమాటొక కుర్ర సన్యాసి కాఫీ హోటల్లో టేబిల్ మీద పెన్నుతో రాస్తే కాసేపు అర్థంచేసుకోలేక; చివరికి అర్థమవగానే చెమట్లు కక్కేసేదు.

ఫామిలీరూమ్‌లో—ఎదురెదురుగా కూచున్నారు...మాటాడుకోడం లేదు—వొంతుల వారీగా కళ్ళలో కళ్ళుపెట్టి చూసుకుంటూ మనసు పరిచిన తెరలని ఒత్తిగిల్లించి అక్కడేముందో చూసుకుందామని ప్రయత్నిస్తున్నారు....

అబ్బాయే చివరికి— "కొంచెం సాయం చేద్దురూ!" అన్నాడు.

"ఏమిటి—టేబిల్ జరుపుదామంటారా?"

"అదికాదు. మిమ్మల్నెక్కడో చూశాను. ఎక్కడా అని ఇదవుతున్నాను."

"బహుశా కలలోనేమో?"

అతనూ నవ్వాడు. "మీరు బలే హ్యూమరస్‌గా మాట్లాడతారే!"

అంగీకరించాలి, తప్పదు! అతనన్న దానికల్లా వొప్పుకోడమే యివాళ నా డ్యూటీ.... నేను బాగా హాస్యధోరణిలో మాట్లాడతానంటున్నాడు. పోనీ, అలాగే కానీ!

వెయిటర్ వొచ్చి హాస్యానికి అడ్డు తగిలేడు...

"మీ ప్రోగ్రాం ఏమిటి?" అంది గిరిజ.

"మీ ప్రోగ్రామే నా ప్రోగ్రాం."

"నా ప్రోగ్రామ్ మీకు నప్పదు."

"అదేమీ?"

"నేనింటికెళిపోతాను. మా మేనత్త నాకోసం చూస్తూ వుంటుంది!"—బాగా చెప్పేమ కదు!?

"ఇంటికి వెళ్లేలోగా—"

"ఇక్కడికొచ్చేనుగా??"

"ఇక్కణ్నుంచి పిక్చర్‌కి పోదామా?"

"ఏడ్చినట్టుంది మీ సలహా"—అన్నట్టు మొహం పెట్టింది గిరిజ." పిక్చర్‌కి వెడతారో బార్‌కి వెడతారో, మీ ఇష్టం: నేను వెళ్ళేక!" అంది గిరిజ, చేతి గడియారం చూసుకుంటూ. "నేను తొమ్మిదిగంటల్లోగా యిల్లు చేరాలి. సినిమాకెళ్ళి మూడుగంటలు వేస్టు చేసుకోడం నాకు కుదరదు." —అంతలో అంత సంసారపక్షంగా మాట్లాడగలిగినందుకు కొంచెం గర్వపడ్డాది గిరిజ.

ఆతగాడు కంగారు పడిపోయాడు. "అలాగే అలాగే—ఐతే కాఫీ తాగేసి మా యింటికి వెళిపోదాం!"

"ఇల్లా?!"

కొంచెం బెరుగ్గా అటూయిటూ చూసేడతను. తాళాలగుత్తి తీసి చూపించేడు, "ఇది రోడ్డుమీద గేటు తాళం!—ఇదుగో ఇది ఇంటితాళం—" బాగానే చెప్పేడు, ఇంట్లో యెవరూ లేనేలేరని.

వెయిటర్ రావడం, ఇష్ట ఫలహారాలు తీసుకోడం అయింది. కులాసాగా నవ్వుకుంటూ బైటపడ్డారు. "టాక్సీ!" అని కేకవేశాడతను.

"దూరమా?"

"దూరంకాదు గానీ; టైం దండగ పెట్టొద్దన్నారుగా? పైగా—" చిలిపి నవ్వులు కళ్ళలో నింపుకొని—నడిపించి మిమ్మల్ని అలవగొట్టేస్తే నాకేమిటి సుఖం?" అన్నాడతను.

"అబ్బో! పిట్ట కూత పెడుతోందే!" అనుతుంది గిరిజ.

"బర్కత్‌పురా చౌరస్తా" అని టాక్సీ అతనికి చెప్పేసి, వెనక తలుపు తెరిచి పట్టుకున్నాడతను. గిరిజ అతనికి తగలనంత సుతారంగా తగిలి, సీటులో చతికిలపడింది.

0 0 0

"రండి, ఇలా కూర్చోండి!....ఇప్పుడే బట్టలు మార్చుకొస్తాను....మీరు రిఫ్రెష్ కాదల్చుకుంటే అదుగో బాత్‌రూమ్. అవసరం అనుకుంటే స్నానం కూడా చెయ్యొచ్చు. అన్నీ అందులో ఉన్నాయి. నేనొచ్చేదాకా తోచకపోతే బొమ్మలు చూడండి." అని శృంగారం ధ్వనించే చిలిపిగొంతుకు మర్యాద కని పించే చిరునవ్వు జోడించి అన్నాడతను.

ఆ మాటలనేసి అతనలా వెళిపోడం ఏమిటాని ఆశ్చర్యంగా చూస్తూ కూర్చుంది గిరిజ.

పద్ధతి చాలా తేడాగా వుంది. ఇలాంటివాళ్ళు సాధారణంగా అనుభవించే ఆకలికంటె ప్రదర్శించే వెకిలితనం ఎక్కువ ఉంటుంది. టాక్సీలోనే సరసం ప్రారంభించేస్తారు. ఇతను—ఇప్పటిదాకా నన్నిక్కడికి ఎందుకు తీసుకొచ్చేడో తనకే తెలియదన్నట్టుగా ప్రవర్తిస్తున్నాడు....అల్లరికూడా నిశ్శబ్దంగా చెయ్యగల వాడిలా వున్నాడు....

0 0 0

ఉక్క పెడుతోంది. లేచి ఫ్యాన్ వేసుకుంటే బావుణ్ణు. ఇంటికి రాగానే అతగాడు ఫ్యాన్ ఆన్‌చేసి గ్లాసుడు మంచినీళ్ళు ఇయ్యావలిసింది....కొంతమంది-ఆడపిల్ల రూమ్‌లోకి రాగానే కంగారు పడిపోతారు....ఇతను కంగారు పళ్లేదు గాని—....

కాలికింద పడింది, ఏమిటిది?....బ్రష్....పెయింటింగ్ వేసుకునేది—.. టేబిలుమీద పెట్టుకోరాదా?....ఆర్టిస్టుల కిలాటి చిన్న చిన్న జాగ్రత్తలు తీసు కోడం తెలీదు కాబోలు....సైంటిస్టులూ అంతేట—పరధ్యానంగా—

ఇతనార్టిస్టా?

టేబిల్ మీద సగం రచించిన చిత్రం—కేన్వాస్—పక్కని ఫ్రేము సీలలూ—రంగుల ట్యూబులు—మేడిన్ యూ ఎస్ ఎస్సార్.

గోడమీద ఆ జమిలిరంగుల బొమ్మ ఇతనేసిందే నేమిటి చెప్మా? కళా భవన్‌లో ఎగ్జిబిషన్‌లో చూసిన ఆర్ట్ బొమ్మలా వుంది.... మోడర్న్ ఆర్ట్ అంటారుట.... ఏమీ అర్థంకాకపోడమే మోడర్నా?

ఆ గోడమీద అలివేలుమంగా వెంకటేశ్వర్లు పద్ధతిని గాడీ కలర్స్‌లో వున్న పుణ్యదంపతులు ఎవరో? ఇతని తల్లిదండ్రులు కాబోలు. కీర్తిశేషులు.... మున్నూటరవయి రోజులూ అహోరాత్రాలూ వెలుగుతూవుండే జీరోబల్బు....

అరిగిపోయిన గ్రామఫోన్ రికార్డులమీద ఈ పాతకాలపు బొమ్మలు ఇతను వేసినవయ్యుండవు.... ఆ మూలని అదుగో, శంతనుడు; గంగ, విశ్వామిత్రుడు, మేనక, అర్జునుడు, ఉలూచి! ఆ వరస వరసంతా కొనుక్కొచ్చి తగిలించిన బొమ్మలే.

ఈ ఈవినింగ్, ఆ ఈవినింగ్ కాలేజీ — కాలేజీ బ్యూటీ- బ్యూటీ బిజినెస్‌లోపడి- బిజినెస్ ఆర్గనైజేషన్ క్లాసుకి వెళ్ళలేకపోవడంవల్ల అక్కడ సాయంకాలమే రాత్రైపోయి, చీకటి పడిపోయి, కరెంటు పోయినట్టయిపోతుంది. వాళ్ళంతా శూన్యంలోకి చూస్తూవుంటారు....

ఏం క్లాసులో ఏమిటో! లెక్చరర్లంతా కుర్రపోకిళ్ళు తప్ప టీచింగూ లేదు కోచింగు అంతకన్నా లేదు....

పాపం క్రిష్ణమోహన్—ఇవాళ క్లాస్‌కొస్తే సెకండవర్‌లో లేచి వెళిపోదాం అన్నాడు.... పూర్‌మాన్!...."నాతో అయిదు నిమిషాలు గడిపితే ఐదేళ్ళు నిద్రాహారాలు లేకుండా బతికెయ్యగలనంటాడు.... ఒంటిమీద చెయ్యేస్తె నేను అపవిత్రం అయిపోతాననచిట్టుగా ఒదిగి వొదిగి కూచుంటాడు. నా చిటికెనవేలు పట్టుకుని అదే పారవశ్యం అనుకున్నట్టుగా కళ్ళు మూసేస్తాడు....

—ఇతగాడేమయ్యేడు చప్మా?....ఎక్కడిదా బాత్‌షవర్ చప్పుడు, ఈ ఇంట్లోదేలా వుంది....స్నానంచేసి సెంటూగట్రా పూసుకొస్తాడో యేమిటో?

కానీ, ఈ గది బలే అందంగావుంది, కదు! అసలిలాటి గదులెక్కడేనా ఉంటాయాని? అబ్బ! ఎంత విశాలంగా వుంది!— ఆ మూలని రేడియోగ్రామ్, దాని నెత్తిని పేర్చిన రికార్డుల దొంతరా—పాడకపోయినా అంత అందంగా వున్నాయి!...ఆ కిటికీలకి కట్టిన తెరలో?

ఈ మంచం? అసలిది మంచమేనా. అదేదో సినిమాలో అన్నట్టు—గించమా?...ఫోంబెడ్డు—హంసతూలికాతల్పం కంటె మెత్తగా వున్నట్టుంది... దీనిమీద యెవరు బబ్బుంటారో?...బట్టల స్టాండుమీద ఆడవాసన ఎక్కడాలేదు... అబ్బాయి బ్రహ్మచారి అన్నమాటా?...నోనో—బ్రహ్మచారికాదు, "అవివాహితుడు" అనాలిగాబోలు, సుజాత చెప్పినట్టు.

ఆ గోడమీద ఆంగ్లో (ఇండియన్) అమ్మాయిబొమ్మ- కేలండరే, ఐనా వంతబావుంది! బంగారుతీగల్ని కుచ్చులా పోసినట్టుంది, ఆ అమ్మాయి జుట్టు! పట్టుకోడానికి చేతికి దొరికితే బావుణ్ణనిపిస్తోంది. ఈ ఏడాదైపోయాక ఈ కేలండర్ నాకిచ్చేస్తాదేమో అడగాలి— అలా అడిగితే ఇప్పుడే పట్టుకుపో అంటాడేమో?అలా అంటే నాకు బావుండదు—

ఈ టేబిల్ అద్భుతంగా వుంది. సరిగ్గా నాగదంత వున్నట్లుందిది. దీని మీద గాజుపలక చూద్దూ! ఇంత పెద్ద గాజుపలక ఎలా సంపాదించేరో? సంపాదించడం మాటదేవుడెరుగు- దీన్ని విరిగిపోకుండా ఈ ఇంటిదాకా ఈ టేబిల్ దాకాచేఎలా పట్టుకొచ్చేరో అసలు?——డబ్బుంటే సరి- కొండమీదికో దిగొచ్చేస్తుంది— ఇంత మంచి టేబిలు మీద. ఈ అద్భుతమైన గాజు పలక కింద ఇంత అసందర్భమైన బొమ్మ ఎందుకుపెట్టేరో?— మొగాళ్లంతా వాకటే —నలుగుర్లో వున్నప్పుడు ఏసీను అబిసీనుగా వుందంటారో, విడిగావున్నప్పుడు అదేసీను ఆసీనులైపోయి మరీ చూడ్డానికి సిద్ధ పడిపోతారు— —మదన్ మోహన్ గారిదగ్గర అసలైన ఫోటోల్తో ఒక ఆల్బమ్ వుంది. ఎవరికో గానీ చూపించని వన్నీ నాకు చూపించేవాడు. బొమ్మలు అసహ్యంగా వున్నాయని నేనంటే మొహమాటానికి అంటున్నావనేవాడు. అలాంటి ఫొటోలసలెందుకు తీస్తారో? మగవాళ్ల ఆనందంకోసం ఆడవాళ్ల బొమ్మలు వేస్తారు....ఆడది అలాంటి అసందర్భమైన భంగిమలో నుంచుంటే— (పోనీ, నుంచున్నట్టు ఫొటో తీయించుకుంటే—) చూసిన మొగవాడికి ఆనందం కలుగుతుంది కాబోలు. మరి లోకంలో సంగోరు మంది జనాభా ఆడవాళ్లే కదా, వాళ్లకి ఆనందం కలగ జెయ్యవలసిన, కనీసం మొగవాళ్ల నేత్రానంద ఘాట్టాలు ఆడ వాళ్లకి జుగుప్స కలగకుండా చూసే, అవసరం ఈ ఆర్టిస్టులకీ ఫొటోగ్రాఫర్లకీ లేదా అని!— లేదేమో? లిల్లీ చెప్పినట్టు ఇది మగవాళ్ల ప్రపంచంకాదు! మొగ వాళ్ల ప్రపంచం!— — అస లిలాంటి పోజులో నిల బడ్డానికి ఆ అమ్మాయి

యెలా వొప్పుకుందో?——ఒప్పుకునే వుంటుంది. —ఒత్తిడి, ధనంమీది మమ తరం, పొగడ్త మీది కాంక్ష అమెని అలాబందీని చేసుంటాయి, డబ్బుపారేస్తే దేనికైనా ఒప్పుకునే వాళ్లుంటారు— ,.. నాసంగతి వేరు- నేనింకా అంత బరితెగించిపోలేదు... మదన్ మోహన్ గారు సెక్రెటేరియట్ నుంచి కలెక్టర్‌గా వెళ్లుండక పోతే నేను బొత్తిగా "రిజర్వ్‌డ్" కదా!

బాగా ఉన్న వాళ్లలా వుంది, వీళ్లెవరోను. ఈ ఇంటికి అద్దెంత యిస్తు న్నారో? అసలిది అద్దెఇల్లు అయివులడదు. అద్దెలకిచ్చే యిళ్లు ఇలా ప్రతి గదికీ ఎటాచ్‌డ్ బాత్ రూమ్‌తో. ప్రతిరూమ్‌కీ ట్యూబ్ లైట్స్‌తో సీలింగ్ ఫాన్స్‌తో కడతారా? నా గదిలో అయితే ఆసలు వెల్తురే రాదు. లైటేసుకుంటే గోధుమ రంగుగా వుంటుంది గది. అదే వెలుతురనుకుని నేను బతికేస్తున్నాను.

ఈ గాజుకూజా ఎంత అందంగా వుందో! సాలార్ జంగ్ మ్యూజియమ్‌లో ఉన్నట్లున్నాయి ఇలాంటి కూజాలు... నీళ్లు చల్లగా ఉన్నాయి. ప్రాణం లేచొ చ్చింది... ... అన్నీ బావున్నాయమ్మా, చాలా బావున్నాయి! కాని, ఎన్నని అనుకోడం? అసలిక్కడ బావులేని వంటూ యేమైనా ఉన్నాయిగనకనా?

ఇతగాడి స్నానం ఇంకా అయినట్టులేదు... ఏంస్నానమో, దూర్వాస మహా ముని తమ్ముళ్లా వున్నాడు...

అవతలగది తలుపు ఇంతసేపూ తీసే వుందా, నేచూళ్లేదే?... ఆగోడ మూలని, అమ్మబాబోయ్. ఆ తుపాకీ ఎంతపొడుగుందో! ...దగ్గిరికెళ్లి చూస్తే బావుణ్ణు.., అబ్బ! ఐదు తుపాకులూ, మూడు బాకులూ,.. ఆ గోడమీద నడి మధ్యని వేలాడదీసిన కత్తిలాంటిది సినిమాల్లో యుద్ధం సీన్లలో చూపిస్తూ వుంటారు... ఈ ఆయుధాలన్నీ ఎందుకో, ఇతగాడికి? వీళ్ల పూర్వులెవరో రాజా స్థానాల్లో పనిచేసి వుంటారు. ఇతను రాజవంశంవాడా? అప్పటిసామగ్రి అంతా ఎగ్జిబిషన్ పెట్టినట్టు ఈ గదిలో పేర్చేరు,.. ఈ గదిలో వాసనేమిటి ఇంత గమ్మత్తుగావుంది, ఏదో జంతువు చచ్చినప్పటికంపు లాగ?

అయ్యబాబోయ్, పులి! ... ... పులికాదు... మంచితమాషాగా వుంది... రాయితో పులిబొమ్మ తయారుచేయించి దాని వొళ్లంతా కాళ్ల దగ్గిర్నుంచి మెడదాకా పులితోలు కప్పి తల ఏకంగా పులి తలే తగిలించేశారు... ... మెడమీద ఈ చిన్న బెజ్జం లేకపోతే ఈ పులితోలు పులిని చంపకుండా యెలా తీసేరా అని ఆశ్చర్యం కలుగుతుంది.,. ఈ పులి తల ఎంత ఫ్రెష్‌గా వుంది!

నిజంగా బతికున్నపులిలా గుంది... మొన్నాదివారం బతికినకాలేజీలో నాతో మాట్లాడినట్టున్న ఈపులి ఈ బుధవారానికల్లా చచ్చిన కాలేజీకి తయారైంది.

ఈ పులి. ఈ లేడి చెర్మాలూ, ఈ దుప్పికొమ్ములూ, ఈ చిరతపులి తలా. తలా వొక కథా చెబుతున్నాయి. వీళ్లతాత రసపుత్ర వీరుడు. వీళ్లనాన్న మొదటి ప్రపంచయుద్ధంలో ఆర్మీ ఆఫీసరు. వీళ్ల పెద్దన్నయ్య రెండో ప్రపంచ యుద్ధంలో చేశుంటాడు. వీళ్ల పూర్వీకులంతా వీరపురుషులూ, వీడు విలాసపురుషుడూ కాబోలు. వాళ్లందరూ శత్రుపుల్ని సింహాల్నీ పులుల్నీ వేటాడితే వీడు అమ్మాయిల్ని వేటాడుతున్నాడు... ఈమధ్య వేట ఉద్యమాలు సన్నగిల్లి మనుషుల్నే చంపుతున్నారు మనుషులు. ఏపేపర్లో చూసినా రోజూ వొక హత్య.., చంపాలనే కోరిక కొందరిలో సహజం. ఆ మధ్య ఎవరో "స్టూడెంటు" కుర్రాడుఏదో విచిత్రమైన టెక్నిక్ వుపయోగించి ఏడుగురు అందమైన నర్సుల్ని చంపేసేట్ట.

ఆ గోడమీద వేలాడుతున్నలాంటి అందమైన పెయింటింగు వేసినవాడు హత్యలు చెయ్యగలడా?.... ఏమో?.... ఈ పెయింటింగు చాలా గాభరా పెట్టే రకంగా వుంది. దీన్లాగే యితని మనస్సు కూడా అల్లకల్లోలంగా రక్తదాహంతో నిండి వుందేమో? "సైకో" అన్న సినిమాలో వొకణ్ణి చూపించేరు. ఆడవాళ్ళని ఆకర్షించే ధోరణిలో వాడు ఇలాగే సన్నంగా పొడుగ్గా అమాయకంగా కనిసించేడు. అమాయకంగా, తెలివితక్కువగా కనిపించే వాడుకూడా ఒకొక్కప్పుడు కొంపలు తీసే కొరివి కాగలడు.... ఇంకా బాత్‌రూమ్‌లోనే వున్నాడేమిటి చెప్మా? నీళ్ల చప్పుడు ఆగిపోయి చాలాసేపైనట్టుంది. ఇంకా బాత్‌రూమ్‌లో యెందుకుంటాడు? బాత్‌రూమ్‌లోంచి ఇటు రాకుండా అటున్నుంచటు వెళిపోడానికి దారి వుందా? ఏమో?.... ఏం ఏర్పాట్లు చేస్తున్నాడో? తాగుతాడు కాబోలు! నన్నూ తాగమంటాడో యేమిటో? తాగుతే నోరంతా వాసన.... బాపుండదు.... వాడికి ముద్దొస్తే నాకు డోకొస్తుంది....మదన్‌మోహన్‌గారు కూడా ఇంతే. తాగమని నన్ను చంపుకు తినేవాడు.

ఈ ఇల్లు సరిగా నా మనస్సులా వుంది కదూ నా మనస్సులో మూడు ముఖ్యమైన కోరికలున్నట్టే ఈ యింట్లో ముఖ్యంగా మూడు గదులున్నాయి. నా మనస్సులో కోరికలు—నా "వాంట్స్"- అన్ లిమిటెడ్ కదా - కాదు, నా కోరికలు అసంఖ్యాకం కాదు. నేనంత అత్యాశాపరురాలిని కాదు. నాకు అత్యవసరమైనవి, నా కోరికలు; మూడే మూడు!

డిగ్రీ.

పెళ్లి.

బ్యాంకులో డబ్బు- అదీ కొంచెమే-

నా కోరికలెలా తీరుతాయి? నాకు డిగ్రీ యెలా వొస్తుంది? రోజంతా ఆఫీసులో పని చేస్సేసి నా బ్రెయినంతా డ్రైయినై పోతోంది. నాపరాతిని కరిగించే నరుడి దృష్టి నామీద రోహిణీకార్తె ఎండలాపడి నన్ను అలవ గొట్టేస్తోంది. ఇంక నాకు చదువుమీద దృష్టెలా నిలుస్తుంది? దృష్టంతా చదువుమీద కేంద్రీకరించి రోజూ క్రమం తప్పక కాలేజీకి వెళితే డిగ్రీ వొస్తుందేమో! నేను మిస్సయిన లెసన్సు నాకెలా వంటబడతాయి? కృష్ణమోహన్ చెబుతానంటాడు. అతని దగ్గిర కూచుందికి నాకు టైమ్ లేదు. అతన్తో వుంటే నాకు థ్రిల్ లేదు. టైమ్ వేస్టు చేస్తున్నట్టుంటుంది.... కాలేజీకి వెడితే అందరూ నావేపు అదోలా చూస్తారు....అసహ్యంగా వుంటుంది.... చూడరేమో అని దిగులూ వుంటుంది. పాఠం వినబడదు. ఈ చెవిని వినబడ్డదికాస్తా అ చెవిలోంచి బైటికి పోతుంది.... ఇంక నాకు చదువెలా వొస్తుంది! నాకు చదువు రాదు. నాకు డిగ్రీ రాదు.

నాకు పెళ్లి కూడా అవదు. నేనిలాగే మూడేళ్ళ డిగ్రీ కోర్సుని ఆరేళ్లో పదేళ్లో చదువుతాను. మార్చి సెప్టెంబర్లు నన్ను మా[illegible] మార్చి పరీక్షించి చివరికి ఏమార్చి వదుల్తాయి. రుక్మిణికి కిందటేడు డిగ్రీ పెళ్ళీ-రెండూ కలిసొచ్చేయి. అంతకి ముందే ఉద్యోగం వుంది.... నువ్విలా అవకాశం దొరికినప్పుడల్లా అడ్డమైన వాళ్ళతోటీ తిరిగితే నీకు పెళ్ళవదంటూ మొన్న నొకనాడు వార్నింగిచ్చింది. నాకారాత్రి నిద్దర పట్టలేదు. నన్నెవరెవరో చంపడానికొచ్చినట్టు భ్రాంతిలో పడిపోయేను. నాలుగైదు రోజుల్దాకా రుక్మిణిమొహం చూడ బుద్ధెయ్యలేదు. ఇప్పుడు రుక్మిణికీ నామొహం చూడ బుద్ధెయ్యదు గాబోలు. నన్ను పలకరించదు; డబ్బు అవసరమైతే తప్పా. మొన్న ఫస్టునాడు నాదగ్గిర ఎనభై రూపాయలు పట్టుకెళ్లింది; "సోఫాకం బెడ్డు కొంటున్నాం" అని- మీ ఆయనికి నువ్వే సోఫాకం బెడ్డుకదా అని నేనేదో జోకేస్తే ఉడుక్కుని డబ్బు తపీమని టేబిలుకేసి కొట్టింది. చివరికి ఎలాగో నన్ను ఉద్ధరించడానికన్నట్టు పట్టుకెళ్లింది. సోఫాకం బెడ్డు, గాస్టవ్వు, ప్రెషర్ కుక్కరు, రేడియోగ్రామ్, గది మధ్యని పెద్ద టేబిలు, దానిమీద అద్భుతమైన గాజుపలక; దానికింద అసందర్భమైన బొమ్మ— ఇవన్నీ ఉంటాయా, రుక్మిణి ఇంట్లో? రుక్మిణి

వాళ్ళింటికి నన్ను తీసికెళ్ళలేదు, తీసికెళ్ళడు........ ఒకటి మాత్రం నిజం.... పక్కింటోళ్లో ఎన్నున్నా సరే, ఆ గదిలో, కిటికీ పక్కని; మంచంమీద పడు కునేవాళ్ళని దొంగచాటుగా చూడ్డానికే వేసినట్టున్న ఆ అల్లిబిల్లి తమాషామొక్క మాత్రం ఉండదు గాక ఉండదు....

నాకు బ్యాంకెకౌంటు మరో కనీసపు కోర్కె.... ఇదంతా నాకు తెలీకుండా జరిగిపోయింది. నేను బతకడానికి స్ట్రగులవుతున్నాను. నా పతనానికి మదన్ మోహన్‌గారు కారణం. విజ్ఞానంతో, అధికారంతో; తెల్లగా తళతళలాడే మదన్ మోహన్‌గారు; గుండ్రంగా, నున్నగా మదనమోహనంగా పచ్చగా నిగనిగ లాడే మదన్‌మోహన్; కోరికతో ఆకలితో ఎర్రగా కణకణమండే మదన్ మోహన్‌గాడు—— తన సుఖంకోసం అమాయకురాళ్లయిన వర్కింగ్‌గర్ల్సని సెడ్యూస్ చేసుకు తినే నల్లపిల్లి మదన్‌మోహన్ వెధవ!— వాడే నన్నీ రొంపిలో మొట్టమొదటిసారిగా దింపేడు. నాకీ వెధవ బతుకిష్టం లేదు. ఈ మాంసం కొట్టు మీది లాభంతో పేర్చిన బ్యాంకెకౌంటు పేకమేడలో నేను నివసించలేను. నా అపకీర్తిని పట్టించుకోనట్టు నటించగల పురుష పుంగవుడి మనస్సులో గదికి పగిడీ కట్టడం కోసం నేనీ తాపత్రయ తాపం భరిస్తున్నాను. నాకు స్థిరమైన నడ వడీ, నిశ్చలమైన జీవితం కావాలి. ఎలా వస్తాయి?........ నా భవిష్యత్తు తాళం వేసేసిన ఈ నాలుగో గదిలాగ అగమ్యగోచరంగా వుంది....

ఈ గదికి ఇంత పెద్ద తాళంకప్ప వేసేరెందుకో? ఈ కప్పతాళం చాల్లే దన్నట్టుగా ఈ తలుపులకి పాతకాలపు "తిప్పుడు తాళం" ఒకటి కూడా వేసేరు.. కీహోల్ స్క్రీన్లేదీ కనబడ్డం లేదు. అంతా చీకటి.... నల్లటి తెర ఏదో తలుపవ తల వేళ్లాడుతున్నట్టుంది. "ఉత్తరపు గదికి మాత్రం వెళ్ళకుమా, రాజకుమారా!" అని పేదరాసి పెద్దమ్మ రాజకుమారుడికి వార్నింగిచ్చిన కథ మామయ్య చెప్పే వాడు. విలన్ మంత్రి చేతుల్లో మర్డరైపోయిన రాజదంపతుల శవాల్ని గంధర్వ శాపం తీరేవరకు ఉంచాలని సేనాపతి ఉత్తరపుగదిలో దాచేట్ట.... అలాగ్గానే వీడు; తను ఇంటికి తీసుకొచ్చి చెరిచేసిన అమ్మాయిల కళేబరాల్నిగాని ఈ గదిలో దాచలేదు కదా! ఈ మూడు గదులూ తిరిగినట్టు అందులోక్కూడా నేనెళ్ళి పోతానని తాళాలెయ్యలేదు కద! అంటే, నేను బతికుండగా ఆ గదిలోకెళ్ళ కూడదు... ఇంకో గడియాపోతే వీడు సైకోగాడిలా వొచ్చి ఆ గదిలో కత్తో తుపాకీయో తెచ్చి నన్ను చంపేసి ఈ నాలుగో గదిలో డంప్ చేసేసి మళ్ళీ

నాంపల్లి జంక్షన్ కెళిపోతాడో యేమిటో!.... నాకీ గాంధర్వ శాపం ఎప్పటికి తీరుతుంది, దేవుడా!

వస్తున్నాడు; అదుగో! ట్రే ఏదో తెస్తున్నాడు.... ట్రేలో ప్లేట్లలో అమ్లెట్లు. బ్రెడ్డు.... ఫోర్కులు. కత్తులు.... విస్కీ సీసా........ గ్లాసులు.... ఐస్ ముక్కలు........ సాసర్లో రూపాయలు.... అన్నీ ఎర్రగా, పళువాంఛ ఎర్రగా;........ తెచ్చేస్తున్నాడు: సైకోగాడు! ఆ కత్తుల్తో బ్రెడ్డు కొయ్యడు–అమ్మో! నా గుండె కొసేస్తాడు వీడు.... నేరక పోయొచ్చేను తల్లోయ్....

* * *

"సారీ! చాలా ఆలస్యం అయినట్టుంది!"

వెధవ చిర్నవ్వూ వీడూనూ. అంతా షో.... తేనెపూసిన కత్తి....

"ఇక్కడ కూర్చుందా మంటారా?........ ఉండండి ఈ తివాసీ పరిచేస్తాను!"

వెనక్కి తిరిగున్నప్పుడే ఆ గోడమీది కత్తితీసి వీణ్ణి పొడిచీసి పారిపోతేనో?

"ఆ కత్తులూ అవీ– మా బాబాయిగారు పోగుచేసేరు. బావున్నాయికదు?"

చూసీసేడు, వెధవ!

"మీకు చెమట్లు పడ్తున్నాయేమిటి? ఫ్యాన్ పెట్టుకోలేకపోయేరా?"

నేర్చుకున్నాడెలాగయితేనేం, మర్యాద!

"రోజంతా పనిచేసి, పాపం అలిసిపోయుంటారు.... కొంచెం మొహమేనా కడుక్కోవలిసింది–"

నా కష్టం గురించి ఈమాత్రం మాట అన్నాడు అదేచాలు.

"రండి, ఇలా కూర్చోండి.... ఇది తీసి జాగర్త పెట్టుకోండి.... యాభయ్యయిదుంటాయి. వెళ్లేటప్పుడు టాక్సీలో వెళతారు కదా అని—"

"మంచివాడు....

"మీరు తీసుకోరా?.... మంచి స్టఫ్. మా చిన్నన్నయ్య తెచ్చేడు కిందటి నెల్లో. స్కాచ్ అంటారు. అబ్బే; దేశివాళీ సరుకులా చేదూ వెధవ్వాసనా ఉండదండి."

నేను ముందే అనుకున్నాను; వీళ్ళ వంశం మంచిదని—

"మీకు నచ్చకపోతే వద్దులెండి........ ఆ వాసన కూడా కిట్టదా?.... సర్లెండి. నేను మీరెళ్ళిపోయాకే తీసుకుంటాను."

o o o

నన్ను తాగమనడు. నా గుండె కొయ్యడు. నన్ను వీడేమీ చెయ్యడు. వీడు ఆర్టిస్టు. రష్యాలో తయారైన మంచిరకం ఆయిల్‌కలర్ ట్యూబ్స్‌తో జపనీస్ కేన్వాస్‌మీద నా పోర్ట్రెయిటు అందంగా వేస్తాడు. నా బొమ్మ తయారయ్యేక ఈ గదిలో పడమటి గోడమీద ఆ అల్లకల్లోలం బొమ్మ తీసేసి అక్కడ వేళ్లాడగడతాడు. నేను అలిసిపోకుండా ఫ్రెష్‌గా వుండేటట్టు చూసుకుంటాడు. నన్ను అడుగు కింద పెట్టనివ్వడు. మధ్యగదిలో ఫోంబెడ్డుమీద ఫ్యాన్‌కింద కూచోబెడతాడు. నన్ను పీల్చి పిప్పిచేస్తున్న ఆ ఉద్యోగంనించి విముక్తురాల్ని చేస్తాడు. హైదరాబాద్ వొచ్చినప్పుడల్లా ధాష్టీకంగా కబురు పెట్టేసే మదన్ మోహన్‌గాడు ఈ మారొస్తే ఇక్కడికి తీసుకొచ్చి ఈ కత్తుల్లో వాడికి నచ్చిందేదో కనుక్కొని దాంతోనే వాణ్ణి ఖతమ్ చేసేసి, తాళం వేసిన ఈ నాలుగో గదిలో పారేస్తాడితడు. ఇతడు వీరుల వంశంలో పుట్టినవాడు. నా తప్పులన్నీ క్షమించి నాకు డిగ్రీ బ్యాంకెకౌంటూ లేకపోయినా నన్ను వరిస్తాడు.........
కాని——

ఇవాళ సాయంత్రం నాకు నేనెంత ఘోరమైన అపచారం చేసుకున్నాను!.. యాభై రూపాయల డబ్బులకోసం ఈ సూర్యవంశ సంజాతుణ్ణి, చురుకు కటారి చూపుల సుందరాంగుణ్ని- అత్యధిక హృదయ వైశాల్యంగల ఈ ఆర్టిస్టుని..... శాశ్వతంగా వదులుకున్నాను!

నాకు భవిష్యత్తు లేదు.

* * *

(నా తమ్ముడు, సోమయాజులు రాయించిన కథ)

(ఆంధ్రజ్యోతి వీక్లీ; మే 1973)

# కఠిన శిక్ష

"ఒచ్చావా నాయనా. రా! నా నెత్తిని పాలుపోసేవు. నీకోసం పొద్దుట్నించీ టవునంతా వెతికింపిస్తున్నాను!" అన్నాడు తాసీల్దార్ రామారావు రివిన్యూ ఇన్ స్పెక్టర్ వాసుదేవరావు కనబడగానే.

"సారీ సార్! చంగల్రావుపేటలో వొక రూమ్ ఉందంటేనూ. పోనీ ఆఫీసుకి దగ్గరగా వుంటుంది కదాని, ఎల్లా వుందో చూద్దాం అని వెళ్ళానండి."

"సరే, సరేలేవయ్యా! నువ్వు రూమ్ వెతుక్కొని అందులో దిగి సెటిలయ్యే లోపున బోర్డు మెంబరు రానూ వొస్తాడు, నా ఉద్యోగం కాస్తా వూడపీకి వెళ్ళనూ వెళ్తాడు!—ఎక్కడున్నావో,ఏ ఉద్యోగం చేస్తున్నావో గుర్తుంచుకొని, కాస్త వొళ్ళు దగ్గిర పెట్టుకొని మరీ పన్చేస్తూవుండు!"

"బోర్డు మెంబరు వస్తున్నారండీ! ఎవరు సార్?"

"ఎవరో అయితే మన కెందుకింత వొణుకు? యమ్-సిక్స్‌గారే! ఆయనగారు అసలే ఉగ్రనరసింహం!—మధ్యాహ్నం ఫ్లైట్‌లో దిగుతాట్ట భువనేశ్వరం నించి! తెల్లవారేసరికి పిడుగులా వొచ్చి పడ్డాది టెలిగ్రాం—నువ్వేమో యన్జీవో హోమ్‌లో లేవు, హోటల్లోలేవు, కలెక్టరాఫీసులో లేవు; తాలూకాఫీసులో నీ పత్తావేలేదు. ఇదుగో, చూడు వాసుదేవరావ్! హెడ్‌క్వార్టర్స్ రెవిన్యూ ఇన్ స్పెక్టరు ఇలాగుంటే మేం ఉద్యోగాలు చెయ్యలేమయ్యా!—పనున్నా లేకపోయినా, బతికున్నా చచ్చినా సరే, హెడ్‌క్వార్టర్! అరై అంటే తాలూకా తాసిల్దార్ దగ్గిర కాకపోతే తాలూకాఫీసు దగ్గిరేనా సరే—ఇరవైనాలుగ్గంటలూ తైనాతీ ఉండవలసిందే! మనకేదైనా పనుంటే-ఏది, మన స్వంతపనులు-రూమ్ చూసుకోడమనీ భోజనం చేయడమనీ ఇలాంటివి-ఇరవై నాలుగ్గంటలూ అయిపోయాక ఇరవయ్యయిదో గంటలో చేసుకోవాలంతే! తెలిసిందా?—సరే వొచ్చేవుకదా, అదే పదివేలు! తొరగా గెస్ట్‌హౌస్‌కి దయచెయ్. నువ్వూ నా ప్యూను బంగారీ అక్కడుండండి! నేను జీపూ. స్టేట్ కారూ తీసుకొచ్చేస్తాను—నాతో ఒక ప్యూనుంటాడు.—నీ ప్యూన్ని సాయంకాలం ఆర్లోపల గెస్ట్‌హౌస్ దగ్గిర హాజరవమనీ, వాడు రాత్తిరి కక్కడే వుండిపోవాలని కబురెట్టు!"

"గెస్ట్‌హౌస్—"

"గెస్ట్‌హౌసుకూడా యరగవు నువ్వు—కాని నీకూడా గెస్టుహౌసుకొచ్చి చూపించడానికి నాకిప్పు డోపికాలేదు, టైమంతకన్నా లేదు! చచ్చి చెడీ రూమ్ రిజర్వ్ చేయించే నెలాగో. ఇంకా నువు డిలే చేస్తూ కూచోక వేగిరం అక్కడి కెళ్ళిపోయి అక్కడన్నీ తిన్నగా ఉన్నాయో లేదో చూడు. నేనలా అయన్తో వొచ్చేస్తాను!"

"అలాగే సార్" అని ఇవతల పడ్డాడు వాసుదేవరావు, కాని అతను ఆ మాట అని గుమ్మందాటీ దాటగానే మళ్ళీ బెల్ నొక్కేడు తాసిల్దార్. ఆ శబ్దం మీద నమ్మకంలేని వాళ్ళాగ "ఓయ్ వాసుదేవరావూ!" అని స్వయంగానే కేకే సాడు.

"అయి—" అంటూ మళ్ళీ కంగారుగా తాసిల్దార్ రూమ్‌లో కెళ్ళాడు వాసుదేవరావు.

తాసిల్దార్ రామారావు కుర్చీలో వెనక్కి చారబడి, టేబిలు కింది అడ్డ చెక్కమీద కాళ్ళుపెట్టి తమాషాగా వూగుతూ అన్నాడు; "అదికాదూ, బోర్డు మెంబరు వొస్తున్నాడయ్యా అని నేన్చెబితేనూ నీకు చీమకుట్టినట్టయినా లేదేమిటి? కొన్నాళ్లు నువ్వు బోర్డాఫీసులో పన్చెయ్యడం కాదుగాని, నా పీకలమీదికి తెచ్చే టట్టున్నావయ్యా నువ్వు!....అక్కడికెళ్ళేక మళ్ళీ మీరు సాబ్ అంటే భాయీ అంటూ పిల్చుకుందురుగాన్లేగానీ. నువ్వు ఇవాళ ఇక్కడున్నావన్న సంగతి మర్చి పోకు!....నువ్వివాళ రెవిన్యూ బోర్డాఫీసులో అప్పర్ డివిజన్ గుమాస్తావికావు, జిల్లా హెడ్‌క్వార్టర్స్‌లో టవునార్టైవి! తెలిసిందా? బంగళాకి వెళ్ళవయ్యా.... అంటే గంగిరెద్దులా బుర్రూపీసి వెళ్ళిపోతున్నావు. టైమేమో మూడున్నరయి పోతున్నాది. ఇంకో గంటలో ఆయనగారు దిగబడతారు. గెస్టుహౌస్‌కెళ్ళే రెవిన్యూ ఇన్‌స్పెక్టరు పెళ్ళికొడుకులా చేతులూపుకుంటూ వెళ్ళిపోవడం నా సర్వీ సులో ఎక్కడా చూళ్ళేదయ్యా, నిన్ను తప్ప!...ఇటుచూడు: నాలుగురకాల పళ్ళూ బజార్నుంచి కొని పట్టుకెళ్ళాలి. గెస్టుహౌస్ కిచెన్లో కాఫీకి పాలున్నాయో లేదో కనుక్కొని, లేకపోతే అప్సరా హోటల్నుంచి పెద్ద ఫ్లాస్కునిండా బోర్న్ విటా, చిన్న ఫ్లాస్కునిండా కాఫీ తెప్పించి రడీగా వుంచాలి; హాట్ వాటర్ సిస్టమ్ సరిగ్గా ఉందోలేదో చెకప్ చెయ్యాలి. ఆ వాచ్మేన్‌గాడు దుప్పట్లూ, దోమ తెరా, తలగడా, గలీబులూ మార్చేనంటాడు; నిజంగా మార్చేడా లేదా అన్నది

చూసుకోవాలి.... బాత్రూమ్ మాత్రం శుభ్రంగా డెట్టాల్ పోయించి దగ్గిరుండి క్లీన్ చేయించాలి... తెలిసిందా?...నీవేషమేమిటి అలావుంది! మొగుడు కొట్టేడా మొహం తీరే అంతా అన్నట్టు? తోవలో ఎక్కడైనా వో అయిదు నిమిషాలాగి గెడ్డం గీయించుకుని మరీ వెళ్ళు. ఆ పావలా నేనిస్తానుగాని! .... పన్లోపనిగా ఆ చొక్కాకూడా మార్చుకుని మరీ తగలడు!"

"వెళ్ళొస్తానండి" అనికూడా అనాలనిపించలేదు ఎందుకోగాని – వాసుదేవ రావుకి.

మర్నాడు ఉదయం ఎనిమిదిన్నరప్పుడు "కఠినశిక్ష!" నూటఎనిమిదోసారి జపించుకుంటూ గెస్టుహౌసు వరండామీద కూర్చొనున్నాడు వాసుదేవరావు.

* * *

గెస్టుహౌసు ఐదో నెంబరు స్వీట్ లో రెవిన్యూబోర్డు ఆరో మెంబరుగారు నిన్న సాయంకాలం దిగేరు. వార్ని చూడ్డానికి ఆర్.డి.ఓ.గారు, జాయింట్ కలెక్టర్ గారు, కలెక్టర్ గారు నిన్నరాత్రి వచ్చారు. ఇవాళ పొద్దుటా వచ్చారు. వారే కాక పలువురు పెద్దలు, అధికారులు, పురప్రముఖులు వస్తున్నారు, వెళుతున్నారు....ఎడా తెరిపీ లేకుండా కాగితాలు చూస్తున్నారు మెంబరుగారు.

గడికోమాటు కాఫీలో, బోర్నవిటాలో, సిగరెట్లో, బిస్కెట్లో—ఏదో వొకటి తెమ్మని చెప్పడానికి తప్ప వాసుదేవరావు ఉనికిని గుర్తించిన వారే లేరక్కడ.

నిన్న సాయకాలం నుంచి మహాయజ్ఞం సాగుతూనే వుంది—బోర్న్విటాలు, కాఫీలు, అవండర్ డ్యూనట్సులు, ఏపిల్సు, బత్తాయిలు, చక్కెరకేళీలు, ట్రిబిల్ ఫైవ్ సిగరెట్ పెట్టెలు–ఇవీ సరఫరా అవుతున్నవి.

నిన్నరాత్రి లగ్జూరియస్ డిన్నర్–

ఇవాళుదయం–ఇప్పటికి పది కప్పుల బోర్న్విటా, ఎనిమిది కాఫీ–

వెస్టర్న్ స్టయిల్ బ్రేక్ ఫాస్టు ముగ్గురికి–

రెండు ట్రిబిల్ ఫైవ్ సిగరెట్ పెట్టెలు–

వెళ్ళిపోతార్ట–అంటే బంగళా అద్దె, వాచ్ మెన్ మామూలు ఇచ్చేసి రిజిష్టర్ క్లోజ్ చెయ్యడం కూడా అయిపోయింది–

హైదరాబాద్ వెళ్ళే ఎక్స్ ప్రెస్ ట్రెయిన్ అరగంట లేటుట,—స్టేషన్ కి ఫోన్ చేస్తే చెప్పేరు.

ఇంకో పావు గంటలోనో, అరగంటలోనో బయల్దేరిపోతారుట-

"టైమ్ ఈజ్ వేస్టాఫ్ మనీ."

ఇంకా ఏం తెమ్మంటారోనని బెంగగా, బెంగ హింసగా, హింస అసహ్యంగా.... అసహ్యం అవమానకరంగా వుంది.

కఠినశిక్ష;

ఆరేళ్ళ బోర్డాఫ్ రెవిన్యూ ఆఫీసులో పనిచేసే దశను.... రెండో యేడాది నించీ మొదలు పరీక్షలు;

మూడు రెవిన్యూ టెస్టులు—

రెండు ఎకవుంట్స్ టెస్టులు—

క్రిమినల్ జుడిషియల్ టెస్టులు—

సర్వే ట్రయినింగు-ఫైనల్ ఎగ్జామినేషన్-

ఏ పరీక్ష ఇంత కఠినంగా వున్నట్టనిపించలేదు.

ఇన్నీ అయినా, "రెవిన్యూ ఇన్స్పెక్టరుగా రెండేళ్ళ చేస్తేనేగాని ప్రమోషన్ లే"దన్నారు-అదీ కష్టమనిపించలేదు-

కృష్ణాజిల్లా వ్యక్తిని. హైదరాబాదులో ఉద్యోగంలో ఉన్నవాణ్ణి. ఈ రెవిన్యూ ఇన్స్పెక్టర్ ఉద్యోగం కోసం-విశాఖపట్నం పంపించేరు.

అదీ ఇబ్బందనిపించలేదు-

"టవున్ ఆరైగా వేసేరా? అయ్యో పాపం;" అని జాలిపడ్డారందరూనూ

"ఎక్కడైతేనేం సార్? కళ్ళుమూసుకుని ఈ రెండేళ్ళూ ఎట్లాగో గడిపేస్తే మళ్ళీ బోర్డాఫీస్ కెళ్ళిపోవచ్చు;" అని సానుభూతిని స్వీకరిస్తూనె సవాలును ఎదుర్కొన్నాడు.

ఛార్జీ పుచ్చుకోకముందే, పద, ఆర్డీవోతోక్యాంపు కన్నారు....

ఎక్కడో వో పల్లెటూళ్ళో వో కొండ, నిజానికి కొండ రెండూళ్ళ భూమిలో ఉంది. రెండూళ్ళ వాళ్ళూ కొండనించి రాయి కొట్టుకుంటున్నారు. ఉన్నట్టుండి తగాదా బైల్దేరింది-అవతలి వూరువాళ్ళు మావూరి వేపు రాయి కొట్టేస్తున్నారంటే, అవతలి వూరు వాళ్ళు మా వూరే కొల్లగొట్టేస్తున్నారంటూను,

డ్యూటీ—

రెండో రోజున కుష్టురోగుల సంఘం ప్రెసిడెంటుగారొచ్చారు, వ్యాధి పీడితుల కాలనీకి ప్రభుత్వం వారివ్వబోతున్న జాగా టవునుకి మరీ దూరంగా

వుంది; అక్కణ్నుంచి వాళ్ళు వూళ్ళోకి ముష్టెత్తుకుందికి ఒచ్చే లోపునే వాళ్ళ ప్రాణాలు పోతాయని వారన్నారు. కుష్ఠురోగుల కాలనీ వూరి నడి మధ్యని పెట్ట డానికి వీల్లేదంటూ హెల్త్ఫీసర్ రికమెండేషన్‌తో రేటుపేయర్ల సంఘం తరపు నొచ్చిన వ్యక్తివాదన, తాసీల్దార్‌తో ఇనస్పెక్షన్.

డ్యూటీయే—

మూడో రోజున ఎక్కణ్నుం చెక్కడికో వెయ్యబోయే కరువు నివారణ రోడ్డు స్వరూప స్వభావాలు-కలెక్టరుగారి ఇన్‌స్పెక్షన్. ఆ రోడ్డుకి ఇరువైపులా యెనిమిది గ్రామాలు. ఆ గ్రామాల రైతులనీ కలెక్టరు వారి దర్శనానికి సిద్ధం చేయించడం; మొరలూ, అర్జీలు పెట్టించడం-డ్యూటీయేగా, మరి!

నాలుగోరోజు-ఉదయం తాటిచెట్ల పాలెంలో యిళ్ళు కాలిపోయేయి. మధ్యాహ్నం పెందుర్తి దగ్గిరేదో వాగు పొంగి ఇళ్ళలోకి నీళ్ళొచ్చేసేయి.

కొంపలంటుకున్నా డ్యూటీ తప్పదు, కొంపలు మునిగిపోయినా డ్యూటీ తప్పదు!

నష్టాలంచనా వెయ్యడం, పేర్లు రాసుకోడం, ప్రభుత్వం వారు తక్షణ రక్షణగా యిచ్చే పరిహారాన్ని సక్రమమైన రసీదులు తీసుకుని పంచిపెట్టడం-

డ్యూటీలే-కాదంటే యెలా?

ఐదో రోజు-అనగా మొన్న-ఎక్కడా ఏ ఉపద్రవమూ లేదు కదా. ఆది వారంకూడా కదా, ఎక్కడేనా ఓ గది చూసుకుని ఈ యన్ జీవో హోమ్ "భూతల శయనంబు"కు స్వస్తి చెబుదాం అనుకుంటూ బయలుదేరుతూ వుండ గానే-

కలెక్టర్‌గారి బంగాళా నుంచి కబురు-

ఎనిమిదిన్నరకి బంగాళాకి చేరితే-పదిన్నర దాకా ఎందుకు రమ్మన్నారో శెలవిచ్చిన దాతలు లేరు.

చివరికి-

మర్నాడు సోమవారం కదా, కలెక్టరుగారి సతీమణి శివార్చన చేస్తారనీ; అష్టోత్తరశత నామావళి అర్చన నాగమల్లి (నాగలించ) పుష్పాలతో చేయడానికి సంకల్పించారని-

అందుకోసం, నూట ఎనిమిదికి తక్కువ లేకుండా నాగమల్లి పువ్వులు కావా లనీ-

ఉదయం ఆరున్నర కల్లా కలెక్టరుగారి సతీమణి స్నానాదికం పూర్తి చేస్తారు కనుక ఆ పువ్వులు ఆ వేళటప్పటికి బంగాళాకి చేరాలని—

అవి ఆ రోజు అప్పుడే కోసిన పువ్వులుగా ఉండాలని—పురమాయించారు.

డ్యూటీ కాకపోవచ్చు కానీ అక్కడెవరికీ ఆ సంగతి పట్టినట్టుగానీ, కసీసం తట్టినట్టుగాని లేదు. "తత్త దఖిలమ్, శంభో తవారాధనమ్"అని అనుకొని, అలాగే సార్-అన్నాడు, కలెక్టర్‌గారి క్యాంపు క్లార్కుతో.

నాగలింగ పుష్పాలకోసం కాంభోజరాజు కథలో శరాబంది రాజులాగ బయలుదేరి విశాఖపట్నం ప్రక్కనున్న సప్త సముద్రాలు-[సనెన్‌సీస్ సముద్రం, రామకృష్ణ మఠ సముద్రం, కోస్టల్ బ్యాటరీ సముద్రం, జాలరిపేట సముద్రం, అగ్రహారం సముద్రం, టవున్‌హాల్ సముద్రం, ఇన్నర్ హార్బర్ సముద్రం-ఈ ఏడున్నూ విశాఖపట్నం వద్దగల బంగాళాఖాతమనే మహా సముద్రమునకు ముద్రవేయని ఉప సముద్రముల పేర్లు] వెతగ్గా-నాగలింగవృక్షం ఒకటి సాయంకాలం అయిదు గంటల ప్రాంతంలో, కనుక్కోబడ్డాది. ఆ చెట్టుగల ఆసామీ—పుష్పాలు కావలసింది రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగారింటిలో పూజకి కాదు, కలెక్టరుగారింటిలో పూజకేనని తెలుసుకొన్నవాడై. వారు "కోరినన్ని" పుష్పాలు స్పేర్ చెయ్యడానికి రిలక్టెంటుగానే అంగీకరించినా, ఉదయం ఏడు దాటితేగాని మాగేటు మాత్రం తెరవం అని అరవంలో చెప్పేడు. అయ్యోర్నాయన, నాయన్నాయన, చచ్చినా నీకడుపున పుట్టం, కావాలంటే పాతిక కేజీల పంచదార పెర్మిటు నీదగ్గర్నుంచి అప్లికేషన్ లేకుండా తెచ్చి దాఖల్ చేసుకుంటాం, ఈ చెట్టు రేపటి రేపటివేళ పూసే పూలలో నూట ఎనిమిది పూలు మాత్రం మీ బంటునిచ్చి మా దొరసానికి రేపు ఆరుగంటలు దాటకుండా పంపుమీ అని ప్రార్థించి ప్రసన్నుణ్ణి చేసుకోవడమైంది. ఎలాగైతేనేమి—

డ్యూటీ కాకపోతేనేం-మూడు డ్యూటీలన్నర కష్టం పట్టింది-

ఆరో రోజు-యమ్ సిక్స్ గారు దిగేరుగా:

ఇవాళ ఏడో రోజు-

హైదరాబాదునుంచి విశాఖపట్నం ట్రాన్స్‌ఫరుకదా అని-ఆరు వందల రూపాయలు ఎడ్వాన్స్ తీసుకున్నాడు—ఇంటిదగ్గర కొంత యిచ్చి, టిక్కెట్ కొనుక్కుని-ఈ ఐదురోజులు పెట్టిన ఖర్చంతా వొకయెత్తూ, నిన్న సాయంకాలం నుంచి ఇప్పటిదాకా వొక యెత్తూనూ.

నిల్ బేలన్స్!

ఏదైనా తెమ్మంటే ఏంచెయ్యాలి?–అని బెంగెట్టుకుంటూ, ఇబ్బంది పడకండా వాళ్ళు అడిగింది తెచ్చివ్వగలిగేటంత మాత్రం డబ్బు తన దగ్గరలేనందుకు–పాపం చేసిన వాడిలా చింత, హింస, అవమానం అనుభవిస్తున్నాడు వాసుదేవరావు.

ఈ ఒక్క కేంపూ యెలాగైనా దాటించు భగవంతుడా ఇకమీదట ఇంకా జాగ్రత్తగా ఉంటాను అని మొరెట్టుకుంటున్నాడు.

*　　*　　*

"బిల్ తెమ్మంటున్నాడోయ్ దొర!" అని గొణుగుతూ యివతలికొచ్చాడు తాసిల్దార్.

ఏదో–"తెమ్మంటున్నాడు"–దొర–అని అర్థమైపోయింది వాసుదేవరావుకి.

ఎదలో ముల్లుదిగి గుండె ఝల్లుమనడం. బిక్క మొహంలో చక్కగా అవుపడ్డాది.

"రెడీ చెయ్యలేదా? ఏమిటలా వెర్రిమొహం వేసుకుచూస్తావు? బిల్లయ్యా బిల్లు! డబ్బు కర్చవడం లేదూ నిన్నట్నుంచి?"

"అయి."

"మరి బిల్లేదీ అంట?"

చక చకా వేసేడు బిల్లు, వాసుదేవరావు, అనుభవంగల హోటల్ బేరర్లాగ. తాసిల్దార్ కొంచెం దూరంగా వెళ్ళి దమ్ము కొట్టుకొచ్చేసరికి పూర్తయింది.

టకటకా వచ్చి బిల్లందుకొని లోపలి కెళ్ళిపోయాడు. తాసిల్దార్. వెంటనే ఎకౌంటు లేని వాడిచ్చిన చెక్కులాగ వెనక్కొచ్చేసేడు కూడానూ. "ఇదేమిటోయ్, నీకేమైనా మతుందా? ఈ బిల్లేమిటి, ఇలావేసేవు? దీనిమీద లాభం సంపాదిద్దామనా, నీ ప్రయత్నం?" అని ఆ కాగితాన్ని వాసుదేవరావు మొహాన కొట్టాడు.

"రామ రామ పిల్లల సాక్షి సార్. నయాపైసల్లో సహా ఖర్చయిందే రాశాను!"

అయితే వొక్కరోజుకే యాభై తొమ్మిది రూపాయల ఎనభయ్యయిదు పైసలైందంటావుటయ్యా?"

"ఒక్కరోజేమండీ నిన్నా ఇవ్వాళ—"

"ఏడ్చావులే! ఆయనొచ్చి ఇరవై నాలుగ్గంటలైనా కాలేదు; నువ్వు రెండ్రోజులకి లెక్క చెబ్తున్నావు;"

"అయి."

"ఇదంతా ఆయన ఇస్తాడనే వేశావా?"

"ఇస్తాడని నేను అనుకోనే లేద్సార్, నిజానికి! అందుకే తమరు వెయ్యమనేదాకా బిల్ వెయ్యనేలేదు."

"షటప్!—అస్సరే లేవయ్యా. వెధవ కొత్త నువ్వూనూ—తొరగా ఇంకో కాయితం తీసుకుని, ఇలా కాకుండా ఏదో. ఆయనకి కష్టం లేకుండా. చూశావు కదూ!— తెల్సిందా?— త్వరగా! ఆయన మళ్ళా పిలుస్తాడు!"

వాసుదేవరావుకి అర్ధమైందిగాని వెంటనే దిక్కు తోచలేదు. వేరే కాగితం తీసుకుని, మరో బిల్లువేశాడు. ఐటం ఐటంకి ఖర్చు తగ్గించుకుంటూపోతే పెద్ద మిగులు కనబడలేదు—మళ్ళీ ఇంకో కాగితం తీసి, కొన్ని ఐటమ్సు వదిలేసి వేసేసరికి పని సుళువుగా తెమిలిపోయింది—

"ఎంతా?— పధ్నాలుగు రూపాయల నలభై ఐదుపైసలు!— పర్లేదు— కదూ?" అని మిస్సివస్‌గా చూసేడు తాసిల్దార్.

కబురొచ్చినప్పుడు లోపలికెళ్ళి, తనపై అధికారుల పైఅధికారి 'ఈ వూళ్ళో కాస్టాఫ్ లివింగ్ చాలా తక్కువే!" అని ఆనందించినప్పుడు వాసుదేవ రావు ఆయన ఆనందాన్ని ఆయనతో పంచుకోలేనంత అధమాధమ మనఃస్థితికి దిగజారిపోయినట్టు కనిపించాడు. అధికారులందరూ హీ హీకారాలు చేసినా అతని మనస్సు హా హాకారాలే చేసింది—

వారిచ్చిన పదిహేను రూపాయలూ తీసుకోగలిగాడు; కాని, 'దోన్ట్‌బాదర్ ఫర్ ది ఛేన్జ్' అన్నవాక్యంతో వారు ప్రసరించిన చూపును మాత్రం వాసుదేవ రావు భరించలేకపోయాడు.

నక్క సింహానికి మంత్రయిపోయి పులివేపు అవమానిస్తూ చూసినట్టని పించిందతనికి.

యాభై అయిదు పైసలు— ఇచ్చేస్తె ఆ అవమానం తగ్గుతుందని అని పించింది, కానీలేవు.

0 0 0

శ్రీవారికి నమస్కారములు.

ఇవాల్టికి ఆరునెల లయింది. మీరు విశాఖపట్నంలో డ్యూటీలో జాయినై, ఈ ఆరునెలల్లో మీరు నాకు రాసినవి రెండే రెండు ఉత్తరాలు. రెండుత్తరాలూ మీరు డబ్బుకోసమే రాయకపోయినా డబ్బు పంపమని మీరు రెండింట్లోను రాశారు.

"దేశంలో ఎంతోమంది ఉద్యోగస్తులు వున్నారు. అందరికీ ఉన్నూళ్ళల్లో ఉద్యోగాలు దొరకవు. అంతమాత్రంచేత పొరుగూళ్ళల్లో ఉద్యోగాలు చేసే వాళ్ళందరూ మీకుమల్లేనే ఉంటున్నారా? పని తీరలేదన్నారు, బాగానే ఉంది ఇల్లు దొరకలేదన్నారు. అదీ బాగానే ఉంది. కాని, వచ్చేజీతంఅంతా మీ ఒక్కరికే చాలనప్పుడు, ఆడదాన్ని నేను ఇద్దరు పిల్లలతో ఏ విధమైన ఆదాయం లేకుండా ఎట్లా బ్రతుకుతానని అనుకున్నారు? పైగా మీకు నేను డబ్బులుపంపటం వొకటా? ఎవరైనా వింటే నవ్విపోతారు!

"క్రితంసారి మీరు నూటయాభై పంపమని వ్రాశారు. నాదొకటి మీదొకటి వుంగరాలు తాకట్టెట్టి పంపాను. ఈసారి మీరు మూడువందలు పంపమని వ్రాశారు, మళ్ళీ అప్పట్లాగానే ఏదయినా వస్తువు తాకట్టు పెడితే మాత్రం విడిపించుకునే అవకాశం ఉంటుందో ఉండదో నాకర్థంగాలా, అందుకని నాగొలుసు అమ్మేసి ఎనిమిదివందలడెబ్భయి రూపాయలు తీసుకున్నాను. ఉంగరాలు విడిపించటానికి నూటఅరవై రెండు రూపాలైంది. మీరు మూడువందలు పంపమన్నారు. కాని నేను నాలుగువందలు పంపుతున్నాను. మీ సొమ్ము మీకు పంపటానికి నాకే మభ్యంతరం?

"టి. యమ్. ఓ. కనక డబ్బు ఇంతకు ముందే అంది ఉంటుంది. ఈ ఉత్తరం అందిన వెంటనే మీరు తీరిక చేసుకుని నాలుగు వీధులూ తిరిగి ఒక చిన్న ఇల్లు, ఎంత చిన్నదయినాసరే, ఆఖరుకు వొక్కరూమైనాసరే సంపాదించండి. అందరము ఒక్క దగ్గరనే పడివుందాము.

"ఏడేళ్ళవ్వస్తూంది. నేను మీ ఇంటి కోడలినై, ఒక్కసారి కూడా మీరు నాకు అన్యాయం చెయ్యలేదు; ఒక్కరోజున కూడా నన్ను మీరు అవమానపరచలేదు. ఎప్పటికప్పుడు నా అదృష్టానికి పొంగిపోవటం తప్ప వేరే రకం ఆలోచన్లే లేవు నాకు. ఇప్పుడీ ఆరునెలల్లో మీరు అవలంబించిన ధోరణి చూస్తూ ఉంటే- చదువులోగాని, లోకానుభవంలోగాని మీకు సమానమైన వ్యక్తినే అయినప్పటికీ ఎందుకో చాలాభయం, కొంచెం ఆగ్రహం కలుగుతూ ఉన్నాయి.

'నాకు తెలిసినంతవరకు మీరు అబద్ధాలు చెప్పరు. సాటి మనిషిని మోసం చెయ్యడం, అగౌరవపర్చడము మీకెంత అసహ్యమో నేనెరుగుదును. చేస్తే ఒకరికి ఉపకారం చేస్తారు, లేకపోతే చాతకాదని చెప్తారు. కాని ఉపకారంలోంచి డబ్బు, అశక్తతలోనుంచి అపకీర్తి తెచ్చుకోటానికి అంగీకరించరు. అట్లాంటి మీకు, ఈ ఆరునెలలనుంచి ఏ దుష్టగ్రహం పట్టింది? మిమ్మల్ని పీడిస్తున్న వ్యసనం ఏమిటి? మీకు కలిగిన బాధలు ఎట్లాంటివి? అవన్నీ తెలుసుకోవాలనే కోర్కెకంటె వాటిని మీతోబాటు అనుభవించాలని, ఎదుర్కోవాలని అనిపిస్తూ వుంది. నాకోర్కె న్యాయమైనదైతే నాకు అవకాశం యివ్వండి.

"మీ మీది ప్రేమచేత ఇంతకంటె కటువుగా వ్రాయలేకపోతున్నాను. స్కూలు మూసేశారు. వేసవికి పాప బడికెళ్ళే పనిలేదు. అందుకని పైగా ఇంక ఇక్కడ వుండాలనిపించక, ఉండలేక నేను ఇవ్వాళే ఇంటికి తాళం పెట్టేసి వుయ్యూరికి వెళ్ళిపోతున్నాను పిల్లలను తీసుకొని. మీకు భార్య, బిడ్డలు, డబ్బు, అభిమానం, సానుభూతి- ఏది కావలసినా మా నాన్నగారి పేరిట వ్రాయండి....

మీ, సులోచన."

* * *

సూకరాజు నవ్వేడు వాసుదేవరావు చెప్పింది విని.

అసలైన రాజకీయ చైతన్యం వున్న జిల్లాలో పుట్టి- నువ్వెక్కడ దొరికావయ్యా బాబూ; గవర్నమెంటు సర్వీసంటే టూ-వే-ట్రాఫిక్కని తెలుసుకోలేక పోయావు. ఇంకెందుకు పనికొస్తావు?.

ఎలా మనవి చేసుకోవాలో అర్థం కాలేదు వాసుదేవరావుకి-

ఎంతసేపూ వెళ్ళు. ఆపని చెయ్యి, ఈపని చెయ్యి-అక్కడ ఆ సప్లయ్‌లు చూడు; ఇక్కడీ ఏర్పాట్లు చెయ్యి- అంటూ కొంపలు మునిగిపోయినట్లు అన్నీ అర్జంటేనంటూ ఆర్డర్సు జారీచేసే తన డిపార్టుమెంట్ అధికార్లకి-

లాభంలేని సెట్టి ఏట్లోపడతాడా? టవునారైగా వేసినప్పుడే సరదాగా జాయినైపోయిన పెద్దమనిషి ఆ పోస్ట్‌లోని లోతుపాతులు కష్టనిష్ఠూరాలు తెలుసుకోకుండానే చేరాడా? వాడి తిప్పలు వాడే పడతాడు!- అని పెదవి విరిచే తన సహాధ్యాయులకి——

తను అర్నెల్లనించి సుఖశాంతుల్లేక, విశ్రాంతిలేక బ్రతుకు తున్నాడని- చివరికి తను కష్టపడి సంపాదించుకున్న జీతంకూడా తన జేబులోకి వెళ్తుందన్న

హామీ లేక భయపడుతున్నాడని-భార్య ద్వారా అమ్మించుకున్న అయిదుతులాల బంగారం పోగొట్టుకుని, పదిహేను వందల రూపాయలకు ప్రోనోట్లు వ్రాసి ఆర్థికంగా అట్టడుక్కి దిగిపోతున్నాడని—

ఎలా మనవి చేసుకోవాలో అర్థంకాలేదు వాసుదేవరావుకి—

ఇది టూ-వే ట్రాఫిక్కన్న విషయంకూడా అతనునమ్మలేదు,

ఎవడో మన దగ్గిరికొక ఉపకారంకోసం వస్తాడు. చేస్తాము- చెయ్యము. చేస్తే వాడు థాంక్సంటాడు. చెయ్యకపోతే, వాడుకాదు మనమే సారీ అనాలి. ఇక్కడ ఈ థాంక్స్ కేష్ చేసుకుని, ఎవడో ఈ వూరికి డ్యూటీమీద గవర్నమెంటిచ్చే అలవెన్సులు తీసుకొని కాంపొచ్చినప్పుడు వాడికి సప్లయ్‌లు చేసి; ఎవడో ఈ వూళ్ళో నిశ్చింతగా వాడిఉద్యోగం వాడు చేసుకొంటూవుంటే వాడికి సర్వీసెస్ చేసి తాను మధ్యని ఉండాలిట. పుట్టి, బుద్ధెరిగిన తరువాత ఎన్నడూ తాహతుకూ, అవసరానికీ మించి ఖర్చుచెయ్యలేదు. తన స్వంత పిల్లలక్కూడా ఒక బిస్కెట్ల ప్యాకెట్టు. ఒక వందగ్రాముల అంగూర్ ద్రాక్ష కొని ఇవ్వడం అనవసరం అనుకున్నవాడు ఆ చేతులతోనే ఈ స్వాములందరికీ బోర్నవిటా, ఏపిల్సు అట్టే మాట్లాడితే ఫారిన్ విస్కీలు సప్లయ్ చేస్తున్నాడు. ఇది టూ వే - ఎలా గైంది; త్రి-వే కదా అన్నాడతను.

'ఇదుగో చూడూ, వాసుదేవరావ్? టు-వే గానీ త్రి-వే గానీ; ఇందులో నీకు కీర్తి ఎలాగైతే అంటదో, తైలంకూడా అలాగే అంటుకోకూడదు;.... యింకా నీపోస్టు నయ్యం. గొయ్యిపడితే పూడ్చుకోడానికి సోర్సెసున్నాయి. మా డిపార్టుమెంటు తీసుకో- మావాళ్ళు ఎంతసేపూ తే. తే. అనడమేగాని ఈ వెధవలు ఎలా తెచ్చిపెడుతున్నారు అన్న ఆలోచనే ఉండదు! వెంకట్రావని, మాకొక రీజినల్ డిప్యూటీ డైరెక్టరున్నాడు; అయనగారికి పన్నెండుమంది పిల్లలూ, పన్నెండు జిల్లాల జ్యూరిస్‌డిక్షనూనూ! ఆయనగారు ఏంచేస్తాడో తెలుసునా? గుంటూర్లో బయల్దేరుతాడు జీపులో పెళ్ళాన్నీ, ఆరుగురు పిల్లల్నీ ఎక్కించుకొని. ఈ వేపున్న ఆరు జిల్లాల్లో పదిహేనురోజులు టూర్ చేస్తాడు. మిగిలిన పదిహేన్రోజులూ పెళ్ళాన్నీ, మిగిలిన ఆరుగురు పిల్లల్నీ వేసుకుని, ఆవేపున్న ఆరు జిల్లాల్లోటూర్ చేస్తాడు. ఇంత మందికీ ఇన్నిచోట్లా ప్రతీనెలా సప్లయిలు మేంచేసుకు పోవలసిందే; అలాచెయ్యకపోతే- ఏముంది; చెడపడానికి చేట పెయ్యాలన్నట్లుగా ఎక్కడో పర్కె బాగులేదంటాడు. అనేసి,

శ్రీకాకుళం వాణ్ని అనంతపురానికి, కర్నూలువాణ్ణి విశాఖపట్నానికి ట్రాన్స్ఫర్ చేస్తాడు. మొన్నామధ్య మా సూపర్వైజర్ ఒకడు ఈ ఖర్చులూ, నలుగురూ పోగేసుకుని బాధపడ్డంచూసి ఏడుపులో నవ్వు వెలగబెడుతూ అన్నాడు; ఇలా ఆరుగురేసి పిల్లలతో ఒక్కసారిగా మీదపడి రోజుకి వందరూపాయలు ఖర్చు పెట్టించే బదులు; ఒక్కొక్క జిల్లాకి ఒక్కొక్క బిడ్డని చొప్పున పన్నెండు జిల్లాలకీ పర్మనెంట్గా ఎలాట్ చేసేస్తే ఏదో చందాలు వేసుకునో. పంతు లేర్పాటు చేసుకొనో,ఆ పిల్లల్నందర్నీ మన పన్నెండు జిల్లాల స్టాఫూ పోషించి పైకి తీసుకురాలేక పోతామా అని!.

వాసుదేవరావు ఆశ్చర్యపడ్డాడు ఈ కథ విని. అతనికి నవ్వుకూడా వచ్చింది, "ఎవరట్లా అన్నది. మొన్న సెంటర్లో మీతో మాట్లాడుతున్న క్రిష్ణమూర్తి గారేనా?" అన్నాడు.

"ఇంకా నయం కాదూ! ఇంతమాట అని వాడింకా ఇక్కడ ఉండడమే! అతనిప్పుడు కడప జిల్లాలో ఏదో స్పెషల్ పోస్టులో అఘోరిస్తున్నాడు!.... అందుచేత—"

* * *

["తోర్న్ బాదర్ ఫర్ ది చేన్జ్!"

o o o

"ఫరవా లేదుంచండి సార్! మేం మీకు ఇచ్చుకున్న దనగా యెంత? మీ దయవల్ల మాకీ లైసెన్సొస్తే మీరే మాకు ఇంతకి నూర్రెట్లు ఇచ్చినట్లు!

o o o

"మొన్న గెస్టుహౌస్లో ఎరేంజ్మెంట్స్ తిన్నగా లేవని కలెక్టరు గారుకూడా పాయింటౌట్ చేసేరయ్యా!—జగర్తగావుండు.లేకపోతే నీ సొమ్మేం పోయిందిగాని మధ్యని మా వుద్యోగాలకీ, పరువుకీ యసరు!"

o o o

"కొండంత దేముడికి కొండంత పత్రి ఇచ్చుకోగలమా. బాబూ, బతుకే వొక గడ్డిపోచ అన్నాడు కవి. ఈ తృణం మా బ్రతుకుతో సమానం, ఇదే పదివేలనుకుని స్వీకరించండి బాబూ."

o o o

"ఎప్పుడూ డబ్బు కర్చయి పోతున్నాదని గోలేనా, వెధవగోలా

నువ్వూను! హెడ్ క్వార్టర్స్ ఆరై అంటే మరేమిటనుకున్నావు! ఎన్నాళ్ళయినా కొత్తవదల్లేదేమిటి, నీకు! వెళ్ళు వెళ్ళు! కబుర్లతో కాలక్షేపం చెయ్యక తిన్నగా పని చూడు."

○ ○ ○

"ఈ సాల్వెన్సీ సర్టిఫికెటు తమ రిప్పిస్తే మీపేరు చెప్పకొని స్టేట్ బ్యాంకిలో లోను పెట్టుకుని మావాడు చిన్న బిజినెస్ పెట్టుకుని సెటిలవుతాడు. బతుకంతా బలాదూరుగా తిరిగి చెడిపోతున్న వాణ్ని ఓదార్లో పెట్టే ఖ్యాతి తమకి మిగుల్తుంది; మీ కలంపోటుతో వొక జీవితం నిలబడుతుంది. మీ కష్టం వుంచుకోంలెండి——."]

○ ○ ○

ఈ రకం మాటలు వినడం అలవాటు చేసుకున్నాడు వాసుదేవరావు క్రమ క్రమంగా. అంతేకాక.

○ ○ ○

["నోనో - లేదండీ. క్షమించాలి. మీరు చెప్పినట్టురాస్తే యింకేమన్నా ఉందా. అది ఎంత పెద్ద రిస్కో మీకు తెలియటల్లేదు —— భూమి మీ ఆక్రమణలో లేకుండా మీరు పట్టాకోసం ప్రయత్నిస్తున్నారు. మీ రాజకీయ నాయకులతో మీరు బాగానే ఉంటారు. ఎటొచ్చీ మమ్మల్నే బతక నియ్యరు. ఇటు ఊళ్ళో జనం, అటు ఆఫీసర్లూనూ. కక్కుర్తిపడినా కడుపు నిండాలి కదండీ.—— మీరు చెప్పిన దగ్గర ఇప్పుడు ఎకరంనేల ఇరవైవేల రూపాయలమ్ముతోంది. ఐదెకరాల పట్టా అంటే లక్షరూపాయలు! మీరు నన్ను యాభై రూపాయలకి కొనాలని ట్రయ్ చేస్తున్నారు ఎందుకండీ,పొసగని వ్యవహారం!ఒక్క ఆఫీసరు కేంపొస్తే నాకు రెండువందలయిపోతుంది!"

* * *

"ఏమిటి సార్ ఈ డ్యూటీలు, చచ్చిపోతున్నాను! క్షణంతీరికలేదు, దమ్మిడీ ఆదాయంలేదూ అన్నట్టుగా ఉంది నాపని. ఆదాయం లేకపోతే పోయింది ఖర్చో?....ఆయనెవరో కలెక్టర్‌గారి ఫ్రెండట. యూనివర్శిటీలో ఏదో నెల్లాళ్ళ పనిమీద వొచ్చాడట, తనకీ, తన అసిస్టెంట్సుకీ తన కుటుంబానికి మెస్ పెట్టుకున్నాట్ట! వాళ్ళ మెస్సు కాదు గాని నా పనంతా మెస్ చేసేసేడు! పదికేజీల పంచదార పట్టుకెళ్ళి అక్కడ స్వయంగా వొప్పచెప్పమని ఆర్డరు. వాళ్ళ దగ్గర

మనం డబ్బులు పుచ్చుకుంటామా సార్? ప్చ్! డబ్బులేముందిలెండి, ఇవ్వాళ ఖర్చుచేస్తాం రేపు భగవంతుడు మనకిస్తాడు!- ఎంత టైమ్ వేస్టండి, ఎంత ఎనర్జీ వేస్టు?"

"ఏదీ, సాల్వెన్సీ సర్టిఫికెట్టేగా; ఇద్దాం. ఇద్దాం? ఇంకామనం మీరుచెప్పిన ఆస్తి వివరాలు చెకప్ చెయ్యలేదు....డాక్యుమెంట్ చూళ్ళేదు....అందులో మా తాసిల్దారున్నాడే, "ఇల్లు" అని అనేసరికి కండిషన్ రాయందే సాల్వెన్సీ నిర్ణయించొద్దని పేచీ పెట్టేస్తున్నాడు!....టయిము రావాలి కదా?-చచ్చిపోతున్నానండీ తీరిక లేక, అన్నిటికీ ఒక్క రెవిన్యూ ఇన్‌స్పెక్టరు ఎక్కడ చస్తాడని ఒక్క ఆఫీసరుకీ కనికారంలేదు!.... మళ్ళీ కనిపించండి; మా ప్యూనుగాడికి మీ ఇల్లు తెలుసుగా? ఎప్పుడో వీలు చూసుకుని వోమారు వస్తాలెండి....ఆ వెధవ, మళ్ళా సమయానికి మీ ఇల్లు తెలీదంటాడేమో, కొంచెం వాడలా అనేయకుండా చూసుకోండి....అ తర్వాత నేనొచ్చి నిమిషాలమీద జరపవలసిన కార్యక్రమం అంతా జరిపించేస్తాను:....అలాగే అలాగే—దానికేం వుంది, నే చెప్తాగా!" ఈ రకం మాటలు మాట్లాడడం కూడా నేర్చేసుకున్నాడు క్రమ క్రమంగానే.

0 0 0

"మీ దగ్గర్నుంచి ఉత్తరంలేకుండా మళ్ళీ మూడునెలలు గడిచిపోయాయి. నిన్న మీతో మాట్లాడదామని ట్రంక్ టెలిఫోన్ కాల్‌బుక్ చేసేను. పి.పి. (మనిషి) దొరకలేదన్నారు. ఈ టెలిగ్రాం చూసుకుని వెంటనే రండి, శుక్రవారం సాయంకాలంలోగా మీరు వుయ్యూరికి రాలేకపోతే శనివారం మెయిల్లో బయలుదేరి నేనే వచ్చేస్తున్నాను- సులోచన."

"వెంటనే రండి" అని టెలిగ్రాం ఇద్దామని టెలిగ్రాఫాఫీసుకి బయలుదేరిన సులోచనకు అంత క్లుప్తంగా ఆఫీసర్‌గారి ఆర్డర్‌లా టెలిగ్రాం ఇవ్వడం అమానుషమని తోచింది. తనకెంతో వుత్కంఠగా ఉండొచ్చు, ఆయన్ని అతి తొందరగా కలుసుకోవాలని, కసిగా ఉండొచ్చు, అతనినిర్లక్ష్యంపట్ల. కాని ఇద్దరి మధ్య ప్రేమబంధం వాటన్నిటిని త్రోసివేయగలది.

"పదకొండు రూపాయల ఇరవై పైసలవుతుందమ్మా."

సులోచన పర్సుతీసి లెక్కపెట్టుకుంది. తొమ్మిది రూపాయల్నర వుంది.

"ఐదారు మాటలు తగ్గిస్తే సరిపోవచ్చునంటున్నాడు కిటికీ అవతలాయన.

కాని, ఆయనతో నేను మాట్లాడబోయిందే తక్కువ, నేనిచ్చే టెలిగ్రామే తక్కువ. ఇంకా ఎట్లా తగ్గించేది? అనుకుందామె. ఫారం తీసుకుని ఇవతలికొచ్చింది,

"హబీబూ! నీ దగ్గర రెండు రూపాయలుంటే ఇవ్వు. ఇంటి దగ్గరిస్తాను" అన్నది సులోచన అక్కడ కనబడిన పోస్ట్‌మేన్‌తో.

"జరూర్ తల్లీ-"అని ఒక ఉత్తరం, రెండు రూపాయలు ఇచ్చాడు పోస్ట్ మేన్.

ఉత్తరం వాసుదేవరావునుంచి -

"నేను మీ గురించి అనుకున్నప్పుడే మీరూ నా గురించి అనుకున్నారు" అని ఉప్పొంగిన హృదయంతో ఉత్తరాన్ని ముద్దు పెట్టుకుని విప్పింది సులోచన.

"కాని, ఉత్తరం తెరిచాక ఆమెకి చాలా నీరసం వచ్చేసింది-

"డియర్ సులోచన-నువ్వు కులాసా అనుకుంటాను. నీకు ఉత్తరం రాయలేకపోయాను. నిజం చెప్పలేక, అబద్ధం ఆడలేక-

"ప్రస్తుతం అనుకోని ఆపదలోపడ్డాను. ఇందులోంచి బయటపడినా,పడక పోయినా, మనం వెంటనే కలుసుకోవచ్చు. నేను ఇన్నాళ్ళూ ఏ విషయమైతే నీతో మాట్లాడడానికి సంకోచించానో అది నీకు తెలియజేయగలిగే ధైర్యం నాకు కలుగుతోంది. అంతులేని సత్యాలను చెప్పే జీవితం. సత్యం రహస్యం కాజాలదన్న సత్యాన్ని కూడా నాకు క్లిష్టతలేకుండా బోధపరుస్తూవుంది.

"ఈ ఉత్తరం నేను నీకు డబ్బు కోసం వ్రాయటంలేదు, అభిమానం కోసం, సానుభూతి కోసం వ్రాస్తున్నాను.

"రేపటి కోసం ఎదురుచూస్తూ, —నీ వాసుదేవరావు"

గుండెల్లో మంట బయల్దేరింది సులోచనకి, పన్నెండురోజుల క్రితం తేదీ వేసిన ఆ ఉత్తరాన్ని సాంతం చదివేసరికి.

ఏమిటి, అయన చిక్కుకున్న ఆపద?

దొంగతనమా! రంకుతనమా?

కొట్లాటా, హత్యా?

స్మగ్లింగా, బ్లాక్ మెయిలింగా?

ఫోర్జరీయా,, ఎమ్ బెజిల్మెంటా?

ఎందులో ఇరుక్కున్నాడు?

రహస్యం-సంకోచం-సత్యం-జీవితం-క్లిష్టత-సానుభూతి—

పదజాలమే కొత్తగా వుంది. ఎదిగినవాడి పదును కనబడుతోంది—

ఎదిగాడా దిగజారేడా?

"సానుభూతికోసం రాస్తున్నాను." అని రాశాడు.

ఇంకొక టెలిగ్రాం పారం తీసుకొంది సులోచన.

"కష్టాలు కలకాలం వుండవు, ధైర్యంగా ఉండండి- సులోచన"

* 0 *

గుండెల్లో బరువును గుండెల్లోనే అణచివేసింది సులోచన. అందుచేతనే కాబోలు, గుండెలర చేతుల్లో పెట్టుకుని తండ్రిగారింటికి చేరింది.

"అమ్మా! ఇదేమిటీ ఘోరం, చూడూ" అంటూ ఇంటికి చేరగానే తండ్రిగారు వార్తాపత్రిక అందజేశారు. ఘోరం అన్నమాటకి భయపడడం మానేసి చాలా రోజులైంది. కాని తండ్రిగారి కంటిలో గిర్రున తిరిగిన చెమ్మచూసి. ఇదేదో ఘోరమే అయి వుంటుందని వణుకు పుట్టింది. సులోచనకు కొన్ని క్షణాలపాటు పేపరు చూడటానికే బుద్ధిపుట్టలేదు. చేతిలోకి తీసుకొన్నా కూడాను.

సుఖాన్ని ఇతరులతో పంచుకోవడము, కష్టాన్ని తానే దిగమింగుకోవడము నేర్చిన సులోచన. ఆ నిమిషంలోనే మళ్ళీ తానైపోయింది.

"విశాఖపట్టం, ఆగస్టు 27—రివిన్యూ డిపార్ట్‌మెంటుకు చెందిన వాసుదేవరావనే ఉద్యోగి వేయి సిమెంటు బస్తాలకు పర్మిట్ ఇప్పిస్తానని ఒక ఆసామీని నమ్మించి, అతనివద్ద పదిహేనువందల రూపాయలు లంచంగా పుచ్చుకొన్నాడని రుజువుకాగా, సదరు వాసుదేవరావును ఉద్యోగంనుంచి బర్తరఫ్ చేయడమేకాక, అతనికి రెండేళ్ళ కఠినశిక్ష విధిస్తూ ఈరోజున—తీర్పు చెప్పారు. ఈ కేసును—నిర్వహించారు."

---

* కఠినశిక్ష - అనేది Rigorous Imprisonment కి తెలుగు, రాష్ట్రస్థాయిలో రెవిన్యూ డిపార్ట్‌మెంటు, ప్రభుత్వ శాఖలో, అతి ప్రముఖమైనది. ఈ శాఖలో Revenue Inspector (రెవిన్యూ ఇన్‌స్పెక్టర్) అనేది ఒక ఉద్యోగం పేరు. రూల్సు ప్రకారం ఈ ప్రభుత్వశాఖలో చేరిన ప్రతి వ్యక్తి ఉన్నతోద్యోగానికి ప్రమోషన్ పొందాలంటే కనీసం రెండేళ్ళపాటు రెవిన్యూ ఇన్‌స్పెక్టర్‌గా (R.I.గా)పనిచెయ్యాలి. లేకపోతే, ఆ వ్యక్తికి ఎంత సర్వీసు వున్నా, ఎన్ని పరీక్షలు పాసయివున్నా సరే ప్రమోషన్ ఉండదు. ఈ R.I. ఉద్యోగ కాలం రెండేళ్ళనీ, "R.I. కోర్సు" అని, Courrse of Rigorous Imprisonment " అనే అర్థం వ్యంగ్యంగా స్ఫురించేటట్టుగా, ఆ శాఖలోని ఉద్యోగులు వాడుతారు, "ప్రమోషన్ వచ్చిందా" అంటే, "ఏదీ ఇంకా R.I. కోర్సు కాందే" అని, "నీ R.I. కోర్సు ఎక్కడ గడిచింది" అనీ. అలాగ.)

** ఈ కథ ఆంధ్రజ్యోతి వీక్లీలో చదివిన కొందరు శ్రీకాకుళం క్యాంపులో మా జాయింటు డైరెక్టర్‌గారితో-మీ వాడు చూడండి ఎంత పచ్చి నిజాలు కథల్లో రాసేస్తున్నాడో-అని పితూరీ చేసేరట. జె.డి.గారే నాకుచెప్పేరు ఇలా నన్ను ఈ కారణంగా సిశాఖపట్నంలో చీవాట్లుపెట్టిన ఆ జె.డి.గారు అలా హైదరాబాదు చేరగానే నన్ను పాడేరు ఏజన్సీకి బదిలీ చేస్తూ ఆర్డర్సు పంపేరు. అయితే అది నాకు కఠినశిక్షగా పరిణమించలేదు.

("ఉదయం" వీక్లీ - ఉగాది సంచిక 1990)

# ఆరేసుకోబోయి పారేసుకున్నాడు

ఎనిమిదేళ్ళకిందట ఒకనాడు ఉదయం మా ఇంటి కాలింగ్ బెల్ మోగితే నేనే వెళ్ళి తలుపుతీస్తే; చక్కగా డ్రెస్ చేసుకుని మొహంలో కాంతి పోసుకున్న ఓ పద్దెనిమిదేళ్ళ కుర్రాడు నిలబడి ఉన్నాడు; అక్కడ. నేను తలుపు తీసీ తియ్యగానే "నాపేరు వెంకటాచలమండి, చినవాల్తేరు నుండొచ్చాను. మీ బట్టలు ఉతికే నారాయణ మా ఫాదరండి" అని గడగడా చెప్పేడు.

"ఓహో, నువ్వా? చదువుకుంటున్నావుట కదు?" అన్నాను, దయగా.

"అవునండి. తొమ్మిదో క్లాసండి."

"రా; లోపలికి లా; అక్కడే నించుండి పోయేవేంటి?" అని ఆ అబ్బాయి అంత సేపటిదాకా లో[illegible]రాకుండా నేనే అడ్డుగా వున్నానన్న సంగతి దాటవేసి దారి ఇచ్చేను.

"అదికాదండి, మా నాన్నగారికి రాత్రినుండీ ఒంట్లో బాగలేదండి: ఒకటే జ్వరం. మీరు ఈరోజు కాంపెల్తారని, మీ బట్టలు ఉండిపోయాయనీ చాలా బాధ పడి పోతున్నారండి. అంచేతండి-"

"అంచేత; నువ్వుగాని ఆ బట్టలు తీసుకు బయల్దేరిసే వేమిటి?" అన్నాను మరింత దయగా.

"మరేండి, మీ కాంపుటైం దాటిపోకుండా మీ బట్టలు మీ కందించేస్తే మీకూ. మా నాన్నగారికీ కూడా హాపీగా ఉంటాదని—" మంచిపని చేస్తూనే ఏదో పశ్చాత్తాప ధోరణిలో అన్నాడు వెంకటాచలం.

"మరి ఏవీ, బట్టలు?"

"కిందను సైకిలు స్టాండు కున్నాయండి. మీ ఇల్లూ, పేరూ సరిగా తెలుసు కోకుండా మేడమీదికి తెచ్చీడం ఎందుకని కిందనే ఉంచేశాను సార్. ఒక్క నిమిషం!"అని చకచకా మేడమెట్లు దిగి వెళ్ళి ఒక్క నిమిషంలోనే బట్టలు పట్టు కొచ్చేడు.

చాకలి నారాయణ కొడుకు వెంకటాచలం ఆ విధంగా పరిచయం అయ్యేడు.

నాకు! ఆ కుర్రాడి వేషం భాషా నాకు బాగా నచ్చేయి. పదిమంది మర్యాదస్తుల కుటుంబాల వాళ్ళ బట్టలు ఉతికే చాకలి కొడుకు కనక ఆ అబ్బాయి మంచి మంచి బట్టలు వేసుకోడంలో వింత ఏమీ లేదని సరిపెట్టుకున్నా అతని మాటలో యాస లేకపోడం, ఆ "మంచీ,మర్యాదా" వంశపారంపర్యంగా వచ్చినవి కావని, వాడి సొంత సంస్కారమే అనీ స్వయంకృషేననీ తెలిసి పోతోంది కదా.

నా బట్టలు మాత్రం తెచ్చేడు. "మిగతావి అంత అర్జంటు కాదన్నారండి మా నాన్నగారు" అని. లెక్ఖప్రకారం అప్పగించి; వెంటనే వెళ్ళిపోలేదు, వెంకటాచలం. మా అమ్మాయి అక్కడొక కుర్చీలో కూచుని, ఎదురుగుండా టీపాయి మీద పరుచుకుని తదేకంగా చూస్తున్న రీడర్స్‌డైజెస్టు సంస్థవారి గ్రేట్ వరల్డ్ అట్లాస్ మీద పడ్డట్టుంది, వాడి దృష్టి. ఆ రోజుల్లో మూడు వందలరూపాయల ఖరీదుండే ఆ అట్లాసు వాడికి అందుబాటులో ఉండదన్నది నిస్సంశయం. అందుచేత వాడు వీలైనంత సేపూ ఆ అట్లాసులోకి మా అమ్మాయి చూస్తున్నంత సేపూ చూసేస్తాడన్నది ఖాయం. తనంతట తాను "ఆపేజీ తియ్యండి, ఈపేజీ తిప్పండి" అని అడక్కపోయినా; వాడు మా అమ్మాయితో సమానంగా ఆ అట్లాసులోకి తొంగి చూడ్డం మా అమ్మాయికి ఎంబరాసింగ్‌గా ఉంటుందేమో అని, అనుమానించి నేను వాణ్ని ఆ విషయంలో నిరుత్సాహ పరచాలని నిశ్చయించు కున్నాను. కాని, డయిరెక్ట్‌గా "అలాంటి ఖరీదైన అట్లాసుల్లో నీతల దూర్చకురా ఒరే చాకలి కుర్రాడా" అని చెప్పేడానికి నా సంస్కారం కూడా అడ్డు తగిలింది. అందుచేత నేను గుప్‌చుప్‌గా లోపలికెళ్ళి, ఓ ముఫ్ఫయి రూపాయలు తెచ్చి వెంకటాచలం మొహంమీద రెండు చిటికెలు వేసేను. వాడు తలెత్తి నావేపు చూసేడు.

"మీ నాన్నకి ఒంట్లో బావులేదంటున్నావుకదా.మందులికీ వాటికీ అవసరం వొస్తుంది, ఈ ముఫ్ఫయి రూపాయలూ పట్టుకెళ్ళు. తరవాత లెక్క చూసుకుందాం." అన్నాను.

వెంకటాచలం డబ్బు అందుకుని "థాంక్యుసర్" అనేసి డబ్బు ముఫ్ఫయి రూపాయలూ ఉన్నాయా అని లెక్ఖయినా పెట్టుకోకుండా జేబులో పెట్టేసుకుని మళ్ళా అట్లాసులోకి చూడ్డంతో, మా అమ్మాయి ఆ పుస్తకాన్ని ఠపీమని పెద్ద చప్పుడు చేస్తూ మూసేసి స్ప్రింగ్ తన్నినట్టు స్పీడుగా నిలబడింది. వెంకటాచలం నాతో; "సార్; ఆ అట్లాసు ఒక్కసారి తిరగేసి చూడొచ్చునా, సార్?" అన్నాడు.

మా అమ్మాయి; (ఎంతైనా నాబిడ్డ కదా) గొప్ప పేట్రనైజింగ్ టోన్‌లో, "ఓ, ష్యూర్!" అని పర్మిషన్ ఇచ్చేసి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

వెంకటాచలం నిర్భయంగా మా అమ్మాయి ఖాళీచేసిన కుర్చీలో కూర్చుని అట్లాస్ తిరగెయ్యడం మొదలు పెట్టేడు.

మన దగ్గిర కూలిడబ్బులు తీసుకుని మనకి చాకిరీ చేసే పనివాళ్ళ కొడుకులో కూతుళ్ళో మన పిల్లలు చదివే పుస్తకాలు స్వతంత్రంగా చదివేస్తేనూ; మన పిల్లలు ఉపయోగించే ఫర్నిచరూ. వెహికిల్సూ చనువుగా ఉపయోగించేస్తేనూ మనం సహించం. కాని గబుక్కున ఏదైనా అనడానికి కూడా నోరు పోరు రాలేదు. అలాగని వెంకటాచలాన్ని ఏదోరకంగా చిన్నచూపు చూడాలని, ఆ సంగతి వాడికి బోధపడేటట్టుగా ఆ ఉద్యమం సాగాలని నాలో రేగిన కోరిక చావలేదు. అందుకనే కాబోలు; నేను ఇంకో కుర్చీలో కూర్చుని సంభాషణ మొదలెట్టాను.

"ఎంత చదువుతున్నావు నువ్వు; తొమ్మిదా?"

"ఉఁ."

"ఇది నీ స్థాయికి అందదు. స్కాలర్లీ ఎడిషను."

"ఉఁ."

"అంతగా నీకు అట్లాస్ సరదా ఉంటే ఈ సారెప్పుడైనా ఒక సెలవు రోజుని రా,అక్స్‌ఫర్డ్ వాళ్ళు వేసింది స్కూల్ అట్లాస్ అనిఉంది,అది నీకుఇచ్చేస్తాను. ఈ అట్లాస్ కొన్నాక మా పిల్లలు దాని మొహం చూడ్డం మానేసేరు."

"అది నా దగ్గిరుంది సార్" అన్నాడు వెంకటాచలం నావేపు చూడకుండానే.

పనివాళ్ళో, వాళ్ల పిల్లలో మన ప్రిమిసిస్‌లో ఉన్నప్పుడు వాళ్ళు అటూ ఇటూ చూసి ఏదో చిన్నవస్తువు జేబులోనో బొడ్లోనో దోపేసుకుని చల్లగా జారుకోకుండా కాపలా కాసే సంస్కృతి. నాలో కూడా ఉండడం వల్ల కాకపోయినా, నేను నా సరదా కోసం నా పిల్లల వికాసం కోసం మూడు వందల రూపాయలు పోసి కొనుక్కున్న ఆ అట్లాస్ గురించి, లేదా అందులో ఉన్న గొప్ప విశేషాలను గురించి వెంకటాచలం మెప్పుగా ఏదైనా అంటే (నైబర్స్ ఎన్వీ. ఓనర్స్ ప్రైడ్) స్వీకరించడం కోసం మరింతసేపు నేను అక్కడే కూర్చున్నాను. కాని వెంకటాచం తన ఆనందాన్ని గాని విభ్రమనుగాని

నాడో పంపుకోక పోయేసరికి నాకు బోరుకొట్టి; "సర్లే. నువ్వు వెళ్ళేటప్పుడు ఈ తలుపు దగ్గిరిగా వేసి వెళ్ళు.మీనాన్నకి శ్రద్ధగా వైద్యంమాత్రం చేయించు." అని చెప్పేసి లేచాను.

మా పుత్రాళ్ళు చదివి వదిలేసిన పుస్తకాలు గాని, వాళ్ళకి పొట్టిగానో ఔటాఫ్ ఫేషన్‌గానో, అనిపించే బట్టలు గాని అడుక్కోడానికి వెంకటాచలం మా ఇంటికి అంతకి ముందుగాని ఆ తరవాత గాని ఎప్పుడూ రాలేదు. వెంకటా చలం మా ంటికి రెండోసారి (నాలుగేళ్ళ కిందట) రావడం ఎలా జరిగిం దంటేను ——

విశాఖపట్నంలో భారత నౌకాదళానికి చెందిన "పూర్వ ముఖ్యాలయు" (ఈస్టర్న్ నేవల్ కమాండ్) ఉంది కదా. ఆ సంస్థలో బాచిలర్ సెయిలర్స్ (అనగా అవివాహిత నావికుల)కోసం హాస్టల్స్ లాంటివికూడా ఉన్నాయి. ఎక్కడెక్కడి నుంచో నౌకల్లో వచ్చే నావికులూ, ఇక్కడ శిక్షణ పొందేవాళ్ళూ ఆ హాస్టల్సులో టెంపరరీగా కొందరు, పర్మనెంటుగా కొందరు ఉంటారు. "సత్రాః భోజనా, మఠాం నిద్రా" రకం ఉద్యోగులు, వాళ్ళు. అయితే మనిషికి భోజనం నిద్రా కాక వేషం కూడా అవసరం కదా. ఈ "నావికులు" తమ దుస్తులు, దుప్పట్లు ఉతికించుకోడానికి ఊళ్ళో చాకళ్ళని పెట్టుకోనక్కర్లేకుండా (దానికోసం సమయం వృథా చెయ్యక్కర్లేకుండా) కేంపస్‌లోనే ధోబీలు, ధోబీఘాట్‌లు ప్రభుత్వ నియామక నిర్మాణాలవల్ల అమరి ఉంటాయి. ఆ కారణంగా నాలుగేళ్ళ కిందట రెండు "ధోబీ" వుద్యోగాలు ఖాళీపడ్డాయి. అప్పటికి వెంకటాచలం ఇంటర్ రెండో ఏడాది చదువు పూర్తిచేసి ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజిలో తన పేరు రిజిస్టర్ చేసుకున్నందువల్ల సహజంగా ఇతనికి ఆ ఉద్యోగానికి ఇంటర్ వ్యూకి వెళ్ళమని కాగితం వచ్చింది. వెంకటాచలం—ఆ ఉద్యోగం నేనుచెయ్యను; అందుచేత ఆ ఇంటర్వ్యూకే వెళ్ళను, అని మొరాయించేడట; నారాయణ నా దగ్గిరకొచ్చి మొరపెట్టుకుని "ఆడికి తమరంటే గవురవం బాబూ. తమరోసారి సెప్పి వొప్పించరా?" అని వాడి ధోరణిలో (కాళ్ళా వేళ్ళా పడి) నన్ను అడి గేడు, "సరే, ఏదో సాకుపెట్టి మీ కుర్రాణ్ని నా దగ్గిరికి పంపించు;" అన్నాను. ఈసారి నారాయణ నా బట్టలు కొన్ని వుతికి ఇస్త్రీచేసి, తను అర్జంటుగా ఏదో ఊరెళ్తున్నాననీ, ఈ బట్టలు వెంకటాచలమే మా ఇంటికి అందచెయ్యాలనీ చెప్పి తన పాత్ర తను సమర్థవంతంగా నిర్వహించేడు.

"ఇంటర్ పేసయ్యేవుకదా, డిగ్రీకి చదువుతావా, లేకపోతే ఏదైనా ఉద్యో

గానికి వెళతావా? నీకూ ఇరవై ఏళ్ళు దాటేయికదా, మీ నాన్నకి చేతికి అందు కొస్తావని అడుగుతున్నాను!" అని ప్రారంభించాను, సంభాషణ.

"ఉద్యోగం దొరికితే చేస్తానండి," అన్నాడు వెంకటాచలం.

"ఇహనేం మరి! ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజికి వెళ్ళి నీ పేరు రిజిస్టర్ చేయించుకో. గురునాథరావుగారని, అక్కడ పనిచేసే ఆఫీసర్ ఒకాయన నాకు తెలుసు. ఏదైనా ఉద్యోగానికి కాల్ లెటర్ వచ్చేటట్టుగా నేను చూస్తాను."

"రిజిస్టర్ చేశానూ, కాల్‌లెటర్ వచ్చింది కూడానండి. ఐతే ఆ జాబ్ నాకిష్టంలేదు సార్. ప్యూన్ పనైనా చేస్తాను గానండీ, ధోబీ పనిమాత్రం చెయ్య నండి." అన్నాడు వెంకటాచలం.

వివరాలేవీ నాకు తెలియనట్టు నటించి సంగతంతా వెంకటాచలం నోటంటే రాబట్టేను. "ధోబీ అయితేనేం వోయి! నెలకి పన్నెండు వందల రూపాయల జీతం ఇస్తారుకదా, పైగా ఈ పని అయితే నేర్చుకోడం తప్పులు చెయ్యడం ఉండవు, నీకు. మాట పడకుండా అవలీలగా పనిచేసీగలవు. నన్నడిగితే ఇందులో చేరిపోడమే బెస్టు" అన్నాను.

"చదువుకున్న వాడికంటే చాకలాడు మేలని మీరేదో పాత సామెత చెప్తే చెప్పొచ్చు గానండి, నేను ఆ పని కూలికిగానీ జీతానికిగానీ చెయ్యదల్చుకో లేదండి." అని ఒక్క క్షణం ఆగేడు, వెంకటాచలం.

"అదేం అలాగ? కులవృత్తిలో అవమాన పడవల్సిందేం ఉండ కూడదే?" అన్నాను.

వెంకటాచలం సన్నగా నవ్వేడు. "మీరేమీ అనుకోనంటే ఒక ఇన్సిడెంట్ చెప్తానండి." అన్నాడు.

"చెప్పు, చెప్పు!" అన్నాను. వాడు కొంచెం ఉషారులో పడితే నేను పాఠం చెప్పడం సులువయిపోతుందన్న ధీమాతో.

"చెప్పు చెప్పు—అన్నారుకదండి సార్. ఇది చెప్పుకి సంబంధించిన సంగతేనండి. మా వీధిలో వెంకటేశ్వర శర్మగారని ఒకాయన ఉన్నారండి. సేల్స్‌టాక్సాఫీసులో క్లర్కండి. ఆయనమీద ఏదో కంప్లేంటొస్తే సస్పెన్షన్‌లో పెట్టేరండి. ఎన్క్వయిరీలో శర్మగారికి ఫేవర్‌గా కొన్ని సాక్ష్యాలొచ్చేయండి. అంచేత ఓసారి ఆఫీసర్‌గారితో స్వయంగా మనవి చేసుకుందామని శర్మగారు ఆయనింటికి వెళ్ళేరండి. వీధి తలుపు గడియ పెట్టుంటేను, తలుపు ఎన్నిసార్లు పిల్చినా యెవరూ రాలేదెందుకని తలుపు సందులోంచి చూసేడంటండి. సరిగ్గా సమయానికి ఆఫీసర్‌గారు లోపలి వరండాలో తన చెప్పు తెగిపోతే రిపేరు చేసు

కుంటూ కనబడ్డారటండి. ఇంతలోకి ఆఫీసర్ గార్ని చూడ్డానికి సిటీ ఎంపోరియం
ప్రొప్రయిటర్ నీలకంఠంగారొచ్చి—ఏంటయ్యా, అయ్యగారేం చేస్తున్నారు—
అని శర్మగార్ని పలకరించేరటండి. నీలకంఠం గారికీ శర్మగారికీ బాగా దోస్తీ
కదండి; అందుకని శర్మగారేమో, అయ్యగారు కులవృత్తి చేసుకుంటున్నారని
జోకేస్తే యిద్దరూ నవ్వుకున్నారటండి ఆ తరవాత మరేంటైందో; ఓటయ్యగారు
మర్నాడు శర్మగార్ని పిల్చి.సారీ పంతులుగారూ, మీ కేసులో నేను మీకేమీ
వుపకారం చెయ్యలేకపోయానండి, మీరింక కులవృత్తి చేసుకోవలసిందేనండి
అని చెప్పేసి ఉద్యోగం తీసేసిన ఆర్డర్ చేతికిచ్చేశారటండి.”
ఓరి గుండెలు తీసిన బంటూ, ఎంత మాట అన్నావురా! అనుకుని
నిర్ఘాంతపోయాను నేను.
“నేను పదోక్లాసు చదువుతున్నప్పుడే ఈ ధోభీ పని చెయ్యకూడదని నిర్ణ
యించుకున్నానండి. ఓరోజు సోషల్ మేష్టారు ఒక పాఠం బోధపరచడానికండి;
గుడ్డమీద అంటించి మడతపెట్టిన ఇండియా మేప్ ఒకటి తెచ్చేరండి. పాఠం
అయిపోయాకండి, ఆ మేప్‌ని ఎప్పట్లాగ మడతపెట్టడం మాస్టారికి చేతకాలే
దండి. మా క్లాస్ లీడర్ సురేష్ ఆ మాప్ తీసుకుని ట్రై చేసేడండి, కాని మడత
మరింత పాడైందే తప్పా అతనికీ చేతగాలేదండి. అప్పుడు మా మేష్టారేమో;
“పిచ్చి వెధవల్లారా; మీకు చాతకాదర్రా ఆ పని. వెంకటాచలానికి ఇయ్యి;
క్షణంలో మడత పెట్టేస్తాడు” అన్నారండి. నేను-అలాగే సార్- అనే వరకూ
అందరూ నవ్వేరండి; ఆఖరికి సరిగ్గా మడతపెట్టేక కూడా నవ్వేరండి. అదుగో,
అప్పుడు నిర్ణయించుకున్నానండి; ఈ జన్మలో చాకలి పని చెయ్యకూడదని!”
వెంకటాచలం చెప్పిన రెండు సంఘటనలూ నన్ను గాయపర్చిన మాట
నిజమే. ఐనా సరే. అతని చిత్తశుద్ధినీ ఫ్రాంక్‌నెస్‌నీ మెచ్చుకోకుండా ఉండ
లేకపోయాను. పైగా, వెంకటాచలం ఇంత పొగరుబోతుతనంగా నిర్భయంగా
మాట్లాడినా అతని తండ్రి నారాయణ మీద నాకున్న సానుభూతి వెంకటాచలాన్ని
క్షమించగల ఔన్నత్యం ఔదార్యం నాలో స్థిరపరిచింది. అందువల్ల; ఆ మరుచటి
నెలలో వెంకటాచలానికి మరో ప్రభుత్వ కార్యాలయంలో ప్యూన్‌పోస్టుకి
ఇంటర్‌వ్యూకి రమ్మని పిలుపు వచ్చినప్పుడు ఆ నియామకం చేసే అధికారి
సలాహుద్దీన్ నా క్లాస్‌మేట్ అయి వుండడంవల్ల అతనితో గట్టిగా చెప్పి ఆ
ప్యూన్ ఉద్యోగం వెంకటాచలానికి ఇప్పించగలిగేను.
ఈ నాలుగేళ్ళపాటూ వెంకటాచలం సంగతి నేనాట్టే పట్టించుకోలేదు.
చాలా దూరానికి ఇల్లు మారడంవల్ల చాకలిపనికి నారాయణకి బదులు మా కొత్త



ఆరేసుకోబోయి పారేసుకున్నాడు

ఇంటికి దగ్గిరిగా ఉన్న సుబ్బియ్యాని పెట్టుకున్నాం. ఎప్పుడైనా వెంకటాచలం గుర్తొస్తే అతగాడు ఇంటర్ పాసయేడు కనక, చదువుమీద ఇంటరెస్టూ స్వయం కృషిమీద నమ్మకం ఉన్నవాడు కనకా డిగ్రీకి ప్రయివేటుగా చదివి, పైపూ, షార్టుహాండూ నేర్చుకుని ఏ గుమస్తాగానో స్టెనోగ్రాఫర్‌గానో అభివృద్ధి సాధించి ఉంటాడని ఊహిస్తూ వచ్చాను; మొన్న ఆదివారం అతగాడు నాకు పూర్ణా మార్కెట్ దగ్గిర కనబడేటంత వరకూనూ.

"బావున్నావా? ఉద్యోగంలో ఏమైనా అభివృద్ధి వచ్చిందా?" అని పరామర్శించాను.

"బాగులేనండి. ఉద్యోగం సంగతంటారా; మీరే గెల్చారండి" అన్నాడు వెంకటాచలం.

"నేను గెలవడ మేమిటి. మధ్యని?" అన్నాను.

"అదంతేనండి. చాకలాడికి పుట్టినందుకు నేను చాకలిగానే బతకాలని మా నాన్నగారితో బాటుగా మీరుకూడా ఒకప్పుడు అనుకున్నారు కదండి! అందుకని మీరే గెల్చారంటున్నానండి."

"నువ్వు కోరిన ప్రకారం నీకు నేను ప్యూన్ ఉద్యోగం ఇప్పించేను కదా; మళ్ళీ ఇదేం మాట?" అన్నాను.

"అంతా అలా జరిగిపోయిందండి. సలాహుద్దీన్‌గారున్న ఎడాదిపాటూ ఏం మోశానో, కాగితాలు. ఆ తరవాత కాగితాల మోత పోయి బట్టలమోత తగిలి చాకలినై పోయానండి."

"అదెలా జరిగింది? తరవాతొచ్చినాయన నిన్నేమైనా డిస్మిస్ చేస్సేడా?"

"ఆలా చేసినా బాగుండేదేమో! కాని, సలాహుద్దీన్‌గారి తరవాత వొచ్చిన రామలింగస్వామిగారికి ఓరోజు అర్జంటుగా చాకలి కావలసి వస్తే పోనీ కదా అని మా నాన్నగార్ని వప్పగించేనండి. నేను మా నాన్నగారి కొడుకునని తెలిసే వరకు డబ్బులిచ్చి చాకలి పని మా నాన్నగారికే ఇచ్చేరండి. ఆ తరవాత; ఒరే వెంకటాచలం; నువ్వు ఇవాళ నుంచీ ఆఫీసుకి రాకు, బంగళాలోనే ఉండిపోయి ఏరోజు బట్టలు ఆరోజు ఉతికేసి ఇంటికి వెళిపో; నీకు ఆఫీసువాళ్ళు నెలనెలా జీతం నీ కాళ్ళ దగ్గిరికి పట్టుకొచ్చి ఇచ్చేసే ఏర్పాటు చేస్తాను. ఏముంది పెద్ద కష్టం! ఓవర్ హెడ్ టాంకులో సమృద్ధిగా నీళ్ళుంటాయి. సబ్బులు, సబ్బుగుండలు, సోడాగుండ, నీలిమందు, గంజి, ఏం కావలిసినా నీ చేతిడబ్బు నయాపైసా పడకుండా అన్నీ నేను ఏర్పాటు చేస్తాను. రోజూ ఒక్కపూట పనిచేస్తె చాలు; నెలజీతం పన్నెండు వందల రూపాయలూ నీకొచ్చేస్తుంది. పైగా నెలకో పదిరోజులు నాతోబాటు నువ్వుకూడా టూర్లకి పోలో అయినట్టు రాసి నెలకి రెండువందలు తక్కువ కాకుండా టి.ఏ. కూడా ఇస్తాను; అన్నా

రండి. ఏదో, పెద్ద ఆఫీసర్‌గారు కదా అని మొహమాటపడి ఒప్పుకున్నందుకు చివరికి పర్మనెంటుగా చాకలినై పోయానండి, వారు ఒక్కపూట అన్నారు గానండి; ఉదయం ఉతుకుడు మధ్యాన్నం ఇస్త్రీ- ఇలాగ రెండుపూటలా పనొచ్చి నా నెత్తిమీద పడ్డాదండి. రామలింగస్వామిగారు ట్రాన్స్ఫరై వెళ్ళిపోతూ తన దగ్గిర ఛార్జి తీసుకున్న సుబ్బరామశాస్త్రిగారికి చెప్పేశారండి- "దిస్ వెంకటాచలమ్ ఈజ్ ఎ జెమ్ ఆఫ్ ఏ ధోబి, ఇతన్ని ఆఫీసుకు మాత్రం మార్చకు" అని! అలాగలాగ చాకలాణ్ణై అయిపోయానండి. మా ఆఫీసులో ధర్మయ్య అని ఒకడున్నాడండి. వాళ్ళకి తండ్రి తాతల కాలంనుంచీ చెప్పులు కుట్టే బిజినెస్సండి. అలాగే గంగయ్య ఉన్నాడండి. వాళ్ళకి లక్ష్మీటాకీసు దగ్గిర ఒక సెలూన్, అదికాక శ్రీనివాస కళ్యాణ మండపాన్ని అనుసరించి మేళం ఉన్నాయండి. ఐనా వాళ్ళిద్దర్నీ ఆ పన్లకోసం పిలవడానికి ధైర్యంలేని మా అధికార్లకి నామీద మాత్రం గొప్ప అభిమానం సార్."

"గుమస్తా పోస్టు ఏదైనా ఖాళీవస్తే దరకాస్తు పెట్టుకో. కొంచెం సర్వీసు అయింది కనకానూ, ఏదో ఇంటర్ దాకా చదివేవు కనకానూ నీకు ఇస్తారేమో. ఆ తరవాత నువ్వు గుమస్తావై పోతే చూస్తూ చూస్తూ నిన్ను బట్టలుతకడానికి పిలవరు కదా." అని ధైర్యం చెప్పబోయేను.

"ఆ సరదా కూడా తీరిపోయిందండి. కిందటి నెల్లో రెండు పోస్టులొచ్చేయండి. అందులో ఒకటి బి.సి.కి రిజర్వేషన్ కూడానండి, అందుకనండి; దినం తప్పక వారి మురికి అంతా వదలగొడుతున్నాను కదా, నా మురికి బతుకు తెల్లార్చకపోతారా, నాకో పోస్టు ఇయ్యకపోతారా అని అయ్యగార్తోనూ అమ్మగార్తోనూ కూడా చెప్పుకున్నానండి. కానీ, నేను తప్పుకుంటే బట్టలుతకడానికి వేరే మనిషిని పెట్టుకోడం; దానికి చేతి డబ్బు కర్చవడం ఒకటీనీ: పైగా బట్టలు చిరగడం మారిగిళ్ళయిపోడంలాంటి రిస్కులొకటీనీ! అందుకని నా కింకొక రాత లేదనుకుంటానండి."

"పోనీ ఒకలా చెయ్యి. బట్టలుతికేటప్పుడుకొంచెం మోటుతనం ఉపయోగించీ: కాస్తబ్లీచింగు పౌడరు తగిలించీ: ఇస్త్రీ చేసేటప్పుడు మరికొంచెంహీటు పెంచీ నీ నైపుణ్యం చూపిస్తే ఏమైనా మార్పుకి అవకాశం ఉండొచ్చేమో?"

"సారీ సార్, నా స్వభావంలో ఉన్న బేసిక్ మోరల్ నన్ను అలా చెయ్యనివ్వదండి."

"సరే: నా కర్జంటు పనుంది: నేను వెళ్తాను. ఎప్పుడైనా కనిపిస్తూ ఉండు, మా పిల్లలందరికీ నువ్వంటే అపేక్ష, నీకు తెలుసు కదా! మీ నాన్నని అడిగేనని చెప్పు." అని వెంకటాచలాన్ని అక్కడితో వదిలేశాను. *

(“జ్యోతి” మాసపత్రిక-నవంబరు 1978)

# ఇప్పగించే [illegible]థ

ఏర్ కండిషన్డ్ రూము తలుపు తెరుచుకొంది. తలుపు తెరిచి వారగా నించున్న ఒరియా నౌకరు మహాపాత్రో వినయంగా సలాం చేస్తూ “ఎమ్. డి. గారు డైచేమన్నారు సార్ తమర్ని” అన్నాడు.

“సరి! ఎంతసేపయింది?”

“ఐదునిముషాలయింది సర్.”

“ఫోన్ చేశారా?”

“లేద్సార్. వారే స్వయంగా మన రూం దగ్గరకొచ్చి పిలిచారు సర్.”

“ఐసీ——”

కుర్చీదాకా వెళ్ళికూడా అందులో కూర్చోకుండా దాన్నోసారి గిర్రున తిప్పాను. నా మనసులో ఆలోచన్లుకూడా గిర్రున తిరగడానికి ప్రయత్నం చేసేయి, ఎమ్. డి. గార్నోసారి తలవగానే. “పేకిట్ ఈజీ బాస్” అన్న ధోరణిలో నలభయి రెండు మెట్లూ దిగి రెండో అంతస్తులోవున్న ఎమ్. డి.గారి గది దగ్గిరకి వెళ్ళాను.

ఎమ్. డి. గారి రూం తలుపుకి మీదుగా ఆయన ఖాళీగా వున్నారని తెలిపే పసుపు పచ్చదీపం వెలుగుతోంది. దర్వాను రెండుచేతులా నమస్కారం చేసి తలుపు తెరిచి పట్టుకున్నాడు.

“గుడ్మార్నింగ్ సర్” అంటూ లోపల ప్రవేశించాను.

మేనేజింగ్ డైరెక్టరుగారు తన సీటులో లేరు. రిలాక్సింగ్ సోఫాసెట్లో ఇద్దరికీ సరిపడే సోఫాలో కూర్చుని వున్నారు. సింగిల్ చేర్, ఎదురుగా టీపాయ్ ఖాళీగా వున్నాయి.

“గుడ్మార్నింగ్. హౌ ఆర్యూ మిస్టర్ కృష్ణయ్యా?”

“ఫైన్ సర్-” అని చేయిచాపాను,

“ఐనో. ఐనో! అని చిరునవ్వుతో నా చెయ్యి ఆడించి ప్లీజ్ బి సీటెడ్” అన్నారు.

"థాంక్యూ సర్," అంటూ కూర్చున్నాను.

మేనేజింగు డైరెక్టరుగారు కాలితో బెల్ నొక్కారు. జపనీస్ క్లైమ్స్ ఇంపైన చప్పుడుతో మోగాయి. మరుక్షణం దర్వాను తలుపు ఓరగాతెరచి వినయంగా వంగాడు.

"ఎవర్నీ పంపొద్దు. టెన్ మినిట్స్" అని కరుగ్గా చెప్పారు ఎం. డి.

"ఎస్సార్"

తలుపు మూసుకుంది.తలుపుకు పైన అవతలకీ ఇవతలకీ కనపడే యెర్ర దీపం అందంగా వెలిగింది. అది అలా వెలిగినంతకాలం ఆ గదిలోకెవరూ అడుగు పెట్టడానికి వీల్లేదు.

ఎం. డి. గారు సోఫాలో దిండు సరి చేసుకుని విశ్రాంతి తీసుకునే భంగిమలో కాళ్ళుజాపి కూర్చున్నారు.

సిగరెట్టు పెట్టెతీసి ఆయనొకటి వెలిగించి పెట్టె, లైటరు అందించారు నాకు.

ఒళ్ళంతా మెలికలు తిప్పుకుంటూ "థాంక్యు సర్" అన్నాను: సిగరెట్టు పెట్టెను సుతారంగా దూరంగా తోస్తూ.

"తీసుకోండి. మీరు కాలుస్తారని నాకు తెలుసు!" అన్నారు ఎం. డి.

బాగుండదని తీసుకున్నాను. దర్జా ఐన ఫారిన్ సిగరెట్టు రెండుదమ్ములు పీల్చి భయంగా చూస్తున్నట్టు నటించాను. "స్వయంగా నా రూంకొచ్చి పిలిచారట సార్" అన్నాను.

"మీరు సదుపాయంగా కూర్చోండి" అన్నారు ఎం. డి.

"నో సర్! నాకిలా బావుంది!" అన్నాను కుర్చీలో యిబ్బందిగా కదిలి.

"మీతో నేను పదినిమిషాలు గడపాలి. మీరు సౌఖ్యంగా కూర్చోడం నా అభిమతం!" అని. టీపాయిని చేత్తో నాకాళ్ళ దగ్గరకు తోశారు. "మీరు దానిమీద కాళ్ళు పెట్టుకుని హాయిగా కూర్చుంటే, నేను ఇలాంటి మర్యాదలమీద టైంవేస్టు చెయ్యకుండా మాట్లాడగలను!" అన్నారు ఎమ్.డి. కఠినంగా.

తప్పిందిగాదు.

కుర్చీలో వెనక్కు వాలబడి, కాళ్ళు రెండూ టీపాయ్‌మీద రెస్టుచేసి, మాయింటిలోనో, ఆఫీసులో నా రూమ్‌లోనో కూర్చున్నట్టు కూర్చున్నాను. కింగుసైజు ఫారిన్ సిగరెట్టు ఇంకా ముప్పాతిక భాగం వుంది.

* * *

"నేనిక్కడికి ఎం. డీ. గా వచ్చి రెండేళ్ళయింది!"

"ఎస్సార్."

"ఈ రెండేళ్ళలో మిమ్మల్ని స్వయంగా కలవడం-ఇవ్వాళ్టి సమావేశంతో-పంధొమ్మిదిమాట్లు."

"సారీ సార్, వర్క్ యెక్కువగా వుంటోంది. కాగితాలు పంపిస్తే తమరు ఆర్డర్సు వేస్తూనేవున్నారు. స్వయంగావచ్చి మిమ్మల్ని డిస్టర్బ్ చేయడమెందు కని-అవసరం వుంటేతప్ప తమర్ని బాధపెట్టడం లేదు" అన్నాను,

"మంచిదే, కాని కాగితాలు చూసినంత మాత్రంచేత బోధపడనివి ఏవి వున్నా నేను కూడా మిమ్మల్ని శ్రమ పెట్టకుండా మీ డిప్యూటీతో మాట్లాడి సెటిల్ చేస్తున్నాను,

"యస్సార్. ఆయన నాతో అప్పుడప్పుడు చెప్తారు. బాస్ పిలిచారు; ఫలానా విషయం గురించి అడిగారు. ఆర్డర్సు వేసారు అంటూనూ. ఆర్డర్సు పడ్డా యవి రిలీఫ్‌గా వున్నప్పటికీ తమరు నన్నేపిల్చి అడగలేదేమా అని అప్పు డప్పుడు ఖేదం కలుగుతూనే వుంటుంది నాకు" అన్నాను-

ఎం. డి. గారు అందంగా నవ్వారు. "మీ డిపార్టుమెంటులో ఏదేనా ఫైలు కాగితంద్వారా నాకు వివరం ఆమూలాగ్రంగా అందించలేకపోతే నేను ముందుగా పిలిచేది మిమ్మల్నే. కాని మీరు దొరక్క కాగితం సెటిలవకండా నా దగ్గరుండి పోవడం నాకు యిష్టం వుండక, మీ డెప్యూటీ చెప్పిన దానిమీద ఆధారపడాల్సి వస్తూంది!—ఆ సంగతి మీకెప్పుడూ తట్టలేదా!"

కాళ్ళు టీపాయ్ మీదినుంచి తీసేశాను.

ఈ డెప్యూటీగాడు ఇంతపని చేస్తాడా అని నాకు కసి కలిగింది. నిమ్మకు నీరెత్తినట్లు నిశ్చింతగా మాటల్తో గోతులు తవ్వుతున్న ఎం. డి.ని చూసి భయం వేసింది కూడా.

"లేదుసార్. అలా నేనెప్పుడూ అనుకోలేదు. బైదిబై, నేను దొరకలేద న్నారా సార్?" అన్నాను: చిన్న ఆధారం ఏదైనా దొరక్కపోతుందా, డబా యించలేక పోతానా అని,

"కంగారుపడకండి కృష్ణయ్యగారూ. సరిగ్గా కూర్చోండి" అని ఆయన లేచి మళ్ళా నేను యిందాకటిలా కాళ్ళు జాపి కూర్చునేవరకు ఆ మర్యాదల్లో కాలం గడిపాడు. "ఈజీగా కూర్చోండి. మీరు బిగిసిపోయి కూర్చోవలసిన అవసరం లేదు, ఇక్కడ మీకెవ్వరూ ఫోటో తియ్యరు! అన్నారు మధ్యలో.

"విషయం ఏమిటంటే, మిమ్మల్ని చూడాలనుంటే నాకు ఒకటే మార్గం. నా పి.ఎ.తో చెప్పడం. మీగురించి నేను ఈ రెండేళ్ళలో నూటతొమ్మిదిసార్లు నా పి.ఏ. ద్వారా కబురు చేశాను. అందులో ఏడుసార్లే మీరు నాకు దొరికారు. మిగిలిన నూటరెండు సార్లుకూడా, దురదృష్టవశాత్తు మీరు సీటులో లేరనే తెలిసింది."

మళ్ళా కాళ్ళు టీపాయ్‌మీంచి తీశాను.

ఎం.డి. తనుకూడా బిర్రబిగిసి కూర్చున్నారు. "లేనిపోని లాంఛనా లెందుకు కృష్ణయ్యగారూ మీరు యింటిలోగానీ, ఆఫీసులో మీ రూంలోగాని, చివరికి ఏదేనా ఉద్యోగానికి అభ్యర్థులను ఇంటర్‌వ్యూ చేసేటప్పుడుగాని కాళ్ళు రెండూ టేబిల్‌మీదే పెడతారుగదా. ఆలా కూర్చుని ఫ్రీగా మాట్లాడండి-అంటే ఎందుకు గడికోసారి కాళ్ళు తీసేడం, బిర్ర బిగిసిపోవడం ఈ అర్థంలేని లాంఛ నాలు?"

పళ్ళు పటపట కొరుక్కున్నాను. ఎవడో కాకారాయుడు చెప్పులు కొరికితే మాత్రం; అవన్నీ విని లెక్కకి తీసుకోడమేమిటి ఈయన?

"మీరు ప్రతిరోజు ఆఫీసుకు పదిగంటలకు రావాలి. పావుతక్కువ పదకొండుకు వస్తారు. ఒంటిగంటకు లంచ్‌బ్రేకుపెట్టి మూడుగంటలకు తీస్తారు ఐదుగంటలకు వెళ్ళిపోవచ్చు. కాని నాలుగింటికే వెళ్ళిపోతారు. మొత్తం మీకిచ్చే మూడువేల రూపాయల జీతానికి మీరు పనిచేసేది రోజుకు మూడే గంటలు!"

మీరనేది నిజంగాదని నా అనుమానం" అన్నాను. ఆయన మాట్లాడుతూ ఆగకపోతే అదీ అనలేనేమో అనిపించింది.

"మీకనుమానం- కాని నాకు నమ్మకమే!" అని కళ్ళు రెండూ మూసుకున్నారు ఎం.డి.

తన పెద్ద టేబిలువైపు చూపించి "మీరేమీ అనుకోకపోతే" అన్నారు.

నేను లేచి నిలబడ్డాను, యాంత్రికంగా.

"నా టేబిలు మీద ఎర్ర పేపరు వెయిటు కింద టైపుచేసిన కాగితా లున్నాయి...."

వెళ్ళి తెచ్చాను.

ఆయన కళ్ళు తెరవకుండానే అన్నారు.

"ఆ కాగితాల్లో అంకెలు చూడండి. అవన్నీ మీరు, ఆఫీసునించి, ఆఫీస్

టైమ్‌లో ఆపరేటరు సహాయంతో మాట్లాడిన టెలిఫోన్ నెంబర్లు, ఆఫీసు పని చేసిన రోజుల సంఖ్య చేత ఆ లిస్టులో వున్న టెలిఫోన్ నెంబర్ల సంఖ్యను భాగిస్తే రోజుకు సరాసరిని నలభై రెండు కాల్సు పడ్డాయి. ఈ టెలిఫోన్ కాల్స్ నిమిత్తం కంపెనీ చెల్లించవలసిన సొమ్ము గురించి కాదు, నా బెంగ. కంపెనీలో వొక ముఖ్య అధికారిగా రోజుకు మూడే మూడు గంటలు ఆఫీసులో కూర్చుంటూ, నలభై రెండు మూళ్ళ నూటఇరవయ్యారు నిమిషాలు మీరు టెలిఫోన్లో మాట్లాడుతూనే గడిపితే. ఇంక మీరు పనిచేసినదెంతా అని నా సదసత్సంశయం!"

ఒక లిప్తపాటు కళ్ళు తెరిచి నావేపు చూసి, వెంటనే కళ్ళుమూసి తల పైకెత్తారు ఎం.డి

నేను గుటకలు మింగేను. "సార్...." అన్నాను.

"ఒక్క మనవి" అందామని ప్రయత్నం.

ఎమ్.డి, గారు చెయ్యడ్డం పెట్టారు. కళ్ళు మూసుకునే మాట్లాడారు.

"నాకొచ్చిన సమాచారం, దానికి ఆధారం—వీటి విషయం లోతుకు వెళ్లొద్దనీ, అక్కర్లేదనీ నేను మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. సమాచారం సేకరించడంలో నాకొక శిక్షణ వుంది....నేను మీ కంపెనీలోకి ఎమ్.డి.గా రాక పూర్వం అనేక వుద్యోగాలు చేశాను. అందులో దినపత్రిక విలేఖరి పని ఒకటి. అప్పుడు నాకు చాలా చిన్నవయసు. ఓసారి నేనేదో వార్త పంపిస్తే దాన్ని పత్రికలో వెయ్యాలా అక్కర్లేదా అని సందేహం వచ్చి మా ఛీఫ్ ఎడిటర్ నాకు కబురు చేశారు. నేను వెళ్ళాను. ఈ వార్త నిజమేనా అన్నారు. "నిజం కాకపోతే నేను పంపనని మీకు తెలుసుకదా" అన్నాను. "నీమీద నమ్మకం లేక కాదు; ఈ వార్త నీకెలాగొచ్చింది, తెలుసుకోవాలనుంది అన్నారు. "పత్రికా విలేకరులు వార్తలు అందిస్తారుగాని వాటినితామెలా సంపాదించారో చెప్పరండి" అన్నాను. "ఇలాంటి వార్తలు ప్రచురిస్తే దెబ్బలాట లొస్తాయేమో" అన్నారు. "వెయ్యటమో మానడమో మీరు చూసుకోండి: దెబ్బలాటొస్తేనేను చూసుకుంటాను అన్నాను—ఇదంతా నేనెందుకు చెబుతున్నానంటే,-ఒక పద్ధతిగా సమాచారం సేకరించడం, అలా సేకరిస్తున్నట్లు యెవ్వరికీ తెలీకండా జాగర్త పడ్డం నాకు బాగా తెలుసు; అందుచేతనే ఇదంతా ఎవరో కాకారాయుడు చెవులు కొరగ్గా చాడీలు చెప్పగా దొరికిన సమాచారమేమోనని నేను అనుమానించడం లేదు!"

నేను మళ్ళా గుటకలు మింగేను.

జేబులోంచి వొక కాగితం తీశారు ఎం.డి.గారు. "ఇది మీ కేమయినా పని కొస్తుందేమో చూడండి" అని నాకు అందించారు.

అది ఒక దినపత్రికలో ప్రచురించిన ప్రకటన.

ప్రభుత్వరంగంలో ఒక పెద్ద సంస్థనడుపుతున్న ఒక రిసెర్చి యూనిట్‌లో సూపరింటెండెంటు కావాలిట. అర్హతలన్నీ నాకున్నాయి. జీతం కూడా ఇప్పుడు నాకు వస్తున్నంత వస్తుంది. ఓ విధంగా చూస్తె ఆ ప్రకటన నన్నే వెతుకుతూ వేశారేమో అనిపించింది. ఐతే, ఉద్యోగం మరీ తాత్కాలికం. ఒక యేడాది మాత్రమే.

లోకాగితం మడిచి జేబు వుంచాను.

"రైట్! మీరు వెళ్ళొచ్చు. సారీ! మిమ్మల్ని బాధ పెట్టానేమో." అని ఆయన షేక్హాండిచ్చారు. సిగరెట్టు పెట్టి తీసి తానొకటి వెలిగించుకున్నారు, నాకొకటి ఇవ్వలేదు.

* * *

ఫొటోలు తీశారు. దండలు వేసేరు. సన్మానపత్రాలు చదివారు. ఒక శ్ళిద్దరు ఫొటోలకు సన్మానపత్రాలకు అద్దాలు కట్టించి యిచ్చారు. ఆఖరు రోజున సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటు, కళాకారులకు మా శ్రీమతి చేత మెమెంటోల బహూకృతి: మా ఇద్దర్నీ కళాకారులతో చేర్చి గ్రూఫ్‌ఫొటో,.... గొప్ప వేడుక జరిగింది, వారంరోజులు డిన్నర్లతో పార్టీలతో వూపిరి సలపలేదు.

రేపు బయల్దేరుతున్నాం, కొత్త వుద్యోగం వచ్చిన వూరికి, ఇక్కడికి పన్నెండు వందలయాభై మైళ్ళుంది. అయినా ఉద్యోగికి దూర భూమి లేదన్నారు కదా.

"బీచికి వెళదాం!" అన్నాను శ్రీమతితో,

"ఇప్పుడా?" అన్నది భాగ్యలక్ష్మి.

"ఎంతో చీకటవ లేదు, అరగంటలో వచ్చేద్దాం" అన్నాను.

విడిగా ఓ చోట కూచున్నాం. నలభై ఐదేళ్ళు నాకూ, ముప్పయ్యాయిదేళ్ళు ఆవిడికీ దాటినా కుర్రజంటలా కనిపిస్తునట్లున్నాం. పక్కనించి నడిచేవాళ్ళు లవర్సేమోనని అనుమానంగా చూస్తూ వెళుతున్నారు. అయినా మాకేం యిబ్బందవలేదు, మేం లవర్స్ కాకపోతేగా!

తేలికయిన చెక్కతో చేసిన బంగిడి ఓ చేత్తోనూ మోడా ఓ చేత్తోను

పెట్టుకని పిడతకింద పప్పువాడు వచ్చాడు. జంగిడీలో ఓ పక్కని కొవ్వుతో సహా కొవ్వొత్తంతలావున్న ఒత్తితో దీపం సముద్రపొద్దు గాలిని ప్రతి ఘటించి వెలుగుతోంది. నడివయస్కువాడి ఉద్యోగ ప్రయత్నంలాగ.

మమ్మల్ని చూసి మోడా ఇసకలో గుచ్చి జంగిడి పెట్టాడు.

"ఐగారు మసాలా మిచ్చర్" అన్నాడు.

"సర్లేగాని ఇలా" అన్నాను.

ఒచ్చేడు.

"ఇలా పప్పు అమ్ముకోడమేనా. లేక వేరే ఏదన్నా పనిచేస్తూ వుంటా వోయ్ నువ్వు?" అన్నాను.

"అదంతా మీకెందుకండి. తింటే వాడు తెచ్చింది తిన్రాదా లేకపోతే పొమ్మన్రాదా" అన్నది భాగ్యలక్ష్మి.

"అడగనీండమ్మా అడిగితేటి పోనాది?"అంటూ మాటగ్గిరచను పుట్టింపాది స్తున్నాడు వాడు, "మంచీసెడ్డా తెల్సిన బాబులయితే! బోగట్టాలడుగుతా రంతే" అని వొక రిమార్కు పారేసి "....కంపెనీలో శిఫ్టుడూటీ మీద వస్చేత్తానండి నాలుగొందలిత్తారు....! ఈ యేలప్పుడు డూటీ నేకపోతే సర్దాగా సంద్రపుగాలికి జంగిడొట్టు కొత్తానండి"

మా కంపెనీలోనే పని చేస్తున్నాడన్న మాట!

ఇంకా మా కంపెనీ యేమిటి!?

అయితే మా కంపెనీలో నన్ను గుర్తుపట్టనివాళ్ళు కూడా కొందరు వున్నా రన్న మాట!

"మీ పెరసనల్ మేనేజరు క్రిష్ణయ్య గారు బావున్నాట్టోయ్?" అన్నాను.

"ఇంకేటి బాగు బాబు! ఆ బాబు జండా దిగిపోనాది."

"జండా దిగిపోడమేమిటి? మంచాడు గాడా?"

"మంచంతే అదీ వొక మంచేనండి."

5అంటే యెలాంటి మంచి చెబుదూ."

"ఎలాటి మంచేటి బాబూ. ఒవుడెలా గున్నాటో. ఒవుడెలా పోతన్నాడో ఆ బాబు కేటీ అక్కర్నెద్దండి. మంచంటే మరదీ వొక మంచేగాదా?"

"అంత మంచా?" అన్నాను. చాటుగా భాగ్యలక్ష్మి వీపుమీద గిల్లి. "నా కీర్తి చూడు. చుక్కలవలె కర్పూరపు ముక్కలవలె" అన్నట్లు మొహం పెట్టి.

"ఆ బాబు పని జోలికెళ్ళడు. ఉంకోలు వస్తేత్తన్నాదా లేదా అని సూడ్డు. మరి తప్పుడు అడిగారు గాబట్టి అదీ వోరకం పంచేనండి!"

"ఊఁ అలాగా?"

"అయితే అంతమంచిని ఎన్నాల్లు సాగనిత్తారు బాబూ. ఆ బాబుమీద పెద బాబు నిగా ఏస్నినాడు."

"ఏమి నిఘావోయ్! క్రిష్ణయ్యగారే పేద్ద అఫీసరుగదా. అయన్ని ఎమ్.డీ. గారు మాత్రం ఏం చైగల్రు!" అన్నాను ప్రగల్భంగా!

"ఓర్ని ఓరూ ఏటీ సెయ్యనేరు బాబూ. అయితే కిష్టయ్య బాబు ఇక్కడుండకంటా సేసీసినాడు గాదా, ఎమ్.డీ.బాబు! సాల్దా?"

"అదెలాగ? ఆయనెవడయ్యా ఇతన్నిక్కడుండకండా చేసేదానికి? ఇతనికే ఇంకోచోట మంచి ఉద్యోగం వొస్తే పోతున్నాడేమో?"

"పెద్దోళ్ళ బాబూ. ఆళ్ళ వూసులు మాకేటి తెలుస్తాయి? పక్కోడు కులాసగుంటే సూళ్ళేని రోజులు! దాంతో ఇందిరమ్మగారు యమర్జెన్సీ ఓటి ఎట్టేసినారు గదా."

"అయితే ఏం చేసేడంటావు. మీ ఎం. డీ. బాబు?"

"ఏశ్నేదు బాబూ. ఓ రోజు మామూలుగా ఆఫీసు కెల్లాడట మా పి.ఎం. బాబు. ఎమ్.డీ. బాబేమో, ఈ బాబుని పిలమన్నేప్పి, కూకోబెట్టి "ఏటయ్యా కిష్టయ్యబాబూ, ఇక్కణ్ణుండీ తప్పుకుంతావా బొక్కసింపే మంతావా అని అడిగినాడు. నేదుబాబూ నానే తప్పుకుంతానం చెప్పి ఈ బాబుంకో వుద్దోగం సూసుకో నెలిపోతన్నాడు."

"బలేగా మాట్లాడతావోయ్ నువ్వు!" అన్నాను; ఆరిపోయి.

"ఐగారు, మసాలా మిచ్చరు తిన్నా?" అన్నాడు వాడు; పాయింట్‌లో కొచ్చి.

హైబ్రో డిన్నర్లతో విసిగిపోతున్న నా ప్రాణానికి మసాలా మిక్శ్చరు నిజంగా తినాలనే అనిపించింది.

"ఇక్కణ్నుండీ తప్పుకుంతావా. బొక్కింపీమంతావా" అన్నాట్ట ఎమ్. డి. బాగా చెప్పాడు; చూసి, వినీసిన వాళ్ళాగ. జరిగిందాన్నే వాడి భాషలో చెప్పాడు.

* * *

(ఆంధ్రపత్రిక వీక్లీ; నవంబరు 1958)

# శంకర పార్వతీయం

శంకరం మామయ్య రాక రాక మా యింటికి వొచ్చాడు. అందరికీ సరదా వేసింది. రకరకాలుగా సరదా వేసింది.

నాన్నకి ఫోన్‌చేశా. పక్కింటికెళ్ళి: నాన్న ఫోన్‌లోనే సంతోషం వెలిబుచ్చారు. శంకరం మామయ్యని తను వొచ్చేవరకూ ఎంగేజ్ చెయ్యమన్నారు.

మామయ్య ఇంట్లోకి రాగానే పార్వతత్త ఇంట్లోకి పరుగెత్తి వంటింట్లో మామ్మతో చెప్పింది. మామ్మ వంట మానేసి శంకరం మామయ్యని పలకరించడానికివతలికొచ్చింది. మామ్మ వెనకాలే అమ్మకూడా వొచ్చింది. ఎవరితోనూ అనవసరంగా మాటాడని అమ్మ శంకరం మామయ్యతో పదినిమిషాలు మాట్లాడింది.

శంకరం మామయ్య మాకు అంతదూరమూ దగ్గిరా కాని బంధువు. చిన్నప్పుడు పార్వతత్తని అతనికిచ్చి పెళ్ళిచెయ్యాలనుకునేవాళ్ళు. కాని కాలక్రమాన పెద్ద చదువులు చదివి మామయ్య కొరకరాని కొయ్య అయిపోయి ఎవరిమాటా వినటం మానేశాడు. మొదట్లో చదువు పూర్తయ్యాక పెళ్ళి సంగతి చూసుకుందామనేవాడు. తరవాత్తరవాత చదువు అయిపోతేమటుకు పార్వతినే చేసుకోవాలని రూఢిగా నిర్ణయం లేదనేవాడు. అవైనా వాళ్ళ నాన్నతోటీ అమ్మతోటేగాని మీదాకా వొచ్చేవేకావు. అసలు శంకరం మామయ్య మేమెవ్వరం గుర్తుపట్టలేనంత కాలం మాకు కనిపించలేదు, అందుకనే కొద్దికొద్దిగా తెలుస్తున్నప్పట్నుంచీ నేను కూడా పార్వతత్త పెళ్ళి విషయంతో అందరూ ఈ శంకరంగార్నే ఎందుకు ఎంచుకోవాలి అని అడిగేదాన్ని. పై సంబంధాలు వెతికితే పార్వతత్తకి పెళ్ళి ఎప్పుడో అయిపోయేదని నా నమ్మకం.

మొన్న మూడునెల్లక్రితం నేనూ, పార్వతత్తా, అమ్మా, నాన్నా రాజశేఖరం తాతయ్యగారింట్లో జానికమ్మపిన్ని పెళ్ళయితే వెళ్ళాం. రాజశేఖరం తాతగారు శంకరం మామయ్యకి పెత్తండ్రేగా! ఆ పెళ్ళికి ఈయనా వొచ్చాడు: పెళ్ళిలో మేం వున్న రెండు రోజుల్లోనూ నాన్నతో ఈ శంకరం మామయ్య ముక్తసరిగానయినా మాట్టాడలేదు. మేం యింటికొచ్చి అమాటే అనుకున్నాం. దాంతో నాయనమ్మ పెదవి విరిచేసి "అబ్బే! వాడు దీన్ని చేసుకోడురా! ఇహ అడిగి

లాభంలేదు" అని తొంభై తొమ్మిదోసారి అన్నది—నేనే పార్వతత్త అయితేనా, నేనే అతన్ని చేసుకోనని గట్టిగా చెప్పేద్దును. ఏమిటి, అతని గొప్పేమిటి, అని పిస్తుంది. నా కెప్పుడూ. కాని పార్వతత్త వాటంచూస్తే నాకు కడుపులో తిప్పేది. శంకరం మామయ్య ప్రసక్తి వొచ్చేసరికి సిగ్గుపడిపోయి అక్కణ్నించి వెళ్ళి పోయేది.

పెళ్ళినించి మేం వొచ్చిన రెణ్నెల్లకి శంకరం మామయ్య తమ్ముడు రవి తుని వెళుతూ మా యింటికొచ్చేడు. అతన్తో నాయనమ్మ అవీ ఇవీ మాట్లాడుతూ, "పార్వతత్తకి ఇహపై సమ్మంధాలు చూసుకోడమే. శంకరం ఇలా మొండి చెయ్యి చూపించా"డని అంటూ ఇదయింది. దాంతో అతను చాలా ఆశ్చర్యపడి పోయి "అరె! మీకింకా తెలీదా? అన్నయ్య పార్వతిని పెళ్ళాడతానని నాన్నకి చెప్పి వదిహేనురోజులు దాటిందే!" అన్నాడు.

దాంతో అందరికీ మతులు పోయాయి.

నాన్న ఆ రాత్రికి రాత్రి శ్రమపడి రెండురోజులు శెలవు సంపాదించాడు మర్నాడు పొద్దుటే విజయనగరం వెళ్ళాడు.

0 0 0

పార్వతత్త సహజసౌందర్యం గలది. నా దృష్టిలో అందమైంది అంటే దానికి కనీసం తిరుగులేదన్నమాట. నాన్న నా నిర్ణయాన్ని చాలా ఆమోదించే వారు. అందరాడపిల్లల్లాగా కాకుండా చదువు నాకు సరైన పద్ధతిలో అందించనే వారు నాన్న.

పార్వతత్త చాలా అందంగా ఉంటుంది, గాని చదువెరగదు. తాతయ్య పోయేవరకూ నాన్న ఆమెని పల్లెటూళ్ళో వొదిలెయ్యడం వల్ల ఆమెకి చదువు అంటలేదు. చదువే కాదు, సంస్కారమూ విమర్శనా జ్ఞానం యిలాటి ఎడ్యుకేటివ్ వాల్యూస్ ఏవీ అంటలేదు. దీనితోపాటు పిత్రార్జితం అంతా అప్పూ సప్పూ తీర్చడానికే సరిపోయెగాని అత్త పెళ్ళికి కేటాయించడానికంటూ ఏమీ లేక పోయింది. ఇలా చదువూ, డబ్బూ రెండూ లేకపోవడాన్ని పార్వతత్త ఏళ్ళు పెరుగుతున్న కొద్దీ నాన్నకి కొంచెం కొంచెం బెంగెక్కింది.

శంకరం మామయ్య ఒస్తూనే 'అత్తా!' అని కేకేశాడు.

పార్వతత్త పరుగో, పారిపోయింది వంటిట్లోకి.

అతను జోళ్ళు విప్పుకుంటూ వుండగే నాయనమ్మ ఒచ్చింది, వెనకాలే అమ్మ వొచ్చింది. ఆ వెనక పార్వతత్త చీరవొస్తోంది.

నాయనమ్మకి మొహమంతా సంబరమే. మాటే రాలేదు.

సావిట్లో హేండ్ బ్యాగ్ పెట్టబోతూ వుంటే అమ్మ అడ్డుపడి తీసుకు పోయి మధ్యగదిలో పెట్టించింది.

'పరాయి వాళ్ళలాగ సావిట్లో పెట్టేస్తున్నారేం సంచీ?' అన్నాను నేనూ మాటకలిపి.

ఆయన నాకేసి చూశాడు. 'ఈ పిల్ల.... బావకూతురేనా అత్తా?', అన్నాడు అనుమానంగా,

'అవును నాయనా, నువ్వెరగవూ?' అంది మామ్మ.

'ఎరగనత్తా. చిన్నప్పుడు చూశానుగాబోలు. అయినా బావకి ఇంత కూతురుందని అనుకోలేదు.'

'మొన్న జానకి పెళ్ళికదీ వొచ్చిందే....' అంది అమ్మ—

మామ్మ కాఫీ పెట్టించడానికి వంటిట్లోకి వెళ్ళింది. శంకరం మామయ్యని ఇతర ప్రశ్నలు అడుగుతోంది అమ్మ. 'మీ అమ్మా వాళ్ళూ బాగున్నారా అంటూను.

నాన్నకి ఈ భోగట్టా చెప్పడానికి ఫోనుకోసం నేను పక్క వాళ్ళింటికి వెళ్ళాను. ఆయన ఎలా సంతోషిస్తారో చూదామని అనిపించింది.

0 0 0

మామయ్యకి కాఫీ ఇస్తూ 'పార్వతత్త మిమ్మల్ని చూడగానే కాఫీచేసిందండీ అందుకే ఇంత అర్జంటుగా తయారయింది' అన్నాను.

అతను మాటాడలేదు. కాఫీ బాగుంది కాబోలనుకున్నా

'ఏం చదువుతున్నా వమ్మాయ్?' అన్నాడు.

'ఇంటరు పార్టువన్ తప్పానండీ.' అన్నాను. నాకేం. అతన్తో మాటాట్టానికి మొహమాటమూ?....

'వ్వాట్! అప్పుడే ఇంటరూ! వాట్స్ యువర్ ఏజ్?'

'అతను 'వ్హాట్' అంటూంటే ఏదో బాగుంది. చాలా అర్థవంతంగా కూడా వుంది.

'పదిహేడో ఏడొస్తోంది.స్కూలుఫైనల్లో వయస్సుచాలదని ఏదో గడబడ చేశారుకూడానూ, మళ్ళీ మార్కులూ అవీ చూసి డి. ఇ. వో. గార్కి రిపోర్టు రాస్తే కట్టనిచ్చారు.' అంది అమ్మ,

'వ్హాట్! మరి ఇంటరుపోయిందేం, ఆ మార్కులు ఇంటర్లో రాలేదా?'

'ఔనండీ- నాక్కొంచెం ఇంగ్లీషులో డౌట్' అన్నాను.

'అరే! ఇంగ్లీషులో డౌటా?.... నా కెప్పుడూ వుండేదిగాదు.' అని కొంచెం నింపాదిగా అనుకున్నాడాయన, 'మరి మీకెందులో?' అన్నా నవ్వి.

'సారీ నా కెందులోనూ డౌటు వుండేదిగాదు,' అని అతను నవ్వాడు.

హేండ్ బ్యాగ్‌లోంచి ఏదో తెలుగు నవల తీశాడు శంకరం మామయ్య. అమ్మ మెల్లిగా అక్కణ్ణించి వెళ్ళింది ఏదో చెప్తూ అమ్మ ఏం చెప్పిందోనన్నా వినకుండా నేను పుస్తకం కేసి చూస్తున్నాను.

ఈజీ చైర్‌లో పడుకున్న మామయ్య పుస్తకం విప్పగానే నవల పేరు కనబడింది. అది నేను చాలా రోజుల్నించీ ఇష్టపడి సంపాదించలేక పోతున్నది.

'అది! గృహదహనమా? చదివేశారా?' అన్నా?

'వ్హాట్! కావాలా?'

'అఁహఁ! మీరు చదివే యివ్వండి.'

'లేదు లేదు-చదవండి. నేను చదవడం ఏనాడో అయింది. నా కేదైనా పత్రిక పడెయ్యండి.' అంటూ పుస్తకం నా వేపు విసర బోయాడు.

నేనే వెళ్ళి తీసుకున్నాను. వెళుతున్నంత సేపూ అతనికేసే చూశాను అతనూ చూశాడు. ఆ చూపుల్లో ఎంత శక్తి వుందని! ఎవరి చూపులైనా తపీమని కిందకి దింపే నా తీక్షణ దృక్కుకి అతను నిటాగ్గా నిలబడి జండాలా ఎగిరేడు—

0 0 0

మామయ్య ఒక రాత్రి రెండు రోజులూ వుండి వెళ్ళాడు. ఇంకా వుండమని అమ్మా, నాన్నా. మామ్మా అన్నారుగాని ఉద్యోగం వొప్పుకోదన్నాడు. ఏదో ప్రమోషను విషయంలో ఎవరో ఆఫీసరు దగ్గిరి కొచ్చాట్ట. శలవాట్టే పెట్ట లేదనీ ఈ మా రొచ్చినప్పుడు మూడ్రోజులు వుంటాననీ అన్నాడు.

మామయ్య అందరూ అనేటంత కరుగ్గా లేడనే నాకు బోధపడింది. కాని నే నీ మాట అనేసరికి అందరూ ఎదురు తిరిగారు. నా తర్క జ్ఞానమూ. వాదనా వృథా అమ్మాయి. మామయ్య శుద్ధ డాబూ, మహా బెట్టూ అన్నారు.

మామయ్యమాట కర్రవిరిచి పొయ్యిలో పెట్టినట్లుంటుంది. మన ప్రశ్నకి అతను జవాబే చెప్పవలసి రావాలిగాని, మళ్ళీ మనకి ప్రశ్న వేసే అవకాశం ఇవ్వడు. అది చూసి తలబిరుసంటే అన్యాయమే—

అభిప్రాయాలు ప్రవర్తనచూసికూడా మార్చుకోలేరు కొందరు. మావాళ్ళు అందులో చేరతారు.

మామయ్య సరదా అయినవాడు. సరదాతో సమయస్ఫూర్తి వుంది. ఉన్న

ఒకే ఒక దుర్గుణం అజాగ్రత్త. పరాకు. ఆలోచనలో వుంటే ప్రపంచం మరిచి పోవడమే.

అతను వొచ్చిన మర్నాడే కాబోలు, కిటికీ పక్కని ఈజీ చైర్లో సిగరెట్టు విసిరేస్తే అది ఎక్కడో పోయి పడాల్సింది వాకిట్లో తాడుకి వేలాడేసిన నాన్న చొక్కా జేబులో పడింది. చొక్కా పూర్తిగా పనికిరానంతగా కాలిపోయాక "ఎక్కడో గుడ్డ కాలిన వాసనేస్తూంది, వంటింటిలోవాళ్ళు చూసుకోండోయ్" అని కేక పెట్టాడు.

అసలు సంగతి చూసి అందరూ గొల్లున నవ్వారు.

ఏమో, నేనతన్నీ అతని పరధ్యానాన్నీ క్షమించి భరించాను. ఆలోచనలలో వున్నప్పుడు ఆ మాత్రం పరధ్యానం ఉండదా ఏం మరి?

నిద్దరొస్తోంది. "ఇలా వొళ్లు వాల్చిపడుకుని వుంటాను. ఎవరేనా పుస్తకం చదివితే అయిదు నిమిషాల్లో వొస్తుంది నిద్ర" అన్నాడు మామయ్య.

"నే చదవనా?" అన్నా

"ఓ; థాంక్సు."

నేను పుస్తకం తీసి ఏదో కథ చదువుతున్నా;

"బాగా స్పీడుగానే చదువుతున్నావు. తప్పులు రావటంలేదు." అన్నాడు.

"బాగుంది. తప్పులు కూడా రావాలా ఏమిటి?"

"అది కాదుగాని పార్వతి ఇలా చదవగల్దా?"

"ఓహో అదా మీ సందేహం?" మామయ్య ఆలోచనకు నాకు సరదా వేసింది. తృప్తిగా నవ్వుతున్నాను "తెలుగయితే బాగానే చదువుతుంది. మధ్య మధ్య ఇంగ్లీషు మాటలొస్తై అక్కడ పోట్లు. ఎటొచ్చీ రైటింగు కొంచెం పెద్ద సైజు అంతే-అయినా మీరు వూరుకుంటారా? మీ సావాసం వారంరోజులు చాలు. ఎడ్యుకేషను రావడానికి" అన్నా.

"వ్హాట్? అంత ఉబ్బేస్తున్నా వేంటి నన్ను?"

"కాకపోయినా అత్తయ్యకున్న గ్రహింపుశక్తి అలాంటిది.

"పోనీలే ఆ మాత్రం వుంటే చాలు." అని మామయ్య నవ్వాడు.

"మీకు నిజంగా నిద్రరావటంలేదు." అంటూ లేచి ఇవతలికి వచ్చాను గది తలుపుదిగ్గిర పార్వతత్త వుంది. నేను బిగ్గరగానే "పార్వతత్తా! నువ్వీ పాటికి ఏబీసిడీలు మొదలుపెట్టడం మంచిది. పెళ్ళవగానే మామయ్య నిన్ను ఫస్టుఫారంలో చదవేస్తారట." అన్నా నవ్వి.

'పో;' అని నాకన్నా మూడేళ్ళు పెద్దయిన పార్వతత్త నా దగ్గిర సిగ్గు పడింది.

ం ం ం

నెల తిరక్కుండా మామయ్య మళ్లా వొచ్చాడు. ఈసారి అందరూ అంత సరదాపడలేదు. కాని అదేం కనబడలేదు బైటికి.

ఒచ్చినరోజు సాయంకాలం సినిమాకి వెళదాం రమ్మన్నాడు. నాన్న ఏడుగంటలదాకా ఇంటికి రారు. పార్వతత్త మామయ్యతో సినిమా మాట అటుంచి వంటిల్లు దాటి ఇవతలికి రాదు; రానంది, అమ్మ పెద్దా కాక చిన్నా కాక రానంది. నాకు మట్టుకు తప్పలేదు.

నాలుగింటికి ఆలోచించుకున్న వాళ్ళం, నాలుగున్నరకే బయలుదేరాం. అలా మెయిన్ రోడ్డంట నడుస్తూ సరస్వతీ రీడింగురూం, టవున్‌హాలూ, బీచి చూసుకొని లైట్ హవుస్ దగ్గిరి చేరాం. లైట్ హౌసు ఎక్కి మళ్ళీ వొచ్చి బీచిలో కూర్చున్నాం.

బీచిలో గంట కూర్చున్నాం. ఎన్నో విషయాలు మాట్లాడుకున్నాం. అతను అడగనిదంటూలేదు. చిన్నప్పట్నుంచీ నే నెలా పెరిగానో, పార్వతత్త ఎలా పెరిగిందో—నాన్న మద్రాసు సెంట్రల్‌జైల్లో పని చెయ్యడం, అప్పటి నాన్న సైకాలజీ—సాయంకాలం ఒకోనాడు ఏదైనా మరణదండన అమలుజరిపి వొచ్చినప్పుడు ఆయనపడ్డ బాధ—అన్నీ నేను చెప్తే మానవ హృదయంమీద ఎంతో చక్కగా మాట్లాడాడు, ఎంతో ప్రాపంచికంగా ఆలోచిస్తాడు మామయ్య. అతను చెప్పేవి అన్నీ తార్కికంగా వుండి వినేవాళ్ళని మాట్లాడనివ్వవు.

జీవితంలో - నాన్నకీ, అమ్మకీ, పార్వతత్తకి- నాకూ, ఎవరికెలాటి సమస్యలుంటాయో అన్నిటి గురించీ మామయ్యతో నేనాగంటలోనూ చర్చించాను ఆరుగంటలు అయిపోతున్నకొద్దీ కష్టమనిపించేసింది. నా గురించి తన భావన సరిపోయిందన్నాడు. తను అన్నీ సరిగ్గా ఊహించగలననడానికి నేనే సాక్ష్యమట.

"ఎంత ప్లెయిన్‌గా మాట్లాడతారండీ మీరూ!" అన్నా ఆశ్చర్యపడి.

"వ్హాట్! ప్లెయిన్‌గా మాట్లాడక?" అన్నాడతను ఏదో ఆనందంలో.

నేనూ ఆయన 'వ్హాట్' అంటుంటే చాలా సరదాపడి 'వ్హాట్' అన్నాను.

"ఓహో, అది నా వూతపదమని కనిపెట్టేశావా? యువార్ ఆఫ్‌కోర్స్ టూలేట్" అని నా చెయ్యి పట్టుకున్నాడు.

నేను నవ్వుతూ మెల్లగా చెయ్యి విడిపించుకున్నాను,

"ఏమట్లా నవ్వుతావ్?....లేదామా" అని లేచాడాయన,

లేచాను. మౌనంగా బస్సు రోడ్డుమీదికి నడిచివొచ్చాం. సిటీబస్‌మీద మార్కెట్టువరకూ వెళ్లాం, అక్కణ్ణించి సినిమాకు పోయాం.

ం ం ం

సినిమానించి ఇద్దరం ఒక్క రిక్షాలో రావడం నాకే కొంచెం ఇబ్బందిగా అనిపించింది. అదీ ఇంటికొచ్చేముందు మరీనూ. ఆయన రెండు రిక్షాలు పిలవడ మేమో పిల్చాడు. కాని నేనే "ఎందుకులెండి, దండగ," అన్నా.

మామయ్య నా ఇబ్బంది గమనించి 'నువ్వు సరిగా ఉండటంలేదు. నేను దిగి నడిచిరానా, ఇల్లు దగ్గరఉంది?' అన్నాడు.

అంత దగ్గర్లో దిగి నడవడమూ నాకు అంత సమంజసంగా అవుపించ లేదు. అది అంతకంటే అసౌఖ్యంగా వుంటుందనిపించింది.

ఏమైనా అతన్ని దిగనివ్వలేదు.

మర్నాడు పొద్దుట మామయ్య మామ్మతో ఫిర్యాదు చేశాడు. 'మీ ఇంటి కొస్తే ఏమీ తోచదత్తా'—అని 'ఎవరూ మాట్లాడ్రు, అలా ఈ పుస్తకాలు ఎంత కని చదవనూ?— ఇహ ఇప్పట్లో మీ ఇంటికి రాకూడదు.'

"ఆఁ అవునుమరి అయినా మా మాటలు మీకేం రుచిస్తాయి? పుస్తకాలో, సినిమాలో వుండాలి మీకు. ఇప్పుడు మా జానకే వుందనుకో, దాని పుస్తకా లేమిటో స్నేహితులేమిటోగాని మాతో అసలు మాట్లాడదే!" అని సోది ప్రారం భించింది మామ్మ.

o o o

ఆ సాయంకాలం మూడున్నరకి మామయ్య "ఏం జానకీ- ఎటేనా వెడ దామా ఇవ్వాళా? నిన్నట్లా కబుర్లు చెప్పుకొంటూ...." అని అడిగాడు.

నాకు నిన్నటి సమావేశం అసంపూర్ణంగానే కనబడింది. కాని "ఎందుకు లెద్దురూ" అనేశాను.

"ఇవ్వాళ యూనివర్శిటీకేసి వెడదాం. నేను చదువుకొనేటప్పుడుకూడా యూనివర్శిటీ బిల్డింగ్స్ చూడలేదు."

"సరే వెళదాంలెండి. ఇంకో గంట పోయాక బయల్దేరుదాం" అన్నా.

నాలుగయ్యేక బయలుదేరాం. యూనివర్శిటీ బిల్డింగ్సు చూసి అతనంత ఆశ్చర్యపోతాం నేను ముందుగా ఊహించలేదు. శలవులవటాన్ని ఏదీ తెరిచి లేదు. హాస్టల్సులో మట్టుకు ఇంటికి వెళ్ళని స్టూడెంట్సు అక్కడక్కడ వున్నారు. వినయ విహార మేడమీద అంతస్తుకి ఎక్కి ప్రకృతి చూదాం. "వాల్తేరు ఊరు చూచి బీచికి వెళదాం" అన్నాడు మామయ్య.

బీచిలో కూచుని సుమారు ఒక ప్యాకెట్టు సిగరెట్లదాకా కాల్చేశాడు మామయ్య. అయిదయిపోయేసరికి లోకంమీద మాకు సంబంధించిన భోగట్టాలూ అయిపోయాయి.

శంకరం మామయ్య నిశ్చలంగా ఆలోచిస్తున్నాడు. నేనతన్ని కదల్చక ఇసకలో ఏవో బొమ్మలు వేసుకుంటున్నా. మధ్య మధ్య అతనికేసి చూస్తె సాగర గాంభీర్యం తప్ప ఏ కదలిక లేదు.

ఒక్కసారి 'జానకీ!' అన్న పిలుపుతో ఇటు తిరిగాను.

"ఒక్కమాట చెప్తాను వింటావా?....దీంట్లో నీ సలహా కూడా తీసుకోందే ఏ పనీ చెయ్యలేననుకో—"

అతనికి నేను సలహా చెప్పేపాటి దాన్నా అని లోనే అనిపించింది. అంతగా నన్ను నేనెప్పుడూ చిన్నబుచ్చుకోలేదు. అదే అన్నాను.

"మరేంలేదు, ఇది నీకు కూడా సంబంధించిన విషయం గనక, లేకపోతే నాకెవరి సలహా అక్కర్లేకపోను. అయినా నీలాంటి వాళ్ళ సలహా దేంట్లోనయినా అవసరమే అని నువ్వే రుజువు చేసుకున్నావులే—దానికేంగాని—నేనీసారి విశాఖపట్నం రావడం నీకోసమే అని నీకు తెలుసా?"

నా కోసమా?

"నీకు తెలీకపోడం అన్యాయం. పోన్లే ఐ డోంట్ మైండ్. ఈసారి నీ కోసం వొచ్చాను. నిన్ను ఒదల్లేక ఈ నెల్లాళ్ళూ కష్టపడి చివరికి ఒచ్చాను. నిజానికి ఈ నెల్లోనూ నేను పూర్తిగా నీవాడినై పోయాను. నేను పొరపాటు చేస్తున్నానా అని రెండు మూడు సార్లు అనుమానం కలిగింది. అది తేల్చుకోడానికే నేనీసారి రావడం. కాని ఎంత చూసినా నీమీద గౌరవం, కాంక్ష ఎక్కువయి పోతున్నాయిగాని మరోలా అవడం లేదసలు.

నాకు నోటంట మాటలు రావటంలేదు.

"—ఈ మార్పు-అంతా ఒక పెద్ద ప్రోసెస్సు. క్రమంగా నీకు వినిపిస్తాననుకో-ఒక్కటి చెప్పు, పార్వతిని కాదని నిన్ను పెళ్ళాడ్డం నీకు యిష్టమేనా?"

అలా డపున్ రైట్‌గా అడిగితే ఏం చెప్పను?

"అఫ్‌కోర్సు, నీకు నామీద నమ్మకం కుదరడం కష్టమేనని నాకూ తెలుసు. ఒక్క నెల్లాళ్ళలో ఇలా మారిపోయిన నేను ఇక ముందు మట్టుకు తిన్నగా వుంటానా అని ఎవరైనా అనుకుంటారు. కాని ఇది నా పరిణామదశ, ఈ మార్పుతో అది సరి,—బోధపడుతూందా?....అబ్బే! ఎంత ప్రయత్నం నా నుంచి జరిగినా మీ పార్వతత్త నన్నసలు ఆకర్షించందే! నేనేం చెయ్యను."

నాకా? స్ఫుటంగా ఒకే రూపు గోచరిస్తున్నది. దేశంలో డబ్బూ చదువూ లేక పెళ్ళీ జీవితమూ ఆగిపోయిన వేలాది ఆడపిల్లలందరికీ ప్రతినిధిగా నిలబడ్డ

దౌర్భాగ్య దేవత పార్వతత్త! ఎన్నో విలువలున్న, ఎంతో కష్టపడి అకర్షిస్తె గాని దొరకబోని ఈ శంకరం మామయ్యనుంచి సభ్యతకోసం దూరంగా వెళ్ళి పోతున్న పార్వతత్త, నా సొంత మేనత్త!

నాన్నా, మామ్మా పై సంబంధాలు వెతకరు. ఈ శంకరం మామయ్యను కాస్తా నేనుకట్టుకుపోతే పార్వతత్త మాటేమిటి; అస్పష్టంగా ఏదో గొణిగాను.

"దాన్ని గురించి నాకూ బెంగగానే వుండేది. ఆ లెఖ్కని నాకు దాని మీదున్న సింపతీ నీకూ లేదేమో. అందుకనే దాన్ని వలంటరీగా నేను పెళ్ళాడ తానని వొప్పుకున్నాను.—కాని నాకూ కొన్ని ప్రాబ్లెమ్స్ వున్నాయి. అవి నువ్వూ నేనూ వుంటేగాని సాల్వ్ కావు—అందుకోసం ఈ మార్పులో పడవలసి వొచ్చింది, కాంట్ హెల్ప్!" అన్నాడు మామయ్య చాలా లోతుగా.

నా కేం తోచలేదు.

"ఏమిటి నీ సలహా? నన్నేం చెయ్యమంటావు?"

సిగ్గువెయ్యటం మొదలుపెట్టింది; ఎప్పుడూ లేంది! అంత సిగ్గులోనూ మామయ్య మొహం చూడాలన్న కోర్కె పుట్టింది. తలెత్తి చూశాను.

మామయ్య ... మేశ్వరుడి బొమ్మలా వున్నాడు; నిర్వికారంగా- చెప్ప దల్చుకున్నదంతా చెప్పేసి జవాబుకోసం ఎదురుచూస్తున్నాడు. అతని బాహ్య దృష్టీ అంతర్దృష్టీ నామీదే నాలోకే ఉన్నాయి.

"నీ సలహా చెప్పవా?" అని ప్రాధేతను సూచించి నా చేతులు రెండు మృదువుగా పట్టుకొన్నాడు.

"పోదాం మామయ్యా...." అన్నా కష్టపడి. మామయ్య అన్న సంబోధన అతనికి తగలాలని నొక్కి పలుకుతూ. అతనికది పట్టితేగా?

"అమ్మయ్యో, పోవడమే?—ఉహుఁ. మన సమస్య ఏం చెయ్యాలో చెబితేగాని పోవడం వట్టిది—ఏం, నీకింకా ఎప్లయి చేసుకోలేకపోతున్నావా? అందులో అర్థంలేదు. నీకు మట్టుకు పెళ్ళి కానక్కర్లేదూ? ఆ మాట నీకూ తెలు సనుకుంటాను...." అంటున్నాడు మామయ్య.

మామయ్య మాట కాదనడానికి, వున్న ప్రాపంచికాలోచనలు పోయి ఆదర్శాల్లోకి దిగిపోవాలి. చాతవుతుందేమో ఎవరైనా అడిగి చూడాలి. పాతి కేళ్ళనాటి నిండని మామయ్య మానవయంత్రం ఊరికేనే అంత వేడెక్కి పోయిందా?

***

(ఆంధ్రజ్యోతి వీక్లీ: నవంబరు 78)

# శ్రీ ఆంజనేయమ్, ప్రసన్నాంజనేయమ్

రాత్రి పన్నెండై వుంటుంది టైం, విజయవాడ స్టేషనని తెలుస్తోంది. రామచంద్రరావుకి....రైలు చాలాసేపయి ఆగివుంది.

బయటినుంచి వచ్చే ధ్వనులవల్ల పెద్దగా నిద్రాభంగం లేదు.కాని, లోపల తిరుగుతున్నాయనిపిస్తున్న ఫ్యాన్లవల్ల వొచ్చేగాలి బొత్తిగా చాలడం లేదు. అతనికి మెలకువ వచ్చేసి కొంతసేపయింది. కళ్ళు తెరవాలనిపించలేదు. కాని, తప్పింది కాదు. దుప్పటిలోపల పైజామా సరిచేసుకుని దుప్పటి పక్కకి తప్పించాడు. కళ్ళుతెరిచి పక్కకి చూశాడు.

"నమస్కారం సార్!"

చిరునవ్వూ, జోడించిన చేతులూ-అతను రఘురామ్. రామచంద్రరావు ఆశ్చర్యపడ్డాడు. "నమస్కారం!" అని ఒక చెయ్యి ఆడించాడు. ఈ ట్రాన్స్ ఫర్ తప్పకపోతే తను రఘురామ్ దగ్గిరే ఛార్జి తీసుకోవాలి విజయనగరంలో.ఆ విషయం మనసులో చైతన్యవంతంగా ఉండడాన్ని కాబోలు, రావలసిన ప్రసన్నత రాలేదు మొహంలోకి.

"హైదరాబాదేనా సార్: ప్రయాణం!"

"ఊఁ....ప్లెజంట్ సర్ ప్రయిజ్-నువ్వూ హైదరాబాదేగా?"

ఆరేళ్ళ క్రిందట రఘురామ్ సరాసరి తను చేస్తున్న ఉద్యోగానికి నియమితుడైనాడు-గ్రూప్‌వన్-సర్వీసెస్ పరీక్షరాసి, తను అప్పుడు గుంటూర్లో ఉండేవాడు. అతనికి ట్రెయినింగ్ యిమ్మని తనకే వొప్పగించారు.ఆ రెండు నెలలూ అయ్యాక అనంతపురంలో జిల్లా ఆఫీస్ నిర్వహించమని పోస్టింగ్ ఆర్డర్స్ రాగా వెళ్ళిపోయినవాడు: మళ్ళీ యిదే కనపడ్డం మధ్యలో మూడేళ్ళనాడు ఈ డిపార్టుమెంటులోని జిల్లా అధికారులందరికీ హైదరాబాదులో ఏర్పాటు చేసిన సమావేశానికి రఘురామ్ రాకుండా పి. ఏ. ని పంపించి, తను సెలవులో వెళ్ళాడు-పెళ్ళిట (అతనికే!) తిరుపతి కొండమీద.

రామచంద్రరావు షేక్‌హాండిచ్చాడు."నీ పెళ్ళికి రాలేకపోయినాను సరిగా అదే రోజున కాన్ఫరెన్సు-గుర్తుందిగా?"

"మీరు అభిమానంతో పంపిన శుభాకాంక్షలు అందాయి....మీలాంటి పెద్దలు గురుదేవులు అనేకమంది ఆశీర్వదించారు. అప్పుడప్పుడవి చూసుకుని గర్వపడుతూ వుంటాను!"

"ఊఁ. ఎలా వున్నావు? పిల్లలా?" అని నవ్వుతూ అడిగాడు రామచంద్ర రావు.

"అవును సార్"–ఒక వేలు చూపించి "బాబు" అన్నాడు రఘురామ్ "అయామ్ హాపీ."

రామచంద్రరావుకి, తను హైదరాబాదు వెడుతున్న కారణం రఘురామ్ చెప్పేయ్యాలని వుంది. తన ఆందోళనలో చెప్పేస్తానేమోనని అనుమానంగా వుంది. చెప్పకపోయినా అతను గ్రహించేస్తాడేమో అని. మాటల్లో పెట్టి తన చేత చెప్పించేస్తాడేమోననీ భయంగా వుంది. అతనితో చెప్పేస్తె అతను సాయ పడతాడని ఆశగా. అతను కూడా ట్రాన్స్‌ఫర్ ఆపించుకుందికే హైదరాబాద్ వెడుతున్నాడని ఆశ్వాసగా వుంది.

"ఈ చెయిన్‌లో నిన్నెక్కడ వేశారు?"

చెయిన్–అది అ ట్రాన్స్‌ఫర్ల రకం పేరు. విశాఖపట్నంలో ఉన్నవాణ్ని ఏలూరు, కడపవాణ్ని విశాఖపట్నం. శ్రీకాకుళం వాణ్ని కడప, నిజామాబాద్ వాణ్ని శ్రీకాకుళం–ఇలా ఈ జిల్లాస్థాయి అధికారులని పేకముక్కలు కలిపినట్టు కలిపి ఎవరికి ఏ స్థలం వస్తుందో వూహకి అందని విషయంగా చేస్తారు, అంత కన్నా పై అధికారులు మూడేసి సంవత్సరాలకోసారి వస్తుం దిలాంటి భూకంపం. అందులో కొందరు అదృష్టవంతులు అవతలి మనుషులు రాకపోవడంచేత, కొందరు గడుసువాళ్ళు తమ పలుకుబడివల్ల కదలక్కర్లేకపోవడంచేత, ఎక్కడి వాళ్ళు అక్కడే కొనసాగుతారు. చిన్న ఉద్యోగస్తుల్లాగ తల్లికో, తండ్రికో జబ్బు అనో, భార్యకి నెలలు నిండాయనో, పిల్లల చదువులు దెబ్బతింటున్నా యనో కారణాలు రాసి ట్రాన్స్‌ఫర్ ఆపించండి బాబూ అని ప్రార్థించరు. ఉన్న ట్టుండి హైదరాబాద్ ప్రయాణం కడతారు. ఎవర్నో కలుస్తారు. ఏమిచేమిటో చదువుతారు. (చదివిస్తారు.) ఇంకా పలుకుబడి కలవాళ్లు ఒక ట్రంక్ టెలిఫోన్ కాల్ చేసి ఊ రుకుంటారు. అంతే. ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చిప్.అలాం టివి సాధ్యంకాని వాళ్ళు ట్రాన్స్‌వర్ అంటే అభ్యంతరం లేనివాళ్ళు కదిలి వెళతారు.

రఘురామ్ చిరునవ్వుతో "నన్ను డైరెక్టర్ ఆఫీసులో. ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ-గా వేశారు. ఇన్‌స్పెక్టర్ ఉద్యోగాలకి సరాసరి రిక్రూట్ మెంట్ జరిగిందిగా, ఈ మధ్య! ఆ ముప్పయ్యిద్దరికీ శిక్షణ యిమ్మని...." అన్నాడు.

"ఔనౌను!" రామచంద్రరావుకి నిజంగానే గుర్తు వచ్చింది. "అదిసరే: నువ్వు ఇక్కడెక్కడ వేం: వాల్తేరులో ఎక్కక!"

"డైరెక్టర్‌గారు నిన్న మచిలీపట్నంలో క్యాంపు. వార్ని ఇక్కడకొచ్చి కలుసుకోమని రాశారు, ఇందాకే ఆయన నెల్లూరు వెళ్లారు. నన్ను హైదరాబాద్ అర్జంటుగా వెళ్ళమన్నారు. మీరు రావడం. ఛార్జి పుచ్చుకోవడం. నన్ను రిలీవ్ చెయ్యడం ఇవన్నీ అలా వుంచి, ముందుగా హైదరాబాద్‌లో పెట్టబోయే ట్రెయినింగ్ క్లాసుకి వసతి చూడవలసిందని ఆర్డర్సు. ఆర్నెల్లకోసం ఏదో బిల్డింగ్ అద్దెకి సంపాదించాలి.

"ఏం మనిషివయ్యా, డ్యూటీమీద వెళుతూకూడా సెకండ్ క్లాసులో ఎక్కేశావు!"

"మొన్న టపాలో వచ్చాయి సార్ ఆర్డర్స్.... ఇక్కడిదాకా ఫస్ట్‌క్లాస్ లోనే వచ్చాను. ఇక్కణ్నుంచి హైద్రాబాదుకి ఇంత తక్కువ వ్యవధిలో - ఫస్ట్ క్లాస్‌మాట అటుంచి-సెకండ్ క్లాస్ దొరకడమే గగనం అయిపోయింది!"

ఆరునెలలయితేనేం? తంతే గార్లెగంపలో పడ్డట్టు హైదరాబాద్‌లో పడ్డాడు. మామగారికి పెద్ద బంగళా వుంది. రెండు కార్లు, ఒక జీపు ఉన్నాయి. ఈ ఆరునెలల్లో జిల్లా ఆఫీసర్ పోస్టునుంచి అసిస్టెంటు డైరెక్టర్ ప్రమోషన్‌కు రూట్ వేస్తాడన్నది ఖాయం. అక్కణ్నుంచి మళ్ళీ జిల్లాలకి రానక్కర్లేదు, డిప్యూటీ డైరెక్టర్ అయితే తప్ప, అప్పుడైనా, అప్పటికి హైదరాబాద్‌లో ఉండే ఇద్దరు డిప్యూటీ డైరెక్టర్లలో ఒకణ్ని ట్రాన్స్‌ఫర్ చేయించేసి తను హైదరాబాదులోనే వుండిపోగలడు....

"విజయనగరం బావుంటుంది సార్" అన్నాడు రఘురామ్.

"వేస్తున్నాడు వల!" అనుకున్నాడు రామచంద్రరావు.

"కొత్త జిల్లా, పెద్దగా వర్క్ లేదు.... భవనానికి స్థలం చిక్కింది. బిల్డింగ్ కట్టడానికి డబ్బుకూడా శాంక్షన్ అయింది. టెండర్లు పిల్చాం...." చెప్పబోతున్నాడు రఘురామ్.

"ఐసీ-ఇలాంటప్పుడు నీలాంటి యువకులు అక్కడుండి డిపార్టుమెంటుని పటిష్టం చేస్తే బాగుండేది-"

"కింది పుద్యోగాల్లో ఇంకా చాలవరకు భర్తీ చెయ్యవలసిన పనుంది. తాలూకాల్లో జూనియర్ ఇన్‌స్పెక్టర్స్‌ని వేసే నిమిత్తం ఇంటర్వ్యూ దగ్గర కొచ్చింది. మూడు తాలూకాల్లో భవనాలు కట్టడానికి ఎస్టిమేట్లు అయ్యాయి-"

"అయ్య బాబోయ్. ఇప్పుడా పెంటంతా ఎవడు పడతాడయ్యా నాయనా! అంచేత నాకు ఈ ట్రాన్స్‌ఫర్ ఎలాగైనా తప్పిపోతే బావుండునని వుంది. పైగా మా అమ్మాయికి పెళ్ళి కుదిరింది, నెల్లాళ్ళలో ముహూర్తం! మా అబ్బాయికి ఉద్యోగం రావాలి. ఈ రెండూ నేను కాకినాడలో ఉండగా అయిపోతే చాలు నని చూస్తూ వుంటే, ఇంతలోనే పిడుగులా వొచ్చింది, ఈ దిక్కుమాలిన ట్రాన్స్‌ఫర్ ఆర్డరు!" అని రామచంద్రరావు నెత్తి కొట్టుకున్నాడు.

రఘురామ్ అతన్ని పిచ్చివాణ్ని చూసినట్టు చూశాడు. "కొంపతీసి ట్రాన్స్‌ఫర్ ఆపించుకోడానికిగాని హైదరాబాదు వెళ్తున్నారేమిటి?" అన్నాడు.

"అయిపోయింది!.... వీడిదగ్గరా నాగుట్టు!" అనుకుని మొహం వేలేశాడు రామచంద్రరావు.

"సార్! మీరేం అనుకోకపోతే, కొంచెం లైటు తీసేస్తారూ! కాసేపు నిద్రపోతాను" పై బెర్తుమీద ఆసామీ అడిగాడు.

"అయ్యో, ఎంత మాట!" అని రఘురామ్ లైటు తీసేశాడు.

సికింద్రాబాదులో దిగిపోతూ, రఘురామ్ అన్నాడు! "సరే- ఎలాగా ఇంతదూరం వొచ్చారు. చెయ్యవలసిన ప్రయత్నమేదో చెయ్యండి. మీ ట్రాన్స్‌ఫర్ తప్పిపోతే మీకు సంతోషం అని తెలుస్తూనే వుంది. కాని నాకు మాత్రం దానివల్ల ఇబ్బందేమీలేదు. అది మీకూ తెలుసు. అక్కడ మిమ్మల్ని కాకపోతే మరొకర్ని వేస్తారు- నేను ఒ. ఎస్. డి. గా జాయిన్ కావాలిగనక, అయితే మీరు విజయనగరంలో జాయిన్ కావడానికి కూడా ఏమీ సందేహించనక్కర్లేదు. అక్కడ ఆంజనేయులని పి. ఏ. ఉన్నాడు మహోన్నతమైన వ్యక్తి. మీరేదో అమ్మాయి పెళ్ళి- అబ్బాయి ఉద్యోగం అని ఊ- భయపడిపోతున్నారు. నిర్మొగమాటంగా అతనికి మీ సమస్యలు చెప్పెయ్యండి. కంటిలో నలుసు తీసినట్టు కాల్లో ముల్లు తీసినట్టు, చెవిలో గులిమి తీసినట్టు, అట్టే మాటాడితే ఇస్త్రీచొక్కా మీద వాలిన ఈగని తోలేసినట్టు- అన్నీ పరిష్కరించేస్తాడు,నమ్మండి."

"ఔరా ఎంతవాడవయ్యావురా!" అనుకొన్నాడు రామచంద్రరావు, రఘురామ్ తనని అక్కడికి లాగే ప్రయత్నం చూసి.

* * *

"పెళ్ళిచేసి చూడు!" అన్నారుట పూర్వులెవరోను. మరి ఆ రోజుల్లో అంత కష్టంగా ఉండేదేమో- అనిపించింది రామచంద్రరావుకి, అంతా సవ్యంగా జరిగిపోయాక.

ట్రాన్స్ఫర్ తప్పదు- అని రూఢి కాగానే కాకినాడలో తన పి.ఏ గా పని చేస్తున్న నారాయణరావుతో ఉత్తరం రాయించాడు, విజయనగరంలో తన పి.ఏ. గా పని చెయ్యబోతున్న అంజనేయులికి. వీలుంటే ఒకసారి వచ్చి వెళ్ళమని.

అంతే, మర్నాటికల్లా వాయుపుత్రుడిలా వచ్చి వాలాడు ఆంజనేయులు.

రిలీవ్ అయిన మర్నాడు బయలుదేరి వచ్చెయ్యడానికి కారు,లారీ. ఏర్పాటు చేసేశానన్నాడు. మీరు అక్కడికి వచ్చేలోగా, వుండడానికి ఇల్లు సిద్ధం- అని హామీ ఇచ్చాడు.

"మరి పెళ్ళి ఎక్కడ చెయ్యాలయ్యా" అన్నాడు రామచంద్రరావు.

"ఏమిటి. విజయనగరంలో పెళ్ళిళ్ళే జరగడం లేదంటారా సార్?" అన్నాడు చిరునవ్వుతో ఆంజనేయులు.

"అదికాదు, వివాహానికి వేదిక కావాలి, విడిదికి వసతికావాలి.... నీళ్ళు, పాలు సరుకూ, సబ్బరా, వంటవాళ్ళు, పనివాళ్ళు ఇదీ అదీ ఎన్ని ప్రాబ్లెమ్స్! వియ్యాలవారు దాదాపు వందమంది వస్తారు, అంతా ఒకేరోజున ఒకే ట్రెయిన్లో మళ్ళా గుంటూరు వెళతారుట. అందరికీ ఒక్కసారి రైల్లో రిజర్వేషన్లు ఇక్కడైతే సర్కార్ ఎక్స్ప్రెస్ వుంది! ఎక్కించెయ్యొచ్చు అనుకున్నాం. బోలెడు పట్టుబట్టలూ అని పెడదామని వొప్పేసుకున్నాం. వాళ్ళతరపు నగలన్నీ కూడా మమ్మల్నే చేయించేమన్నారు. ఇంకా పట్నాలవారి షాపులో చెబుదామను కొంటున్నాం.... ఇంతకీ నేనింకా బొమ్మ రెడీ చేసిపెట్టుకోనేలేదు___ ఏమిటో; అంతా గాభరాగా ఉందయ్యా..."

ఆంజనేయులు మొహంమీంచి ఆ చిరునవ్వు పోలేదు. "సార్ అన్నీ నా కొదిలెయ్యండి! మీరు పీట్లమీదప్పుడు పీట్లమీద; మిగతా టైమప్పుడు కుర్చీలోనూ అలా కూర్చోండి. అన్నీ అలా జరిగిపోతాయి!.... ఇక్కడున్నట్టే అక్కడా సత్రాలున్నాయి. ఇక్కడ సర్కార్ ఎక్స్ప్రెస్ వుంటే, అక్కడ

ఈస్టుకోస్టు ఎక్స్‌ప్రెస్సుంది, ఇక్కడి పట్నాల వారుంటే అక్కడ నాగులకొండ వారున్నారు. ఇక్కడ మీ పి. ఏ గా నారాయణరావుంటే అక్కడ ఆంజనేయు లుంటాడు!"

....అంతా ఒక తియ్యని కలలాగ గడిచిపోయింది.... దాదాపు ఇరవై ఎనిమిదివేలు ఖర్చయినట్టు తెలుస్తోంది అన్నిటికీ కలిసి. అందులో తను తెచ్చి ఇచ్చింది పదహారువేలు. అంతే.... తను ఐదారుమంది పి. ఏ. లను చూశాడు, కాని ఇలాగ ఎక్కడా లేదు!

"మీకు తెలియాలి కాబట్టి చెబుతున్నాను సార్. ఇదుగో ఇతను– మన ఆఫీసు బిల్డింగు కట్టే శాయికృష్ణ పట్నాయక్. బిల్డింగ్ స్టాండర్డ్స్ అన్నీ ఆర్. అండ్. బి. ఇంజనీర్లే చూసుకుంటారనుకోండి. కాని ఫైనల్ బిల్లు మనద్వారానే వెడుతుందండి. అందుకని తమర్ని చూద్దామని వొచ్చాడు."

"అంతే సార్!" అన్నాడు ఆ శాయికృష్ణపట్నాయక్. అమాయకంగా మొహంపెట్టి.

0 0 0

"జూనియర్ ఇన్‌స్పెక్టర్ పోస్టులు ఇదివరకు నింపినవి కాక మొత్తం పధ్నాలుగు ఖాళీలు సార్, ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్‌ఛేంజ్ వారు ముప్పయ్యొనిమిది మందిని పంపారు, రిజర్వేషన్ పోస్టులు నాలుగు సార్. అవికాక పదిఖాళీలు సార్. తమరు సెలక్షన్ చేసినట్టు ఆర్డర్స్ వేసిన ఈ పదిమందిలో శాయికృష్ణ పట్నాయక్ గారి కేండిడేట్ ఒక్కడే సార్. లిస్టులో ఈ యిద్దరూ మాత్రం ఫర్నిచర్ కాంట్రాక్టర్ అప్పలస్వామిగారి తాలూకు సార్. వారిచేత తమ దర్శనం విడిగా చేయిస్తాను సార్. అయిదుగురు ప్యూర్ మెరిట్ మీద వొచ్చిన వాళ్ళు సార్. ఒకరేమో తమ అల్లుడిగారి క్లాస్‌మేట్ సార్...." అని వివరం చెప్పాడు ఆంజనేయులు. ఒక కొత్త బ్రీఫ్‌కేసు టీపాయ్ మీద రామచంద్రరావు వైపు గొళ్ళాలు పెట్టి ఇలా తెరిచి అంతలోనే మూసేసి– ఆయన కళ్ళు జిగేల్ మనడం సహించలేని వాడిలాగ– "ఇక మిగిలిందినేను చెప్పిన కాండిడేట్ సార్" అన్నాడు మామూలుగా.

"అతన్ని నేను డ్రాప్ చేసేద్దామనుకున్నాను. కాని మీరెందుకో పట్టు బట్టారు మరి" అన్నాడు రామచంద్రరావు కళ్ళు జిగేల్మనడం వల్ల కాబోలు, మాట మెత్తనై.

"తమరు దానికి నన్ను క్షమించాలి సార్.... ఎందుకంటే ఈ కాండిడేట్ మామగారు విశాఖపట్నంలో ఒక పెద్ద సంస్థలో పెర్సనల్ ఆఫీసర్ సార్. అక్కడ మన జగన్‌బాబుకి - అదే అబ్బాయిగారికి- ఉద్యోగం కోసం గట్టిగా ప్రయత్నం చెయ్యమని చెప్పారు కదండీ—"

ఎక్కడెక్కడ ఎవరెవర్ని యెలా యెలా పడతాడో తెలీదు. అంతా అయి పోయాక గానీ తన స్కీమేమిటో చెప్పడు, ఆపన్లు చేయించడానికి సామ దాన భేద దండోపాయాల్లో దేన్ని అవలంబిస్తాడో అసలు తెలియనివ్వడు. అమ్మబాబోయ్, వీడు రాజకీయాల్లో వుంటే రోజుకో మంత్రిని మార్చిపారెయ్యడూ ?—అను కున్నాడు రామచంద్రరావు.

పోనీ అస్తమానూ తిరిగినట్టూ ఉండడు మరి. పి.ఏ. అన్న తరవాత ఆఫీసును కాసుకొని కూర్చోవాలికదా. అక్షరాలా అంతే చేస్తాడు. అయితే 'ఫోను రాక్షసుడు'లా ఆఫీసులో వుండే తొమ్మిది గంటల్లోనూ అయిదువందల నిమిషాలు ఫోనులోనే వుంటాడు, ఆ మిగిలిన నలభై నిమిషాలూ తనదగ్గర 'అత్యర్జంటు', 'యమర్జెంటు' 'అర్జెంటు', 'ఆడ్నరీ'- కాగితాలమీద సంతకాలు తీసుకోడానికీ 'స్పీక' డానికీనూ!

0 0 0

"ఆ అమ్మాయిని ఇన్నాళ్ళూ సరిగా చూడనేలేదు ! ఘోరంగా మిస్ అయ్యాను!" అనుకున్నాడు రామచంద్రరావు. ఆడిట్ పార్టీవాళ్ళ తమ అభ్యంత రాలన్నిటికీ రాత్రికి రాత్రి సమాధానాలు కావాలని పట్టు పట్టిన ఆరోజు తరవాత. సరిగ్గా ఆ రోజునే ఆంజనేయులు వాళ్ళ నాన్నగారికి సీరియస్‌గా వుందని అమలా పురం వెళ్ళకపోతే, ఆ సమాధానాలన్నీ తను డిక్టేట్ చెయ్యకుండా అతనే తయారు చేసుకునుండేవాడు: ఆ అమ్మాయిని అసలు చూసే ఉండక పోదును!

....చచ్చు పీనుగ, తనని పూర్తిగా అన్ని విధాలా 'సుఖ' పెట్టలేని పెర్సనల్ అసిస్టెంటు!....

స్టెనోగ్రాఫరు - ఆ అమ్మాయి ....

లీలారాణి - ఆ అమ్మాయి పేరు—

ఇరవై ఆరేళ్ళు - ఆ అమ్మాయి వయసు—

పొచ్చుటి వసుపు. ఆ అమ్మాయి రంగు.

పుష్టి, ఆరోగ్యం, నునుపు, మెరుపు - ఆ అమ్మాయి శరీరం—

నాజూకు, నవత - ఆ అమ్మాయి నడక. నడత—

అప్పుడు—బంట్రోతు సింహాచలంగాడు, ఎకౌంటెంట్ అచ్యుతరామయ్య, హెడ్ గుమస్తా రంగాచారిగారు - ఇలా వివిధ ఏజ్ గ్రూప్‌ల వాళ్ళు-అందరూ ఆ అమ్మాయిని ఆశగా, ఆకలిగా చూస్తూ వుండడం అన్యమనస్కంగానైనా ఆందోళనతో చూశాడు రామచంద్రరావు.

మొత్తం అయిదుగంటలసేపు కూర్చుంది తన రూమ్‌లో, తన ఎదురుగా, ఆ రాత్రి లీలారాణి అయిదువందల సార్లయినా తన కళ్ళలో కళ్ళుపెట్టి చూసింది. పోనీ- తను అయిదుగంటలపాటూ ఆమె కళ్ళలోకే చూస్తూ కూర్చుంటే, తను చెప్పిన వాక్యమో, మాటో, అక్షరమో, ఆశ్చర్యార్థకమో - ఉర్దూలాంటి ఆ అర్థం కాని లిపిలో రాసేసి, తరవాత ఏం చెబుతారు'సా'రన్నట్టు తన కళ్ళ ల్లోకి ప్రశ్నార్థకంగా చూసింది.

పైపు కొడుతూ బ్లైండ్ టచ్‌లో తనని 'బ్లైండ్ ఫోల్డ్' చేసి, ప్రశ్నార్థకంగా చూసింది.

ప్రశ్నార్థకమే, మరి!....

తనేమైనా శ్రీ రామచంద్రుడా ?

అయితే, ఏమాట కామాటే - పదేళ్ళ నాడు అమ్మాయి ఈడేరిన నాటి నుంచి నేటివరకు మాత్రం—

ఇప్పుడు మళ్ళానా?

అవును— ఇప్పుడేమిటి, తన బాధ్యతలు?

ఏమీలేవు—

అమ్మాయికి పెళ్ళై అత్తారింటికి వెళ్ళిపోయింది. అబ్బాయికి ఉద్యోగమై విశాఖపట్నంలో ఉంటున్నాడు.

భార్య తన సంపాదనమీద, ప్రతిష్ఠమీద నెరవేర్చేసిన బాధ్యతలమీద, తృప్తితో, గౌరవంతో రెండు పూట్లా నిద్రపోతోంది- కడుపునిండా తిని!

తనకి వయసుమాత్రం ఏం మీరిపోయిందని? మొగాడికి యాభై ఏళ్ళొక వయస్సా?

సర్వీస్ రిజిస్టర్‌లో చాలా వివరాలుంటాయి........

కేస్ట్- దేవదాసి. వెదర్ మేరీడ్— విడోడ్,

బొట్టుపెట్టుకొని రంగు చీరలు కట్టే ఈ సుందరీమణి విధవయా? ఎంత దుర్భరం మెంత దుఃఖావహము!

అడవికాచిన వెన్నెలా?

పరువంలో వైధవ్యమా?

ప్రశ్నార్థకాలే- అన్నీను....

ఈ ఆంజనేయులుగాడితో ఎన్ని చేయించుకున్నాను! ఎంత చేరదీశాను వీణ్ణి!

వీడితో నేను చెప్పలేని మాట అంటూ లేదు-ఇప్పటివరకు.

ఇది చెప్పగలనా?

ఇదీ చెప్పగలనా?

చెప్పాలి.... చెప్పక వీల్లేదు.... వాడే, వాడే, వాడే సమర్థుడు, ఏ ఏర్పాటుకైనా....

వాడు కాలాంతకుడు, దేవాంతకుడు! అయితే అస్మదీయుడు!

రానీ, వాణ్ని అమలాపురం నుంచి-

"మీ నాన్నగారి కెలా వుంది? సరైన వైద్యం చేయించేవా? పోనీ వైజాగ్ తీసుకురాకపోయావా? మంచి ఆసుపత్రి వుంది కదా.... అసలు నీకు బుర్ర లేదయ్యా. ఈ వయసులో ఆయన్నక్కడ ఒంటరిగా వదలి— అమలాపురంలో అరటితోట వుంటే మటుకు?— నీ దగ్గరుంటే వచ్చే తృప్తి, ఆరోగ్యం తనివి అక్కడొస్తాయా?"

ఇలా మాట్లాడొచ్చు.

"ముప్ఫయ్యేళ్ళు వొచ్చాయి నీకు. ఇంకా పెళ్ళి చేసుకోవేం? మంచి పిల్లని చూసి పెళ్ళి చేసుకుని, కోడలిచేత ఆయనకి సేవ చేయించలేవు, ఎందుకు? ఊళ్ళో వాళ్ళందరికీ అడ్డమైన వుపకారాలు చేస్తావు! నీ స్వంత తండ్రిని గాలికి వదిలేసి!.... ఛఛ! ఇదేం బాగులేదయ్యా. ఆంజనేయులూ!"

ఇలా చొరవ చెయ్యొచ్చు. ఇందులో పెద్ద చొరవ మాత్రం ఏముంది? అతను నా పెర్సనల్ అసిస్టెంటు. అతని వ్యక్తిగత వివరాలు నేను భోగట్టా చెయ్యాలి. నా "పెర్సనల్" విషయాలలో అతని సహాయం తీసుకోవాలి—

"ఫాదర్ ఎక్స్‌పైర్డ్- ప్లే ఎక్స్‌టెన్షన్ లీవ్ ఫిఫ్టీన్ డేస్- ఆంజనేయులు.,

చంపేశాడ్రా బాబూ........ ముసిలాడు- వాడు చావడం కాదుగాని- నన్ను చంపి వదిలిపెట్టాడు. పదిహేను రోజులు సెలవు పొడిగించేశాడు "నా పెర్సనల్" అసిస్టెంటు!

ముసిలాడు ఇక్కడైనా వచ్చేడు కాదు.... అప్పుడప్పుడు కనబడుతూనైనా ఉండేవాడు ఆంజనేయులు....

ఎన్ని పన్లు బాకీ ఉండిపోయాయి!

ఎన్ని ముఖ్యమైన పన్లు....

అర్జంటు పన్లు....

"పెర్సనల్" పన్లు....

ఒక్కటి కాదే, వాడు లేందే!

ఒక్కటి——

పోనీ, ఆ ఒక్కటీ.... అసలు కాదే!

.... .... .... ....——

ఐడియా!

ఎలాగా ఈ పదిహేడో తారీకున హైదరాబాద్‌లో జరిగే కాన్ఫరెన్సుకి వాడు రాలేడు——

"స్టెనోగ్రాపర్ శ్రీమతి లీలారాణి హైదరాబాదు కాన్ఫరెన్సుకి జిల్లా ఆఫీసర్ని ఫాలో కావలెను"

హద్దదీ, వేస్సేను ఆర్డర్.... ఛక్ ఛకా, ఫట్ ఫటా!

అయిదు వందల మైళ్ళు ఇటూ, అయిదు వందల మైళ్ళు అటూ ప్రయాణం!

అయిదు రోజులు కలసివుంటాం....

అయిదు గంటలు కాదు——

అయిదు నిమిషాల్లో తేలిపోయింది సమస్య!

అయిదు వందల అడ్వాన్స్ టి.ఏ. శాంక్షన్డ్.

0 0 0

"పి.ఏ. గారెప్పుడొస్తారు సార్?"

"పి.ఏ. గారైతే తమర్ని బాగా అర్థం చేసుకుంటారు సార్."

"పి.ఏ. గారుండి వుంటే ఈ పొరపాటు జరిగేది కాద్సార్."

"పి.ఏ. గారితో చెప్పండి సార్, ఆయనొచ్చేక"

——ఔనన్లేదు. కాని, కాదన్లేదుగా,....

ఆంజనేయులుతో చెప్పమంటోంది.... ఆంజనేయుల్నే అడగమంటోంది., అడుగుతాను. నాకేం మొహమాటమా?........ (తొందరపడకూడదు!)

ఇంకెన్నాళ్ళు?.... ఇవాళ ఇరవయ్యో తారీకు.... ఎల్లుండి కల్లా వొచ్చేస్తాడు!

* * * *

"సార్—" పొడ్డుమాస్తా రంగాచారిగారు.

"ఎస్–"

"ఐదయిపోయింది. తమరింకా ఆఫీసులో ఉంటారా సార్?"

"ఏం. మీరు వెళ్ళిపోతారా?"

"అవును సార్, ఇవాళ మధ్యాహ్నం పి.ఏ.గారు ఇంటికొచ్చేశారు సార్. వాళ్ళ నాయనగారు పోయారు కదా, సార్."

"అవునండీ, పాపం...."

"ఆఫీస్ స్టాఫ్ అంతా వెళ్ళి పరామర్శ చేయాలనుకొంటున్నాం సార్."

"ఓ, అదా!.... అలాగే, అలాగే తప్పకుండా వెళ్ళండి.... సరే, నేనూ వెళ్ళిపోతాను; వాచ్‌మేన్‌ని పచ్చి తాళాలు వేసెయ్యమనండి.... అర్జంటు కాగితాలింకేం లేవు కదా"

"లేవు సార్."

క్షణాలమీద నిర్ణయానికొచ్చాడు రామచంద్రరావు. తనుకూడా వెళ్ళి నాలుగు సానుభూతి వాక్యాలు పలకాలి.

ఇంటికి వెళ్ళి ప్యాంటూ, కోటూ విడిచాడు, మొహం కడుక్కొని, సబ్బు వల్ల అంటుకునే తెల్లటి తెలుపును సన్నటి గుడ్డతో తుడిచేసుకున్నాడు. జీప్‌లో వెళ్ళకూడదని ముందే నిర్ణయించుకోడంవల్ల జీప్ డ్రైవర్ని పంపేశాడు. వీధి గుమ్మంలోకెళ్ళి ఆలా వెళ్తున్న ఒక రిక్షాను ఆపి బేరం చేశాడు.

"వాళ్ళమ్మగారు ముందే పోయారటగా! లేకపోతే నేనూ వద్దును." అంది ఇల్లాలు.

"ఆఁ, అయినా నువ్వెందుకులే! అతనేం మన చుట్టమా, బంధువా? మన యింట్లో మనిషిగా కలిసిపోయాడనుకో.... అయితే మాత్రం? అది అతని స్వభావం, అంతే! మన పొజిషన్‌లో యెవరుంటే వాళ్ళతోనే అతనలా కలిసిపోతాడు."

"మరేవండీ.... పాపం, మంచివాడు!"

"ఆఫీసులో వాళ్ళంతా వెళ్ళారు.... మనలో ఎవరో ఒకరు వెళ్ళకపోతే బాగుండదు.... చిన్నబుచ్చుకుంటాడు.... అంచేత నేనే ఒకసారి వెళ్ళి పలకరించి వచ్చేద్దామనుకొంటున్నాను...."

రామచంద్రరావు వెళ్ళేసరికి ఆఫీసు స్టాఫ్ అంతా ఇవతలికి వచ్చేస్తున్నారు.

అయినా ఆంజనేయులు ఉండే ఇల్లు రద్దీగానే వుంది పరామర్శకు వచ్చిన వాళ్ళతో.

అక్కడ—

నిల్చున్న వాళ్ళు, కూర్చున్న వాళ్ళు, వరండాలో అక్కడా అక్కడా కొద్ది శబ్దంతో మాట్లాడుకుంటున్న వాళ్ళు— కంట్రాక్టర్లు. పాత ఆఫీస్ బిల్డింగ్ యజమాని- ఇరుగు పొరుగు వాళ్ళు- దగ్గర తాలూకాల ఉద్యోగులు- కొద్దిమంది బంధువులు కూడా ఉన్నట్టున్నారు........

ఏ ఒక్కరి మొహం చూసినా ఆంజనేయులికి వొచ్చిన కష్టంపట్ల నిజంగా సానుభూతి కలిగిన వాళ్ళలాగే ఉన్నారు.... ఒక్కసారి రామచంద్రరావుకి ఒళ్ళు గగుర్పొడిచింది. కాని వెంటనే అతను సర్దుకున్నాడు- ఏముందీ— "హల్లో; మిష్టర్ ఆంజనేయులు! చాలా విచారకరమైన వార్త. ....నేను షాకయ్యాను. ఆ రోజు నీ టెలిగ్రాం చూసి.... పాపం. మీ ఫాదరు.... గట్టిగా అరవై ఏళ్ళు లేవటగా.... ఇట్స్ వెరీ అన్‌ఫార్చునేట్.... మరేమిటి సంగతులు? మీరెంత మంది అన్నదమ్ములు? హౌ అబౌట్ సిస్టర్స్? నువ్వు పెద్ద కొడుకువి కాదనుకుంటానే—పోన్లే. ఆ విధంగా కొన్ని బాధ్యతలు తగ్గాయి నీకు.... ఐనా. నాకనిపిస్తుంది— మీ ఫాదర్‌కి జబ్బుగా ఉందని తెలియగానే ఆయన్ని నీ దగ్గరికి ఈ వూరు తీసుకొచ్చెయ్యవలసింది. పూర్ సోల్.... ఇంతమంది ఉండీ కూడా ఒంటరిగా పోయినాడు.... ఐయామ్ సో సారీ ఆంజనేయులు!.... అయితే ఏమిటి?— ఆఖరి చూపు కనీసం నీకైనా దక్కిందా? ఐసీ-ఇట్స్ వర్స్.... పోనీ, ఆస్తి గురించి స్పష్టంగా విల్లు రాశాడు కదా. అందువల్ల హెడేక్ తగ్గింది.... ఎనీవే- నువ్వు ధైర్యంగా ఉండాలి.... లాటాఫ్ లైఫ్ ఎ హెడ్........ ఆఫ్టరాల్, డెత్ ఈజ్ కామన్...." ఒక్క అక్షరం కూడా మర్చిపోకుండా—

రామచంద్రరావు మాటలు వింటూ, మధ్యలో సమాధానాలు చెబుతూ,

అంజనేయులు అతన్ని లోపలి గదిలోకి తీసుకు వెళ్ళాడు. చక్కటి ఆ గదిలో, మిక్కిలి సదుపాయంగా, సౌఖ్యంగా కూర్చున్న రామచంద్రరావు అక్కడొక వింత ప్రపంచాన్ని చూసేడు....

బోలెడు పుస్తకాలు—

ఎన్నో బహుమతి వస్తువులు—

మరెన్నో కానుకలు—

గోడలకి మంచి పెయింటింగులు—

అవసరాలు, సౌఖ్యాలు, విలాస వస్తువులు; అన్నిరకాలూ వున్నాయక్కడ. ఆ గదుల అలంకరణ పాతదే అయినా హుందాగా వుంది....

"అదలా వుంచు. నీ మంచితనం కారణం గానీ, నీ పనివాడితనం కారణంగానీ— ఇవాళ నీ యింటికి వచ్చిన జనం- ఇన్నిరకాల వాళ్ళు ఇంత మంది! వీళ్ళని చూసేసరికి; వీళ్ళ కళ్ళలో నీమీన కురుస్తున్న సానుభూతి చూసే సరికి. మీ నాన్నగారు పోయినందుకు నాకు నిజంగా కలిగిన విచారం అంతా పోయిందనుకో! ఒక్కసారిగా నువ్వు నా పెర్సనల్ అసిస్టెంటువి, ఇంత జన ప్రియుడివిగా, అజాత శత్రువుగా వున్నావని నాకెంతో సంతోషం కలిగింది. దానికి కారణం నాకు తెలుసు. నువ్వు యెవరు- ఏమి- అడిగినా తప్పకుండా యిస్తావు, చేస్తావు! నాకు నిజంగా గర్వంగా వుందనుకో!" ("నాకు కొంచెం అసూయగా వుంది" అనేమాట మింగెయ్య గలిగినందుకు కూడా ఆనందిస్తూ) అన్నాడు రామచంద్రరావు. ఈ ధోరణి యిప్పుడు అవసరం. అతన్ని కొంచెం కీర్తించడంవల్ల ఒక ముఖ్యమైన "స్వంత" పని నెరవేరుతుంది.

"అంతా మీ వంటివారి దయ సార్, నాదేముంది? కేవలం నా వుద్యోగం మీద శ్రద్ధా, నా అధికారులమీద భక్తీ; అంతే!" అని పక్కకి చూశాడు ఆంజ నేయులు.

[ఏ సంజ్ఞ చెప్పిందో, ఏ సందేశం విన్నదో, స్టెనోగ్రాఫర్ శ్రీమతి లీలారాణి, ప్రస్తుతం కష్టంలోవున్న అంజనేయులికి ఒక సాంసారిక నెచ్చెలిలా, నిరాడంబరమైన వేషంలో రెండు సాసర్లలో రెండు కప్పులతో కాఫీ తీసుకొని, ఆ సమయానికి ఆ గదిలో అడుగుపెట్టింది]

రామచంద్రరావు ఆ నిరాడంబర సౌందర్యం కూడా ఒక కళాకాపక్షి కుండే ఆశా పరిశీలనతో ఆస్వాదించి కాఫీ అందుకొన్నాడు....

"అయితే సార్, నాదొక్క మనవి" ఆంజనేయులు మాట్లాడడం ప్రారంభించాడు; కాఫీ కప్పు పక్కన పెట్టి. "తమరున్నారండి! తమరు రామచంద్ర రావుగారండి. నేనున్నానండి! నేను ఆంజనేయుల్నండి. నేను మీ సేవకుణ్ణండి. నేను మీ భక్తుణ్ణికూడానండి. అలాగే ఆ శ్రీరామచంద్రులవారున్నారండి! వారి భక్తుడూ వారి సేవకుడూ అయినటువంటి ఆంజనేయస్వామివారున్నారండి. రామ భక్తిలో, రామసేవలో ఆంజనేయుడికి సాటి మరెవ్వరూ లేరండి. అయితేనండీ; ఆంజనేయుడి భక్తులు అంజనేయుడికీ ఉన్నారండి. ఆంజనేయుడి దేవాలయాలు ఆంజనేయుడికీ ఉన్నాయండి. శ్రీరామచంద్రులవారు ఆంజనేయుడి సేవలు ఎన్నయినా ఆశించవచ్చు పొందవచ్చు గానండీ; ఆంజనేయుడి తపోఫలాన్నిగాని అందులో వాటానుగాని ఆశించకూడదు గదండీ!" అని నమస్కారం రామ చంద్రరావువైపూ ఆపేక్షగల చూపు లీలారాణివైపూ పెట్టాడు ఆంజనేయులు.

"ఆహాహా! ఏమి నిజం చెప్పేవయ్యా!" అని అక్షరాలా లెంపలు వేసుకున్నాడు; "ఆంజనేయ భక్తుడు" రామచంద్రరావు. *

[కీర్తిశేషుడు సంకు పాపారావు అలవోకగా చెప్తూ ఉండే అనేక జీవిత సత్యాలలో ఒకటి విని ఈ కథ రాయకుండా ఉండలేకపోయాను. మా అధికారి తిరుపతిరాజుగారు నన్ను పిలిపించి ఈ కథలోని అధికార వ్యవస్థపట్ల నేను వ్యక్తపరచిన పరిశీలనాశక్తి తమకెంతో సంతృప్తిని కలిగించిందని చెప్పడం విశేషం.]

("స్వాతి" మాసపత్రిక; మార్చి 1979?)

# వై - శ్వానర - భోగం

అరగంటయింది బ్యాంక్ తలుపేసేసి.

ఇవతలికొచ్చేవాళ్ళు నోట్లకట్టలు నిండిన హ్యాండ్‌బ్యాగులతో బ్రీఫ్‌కేసులతో, రుమాళ్ళతో, జేబులతో ఏజెంటు గారి రూమ్‌లోంచి వస్తున్నారు. లోపలికి ఎవరూ వెళ్ళే ప్రసక్తే లేదు.

"అవదంటారా నర్సింహారావుగారూ?"

"మీకెందు కలాగుండండిచెప్తాను!" అని పదోసారికాబోలన్నాడు. ఆర్. అండ్ బి. ఆఫీసు గుమస్తా నర్సింహారావు. అతని చేతుల్లో వున్నాయి నాలుగు లక్షల రూపాయల విలువగల నా బిల్లులు ఆనాడు.

"రేపుకదా ఏప్రిల్ ఫస్టు? వీళ్ళు మనన్ని ఇవాళ్టినుంచే ఫూల్ చేస్తున్నారేమిటి ఖర్మ?" అని జోకుతో మళ్ళా అశాంతిని వెలిబుచ్చాను.

"ఏంటండి కంట్రాక్టరుగారూ! ఇవాళకింక మూసిన బ్యాంక్ తెరవనట్టేనా?" పక్కనుంచి ఎవరో అడిగారు. తిరిగి చూశాను. అతని పేరు మరిచిపోయాను. ఎలెక్ట్రిసిటిబోరు ఎస్. ఈ. ఆఫీసులో యూడిసీ.

"మీరొచ్చేరేమండి కాష్‌కి? ఇవాళ వేంకట్రావుగారి పేర్న ఎండార్స్ చేస్తామన్నారే మా బిల్లులు?" అన్నాను.

"అక్కడా ముప్పైయ్యారువేలదాకా రావాలి.... "అందరికంటె తక్కువ బిల్లు సార్ మీది! మీరు రేపురండి, పేమెంటుకి. ఇవాళ కోటిరెడ్డిగారిదీ జంబునాధన్‌గారిదీ, ఇంకా కొందరిదీ, మొత్తంపదహారులక్షలకిపైగా వున్నాయి, అని చెప్పేరు వెంకట్రావుగారు ఈ ఉదయం. దానికి" నేను—" బాబ్బాబూ— ఆ బిల్లులతోపాటు నాదీ మీపేర్న వేసుకోండి. నాకు సొమ్ము యివాళ రాత్రికే కావాలి" అని మొరపెట్టుకొని మొత్తానికి ఆయన్ని వొప్పించేను.

"మీబిల్లు ఆయన పేరనే వుంది."

"మరి ఆయన కనిపించరే?"

"ఆయన మళ్ళీ ఆఫీసుకెళ్ళేరు."

"అసలు బ్యాంకు కొచ్చినట్టు కనబడదే?"

"బ్యాంకుదాకా రాలేదు. జంబునాథన్‌గారి మూడు బిల్లుల్లో వొకదాని మీద ట్రెజరీలో ఆబ్జక్షన్ పడింది- అది పట్టుకుని మళ్ళీ ఎస్. ఈ. గారి సంతకాలకోసం వెళ్లారు."

"మిగతావి పాసయ్యాయా? వాట్లో నా బిల్లుంది" అన్నాను.
"మిగతావి పాసయ్యాయి. అవీ వెంకట్రావు దగ్గరే వున్నాయి"

పాస్‌కాని బిల్లుకోసం అయిన బిల్లులుకూడా ఆఫీసుకి పట్టికెళ్ళడమేమిటండి; మరీ అన్యాయం కాకపోతే!" అని విసుక్కున్నాను.

"బిల్లులేమో ఆయనదగ్గి రుండిపోయాయి. బ్యాంకువాళ్ళేమో తలుపులు మూసేసుకున్నారు. ఆయన వొచ్చే దెప్పుడు, ట్రెజరీలో పాసయ్యేదెప్పుడు; బ్యాంకులో ప్రెజెంట్ చేసేదెప్పుడు; కేషయ్యే దెప్పుడు?" అనికూడా అనేశాను.

0 0 0

ప్రతి యేడూ మార్చి 31 నాడు ఠంచన్‌గా మధ్యాహ్నం రెండుగంటలకి బ్యాంకు తలుపులు మూసెయ్యరు, లక్షలకొద్దీ రూపాయల బిల్సు ఆరోజు కాష్ అవుతాయి. అవి ఉద్యోగుల జీతభత్యాలూ కావచ్చు. కాంట్రాక్టర్ల బిల్సు కావచ్చు. కంటింజెన్సీలు కావచ్చు.

పీకలమీది కొచ్చేకాదా బిల్లులు తయారుచెయ్యక ఏంచేస్తారో- అనుకునే వాణ్ని— మా నాయనగారు కాంట్రాక్టులు చేసిన రోజుల్లో-

గుమస్తాలదీ కాదు తప్పు; అధికారులదీ కాదు.

ఎన్నో శాంక్షన్లు మార్చి 20 నుంచి 28 వరకు గల దినాల్లో వస్తాయి. ొన్ని 29. కూడా వస్తాయి!.........మార్చి 24 ప్రాంతంనుంచి రాత్రీ పగలూ నిప నేసి, బిల్లులు తయారు చేస్తారు గుమాస్తాలు; వాటివల్ల ఎవరికి లాభమో వాళ్ళని ట్టుకుంటూనూ, అందులో వాళ్ళ సహాధ్యాయులే వుంటారు. స్వంత అధికార్లే ంటారు. నాలాంటి కాంట్రాక్టర్లూ వుంటారు.

ఎవరికీ తప్పవు తిట్లు.

ఐతే ఎవరి బిల్లూ ఆగిపోదు.

ఎందుకంటే మార్చి 31న ట్రెజరీ ఆఫీసు మూసెయ్యరు. బ్యాంకు తలు లూ మూసెయ్యరు. తయారైన బిల్లులు సంతకాలై ట్రెజరీకి వెళ్ళడమూ, గదుగా మారడమూ జరుగుతాయి.

ఒకో ఏడాది- ఏప్రిల్ 1న తెల్లారే వరకు బ్యాంక్ పని చేస్తూనేవుంటుంది.

శాంక్షన్‌లు ముందుగా పంపడానికి 'ఫండ్స్' వుండవు. సెంట్రల్ గవర్నమెంటు గ్రాంటో, అప్పో మార్చి 15 దాకా రాదు. ఆ తరువాత హైదరాబాదు సెక్రటేరియట్లో ఆ యా డిపార్టుమెంట్ల అధికారులు. "ఆర్థికశాఖ కంకరెన్స్"తో శాంక్షన్లు విడుదల చెయ్యడం అక్కణ్ణుంచి జిల్లాలకి డిస్ట్రిబ్యూషన్ స్టేట్‌మెంట్ల కాపీలు రావడం, ఇన్నీ అయినా డైరెక్టరేట్ ఆఫ్ ట్రెజరీస్ అండ్ అకౌంట్స్ ద్వారా జిల్లా ట్రెజరీలకి విడిగా వాటి కాపీలు రాకపోతే బిల్లులు ట్రెజరీలో పాస్ కావు.

అయితే ఏదీ ఆగిపోదు. అలా అలా ఆ అర్డర్సు 31 మధ్యాహ్నం మూడు గంటలకి వొచ్చినా, ఏ బిల్లూ వదలకుండా అన్నీ ప్యాస్ చేసేస్తారు ట్రెజరీ వారు. అన్నిటికీ కేష్ యిస్తారు బ్యాంక్‌వారు.

ఏప్రిల్ ఫస్టు ఉదయం వరకు యిచ్చినా సరే, ఆ బిల్లులన్నీ మార్చి 31 డేబుక్‌లోకే వెళతాయి. ఏప్రిలుఫస్టున, ఆ తరువాత-పాత ఆర్థిక సంవత్సరపు శాంక్షన్ల బాసతు బిల్లులకు కేష్ యివ్వరాదు,

ఈ ఏడాదీ అంతా సవ్యంగానే అయిపోతుందనుకున్నాం.

అయితే-రాష్ట్రం మొత్తంలో ప్రభుత్వ కార్యాలయాలన్నీ మొన్నటికి నాలుగు నెలలపాటు గుమాస్తాలు లేకుండా నడిచాయి. నూటపదహారు రోజులు సమ్మెచేసి మార్చి 26 న ఉద్యోగులు తిరిగి డ్యూటీల్లో చేరారు.

మూడు నెలలనుంచీ జీతాలు లేక ఆవురావురని వున్నారేమో, ముందు వాళ్ళ జీతాలు బిల్లు చేసుకున్నారు. "మా బిల్సు సంగతేమి"టని అడగడానికి కూడా నోరు రాలేదెవరికీనీ.

అక్కడికి 28 అయింది. మూడు నెలల జీతాలు పట్టుకుని ప్రతి చిన్న గుమాస్తా, పెద్ద గుమాస్తా, హెడ్ గుమాస్తా, సూపరింటూ, మేనేజరు-28న ఇళ్ళకు వెళ్ళి ఇంటి చుట్టూనూ, వూరు నలుమూలలానూ వున్న అప్పులు నిష్పత్తీ అనుపాతం చూసుకుని నివాడా చేసుకున్నారు.

29 ని వాళ్ళు పన్లోకొచ్చినా మధ్యాహ్నందాకా ఎవరెవరికి ఎంతెంత అప్పు మిగిలిపోయిందో చర్చించుకోడంతోనే సరిపోయింది,

29 రాత్రి, 30 పగలూ రాత్రీ, 31 పగలు-ఇళ్ళకి వెళ్ళకుండా బిల్లులు తయారుచేసి వాటికి అవసరమయిన ఇతర కాగితాలు జతపరచి, సంతకాలు పెట్టించుకుని-ఒక మహాసంప్రదాయాన్ని తు-చ-తప్పకండా ఆచరించారు గుమాస్తాలు. వారికి జోహార్లూ; వందనాలూ ఎన్ని అర్పించినాచాలవు....

కాని ఈ బిల్లులన్నీ ఇవాళ కేష్ కాకపోతే-
వాళ్ళకి మేం అవికూడా అర్పించం
మా అప్పులే తీరవు, సరి...

*　　　　*　　　　*

చొరవ చేసుకుని ఏజెంటుగారి రూమ్‌లో దూరాను. మెసెంజరు నన్ను అడ్డుతూ పడ్డ చిరాకు ఆయన కళ్ళపడ్డాది, "ఆయన్ని రానివ్వవోయ్; అప్పారావూ! ఆయన వేరేపనిమీద వొచ్చుంటారు." అన్నారు ఏజెంటుగారు; నన్ను కూర్చోమని సంజ్ఞచేసి; హెడ్‌క్యాషియర్ తెచ్చిన స్టేట్‌మెంటు ఏదో టిక్‌చేస్తూ.

నేను చిరునవ్వు మొహాన పులుముకుని "సారీ సార్. నేను వేరేపనిమీద రాలేదు. అదేపనిమీద వొచ్చాను. నావి ఐదు లక్షల రూపాయలు వుండిపోయాయి ఈ ఏడాది. ఖర్మేమిటోగాని అన్నీ తలుపవతలే వున్నాయి" అన్నాను.

"అరరే-అలాగా? సా-రీ-"

సా-రీ-అనడంలో "సరి" అన్నారో తెలీలేదు; 'సారీ' అన్నారో తెలీలేదు.

తమరు పర్మిట్ చేస్తే-ఎ. పి. ఎస్. ఈ. బీ. నుంచి ఇద్దరు; ఆర్.అండ్ బి నుంచి వొకరు-జడ్, పి. నుంచి ఒకరు-మూడోకంటివాడికి తెలీకండా లోపలికొస్తారు సార్" అన్నాను.

"అబ్బెబ్బే-అదెలా కుదుర్తుంది? అలాంటప్పుడు మీరు ముందే జాగర్త పడుండాల్సింది. నా పీకలమీద కొస్తుంది అలాంటి పన్లు చేస్తేను. వెళ్ళండి వెళ్ళండి——" అని ఆయనలేచి నిలబడిపోయాడు.

మెసెంజర్ అప్పారావు నావేపు పొగరుగా చూశాడు.

"కలెక్టరుగారు రాయలేదా సార్, బ్యాంక్ తెరిచుంచమని?" అన్నాను లోపలవున్న నూటయిరవైమందికాక, పైనున్న రెండువందలమందినీ, ట్రెజరీలో గిరికీలుకొడుతున్న యాభైమందినీ తలుచుకుని,

"కలెక్టరుగారు రాయలేదు; ఫోన్ కూడా చెయ్యలేదు. కనీసం మేం ఫోన్ చేస్తే అన్సర్ చెయ్యడంలేదు."

అంటే-కలెక్టర్‌గారేం చేస్తున్నట్టు?

ఎనభైలక్షల రూపాయల బిల్సు ఇవాళ ఎన్‌కాష్ కావాలని ఆయనకి తెలుస్తుంది. ఇటువంటి సమయంలో ఆయన మౌనం వహించడం కష్టంగా ఉంది. మాయమైపోడం దుస్సహంగా ఉంది.

ఈ శాంక్షన్‌లన్నీ "కుక్క" ముట్టేసుకుంటే మళ్ళీ కొత్తశాంక్షన్లు అక్టోబర్ దాకా రాకపోవచ్చు. పెట్టిన డబ్బంతా వర్క్సులో లాకప్ అయిపోయి వుండిపోయింది. కొత్తవర్క్సు ఎలా చేపట్టగలం? ఎప్పుడూ ఎవరికీ లోటుచెయ్య లేదు....ఇలా ఎందుకు జరుగుతోంది?

"కలెక్టర్‌గారు ఆఫీసులో లేనట్టున్నారు సార్."

"నాకు తెలీదు. మీరు వెళ్ళండి. ఐయామ్ బిజీ" అన్నారు బ్యాంక్ ఏజెంటుగారు,

*　　　　*　　　　*

"ఎవ్వరూ వెళ్ళిపోకండి. అరగంటలో వస్తాను" అని, నా బిల్సు పట్టు కున్న గుమస్తాలిద్దర్నీ వుద్దేశించి చెప్పినా, అందరికీ వినపడేలాగే చెప్పేను.

కారు తీసుకుని బైల్దేరాను, కలెక్టరుగారి బంగళాకి.

*　　　　*　　　　*

"గవర్నమెంట్ వెహికిల్" అని రాసివున్న జీపులు పది, పన్నెండు దాకా వున్నాయక్కడ.

సంగతేమిటో అడుగుదామని, ఎవరైనా కనిపిస్తారేమోనని వెతికాను. అందరూ లోపలెక్కడో వున్నట్టున్నారు. ఆ నిశ్శబ్దం భయంకరంగా వుంది.

కలెక్టర్‌గారు కులాసాగా ఉన్నారా? హఠాత్తుగా ఆయనకేదైనా సుస్తీ చేసిందా అని అనుమానం వొచ్చింది.

ప్రస్తుతం యీ జిల్లాకి కలెక్టర్‌గా వున్న సూర్యంగారూ, నేనూ భీమ వరం కాలేజీలో క్లాస్‌మేట్సుం. ఆయన యిక్కడికి రాకపూర్వం వివిధ వుద్యో గాలలో వుండే కాలంలో నేను వార్ని అప్పుడప్పుడు కలుస్తూనే వున్నాను.ఎంత పన్లో ఉన్నాసరే, "హలో, వొచ్చావా! రా, కూర్చో. ఎలా వుందినీ పని? పిల్లలు బావున్నారా?" అని పలకరించడం రివాజు.

ఎక్కడో లోపల వున్నట్టున్నారాయన.

ముందు హాల్లో అడుగుపెట్టాను.

ఇరవై చేతులుంటే బాగుణ్ణు రావణాసురుళ్ళాగ-అనిపించింది, జీవితంలో తొలిసారిగా—

అక్కడ-

ఆర్. డి. ఓ.గారు-

డి. ఎం. ఓ. గారు-

జాయింట్ కలెక్టరుగారు–

తాసీల్దార్‌గారు–

డిస్ట్రిక్టు వెటెర్నరీ ఆఫీసర్‌గారు–

సి. టి. ఓ. గారు–

హుజూరు శిరస్తాదారుగారు–

కలెక్టర్‌గారి పి. ఏ, గారు–

సెటిల్మెంటు ఆఫీసర్‌గారు–

డి. సి. టి. ఓ గార్లు యిద్దరు–

సర్వే అసిస్టెంటు డైరెక్టరుగారు–

కో–ఆపరేటివ్ జాయింటు రిజిస్ట్రారు గారు–

ల్యాండ్ అక్విజిషన్ డిప్యూటీ కలెక్టరుగారు–

పి. డబ్ల్యు. డి. సూపరింటెండింగు ఇంజనీరుగారు.

జిల్లా స్టాటిస్టికల్ ఆఫీసర్‌గారు–

సివిల్ సప్లయిస్ ఆఫీసర్‌గారు–

అందరూ మహానుభావులే!

ఎందరికని వందనాలు,

రెండంటే రెండుచేతులతో?

అయితే గొప్ప సంతోషపడిపోయాను; బ్యాంకుదగ్గిర పరిస్థితి తల్చుకుని.

వీళ్ళందరూ తమ తమ ఆఫీసుల్లో ఈ మూడురోజులూ తయారైన బిల్లులు బ్యాంకుదగ్గిర ఆగిపోయాయని చెప్పుకోడానికే ఇక్కడికి వొచ్చుండొచ్చు అన్న మాట స్ఫురించింది.

అసలు మాబోటి కాంట్రాక్టర్లకే ఎక్కువ నష్టం–ఈ పరిస్థితివల్ల.

అప్పను– మొత్తం ఎనభై లక్షలుంటుంది; రావలసిన సొమ్ము. ఏడెనిమిది నెలలపాటు ఈ సొమ్ము రాకపోతే అందరికీ కలిపి మొత్తం వడ్డీల రూపేణా నష్టం దాదాపు పదమూడు లక్షలు....ఐనా. బ్యాంకు తెరిచివుంచే ఏర్పాటు చెయ్యమని అడగడానికి మాబోటి కాంట్రాక్టర్లకి నోరెక్కడిది?

అడిగితే అధికారులే అడగాలి–

వారూ వారూ ఒకటి....

అరనిమిషంపాటు చిరునవ్వుతో అందర్నీ పలకరించేను; ఒక చెయ్యీ రెండు చేతులూ పైకెత్తుతూ, జోడిస్తూ....

వారందరూ చేతులెత్తి రిసీవ్ చేసుకుంటున్నారేకాని; చిరునవ్వులైనా ప్రసాదించరేం? అని దిగులుపడ్డాను.

సమాధానానికన్నట్టు పక్కపరండాలోంచి ఫోన్ సంభాషణ వినబడింది.

"హలో-నేను కలెక్టరుగారి క్యాంప్ క్లర్కుని మాట్లాడుతున్నాను-అక్కడ పొజిషనంతా బావుందా? ఆఁ ఆఁ బయల్దేరుతున్నారు కలెక్టర్ గారు....శవదహనానికి అన్ని ఏర్పాట్లూ జరిగాయా? ఓకే-ఇదుగో, బయల్దేరేడమే...."

నిర్ఘాంతపోయాను-"శవదహనం" అన్నమాట విని,

ఇప్పుడర్థమైంది-నా నమస్కారాలకి ఈ అధికారులంతా ఎందుకు ముభావంగా తలలూపి వూరుకున్నారో-

కాని-ఎవర్నడిగినా బావుండదు,

తెలుసుకోకపోవడం నా పొరపాటే.

కాసిని బిల్స్ కేష్కాలేదని-నా ఆదుర్దాలో నేనున్నాను-కాని జరిగిపోయింది మహాఘోరం!

* * *

"అందరూ లేవాలి సార్"

దఫేదారు నెమ్మదిగా అయినా ఖచ్చితంగా చెప్పేడు; హాలుద్వారం దగ్గిర కనబడి—

స్విచ్చినొక్కితే మోటారు కదిలినట్టు అందరూ లేచారు. "ఇటు—" అంటూ అందరిమధ్యనించీ నడుచుకుంటూ, హాలుకి ముందువేపున్న ద్వారంలోంచి బయటికి నడిచాడు.

అందరూ కలెక్టరుగారి మాటని "ఫాలో" అయినంత విధేయతతో దఫేదార్ని "ఫాలో" అయ్యారు.

* * *

అక్కడ—

టాపులేని జీపులో—

ముందు డ్రయివరూ, దఫేదారు—

వెనకపక్క బెంచీ అంత యెత్తుకి పువ్వులు పేర్చారు. ఆ పూలమీద,

మెడలో పువ్వులదండతో—

ఏమనిచెప్పను—!....

o o o

జీపు స్టార్టయింది.

వెనకాల కలెక్టరుగారి కారు—

లోపలవారూ. మేడంగారూ.

తరవాత మిగతావాళ్ళ కార్లు, జీపులు-

ఆఖర్ని నా కారు.

స్మశానందాకా "ఫాలో" అవుదామని; ఆ మహోన్నతమైన దహనసంస్కారాన్ని చూసి అక్కడ కలెక్టర్‌గారికి కనబడి, నా సానుభూతినికూడా యధోచితంగా తెలియజెయ్యాలని: వారి అభిమానాన్ని చూరగొనాలని; ఒకటిరెండు నిమిషాలపాటు అనిపించింది, ఆ పరధ్యానంలో కారు నడుపుతున్నాను.

కార్లతో, జీపులతో సాగుతున్న వూరేగింపువల్ల రోడ్డుకి ఎడంవేపునుంచి కుడివేపుకి దాటలేక ఒక కుక్క భయం భయంగా చూస్తూ నిలబడింది; ఇంతలోనే హఠాత్తుగా దాటేద్దామన్న ఆశతో-

పడ్డాది నా కారుకింద.

ఒక్క క్షణం అనిపించింది-

దీన్నికూడా ఆ జీపులో ఆ పూలదిండుమీద పడుకోబెట్టి ఆ గంధపు చెక్కలతో తగలబెట్టిద్దామా అని-

కాని అది "కలెక్టర్‌గారి కుక్క" కాదు....

దాన్ని ఈ ఉదయం ఏ పామూ కరవలేదు—

పాము కరచిన కుక్కకి జిల్లా వెటర్నరీ ఆఫీసర్‌గారు స్వయంగా తన శక్తినంతా ధారపోసి చికిత్స చెయ్యడం-అయినా అది ఆయన చేతులుదాటి పోవడం-దాని శవదహనానికి జిల్లా అధికారులంతా బారులుతీరి వెళ్ళడం-ఎంత గొప్ప దృశ్యం!

ఆ కుక్కగల మనిషికాటుకి జిల్లాలో రెండువేలమంది, తమకు న్యాయంగా రావలసిన ఎనభై లక్షల రూపాయలకి దూరమై, ఆర్నెల్లపాటు అల్లాడిపోవడానికి సిద్ధంగా ఉన్నారు.

అదీ గొప్ప దృశ్యమే మరి.

*

(ఆంధ్రజ్యోతి వీక్లీ, దీపావళి 1988)

# మామూలు గాంధీ

రాత్రంతా రిహార్సల్ చేసుకున్నాను. నాన్నగారితో చెప్పేద్దామని. కాని నా నాలుక నా మెదడిచ్చే ఆజ్ఞల్ని పాటించడంలేదు. "టిఫిన్ తిందాం రారా చిన్నా "అని నాన్నగారు స్వయంగావచ్చి పిలుచుకువెళ్ళేరు. మేడమీద గది కిటికీలోంచి నరసయ్యగారి పెరట్లోకి చూస్తూ దొరికిపోయాను. నోట్లో టూత్ బ్రష్ ఆడుతోంది గానీ, అ పని వాష్‌బేసిన్ దగ్గిర కదా చెయ్యాలి! "స్నానం చేసొస్తావా?—నేను పొలంమీదికి వెళ్ళాలి—నీకోసం కూర్చోలేనేమో" అంటూ మెట్లు దిగిపోతున్న నాన్నగారితో "స్నానం తరవాతెప్పుడో చేస్తాను, నాన్నగారూ" అని హడావిడిగా చెప్పేసి వాష్‌బేసిన్ దగ్గిర చేరి మొహం కడుక్కుని చకచకా కిందికి దిగొచ్చాను.

వంట మనిషి నాకూ ఆయనకీ టిఫిన్ వడ్డించింది.

మా ఇద్దరి అలవాట్లలో కూడా చాలా తేడా, నాకు ప్రతిరోజు ఇడ్లీలు పెసరట్లు కావాలి. ఆయనకి రెండంటే రెండు పుల్కారొట్టెలు. చాలు "పొలంమీద పని చేస్తారు నాన్నారూ మరి కొంచెం పోషకాహారం తినాలి" అని నేను వైద్య విద్యార్థిగా ఆయనకి ఓసారెప్పుడో సలహా ఇచ్చాను. ఆరోజు ఆయన ఇచ్చిన వివరణ నాకింకే గుర్తే. "నేను రెండు పుల్కాలు తినడమే చూసేవుగాని దాంతో ఆరగించే పప్పు సంగతి చూడలేదు నువ్వు" అంతే. మిగిలినది ఆయన చెప్పరు: అక్కర్లేదు కూడాను. యాభై గ్రాముల పెసరపప్పు, ఒక పూర్తి వెల్లుల్లిగడ్డతో కొంచెం అల్లం, జీలకర్రా వేసి ఉడకపెట్టాలి. చిన్న మిరపకాయ ఒక్కటి రెండు చెమ్చాల ఆవునేతితో వేయించి తిరగమోత వెయ్యాలి. ఈ రెండు పుల్కాలతో ఆ పప్పు అంతా ఒక్క బొట్టు మిగలకండా తినేస్తారు.

"నువ్వు తినే రెండు పెసరట్ల కన్నా ఇదే ఎక్కువ!" అని ఆయన చెప్పక్కర్లేదు కదా.

చెప్పదల్చుకున్నమాట నా నోటమ్మట రాడంలేదు. ఆయన టిఫిన్ తినడం అయిపోయింది. వంటావిడ పాలగ్లాసు పెట్టేసి వెళ్ళిపోయింది. మజ్జిగ

లాగ గటగటా తాగేసి లేచి వెళ్ళిపోతారు, ఇప్పుడు చెప్పెయ్యాలి, లేకపోతే మళ్ళా రేపు ఉదయంవరకు ఆయన నాకు దొరకరు, పొలం వెళ్ళి ఆయన వచ్చే సరికి ఊళ్ళజనం అంతా సావిటిలో ఆయన కబుర్లకోసం చేరుతారు, నాలుగు గంటలకి సభ తీరిపోగానే స్నానం చేసి పుస్తకాల గదిలోకి వెళ్ళిపోతారు.ఆరు గంటలకి పంచాయతీ ఆఫీసుకి వెళ్లి ఎనిమిదిగంటల కొస్తారు, రాత్రి తినే రెండు పుల్కాలు ఆయన గదిలోనే తింటారు తప్పా వంటింటి గదిలోకి రారు. వంటమనిషి నాతో ఆ కబురూ ఈ కబురూ చెప్పి కొసిరి వొడ్డించి పనులన్నీ పూర్తి చేసుకుని వెళ్ళిపోతే తలుపులు నేనే వెయ్యాలి,

"గాంధీగారు గొప్పవారే కావచ్చుగాని గాంధేయవాదానికి రోజులుకావు నాన్నగారూ!" అన్నాను. టైమ్ అయిపోతూ వుంటే ఆఖరి ప్రశ్నకి సమాధానం రాసేసినంత హడావుడిగా, పేపరు లాగేసుకుంటారేమో అన్న భయంలో రాసేసి నట్టు దొంగతనంగా.

పాలగ్లాసు ఖాళీచేసి కిందపెట్టేరు నాన్నగారు. నేను ఆయన వేపు చూడ లేదుగాని ఆయన నావేపు చూసేరు, ఎదుగుతున్న పిల్ల పక్షికి రెక్కలొచ్చి ఎగ రడం ప్రాక్టీస్ చేస్తూ వుంటే తల్లి పక్షి చూసినప్పటి వినోదం కళ్ళలోకి తెచ్చు కుని చూసి వుంటాడు.

"గాంధేయవాదానికి కాని రోజులంటూ వుండవు చిన్నా."

* * *

"నాన్నగారితో వాదన పెట్టుకొని గెలవలేరు చినబాబూ" అని సన్నాయి నొక్కులు నొక్కుతూ చెప్పి వెండిగ్లాసుతో తెచ్చిన కాఫీ చేతికందించింది మీనాక్షి.

"నిన్నెవరూ చెప్పమన్లేదు" అంటూ ఆ చేతివేళ్ళు తగలకుండా జాగ్రత్త పడుతూ గ్లాసు అందుకున్నాను.

"ఆయన చెప్పమన్నారని మీరు మొదలెట్టారా; మీరు చెప్పమన్నారని నేను చెప్పేనా? మంచి అనిపించింది మరో మనిషికి చెబుదామని ఎవరికేనా అనిపిస్తుంది" అని రెండు ప్లేట్లు, మూడు గ్లాసులు, పప్పు వుంచిన మట్టుగిన్నె, చెమ్చా-అన్నీ పట్టుకుని వెళ్ళిపోయింది మీనాక్షి.

"వెంకట్రావూ!" అని వీధిలోంచి కేక.

"అదుగో వొచ్చేడు బుచ్చిబాబు! వాడి కాఫీ కిటికీలో ఉంది పట్టుకెళ్ళండి

నాకు పనుంది" అంది మీనాక్షి. సింకు దగ్గిర పీటమీద కూర్చున్న మనిషి కదల కుండు, తల మాత్రం ఇటు తిప్పి.

నవ్వవలసివ సమయం కానప్పుడు కూడా నవ్వుతుందని నాకు మీనాక్షి అంటే కోపం. విసురుగా రెండో గ్లాసు రెండో చేత్తో పుచ్చుకుని "వస్తున్నా" అని కేకపెట్టి వీథి వసారావేపు బయలుదేరాను.

అసలు వీడివల్ల వొచ్చింది ఈ రంధి అంతాను.

* * 0

మానూరు నుంచి కోనూరుకి రెండుమైళ్ళు.

ఆరోక్లాసు చదివినన్నాళ్ళు నడిచేవెళ్లేను.

నేను ఏడులోకి వచ్చేసరికి నారాయణ ఐదు పాసయ్యేడు.

"వాణ్ణి కోనూరు పంపించు" అన్నారు నాన్నగారు.

"ఆడు కోనూరు సదువుకి పోతె గేదెల్నెవడు కడుగుతాడు బాబయ్యా? ఇప్పుడిప్పుడే ఒంటికి జనపత్తా వుంది. పని నేర్పిత్తే నాకు సాయంగా వుంటాడు" అన్నాడు వెంకడు.

"పని నీకు అలవి కాకపోతే మరొకణ్ని పెడతాను. వాణ్ణి చదవనీ. నిన్ననే హెడ్మేస్టరు నాతో చెప్పేడు నారాయణకి చదువొస్తుందండీ వాణ్ని చదవ నిస్తే బావుండునూ అని."

నాన్నగారు సైకిలు నాకోసమే కొన్నారు. కాని రోజూ రెండు పూటలా పోనూ రానూ నారాయణే తొక్కేడు, మొదటిలో ముందుని రాడ్డుమీద కూచునే వాడిని. ఓ రోజు తొడలు తిమ్మిరెక్కి అరగంటసేపు బాధపడితే కమసాలి ఎల్లయ్య ఆ సైకిలుకి వెనకచక్రంమీద ఒక ఇనపస్టాండు అమర్చి, దానిమీద ఒక చెక్కపీట దిగ్గొటి. అందిమీద' నేను హాయిగా కూచుంటే ఆనందించి మా వెనకాతలే కోనూరు వొచ్చి. చెక్కపీటమీద కొబ్బరిపీచుతో చేసిన దిండు వేయించేడు మాడేకుల ముసలయ్యచేత సైకిలు ముందు రాడ్డుమీద నన్ను కూచో పెట్టి నారాయణ నన్ను డబల్స్ తొక్కుకొచ్చిన మొదటిరోజు మా అమ్మ- "ఆ బట్టలక్కడ విప్పి స్నానంచేసి లోపలికిరా" అని వీథి వసారాలో బాల్చీడు నీళ్ళు పెట్టించింది. నాన్నగారు ముక్కుమీద వేలుపెట్టుకుని వెంటనే తీసేసి అడ్డంగా ఆడించేరు. "అయ్యో, నేనందుకు అనలేదండీ. నారాయణకేమి, మన పిల్లాడి లాంటివాడు. స్కూల్లో ఇంకా ఎంతమంది ఉంటారో; మయిలవాళ్ళ

కూడా వుండొచ్చు కదా" అంది అమ్మ సౌమ్యంగా. "పగలంతా చెమట పడు తుంది కదా అని!"

"రోజూ బడినుంచి రాగానే ఆ గుడ్డలు వేరే పెట్టి స్నానం చెయ్యడం మంచిదే అనుకో" అన్నారు నాన్నగారు. అలా రెండోపూట స్నానం అలవాట యింది.

0 0 0

నా చేతిలో రెండోగ్లాసు చూడగానే పెణకలోంచి గాజుగ్లాసు తీసాడు నారాయణ, "పొయ్యి" అన్నట్టు చెయ్యి జాపేడు.

"ఎవరూ లేర్లే. దీంతో తాగి" పరవాలేదు అన్నాను.

నారాయణ నవ్వేడు. "పంతులమ్మగారు నీది కడిగిన చేతితో నాది కడుగు తాదా?" అన్నాడు.

"నోర్మూయ్యి" అన్నాను నవ్వుతూ, వాడి గ్లాసులో కాఫీ పోస్తూ.

నేను ఎనిమిదో క్లాసులో వుండగా మా అమ్మ చచ్చిపోడం, మా అక్కకి పెళ్ళి అవడం, నేను సగం పరధ్యానంగా, సగం పిచ్చిగా, సగం అశ్రద్ధగా వుండడం—ఈ కారణాలవల్ల అటు ఎటెండెన్సూ ఇటు మార్కులూ రెండూ చాల్లేదు. నేనూ నారాయణా క్లాస్మేట్లయిపోయాం. అయితే అందువల్ల నాకు మేలే జరిగింది.

నారాయణ ఎప్పుడూ క్లాస్ ఫస్ట్. తొమ్మిదో క్లాసు నుంచి మా హైస్కూల్లో మూడు సెక్షన్లుండేవి. అపడు స్కూల్ ఫస్టు వాడే. పది, పదకొండు, పన్నెండు—ఈ మూడు క్లాసుల్లోనూ నేను కొంచెం వెనుకబడుతున్నానని రోజూ నారాయణ రాత్రి పూట అన్నం తినగానే వొచ్చేసేవాడు. ఆ రోజు అన్న పిరియడ్లలో అయిన పాఠాలు అన్నీ ఖచ్చితంగా నాకు వంటబట్టేయని రూఢి అయ్యేదాకాను, నేను నిద్దట్లోకి జారుకుంటున్నా నన్ను లేపి కూర్చోపెట్టి—ఆ పాఠాలన్నీ తను చదువుకుంటున్నాట్టే చదువుకుంటూ నాకు బోధపరిచి, అక్కడే గోనె పట్టామీద, పుస్తకాలు తలకింద పెట్టుకొని పడుకునేవాడు.

మొదట్లో కొన్నాళ్ళు వెదురుగడతో నేలమీద చప్పుడు చేస్తూ నన్ను లేపుతూ వుండేవాడు. ఓనాడు నేనెంతకీ లేవకపోతే నెత్తిమీద ఒక్కటి కొట్టి లేపి "సారీ వెంకట్రావూ, ముట్టేసుకున్నాను! వెళ్ళి స్నానం చేసిరా, నిద్దరా గిద్దరా తేలిపోద్ది" అన్నాడు.

"నా మొహం. నా కలాటి నమ్మకాల్లేవు. నేనెవర్నను కున్నావు? మానూరు గాంధీగారి కొడుకుని!" అన్నాను.

0 0 0

కాఫీ తాగేసి, అల్లంత దూరాన గోలెంలో వున్న నీళ్ళు సిలవరి చెంబుతో నేను తెచ్చి పోస్తే గ్లాసు కడిగి మళ్ళా పెణకమీద పెట్టేడు నారాయణ. జేబు లోంచి రుమాలు తీసి చేతులు తుడుచుకుని, వసారాలో ఈ మూలకి వెళ్ళి ఇంత పేపూ నేను చూడని ఒక గోనెసంచి మోసుకొచ్చేడు. చేకుతాడు ముడులువిప్పి, అందులో పీకదాకా నిండిన సామాన్లు ఒకటొకటీ తీసి బెంచీమీద పేర్చడం మొదలెట్టేడు.

వాటన్నిటి వెనకా బోలెడు చరిత్ర వుంది.

హయ్యర్ సెకండరీ పరీక్షలో జిల్లాకి ఫస్టుగా పాసయ్యేడు నారాయణ. అంచేత కోనూరు మోతుబరి బుచ్చయ్యగారి పేరిట వున్న బందరు బంగారం మెడల్ వాడికొచ్చింది. దాంతో ప్రారంభమైంది ఆ చరిత్ర.

ఇంటర్-యూనివర్సిటీ మెడికల్ కాలేజి స్టూడెంట్స్ మీట్‌లో వాడు ఎలక్యూషన్‌కీ ఎస్సే రైటింగ్‌కీ, డిబేటింగుకీ తెచ్చుకున్న ఫస్టు ప్రయిజులు—మూడు మెమెంటోలు—ఆనాడే నాన్నగారికి ఇచ్చే బోయాడు. నలభై రూపాయిలు కర్చుపెట్టి నాన్నగారు వాళ్ళింట్లోనే ఒక అటక కట్టిస్తే ఇన్నాళ్ళూదాచేడు. అవి తెచ్చేడు ఇప్పుడు.

సెకండియర్‌లో వాణ్ని మెడికల్ కాలేజి స్టూడెంట్స్ కల్చరల్ అసోసియేషన్‌కి సెక్రటరీగా నిలబెట్టి గెలిపించేసరికి నా తాతలు దిగొచ్చేరు. అయితేనేమీ? ఆ ఏడాది వాడు జానపద సంగీతంలో ఒక గొప్ప ప్రయిజు, నాటికల పోటీలో గెల్చి ఒక బ్రహ్మాండమైన షీల్డు, సాంస్కృతిక కార్యక్రమాలు అవిచ్ఛిన్నంగా నిర్వహించినందుకు కాలేజి తరపున ఇచ్చిన స్పెషల్ మెమెంటో అటు నారాయణకే కాదు, ఇటు నాకూ, నాతోపాటు చదువులో వాడి నుంచి పోటీ అంటూ లేకుండా పైకొస్తున్న నా గ్రూపువాళ్ళకీ కూడా గర్వ కారణాలే. అవన్నీ ఆ బెంచీమీద, లేబిల్స్ తుడిచి అక్కడ పెట్టేడు.

మూడో సంవత్సరం ఎనాటమీలో తప్పేడంటే అది నారాయణ తప్పుకాదు. ప్రొఫెసర్‌గారు మొదట్నించీ కలవ ఎల్లమ్మ అనే మాక్లాస్ అమ్మాయిని హెచ్చరిస్తూ వుండేవారు—నువ్వు రిజర్వేషన్‌మీద సీటు సంపాదించినా,

పేదరికంవల్ల స్కాలర్‌షిప్పులూ గ్రాంట్లూ సంపాదించినా, బాగా చదవకపోతే ఎనాటమీలో నిన్ను పాస్ చెయ్యడం నాకూ, నన్ను పుట్టించిన బ్రహ్మదేవుడికీ కూడా చాతకాదు- అంటాను. ఈ కలవ ఎల్లమ్మ అనే అమ్మాయి నారాయణ గ్రూప్‌లో జానపద సంగీతంపాడి బహుమతులు తెచ్చుకోడమే కాక రన్నింగ్ రేసెస్‌లోను, లాంగ్‌జంప్, హైజంప్‌ల్లోనూ, జావెలిన్ త్రో, డిస్కస్ త్రో-ల్లోనూ ప్రెయిజులు పుచ్చుకుంది. రెండో ఏడాదిలో వుండగా ఎల్లమ్మేమిటి, నీ పేరు మార్చుకో; డాక్టర్ అవబోతున్నావు; డాక్టర్ ఎల్లమ్మ అంటే పేషెంట్లు రారు అని వాదించి, నారాయణ ఆమె పేరును వై. కలవ, అని మార్పించేడు. అందరూ "వై? కలవ!" అని వేళాకోళం చేసేవారు. కలవ నల్లగా వున్నా కళగానే వుందిరోయి అని కొందరనేవారు. నల్లకలవ అపురూపమైన జాతిది సుమా- అనేవారు "జాతి" అనేమాట నొక్కిపలికి. అందులో ఒకడు "ఏమిట్రోయి. జాతి గీతి అంటున్నావు" అని కవ్వించేవాడు. "నే నన్నది అది కాదు గురూ, ఉండు, కొట్టకు! నల్లకలువ అని, అలెగ్జాండర్ డుమా రాసిన నవల చదివేవా? చదవకపోతే కల్చరల్ సెక్రటరీ గారి కేరాఫ్‌లో వుంది. 'గో-త్రు- ఇట్' అని ఆ కొంటెవాడు విపులీకరించేడు. ఎల్లమ్మ ఇవన్నీ అప్పుడొకటీ అప్పుడొకటీ ఏడుస్తూ చెప్పుకోడంలో, నారాయణకి అంతకి ముందుకంటా బాగా దగ్గరైంది, ఆ తర్వాత నిజం ఎంతో, అబద్ధం ఎంతో తెలియదుగాని, ఎనాటమీ ప్రొఫెసర్ గారు: "కలవని నన్నొచ్చి కలవమను. అంతా సెట్టింగైపోతుంది" అని నారాయణకి పురమాయించేడనీ, అలా అనడంలో అతనికేదో దురుద్దేశం వున్నట్టు కనబడుతోందని నారాయణ ప్రిన్సిపాల్‌గారికి చెప్పేడనీ, కథలు రాసి మెడికల్ కాలేజీ గోడలమీద ప్రచురించేరు. పర్యవసానంగా కలవతో బాటు నారాయణ కూడా తప్పేడు.

మూడో ఏడాది పరీక్ష తప్పగానే నారాయణకి స్కాలర్‌షిప్ రద్దయింది. మళ్ళీ ఆరు నెలల్లో అదే పరీక్ష రాసి అప్పుడు కూడా పాసవనందుకు సాంఘిక సంక్షేమ శాఖవాళ్ళు ఏర్పాటు చేసిన ఉచిత భోజన సౌకర్యం రద్దయింది. కాని సాంస్కృతిక రంగంలో అతను చేసిన కృషికి మెచ్చి "కొందరు సహాధ్యాయులు" అతనికొక "మెడికల్ డిక్షనరీ" (పుస్తకం గొప్పదే) బహుమతి ఇచ్చేరు. ఆ పుస్తకం కూడా ఈ సామగ్రిలో వుంది. దాంట్లో అట్ట తెరవగానే వచ్చే పేజీలో ఒక స్టిక్కర్ మీద స్కెచ్ పెన్‌తో అందంగా "మా అభిమాన సహాధ్యాయి ఆర్. నారాయణకి" అని వుంది.

నారాయణ ఆ పుస్తకం బెంచీమీద పెట్టకుండా నా చేతికి అందించి "దీన్ని జాగ్రత్తగా పరిశీలించి చూడు" అని వదిలేసి, చెప్పులు తొడుక్కున్నాడు.

ద్వారం దగ్గిర మీనాక్షి వున్నట్టు నేను చూడలేదు. ఆమె నోటిమీద అరిచేత్తో కొట్టుకుంటూ అవ్వ, అవ్వ, అవ్వ అని చప్పుడు చేసింది. నారాయణ నా వేపు చూసి "ఇవన్నీ నీ సాయం లేకుండా నేను సంపాదించుకోలేనివే. నేనే తెలివైనవాడినని గర్వపడ్డాను. తెలివి ఒక్కడి సొమ్ము కాదని రుజువు చేసేవు" అని నిర్భావంగా చెప్పేసి వెళ్ళిపోయాడు.

"ఏంటదీ? అంత మరీ ముట్టుకునీ పట్టుకునీ ఇచ్చాడే: ఏం పుస్తకమదీ?" అంటూ మీనాక్షి దగ్గిరగా వచ్చింది. ఆ క్షణంలో మీనాక్షి నా దగ్గిరున్న చనువు ఆసరాగా ఆ పుస్తకం లాగేసుకుంటుందేమో అని భయపడ్డట్టుగా నేను వెనక్కి దాచాను. మోచేతికి బెంచీ అంచు తగిలి పుస్తకం కిందపడ్డంలో ఎలా పడిందం టేను- అట్ట తియ్యగానే వొచ్చిన మొదటి పేజీలో స్టిక్కర్ నేలకి రాపిడి పడి, సగం మేర లేచింది.

స్టిక్కర్ కిందకూడా ఏవో అక్షరాలున్నాయి.

స్టిక్కర్ పూర్తిగా వూడతీశాను.

అక్కడ—

"మానూరు గాంధీగారి ప్రియ పుత్రుడికి సహోధ్యాయుల కానుక" అని వుంది.

తెలుగులో వుంది.

మీనాక్షి నా మీదికి వొంగి ఆ రాత తనూ చదివేసి "ఐందా?" అంది.

నేను తెల్లమొహంవేసి "ఏమిటి అవడం?" అన్నాను.

ఒకవేలు ఆ రాతమీదికి చూపించి "నేనెప్పుడో చెప్పేను" అంది; మూతి వెక్కిరింపుగా తిప్పి "మీ కాళ్ళకింద గొయ్యే మీరు చూసుకోలేరు" అని విసురుగా లోపలికి వెళ్ళిపోయింది.

0 0 0

అదంతా వొట్టి నాన్‌సెన్సు. కిట్టనివాళ్ళు పుట్టించిన పుకారు. మానూరు గాంధీగారి ప్రతిష్ఠకి గాలి వూపు తలపెట్టిన ఎవరి తల్లోనో పుట్టిన నులిపురుగు.

నారాయణ కోనూరులో చదువుకి చేరకముందు వెంకడు మా కుటుంబం

నుంచి పొందినదేమీ లేదు. ఏడాదికి ఇన్ని అని లెక్క ప్రకారం కొల్చేగింజలు; పండుగా పబ్బం వొచ్చినప్పుడూ కష్టం సుఖం వొచ్చినప్పుడూ విదిల్చే మామూళ్ళు; అంతే. వాడు తొమ్మిదో క్లాసులోకి వచ్చినప్పుడు వెంకడు "చదువు కుంటూ పదిమందిలో మెసిలే కుర్రాడు; మరో రెండు జతలబట్టలూ రాసుకోడా నికి కలం, చదువుకోడానికి పుస్తకాలూ, మధ్యాన్నం ఆకలేస్తే ఏదైనా కొనుక్కు తినడానికి కొంచెం రోజువారీ చిల్లర డబ్బులు వుంటే, వాడు ఏడుపుగొట్టు మొహంతోనూ, తక్కువతనపు ఆలోచనతోనూ వుండ"డని దానికి తగినసాయం చెయ్యమని అడిగినప్పుడు నేనక్కడే వున్నాను. "చిన్నబాబుగారు విసుగుపుట్టి వొదిలేసిన బట్టలే" ఇమ్మన్నాడు. కాని నాన్నగారు కొత్తవే కుట్టించుకోమన్నారు. "లెక్కరాసుకోండి బాబయ్యా" అని వెంకడు అన్నాడుగాని "ఏడిశావ్ లే వెళ్ళు" అన్నారు నాన్నగారు — మెడికల్ కాలేజీలో చేరినప్పుడు పదిహేనువందలకి పైగా అయింది వాడి ఏర్పాట్లకి. "ఇప్పుడైనా లెక్క రాసుకోండి బాబయ్యా" అని వెంకడు అంటే "వాణ్ని రమ్మను నీకూ నాకూ మధ్య లెక్కలూ, పత్రాలూ ఇన్నాళ్ళు లేనివి ఇప్పుడెందుకు" అన్నారు. నారాయణకి సోషల్ వెల్ఫేర్ వాళ్ళ హాస్టల్లో వసతీ భోజనం ఆర్డర్లు వెంటనే ఇచ్చినా, స్కాలర్‌షిప్పు డబ్బు రాడా నికి ఎనిమిది నెలలు పట్టింది. అంతా వొక్కసారి అందుకున్నాడు. ఆ పన్నెండు వందలూ తెచ్చి ఇవ్వబోతే నాన్నగారు వెంకడి ఇంట్లో నారాయణ వుండడానికి వేరే ఒక గదిలాంటిది కట్టించమనీ, ఆ గదిలో టేబిలూ కుర్చీ పుస్తకాల అల మారా దీపం ఏర్పాటు చెయ్యమనీ చెప్పేసి, మరో ఎనిమిదివందలు తనే ఇచ్చేరు నన్ను చూడ్డానికెప్పుడైనా పట్నం వొస్తే నా చేతిలో నాలుగు వందలు పెట్టినా, నారాయణకి నూరు రూపాయలైనా ఇవ్వకుండా తిరిగి రాలేదు. ఎన్ని చేసినా ఎంత అయిపోయుంటుంది మహా! ఐదారు వేలు దాటదు. సెకండియర్ చివర్లో ఓసారి మీనాక్షి కూతురు 'పద్మ'కి జబ్బుచేస్తే పట్నం తీసుకొచ్చి పరీక్ష చేయించి నప్పుడు మెడికల్ వార్డులో కొచ్చి నారాయణ ఆవిడని పలకరించినప్పుడు బావు న్నావా, చదువు బాగా సాగుతోందా అలాంటి ప్రశ్నలు వేస్తే "నాకేమి లోటు పంతులమ్మగారూ, పెదబాబుగారు నన్ను కన్న కొడుకులా చూసుకుంటున్నారు" అని నారాయణ అంటే "కొడుకుని కొడుకులా చూసుకోకపోతే యింకెలా చూసు కుంటారు" అంది. అప్పుడు ఆవిడ అక్కడున్నది మూడు రోజులే అయినా మెడికోల మధ్య బాగా పాప్యులర్ అయిపోయింది. పిల్లకి వైద్యం సమంగా

అందుతోందో లేదో చూసే మిషతో ఒకడూ ఒకడూ రావడం. ఆవిణ్ణి కబుర్లలో పెట్టడం, అవసరమైన దానికంటే ఎక్కువసేపు అక్కడుండిపోడం- రకరకాల అల్లరివాళ్ళు-నా క్లాస్‌మేట్లూ సీనియర్లూ, అనవసరపు ఆప్యాయత చూపించడం- ఇలా నాకు వాళ్ళమీద చిరాకు, అసూయ.

"నువ్వు వెనకబడిపోయినన్నాళ్ళు వాడు నీకు హితుడై మిత్రుడై దారి చూపించి తన ఔన్నత్యాన్ని చూపించేడు. వాడి అవసరాలు తీరడానికి మనం చేస్తున్న సాయానికి విలువకడ్తే వాడు తీర్చుకోలేకపోడు. కాని ఆ అర్హత వాడు సంపాదించుకోడానికి నువ్వు చెయ్యి ఆసరా ఇవ్వాలి. గ్రహణ శక్తీ, ధారణా శక్తీ వున్నవాడే కదా. పైగా ఈ ఎనాటమీ కొండ దాటితే ఇంకే అడ్డూ వుండదని నువ్వే అంటున్నావు. వాణ్ణి దిద్దు చిన్నా" అని నాన్నగారు చాలా ఆవేదనతో చెప్పేరంటే అందులో మానూరు గాంధీగారికి ఇంకో రకమైన సానుభూతి ఆపాదించడం న్యాయంకాదు.

"వాడు కులంలోకెల్లా దీపంలా వెలగగలడన్న ధైర్యంతో వాళ్ళమ్మా, వెంకడూ అన్ని కష్టాల్నీ సహించి అన్ని దరిద్రాలనీ భరించి బతుకుతున్నారు. మన కుటుంబం వాళ్ళని సానుభూతితో చూస్తున్నా; మన కుటుంబంలో వాడే సాక్షాత్తు నా అన్నకి పుట్టిన కొడుకే వెంకడి కూతురు ఉరిపోసుకుని చావడానికి కారణం అయ్యాడంటే మనం మొదటి కంటె ఎక్కువగా వాళ్ళని ఆదుకోవాలి కదా. వాడు ఈ కోర్సు పూర్తిచేసి డాక్టరయ్యేడంటే ప్రభుత్వం వాడికి ఉద్యోగం ఇస్తుంది. ఆ తరవాత వాళ్ళు ఎక్కడెక్కడికో పోతారు తప్పా వాళ్ళ నించి మనకీ పోటీ లేదు, వాళ్ళు మనకీ సాటీ కాదు, దరిద్రుడూ నారాయణా కూడాను. ఆ దరిద్ర నారాయణ సహాయం నీ ద్వారా తుదముట్టితే అంతకన్న నువ్వు నాకు చెయ్యదగిన గౌరవం వేరే ఏం వుండదు. డబ్బుపెట్టి నేనిన్నాళ్ళూ వాణ్ని పైకి తీసుకొచ్చానే గాని, జ్ఞానం పంచిపెట్టి నువ్వు వాణ్ని ఈడేరిస్తే అదే గొప్ప సహాయం చిన్నా." అన్నారు నాన్నగారు.

వాడు ఎనాటమీ పరీక్ష తప్పిన నుంచి నేను హవుస్సర్జెనీ పూర్తిచేసేదాకా గడిచిన ఈ మూడేళ్ళలోను నాన్నగారు వాణ్ణి గురించి నాతో సూటిగా మాట్లాడ్డం ఈ నాలుగు రోజులనుంచే. ఏ ఒక్కసారీ ఒక్క వాక్యం కంటే ఎక్కువ మాట్లాడలేదు. దేనికీ నా నుంచి మాటల రూపంలో సమాధానం ఆశించలేదు. మాటల్లో ఏమీ లేదనీ, చేతల్లోనే అంతా వుందనీ నమ్మడం-ఆయనకీ, నాకూ వున్న ఒకే ఒక బలమైన పోలిక.

ఒకటి మాత్రం నిజం. చిన్నక్లాసుల్లో మా ఇద్దరి 'కంబైండు స్టడీ'గురించి

నారాయణ సమాచార ప్రాయంగా తప్ప ప్రగల్భంగా చెప్పుకోకపోయినా "నువ్వింతవాడివి కావడానికి తనే కారణం అవి గొప్పలు చెప్పుకుంటూ విన్ను తీసిపారేస్తున్నాడ్రా, ఒరే!" అంటూ నా మెడికో మిత్రులు చెప్పిన మాటలకి నేను పరోక్షంగా ప్రతిస్పందించేను గాని ప్రత్యక్షంగా కానే కాదు. అది కూడా గాంధీ మార్గమే అని నా నమ్మకం. కాలం గడుస్తున్నకొద్దీ గాంధీగారి అహింసా వాదానికీ, సత్యాగ్రహానికీ కొత్తకొత్త రూపురేఖలు వస్తూనే వున్నాయి కదా.... విశ్వాసాలు సమానమే అయినా ఆచరణ మార్గాలు వేరుకావచ్చునన్నది కాలం తెచ్చే మార్పు.

పంచాయితీ బోర్డు ఆఫీసులో పనుల ఒత్తిడివల్లా హరిజనవాడలో జరిగిన అగ్నిప్రమాదంవల్లా నాన్నగారికీ నాకూ రెండు రోజులపాటు సంభాషణకివేదిక, తీరిక దొరకలేదు. మూడో రోజున ఆయన కోనూరులోనూ, హంసవాడలోనూ అధికారులని కలుసుకోవాలని ఉదయమే లేచి వెళ్ళిపోయేరు; రాత్రికి రానేలేదు,

ఈ సమయం అంతా మీనాక్షి నన్ను సతాయిస్తూనే వుంది. "గాంధీగారు ఎంత మొండివారో నాన్నగారు అంతకంతా మొండివారు చినబాబూ. మీరు మంచి అనుకున్నా అనుకోకపోయినా అన్నీ తెలిసినవారూ. ఎవర్నీ లక్ష్యపెట్టని వారూ అయిన పెదబాబుగారు ఏం చెప్తే అది చెయ్యడం మీకు విధాయకం. చేతులు కాలేక ఆకులు పట్టుకోడంవల్ల లాభంలేదు. ఏమైతే అదే అవుతుంది; పెదబాబు గారు చెప్పినట్టు చేస్తానని మాటిచ్చెయ్యండి. ఆనక ఆయన పట్టుదలవల్ల మీ ధైర్యం వీగిపోతేఅంతకన్నాచెడ్డ ఏదీ వుండదు."ఆత్మీయురాల్లా సలహా ఇచ్చింది.

0 0 0

నాలుగోరోజు నాన్నగారు పట్నంనుంచి వచ్చేసరికి ఉదయం పదిగంటలు దాటింది. ఎక్కడ తగిలేడో తెలీదుగాని నారాయణ ఆయనతోకూడా వచ్చాడు. వాణ్ణి వీధి వసారాలో వదిలేసి లోపలికొచ్చారు నాన్నగారు, స్నానంచేసి బట్టలు మార్చుకుని "భోంచేద్దాం రారా చిన్నా" అన్నారు. నాకు వేళ అవకపోయినా మెత్తబడి వెంటపడ్డాను.

"నువ్వు ఎం.ఎస్. చెయ్యడానికి ఆర్డర్ వచ్చిందిరా చిన్నా" అన్నారు నాన్నగారు.

"చెప్పరేం? థాంక్స్ నాన్నగారూ.... మరి-"

"అదీ అయింది. డాక్టర్ సింహాచలం గార్ని అడిగావుటగా; ఆయన నర్సింగ్ హోమ్‌లో పని చేస్తానని? ఆయన నిన్ను రేపే వచ్చేమన్నారు..."

"మరీ రేపు కాకపోయినా ఫస్ట్ తారీకల్లా వెళ్ళి చేరుతాను నాన్నగారూ."

"అలా కుదరదనుకుంటాను చిన్నా. ఎల్లుండి వుదయం నువ్వు ప్రొఫెసర్

గారి దగ్గిర రిపోర్ట్ అవాలిట. సింహాచలంగారు నువ్వుండడం కోసం వాళ్ళ పాత ఇంట్లో నాలుగు గదులు ఖాళీ చేసి ఇస్తానన్నారు. ఔట్ హౌస్‌లో మీనాక్షమ్మా పద్మా వుండొచ్చు; నీకు సాయంగా. నారాయణ సింహాచలం గారి నర్సింగ్ హోమ్‌లో పనిచేస్తూ చదువుకుంటాడు."

"ఏం పని చేస్తాడట?" అన్నాను; వ్యంగ్యం కనపడనీయకుండా.

"ఎంత పుచ్చిన మిరియాలైనా ధనియాల పాటి చెయ్యవా అని సామెత, కాంపౌండర్‌గా పని చెయ్యగలడు కదా."

"నేను హాస్టల్లోనో, అక్కడ రూమ్ దొరక్కపోతే హోటల్ రూమ్ లోనో వుంటాను. నాకు వొండి పెట్టడానికి కన్నా మీకు వేళకన్నీ సదునుగా అమర్చి పెట్టడానికే మీనాక్షీ ఎక్కువ అవసరం—" అని చెపుదామని సిద్ధం అవుతూ వుండగానే నాన్నగారు లేచిపోయారు. "సావిట్లో వుంటాను రా!" అని చెప్పి వెళ్ళిపోయారు.

0 0 0

"అవసరం అయిందానికి మించి చనువూ, నవ్వూ కూడదు" అన్నాను; నిస్సంగత్వ ధోరణిలో.

"నాకా మాత్రం తెలీదూ? పిల్లకి పదోయేడు వెళుతోంది—"అంది నవ్వుతూ.

"ఛీ!" అని చెయ్యి కడుక్కుని లేచాను. సావిట్లోకి వెళ్ళేసరికి నాన్నగారు మళ్ళీ ఏదో ప్రయాణానికి లాగ బట్టలు సర్దుతున్నారు. ఇందాక పట్నం నించి తెచ్చిన ఫైబర్ గ్లాస్ సూట్‌కేసులో కాకుండా చెవులు అమర్చిన యూరియా సంచిలో సర్దుతున్నారు.

"చదువులో శ్రద్ధగానే వుండాలనుకో, కాని, నెలకో మారైనా వచ్చి ఇల్లూ పొలమూ చూసి వెళ్తూవుండు చిన్నా" అన్నారు నాన్నగారు.

"అంటే?"

"మూడుతరాల కాలంనుంచీ ఈ ఇంటికి తాళంపెట్టి వెళ్ళడమంటూ లేదు"

"అంటే? సమంగా చెప్పండి నాన్నగారూ, నాకేమిటో గాభరాగా వుంది!" అన్నాను.

నాన్నగారు సంచి సర్దడం పూర్తిచేసి, "నేను రెండేళ్ళపాటు సేవాగ్రాంలో వుందామని వెళ్తున్నాను చిన్నా. అబ్బే; ఏం లేదు, మార్పుకోసమంతే. గాంధీగారి ప్రవచనాలు ఎవరో తెలుగులో రాసేరట. అవన్నీ చూసి, పదిమందిలో చదవడానికి వీలుగా తిరగరాయించాలట. మరో ముగ్గురితో పాటుగా నాకూ పిలుపొచ్చింది. ఏర్పాట్లన్నీ చేసేశాను. ఈ రాత్రే కోణార్క్ పట్టుకోవాలి."

దెబ్బ కరెంటు షాకులాగ హెచ్చరిక లేకుండా తగిలింది. "ఏంటి నాన్నగారూ నేను తప్పు చేసేనే అనుకోండి. నన్ను దండించాలేగానీ నా దగ్గిరకూడా సత్యాగ్రహమేనా?"

నాన్నగారు ప్రశాంతత వదల్లేదు. "ఆగ్రహం లేదు చిన్నా. అంచేత సత్యాగ్రహం కూడా లేదు. రెండేళ్ళు ఎంతలో గడిచిపోతాయి! పొలం మీద రాబడి అంతా కోనూరు బ్యాంకిలో నీ కాతాలో జమ చెయ్యాలని వెంకడికి నియమం పెట్టేను. మన పూర్వుల ప్రమేయం లేకుండా నేను పోస్టుమాస్టర్‌గా, పంచాయితీ గుమాస్తాగా ఉద్యోగం చేసి సంపాదించుకున్నది తుమ్మల చెరువు కింద పల్లం అయిదెకరాల ముప్పయి సెంట్లు నారాయణ పేర రాసి రిజిష్టర్ చేసేను. దానిమీద రాబడితో వాడు చదువుకుంటాడో ఆ పొలమే వాడు చేసుకుంటాడో వాడి ఇష్టం. మీనాక్షి మొగుడు పోయి కూతురితోసహా దిక్కులేక మనింటిలో చేరినందుకు దాన్ని నువ్వు ఎన్నాళ్ళు బాగా చూసుకుంటావో నాకు తెలియదు కదా. ఎంత చెడ్డా బ్రాహ్మనామె. అంచేత నలభై వేలు ఒక ఫిక్సెడ్ డిపాజిట్ చేసి దానిమీద వడ్డీ మాత్రం మీనాక్షికి ఏడాదికోమాటు అందజెయ్యమని నిబంధన పెట్టేను. ఇహ, నీ కంటావా! తరతరాల ఆస్తి పొలమూ కొంపా సరుకూ సబ్బరా అన్నీ నీవేకదా.... వుండు, నీకు ఆ కాయితాలన్నీ తెచ్చిస్తాను. అన్నీ రిజిష్టర్ చేసినవే.తగూలూ తంటాలూ వుండవు" అనిలోపలికి వెళ్ళబోయేరు.

ముందుకి వెళ్ళి రెండు కాళ్ళూ పట్టేసుకొని కూర్చున్నాను. నాన్నగారు నా తలమీద చెయ్యి ఆనించి పడిపోకుండా కాసుకున్నారు.

తల ఎత్తి చూసేను.నాన్నగారు అంతఎత్తరి మనిషని ఇన్నాళ్ళుఎరగను.

"రెండు మాటలు వినండి నాన్నగారూ" అన్నాను. "సరే చెప్పు" అని ఆయన అనరు. నేను ఆ వ్యవధి ఇవ్వలేదు. "మీరన్నవి అన్నీ రైటే. అదలా వుంచి ఈ పూర్వార్జితమైన ఆస్తులు లేకుండా కూడా నేను బతగ్గల్ను. అది రైటే కాని– కాయితాలు రాయడం, రిజిష్టర్ చెయ్యడం, అదంతా అల్లరి. ఈ రకం శాంతి స్థాపన గాంధీ మార్గం కాదేమో అని నా మనవి. మీరు ఏం చెప్తే అది చేస్తాను. మీరు వెళ్ళిపోకండి. ఈ శాంతి అమలు అవుతుందో లేదో అని అక్కడెక్కడో మీరు వేదనగా వుండడం మీక్కాదు నాకే శిక్ష."

నాన్నగారు చిరునవ్వుతో నన్ను లేవతీసేరు" ఎంత చిన్న తప్పు అయినా శిక్ష తప్పించుకో కూడదని గాంధీగారు అన్నారు. నేను వెళ్ళడం నా తప్పుకి నా శిక్ష. నెల రోజులు గడిపి, నువ్వు ఇదే స్థిరత్వంలో ఉత్తరం రాయి. రాకపోతే అప్పుడు అడుగు" అని, నన్ను విడతీసి. గదిలోకెళ్ళి ఒక కవరు తెచ్చి ఇచ్చి, చెవులు అమర్చిన యూరియా సంచితో సావిడి దాటేరు.

ఆయన వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళేరు,

ఆయన, మామూరు గాంధీగారు!

నా తండ్రిగారు.

(ఆంధ్రపత్రిక వీక్లీ 19-11-1960 దీపావళి కథలపోటీ రెండో బహుమతి)

# వెన్నెలనీడ

సామర్లకోట రైల్వేస్టేషను.

మద్రాసు వెళ్ళే మెయిలు.

రైలెక్కి ఒక్క నిమిషం అయివుంటుంది. వెంకటేశ్వర్లు పోర్టరుచేత సామాన్లు సర్దించి, అతనికి డబ్బులిచ్చేసి, సీట్లో చతికిలబడి భార్యా బిడ్డలవేపు, ఆనక కంపార్టుమెంట్లో మిగిలిన వాళ్ళవేపు కలయజూశాడు.

కార్నర్ సీట్లో ఆయనా, శ్యామలా ఒకర్నొకరు పరీక్షగా చూసుకొంటున్నారు.

ఒకసారి ఆయనవేపూ, ఒకసారి శ్యామలవేపూ చూసి మళ్ళీ అటు తిరిగాడు వెంకటేశ్వర్లు.

"ఎందాకా వెళుతున్నారండి. మీరు?" అని అడిగాడు. "మి?-ఒంగోల్!" అన్నాడతను ఇటు చూడకుండానే.

శ్యామల పిల్లను ఎదటి బెంచిమీద నుంచి ఈ బెంచి మీదికి మార్చి ఎడంచేత్తో జోకొడుతూ అతనివేపు అలా చూస్తూనే వుంది,

ఒక నిమిషంపాటు ఎవరూ మాట్లాడలేదు. వాళ్ళిద్దరూ అలా చూసుకోడం వెంకటేశ్వర్లుకి ఏమీ బాగాలేదు.

అతను శ్యామలకి బంధువో, స్నేహితుల కుటుంబంలోని వాడో అయివుండాలి, ఇద్దరికిద్దరూ గుర్తు తెచ్చుకోలేక పోతున్నారని తెలుస్తూనే వుంది. తనేమీ సాయం చెయ్యలేక, భరించలేక అలా చూస్తూ కూచున్నాడు, అతను కూడాను.

"మీ దేవూరండి!" అంది శ్యామల హఠాత్తుగా.

"తుని! మీదో?"

"కాకినాడ. మీరు కాకినాట్లో చదివారా?....ఒకవేళ మా అన్నయ్య కోసం మా యింటికి వస్తుండేవారా? మిమ్మల్నెక్కడో చూశాను!"

"నన్ను చెప్పమంటారా?" అని అతను చిరునవ్వుతో వెంకటేశ్వర్లువేపు చూశాడు. "ఎక్స్క్యూజ్ మీ—"

వెంకటేశ్వర్లు సమస్య విడిపోయినంత ఆనందం చూపిస్తూ నవ్వాడు. "చెప్పండి చెప్పండి—ఎక్కడో ఎప్పుడో చూసుంటారు. అసలు చిన్నప్పటి ఫ్రెండ్సుని వొకో సమయంలో గుర్తుపట్టలేం..నా కట్టా చాలా సార్లైంది!" మరచిపోవడం తప్పులాంటిదని తెలిసినా ఇబ్బందైన పరిస్థితిని వీలయినంత త్వరగా దాచెయ్యాలని ఆతని ప్రయత్నం.

"సారీ, ఎట్లా చెప్పాలో నాకు తెలీటంలేదు!" అని చిరునవ్వు నవ్వి "ఇఫ్యూ డోంట్ థింక్ అదర్‌వైజ్—" అని ఇంగ్లీషులో మొదలుపెట్టి, "ఆమెని వొకప్పుడు వాళ్ళింటిలోనే పెళ్ళిచూపుల తతంగంలో చూశాను.ఆమెని పెళ్ళాడిన అదృష్టవంతులు మీరేననుకుంటాను." అన్నాడతను.

వెంకటేశ్వర్లు షాక్‌తిన్నాడు. కాని ఆ సంగతి తెలీకుండా ఏదో అందామని "నేనూ అదే అనుకున్నాను. లేకపోతే అంత తొందరగా యెట్లా మరచిపోతాం?" అన్నాడు. పరిస్థితి సరిగా అదుపులోకి రాలేదని అతని కదలికలవల్ల తెలిసిపోతోంది.

"ఇప్పుడేం చేస్తున్నారండీ!" అనడిగింది శ్యామల, మెరిసే కళ్ళతో.

ఆరేళ్ళక్రిందట—అతను తనను చూడ్డానికొచ్చినప్పుడు—తను పదిహేడేళ్ళ పడుచు. స్కూలుఫైనలు పాసయింది. ఇంటరూ, డిగ్రీకోర్సూ చదువుదామని తన ఉద్దేశ్యం. పెళ్ళిచేసి అత్తారింటికి పంపుదామని మిగతా వాళ్ళందరి ఉద్దేశ్యం. మెజారిటీ నిర్ణయం నెగ్గింది.

అప్పటికీయనకు ఇరవై రెండేళ్ళుంటాయేమో! సంపెంగవాసన పూసుకొచ్చిన వెన్నెల్లాంటి మత్తుసౌందర్యం అతనిది. గుండ్రని మొహంమీద నాకెందుకని వెనక్కి పారిపోయిన క్రాఫింగూ, ముందుకొచ్చేసిన ముక్కూ. మధ్య లొత్తతో గడ్డం, పేరుకు తగినట్టుగా "మనోహరంగా" ఉన్నాడని తను అనుకోడం, చూడ్డం తనకింకా జ్ఞాపకం వస్తున్నాయి "చూపులకొచ్చిన మొగకుంకని అలా చూస్తే వాడేమయిపోతాడూ!"అని మేనమామ దెప్పిపొడుస్తే—నలుగుర్లోనూ చెప్పరాని సిగ్గేసింది.

ఎంత చదువయితే ఉండనీ గాని. ఆస్తిలేని వాడికివ్వకు—అంటూ అమ్మమ్మ నాన్నకు చెప్పింది. ఎం. ఏ. ప్యాసయినీ్న తాలూకా కచేరీ గుమాస్తా పనికి సిద్ధమై పోతున్నారని నాన్న అభిప్రాయపడ్డాడు. వాళ్ళేమీ కట్నం అక్కర్లేదన్నారని వాళ్ళు అందరికీ హీనంగా కనబడ్డారు. "డిప్టీ కలెక్టరు కొడుకయితే మాత్రం? అయినా రిటైర్డు! ఏమిటో పోనిస్తూ; ఇంతకూ పిల్లకి ఏమంత

వయస్సు మీరిపోయిందని? ఇంకో సమంధం రాకపోదులే—" అన్నాడు మామయ్య.

కృష్ణాజిల్లా గన్నవరం తన అత్తవారిది. వెంకటేశ్వర్లు వాటాకు వాళ్ళ నాన్నగారు పోయాక, పదెకరాలు, అదీ ఇదీ కలిసివచ్చింది. బియ్యే ప్యాసయి సర్వీసు కమీషన్‌తో సెలక్టయి, అక్కడా అక్కడా చేసి బెజవాడ సబ్ కలెక్టరు ఆఫీసులో గుమాస్తాగా ఉంటున్నాడిప్పుడు. తనను పెండ్లాడిన ముహూర్త బలమో, తన అదృష్టమో అన్నారు; చకచకా రెవిన్యూ టెస్టులూ. ఎకవుంట్సు అవీ ప్యాసయి యూ. డీ. సీ. అయినాడు. రెండు చేతులా సంపాదిస్తాడు.

తన పుట్టింటారైనా—ఏమాట కామాటే చెప్పుకోవాలి—మంచి సంబంధమే చూశారు. వాళ్ళు కావాలనుకున్నవన్నీ వెంకటేశ్వర్లులో వున్నాయి. పైగా సరసుడూ, సహృదయుడున్నూ. వ్యవహార దక్షులయిన కొందరు గుమాస్తాలు పార్టీల్తో అలవాటు పడిపోయి, గృహజీవితంలోనున్నూ చాతుర్యం ప్రదర్శించి తన-పరభేదం మరిచిపోతారు. వెంకటేశ్వర్లు అట్లాటివాడు కాదు. అతనికి శ్యామలంటే చెప్పలేని ప్రేమాభిమానాలు.

చూసిన వాళ్ళందర్నీ పెళ్ళి చేసుకోలేం కదా. ఒక మనిషి ఒక మనిషినే పెళ్ళాడొచ్చు. మిగతా వాళ్ళందరూ అరగంట పరిచయంతో అనంతంగా చీలిపోతారు. ఎప్పుడో, ఎక్కడో వుంటూ "ఫలానా వారబ్బాయిలేడూ—ఆ రోజు మనమ్మాయిని చూట్టాని కొచ్చాడే—అతనికి పెళ్ళటమ్మోవ్—" అని వింటాం. అలాంటి ఒక్కొక్క కబురు మనకు సంబంధించిన ఒక్కొక్క వార్తలాగా వినపడుతుంది. అదే అతన్ని గురించి వచ్చే ఆఖరి వార్త కాబోలు. అంతే మరి; పెళ్ళికాని అమ్మాయిలకూ అబ్బాయిలకూ పెళ్ళేగదా అంతం!

శ్యామల హృదయం ఆనందంతో గంతులు వేసింది. అతన్ని చూడగానే ఎవరో ఆత్మీయుణ్ని చూసినట్లయింది. అతను మొహమాట పడుతున్నాడని ఆమె గమనించలేదు. అతనిమీద తను చూపిస్తున్న ఆపేక్ష, అతను కనుపించాక తను కనబర్చిన సంతోషం, సామాన్యుడైన తన భర్తకు అసూయపుట్టిస్తాయని తెలిసిన ఆమెలోకజ్ఞానం తాత్కాలికంగా మూగబోయింది.

"ఇప్పుడేం చేస్తున్నారు మీరు?" అనడిగింది శ్యామల మళ్ళీ.

"ఒంగోల్లో సబ్ కలెక్టరుగా ఉంటున్నానండీ-"

అదిరిపడ్డారు వెంకటేశ్వర్లూ, శ్యామలా. రైలుకు ఇంజను అప్పుడే అంటినట్టయింది.

* * *

బెజవాడ స్టేషన్లో సామానంతా దించి, నిద్రపోతున్న అబ్బాయిని ఎత్తుకుని శ్యామలను లేపాడు వెంకటేశ్వర్లు. "అప్పుడే వొచ్చేసిందా బెజవాడ?" అంటూ బద్ధకంగా ఒళ్ళు విరిచి లేచింది శ్యామల. జారిపోయిన పైటసరిగా కప్పుకుంటూ అప్రయత్నంగా కార్నర్ సీట్లోకిచూసింది.

అతను లేడు.

"ఆయనేరీ?" అంది శ్యామల.

"భోజనానికి పోయాడు. బండాగి పది నిమిషాలు కావస్తూంది. పద."

"అయ్యో, వెళ్లొస్తాననేనా చెప్పలేదండీ—"

"పద పద! చోటుకోసం వాళ్ళవస్థ పడుతున్నారు. చెబుతూంటే నీక్కాదూ?"

"అబ్బ! వొస్తున్నానండీ!" అని విసుక్కుని పిల్లనుతీసింది శ్యామల, లేస్తూ.

ఇంటికి రిక్షా మాటాడుకొని కూర్చున్నారు ఇద్దరూ. శ్యామల మనస్సు పీకుతోంది. 'అతను' ఎంత కాకపోయినా ఏదో కావలసిన వాడనే భావాన్ని చంపుకోలేకపోతోంది. 'సఖ్యం సాప్త పదీనమ్' అని అన్నారు. దాదాపు నూట యాభై మైళ్ళుకలిసి ప్రయాణంచేసి దిగేటప్పుడు "వస్తామండీ" అనైనా చెప్పకుండా ఎవళ్ళ మట్టుకువాళ్లు వెళ్ళిపోవడం బండిలోనూ అంతకుముందూ జరిగిన దానికి చాలా విరుద్ధంగా వుంది. అతన్ని తొందరగా పెళ్ళిచేసుకోమనీ మరిచిపోకుండా తనను పిలవమనీ మరోసారి చెప్పాలనుకుంది. అతని హోదా తనకు అడ్డదు. లోకానికి అతను సబ్ కలెక్టరు కావచ్చు. కాని తనకు మిత్ర సమానుడు. కలుసుకోడం కష్టమైన మిత్రుల్ని కలుసుకున్నప్పుడు కల్గిన ఆనందంకంటే, విడిపోయేటప్పుడు వచ్చే వుత్కంఠా, అది తెలియకుండా చూపే ఉత్సాహం, చాలా అనుభవ నీయాలు. రైలు స్టేషనుకు వెళ్ళి దిగబెట్టి రైలు కదిలేటప్పుడు "ఉంటాను. ఉత్తరాలు రాస్తూ వుండేం?" అనడానికి మనస్సులో ఆత్మీయత పేరుకుపోయి ఇంచుమించు అందరికీ హాయిగావుంటుంది. రైలు వెళ్ళాక కాళ్ళలోకివచ్చే బరువు అప్పుడేమాత్రం స్ఫురించదు.

పాడు నిద్ర — ఎప్పుడు పట్టిందో —

అదృష్టవంతుడతను. వాళ్ళ నాయనమ్మ తను చచ్చిపోయేలోగా అతని పెళ్ళి కావాలని పట్టుపట్టిందట. రెండు మూడు సంబంధాలు చూసి ఏమాటా తేల్చుకోలేని సమయంలోనే ఆవిడ పోయిందట. ఢిల్లీ వెళ్ళి ఐ. ఎ. యస్

ప్యాసయి సబ్ కలెక్టరు అయినాడు. ఇంక రెండు మూడేళ్ళలో జిల్లాకలెక్టరూ అవుతాడట.

తన వాళ్ళు తనకు పదిహేడు వెళ్ళి పద్దెనిమిది రాగానే ఏదో కొంప మునిగిపోయినట్టు సంబంధం చూసి పెళ్ళిచేసి తనను పంపించేశారు. తన భర్త ఇంకా రెండు మూడేళ్ళలో ఏమీ కాడు.

"అతన్లా అందరూ ఐ.ఏ.యస్.కి కట్టరేమండీ?"

వెంకటేశ్వర్లు ఉలిక్కిపడ్డాడు. ఆమె ఇంతసేపూ "అతన్ని" గురించే ఆలోచిస్తోందని స్ఫురించిందతనికి. పరాయివాళ్ళ విషయం శ్యామల ఇంత దూరం పట్టించుకోవడం అతను తొలిసారిగా చూచి ఆశ్చర్యపడ్డాడు. కాని అతనామెను ఎప్పుడూ నిరుత్సాహపరచలేదు. భార్యాభర్తలు ఒకర్నొకరు నిరుత్సాహపరుచుకొని విషయాలు తుంచేస్తే వాళ్ళ అనుబంధాలు చెడతాయని అతని నమ్మకం.

"కట్టొచ్చు. తెలివితేటలే కాదు, వొడ్డూ పొడుగూ కాళ్ళూచేతులూ బరువు ఏవో కొల్తలు చూసుకోవాలి. కొన్నాళ్ళకిందట వంశమూ సంప్రదాయం కూడా పట్టుదలగా గమనించేవాళ్ళు, పరిపాలనా దక్షతకోసం" అన్నాడతను చల్లగా.

"ఎం.ఏ. పాసవ్వాలా?"

"లేదు. బి.ఏ. చాలు."

—అతను అప్పటికే ఎం.ఏ. అయినాడు. వాళ్ళ నాన్నగారు డిప్టీకలెక్టరు చేసి రిటైరయినాడు. ఒడ్డూ పొడుగూ మనిషిని చూడగానే ఇతగాడు పెద్ద ఉద్యోగంకోసం పుట్టాడనిపిస్తాడు. బ్రిటిషువాళ్ళు మెచ్చుకునే స్ఫురద్రూపం. నాటికి నేటికీ ఒఖ్ఖలా తెల్లటి చలవగుడ్డలూ. ఉన్న అవకాశాలన్నీ సద్వినియోగంచేసుకుని చిన్నతనంలోనే కలెక్టరు హోదా పొందాడు. అతడు అప్పట్లో కట్నం కావాలనలేదు. కావాలనాలేగాని ఇప్పుడు ముప్ఫయివేలో నలభై వేలో ఇస్తారు! బంగారపు బొమ్మలాటి పిల్లను చేసుకుంటాడు. ఆ అదృష్టవంతురాలు ఎవరో?

తనే అయివుండవలసింది, తనవాళ్ళు తెలివిగా ఆలోచిస్తే. ఇంటిచుట్టూ జవాన్లూ, ఏ ఊరెళ్తే ఆ ఊళ్ళో బంగళా, పలుకుబడీ, పెద్దజీతం, మంచికారూ, గవర్నమెంటు జీపూ, ఇవన్నీ తనవే అవవలిసింది. ఆస్తి. ఆస్తి అంటారు గాని అధికారం ఉన్న వాళ్ళను ఆస్తిపరులూ గౌరవిస్తారుగా!-ఇప్పుడు తను? ఆ సబ్‌కలెక్టరు ఆఫీసులోనే ఒక గుమాస్తా భార్య!

"ఒంగోల్లోనే వుంచేస్తారా, అతన్ని ట్రాన్స్ఫర్ చేస్తూవుంటారండీ!"

"ఎందుకు చెయ్యరు? రెండేళ్ళు తిరిగేసరికి మళ్ళీ ఎక్కడికో-"

"బెజవాడా వెయ్యొచ్చా?"

"ఆ; బెజవాడేం? ఆంధ్రాలో ఎక్కడన్నా వెయ్యొచ్చు; వొకసారి అంధ్రకి ఎలాట్ చేశారు గనక!"

అతను బెజవాడలోనే సబ్ కలెక్టరు అయితే తనకి ఇంతకన్నా బాధగా వుంటుంది కాబోలు. అ పరిస్థితి రాకుండా ఉంటే బాగుణ్ణు!

ఏమిటో—మేరేజెస్ ఆర్ మేడిన్ హెవెన్, అంటారు. తన వివాహం భూమిమీదే జరిగుంటుంది,"ఇంతకీ ఘటనుండాలి,మా అమ్మమ్మ చెప్పినట్టు." అని తను అంటే, "ఎవరమ్మమ్మ నడిగినా అంతకన్నా ఏం జెప్తారు?" అన్నా డతను. వెన్నెల ఒలకబోసినట్లు నవ్వి, పల్చటి తెల్లటి ఆందం అతనిది.వెన్నెలే అతను; అతనే వెన్నెల.

"ఛీ—ఏమిటి నాకీ పాడాలోచనలు!" అనుకుంది శ్యామల. పెళ్ళయిన తరువాత ఈ అయిదాేళ్లలోనూ తనవాళ్ళు తన పెళ్ళి విషయంలో ఏదో పొరపాటు చేశారని అనుకోడం ఇదే మొదటిసారి.అనుకున్నందుకు విచారించినా అందులో ఉందనిపించే నిజం అనిపిస్తూనే ఉంది.

రిక్షా ఆగగానే శ్యామల వాస్తవ ప్రపంచంలో పడింది.

"నేను కేరియర్ పట్టించుకొస్తా గానీ నువ్వింటికెళ్ళి స్నానానికి వేణ్ణీళ్ళు సిద్ధంచేసి పెట్టు. ఇవిగో తాళంచెవులు" అని వెంకటేశ్వర్లు హోటలు దగ్గర దిగాడు.

"తొందరగా వచ్చేయ్యండేం !"

0 0 0

ఇంటికి వెళ్ళి పిల్లలిద్దర్నీ మంచంమీద పడుకోబెట్టి బాయిలరు అంటించి రెండు గదులూ ఊడ్చింది శ్యామల.పదినిమిషాల్లో నీళ్ళుకాగాయి. భర్త రాలేదు. తొరతొరగా రెండు బకెట్లకు నీళ్ళు తోలుపుకొని ఒంటిమీద పోసుకుంది. చీర మార్చుకొని తలా ముఖం సవరించుకొచి హాల్లోకొచ్చింది. ఇంతలో వీథి తలుపు చప్పుడైంది. "వస్తున్నా !" అని తలుపు తీసింది.

"సబ్ కలెక్టరు గారి జవాన్నండి."

"ఊఁహూఁ. ఏం !"

"అయ్యగార్ని పొద్దున్నే ఎడ్గుమాస్తా గారితో కల్చి రమ్మన్నారండి."

"ఏం వేళాపాళా లేదు ? మేం వొచ్చామని అప్పుడే ఎట్టా కనుకున్నారు మీ దొరగారు! ఏమన్నా అంజనం వేశారా?-ఇంకా అయన ఇంటికన్నా రాలేదే! ఏమిటీ సంత?-పో, పో!" అని కసురుకుంది శ్యామల.

"ఏందండమ్మగారూ అట్టా అరుస్తారు? ఎడ్గుమాస్తాగారు ఎదుటింబోనే గదండి ఉంటం! వారితో పిచ్చా పాటీ మాట్లాడ్తా వుంటే ఎళ్ళిరమ్మన్నారు. మళ్ళీ పొడుకుంటారేమోనని చెప్పొచ్చా. వార్తో జెప్పండమ్మా-" అని గుమ్మం దిగి చరచరా వెళ్ళాడు జవాను.

శ్యామల తలుపుదగ్గరే నిలబడిపోయింది బిత్తరపడి. తను ఎందుకన్నదో ఆమాటలు, వాడెట్లా జవాబు చెప్పాడో; అంతా మాయగా ఉంది.

"ఏమిటీ, ఎవరదీ? లే!" అంటూ వెంకటేశ్వర్లు వచ్చాడు. అతనికి దారి ఇయ్యటానికి శ్యామల లోనికి నడిచింది.

"ఏముందీ? ఆఫీసు జవానుట! తెల్లారేసరికి రమ్మన్నారట! యింతేగా వుద్యోగం!"

వెంకటేశ్వర్లు వెనకాలే వొచ్చిన హోటలు కుఱ్ఱాడు కేరియరు అక్కడే ఉంచబోయాడు. ఇట్టా ఇట్టా అని వాణ్ని లోపలికి తీసుకెళ్ళింది శ్యామల.

వెంకటేశ్వర్లు ఆలోచిస్తూ బట్టలు విప్పుకుంటున్నాడు: కేరియరు లోపల పెట్టిన కుఱ్ఱాడు తిరిగొచ్చి హాల్లో నుంచున్నాడు. శ్యామల పంచె, తువాలు తీసుకువచ్చింది.

"కేరియరుకి పొద్దుట రా అబ్బాయి. పనిమనిషి వొస్తుందో రాదో తెలీదు" అన్నాడు వెంకటేశ్వర్లు. "సరేనయ్యా" అని వాడు వెళ్ళాడు.

వాచీ తీసి ఇస్తూ వెంకటేశ్వర్లు "తొమ్మిదే యిరవై అయిందే! నీళ్ళు కాగాయా?" అన్నాడు. శ్యామల చేతుల్లోంచి తువాలు.పంచె తీసుకుని బాయిలరు దగ్గర కెళ్ళాడు.

భర్త తనకేసి చూడలేదు. తను అన్న మాటకు ఏమన్నా అనుకుంటున్నాడేమోనని శ్యామల బాధపడింది.

వెంటనే వెళ్ళి "నే తోల్లిస్తా లేవండి——" అంది.

"అక్కర్లేదులే. నువ్వు స్నానం చెయ్యవూ?"

"పోసుకున్నా, లేవండి నే తోల్లిస్తా."

"వెళ్ళి డాబామీద పక్కలువెయ్" అని వెంకటేశ్వర్లు రెండు బక్కెట్లూ బాయిలరు దగ్గరకు తెచ్చాడు.

అతని అభిప్రాయం గ్రహించి శ్యామల వెళ్ళింది.

నిజానికి అర్ధరాత్రప్పుడు రమ్మనడం, ఆదివారాలూ సెలవులూ వర్కు చెయ్యవలసి రావడం, మర్నాడు ఉదయాన్నే ప్రత్యేకం రావలసుంటే తొలి రాత్రి పది పదకొండు గంటలవరకూ కబుర్లు చెయ్యడం, ఇలాంటివి వెంకటేశ్వర్లుకు కొత్తకాదు. ఎంత విసుక్కునేది శ్యామల! వాళ్ళకు పెళ్ళాలూ, పిల్లలూ ఉండరా అనేది, ఒకసారి; తాలూకాలో వర్కు చేస్తున్నప్పుడు డఫేదారుతో అన్న ఈ మాట తాసిల్దారువరకు వెళ్ళింది. భార్య అన్నమాటకు అతని బాధ్యత ఏమీలేదు కాని ఆ మాటను తాసిల్దారు జోక్‌గా మార్చేవరకూ వెంకటేశ్వర్లు ఇబ్బంది పడ్డాడు. జమాబందీల్లో రాత్రి రాకపోవడమూ జరిగేది.... అంత విసుగు శ్యామల ఎన్నడూ చూపలేదు. "ఇంతేగా వుద్యోగం!" అని ఉద్యోగంపైన నిరసనలేదు, డ్యూటీలో ఎగుడు దిగుడులు ఉద్యోగానికి చెందవు: ఆఫీసర్లుగా వచ్చే వ్యక్తులలో మంచి చెడులు ఆ ఉద్యోగాలకు చెందనట్టు.

"ఇంతేగా ఉద్యోగం" అన్న భావం ఇంకో ఉద్యోగి ఉద్యోగంతో పరిపోల్చు కున్నప్పుడు కలగొచ్చు.

కాని ఈ మాట శ్యామల తొందరపడి ప్రయాణపు బడలికా, చికాకూ ప్రోత్సహించగా అన్నమాటేగాని లోతాలోచించి అందులో అర్థం తనకు తగలాలని అన్నమాట కాదని వెంకటేశ్వర్లు ఉద్దేశం. రైల్లో తటస్థపడ్డ ఆయన ఉద్యోగం పెద్దది అన్న విషయం దృష్టిలో పెట్టుకొని శ్యామల ఈ మాట అన్నదేమో అనుకోడానికి అతనికి ప్రాణం ఒప్పలేదు. ఆ విధంగా ఒక తరంగం వస్తే గట్టిగా తోసి వేశాడు,

ఏమైనాసరే ఈ విషయం అతనేమీ ప్రసంగించదలచలేదు. తనలో ఏమైనా అసంతృప్తి రేగితే, శ్యామలే ఆ విషయం దాచుకోకుండా తెలియజేస్తుందని అతనికి తెలుసు.

కాని అట్లా ఆమెను పరీక్షకు పెట్టడమూ అతని లక్ష్యం కాదు. ఆమెను పరీక్షకు పెట్టి విషయం తెలుసుకోటం తనకూ, ఆమెకూ మధ్యవున్న అనుబంధాన్ని కలుషితం చేస్తుందని అతని భావం.

0 0 0

స్నానం, భోజనం అయి డాబామీదకు చేరేసరికి పదిగంటలు కావస్తోంది. శుక్ల చతుర్దశి వెన్నెల విశ్వానికి తెల్ల బట్ట కప్పినట్లుంది. తెల్లటి దుప్పట్లమీద

తెల్లచీర కట్టుకున్న శ్యామలమీద ఆ వెన్నెలపడి, ఆరిపోతాయేమోనని భయపడే అనుభవాల కోరికల్ని వెంకటేశ్వర్లులో రెచ్చగొట్టుతున్నవి. నిశ్శబ్దమయిన ప్రకృతిని సూచిస్తున్నట్టు శ్యామల మౌనంగా వుంది.

"ఏం, అల్లావున్నావ్ ?"

"ఎలా వున్నానూ ?"

"అలిసిపోయినట్టుంటేనూ!"

"నేనేం అలిసిపోలేదు. చక్కగా నిద్దరబోయా రైల్లో."

కాని ఆమె మనస్సు స్వాధీనంలోకి తిరిగి రాలేదు. వెన్నెల చూస్తేనే "అతను" జ్ఞాపకం వస్తున్నాడు. తెల్లటి దుప్పటిమీద కనబడని కిరణాలు ప్రసరిస్తున్న చందమామను చూస్తె ఊహలో అతనే మెదుల్తున్నాడు "అతను వెన్నెల్లా ఉన్నాడు." అన్నది తన భావం. అది ఇవ్వాల్టిది కాదు; ఆనాటిది. విధి తనను అతన్నుంచి విడదీసి ఈనాడు వెన్నెల్లో ఈ తెల్లని అనుభవం రూపం చూపించి పరిహసిస్తూంది. అలిసిపోయి, పాతబడిపోయి, సౌఖ్యాన్నీ, ఫలితాన్నీ మొహం మొత్తించేసిన ఈ అనుభవం నేడేమో కొత్తగా ఉంది. ఆ సమయంలో వివేకం, జ్ఞానం, ధర్మాధర్మజిజ్ఞాస–వీట్ని ఆమె నుంచి వేరుచేసి 'దుశ్శీలం' విజృంభించింది. భర్తే పరాయివాడై తను భర్త సమక్షంలో ఏకాంతంగా ఉంటున్నది. ఊహచిత్రమైన మార్గాలు పట్టి తనను మత్తులోముంచి ఎక్కడికో తీసుకుపోతున్నది. లక్ష్యమూ, మార్గమూ లేవి ఆ ఊహ వెంట నీరసంగా నిశ్శబ్దంగా పోతూ, ఉన్నది లేదనుకొని, లేనిది సృష్టించుకొని, బధిర బంధితురాలైంది. ఆ ఊహలోంచి వాస్తవానికి వచ్చేటప్పటికి పవిత్రమైన సుఖశిఖరం జారిపోయింది.

అతి గోప్యమైన ద్రోహం అది. దానికి తట్టుకోడానికి ఎంత అనుభవమూ చాలదు.

0 0 0

"నా కిక్కడ బాగా లేదండీ–" అంటూ శ్యామల లేచింది.

కట్టు సవరించుకొని పాపను ఎత్తుకుంది.

"చలేస్తోందా !"

"ఏమోనండీ – కిందికి పోతానూ?"

"నేనూ రానా ?"

"మీ యిష్టం."

"యిక్కడ బాగానే వుంది; మంచుకూడా పడేట్టు లేదు."

"....బాబుని తీసుకొపోనా ?"

"ఒద్దులే. ఉంచు."

తొందరగా మెట్లు దిగి వచ్చింది. పాపను ఉయ్యాలమంచం మీద పడుకో బెట్టి టేబుల్ ఫ్యాను కాళ్ళవేపున స్టూల్ మీద ఉంచింది. పక్కనే మంచం వాల్చుకుని ఒట్టి దిండు వేసుకుని దీపం ఆర్పి పడుకుంది.

నిద్ర రావటం లేదు, ఎంత ప్రయత్నించినా. జాగ్రదవస్థలో ఉన్నంత సేపూ ఆలోచన తప్పదు. గుప్పెట్లోనూ, సీసాలోనూ శూన్యాన్ని సాధించడం. మస్తిష్కాన్ని ఖాళీగా ఉంచడం – ఒకదానికంటే ఒకటి కష్టం. మొదటిదానికి సైన్సు సహాయం లభిస్తుంది. రెండోదానికి భౌతిక సహాయం లేదు. ఆధ్యాత్మిక చింతన, ధ్యానం చేస్తె వీలవుతుంది. వాట్ని అలవర్చుకోడానికి కొంత పారిశుద్ధ్యం పరిపూర్ణతా అవసరం. అవి మొదలయ్యే చోటుకు శ్యామల ఇంకా చేర లేదు,

ఈ రోజు ఎంత అన్యాయం జరిగిపోయింది! అతన్ని చూపించి విధి తనను పరీక్షించి పరిహసించింది. పరీక్షలో తనునెగ్గ లేక చెయ్యకూడని పాపం చేసేసింది. తనలో ప్రవహిస్తున్న రక్తానికీ ఆత్మకూ చుట్టరికం లేదు. పైకగు పించని ఈ బాధ తను ఎట్లా భరించడం? భర్తకాదుగదా, ఆత్మకూడా ఈ బాధను పంచుకోదు. తనకు తనే చేసుకున్న ఈ ద్రోహానికి ప్రాయశ్చిత్తంగా తననుంచి తనే దూరంగా పారిపోవాలి. ఎక్కడికి? ఎక్కడికి పోయినా ఈ బాధ తనను వెంటాడుతూనే ఉంటుంది. ఎవరో ఎర్రగా మండుతున్న కొరివితో తనను కాలుస్తున్నాడు. శరీరం పాప చింతనాగ్నిలో దగ్ధమై వ్రణాలవుతోంది.

చీకట్లో ఫ్యానురొదలో వేయికంఠాలు తనవేపు తిరిగి ఏమేమో అరుస్తు న్నట్లుంది. కళ్ళు మూసుకున్నా కనబడే ఆ భీకర దుష్ట స్వరూపం తన ప్రతి బింబమేనని ఊహించుకొని చెప్పరాని ఆవేదన అనుభవించింది శ్యామల. మని షికి ఒంటరితనం కంటే శత్రువు, శిక్ష ఏమున్నాయి!

ఆరేళ్ళుగా భర్తతో కాపురం చేస్తూ. అతనే తనై, తనే అతనై గాటు తప్పని బండిలాగా సరళంగా సంతోషంగా జీవితయానం సాగిస్తున్న తనను, ఈ రోజు అతను కనబడి తలక్రిందుగా నించోబెట్టాడు. సామర్లకోటలో మెయిలు

ఎక్కేవరకూ ఉత్సాహంగా ఉన్న తనను; ఈ గొడవ ఊహించడానికైనా అవ సరంలేని తనను; ఇందులో దింపి ఏడిపిస్తున్నాడు.... క్రూరుడతను!

పాపం అతను మటుకు ఏం చేశాడు! అమర్యాదగాగాని అపసవ్యంగాగాని ప్రవర్తించలేదు. తనే అతన్ని గుచ్చిగుచ్చి, మీదేవూరు? ఇప్పుడేం చేస్తున్నారు? అని అడిగింది. అతను సాధ్యమైనంత సిగ్గుపడి ఎలా చెప్పనండీ అంటూనే తన కర్థం కాదనుకొని గాబోలు ఇంగ్లీషులో చెప్పాడు. అతన్ని పరకాయించిచూసి, ఫలానా అని తెలిసి ఈ ఒకోక పదే పదే పృచ్ఛించడంలో తనకు తెలియకుండా తనపైన స్వారీచేసే ఒక ఆధిక్య భావావేశం ఉంది. పెళ్ళి చూపులకు వచ్చిన తరవాతకూడా వాళ్ళకు ఆస్తిపాస్తులు లేవని తిరస్కరించి అనాడు వార్ని తన వాళ్ళు అవమానించారు. ఈనాడు నీవెవరు, నేనెవరో తెలుసుగా! నాకు పెళ్ళ యిందిలే; ఇదుగో నా భర్త నా పిల్లలూ చూశావా! అని చెప్పకోబోడం– ప్రద ర్శన– అతన్ని అవమానించడమే. నాడూ, నేడూ క్షణికమైన అధిక్యాన్ని పుర స్కరించుకుని నిజమయిన విలువను అవమానించిన దోషం తనది– తనే దోషి.

అయినా ఇంత శిక్ష తగదు. చిరకాల సముపార్జితమైన పావిత్ర్యం ఉద్రేకజనకమైన ఒక్కదోషంతో దగ్ధమైపోయి ప్రత్యక్షదైవం ఎదుటా, ఆత్మ ఎదుటా విచారణ పొందవలసి రావడం అన్యాయం.

తను చేసినది తప్పయినా సామాన్యమైనదిగా కనుపించదు; ఆత్మసాక్షిగా, భర్త సమక్షంలో అతనిసరంగా ఆలోచించి, భర్తని స్వల్పానికి తూలనాడింది; భర్తలో అతన్ని ఊహించుకొని మానసిక వ్యభి—— ఛీ!

"భగవంతుడా!" అని ఒక కేకపెట్టింది శ్యామల. కాని ఆ కేక ఆమెకే వినిపించలేదు. గాద్గద్యంతో ఆమె కంఠం మూసుకుపోయింది.

0 0 0

"లెగవండమ్మగోరూ!" అంటూ పనిమనిషి లేపేవరకూ మెలకువే రాలేదు. రేడియో మీద అలారం టైమ్‌పీస్ చూసింది; దానికి కీ ఇస్తేగా తిరగ డానికి! అనుతుంటూనూ, అది ఎనిమిదింపావు చూపిస్తోంది. రేడియో ఆన్ చేసి సరిదిద్దుదామని కీ ఇవ్వబోయింది. గడియారం తిరుగుతూనే వుంది. ఎవరయినా కీ ఇచ్చారేమోలే అనుకుంది.

"ఎంత నిద్దర బొయ్యావమ్మా." అని పనిమనిషి నిట్టూర్చి చేతులు తిప్పింది.

"అబ్బ! ఏమిటే నీ సొద!"

"సొదేం దండమ్మగోరూ! ఐగారు ఆఫీసుకెలి పొయ్యారుగా. సందు మొగలనే గనపడి దణ్ణం బాబూ అంటే యింటికెల్లమంటిరి. తమురులెగిసే వున్నారనుకుంటుండా!" అని చదివింది పనిమనిషి.

శ్యామలకు పూర్తిగా తెలివొచ్చింది. అయితే టైము ఎనిమిదింపావు అయిందన్నమాట. వెంకటేశ్వర్లు విషయం ఆమెకు కొత్తగాదు. పిడుగులు పడుతున్నా సరే డ్యూటీకి ఎగనామం పెట్టడు. రాత్రి కబురొచ్చిందో లేదో పొద్దుటే లేచి వెళ్ళాడన్నమాట.

"సరే నీళ్ళుతోడు బాయిలర్లోకి" అంటూ గదిలోకి వెళ్ళి టూత్ బ్రష్ తెచ్చుకుంది శ్యామల.

"బాయిలేర్లో నీళ్ళు కాగుతుండాయమ్మగోరూ!"

"సరే కుంపటి వెలిగించు. డాబామీద చిన్నయ్యగారింకా పండుకున్నాడు గాబోల్లేపి తీసుకురా!—"

ఏమీలేదు, చిన్నయ్యగారు లేచి వాళ్ళనాన్నగారితో కాఫీ తాగేసి పెరట్లోకి వెళ్ళి ఆడుకుంటున్నాడు. కుంపటి పక్కన కాఫీ గిన్నెలూ, కుంపటిమీద సన్నగా కాగుతున్న పాలూ! అనుమానించి మేకున ఉన్న ఫ్లాస్కుచూస్తే బరువుగా వుంది.

శ్యామల సిగ్గుతో చచ్చిపోయింది.... రాత్రి ఆ దిక్కుమాలిన ఆత్మ పరిశీలన దప్పించుకోడానికి వీల్లేనిదైంది. అందులో ఎప్పుడు నిద్దరపట్టేసిందో! ఆయన పాపం తెల్లవారుజామున చాలా తొందరగా లేచుండాలి. పాలు పిండే మనిషి బర్రెను తీసుకుని అయిదుకాక ముందే వచ్చేస్తుంది. అప్పుడనగా లేచి, ఈ పనులన్నీ చక్కబెట్టి ఎనిమిది ప్రాంతంలో ఆఫీసుకు వెళ్ళాడన్నమాట. ఇవన్నీ చూసి పనిమనిషి నవ్వుతోంది కూడాను. ఛీ; మొద్దునిద్దరా నేనూను! ఎంత పనైంది! అనుకుంది.

పిల్లలిద్దరికీ నీళ్ళుపోసి దను పోసుకుని వంట పూర్తిచేసేసరికి పదిన్నర దాటింది. వేడివేడన్నం పిల్లలిద్దరికీ పెట్టేసి ఇవతలికి తీసుకొచ్చింది. వీధి తలుపు చప్పుడైంది.

ఆఫీసు బవాను——

"అయ్యగారు తొందర పనుండి బందరెళ్ళారండి. రాగవయ్యగారి దగ్గి

రుచ్చుకున్నారండి యిరవై రూపాయలు, తమర్నడిగి వారి కియ్యమన్నారండి, ఇదిగో చీటి."

సరిగా మెదడులో ఇమడలేదు శ్యామలకి.

"బందరెళ్ళారూ?"

"మరేనండి."

"ఎందుకూ?"

"ఏదో అర్జంటు పనిటండి. దొరగారు బంగళాకి పిలిపిచ్చుకుని జీపులో ఎక్కించుకు పొయ్యారండి."

"భోజనమో?"

"ఇంక బోజన వేఁటండి; ఎవురూ దిన్లా, అమీన అయ్యగారు డబ్బు ల్దెచ్చుకోలేదని యిదవుతావుంటే రాగవయ్యగారిల్లు దగ్గిరగదాని నే బోయి దెచ్చిచ్చా."

చీటీ చూసింది శ్యామల. ఇంట్లోకెళ్ళి డబ్బు తెచ్చియిచ్చింది.

"రాత్రి కొచ్చేస్తారుగా!"

"ఎట్ట తెలుసుద్దండి? ఎళ్ళం మనిష్టం గాకపాయె. రాటం మనిష్టమా!" అనివాడు వెళ్ళిపోయాడు.

దిగాలుపడి కూచుంది శ్యామల.

అర్జెంటు పనులు వస్తూనే ఉంటాయి. ఇంటికి వచ్చి చెప్పి వెళ్ళకూడదా? చేతిలో డబ్బులేకపోయినా ఇంటికి రావాలని బుద్ధి పుట్టలేదు? రాఘవయ్యకు కబురు చేసి- తిండీ తిప్పలూ లేక కట్టుబట్టలతో అప్పుచేసి వెళ్ళిపోవాలా? ఇది ఎప్పటి డ్యూటీకాదు. ఇందులో ఏదో ఉంది.తన మాటా ప్రవర్తనా గుర్తించి తనను శిక్షిస్తున్నారా ఆయన?

కబురు తెచ్చిన జవాను! వాడి మాటలు! కొంచెం తిన్నగా ఏడవకూడదూ వాడైనా! వాడికంతా తెలుసల్లే ఉంది!

ఆలోచనలో అశ్వాసలతో శ్యామల అలాగే గంటలు గడిపేసింది. మధ్య మధ్య పిల్లల ఆట, నిద్రపోవడాలు,కిటికీ రెక్కల చప్పుళ్ళు. పోస్టుమన్ కేక- ఇలాటివి స్వల్పంగా కదిల్చినా ఆలోచనలనుంచి తప్పించుకోలేక పోయింది,

సాయంకాలం హెడ్మాస్టారు శంకరంగారు ఇంటికి వస్తాడు గదా; ఆయన్న డిగితే వివరం తెలుస్తుందనీ, అసలాయనతో కలిసి భర్తవచ్చేస్తాడనీ కొంత

ఆళ. అతనికోసం చూడగా చూడగా చివరికి రాత్రి ఎనిమిదిన్నరకు వచ్చారు, రిక్షా వాళ్ళింటి గగ్గర ఆగగానే గబగబా వెళ్ళింది శ్యామల.

"ఏమమ్మాయీ ఇట్లా వొచ్చావూ? రా. కూర్చో!" అంటూ లోనికి వెళ్ళాడాయన. హెడ్డు గుమాస్తా గారి భార్యవచ్చి "శ్యామలా యేమిటి' వోహోహో_ రామ్మా,రా. ఏమిటి విశేషాలు? చెల్లెలు పెళ్ళి విశేషాలు చెప్పు ముందుగా!" అంటూ పలకరించింది.

శ్యామలకు ఇరకాటంగా ఉంది. కోటూ పాగా తీసేసి శంకరంగారు ఇవతలికొచ్చాడు. "ఏమమ్మాయీ,పొద్దుపోయొచ్చావూ! మీ అయన రాలేదట్టుందే బందర్నించి?" అన్నాడు,

"మరేనండీ_ సాయంకాలాని కొస్తానని కబురు పెట్టలేదు. మీకు తెలుసేమోనని___"

"తెలిసేదేముంది? వెళ్ళిన వాళ్ళంతా వొచ్చేశారుగా?"

"అందరూ వొచ్చేశారాండీ!"

"ఆ, అంతా వొచ్చేశారు! రేపు శనివారం లోపుగా బిజినెస్ రిటర్న్సు పంపాలి. ప్రతీ వాడి ఆఫ్లోనూ వర్కు_ హెవీగా వుంది. ఇవాళ కలెక్టరు క్యాన్సు రెన్సు. క్యాంపు క్లర్కు_కి జ్వరమైతేనూ మీ అయనకి షార్టుహాండ్ తెలుసుగదాని సబ్కలెక్టరు వెంబడేసుకు పొయ్యాడు. వాళ్ళంతా సాయంకాలనికే వొచ్చేశారు. మరి యీన ఎవరన్నా ఫ్రెండ్సుతోవుండి బస్సులోగాని వస్తాడేమో?

ం ం ం

ఆ మర్నాడు సాయంకాలం హెడ్డుమాస్తా శంకరంగారే వచ్చారు. "అమ్మాయీ!" అని కేకేస్తూ.

శ్యామల గదిలోంచి హాల్లోకి వచ్చింది. కొంగుపట్టుకుని అబ్బాయి వచ్చాడు. వాడిచేతుల్లో పిప్పరమెంట్ల ప్యాకెట్ ఒకటి పెట్టాడు శంకరంగారు.

"అదేమిటండీ?" అని వారించింది శ్యామల,

"అబ్బే ఏంలేదమ్మా! పసిపిల్లాడు. చూసిచాల రోజులైందిగా_"

శ్యామల మొహం పొంగి కళ్ళు బరువుగా వున్నాయి.

"ఏమమ్మాయీ అట్లావున్నావు? ఇవ్వాళా రాలేదుగా, వెంకటేశ్వర్లు? ఏమయిపొయ్యాడు, ఎటు పొయ్యాడు?"

"వారి పని పూర్తిగాలేదేమోనండి, బందర్లో_" దుఃఖం దిగమింగుకుంటూ అంది శ్యామల.

"నా బొంద, వారి పనీ నా పనీ అక్కడేముందమ్మా! ఇందతా గవర్న మెంటుపనీ, సబ్ కలెక్టరు పనీ—

"అయినా నాకు తెలియని పనేముందతనికి బందర్లోమటుకు? లేదు! ఇందులో ఏదో వుంది. అయితే అమ్మాయీ, ఒక్కటడుగుతాను. ఏమను కోకుండా చెబుతావూ?"

శ్యామల పరిస్థితి అయోమయంగా వుంది.

"నా అనుమానం ఏమిటంటే- ఏమన్నా పోట్లాడి వెళ్ళాడా అని! పెళ్ళికి గదా వెళ్లారు! అక్కడ లాంఛనాలూ వాటివిషయంలో లేదా యింకో నాలుగు రోజులక్కడుండం విషయంలో ఏదన్నా మాటా మాటా అనుకున్నారేమో! ఒక వేళ!- చూడమ్మాయీ ఇది ఎలాంటి సైమంటే- బిజినెస్ రిటర్న్స్ సైమ్. అందరూ కష్టపడి పనిచెయ్యాలి. రెండు రోజులు ఆబ్సెంటయినాడంటే అతని కెంత నష్టం !- అసలే పది రోజులు సెలవు వాడేశాడు- వర్కుకి ఎప్పుడూ ఎగనామం పెట్టడే అతను; నువ్వు చూస్తే ఇట్లా వుంటివి- అతనేమో తొందర పడే మనిషికాదు-ఇట్లా ఎందుకు చేశాడో మరి? నాతో చెప్పమ్మా ఏదన్నా వుంటే- మీ ఫాదర్లాంటి వాణ్ని."

శ్యామల మాట్లాడలేదు. రాతి బొమ్మలాగా నించుంది. దుఃఖం పొంగి వస్తూంది.

"సరేలే. నేనెళ్ళొస్తా. ఇప్పుడో ఇహనో వస్తాడనే అనుకుందాం. రాగానే కాస్త కనబడమని చెప్పు."

వెళ్ళాడు.

ఈసారి శ్యామలకు దుఃఖం ఆగలేదు. ఏడ్చేడ్చి అలసిపోయిందామె. ఏదీ మామూలుగా జరగటంలేదు! మూడు రోజులు మూడుయుగాలైనై. ఇది ఇంకా ఇలాదేనికి దారితీస్తుందో! పోట్లాడుకున్నారనికూడా అనుకుంటున్నారన్న మాట. ఇది అక్షరాలా హెడ్ గుమాస్తాగారి ఇంట్లోనుంచి వచ్చిన బులెటిన్. సందేహంలేదు. అయితేనేం; ఇది ఆఫీసులో ప్రాకటానికి ఎంతోసేపు పట్టదు శంకరంగారు ఏం చెప్పదల్చుకున్నా గుమాస్తాలందరూ చుట్టూ చేరుతారుట.

గుమాస్తాలందరి మధ్యా ఈ విషయం చెప్పడమూ, వాళ్ళు వప్పుకుని ఇళ్ళలో, ఆ పక్క, ఎదురు ఇళ్ళలో, వాడల్లో చెప్పడమూ, తమకు జరగని గృహకల్లోలం గాథగా రూపొందడం ఊహించుకుంది శ్యామల. ఆమె హృద యం కల్లోలమైంది. ఊహ భయంకర మార్గాలు పట్టింది.

విధి తనను ఎందు కిలా పరిహసిస్తూంది?

తొమ్మిదైంది. భోజనం మీద ఆపేక్ష కలగలేదు. వంటింట్లో అన్నీ చక్కబెట్టుకొని వద్దామని లేచింది. తలుపు చప్పుడైంది, ఉలిక్కిపడింది శ్యామల.

తలుపు తెరుచుకొని వెంకటేశ్వర్లు లోనికి వచ్చాడు. బుట్టతో మామిడి పళ్ళు కాబోలు తీసుకొని రిక్షా అబ్బాయి వెనకాలే వచ్చాడు.

"సారీ శ్యామలా; చెప్పకుండా వెళ్ళాను!" అంటూ వెంకటేశ్వర్లు గది లోకి వెళ్ళాడు.

శ్యామల ఎక్కడున్న దక్కడే నిలబడిపోయింది.

వెంకటేశ్వర్లు రెండు నిమిషాల్లో ఇవతలి కొచ్చాడు బట్టలు మార్చుకుని.

"కాళ్ళు కడుక్కోండి."

"ఏమిటి భోజనమా? ఊహుం. దార్లోనే ఆగి హోటల్లో తినొచ్చాను; మళ్ళీ యింత రాత్రప్పుడు నువ్వేమవస్థ పడతావనీ-

శ్యామల మళ్ళీ అదిరి పడ్డది.

"నన్నెందుకిలా అన్యాయం చేస్తున్నారూ?" అని అడిగింది. అణుచుకో లేని భావాలను తెలియజేయటానికి ప్రారంభించిన ఈ వాక్యం బరువుగా ముక్క ముక్కలుగా వచ్చింది. ఆమెకు ఏడుపు ఆగలేదు;

"ఛా,ఛా; ఏడుస్తావేం !" అన్నాడు వెంకటేశ్వర్లు దగ్గరగావచ్చి.

"నాకు తెలుసు, నాకేం చెప్పకండి, నేను తప్పుచేస్తే నన్ను దండించండి. కాని యిలాగా ?" అని కన్నీళ్ళలోంచి గాద్గద్యంలోంచి అన్నది.

వెంకటేశ్వర్లు నీరయిపోయినాడు. దుఃఖించటానికి శ్యామల కెంత అనుభవం లేదో ఊరడించటానికి అతనికి అంతకంటే అనుభవం లేదు.

"లేదు శ్యామలా- నువ్వేం తప్పుచేశావూ? ఛీ ఛీ; తప్పు కాదూ- ఏమిటా మాటలు? నేను చెప్పకుండా వెళ్ళినందుకేగా! పాపం మూడు రోజులూ పూట పూటా వొండుకునిచూశావు కాబోలేం-?, సారీ శ్యామలా! మనం కాకినాడెళ్ళే ముందు అమ్మ నూతి దగ్గర కాలుజారి పడిందనీ లెటరొచ్చిందిగా? చూదామని మావూరెళ్ళాను. కాకినాణ్ణించి వొచ్చేప్పుడే దిగుదామంటే మనసొప్పలేదు. సరిగ్గా పంధొమ్మిదికి డ్యూటీలో ఉండాలని సబ్కలెక్టరు ముందుగా చెప్పాడు. బందర్లో కాన్ఫరెన్సు అయినాక ఈ రెండు రోజులూ పబ్లిక్ హాలీడేస్ కదాని

అడిగితే పోయి రమ్మన్నాడు. అబ్బ! ఎట్లా అయిపోయినావు- ఏమిటీ కళ్ళు! ఎంతసేపట్నుంచీ ఏడుస్తున్నావ్?"

శ్యామల శరీరమే ఆత్మైపోయింది. భర్తకేసి ఒక్కసారి చూసి కాళ్ళ దగ్గర చతికిల బడ్డది, రెండు కాళ్ళనూ పెనవేసుకుని "నన్ను క్షమించండి. మీ మనస్సు కష్టపెట్టాను. తప్పు చేశాను, పాపిష్టిదాన్ని..." అన్నది అతని మోకాళ్ళమీద తల ఆనించి,

అక్కడికి విడుదలైన నిట్టూర్పులో భూభారంఅంతా ఉంది. పాతాళ లంలో కాలిన హృదయం పశ్చాత్తాప వాహినిలో ప్రక్షాళితమైనట్లు శ్యామల తేలిక పడింది.

"ఏ తప్పూలేదు- లేలే అన్నం తిందువు గాని" అన్నాడు వెంకటేశ్వర్లు ఆమెను లేవదీస్తూ,

*

---

ముళ్ళపూడి వెంకట రమణ గారికి ఈ కథ అంటే చాలా ఇష్టం, ఎప్పుడో ఒకనాడు ఈ కథ ఆధారంగా ఒకసినిమా తీస్తానని అంటూ వుండే వారు.

'చాందినీ- కీ-ఛాయా' అనే పేరుతో ఈ కథ హిందీలోకి వెళ్లి "తెలుగూ-కే-ప్రతినిధి- కహానియా" అనే కథా సంపుటంలో అచ్చయింది. ప్రచురణ కర్తలు: "దక్షిణ భారతహిందీ ప్రచారసభ" ఆ పుస్తకాన్ని పాఠ్యగ్రంధంగా పెట్టించి లక్షల కొద్దీ కాపీలు అమ్ముకున్న ఆ హిందీ భాషా సేవా సంస్థ వారు నా కథ హిందీలోకి తర్జుమా చేయిస్తున్నామని నాకు చెప్పడంగాని, హిందీ ప్రచారానికీ పుస్తకంవల్లా వచ్చిన నిధులనుంచి నాకో తృణమో పణమో ముట్ట చెప్పడం గాని, చెయ్యలేదు, పైగా-ఏమర్రా ఇలా చేసేరు-అని నేను ఉత్తరం రాస్తేకూడా సమాధానం లేదు. 'హిందీ' దేశానికి ఎంత స్వాతంత్ర్యం ఉన్నా ఇంతలాంటి "కాపీ (చేసే) రైటు" రైటు కాదేమో అని నాకు అనిపిస్తూ వుంటుంది.

("జ్యోతి" మాసపత్రిక ప్రమోద సంచిక, 1990)

# ప్రతి రాత్రి వసంతరాత్రి

"అతన్ని నేను కూడా ఎరుగుదును" అంది వసంత.

"అంటే; అతనంటే నీ కిష్టమే అన్నమాట" అన్నాను పెద్దతనపు నవ్వు వొలకబోస్తూ.

"ఏమో, ఆ సంగతి నాకేం తెలుసు!?" అని వసంత ఆవలించి చిటికె కూడా వేసుకుని లేచి వెళ్ళిపోయింది.

వసంతకి ఇరవై ఆరో ఏడు నడుస్తోంది. అహమ్మదాబాద్‌లో మా బావ గారు పనిచేస్తున్న సంస్థలో ఏదో చిన్న పుద్యోగం చేస్తోంది: మూడేళ్ళనుంచీను.

వసంత నా కోడలు కావలిసింది, అసలు. ఐదేళ్ళ కిందట మా ఆవిడ ద్వారానూ మా చెల్లెలి ద్వారానూ ఆ అవకాశం తప్పిపోయింది. నా వృద్ధాప్యంలో నన్ను అపేక్షగా చూసుకోగల పిల్ల పరాయిది అయిపోయింది.

"బిడిపి దీపం పెట్టొచ్చు" లాంటి నానుడులు పుట్టడానికి వసంతలాంటి ఆడపిల్లలే కారణం అయివుండాలి. కట్టూ బొట్టూ తలకట్టూ ఆడపిల్ల అందానికి వన్నెతెస్తాయంటారు. కాని వసంత సంగతి వేరు. దాని వొంటిపున్న కాంతి, లావణ్యం ఎలాటివంటేను, అదీ ఎలాంటి బట్టలు కట్టుకున్నా ఆ బట్టలకి, తను జుట్టు ఎలా సవరించుకుంటే ఆ పద్ధతికి–వన్నెలు తెచ్చి మిగతా వాళ్ళలో ఆ అభిరుచిని ప్రవేశపెట్టే రకంవి, అవి.

సన్నంగా ఉన్నా పుష్టిగా, పొడుగ్గా ఉన్నా లలితంగా, చామనచాయగా ఉన్నా మెరుగ్గా, ఉండే వసంత; కేవలం విద్య యొసగిన వినయం వల్ల, పెద్దల యెడ గౌరవం మూలాన్నించి ఏర్పడిన మొహమాటం వల్ల, మా అబ్బాయి మీద

తనకున్న ఇష్టాన్నీ నామీద తనకున్న ఆపేక్షనీ దాచేసుకుని, వాడు చేజారి పోతూ ఉంటే చూస్తూ వూరుకుండిపోయింది. అప్పుడు వసంతకి ఇరవై ఒకటి,

బావగారు అహమ్మదాబాద్‌లో ఉద్యోగంలో చేరిన కొత్తలో పుట్టింది వసంత. అగ్రహారంలో తాతగారింటిలో దాని బాల్యం గడిచింది. తాతగారూ నాయనమ్మా వసంతని ముద్దు చేసేరేగాని చదవ్వేయ్యలేదు. చదవ్వేస్తే ఉన్న

మతి పోతుందని భయం చేత కాదు, ఆడపిల్లలు చదువుకోనేకూడదని ఆ తాత గారూ నాయనమ్మా నమ్మడం వల్ల. రెండేళ్ళ మా చెల్లెలి అత్తవారితో దెబ్బ లాడగా దెబ్బలాడగా వసంతని విశాఖపట్నంలో మా ఇంటిలో వుంచి చదువులో ప్రవేశపెట్టడాని కొప్పుకున్నారు. ఏడోయేట బళ్లో చేరినా, అప్పటికే వాళ్ళ నాయనమ్మ నేర్పిన బాల రామాయణం శ్లోకాలు, సుమతీ శతకం, భాస్కర శతకం, కాళహస్తీశ్వర శతకం, భర్తృహరి నీతిశతకం అన్నీ కంఠతా రావడం వల్ల, పెద్ద బాలశిక్షలో ఉన్నపాటి లోకజ్ఞానం గళగ్రాహి అవడం వల్ల, అన్ని క్లాసుల్లోనూ నిజ్ఞానదీపంగా వెలిగిందిగాని, ఇరవై ఒకటో ఏట ఇంకా బి. కాం. సెకండియర్‌లోనే ఉండిపోయింది.

మా అబ్బాయి అప్పటికి ఎమ్. కాం. ఫస్టుక్లాసులో పాసై, స్టాటిస్టిక్సులో ఒక డిప్లొమా, మేనేజిమెంటులో ఒక సర్టిఫికేటూ సంపాదించుకోడం వల్ల కలకత్తాలో ఒక గొప్ప ప్రయివేట్ కంపెనీలో మంచి ఉద్యోగం వచ్చింది. రెండు నెలలు హోటల్లో తిని, మరో రెండు నెలలు వండుకుని తిని ఆలోచనని దెబ్బ తీసేటంతగా ఆరోగ్యాన్ని నష్టపోయి జీతం నష్టంమీద సెలవుపెట్టేసి ఇంటి కొచ్చేడు. "అదేమిట్రా నా తండ్రీ అలా చీపురుపుల్లలాగైపోయేవూ?" అని మా ఆవిడ వాణ్ని పొదివి పట్టుకుని కన్నీళ్లు పెట్టుకుంది. "అక్కడ భోజనం సరిగా లేదమ్మా. ఏముంది, వారం రోజుల్లో నీ చేతి వంటతో మళ్ళీ మామూలుగా అయిపోతాన్లే" అన్నాడు.

"మనకెలాగూ వంట మనిషుంది కదా, నేను నానిగాడితో వెళ్ళిపోతానండీ:" అంది మా ఆవిడ, పదిరోజుల తరవాత కంపెనీ వాళ్ళిచ్చిన టెలిగ్రాం చూసుకుని వాడు ప్రయాణం అవుతూవుంటేను.

మామూలుగా అయితే "పిల్లాడికి పాతికేళ్ళు వెళ్లిపోయాయి కదండీ. ఏ వయస్సులో ముచ్చట ఆ వయస్సులో జరగాలి కదా, వాడికి పెళ్ళి చేసేద్దామండీ" అనవలసిన మా ఆవిడ ఇలా అనేసరికి నాకు తల తిరిగిపోయింది. "నువ్వెళ్తే సమస్య కొంతతీరుతుందనుకో గాని, అలా ఎన్నాళ్ళని? వాడికి పెళ్ళి చేసీడమే రైటు." అని నేనే అనవలిసొచ్చింది!

"అంత అర్జంటుగా సరైన పిల్ల దొరకొద్దూ?" అంది మా ఆవిడ.

"చంకలో పిల్లని పెట్టుకుని వూరంతా వెతికిందిట నీలాటిదే, ఎవత్తో!" అన్నాను.

"హవ్వ!" అని అరి చేతి దొప్పతో నోరు కొట్టుకుంది మా ఆవిడ.

"ఎదురు మేనరికం అచ్చిరాదన్న సంగతి కూడా మీకు తట్టలేదంటే మీ ప్రయోజకత్వం తెలుస్తూనే వుంది. పైగా వసంతకి దేశం కాని దేశంలో ఇల్లు దిద్దుకునే వయస్సేదీ?" అని నా ప్రతిపాదనని వీటో చేసేసింది. సరిగ్గా ఆ రాత్రే అగ్రహారం వెళ్ళిన మా బావగారూ, చెల్లెలూ వసంతా దిగేరు, అహమ్మదాబాదు వెళ్తూ. మా చెల్లీ మా ఆవిడా చెరో అయిదు వందల నోళ్ళు పెట్టుకుని వసంతకీ మా అబ్బాయికీ పెళ్ళిచెయ్యడం శ్రేయస్కరం కాదని వేనోళ్ళతో ఖండించేరు. వీళ్ళ దృక్పథం మారాలంటే కొంచెం వ్యవధి కావాలని నేను అనుకుంటూ వసంతకి మెల్లిగా బ్రెయిన్ వాషింగ్ ఇచ్చేను, కలకత్తాలాంటి నగరంతో చిలకలూ గోరింకలూ ఎంత ఆనందంగా కాలం గడుపుతాయో చెప్తూ మా అబ్బాయి మంచితనం గురించి ప్రశంసలు చేస్తూ. "పో మామయ్యా, నన్నడుగుతావేమిటీ?" అని వసంత మొహం అటు తిప్పుకుని ముసి ముసిగా నవ్వుకునే స్థితికి తీసుకొచ్చిన వేళకి, "ఇక్కడొక మంచి సంబంధం కుదిరేటట్టుగా వుంది గనక. వసంతకి ఈ పదో తారీకునుంచీ వేసంగి సెలవలే కనకా డబ్బు ఖర్చు ఎక్కువయినా సరే పదకొండో తారీకు ప్లయిట్‌లో దాన్ని ఇక్కడికి పంపించు" అంటూ బావగారు రాసిన ఉత్తరం వచ్చింది.

ఆ తరవాత నెలరోజులకి అహమ్మదాబాదు నుంచి వసంతా, కలకత్తా నుంచి మా వాడు పనిచేస్తున్న కంపెనీ జనరల్ మేనేజరు శేషాద్రిగారూ ఒక్కరోజునే విశాఖపట్నం చేరారు, శేషాద్రిగారు వాళ్ళమ్మాయీ మా అబ్బాయీ వొకర్నొకరు బాగా యిష్టపడిన సంగతి చెబుతూ "ప్రస్తుత పరిస్థితుల్లో మీ అబ్బాయి మా అమ్మాయిని పెళ్ళి చేసుకోడమే ఉత్తమం" అని నచ్చజెప్పడం అయింది. "మీవాడు రెండు నెలల్లో డిప్యూటీ మేనేజర్ కావడం నాపూచీ, పైగా, మాకువున్నది ఒక్క ఆడపిల్ల! అంచేత అతను వేరే ఇల్లుకూడా కట్టుకో అక్కర్లేదు. అతను తెచ్చుకునే జీతం నెలనెలా మొత్తం మీకు పంపేసినా దేనికీ యిబ్బందిపడడు" అన్నాడు శేషాద్రిగారు మా ఆవిడతో డైరెక్టుగా.

"ఆయనేమిటంటున్నారు మామయ్యా?" అంది వసంత నాతో ఎవళ్ళూ లేకండా చూసి.

"ఆఁ, ఏదో పెళ్ళి సంబంధంలేవే, బావకి!" అన్నాను తేలిగ్గా.

"బావని అడగక్కర్లేదా?" అని వసంత అడిగిన ప్రశ్న నాకు గట్టిగా గుచ్చుకుంది గాని మా ఆవిడా మా అబ్బాయీ కలిసి ఆ పూచిక ముల్లుని సునాయాసంగా తీసేసేరు.

నాటికి నేడు బావగారు చెప్పా చెయ్యకుండా వసంతని తీసుకుని హటాత్తుగా దిగేరు.

"ఎదురు మేనరికం అని మావాణ్ని అప్పట్లో వొదిలేశారు. గోత్రం వొకటైపోయిందని సుబ్బారావుగారబ్బాయిని జార్చేసేరు, నియ్యోగుల ఇంటిలో ఎలా యిస్తామంటూ సీతారామయ్యగారి పిల్లాణ్ణి కాదనీసేరు. వసంత అంటే నా కెంత వాత్సల్యం ఉన్నా, మీరందరూ కూడి ఇలా నేను తెచ్చిన ప్రతీ సంబంధాన్నీ తూలగొట్టేస్తూ వుంటే ఇంక నేనేమిటి చెయ్యడం?" అని బావగార్ని నిష్ఠూరం ఆడేను.

"అన్నీ నిజమేనయ్యా! పొరపాటే అయిపోయింది. ఇప్పుడు నువ్వు కూడా దీనికి సంబంధాలు చూడ్డం నావల్ల కాదంటూ తప్పుకుంటే అంత దూరాభారాన్నుంచి నేనేం ప్రయత్నాలు చెయ్యగల్ను? దీనికేమో తెల్లవారితే ఇరవై ఆరేళ్లు వెళ్ళిపోతాయి. బీకామ్ పేసైంది కనక దీనికన్నా ఎక్కువ చదివినవాడికే ఇచ్చి చెయ్యాలనుంటుంది. అ లెక్కని ఏ ముప్పయ్యేళ్ళవాడో కనీసం పోస్టుగ్రాడ్యుయేటో ఖాళీగా దొరకాలి మనకి, ఇంతకీ వసంత పుట్టడం అయితే మా యింటిలోనే పుట్టినా పెరగడం మీ రక్షలోనే కద! నువ్వే దాని తండ్రివి, అక్కగారే దానికి తల్లి. అంచేత ఇంక ఈ వ్యవహారం నువ్వు తేల్చవలసిందే తప్ప ఇది నావల్ల అయ్యేపనికాదు గాక కాదు" అన్నారు బావగారు.

"ఉన్నట్టుండి నేనెక్కడి సంబంధం చూసీగల్ను? పెళ్ళి కొడుకంటే బీరువాలో ఉన్న ఇస్త్రీ చొక్కా కాదుగదా. పోనీ వసంతని ఇక్కడే వొదిలేసున్నా బావుండేది. చదువై పోయిందని అక్కడికి లాక్కెళ్ళేవు. ఉట్టినే కూచోడం ఎందుకని దాని నెత్తిమీదికో ఉద్యోగం తెచ్చిపెట్టేవు. ఆ సాకుతో ఒకటీ ఈ నెపంపెట్టి ఒకటీ దానికొచ్చిన సంబంధాలన్నీ తూల గొట్టేసేరు. ఇప్పుడుట, నేనుట, వసంతకి సంబంధం చూడాలిట!" అన్నాను.

"అదే చెప్తున్నాను. వారణాసి నరిసింహంగారబ్బాయి కామేశ్వర్రావు ఈ వూళ్ళోనే ఏదో ఉద్యోగం చేసుకుంటున్నాడని తెలిసింది నాకు. అతనికింకా పెళ్ళి కాలేదుట. కిందటేడు వరకూ వాళ్ళ చెల్లెలి పెళ్ళయితే తప్పా చేసుకోనంటూ ఆగేడుట, ఇంతట్లోకి వాళ్ళమ్మగారు పోవడం వల్ల ఏడాది సూతకం వొచ్చి ఆగేడుట. ఈ నెలాఖర్ని వాళ్ళమ్మగారి సాంవత్సరీకం అయిపోగానే పెళ్ళి చేసుకునే ఉద్దేశంలో ఉన్నాడని తెలిసింది. ఆ పిల్లాడు కొన్నాళ్ళు నీ స్టూడెంటుట కదా! పైగా, కట్నాలూ కానుకలూ తీసుకోకూడదని ఉపన్యాసా

లిచ్చి వ్యాసాలు రాసి బహుమతులు తెచ్చుకున్నాట్ట. నువ్వు చెబితే తప్పకుండా వింటాడని బోలెడు ఆశపెట్టుకుని వొచ్చాను, కట్నం వొద్దని అతను అంటే కూడా మనకి కలిగిన కాడికి మనం ఇష్టపూర్వకంగా ఇస్తే కాదంటాడా అని నా ఐడియా. ఎలాగో మాటలు నడిపి వ్యవహారం సానుకూలం చెయ్యి బావా: నువ్వే కన్యధారపోసి పుణ్యం కట్టుకుందువుగాని!" అన్నారు బావగారు.

"ఆ అబ్బాయికి వయస్సయితే ముప్పయ్యేకటే గాని—"అని కొంచెం ఆంకేను.

"కాని, ఏమిటిరా?"

"కానీ ఏముంది? ముప్పయ్యేళ్ళకే బట్ట తలొచ్చేసింది అతగాడికి. చూసీ చూడగానే ఇదేదో రెండో పెళ్ళి బాపతులా ఉన్నాదని ఎవరికైనా అనిపించేస్తుంది. కాకి ముక్కుకి—"అని ఆ మీది మాట అన్లేదు నేను: ఊరికే వసంత వేపు మొహం తిప్పేను.

"అతన్ని నేను కూడా ఎరుగుదును." అంది వసంత.

* * *

కామేశ్వర్రావు ఈ వూళ్ళోనే ఉన్నాడని నాకు తెలుసుగాని అతన్ని ఈ దృష్టితో నేనెన్నడూ చూళ్ళేదు, బావగారి ఆశావాదం పూర్తిగా సమర్థనీయం కాదుగాని మరీ అంత నిరర్థకం కూడా కాదవి అనిపించింది. నాలుగు పాయింట్లూ ఆలోచించేక. అందుకని రంగంలో దిగేను,

ఎమ్మెస్సీ పాసయ్యేక కామేశ్వర్రావు బయోకెమిస్ట్రీలో చిన్నకోర్సుచేసి మెడికల్ రిప్రెజెంటేటివుగా కుదురుకున్నాడని తెలిసింది. ద్వారకానగర్లో నెలకి ఏడువందలరూపాయల అద్దె ఇస్తూ ఒక చిన్నయింట్లో సగం వాటాలో ఉంటున్నాడు. ఇన్నాళ్ళూ చెల్లెలి పెళ్ళికోసం ఆగడంవల్ల ఇంకా స్కూటరూ టీవీ అమిర్చుకోలేదు. కంపెనీవాళ్ళు పెట్టించిన టెలిఫోనుంది. తల్లిపోయాక మేనమామా అత్తా వొచ్చి అతనితో ఉన్నారు. వాళ్ళకి పిల్లల్లేరు.

"కామేశ కేంపెళ్ళాడు. ఏమిటి, పని?" అని అడిగేడు, నేను చేసిన ఫోన్కాల్ తీసుకున్న ఆ మేనమామ. "అది ఫోన్లో చెప్పే భోగట్టాకాదు. నేనొచ్చి మాట్లాడతాను." అని వెంటనే బయలుదేరి వెళ్ళేను,

"వాడికి పెళ్ళి చెయ్యాలనే చూస్తున్నాం సార్. మీరు విన్నదంతా నిజమే. ఈ నెలా ఖర్నే మా చెల్లెలి సంవత్సరీకాలై పోతే సూతకం గడిచి పెళ్ళికి పచ్చ జెండా వూగుతుంది." అని నా సంగతి, బావగారి సంగతి, మా వసంత సంగతి

వివరంగా అడిగేరు, దంపతులిద్దరూనూ. పిల్ల అందం, అణకువా, విద్య, వినయం. సంప్రదాయం, సంపదా వర్ణించి చెప్తే ఎంతో ఆశగా అపేక్షగావిన్నారు. బావుందంటే బావుందన్నారు. "మళ్ళీ దయ చెయ్యాలి తమరు, అబ్బాయి కేంప్ నించి ఈ రాత్రికే రావాలి మరి" అన్నారు,

"మా పిల్లని చేసుకోవాలేగాని అదృష్టం అంటే అతన్దే అవుతుంది." అన్నాను. "ప్రతిరాత్రి వసంతరాత్రి అని పాడుకోడమే ఆ అబ్బాయి పని!" అందామనుకున్నాను గాని అంత పొయిట్రీకి వాళ్ళు తట్టుకోగలరని అనిపించక నోరు కట్టేసుకున్నాను,

ఆ ఇంటి గుమ్మందిగి నాలుగడుగులు నడిచేసరికి నాకు వెనగ్గా ఒక జీపు ఆగింది. "ఏమిట్రోయి సంగతి? కొంపతీసి ఈ ఇంట్లో వున్న కామేశ్వ్రరావుతో పెళ్ళి సమ్మంధం మాటాడ్డానికి గాని రాలేదు కద! అయినా, నా తెలివి తెల్లారా, నీకు ఆడపిల్లలు లేరు గద, బతికిపోయేవు—ఫో!........రా, జీపులో కూర్చో: ఇంటిదగ్గిర దింపేస్తాను, నేనూ అటే వెళ్తున్నాన్లే." అన్నాడు. డ్రయివర్ సీట్లో కూర్చున్న నా స్నేహితుడు సర్వేశ్వరశాస్త్రి.

ఉత్సాహం సాయంగా అంతా వివరించేను, శాస్త్రికి.

"వాళ్ళతో నువ్వెక్కడ తూగ్గలవురా?—నువ్వంటే నువ్వుకాదు. మీ బావగారే అయెను! కామేశ్వ్రరావుకి తండ్రి సంపాదించిన ఆస్తి ఎలాగైతే ఏమీ లేదో, బాదరబందీలు కూడా అలాగే ఏమీలేవు. మంచి సంబంధమనే చెప్పుకోవాలి. ఐతే, వాడిప్పుడు ఏ సౌఖ్యం కోసమైనా ఆరునెలలుకాదు, అరగంట కూడా ఆగేటట్టుగా లేడు. కట్నాలూ కానుకలూ తప్పూ అంటూ ఉపన్యాసాలివ్వడం వ్యాసాలు రాయడం అదంతా పాతకథ. వెనకటి రోజుల్లో అయితే చేతి గడియారం, స్కూటరు, ఫ్రిజ్జు, కలర్ టీవీ, వి సి ఆర్, ఇంటి స్తలం;స్వంత ఇల్లు ఇవన్నీ కంఫర్ట్సు, లగ్జరీసూనూ వాటికోసం కొంత చమట వోడ్చి కొన్నాళ్ళు వెయిట్ చేసి ఒకటీ వొకటీ సంపాదించుకోడానికి ప్రయత్నం చేసే లక్షణం ఉండేది. నీ మట్టుకు నువ్వు సర్వీసులో చేరిన ఏడేళ్ళకి కదా మొదటిసారిగా రేడియో కొనుక్కున్నావు! అదీనీ వాయిదాల పద్ధతిమీద కొన్నావని కూడా నాకు తెలుసును. ఇప్పుడు అవన్నీ తక్షణం నెరవేరవలసిన కోరికలై కూర్చున్నాయి. పెళ్ళయిన మర్నాటి ఉదయానికే అవన్నీ వొచ్చి ఇంట్లో అమిరిపోవాలి. మా అమ్మాయిని ఇద్దామని మాట్లాడితే బైటపడ్డారు. వాళ్ళు. ఇంటి స్థలం కొనిఇవ్వాలి. ఇల్లు కట్టడానికి అవసరం అయినంత డబ్బు ముట్టచెప్పాలి.

ఇంట్లో పేర్చుకుందికి ఈ అధునాతనమైన సామగ్రి, సుఖదాయకమైన వస్తు సముదాయం అంతా ఇమీడియెట్‌గా జతపరచాలి. అవన్నీ పెట్టించే ఖర్చుల కోసం తను ఒక్కడూ తెస్తున్న జీతం సరిపోదు కనక అమ్మాయికూడా నెలకో రెండువేలు తెచ్చే ఉద్యోగం ఏదైనా చేస్తే మంచిది. నువ్వూ నేనూ అయితే జీతాల్లో కానీ పరకా మిగిల్చి ముందు పుస్తకాలూ, క్రమంగా రేడియో, కొన్నేళ్ళ తరవాత చేతిగడియారం దగ్గర్నుంచీ అన్నీ ఇలా కొనుక్కున్నాం. ఇప్పుడు అదంతా మారిపోయింది.

"మెళ్లో మొగతనపు చిహ్నం ఉండి చేతిలో మెట్రిక్లేషన్ సర్టిఫికేటు ఉంటే చాలు, లక్షదాటుతోంది ఆశ! నేను మొగ పుట్టుక పుట్టేను, నన్నూ నా శక్తిసామర్థ్యాలనీ నమ్మి నా ఇల్లాలుగా రావడానికి సిద్ధపడే ఆడపిల్ల అంటూ ఉంటే అది నా పట్ల చూపించే ప్రేమకీ అపేక్షకీ కనీస ప్రతిఫలంగా దానికి రెండుపూటలా ఇంత అన్నంపెట్టి ఏడాదికో చీరకొనే మొగతనం నాకు ఉన్నాది–అనే ధోరణి మెల్లిమెల్లిగా యువతరం ఆలోచనల్లోంచి తప్పుకుంటోంది రా, గోపాలా! ఇదీ, ఇవాళ్టి వివాహ వ్యవస్థ ఏర్పరచుకుంటున్న నేపథ్యం.ఇంక నీ ఓపిక." అని చావు కబురు చల్లగా చెప్పేడు శాస్త్రి. (చావు కబురు కాదు: పెళ్ళి కబురే.)

* * *

"ఏం ఫరవాలేదు లెండి బావగారూ! ఎలాగోలాగ బేరమాడి సెటిల్ చేద్దాం. ఊరికే బెంగ పెట్టుకూర్చుంటే పన్లు అవుతాయా? మీరు మీ పన్లు చేసు కొంటూ ఉండండి. ఇంకా నయం కాదూ? ఇప్పటికైనా వసంతని ఇక్కడ వొదిలి వెళుతున్నారు!" అని ధైర్యం చెప్పి ఆయన్ని ఆ రాత్రి కోణార్క ఎక్స్‌ప్రెస్ ఎక్కించి ఇంటి కొచ్చేను.

రాత్రి రెండుస్నరదాటింది. ఐనా నిద్దర రాలేదు. నెత్తిమీద పడ్డ బాధ్యతని చూసి బెదిరిపోయి నిద్దర చెడుర్చుకొనే తత్వం కాదు, నాది, బాధ్యత నెరవేర్చే అవకాశం దొరికినందుకు ఆనందించే తత్వమే తప్ప, "నువ్వెళ్ళి మీ అత్తతో బాటుగా గదిలో పడుకోవే, వసంతా!" అని నేను హాల్లో సోఫా–కం–బెడ్డుమీద వాలేను. పక్కనే ఉన్న పెద్దలైటు స్విచ్చి ఆఫ్ చేసేనుగాని, సరిగ్గా ఎదురు గుండా గోడకి వేలాడుతున్న గ్రూప్‌ఫొటో మీద పడిన అప్రయత్నమైన దృష్టి ఆ దృశ్యాన్ని మరోసారి చూడమంటే మళ్ళా స్విచ్‌ని ఆన్‌చేసేను.

ఆ గ్రూప్‌ఫోటో ఆరేళ్ళనాటిది, అందులో ఐదుగురం ఉన్నాం, మంచి

ఎన్లార్జిమెంటు అది. "ఎడమనుండి కుడికి వరుసగా" మా ఆవిడ నేను,వసంత, మా చెల్లెలు, మా అబ్బాయి. మా ఆవిడ చిరునవ్వులో ఉన్నది గడుసుతనమో చిలిపితనమో నాకు ఆ ఫోటో ఎన్ని వందల సార్లు చూసినా అర్థంకాదు. నా పక్కని నుంచున్న వసంత ఇంచు మించు నా అంత ఎత్తు. ఎవరో ఫోటో తీస్తారేమో అని బిగుసుకు పోయే రకం కాదు, వసంత, చనువుగా నా బుజం మీద చెయ్యేసి నుంచుంది. దానికి బేలన్స్‌గా మాచెల్లెలు మా అబ్బాయి జబ్బ పట్టుకుని ముందుకి కొద్దిగా వొంగి వుంది. మా అబ్బాయి కెమెరా లెన్స్ వైపు కాకుండా ఇటువేపుకే చూస్తున్నాడు కాని, అది నావేపు కావచ్చు, మా ఆవిడ వేపు కావచ్చు; అంతే తప్పా వసంత వేపు అని అనిపించదు.

ఆ పక్కని అన్నీ వసంత ఫోటోలు. ఐదేళ్ల పిల్లగా ఉన్నప్పుడు జబ్బల్తో, కండల్తో, బుగ్గల్తో పుష్టిగా ఉన్నప్పటిది ఒకటి; పదేళ్ల వయసప్పుడు లాగూ గవునూ మానేసి పరికిణీ జాకెట్టూ వేసుకున్న కొత్తల్లోది; గిర్రున తిరిగి చప్పున కూచున్నపుడు పరికిణీ బుట్టలా పరుచుకుంటే రపీ మని స్నాప్ కొట్టినది. ఆతరవాత వసంతకి ఇరవై ఒక్క ఏళ్లప్పుడు మా అబ్బాయీ కోడలూ తనూ స్టూడియో కెళ్లి తీయించుకున్నది. దానికవతల ఆ మరుసటి ఏడాది వసంత డిగ్రీ పాస్ అనిపించుకున్నప్పుడు అద్దెగౌనూ అద్దెటోపీ వేసుకుని కాన్వొకేషన్ హాల్ లాన్స్‌లో తీయించుకున్నది. బహుశా అప్పుడు నేను చేసిన వేళాకోళం— "ఓసే వసంతా, నీ తల ఇంత ఫ్లాట్‌గా తయారైందేమే" అన్నది వసంతకి గుర్తు రాక పోతే బావుండును.

నా దగ్గిర పెరిగి నా అపేక్షకీ వాత్సల్యానికీ పాత్రురాలైన వసంత. కామన్ సెన్స్ అంటే కామన్‌గా ఎవరికీ ఉండని సెన్స్ అని నేనంటే స్పందించిన వసంత. పన్నెండేళ్ల వయస్సు దాటినా అర్థ రాత్రి దాటేక నా పక్కలోకి చేరి "మామయ్యా నీదెగ్గిర పడుకోవొద్దా- అంటూ"నాకొక చిన్నారి బిడ్డ, నన్ను అపేక్షగా గౌరవంగా చూసే ఆడపేగు ఉందిలే- అనే ధైర్యం కలగ జేసిన వసంత. "నాకా బట్టల మిల్లులో ఉద్యోగం ఎందుకు మామయ్యా నీ సెక్రెటరీగా వేసీసుకుంటే బావుణ్ణు కదా"అని నన్ను గొప్ప మానసిక సుఖం కోసం ప్రలోభ పెట్టిన వసంత.

ఎంతకని చూసేది! కాని ఎలా మరిచి పోయేది? ఎవడి కిచ్చిముడి పెడతానో గాని, వాడికి అర్హత ఉన్నా లేకపోయినా వాడి జీవితం "ప్రతి రాత్రి వసంతరాత్రి" అని "పాటలాగ పాడాలి."....

ం ం ం

"ఎంతమాట అన్నారు మేష్టారూ! మీరు నిజంగా నమ్మే అన్నారా, మేష్టారూ? మీ రవన్నీ నమ్మితే అంతకన్నా అవమానం నాకు వేరే ఉండదు మేష్టారూ. ఇప్పుడు మీరు లెక్చరరు కాక పోవచ్చు. నేను స్టూడెంట్ కానీక పోవచ్చు. కాని మన మధ్య ఉన్న గురుశిష్యబంధం —డోంట్యు థింక్ ఇటీజ్ సమ్ థింగ్ ఇటర్నల్?"

"మరి ఊరంతా అనుకుంటున్నారే, నీకు ఆశ ఎక్కువ అని?"

"అలా ప్రచారంలో పెట్టవలసొచ్చిందనే మీరు కూడా నమ్మరు మేష్టారూ! ఒకఫైవ్ స్టార్ హోటల్ ఉందనుకోండి, అక్కడ ప్లేటు ఇడ్లీ ధర ఎంతుం టుంది? ఎనిమిది రూపాయలుండొచ్చు. నోటుసే—అడ్డమైన వాళ్ళూ వచ్చేసి ఇడ్లీ పట్రా - సాంబారు ఇంకొంచెం పొయ్యి - అని న్యూసెన్స్ చేసీకుండా ఆ ధరల్యలా ఫిక్స్ చేసి అన్ వాంటెడ్ క్రౌడ్‌ని దూరంగా ఉంచుతారేతప్ప అది రియల్ కాదు, మేష్టారూ!— నిజం, మీరెలా చెప్తే అలాగే! మీ మేనకోడలికి నా ఆకారం అసహ్యం కాకపోతే నా కంతేచాలు. మిగిలిన మర్యాదలన్నీ బాష్. బంకమ్, ఏర్ బబుల్!"

"థేంక్యు, థేంక్యు మైచైల్డ్!!" అని ఆనందంగా అరిచాను

"ఛి, ఛి! ఏంటి మామయ్యా, చూడు! నేను, వసంతని. చైల్డ్‌కాదు! "గో మేన్," "అరెలుక్ హియర్, మేన్," అంటావే— ఆ మేన్!"

కళ్లు తెరిచాను. వసంత చెయ్యివదిలెయ్యాలని అప్పటికి గానీతట్టలేదు....

"సారీ, వసంతా! ఏదో కల— నేనొక మొగ అబ్బాయికి షేక్హాండిస్తు న్నట్టు—"

"సర్లె," అంది వసంత అల్లరిగా బుంగమూతి పెట్టి, "నాకొచ్చినకల నువ్వేచూసినట్టు మాట్లాడు తున్నావు."

"నీకా, కలా? ఏంటది?"

వసంత ఓ పట్టాన చెప్పరేదు, తనకొచ్చిన కల ఏమిటో,

రాత్రి టి.వి.లో సెక్స్ మార్పిడి ఆపరేషన్ గురించి చూపించేరు, ఆ సంగతి నాకు గుర్తుచెయ్యటం కోసం బోలెడు డొంకతిరుగుడు పెట్టింది.

"నువ్వేమో, నన్ను వొదిలించు కోవాలని—........ కేరళా తీస్కెళ్లి— ........ అదేదో హాస్పటల్లో ........ ఆపరేషన్.... చేయిం చేశావట........ నేనేమో అబ్బాయినైపోయానట! *

("ఆంధ్రప్రభ" వీక్లీ: ఫిబ్రవరి 1972)

# బ్రేక్ డౌన్

పావుగంట అయిపోయింది, కారాగిపోయి.

డ్రైవరు కనకయ్య ఇంజనుని కిందా మీదా పరిశీలించి చూసేడు. అన్నీ బాగానే ఉన్నాయి. కాని, డెల్కో-పాయింట్స్ కాలిపోయాయి.

కనకయ్యకి కారు తోలడంలో ఇరవయ్యేళ్ళ అనుభవం వుంది. ఇలాగే కారెన్నిమాట్లో ఆగిపోయింది. కాని, ఇలా ఇంత నిస్సహాయంగా ఎన్నడూ ఆగిపోలేదు. ఇంతలా తన శక్తికి మించిన దగా ఎన్నడూ జరగలేదు. కలెక్టర్లు మారారు. కార్లు మారాయి. తను మాత్రం ఎప్పుడూ ఇంతలా దొరికిపోలేదు. కారుని సాకల్యంగా పరీక్షిస్తూ గోడు అంతా దఫేదారు సింహాచలంలో వెళ్ళబోసుకున్నాడు.

కలెక్టర్ గోపాల్ కారు వెనుక సీటులో కూర్చుని రెవిన్యూబోర్డు మెంబరుకీ, ఎలెక్ట్రిసిటీ బోర్డు ఛెయిర్మన్‌కీ మధ్య జరిగిన అతి ముఖ్యమైన చర్చల సారాంశం కాగితాలమీద చూస్తున్నాడు. కారు బ్రేక్ డౌన్ అయింది. కాని, కనకయ్యకి బ్రేక్ డౌన్ లేదని అతని నమ్మకం. అందుచేత అతని ఆలోచనకు ఏ అడ్డూ రాలేదు.

పని మానేసి కనకయ్య కారు దగ్గిరకొచ్చి నిలబడేసరికి అతనికి అనుమానం వేసింది. కనకయ్య కళ్ళల్లోకి సూటిగా చూసేడు. ఆ చూపులో "ఇంకా అవలేదూ? ముద్దమొద్దు మొహం" అన్న అధికార పూర్వకమైన గద్దింపు మొదలు; "అప్పుడే అయిపోయిందా! థాంక్స్!" అన్న మెప్పు మాటలూ వున్నాయి. అసలేమీ అర్థం కాకుండా చూడ్డం కలెక్టర్లకి బాగా తెలుస్తుంది. అలాంటి కలెక్టర్లలో గోపాల్ అగ్రగణ్యుడు. అందుకనే ఎలక్ట్రిసిటీ బోర్డు ఛేర్మన్ పెద్దపెద్ద ఇంజినీర్లతో సీలేరులో ఏర్పాటుచేసిన ఆ ఉన్నత శ్రేణి సమావేశానికి రెవెన్యూ మెంబరు వస్తానని ప్రకటించీ కూడా తాను అనివార్య కారణాలవల్ల రాలేకపోతున్నాననీ, తన బదులు కలెక్టర్ శ్రీ గోపాల్ ఆ సమావేశంలో పాల్గొంటా

రనీ. చివరి నిమిషంలో తెలియజేసి, తాను రావడానికి ఇష్టం లేదనో, అవసరం లేదనో తెలియకుండా చేసేడు.

"కారు చెడిపోయింది, బాబూ!"

కాగితాలు చూడ్డం అయిపోయిందన్న ధోరణిలో విసిరికొట్టి "అసలే. జరిగింది?" అన్నాడు కలెక్టర్ గోపాల్ కారుదిగి రోడ్డుమీద అడుగుపెడుతూ

"డెలోక్ర-పాయింట్స్ కాలిపోయాయి, బాబూ."

"బయయిదేరేటప్పుడు చూసుకోనక్కర్లేదా?"

కనకయ్య బయలుదేరేటప్పుడు తానన్నీ జాగ్రత్తగానే చూసుకున్న సంగతి చాలా వినయంతో చెప్పుకున్నాడు. అంతటితో ఆగకుండా ఇలాంటి ప్రమాదం జరగటం ఎప్పుడో గాని జరగదని, కావాలంటే చూడండని బోనెట్ ఎత్తి విషయం అంతా వివరంగా చెప్పేడు.

"వర్క్-షాపు కెళ్తేగాని పని జరగదండి. తోసుకెళ్ళడం కానిపని. మెకానిక్కుని సామాన్లూ గట్రా పట్రమ్మని చెప్పి కబురు తోలెయ్యొచ్చండి" అన్నాడు కనకయ్య.

సీలేరువదిలి పదిహేను మైళ్ళయినా వచ్చేసి ఉంటారు.

రోడ్డుకి ఓవేపు ఎత్తుగా కొండ. రెండోవేపు అగాధంలా లోయ.ఆ లోయ లోతులు తెలిసి కళ్ళు తిరిగి జెంగెట్టుకోకుండా పొదలు. ఇంకా కిందికి పెద్దపెద్ద టేకి చెట్లు.

దూరంగా నేలా నింగీ కలిసేచోట నీలపు జాడ.ఎత్తుగా కొండమీద ఉండ టంవల్ల అ నీలపు జాడ మరీ దూరంగా తోస్తూంది. లెక్కల్లో సూత్రం జ్ఞాపకం వచ్చింది గోపాల్‌కి....డిస్టెన్స్ టు ది అపరెంట్ హొరైజన్.

"కారు బాగయ్యే మార్గంగాని, త్వరగా ప్రయాణం సాగే సూత్రంగాని ఏదీ లేదూ?"

"లేదు, అన్ని బస్సులూ వెళ్ళిపోయాయి. ఆఖరి బస్సు సీలేర్లో బయలు దేరినాకనే కారు బయలుదేరింది. బస్సుని దాటేస్తాం మూణ్నిమిషాలలో అన్న దాకా వచ్చింది. ఆగిపోయి కూర్చుంది కారు. ప్రాజెక్టుకి సామానులు తెచ్చేవాళ్ళు తెల్లారితేగాని బయలుదేరరు. కార్లు ఆ దారిని వచ్చే అవకాశం కనబడదు— కొండ అందాలు చూడ్డానికి వచ్చే కార్లు రావాలి తప్ప. డ్రైవరు కనకయ్యకీ, దఫేదారు సింహాచలానికి కూడా కాళ్ళు విరిచేసినట్టున్న మాటనిజమే. ఏ కారో,

జీపో తగలకపోతుందా. కనీసం వెళ్ళి చింతపల్లిలో పడకపోతామా అని వాళ్ళకి ధీమాగా నేవుంది. కానయితే కలెక్టరు బాబు మాట? ఆ దారంట ఏ కారో, జీపో రావాలేగాని వస్తే కలెక్టరుగారికి 'లిఫ్టు' ఇస్తారు, అందుకు సందేహంలేదు. ఆ మాటకొస్తే ఆ అడవి చూసి చేతులడ్డం పెడితే ఎవరడ్డం పెట్టినా ఆపుతారు,ఎవ రయినా ఆపుతారు.

"నిలబడిపోయారు, బాబూ" అని డ్రైవరు కారు వెనకతలుపు తెరవ బోయాడు.

"లేదులే. లోపల ఉక్కగా ఉంటుంది."

తనకేమో కాళ్ళూ చేతులూ చల్లగా అయిపోయాయి. అందులోనూ సాయంత్రం నడి మధ్యాహ్నం అప్పుడు కూడా చెట్టు నీడలో చలేసినట్టుంటుంది ఆ కొండల మీద. మరి అటువంటిది కలెక్టరు బాబుకి ఉక్కగా ఉండటం ఏమిటి? అవును, మరి! వారు బంగళాల్లో, ఆఫీసులో ఎయిర్ కూలర్ల దగ్గిర కూచునే వారు. మరి ఉక్కగా ఉండదా?

నాలుగడుగులు వేసి కాస్త ముందుకి వచ్చాడు గోపాల్. ఎలక్ట్రిక్ టవర్ లైన్ నడినెత్తి మీదుగా దూరదూరాలకు పోతూంది. తలెత్తి చూశాడు. అతని వెనక నడుస్తున్న సింహాచలం కూడా తలెత్తి చూశాడు అలవాటుగా.

"ఈ ఎలక్ట్రిక్ టవర్ లైన్స్ మీద అక్కడక్కడ టెలిఫోన్స్ ఉంటా యనుకుంటాను. కదూ?"

"అవును బాబూ, సప్పర్లకాడుంది. కాని, పదిమైళ్ళు ఇక్కడికి" అన్నాడు సింహాచలం.

"అక్కడికి నడిచెళ్ళి ఫోన్ చెయ్యడాని కెంత సేపు పడుతుంది?"

డ్రైవరుకూడా వచ్చాడు అక్కడికి.

"మేమిద్దరం ఎళితే తమ రొక్కరూ ఇక్కడుండలేరండి" అన్నాడు డ్రైవరు.

"ఇద్దరూ ఎందుకూ? సింహాచలం వెళతాడు."

"ఈ సందపొద్దుని రోడ్డుమీద ఒక్కరూ ఎళ్ళలేరండి. మంచిదికాదు— జంతువూ గట్రా వచ్చినా చేసినా...."

"అదా.... పోనీ, ఇద్దరూ వెళ్ళండి. కార్లో కూర్చుంటాను. నాకేం భయంలేదు."

"బయట నిలబడ్డమే రైటండి. ఏదైనా కారో లారీయో వస్తే ఆపు చెయ్యచ్చు."

"ఊరుకుందూ నువ్వు మరీనూ— దొరగారొక్కరూ నిలబడితే ఎవ్వడికి తెలుస్తాది?"

అదీ నిజమేననిపించింది గోపాల్‌కి. వాళ్ళులేని సమయంలో ఏదేనా కారు రావచ్చు. చెయ్యి చూపించి కారు ఆపచ్చు, కాని, నేనీజిల్లా కలెక్టర్ని. నర్సీపట్నమో, చింతపల్లో లిఫ్ట్ ఇవ్వండి అని తనంత వాడు అభ్యర్థించడం కష్టాల్లోకెల్లా కష్టం. కార్లుగల తరగతిలో సగం మంది ఇలాంటి కష్టాల్ని నమ్మడం కష్టం, ఆదుకోవడం అంతకన్నా కష్టం.

ఏదో వస్తున్న చప్పుడు వినిపించింది దడదడా, సీలేరువేపు నించే! మాట్లాడకన్నట్టు చూశాడు కలెక్టరు చెవులకి పదును పెట్టి ఆలోచిస్తూ.

"ఆఁ— లారీ వస్తోంది" అన్నాడు కనకయ్య.

"బస్సేమో?" అన్నాడు సింహాచలం.

"చూడు" అని చూపించేడు కనకయ్య.

ఘాట్ రోడ్డుమీద, కిందినించి, ఎగుబోటు పోటుకి ఎగశ్వాసల పొగలు కక్కుకుంటూ, ఆక్రోశించకుంటూ వస్తూందొక లారీ. ముందుగా పొగ తరువాత దానికి ముందుగా లారీ, కనపడేటంత దట్టంగా పొగవిడుస్తోందది. రోడ్డువంపులు కంటికైతే కనపడుతున్నాయి గాని, ఆ లారీ ఈ రెండు ఫర్లాంగుల రోడ్డు ఎక్కి వచ్చేసరికి రెండు నిమిషాలైనా పట్టేలాగుంది.

కనకయ్యా, సింహాచలం రోడ్డు కడ్డంగా నిలబడి చేతులు ఊపేరు.

దవాలావేసుకున్న తెల్లయూనిఫారమ్ బంట్రోతు, దవాలా వేసుకోకుండా కాకీ యూనిఫారమ్‌లో డ్రైవరూ, అల్లంతదూరాన బిస్కట్ కలర్ సూట్లో రాజ ఠీవితో అధికారీ కనపడగానే నిట్టూర్పులు విడుస్తున్న లారీ నీరసంగా నిలబడిపోయింది. కంగారు పడకుండా ధీమాగా నడుచుకుంటూ సింహాచలం లారీ దగ్గరి కెళ్లాడు.

"కలట్రుగారు" అన్నాడు పిడికిలి బిగించి, బొటనవేలితో చూపిస్తూ.

లారీ డ్రైవరు వెంటనే బండి దిగి, "దండాలు బాబయ్యా!" అన్నాడు.

బొట్టికాయ. నిండా పద్దెనిమిదేళ్ళు ఉండవు.... కలెక్టర్ గోపాల్ చెయ్యి ఆడించాడు.

"బండెక్కడిదాకా?" అనడిగాడు కనకయ్య.

"మా బండండీ?" అని కంగారు పడ్డాడు లారీ అబ్బాయి. "దారకొండ మలుపుకాడ లోవలోని పేకు కర్ర కొడతన్నారండి. అక్కడ సైటాల్దయి పోతాది."

చింతపల్లి దాకా మన కార్ని 'టో' చేసుకురమ్మను. దాల్లో ఎక్కడైనా లిఫ్ట్ దొరికితే అక్కడ విడిచి పెట్టేద్దాం, లేకపోతే చింతపల్లిలో వదిలేద్దాం" అన్నాడు కలెక్టర్ గోపాల్, డఫేదారు సింహాచలంతో.

'విన్నావుగా, కలెక్టర్‌గారి ఆర్డర్?' అన్నట్టు చూసి తల ఆడించాడు సింహాచలం.

లారీ డ్రైవరబ్బాయి రెండు చేతులూ ఎత్తి కలెక్టర్‌కి దండం పెట్టాడు. తల అడ్డంగా ఆడించాడు, "గాటీ రోడ్డుమీద అంతలక్క ఎల్దానికి బండికి దమ్ము నేదండి. పదిమైళ్ళ గదాని నాకు బండప్పగించేడండి డయివోరు."

"అంటే వీడు డ్రైవరు కాడా?"

జవాబు లేదు.

"మరి అసలు డ్రైవరు ఎక్కడున్నాడు?"

"సప్పర్లలో తాగేసి తొంగున్నాడండాడు. పెబువులు తప్పు కాయాల. నాకు సైసెన్స్ నేదండి."

లారీ ఇంజన్, దాని తాత్కాలిక చోదకుడి గుండెలా లబలబలాడుతూనే ఉంది. ఆ శబ్దం కటువుగానే ఉంది. వాడి భాషలో యాసకన్నా, వాడిమాటలో నిస్పృహాయకకవ్నా కటువుగా వినిపిస్తుంది ఆ చప్పుడు గోపాల్‌కి.

"నువ్వు లారీని డ్రైవ్ చెయ్యరాదూ?" అన్నాడు కనకయ్యతో.

"నేనా?.... నాకు రాదండి.... అసలే డిసోల్ బండి, అందులో గాటీ రోడ్డు. ఒకదానికొకటి—— వద్దుబాబూ" అన్నాడు కనకయ్య.

అరనిమిషం అలా నిశ్శబ్దంగా నిలబడ్డాడు కలెక్టర్.

"వాణ్ణి పోనివ్వండి"

మళ్ళీ ఈ అవకాశం తప్పిపోతుందేమో నన్నట్లుగా లారీ కుర్రాడు తిరిగి తిరిగి దండాలు పెట్టుకుంటూ ఛంగున లారిలో కెక్కిపోయాడు. గేరు మార్చి లారీడు నిట్టూర్పు విడిచాడు. ఆ నిట్టూర్పు రొద తగ్గేసరికి నిమిషం పట్టింది. ఆ నిమిషంలోనే ఈ రాత్రికి మీకు మిగిలేది ఈ నల్లని పొగలాంటి చీకటేనర్రా అని ఏదో చిక్కని భయం కొండంతా వ్యాపించింది.

"ఆ లారీతో దారకొండ గుడికాడి కెళిపోయి ఉండాల్సింది" అన్నాడు సింహాచలం డ్రైవర్‌కి మాత్రం వినపడేటట్టు.

'ఇంకో గంట పాటు ఏ బండీగాని రాకపోతే అప్పుడా పాట్లు ఎలాగూ పడాలి, అనుకున్నాడు కనకయ్య తనలో తాను.

వాచీ చూసుకున్నాడు కలెక్టర్ గోపాల్.

ఐదూ ఇరవై.

o o o

వాచీ చూసుకున్నాడు కలెక్టర్ గోపాల్.

ఆరుంపావు.

దూరంగా ఎర్రని ఆకాశంలో అస్తమిస్తూన్న సూర్యుడు కాంతి తరిగి, "వెంటనే ఆర్డర్స్ వేసే వీలులేని" కలెక్టర్‌లా ఉన్నాడు. ఆ ఎర్రని బింబాన్ని ఇంత ఎత్తునుంచి చూడడం తననుంచి తానే వేరయిపోయి ఒక ఎత్తులోంచి తనలోకి తాను చూడడంలో ఉంది.

దఫేదారు సింహాచలం రోడ్డుమీద బాసింపట్టు వేసుకుని కూర్చున్నాడు. పొదచాటు నుంచి అప్పుడే బయటపడుతున్న డ్రైవరు కనకయ్య నోట్లోంచి బయట పడుతున్న పొగ కనపడింది, వీళ్ళిద్దరూ వంతుల వారీగా పావుగంట కోసారి పొదలోకి వెళ్ళ రావడం పొగలోకి వెళ్ళి రావడానికన్నమాట!

తలుపు క్లిక్‌మనిపించాడు కలెక్టర్ గోపాల్,

డ్రైవరు కనకయ్య పరుగెత్తుకు వచ్చాడు. దఫేదారు సింహాచలం నింపాదిగా బాసింపట్టు విప్పుకుని నడిచి వస్తున్నాడు.

"ఊఁ(....." అన్నారు గోపాల్.

"సార్?"

"మనం ఇక్కడిలా నైట్ హాల్టేనా ఏమిటోయ్?"

"చిత్తం. మరి బండేదీ రాలేదు గదండి?"

"ఏం మనుషులోయ్ మీరు — వెధవ మొహాలు! బయలుదేరేప్పుడు అన్నీ చూసుకుని ఏడవరు— ఎక్కడ దొరికారో...." అని విసుక్కున్నాడేగాని కలెక్టర్ గోపాల్‌కి తను చేసిన తప్పులాంటిదొక చిన్న విషయం జ్ఞాపకం వచ్చింది.

తాను సీలేరు కాన్ఫరెన్సుకి వెళుతున్నాడని చింతపల్లి తాసిల్దారుకి

మొన్ననే తెలుసు. సీలేరు చింతపల్లి తాలూకాలోనిది. నిన్న ఉదయం నాలుగు గంటలకి తాను విశాఖపట్నంలో బయలుదేరాడు. చింతపల్లి చేరేసరికి ఏడు న్నర అయింది, అక్కడ బంగళాలో తాసిల్దారు; దొరగారి బ్రేక్‌ఫాస్ట్ కి తగిన ఏర్పాట్లన్నీ చేసేడు. అతని తాలూకాలో కాంప్ కదా. అతనూ రావాలని సిద్ధపడ్డాడు. అతని దగ్గర "లాండ్ రెవెన్యూ డ్రైవ్ కోసమని, ఎక్కణ్ణుంచో తెచ్చి ఎలాట్ చేసిన ఒక జీపువుంది, "కలెక్టరుగారు కాంప్ క్లర్కైనా లేకుండా బయలుదేరుతున్నారు. ఆ జీప్ తీసుకుని నేనూ కలెక్టర్‌గారి కూడా వస్తాను" అని ఆఫర్ చేశాడు.

"నీ తాలూకాలో పరిపాలన ఎలాఉందో నేను చూడ్డానికొచ్చినప్పుడు వద్దూగాని నా వెంట. ప్రస్తుతం లాండ్ రెవెన్యూ వసూళ్ళు చూడు" అని అతణ్ణి కలెక్టరే ఆపేశాడు. అతను మంచివాడే, పాపం. కాని ఎందుకో అతని మొహం చూస్తే తొందరగా వెళ్ళిపోవాలనిపిస్తుంది. ఆకారణంగా చికాకు. అతనూ ఆజీపూ ఉంటే నాకారు కతణ్ణి ఇక్కడ కాపలా పెట్టేసి నేను టింగురంగా అని విశాఖ పట్నం వెళ్ళిపోయి ఉండేవాణ్ణి, అనుకున్నాడు. కలెక్టర్ గోపాల్.

"ఇక్కడ ఎట్లానోయ్?"

"చిత్తం!"

"ఇక్కడ ఎట్లానోయ్ అంటుంటే చిత్తం ఏమిటి నీమొహం? నేనొక్కణ్ణే కారు వెనక సీట్లో పడుకుంటే మీరిద్దరూ రోడ్డు మీద పడుకుంటారా? జంతువు లున్నాయన్నావే జంతువులు– అవి మిమ్మల్నెత్తుకుపోవూ?"

"అయి! నిజమేనండి — ఇందమ్మటి ఏయన్నా గుడిసెలున్నాయ్యేమో సూస్తాను బాబూ" అన్నాడు సింహాచలం.

"ఇంకో గంటుండి బయలుదేరు— అవతల చీకటడిపోతోంది కనపట్టంలే? ఇంకెప్పుడు చూస్తావు?"

"మరేనండి.... ఇందాక ఆ లారీతో దారకొండ గుడికాడదాకా పోతే తీరిపోనండి" అని అందుకున్నాడు డ్రైవరు.

"గుడీ? ఏం గుడీ?"

"గుడేనండి. దారాలమ్మ గుడంటారండి. అక్కడ ఒకరిద్దరు మనుసులు రాత్రికి ఆల్టు చెయ్యొచ్చున్నారా—బాగుంటాది."

"ఇక్కడి కెంత దూరం?"

"రెండుమైళ్ళుంటుందేమో, సార్?"

"ఏమో ఏమిటి. కరెక్టుగా తెలీదా?"

"తెలీస్సార్" అన్నాడు డ్రైవరు పరమ వినయంగా. 'కరెక్టుగా నాకు మాత్రం ఎలా తెలుస్తుందీ? నేనూ మీలాగే కారుల్లో తిరిగే వోణ్ణేగదా'! అనుకున్నాడు లోపల.

o o o

కలెక్టర్ గోపాల్ ఈ జిల్లాకి వచ్చి రెండేళ్ళుకావస్తూంది. చాలా ఖచ్చితమైన మనిషనీ, చురుకయిన ఆఫీసరనీ అతనికి మొదటి నుంచీ మంచి ఖ్యాతి ఉంది.

విశాఖపట్నం అడ్డూ అవూ లేకుండా ఎదుగుతూంది, ఆ ఎదుగుతో పాటు మురుగూ కుళ్ళూ కూడా అంత అడ్డూ ఆపూ లేకుండానే పెరిగి పోతున్నాయి.

అంతకుముందు ఉండే కలెక్టరు పరిపాలనలో నిర్లక్ష్యం, అన్యాయం బాగా ప్రబలినట్టు ప్రభుత్వానికి అర్జీలు వెళ్ళాయి. సంగీత ప్రియులు, సాహిత్య ప్రియులు, ఈజిల్లాని భోజరాజు ఆస్థానంలా తయారు చేశారని స్థానికంగా పెద్దలనబడే వారు ప్రభుత్వంలో పెద్దలనబడే వారికి వినతిపత్రాలు సమర్పించారు. తత్ఫలితంగాకలెక్టర్ గోపాల్ అనే (ఎం. ఏ. మేథమెటిక్సు, పి. హెచ్.డి.) ఖచ్చితమైన ఆఫీసరుని చూసి (లోగడ ఒక శాఖ డైరెక్టరు పదవిని గొప్ప సమర్థతతో నిర్వహించినందువల్ల) ప్రత్యేకంగా ఈ జిల్లా కలెక్టరుగా బదిలీ చేశారు.

"నా పరిపాలనలో ఈ జిల్లా భోజమహారాజు సంస్థానం కానివ్వను,అలా అని ఇది ఔరంగజేబు సామ్రాజ్యం కాబోదు. నాది శ్రేయోరాజ్యం"అన్నాడు ఈ జిల్లాలో తొలి ఉపన్యాసం ఇస్తూ. "నావిష్ణుః పృథివీపతిః" అన్నమాట నిజమే గాని సాక్షాత్తూ ఆ విష్ణుమూర్తి వారే వేంచేసినా ఉన్నట్టుండి విశాఖపట్నం పూర్ణా మార్కెట్ లో కూరగాయల ధరల్నిగాని, ఆ మార్కెట్ చుట్టూ పేరుకు పోయిన బురదని గాని ఏమీ చెయ్యలేకపోవచ్చు. కాని, ప్రయత్న లోపం లేకుండా, ఖచ్చితానికి, కరుకుదనానికి పేరుపడ్డ కలెక్టర్ గోపాల్, పట్టి మంచానికి పట్టిన నల్లుల్లాంటి కొందరు బురఖారాయుళ్ళని లోపల్లేపలే మాడ్చి పారేసి భళీ అనిపించుకున్నాడు. అతడు ఏ విషయాన్నిగానీ ఆలోచించి గాని నిర్ణయించడు. అనుమానించకుండా ఆర్డర్ వెయ్యడు. అనుమానించడం ద్వారా సత్యం

బయట పడుతుందనీ, అవమానం ద్వారా అహంభావం చల్లారుతుందనీ అతని సిద్ధాంతం.

దాదాపు రెండు మైళ్ళు నడిచేలోగా కలెక్టర్ గోపాల్‌కి సుమారు రెండేళ్ళ నుంచీ ఈ జిల్లాలో తాను చేసిన పనులు, ఎదుర్కొన్న సమస్యలు, అనుభవించిన సంఘర్షణలు, చక్కబరిచిన ఘర్షణలు—కొన్ని జ్ఞాపకం వచ్చాయి. జనాన్ని, క్రింద అధికారుల్ని అనుమానించి తనింకా ఆర్డర్స్ వెయ్యని కొన్ని విషయాలమీద తను ఇంకా ఎంతెంత సత్యాన్వేషణ చెయ్యాలో అదీ మనసులో కొచ్చింది. కాంప్ క్లర్కునైనా వెంట తీసుకుని రాని ఈ కాంప్‌లో తన కారుకీ, తన కారుడ్రైవరుకీ, తన ఆలోచనలకు తగిలిన 'బ్రేక్‌డౌన్' మనస్సును బాధ పెడుతూనే ఉంది, ఈ రాత్రి భీమకవి శాపం తగిలిన రాజకళింగగంగులా కర దీపిక లేకుండా నడిచి వెళ్ళి దారకొండ గుడిలో అభోజనం పడుకోవాలన్న మాట. ఆకలి తీరక పోవడం పెద్ద సమస్య కాదుగాని, తీర్చుకోలేక పోవడం వల్ల కలిగే అవమానం మాత్రం తప్పకుండా పెద్ద సమస్యే. హోదాకి భంగం రాకుండా ఈ రాత్రి గడుస్తుందా?

* * *

గుళ్ళో ఆముదపు దీపం అఖండ జ్యోతిలా వెలిగిపోతూంది.

ఎవరు కట్టించారోగాని ఈ అమ్మవారి గుడి చిత్రంగా ఉంది. అమ్మవారి మహత్తువల్లనే ఈ కొండమీద లారీలు నడుస్తున్నాయని తప్పకుండా లారీలూ, కార్లూ తోలేవాళ్ళు నమ్ముతారు. అందుచేత వాళ్ళు కొబ్బరికాయలూ, చిల్లర డబ్బులూ ట్రిప్పు ట్రిప్పుకూ ఇస్తారు. గుడి ఎదురుగా కొండ ధార ఉంది. నీళ్ళు మున్నూటరవై రోజులూ ఉంటాయి. అందుచేత అమ్మవారికి 'ధారలమ్మ' అని పేరు వచ్చిందని స్థలపురాణం తెలిసిన వాళ్ళంటారు. కొండ జనం ఆ అమ్మ వారినే దార్లమ్మ దారాలమ్మ అంటారు,

కొండధార జలజలా అవిచ్ఛిన్నంగా కాలంలా ప్రవహిస్తూంది.

టైమ్ ఎనిమిదీ నలభై!

ట్రాన్సిస్టర్‌లో 'సంగీత కచ్చేరీ' వస్తూంది. గోపాల్‌కి సంగీతం అంటే అయిష్టం ఏం లేదు. కాని, అతనికది బోధపడదు. మూడేసి, నాలుగేసి గంటలు సంగీత కచేరీలకు వెళ్ళి తలకాయలు ఊపేసి పెద్ద తెలిసినట్టు తాళాలు వేసే తెచ్చికోలు దర్జాకూడా బోధపడదు. ఇవేవీ బోధపడక పోవడంవల్ల తన పరి

పాలనా దక్షతకి ఏం లోటు లేదనీ, ఆ స్థాయికి తగిన తన వ్యక్తిత్వానికీ, రసికతకీ లోటు లేదనీ అతను చాలాసార్లు తనని తాను సమర్థించుకుని, అలా సమర్థించుకోవడం మాత్రం లోపం కాదా అని తనని చూసి తనే నవ్వుకున్నాడు.

డ్రైవరు కనకయ్య! దొంగవెధవ! ఆఫీసరని తెలిసీ తననిక్కడ వది లెయ్యడానికేమీ వెనకాడలేదు. పదిహేనేళ్ళ సర్వీసులో కాలింగ్ బెల్ వేటు దూరంలో బంట్రోతు లేకుండా పడుకోడం ఇదే ప్రథమం! జంతువుల భయం వల్ల కారు దగ్గర తప్పక ఇద్దరూ పడుకోవాలని పట్టుబట్టాడు—డ్రైవరు కనకయ్య. "తమరు కార్లో పడుకోలేరు—వద్దు కూడాను. తమరు గుళ్ళో పడుకోండి: మేం ఇద్దరం కార్లో పడుకుంటాం" అన్నాడు వినయం ఉట్టిపడే పట్టుదలతో, "నన్ను చంపేసినా నేనొక్కణ్ణీ పడుకోలేనండి, బాబూ!" అని అన్నాడు. వాడికి అన్ని మాటలు వచ్చని ఇప్పుడే తెలిసింది.

అధికారి కనకా, అధికార హోదా ఉండాలి కనకా తప్ప ఇక్కడ బంట్రోతు అవసరం అట్టే లేదు. కారణం— గుడి మాంచి పకడ్బందీగా ఉండడమే. ఒక్కడూ పడుకున్నా వచ్చిపడే ప్రమాదం ఏమీ ఉండదు. గర్భగుడి, మంటపం రెండు భాగాలు, మంటపానికి ఓపక్క గర్భగుడి. ఎదురుగుండా కటకటాలూ, రెండుపక్కలా గోడలూ, వాటికి కిటికీలూను. కటకటాల మధ్య తలుపు, తలుపుకి బ్రహ్మాండమైన గడియ. మంటపం మధ్యగా నలభై, ఏభై దీపాలు పట్టే భజన చెట్టు. దానిలో శిఖరాన అంగుళంన్నర లోతు కలిగిన ప్రమిదలో జ్యోతి. భజన చెట్టుకి వేళ్లాడగట్టి వెదురు గొట్టాంనిండా ఆముదం. ఇక్కడ వెలుతురూ, గాలీ పుష్కలంగా ఉన్నాయి. పక్కనే నిరంతరం నీరిచ్చే జల ఉంది. జంతుభయంలేదు.

మధ్యలో ఓసారి ప్రమిదలో ఆముదం పొయ్యాలేమో?

హఠాత్తుగా కలెక్టర్ గోపాల్‌కి సందేహం వచ్చింది. తాను రాకముందు నుంచీ దీపం వెలుగుతూనే ఉంది. ఎవరు వెలిగించి ఉంటారు? ఎప్పుడు? ప్రమిదలో నిండా ఆముదం ఉంది. నిన్నటి దీపం కాదు.

సందేహానికి సమాధానంలా తలుపు చప్పుడైంది.

"ఎవరది?" అనుకోకుండా కలెక్టర్ గొంతుస్థాయి పెరిగింది.

"ఓరు బాబూ, లోపల?"

లేచి ద్వారం వద్దకు నడిచి వచ్చాడు గోపాల్.

ద్వారం అవతల ఒక వృద్ధుడు నిలుచుని వున్నాడు. అతని భుజం మీద ఒక చిన్న బిడ్డ నిద్రపోతూంది.

"తలుపు తియ్యండి, బాబూ!"

మాట తీరు చూడగా ఏజన్సీ మనిషిలా లేడు.

"సో!.... నాకితను తోడన్నమాట' అనుకున్నాడు. అతను లోపలికి వచ్చేసరికి చేతిలో బిడ్డ చేతిలోఉండగానే గర్భగుడి దాకా వెళ్ళి,తలుపు తీశాడు. గుప్పుమంది కుంకంవాసన. గర్భగుడిలోంచి ఖాళీగా ఉన్న చేత్తో పక్క చుట్ట తీసుకొచ్చాడు, నేలమీద సడేసి కాలితో ఒక తాపు తన్నాడు. అది అడ్డదిడ్డంగా విడింది. బిడ్డని దానిమీద పడుకోబెట్టి, పక్కమీద ముడతలు లేకుండా సరి చేసేడు. భుజంమీద దుప్పటి కప్పేడు.

కలెక్టర్ గోపాల్ ద్వారందగ్గర నిలబడి అంతా గమనిస్తున్నాడు. ముసలాడు పక్క పరవడం అవగానే తను తలుపు గడియ పెట్టేడు. వచ్చి తన పక్కమీద కూర్చున్నాడు. ముసలాడు ఎవరు నువ్వని అడుగుతున్నాడు.

తనని ఇలా అడిగినవాడు ఇరవై ఏళ్ళలో వీడు మొదటివాడు. వీడికి జవాబు చెప్పాలా? నిజం చెప్పాలా, అబద్ధం చెప్పాలా? నేను ఈజిల్లాకి కలెక్టర్ని-తెలుసా అని అంటే నేను ఈ ప్రాంతానికి గాంధీని నన్నే ఎరగవా అని అంటాడేమో వాడు?

"ఓరు బాబూ, నువ్వు?" అని మూడోసారి అడిగాడు ముసలాడు. మళ్ళీ సమాధానంకోసం చూడకుండానే తలుపు దగ్గిరకెళ్ళాడు. తలుపు తెరిచి. బయటికి తొంగిచూసేడు. "సలికి సచ్చిపోగలవు! తిన్నావా? ఎక్కడా సోట్లేనట్టు ఇక్కడ కొచ్చినావేటి! మాకే సోటుసాలక సస్తుంటే" అన్నాడు.

తనకి విశాఖపట్నంలో ఉద్యోగమనీ, సీలేరునుంచి వస్తూ గంటన్నర క్రితం దారిలో కారు చెడిపోవడంవల్ల దిగిపోయి, ఇక్కడ బెడ్ పరచుకుని పడుకున్నాననీ, పొద్దుటే వెళ్ళిపోతాననీ అన్నాడు.

ద్వారం దగ్గిర మళ్ళీ అలికిడైంది. నెత్తిమీద పెద్ద తట్టతో ఒక ఆడ మనిషి వచ్చింది. అలికిడికి ముసలాడు మళ్ళీ అటెళ్ళి, ఆమె నెత్తిమీద తట్ట సగందాకా దింపి ఆమె సాయంతో తట్టని గర్భగుడి దాకా తెచ్చి మూలనున్న రాయిమీద పెట్టేడు.

ఆ తట్టలో సిలవరు గిన్నెలు, గాజుగ్లాసులు, కంచాలు, రెండు మూడు

మూటలు. ఏమేమో ఉన్నాయి. వాళ్ళకున్న ఆస్తంతా ఆ తట్టలో అన్నదే అని చూసిన వాళ్ళకు స్ఫురిస్తుంది, ఆ ఆడమనిషి తన నెత్తిమీద ఇంతసేపూ ఉంచిన గుడ్డ చుట్టువిప్పి తట్టమీద జాగ్రత్తగా కప్పి, ఇటు తిరిగింది.

ఆముదం దీపం వెలుతుర్లో ఆమె ముఖం చూసి గోపాల్ ఆశ్చర్య పోయాడు. ఆమెకి ఇరవై రెండు ఇరవై మూడేళ్ళకన్నా ఉండవు, అతడికి అరవై ఉండవచ్చు. పైగా, మూడేళ్ళ బిడ్డ. ఇదేం సంసారం! ఇదేం దేశం! అను కున్నాడు.

ఆమె నిలబడి వుంది.

గోపాల్ ఆమెవేపు మళ్ళీ చూశాడు. 'ఇరవై రెండేళ్ళుంటాయి' అను కున్నాడు, ఆమె కేశాలు సంస్కార హీనంగా ఉన్నాయి. ఆ కొప్పు నిన్న ముడిచిందే అయినా, కొప్పులో తురిమిన కొండ పువ్వు ఈ వేళదే. పడుచుదనం పరువంలో ముడిచిన పొగరుబోతు తనంలా మెరిసిపోతుందా ఎరుపు. ఆమె జాకెట్టు తొడుక్కోలేదు. ఆ లేమి ఆ సన్నివేశాన్ని ఒక విధమైన సహజత్వంతో నింపింది.

ఆమె కలెక్టర్ గోపాల్ వేపు చూసింది. ఆమెకి తనెలా కనపడుతున్నాడో చూసుకోవడాని కన్నట్టుగా తనచుట్టూ తను చూసుకున్నాడు. అట్టే విశాలంగా లేని ఆ గుడి మంటపంలో పడమటివేపు సగంమేర అతను ఆక్రమించుకొని ఉన్నాడు. అతని బట్టలూ, పక్కమీద దుప్పటీ తెల్లగా మెరిసిపోతున్నాయి. గుప్తంగా ఉండిపోయినా అధికారం తెచ్చిన ఠీవితో అతను కలెక్టర్లా వెలిగిపోతు న్నాడు. ఈ చోటంతా నాది. ఇటెవ్వరూ రాకండి, వస్తే దురాక్రమణ కాగలదు అన్న ధోరణి శిలాశాసనం చేసినట్టు అతని చుట్టూ వ్యాపించింది.

"నిలుచుంటావేం, పక్క దెచ్చుకో" అన్నాడు ముసిలాడు.

మోచెయ్యి ఆడించి, 'అతనున్నాడు. ఎలాగ?' అని సూచించింది ఆమె.

ముసిలాడు ఇటు చూసి. "బాబూ, తమరు కొంచెం అటు కాసి సరకా యించుకోరా?" అన్నాడు.

మూడు పక్కలు వేయడానికి వీలుగా గోపాల్ తన పక్కని గోడ అంచుకి లాక్కున్నాడు. గోడ దగ్గిర ఏమైనా పురుగులు, కీటకాలు ఉంటాయేమో నని క్షణకాలం అతనికి భయం వేసింది.

అయినా అతను సర్దుకున్నాడు.

* * *

"ఇలా క్కొలిపోయింది బాబూ, దీని బతుకు! అది మొగుడుండీ లేని దైంది నాను కొడుకుండీ లేనోణ్ణైనాను— ఆడేటో, ఆడుద్దోగవేఁటో నాకు తెల్దు! నాలుగు నెల్లకోపాలి తొంగిసూస్తే సూసినట్టు, సూడకుంటే లేనట్టు. నా పేణాలు తోడేస్తున్నాడు. నా బతుకేదో నేను బతుకుతాన్రా, ఎదవ సచ్చినోడా, గుంట దాన్నారడిసెయ్యక నీతో టొట్టికెలిపోయి టవున్లో కాపరవెట్రా అని నెత్తీ నోరూ మొత్తుకుంటానండి. బాబూ, నా మాటంటే ఆడి కిలువు లేదు. సీపురు ముల్లులా తీసేత్తాడు. నానంటే కిట్టకపోతేపోనాది. నానిమీదెందుకో ఆడికంతపగ? తల్లి సచ్చిపోయిన గుంటని, మూణ్ణెల్ల పసిగుడ్డుని ఈ సేతుల్తో సాకేను, బాబూ, దీని శాకిరీకోసం, మందులకోసం నా యాడది నానా సంకలు నాకి కడకి మంచం పట్టి చచ్చిపోనాదండి. నరసీపట్నం ఆస్పత్రిలో మా యాడది సచ్చిపోయేటయిములో అక్కడున్న మంతరసానమ్మ ఈ పిల్ల ముండని తను పెంచుతానని ఉంచేసుకున్నాది. బాబయ్యా. సుక్కురారం సంతకి నాను అడవి కఱ్ఱొట్టికెళ్తే ఆ యమ్మ బిడ్డ నెత్తుకుని కూరా నారా జేసుకోనాని కొచ్చేదండి. ఏడాత్తిరిగే లోపల నాను సెమటోడిచి కఱ్ఱముక్క లమ్ముకున్న డబ్బులూ, అప్పుడూ అప్పుడూ దాసుకున్న సొమ్ములూ ఆరగొట్టేసిందండి దొంగ నంజ. ఎప్పుడొచ్చినా గుంటకి అంతకాయిలా సేసింది, ఇంత కర్సెట్టీసినానని నాకాడ డబ్బులు గుంజేసేది, బాబయ్యా, ఆ శంకినీ, అదుగో, దానిమీద కోపవంతా దీనిమీద సూపిత్తాడండి మా గుంటడు.... ఈడి కప్పుడుకి పన్నెండేల్లవుతాయండి, బాబూ. తెలిసీ తెలీని గేనం. ఈ గుంట పుట్టిన కాణ్ణుంచే మా రోజు లిలా సీకట్రాత్తుర్లయిపోనాయని ఆడివోదన. రైల్వేలో కలాసీ కేటొస్తాది; నాకు సంసారంవోఁటి తక్కువొచ్చి నాదా అని సీదరించుకుంటాడు, బాబో! పేదోడికి పెల్లాఁవేఁ బార్యరా, నంజికొడకా. ముసిలాణ్టి, నాకీ వొయిసులో ఈలంపట వేంట్రా, నీ పెల్లాన్ని నువు తీసుకెల్రా, ఎదవనాయాలా, నే నీ కొండమీద సితుకులు పోగు జేసుకోని, ఈ గుళ్లో దీపఁ వెట్టుకోని బతుకుతానని చెప్తే ఇందండి" అని ముసిలాడు తన కధంతా చెప్పుకొచ్చేడు.

హఠాత్తుగా ఆపి, "బాబూ, తమరు పొద్దోయినకాణ్ణుంచీ ఇక్కడే ఉన్నారుగదా ఏవైనా ఇంత తిన్నారా?" అన్నాడు.

ముసలాడి కధంతా వింటూ కొన్ని క్షణాలకాలంపాటు మారువేషంలో ప్రజల యోగక్షేమాలు విచారించే విక్రమార్కుడి ధోరణిలో పడ్డాడు కలెక్టర్

గోపాల్. ముసిలాడి కొడుకు గుణగుణాల్ని బట్టీ, వాడి మనస్తత్వాన్నిబట్టీ వాడి రూపాన్ని ఊహించుకొంటున్న గోపాల్‌కి, ఏదైనా తిన్నారా అన్న ప్రశ్నలలో ఆకలి, దాన్ని తీర్చుకోవడానికి అయిష్టమూ కలియనట్లైం. దానిలోంచేమీ జవాబు రాలేదు.

"ఏంత పనైపోనాది. బాబో!" అని ముసిలాడు నెత్తి కొట్టుకుని, వెంటనే మూలకి పరుగెట్టికెళ్ళి దట్టలోంచి ఓ న్యూస్ పేపర్ పొట్లాం తీసేడు. అదితెచ్చి గోపాల్ ఎదుట పెట్టి, మళ్ళీ తట్ట దగ్గిరికెళ్ళి ఓ సిలవర్ గిన్నె, ఓ గాజుగ్లాసూ తెచ్చేడు. గబగబా కటకటాల తలుపు తీసుకుని నాలుగు మెట్లు దిగి జలలోంచి నీళ్ళు తెచ్చేడు.

పొట్లాం విప్పి ఉంది. దానిలో ఏముందో తెలియకుండా, ముడిచిన కాగితం అడ్డువచ్చింది. అందులో నిన్నటి సంతలో తెచ్చిన పకోడీలో, జంతికలో, నూనె మిఠాయో ఉంటుందని, ఆకలిబాధ తట్టుకోగలిగినా ముసిలాడి బాధ తట్టుకోలేక అవేమైనా తినవలసి వస్తుందని భయపడ్డాడు గోపాల్.

ముసిలాడు స్వతంత్రంగా ముందు కూర్చుని పొట్లం పూర్తిగా విప్పాడు ....అందులోంచి ప్లాస్టిక్ సంచులలో సీల్ చేసిన బన్ రొట్టెలు బయటికి దొర్లాయి.

ముసిలాడు ఏదో హఠాత్తుగా గుర్తొచ్చిన వాడిలా మళ్ళీ లేచి తట్ట దగ్గిర కెళ్ళాడు. తట్టలో సామానులు కలకల, గణగణ తిరగేసి అందులోంచి ఒకసీసా తీసేడు. చప్పుడుకి ఆమె లేచింది.

"గుంట నెగిసిందా!" అంది.

"నేదు. నువ్వు తొంగోయే" అన్నాడు ముసిలాడు.

"పాలెందుకు!" అందామె, కూర్చుని, చీరతో ఒళ్ళు కప్పుకుంటూ.

కలెక్టర్ గోపాల్ గ్రహించాడు. ఆ సీసాలో పాలు ఆ పాపవి. నిద్దట్లో లేస్తె పట్టటానికి దాచేరు....ఆ ఆదరాన్ని తనవేపు తిప్పుకోడానికి ఏ డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేటుకి పవర్సులేవు....ఇంక తాను స్వీకరించగలిగేవి ఆ బన్ రొట్టెలు మాత్రం!

0 0 0

"నీ పేరేమిటన్నావు?" అన్నాడు కలెక్టర్ గోపాల్.

"నారాయడండి."

"నారాయడూ, నీకొడుకు—నిన్నూ నీ కోడల్నీ తీసుకెళ్ళాలంటే వాడికి ఏమి ఉండాలి?"

"ఆడికా, బాబూ? ఏటుండాల, బుద్ధీ గేనం ఉండాల:"

అసామాన్యమైన ఉల్లాసం కలిగింది ఆ మాటకి, కలెక్టర్ గోపాల్‌కి.

"ఆ ఉద్యోగం మానేసి వ్యవసాయం చేసుకోమన్నాదూ మీ వాణ్ణి?"

"ఎవసాయానికి మాకు బూఁవెఁక్కడిది, బాబూ! పరాసికాలాడతన్నారు. ఆ దక్కడ, మాఁవిక్కడ. ఎవసాయఁవూఁ నేదు, ఏ సాయఁవూఁ నేదు"

"భూఁవుంటే వ్యవసాయం చేస్తాడా?"

"ఎందుకు సెయ్యడు బాబూ? సేస్తాడు. ఆడు సెయ్యకపోతే, నానే సేస్తాను, ఆణ్ణీ, దాన్నీ ఇంటికాడ కూకోబెట్టి సెయ్యగల సత్తువుంది, బాబూ. తమలాంటి పెభువుల దయవల్ల."

"మరి భూమికోసం ధరఖాస్తు పెట్టలేక పోయావా? భూమి లేనివాళ్ళకి బంజర్లు ఇస్తారుకదా" అని సన్నగా అతని కళ్ళల్లోకి చూసేడు గోపాల్.

తఁవఁరికి తెలీందేంటుంది, బాబయ్యా? భూఁవిఁలేనోళ్ళకి బూఁవిస్తారని మూడేల్ల నాడు నా సేత కాయితాల మీద ఏలిముద్దర్లేయించుకున్నారండి, ఆరుసుట్లు సింతపల్లి తాలూకాపీసు కెళ్ళి దొరలకి దండాలు పెట్టుకున్నాం. కాయితాలు రాపించుకున్నాం. కాయితాలు "సదివించుకున్నాం" కూడా నండి. బాబూ.... ఆ బాధలన్నీ గేపకం సెయ్యకండి, బాబయ్యా."

"నాకు తెలిసిన వాళ్ళున్నారు, చెప్పి నీకు భూమిప్పిస్తాను. కాయితం పెట్టు."

* * *

నారాయుడికి భూమి ఇచ్చే అదృష్టం చింతపల్లి తాసిల్దారును వరించ లేదు.

ఆ కాగితం భద్రంగా విశాఖపట్నానికి తీసుకు వచ్చిన కలెక్టర్ గోపాల్ దానిమీద అందమైన స్వదస్తూరీతో విశాఖపట్నం తాసిల్దారుకే ఆజ్ఞలు జారీచేసి ముద్ర ప్రసాదించేడు.

కాంపు గుమాస్తాని పిలిచి ఈ కాగితం పంగతి ఎక్కడైనా నోట్ చేసుకుని, వారం రోజుల తరవాత ఓసారీ, పదిదినాలయ్యాక రెండోసారీ పన్నెండు రోజులూ పూర్తయ్యాక ఆఖరుసారీ తాసిల్దారుకు టెలిఫోన్ మీద గుర్తుచేయ మన్నాడు.

పదమూడో రోజయ్యే సరికి నారాయుడుకి విశాఖపట్నం తాలూకాలో అయిదెకరాల భూమికి పట్టా ఇవ్వడం జరక్కపోతే దానికి బాధ్యులెవరో కనుక్కోవడం వరకే కాంపు గుమస్తాగారి పూచీ. వాళ్ళకు కలెక్టర్‌గారి దర్శనం అయాచితంగా దొరుకుతుంది.

ఆ పైన రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదవ ఎలాగా ఉండదు.

0 0 0

ఏడాది తరవాత—కలెక్టర్‌గారి కారు డ్రైవరు మద్దిలపాలెంలో ఇల్లు కట్టుకున్నాడు. గృహప్రవేశానికి ఎవర్ని పిలిచినా వస్తామన్న వాళ్ళు, వచ్చేవాళ్ళే—కాని, ఎందర్ని పిలిచినా అతనికి తృప్తికాలేదు. ఇరవైయేళ్ళబట్టీ కలెక్టరుగారి డ్రైవరుని కదా. ఒక్క కలెక్టరుకూడా నీ యింటికి రాలేదే అని ఏదో బాధ పీకింది. సమయం మించిపోకుండా పనులు చేసుకొనే సమర్థుడు కనక సమయానికి తగు మాటలాడి ఆహ్వానం, అభ్యర్థన అందజేసేడు. పీడిత ప్రజల అభివృద్ధికీ; సన్నకారు రైతుల సౌభాగ్యానికి పరవశించే కలెక్టర్ అతని ఇంటిని పావనం చేసేడు,

పదిమంది మధ్య గర్వంగా నిలబడి ఉపన్యాసం చెప్పేడు కలెక్టర్.

"కనకయ్య మంచి డ్రైవరు. కాని, కనకయ్యకి ఒక్కసారే బ్రేక్‌డౌన్ నేనెరిగి నంతవరకూ—అంతేకదూ!" అన్నాడు కలెక్టర్ గోపాల్.

ఒక్క క్షణానికి తెలివి తెచ్చుకుని రెండు చేతులూ జోడించి "చాలు, మా ప్రభో. తమరు నన్ను కాపాడేరు. రెండోసారి బ్రేక్‌డౌన్ వద్దు" అన్నాడు కనకయ్య.

0 0 0

అనగనగా ఒక డ్రైవరు.

ఆ డ్రైవరు పేరు కనకయ్య.

నాలుగేళ్ళ కిందట ఓసారి విశాఖపట్నం కలెక్టర్‌కి అతనిమీద ఎందుకో ఆగ్రహంవచ్చి అతణ్ని నరసీపట్నం సబ్‌కలెక్టరు దగ్గిర పనిచెయ్యమని ట్రాన్స్‌ఫర్ చేసేడు.

ఆర్డరు అసలు జరక్కుండా కనకయ్య సెలవు పెట్టేడు.

సీలేరులో అప్పుడే పని ప్రారంభించారు. గవర్నమెంటు ఉద్యోగంలో ఉంటున్న కనకయ్య సెలవుకాలం వృథాకాకుండా, ప్రాజెక్టుకి సామానులు చేర

వేసేందుకు పెండరు పొందిన ఒక కాంట్రాక్టర్ దగ్గర లారీ తోలడానికి కుదుడు కున్నాడు. కాలక్షేపంకోసం చేసే ఉద్యోగకాలంలో కాలక్షేపం కావడంకోసం చింతపల్లినుంచి నారాయుడు కూతుర్ని సీలేరు లేవదీసుకు పోయాడు. నాలుగు నెలలపాటు రెండో జీతం సుఖం, రెండో పెళ్ళాం రుచీ దొరికాయి.

రెండో ఉద్యోగం వదిలిపోయే ముందు రెండో పెళ్ళాన్ని వదిలించు కోవడం కోసం దాన్ని తనతోటి డ్రైవర్లు కొందరికీ, కాంట్రాక్టర్ మేస్త్రీలకీ, ఇంకా తనకి దండాలు పెట్టి నాటుమందు కొట్టించిన వాళ్ళకీ పరిచయం చేసే సేడు, రోజు రోజుకూ పెరిగిపోతున్న బాధ భరించలేక, కనకయ్య రెండో పెళ్ళాం లబోదిబోమని మొత్తుకుని చింతపల్లి వెళ్ళి అప్పటిదాకా తనెక్కడుందో తెలియక కొట్టుకు వస్తున్న తండ్రిని సీలేరు తీసుకొచ్చి తగాదా పెట్టింది.

ధారాలమ్మ గుడిదగ్గిర కొబ్బరికాయకొట్టడం కోసం వచ్చేపోయే లారీలు, కార్లు, జీపులు, ట్రక్కులు అన్నీ ఆపుతారు. అయిదు నిమిషాలు ఆగాలనుకున్న వాళ్ళకి అరకప్పు జలలో నీళ్ళే తప్ప టీ లేదు. గుడికి కొంచెం తూర్పువేపున కొండ చదును చేయించి అక్కడ గుడిసె వేయించి టీ కొట్టు పెట్టించేడు. సంతలో దొరికే చవక మిఠాయిలూ, బన్‌రొట్టెలూ, టీ అమ్ముతూ నారాయుడు కూతురు "ఒళ్ళు దాచుకోకుండా" పనిచేసి అడిగినవాడికల్లా ఆకలీ దాహం తీర్చేది. పోటీలేకుండా దాని వ్యాపారం అలా సాగింది కొన్నాళ్ళు.

కూతురి బతుకు బండలు చేసేసేడని; నారాయుడు, "నీ మీద కలెక్టరు గారితో ఫిర్యాదు చేస్తా" నంటూ కనకయ్యని బెదిరిస్తూనే ఉన్నాడు, ఓర్లంజ కొడకా, ఆగరా, నీకూ నీ కూతురికీ ఐదెకరాలు భూమి రాసిస్తాను-అంటూ కనకయ్య తప్పుకొంటూనే ఉన్నాడు!

కనకయ్య వాళ్ళకి ఐదెకరాలపొలం రాసివ్వాలంటే కనకయ్యకి ముందుగా ఏ కలెక్టరో కనీసం పదెకరాలభూమికి పట్టా ఇవ్వాలి. వాడికి ఇదొక్కర్తేకాదు గదా, పెళ్ళాం!

తన చేత చక్రం తిప్పించుకున్న వాళ్ళేగాని తనకో భూచక్రం ఇచ్చి తన సమస్యకి చక్రం అడ్డేసిన కలెక్టర్లు కనపడలేదు కనకయ్యకి-గోపాల్ తప్ప!

చింతపల్లి తాలూకాలో అయిదెకరాలిస్తే ఏపాటి, ఏభై ఎకరాలిస్తే మాత్రం ఏ పాటి? అంతా కొండ, డొంక, తుప్ప! నారాయుడు చేత సమయం చూసి పెట్టించిన కాగితం మీద నారాయణమూర్తి వారి దయ పడింది. ఆ చింతపల్లి

తాసిల్దార్ మొహం ధర్మమా అని ఆ కాగితం విశాఖపట్నం తాసిల్దార్ మొహాన పడింది, క్యాంపు గుమాస్తాగారి ఫోన్ కాల్స్ పుణ్యమా అని ఆ ఇచ్చే ఐదెకరాలు మెట్టలోకాక, మాగాణిలోకాక రేసపు పొలంలో రోడ్డు పక్క వచ్చిపడ్డాయి.

అక్కడ ఎకరం ఇరవై వేలుంది.

బంజర్ పట్టా నారాయుడు పేరన వచ్చిన నాలుగో రోజున పవర్ పట్టా తన పేర వ్రాయించుకున్నాడు కనకయ్య. భూమి మీద వెంటనే లేఔట్స్ తయారు చేయించి, "ఇచ్చట ప్లాట్లు అమ్మబడును" అని బోర్డు తగిలించాడు. బాలాజీ హౌస్ బిల్డింగ్ సొసైటీ అనే ప్రైవేటు సంస్థవారు ఆ లేఔట్ అంతా కొనుక్కున్నారు.

చింతపల్లి సమీపంలో అయిదెకరాల భూమిని నారాయుడుకి కొని ఇచ్చేసేడు కనకయ్య. ఇస్తానన్న ఐదెకరాలే కాక, ఐదువందల రూపాయలు నారాయుడు కూతురి చేతిలో పెట్టి నీకూ, నాకూ ఇంక ఏ విధమైన సంబంధం లేదని చెప్పేసేడు.

పెళ్ళాం పేరిట ఇరవై వేలు బాంక్ అక్కౌంటు, మద్దిం పొలంలో నాలుగు గదుల డాబా ఇల్లూ; అంతో ఇంతో అనుభవం పలుకుబడీ–వీటిని మించి కనకయ్య కేం మిగిలింది, పాపం!

*

(ఆంధ్రజ్యోతి వీక్లీ 15-7-1973)

# దేవుడుచేసిన మనుషుల్లారా మీ పేర్లేమిటి?

"ఏం. మీ దేవుడు ఇలా చేసేడు?"

ఉలిక్కిపడింది అనూరాధ. భర్త వర్క్‌షాపునుంచి వచ్చేవేళ కాదు. తను ఊర్నించి వచ్చినట్టు తెలుసుకొని ఓ గంట ముందుగా బయల్దేరి వచ్చేశారన్నమాట. ఆర్నెల్ల తరవాత తన ఇంటికి తనువస్తే అదీ మొదటి ప్రశ్న.

'నేనొచ్చానని కబురు తెలిసిందాండి?' అన్నది తల వొంచుకొని.

'మరే. మీ నాయనగారు స్టేషనుకి వెళుతూ వర్క్‌షాపు దగ్గిరకొచ్చి రాత్రికి ఉండలేక పోతున్నానని క్షమార్పణలు చెప్పుకుని వెళ్ళారు. ఒక్కతెవూ ఉన్నావని వెంటనే వచ్చేశాను.'

"నాన్నగారికి రేపట్నుంచి ఎవరో ఆఫీసరు క్యాంపు ఉందటండి. మీరేమో తప్పకుండా ఇవాళ్టికే నన్ను దిగబెట్టెయ్యమని ఉత్తరం రాసేరు. మా అన్నయ్యకు వీలుగాలేదు."

"అన్నీ చెప్పారు....అంతా బాగున్నారా మీ వాళ్ళు? తమ్ముళ్ళు, చెల్లాయిలు" అని యధాలాపంగా అనేసి జవాబుకోసం నాకంత పట్టింపు లేదన్నట్టుగా ముందుకు వెళ్ళాడు సన్యాసిరాజు.

పలకరింపులో ఆప్యాయత లేకపోవడం గమనించి సమాధానానికి మాటలు ఖర్చు పెట్టకుండా తల వూపింది అనూరాధ.

గదిలో ఒకమూల దూలానికి చిన్న హుక్ లాంటిది వుంది. దానికి చిన్న కొబ్బరితాడు వేలాడేసి, మెత్తని చీరతో ఒక ఉయ్యాల వేసింది అనూరాధ అందులో అయిదో నెలలో అడుగు పెట్టిన పాప నిద్రపోతోంది.

అక్కడిదాకా వెళ్ళి కిందినుంచి పైదాకా చూసేడు సన్యాసిరాజు. బూట్లు విప్పుకోడానికి వంగాడు.

చకచకా అతని దగ్గర కెళ్ళింది అనూరాధ. బూట్ లేసులు వదులుచేసి సాయంచేసింది. "కాళ్ళు కడుక్కుని రండి పాపని ముద్దుగురుగాని" అంది తల వంచుకొనే.

"కడుక్కోకపోతే చూపించవా?"

"ఊఁహూఁ" అని ఉయ్యాల కడ్డంగా నిలబడి చిరునవ్వు నవ్వి భర్తవేపు మెత్తని చూపు విసిరింది అనూరాధ.

సన్యాసిరాజు కోపం తెచ్చుకోకుండానే "అలా అయితే నేను చూడనే చూడను" అన్నాడు.

క్షణంలో అనూరాధ ముఖం మాడిపోయింది. "మీరు హాస్యానికైనా అలా గనకూడదండి" అన్నది.

"సారీ—" అని రాజు లోపల వరండాలోకి వెళ్ళాడు.

అప్పుడు మళ్ళీ ఆమెకి అతను మొదట ఇంట్లో అడుగు పెడుతూ అడిగిన ప్రశ్న జ్ఞాపకానికొచ్చింది. ఆ ప్రశ్న మళ్ళీ అడుగుతాడని భయంగా వుంది.

........అవును దేవుడిలా చెయ్యడం అన్యాయం. తొలికాన్పు మొగబిడ్డ కావాలని అందరూ అన్నారు. అమ్మకి తొలికాన్పు మొగబిడ్డ. అమ్మమ్మకి అంతే. అత్తగారికి, వారత్తగారికీ అంతే. తనకి ఆడపిల్ల పుట్టింది. దేవుడు ఎందుకిలా చేసేడో?

బాబు పుడితే పేరుపెట్టి నీ కొండకి తీసుకొస్తామని వేంకటేశ్వరస్వామికి మొక్కింది. కలిసి మొక్కితే కనికరిస్తాడని ఆయన్ని చెయ్యికలిపి మీదు కట్టమంది. ఆయన ఆవేళే వేళాకోలంగా మాట్లాడారు.

ఆయన గారు మొక్కితే అబ్బాయి పుట్టేవాడేమోనని అనిపించని రోజు లేదు; ఈ నాలుగు నెలల్లోను "ఆడపిల్లయితేనేం పాప బంగారు పాప. ఎంత ముద్దొస్తోందో" అని ఎంతమంది పాపని పొగిడినా ఊరట కలగ లేదు.

హాస్పిటల్లో గాని చుట్టుపట్ల ఇళ్ళలో గాని అంత చిన్న వయస్సుకి అంత పుష్టిగా వున్న పాప ఎన్నడూ కనబడలేదు. ఎనిమిది పౌన్లు పుట్టిందట. ఇప్పుడు పన్నెండు పౌన్లు.

"ఆ వూరుకెళ్తే మెకానికల్‌గా అయిపోతావు" అని మొన్నరాత్రి సినిమాకి తీసుకుపోయారు తమ్ముళ్ళూ. చెల్లెళ్ళూ. పాపని అమ్మకి అప్పగించి వెళ్ళారు. సినిమాలో ఏదో ఎడ్వర్‌టయిజ్‌మెంటులో ఉన్నాడొక బాబు. సరిగ్గా పాపలానే ఉన్నాడు. "నెలరోజుల్లో మీ పాప అంతదౌతుంది" అని అన్నయ్య అంటే ఒళ్ళు పులకరించినా మనసు కలుక్కుమంది....

కాళ్ళు కడుక్కొని వచ్చాడు సన్యాసిరాజు.

పాపని చూపిస్తానన్నావు; చూపించు అన్లేదు. "పన్లు అవీ చేసుకోగలవా, మా నారాయణత్తయ్యకి కబురు పెట్టనా?"

సమాధానం చెప్పలేదు అనూరాధ. "పాపని చూద్దురుగాని రండి" అని నవ్వుతూ ఉయ్యాల వెడల్పుచేసి పట్టుకొంది.

"బుద్ధిజాడ్యం తలకెక్కిందే" అని నవ్వుతూనే ఉయ్యాలలోకి తొంగి చూశాడు రాజు. ఉయ్యాల వెడల్పు చేయడంతో పాపకి నిద్రలో ప్రశాంతతకి భంగం కలిగింది. మొహంలో చిరాకేర్పడింది.

"అబ్బో! మీ నాయనగారి కున్నంత చిరాకుందే" అని పెళ్ళాంతో హాస్య మాడేడు సన్యాసిరాజు.

"మా నాయనగారు మీ మీద ఎప్పుడు చిరాకు పడ్డారండి?" అన్న ప్రశ్న నాలుక చివరివరకు వచ్చింది అనూరాధకి.

* * *

అనూరాధకి పద్దెనిమిదో సంవత్సరం. పదిహేడో ఏట పెళ్ళి చేసేరు. సన్యాసిరాజు ఆటోమొబైలు ఇంజనీరింగులో డిప్లొమా తీసుకున్నాడు. వాళ్ళ బంధువులెవరో కార్లూ, లారీలూ రిపేర్ చేసే వర్క్‌షాపు పెడితే అందులో కొంత డబ్బు పెట్టాడు. అక్కడా అక్కడా వుద్యోగం చేసి పానకం తాగేకంటే ఈ వర్క్‌షాపునే వృద్ధిలోకి తెచ్చి కలో గంజో తాగితే మంచిదని సన్యాసిరాజు అందులోనే కుదురుకున్నాడు, పెట్టుబడి మీద లాభం వస్తోంది. పని చేసినందుకు జీతం. అనుభవం, పేరు వస్తున్నాయి, కష్టపడి పని చేయడం తెలుసు. స్వశక్తి మీద స్వయంకృషి మీద ఉన్న నమ్మకం ఏ ఇతర లౌకిక అలౌకిక శక్తులమీదా లేనివాడు. తీరిక వుంటే సరదాగా వుండగలడు కాని సరదాకోసం తీరిక చేసు కోడు.

0 0 0

"ఇవాల్టికి నేను టిఫిన్ హోటల్లో తీసుకుంటాను. రేపట్నుంచీ ఇంటి దగ్గర చేద్దువుగాని" అన్నాడు బట్టలు వేసుకుంటూ సన్యాసిరాజు.

"ఇవాళ్నుంచే చేస్తానండి. ఇదిగో అయిపోయింది పూజ. ఆర్నెల్లనుంచి దేవుడిదగ్గర దీపం లేదని అవన్నీ శుభ్రం చేసుకుంటూ కూర్చున్నాను. ఎంత పెందలాడే లేచినా లేటయిపోయినట్టుంది."

"ఐతే ఎంత సేపటికవుతుంది?" వాచీవేపు చూసేడు సన్యాసిరాజు. "నా కింకా ఇరవయి నిమిషాలు మాత్రం టైముంది."

"ఎంత సేపో ఎందుకండి?.... ఐదు నిమిషాలంతే-అయినా ఏ గవర్నమెంట్ ఉద్యోగస్తుల్లా-" అని ఆమ్లెట్ వెయ్యడానికన్నీ సిద్ధం చేసుకుంటూ. చిరునవ్వుతో వోరగా చూసింది అనూరాధ.

సన్యాసిరాజు కఠినంగా చూశాడు. "ఊ- కానియ్యి, గవర్నమెంటు ఉద్యోగస్థుల సంగతి నాదగ్గర ఇప్పుడంటే అన్నావుగాని ఇంకెప్పుడూ అనకు. టైమ్ ఎప్పుడవుతుందా అని చూడ్డమే తప్ప పని ఏమాత్రం అయిందని చూడరు .... నేను టైమ్ ప్రకారం వెళ్తున్నది ఏదో టైమ్-సెన్స్ కోసం కాదు. నా వర్కర్స్ నాకన్నా ముందు వర్క్-షాపులో అడుగు పెట్టడానికి ల్లేదు!"

అది నిజమేనని అనూరాధకి తెలుసు.

"పాపకి ఏం పేరు పెడదామండి ?" అన్నది అనూరాధ; ఆమ్లెట్ ప్లేటు రాజీకి అందిస్తూ.

"ఇప్పట్నుంచీ పేరెందుకు?"

"పేరెందు కేమిటి; పిలుచుకోందుకు!"

"ఇప్పుడావిడగార్ని పేరుబెట్టి పిలవకబోతే పనులు జరగవా?"

"అదేమన్న మాటండి!.... ఎప్పటి ముద్దు ముచ్చట్లప్పటివి!— పదకొండోరోజు నాడు నామకరణం అన్నారు కదా. అప్పుడు ఇప్పుడేకాదు ఇరవై ఒకటన్నారు. ఇరవై ఒకటోరోజున మీరు రావడమే ఆలస్యమైపోయింది. కానివ్వండంటే కానివ్వడంటూ తంతు జరిపించేరు. పేరేమిటి పెడతారని నలుగురూ అడిగితే నావేపు మీరూ. మీవేపు నేనూ చూసుకున్నాం. ఆలోచించుకుని పెడతాం అన్నారుగా— ఈ ఆలోచన ఎప్పటికి తెగేట్టు?"

"ఆలోచన అంటే, నా ఒక్కడిదా!" అని సన్యాసిరాజు చెయ్యి కడుక్కున్నాడు.

"నా ఆలోచన అయింది" అని తువాలందించింది అనూరాధ.

"అదా సంగతి! అందుకోసమని నా మీద దండయాత్ర ప్రారంభించేనన్నమాట" గది మూలకి వెళ్ళి చెప్పులు తొడుక్కున్నాడు సన్యాసిరాజు.

"కాని ఆలోచన అంటే నా ఒక్క దానిదీకాదు కదా" అని నవ్వింది అనూరాధ.

"బలే బలే! చిలక మాటలు నేరుస్తోంది" బుగ్గమీద చిటికె వేశాడు రాజు.

"సరేగాని. నేను ఒంటిగంటకి వస్తాను. తెలుసుగా! వస్తే ఇరవై నిమిషాలు వుంటాను. అదీ గుర్తుందనుకుంటాను.... అప్పుడు మళ్ళీ సెషన్స్ ప్రారంభం... టాటా!"

"ఇంతే............ ఇలా మెకానికల్‌గా బ్రతకవలసిందే—" అనుకుంది అనూరాధ.

ం ం ం

నలభై రోజులైంది.

తెల్లవారక మునుపే మెలకువ వచ్చింది సన్యాసిరాజుకు. అనూరాధ స్నానం చేస్తున్న చప్పుడు వినిపించింది. తనకే చలివేసినట్లు వణికాడు.... ఇవాళ శనివారం కాదే అనుకుంటూ బద్ధకంగా దొర్లాడు. ఓరగా వేసున్న తలుపు చప్పుడుకాకుండా తెరిచింది అనూరాధ. చప్పుడైతే కాలేదుగాని వెలుతురు మాత్రం సన్యాసిరాజు కళ్ళలో సూటిగా పడింది. కళ్ళు తెరిచాడు. "లేచారా" అన్నది అనూరాధ ఆ కళ్ళలోకి చూస్తూ తలుపుమూస్తూ. తడిగుడ్డతో పూజగదిలోకి వెళ్తున్న అనూరాధను గమనించాడు రాజు. "తొందరగా మొహం కడుక్కోండి; నాతోబాటు బోర్నవిటా తాగుదురుగాని" అంటూ వెళ్ళింది.

ఐదు నిమిషాలు అతనలా కదలకుండా పడుకున్నాడు.

అనూరాధని రెండు మూడు ప్రశ్నలడగాలని దాదాపు ఇరవై రోజుల నించీ అనుకుంటున్నాడతను. పగలంతా డ్యూటీ సరి పోతోంది, రాత్రి సంభాషణలు కూడా అదోరకంగా అనూరాధే నడిపిస్తున్నట్టు అయిపోతున్నాయి. అసలు ఏ నిమిషం కూడా తను మాట్లాడేదేదైనా ఉండవచ్చునని ఆమె అనుకోదు.... ఏదో ఒక విషయం సంభాషణలోకి తెచ్చి ఇరవై నాలుగు గంటలూ ఇదే నా బాధ అన్నంతగా ప్రాముఖ్యం ఇచ్చి మాట్లాడుతుంది. అందుచేత ఆమెని ఈ ప్రశ్నలడగాలన్న సంగతి జ్ఞాపకమే రాదు, తీరా గుర్తొచ్చే వేళకి సరైన భాష దొరకనట్టు ప్రశ్నలు గొంతుకలోనే వుండిపోతాయి.

పూజగదిలో చిరుగంట మోగింది.

అలారమ్ అయినట్టు లేచాడతను. గబ గబా పళ్ళు తోముకుని మొహం కడుక్కున్నాడు. తడి మొహంతో లోపలికొస్తుండగా పూజ గదిలోంచి తడి గుడ్డతో, హారతి పళ్ళెంతో అనూరాధ ఎదురైంది. 'హారతి కళ్ళకద్దుకోండి'

అన్నట్లుగా పళ్ళెంముందు జాపింది. అతను నవ్వుతూ చెయ్యి పళ్ళెంనుంచి మొహంవేపుకి ఆడించాడు. "మరి కాస్త కర్పూరమో ఏదో వేసి ఆ పళ్ళెం ఇలాగిచ్చెయ్. చలికాచుకుంటాను" అన్నాడు.

"మీలాంటి వాళ్ళకి అంతేగా మరి. హారతితో చలికాచుకుంటారు. ప్రసాదంతో ఆకలితీర్చుకుంటారు. తీర్థంతో జలకాలాడుతారు"

"హారతుల్తో ఇళ్ళు కాల్చేవాళ్ళ మాటేమిటి?" అన్నాడు సన్యాసిరాజు.

"ఊరుకోండూరుకోండి" అంటూ పళ్ళెం తీసుకొని ఉయ్యాల మంచం వేపెళ్ళింది అనూరాధ.

రెండు నిమిషాల్లో చేతిలో బోర్న్‌విటా గ్లాసు తెచ్చి స్టూల్‌మీద పెట్టింది. సన్యాసి రాజు ఈజీచైర్‌లో కూర్చుని స్టూలుమీద ట్రాన్సిస్టర్‌లో ఏదో స్టేషను కోసం ప్రయత్నిస్తున్నాడు.

అనూరాధ అతని కాళ్ళ దగ్గర నేలమీద కూర్చుని పాదాలు కళ్ళకద్దుకుంది.

"నా జీవితం చివరికొక బెంగాలీ నవల అయిపోయేటట్టుంది" అన్నాడు సన్యాసిరాజు. "అది సరే కాని, ఇవాళ శనివారం కాదుకదా. ఈ జాతరంతా ఏమిటి?" అన్నాడు గ్లాసు తీసుకుంటూ.

"ఏం శనివారం తప్ప నేను స్నానం చెయ్యడం లేదంటారా?"

"అమ్మబాబోయ్ అంత జోకు నీ మీద వెయ్యలేను. అది కాదూ; ఈ తడి గుడ్డలూ, హారతి ఇవన్నీ రోజువారీ పద్ధులు కావుగా.... పైగా నా కెందుకూ సాష్టాంగపడ్డం?"

"ఏం పడకూడదా.? దేవుడి తరవాత దేవుడంతటి వారుమీరు."

"అయ్యో ఇంతేనా, నా స్టేటస్సు? నేనే దేవుడికన్నా గొప్పవాణ్ణనుకుంటున్నాను, కనీసం నీ వరకు!"

"అదీ నిజమే అనుకోండి; అందుకే సాష్టాంగపడ్డా ననుకోరాదా?"

"అసలు సంగతి చెప్పేవేకాదు."

"అదా? అది నేను చెప్పకుండా మీరు తెలుసుకోలేరా?.... మళ్ళీ మాట్లాడితే తారీకులూ గంటలూ పంక్చువాలిటీ అని లెక్చర్లిస్తారే!" అని దొంగ చూపులు చూసుకుంటూ లేచి పారిపోయింది అనూరాధ.

"అమ్మబాబోయ్. చంపేశావు!" అని ట్రాన్సిస్టరు ఆఫ్ చేసేసి కుర్చీలో వెనక్కి చేరబడి పోయాడు సన్యాసిరాజు.

కాలు తగిలి బోర్నవిటా గ్లాసు కింద పడిపోయింది.

'అరె!' అనుకున్నాడతను. లేటుగా,

○ ○ ○ ○

సన్యాసిరాజుకి దిగులుగా వుంది. సిగ్గుగా ఉంది.భయం పట్టుకుంది. తన మీద తనకే అసహ్యం వేసింది.తనకింకాఇర వై మూడేళ్ళు.తన వయస్సువాళ్ళు చాలామంది పెళ్ళి కాకుండానే వున్నారు మొగవాళ్ళదాకా యెందుకు; ఆడపిల్లలున్నారు.ఇర వైమూడేళ్ళవాళ్ళు పెళ్ళికాని వాళ్ళు కొల్లలు!తనకి అప్పుడే ఇద్దరు పిల్లలా! పోనీ ఇప్పుడు కాకపోతే ఆర్నెల్లలో!

సన్యాసిరాజుకి పెద్దగా చదువుకున్న వాళ్ళుగాని సంస్కారంతో జ్ఞానంతో ధగ ధగ లాడిపోతున్న వాళ్ళుగాని స్నేహితులూ బంధువులూలేరు. అతని వంశంలో ఎక్కువమంది పదేసిమంది బిడ్డల తండ్రులే. భూమీపుట్రా గొడ్డూగోదా పుష్కలంగా వుంటే మనవాళ్ళు పదిమంది పుండడం సంపద. ఆ సంప్రదాయం కల బిడ్డడే అతనూనూ.

కాని మొదటిసారి అనూరాధ తల్లి కాబోతున్నదని తెలిసినప్పుడు అటువాళ్ళూ ఇటువాళ్ళూ బంధువులంతా సంతోషించినా అతనికెందుకో సంతోషం కాలేదు, ఏదో నేరం చేసినట్టే బాధపడ్డాడు. ఆ నేరానికి తనని ప్రోత్సహించి తనని ఇరవయి రెండేళ్ళకే తండ్రిని చేసేసిందని అనూరాధ మీదకోపం కూడా వచ్చిందతనికి. ఇంక తను 'కుర్రాడు' కాదు. 'తండ్రి!' బాధ్యతలు స్వీకరించడానికి భుజాలు గట్టిపడుతూనే ఉన్నా 'కుర్రతనం' వదలనివాడే కదా,తను!.... కాని కుర్రతనం తననుంచి బలాత్కారంగా వదలిపోతున్నది.

పాప పుట్టిందని మనిషిచేత ఉత్తరం పంపేరు మామగారు, దాంట్లో పదకొండో రోజున నామకరణం చేసుకోడం మంచిదని రాసేరు. బంధువులందర్నీ పిలుస్తున్నాము; మీ అంగీకారం తెలియజెయ్యమని రాశారు. 'వద్దు వద్దు పదకొండు వీల్లేదు. ఇది కొన్నాళ్ళు వాయిదా వెయ్యండి' అన్నాడతను. ఎ[illegible]ళ్ళు వాయిదా వెయ్యడం ఎలా వీలవుతుంది నాయనా. అంతగా నీకు పదకొండో నాటికి వీల్లేకపోతే ఇరవై ఒకటోనాడు చేద్దాం అని మామగారు స్వయం[illegible] కొట్టించి వెళ్ళాడు.

ఇర వై ఒకటోనాడు వెళ్ళాడు గాని ముద్దాయి విచారణకోసం వెళ్ళినట్టే

వెళ్ళాడుగాని, ఏదో ఘనకార్యం చేసిన వాడిలా వెళ్ళలేదు. అతిచిన్న వయస్సులో తండ్రి అయిపోయి, తనని నమ్మి తన ఇల్లాలుగా స్నేహితురాలుగా వచ్చిన అనూరాధ అనే ముద్దరాల్ని తల్లిని చేసి, అపరిశుభ్రమైన ఈ నేరం చేసి, అయిన వాళ్ళందరి దగ్గరా తగుదునమ్మా అని ఎలా నిలవాలి? ఇది నేరం కాదా! అనుకున్నాడతను.

"అవును, నేరమే. కాని కాగ్నైజబుల్ అఫెన్స్ కాదు" అన్నాడు అతనికి కొత్తగా పరిచయం అయిన ఒక లాయరుమిత్రుడు. "తెలిసీ తెలియని వయస్సులో పిల్లల్ని ఉత్పత్తి చేస్తున్న మీలాంటి కుర్రకారందరూ దేశం, కాలం, మీ ఒక్కళ్ళవే అనుకొని, దేశపు సాంఘిక, ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా నేరమే చేస్తున్నారు" అన్నాదతను.... ఇరవయి ఒక్క సంవత్సరాల వయస్సు లేని స్త్రీ పురుషులకి వోటుచేసే హక్కు లేనట్లే. ఏ ఇరవయి అయిదేళ్లో లేని స్త్రీలకి బిడ్డల్ని కనే హక్కుకూడా లేకుండా ఏదైనా ఒక గట్టిశాసనం వుంటే బాగుండు నన్నాడు.... అతనెంతో తెలివిగలవాడులా కనిపించాడు.

తనూ, అనూరాధా, మధ్యపిల్లలు. వాళ్లు పుట్టడం, వాళ్ళకి పేర్లు పెట్టడం, వాళ్ళ పెంపకం—ఈ సంగతులన్నిటిమీదా అనూరాధతో మాట్లాడాలని వుంటుంది. కాని తీరా మొదలెట్టేవేళకి ఏదో చిరాకు కలిగి సంభాషణ సాగదు. ఆ మిత్రుడి మాటలు తన నోట్లోకి తెచ్చుకుని అనూరాధతో వాదించాలని అనుకుంటాడు. కాని అనూరాధ అతన్ని వాదించనివ్వదు. తనకీ ఉద్దేశాలున్నాయని చెబుతూనే తనకి వ్యక్తిత్వం లేనట్టు నిశ్శబ్దంగా మాట్లాడుతుంది. వాదించడానికి ఇద్దరుం డాలి; అంతేకాక ఆ ఇద్దరిమధ్య కొంత నిర్మొహమాటంగా మాట్లాడుకో గల పరిచయం వుండాలి!

అనూరాధతో ఏ విషయం మాట్లాడినా సంభాషణ ఎలాగెలాగో అయి చివరికి పాపకి పేరు పెట్టడం అనే సమస్యమీద గింగిర్లు కొడుతుంది. ఈ పాప పేరు ఇప్పటిదాకా తేలలేదు. ఈ పాప పుట్టడమే అనవసరం అన్నట్టుగా తన మనస్సు చీకటిలోకి ఉక్రోషంలోకి నిశ్శబ్దంలోకి వెళ్ళిపోతుంది. ఆమెకి మాత్రం ఇదో సజీవసమస్య. అమ్మ పేరు పెట్టాలా, అమ్మమ్మ పేరుపెట్టాలా, అత్తగారి పేరుపెట్టాలా అని ఇరవైనాలుగుగంటలూ సతమతమై సలహాలు కోరుతూ వుంటుంది. కంచి కామాక్షి, మధురమీనాక్షి, బెజవాడ కనకదుర్గా ఎవరెవరో కనబడుతూవుంటారు కలల్లో, ఈ పాపకి తమతమ పేర్లు పెట్టించుకోవాలని,

"ఈ పిల్ల పేరు తరవాత పెడదాం, మళ్ళీ మన కిప్పుడప్పుడే పిల్లలు వద్దు" అని చెప్పాలనుకుంటాడు, "డాక్టరు దగ్గరికి వెళదాం" అని మొహమాటపడుతూ నిర్ణయించుకొనే వేళకే; మళ్ళీ కొంపమునిగింది.

*　　　　*　　　　*

"ఏమంటున్నాడు, మీ దేవుడు?"

ఉదయం ఎనిమిదిన్నరైంది. ఆదివారం రెండోసారి కాఫీ ఇంటిదగ్గరేగా పుచ్చుకొంటూ, పక్కనే నిలబడ్డ అనూరాధని పలకరించేడు సన్యాసిరాజు.

అనూరాధ స్నానంచేసి పూజ ముగించి నారచీరలోంచి మడతచీరలోకి ఇప్పుడే మారింది. అతని ప్రశ్నలో ఏదో హేళన వుందని స్పష్టంగా తెలుస్తోంది. దానికిసమాధానం యిస్తే తను ఆ హేళనని అంగీకరించడం ప్రోత్సహించడం కూడా అవుతుందన్నట్లు నిశ్శబ్దంగా ఉండిపోయింది.

పైట పూర్తిగా కప్పుకుని అప్రయత్నంగా కిందికి చూసుకుంది. ఎత్తుగా వస్తున్న పొట్ట ఆకారం గమనించి అప్పుడే చాలామంది పుట్టబోయే బిడ్డగురించి ఊహల ఊయల లూపుతున్నారు. మగా, ఆడా?....అతని వేపొకసారి చూసి మళ్ళా తలదించుకుంది.

"నేనన్నమాట బోధపళ్ళేదా?" అన్న ధోరణిలో "ఈ మారైనా అబ్బాయి నిస్తానంటున్నాడా" అన్నాడు సన్యాసిరాజు.

''ఇస్తాడంట, మిమ్మల్ని స్వయంగా అడగమంటున్నాడు" అన్నది అనూరాధ. వోరకంట అతన్ని గమనిస్తూ, ''నేనుసరదాకంటున్నాగా" అని స్ఫురించడానికి వీలుగా మొహాన చిరునవ్వు తేలింది.

''ఆశలు పెట్టి దండాలు పెట్టించుకుంటాడు. బెదిరించి, జబ్బులు తెప్పించి లంచాలు వొసూలు చేసుకుంటాడు. మీదేవుడు నిజంగాదేవుడేనా, లేక యేదైనా రాజకీయ నాయకుడి వాటమా?"

''.... .... ...., .... "

''దండాలు పెట్టకపోతే యేంచేస్తాట్ట?"

"దండాలు పెట్టక దైవాలు దారికిరారు.... వాళ్ళ లారీలూ నీళ్ళ లారీలూ బాగుచేసి డబ్బులు కూడబెడుతున్నారుగా. ఏమాత్రం పోగుచేస్తారో చెయ్యండి. కట్నాలు, కట్నాలు పోసి చేద్దరుగాని అమ్మాయిల పెళ్ళిళ్ళు!"

"అబ్బోసి! చారా కోరిక లున్నాయే. చిలక్కి!"

"మీకు లేవాండీ కోరికలు?"

"ఎందుకుండవూ?కాని దండాలు పెట్టీ లంచాలు పోసీ నా కోరికలు తీర్చు కోను."

"దండాలకి లొంగని దేవుళ్ళదడిపింపులకి లొంగుతారా?"

"నేనూ లొంగను!"

కాఫీతాగడం అయింది. గ్లాసుకింద పెట్టబోయాడు. దగ్గరగా వెళ్ళి అందు కుంది. ఆ చర్యతో వినయం శరీరంలోంచి మనస్సులో కెళ్ళింది.

"ఈ ఒక్కసారికీ మీరు దండం పెట్టండీ-?"అని ప్రాధేయంగా అడిగింది.

"పెట్టనూ, పెట్టనూ, పెట్టను."

"నామాట వినండీ— మీరు అడిగితే తప్పకుండా అబ్బాయి వుడతాడు మనకి.... ఇద్దరు పిల్లలకంటె ఎక్కువ వద్దంటారుగా!.... అబ్బాయి పుడితే.... నేను...."

"ఊఁ-నువ్వు!"

"....అబ్బా నే చెప్పను!"

"ఆపరేషన్ చేయించుకుంటా నంటావు ంతేనా?.... హుఁ; అబ్బాయి పుట్టడం సంగతి ఎలావున్నా ఆపరేషన్ ఖాయమని ఎప్పుడో నిర్ణయమైపోయింది దేవుడు మొండివాడైతే మనిషి అంతకన్నా మొండి, శతమొండి! తెలుసా?" అన్నాడు సన్యాసి రాజు ఆమె చేతినున్న ఉంగరాన్ని చూపించి తనని చూపించు కుంటూ.

"ఏం కాదు" అన్నట్లుగా తల అడించింది అనూరాధ. తనకిమాత్రం అబ్బాయి అక్కర్లేదా?" అనుకొంది. ఆతని వేపు దొంగచూపులు చూసింది.

"మీ వాళ్ళింటికి పురుటికివెళ్తే ఏదో సాకుచెప్పి ఆపరేషన్ చెయ్యకుండా చూస్తారు. అందుచేత ఈమారు ఇక్కడే. గవర్నమెంట్ హాస్పిటల్లోనే;"

* * *

నెమ్మదిగా కళ్ళు విచ్చుకుంటున్నాయి.

అనూరాధకి కళ్ళు విడకముందే మనసు మేలుకొంది. మెలకువ రాక ముందే తెలివి వచ్చేసింది. చుట్టూవున్న జనాన్ని చూడక ముందే పొట్టమీద చేయివేసుకొంది........ అక్కడ మెత్తని చీరలేదు.... ఉవ్వెత్తుగా పొంగ లేదు....హాస్పిటల్‌వారు కట్టిన ఏప్రన్ వుంది.... సర్జనమ్మ కుట్టిన కుట్లున్నాయి.

"సరిగా కనలేకపోయానా?" అనుకుంది. క్షణంలో సగం సేపు గడవక

ముందే నాకు మగబిడ్డ పుట్టాడాలేదా అన్న ప్రశ్నతో గిజగిజలాడింది. పుట్టే ఉంటాడు. దుడుకుతనంతో ఆయనగారు వలతంపడితే మట్టుకు.... దైవంలో దైవంలేడా?.... పుట్టేవుంటాడు.... పుట్టి.... ఉన్నాడా?.... అమ్మో!.... అంత బరువుండేవాడు. నాయన!.... వాడికేమీ కాలేదుకద!

ఆత్రుతతో కళ్ళుతెరచింది.... ఎదురుగా సన్యాసిరాజు.... పక్కనే వాళ్ళ నారాయణమ్మత్త. ఆమెచేతిలో పాప— ఏడాది వెళ్ళినా పేరులేని పాప.

"బాధగా ఉందా?" సన్యాసిరాజు ఆమె మీదికి వంగి అడిగాడు; ఎంతో దయగా, మెల్లిగా ఆమెని స్పృశిస్తూ.

తల అడ్డంగా వూపింది. చేతులు నెమ్మదిగా ప్రక్కలకు జాపింది.... నాబిడ్డ ఏడీ? నాకు మగబిడ్డ కలిగాడా?.... కలిగితే.... ఏడీ? ఈ పక్క ఖాళీగా ఉందేమీ?.... ప్రశ్నలు కళ్ళలో ప్రవేశించి వేదన కన్నీళ్ళ రూపంతో కన బడింది.

రెండు వేళ్ళు చూపాడు సన్యాసిరాజు. పక్కనే రెండు తొట్టెలున్నాయి. అటువేపు చూపించాడు. అతికష్టంగా తల తిప్పింది అనూరాధ.... మసక మసకలుగా కన్నీరు.... అసలేం కనబళ్ళేదు.

'ఇద్దరు....ఇద్దరు పాపలు' అన్నాడు సన్యాసిరాజు, ఆమె కళ్ళల్లో అసం తాంబరపు నీలి నీడలు చిమ్ముతున్న అశ్రువులు చూచి— అపరేషన్ చేయించేసి నందుకు—శతమొండిగా ప్రవర్తించినందుకు మొదటి సారిగా.బహుశా ఆఖరు సారిగా కూడా పశ్చాత్తాపపడ్డాడు. అంతలోనే 'ఎంత మూర్ఖత్వంలో పడిపోతు న్నాను? అని తన్నుతాను మందలించుకొన్నాడు.

చేతులు జాపింది అనూరాధ. పాప నారాయణమ్మ చేతుల్లోంచి వంగింది. నారాయణమ్మ వంగింది. అనూరాధ అందుకుంది. అంతలోనే బలం చాలక పక్క మీద పడేటట్లుగా వదిలేసింది.

'పాప, చిన్ని. బుచ్చి' అంది అనూరాధ నిర్జీవంగా నవ్వుతూ. 'మీ నాన్నగారు ముగ్గురికీ పెడతారమ్మా. పేర్లు.... మీ రంతాఊరూ పేరూలేని బిడ్డలు కారు....'

*

("జ్యోతి" మాసపత్రిక-ఆగస్టు 1964)

# నీ పద్ధతి మార్చుకో

"వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీమ్ వందే జగన్మాతరమ్—" అని మంచి శ్రుతిలో వినబడుతున్నాది కలెక్టర్ రమణకి జీపు దిగేటప్పటికి—

ఉదయాన్నే పోలీస్ పెరేడ్ చూడ్డానికి వెళ్ళొస్తూవుంటే "టీ"కి పిల్చిన పోలీసు సూపరెంటుగార్ని—టీ అంటే జస్ట్ టీ; దట్సాల్! అని ఒక్క నిమిషంలో వదిలించుకున్నా; బంగళాకి చేరేసరికి పరిస్థితంతా తారుమారుగా కనబడింది.వరండాలో కూర్చునివున్న తాసిల్దారూ క్యాంపు గుమాస్తా మేం అప్పుడే వొచ్చేసేం సుమండీ అని చెప్పినట్టు నిలబడి నమస్కారాలు చేసేరు. ఇప్పుడు మాంచిశ్రుతిలో వెంకటేశ్వర సుప్రభాతం పూర్తి పాఠం వల్లిస్తున్న శేషుని వదుల్చుకుని క్యాంపుకి సిద్ధం కావాలంటే అదంత సుళువుగా అయ్యేపన్లా కనబళ్ళేదు.

అయినా; వదలని ఆశతో నెమ్మదిగా హుందాగా అడుగులేసుకుంటూ పూజామందిరం వేపు వెళ్ళేడు.

బూట్ల చప్పుడు విని శేషు యిటు తిరిగింది. "ఒక్క నిమిషం!" అని అనువుగా, మధురంగా నిర్బంధించింది. జిల్లా అందరిమీదా నిరాఘాటంగా పని చేసే కాఠిన్యం నిర్మొహమాటం శేషు దగ్గిర ఎందుకో మెత్తబడిపోతాయి. ప్రసాదం పుచ్చుకోందే టిఫిన్ ఊసెత్తడానికి వీల్లేదు. అదీ ఇక్కడి రూలు.

"ఒక్క నిమిషం" అయిపోయింది. శేషు వచ్చేస్తోంది. పళ్ళెంలో ఆరని కర్పూరజ్యోతి, కోసిన కొబ్బరి ముక్కలూ, తీర్థంతో నిండిన వెండిగ్లాసూ; పళ్ళెన్ని పట్టుకున్న పసుపు రాసుకున్న చేతులూ, ఆ చేతులమీదుగా వేళ్ళాడుతున్న తడి ఆరని జుట్టూ—

రమణ కంగారుపడి సిగరెట్టు పారేశాడు.

హారతి అందుకొమ్మన్నట్టు చేతిలో పళ్ళెం ముందుకి జాపింది శేషు. "థాంక్యూ" అని కర్మకాండ ముగించి "పద" అన్నట్టు డైనింగ్ టేబిల్‌మీదికి చూపించేడు రమణ. ఆ చేతిలో ప్రసాదం వేస్తూ "బూట్లు విడిచేస్తే యేం?" అనకుండా వుండలేకపోయింది శేషు.

"నాకు టైమవుతున్నాది. అవతల వాళ్ళంతా యెదురు చూస్తున్నారు"

"వాళ్ళేకాదు. మేం కూడా" అంది శేషు చిరునవ్వుతో.

సైడు వింగులోంచి నటీనటుల్ని గమనించే ప్రాంప్టర్లా నిలబడ్డ వంటావి డని కళ్ళతోనే పిల్చింది శేషు. "ఇదక్కడ పెట్టి; టిఫినేర్పాట్లు చెయ్యండి. బాబుగారు కాంపెళ్ళాలి" అంది.

"అన్నీ సిద్ధంగా వున్నాయి తల్లీ, తమరు భోం చెయ్యడమే తరువాయి."

టేబిల్ మీద స్టీలుగిన్నెలో ఇడ్లీ: గాజుగిన్నెలో కొబ్బరిపచ్చడి; సీసాలో కారప్పొడి, చిన్న గిన్నెలో నెయ్యి;ప్లేట్లు, చెంచాలూ—

ఆహారపాత్రకి రెండుచేతులెత్తి నమస్కారంచేసి;మూతతీసి ప్లేట్లో ఇడ్లీలు పెట్టబోయింది శేషు.

చెయ్యి పట్టుకుని ఆపేశాడు రమణ.

"నాకేం నచ్చలేదు"

"తినకుండానే?"

"టిఫిన్ కాదు; నీ విధానం"

శేషు నవ్వింది "నా—విధానమా?"

"ఆ, హా! నీ—విధానమే. కట్టూ బొట్టూ వేషం భాషా అన్నీనీ!...."

"ఇప్పుడు నేనేం చేసేనని—"

"ఫర్ గాడ్స్ సేక్! నువ్వీ వేషం మానేద్దూ శేషూ! నిన్ను చూస్తే అమ్మమ్మ జ్ఞాపకం వొచ్చేస్తోంది!"

"నేను బామ్మ పోలికేగా!" అని నవ్వింది శేషు.

"జోక్స్ వెయ్యకు శేషూ. నేను సీరియస్‌గా మాట్లాడుతున్నాను!నీకిప్పుడు ఇరవై నాలుగేళ్ళు. పెళ్ళయి మూడేళ్ళు కూడా అవలేదు. ఈ పూజలూ పునస్కా రాలూ నోములూ వ్రతాలూ ఆచారాలూ అమ్మమ్మ రూల్సూ ఇవన్నీ నాకు పనికి రావు.నువ్వు నా భార్యగా ఉన్నంతకాలం కలెక్టర్ సతీమణిలా ఉండాలి; అంతే!"

"తరవాత మాట్లాడుకుందాం లెండి. అవతల 'వాళ్ళు' ఎదురు చూస్తున్నా రేమో" అని చెయ్యి విడిపించుకోబోయింది శేషు. రమణ ఆ చెయ్యి వదల్లేదు.

"ఫరవాలేదు, ఎదురు చూడనీ. దే ఆర్ పెయిడ్ ఫరిట్. ఇదేదో ఇవాళ తేలిపోవలిసిందే. నీకిక్కడ మాటాడదామని లేకపోతే మేడమీదికి రా." అని చెయ్యి వదిలేసి, కుర్చీలోంచి లేచిపోయాడు రమణ. గోడకున్న కాలింగ్

బెల్ బటన్ నొక్కి: పరిగెట్టుకొచ్చిన దఫేదారుతో చెప్పేడు. "క్యాంపు మధ్యాహ్నం రెండింటికి" సిగరెట్ వెలిగించుకుని చకచకా మేడెక్కిపోయాడు.

0 0 0

శేషు కూడా అతని వెనకాతలే మేడ మీదికి వెళ్ళింది, కాని ముందు తన గదిలోకి వెళ్ళింది. పట్టుచీరలోంచి వాయిల్ చీరలోకి మారింది. "ఈ తడిజుట్టు చూస్తే బతకనియ్యడు" అనుకుని నవ్వుకుంటూ; పైన సీలింగుఫాను తిరుగుతుండగానే పక్కనించి టేబిల్‌ఫాన్ గాలికూడా పెట్టుకుంది.

రెండు ఫాన్ల గాలికీ చిందర వందరౌతున్న జుట్టు అడ్డదిడ్డంగా యెగుర్తూ మొహం మీద కితకితలు పెడుతూవుంటే-చిక్కు దువ్వెన అటూ యిటూ నడిపిస్తూ-చిందర వందరవుతున్న ఆలోచనల మీద చిక్కుదువ్వెన లాంటిదేదైనా పని చేస్తుందా అని తన్ని తాను ప్రశ్నించుకొంది.

చిన్నప్పటి చిలిపితనం చెలాకీతనం ఏవీ, ఇప్పుడు? కాలేజీలో చదివి నప్పుడు ఆడపిల్లల దగ్గిర్నించీ కళ్ళు తిప్పుకోలేని ఆకర్షణ తనది. ఈనిడ జోలికి పోకూడదురా నాయనా అనుకునేటంత విసురు. అవన్నీ ఇతగాడే పొట్టన బెట్టుకుని....మళ్ళానేమో నువ్వు అమ్మమ్మలా వున్నావంటాడూ?

తన పదిహేనోయేట ప్రారంభమైంది ఈ దండయాత్ర. శివాజీ బాబాయి పిన్నీ జెర్మనీ నించొస్తూ తనకి ఏవేవో ప్రెజెంటేషన్లు తెచ్చేరు. అందులో ఒకటి....తొడుక్కుని-తనెల్లా వుందోనని అద్దంలో చూసుకుంటూ వుంటే హఠాత్తుగా అక్కడి కొచ్చేసి "నీకోసం రజని వొచ్చినట్టుంది శేషూ" అని చెప్పి; అద్దంలో తననీ, ఇవతల తననీ చూసి; కోపంగా, "సారీ!" అని వెళ్ళేడు. "ఏమిటే, పెళ్ళికొడుకు అలిగినట్టున్నాడు?" అని రజని అడిగితే—"అవునే.మా బావకి; అడాళ్ళు బట్టలు కట్టుకుంటూవుంటే చూడ్డానికి సిగ్గూ!" అంది తను.

బి. ఎస్సీ రిజల్ట్సు పేపర్లో పడ్డనాడే పల్లెటూర్నించి వాళ్ళమ్మతో సహా వూడిపడ్డాడు. ఫస్టుక్లాసని అందరూ అనుకున్నదే. "నీ పరీక్షేమైందే?" అంది అత్త.

"పోయిందత్తా"

"నిజంగానే పోయిందా?" అని కసిరేడు.

"పో బావా: యేమిటి! ఇంటరుఫస్టియర్ ఫేలయ్యేటంత మొద్దునికాన్లే."

0 0 0

"నాకు మద్రాస్ యూనివర్సిటీలో ఆనర్స్ చదవడానికీ సీటొచ్చింది.

ఎల్లుండి వెడుతున్నా"నని చెప్పేడు రమణ, ఆ తరవాత కొన్నాళ్ళకి, ఇంట్లో అందరూ వుండగా చూసి.

"ఔన్ట, ఈ రోజు పేపర్లో వేసేరు" అని నవ్వుతూ వెళ్ళింది శేషు.

"హాస్టల్లో ఉంటావా?" అన్నాడు మేనమామ.

"లేదు. నా ఫ్రెండు జీవరత్నం ఉన్నాడు కదా.అతనికీ వొచ్చింది సీటు. ఇద్దరం కలిసి వాళ్ళ బంధువులింట్లో ఓ గది తీసుకుంటాం, అతనేమో వాళ్లింటిలో తింటాడు, నేను హోటల్లో తింటాను."

"నాకు మెడ్రాస్‌లో వైద్యనాధన్‌ని అని ఓ ఫ్రెండున్నాడోయి.వాళ్ళింట్లో ఉండకూడదు.నేను ఉత్తరం రాసిస్తానూ? నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు! భోజనం కూడా అక్కడే చెయ్యొచ్చు."

"సారీ మామయ్యా. ఈ విషయంలో జీవరత్నం నేనూ ఓ మాట అనుకున్నాం. అలాగే చేస్తాం. నువ్వు ఉత్తరం రాసేవు కదా అని ఆయనెవరో నాకు భోజనం పెట్టి గది ఇవ్వొచ్చుగానీ; రెండేళ్ళపాటు ఆ అరవ్వాళ్ళింటో నేను తిన్లేను."

శేషు ముందుకొచ్చింది "మెడ్రాసులో హోటళ్ళ వాళ్ళంతా తెలుగువాళ్ళని కాబోలు బావ వుద్దేశం?" అని పకపకా నవ్వింది.

"అది కాదు శేషూ, నేనన్నది! నాలుగేళ్ళు ఈ వూళ్లో చదివి మీ ఇంట్లో తిన్నంత సుఖవుకాదని అలా అన్నాను."

"పోనీ వోపని చెయ్యకూడదు?" అంది కమలమ్మ—అంటే శేషు తల్లి— "అప్పుడనుకున్నట్టుగా పెళ్ళిచేసేస్తె ఇద్దరూ వెళ్లి ఉండొచ్చుగా."

రమణ లేచి నిలబడిపోయాడు. "నో నో! అబ్‌సర్డ్! ఇంతోటి ఆనర్స్ చదువుకీ నాకొక గార్డియన్ ఉంటే తప్ప సాగదా యేమిటి? పెళ్లి అవుటాఫ్ కొశ్చన్.—అయినా శేషుకి నేను తగను కూడాను. మొంటినించీ దాని టేస్టు వేరూ నాది వేరూనూ. కనక ఎవరైనా ఫారిన్ రిటన్‌డ్‌ని చూసి చేసియ్యండి. నాకోసం వెయిట్ చెయ్యక్కర్లేదు."

శేషు గబుక్కున లేచి అవతలి కెళ్ళిపోయింది.

"నువ్వు చెప్పింది రైటు కాదల్లుడూ" అన్నాడు మేనమామ. "నేను చూస్తున్నాన్లే, నువ్వేమో గడీకోసారి దాన్ని ఇంగ్లీషు మాటాడొద్దంటావు.కష్టపడి బాబ్ చేయించుకున్న జుట్టు పొడుగ్గా పెంచుకుని వాల్జడ వేసుకోమంటావు.మహిళా

సమాజాలూ మీటింగులూ ఇంగ్లీషు సినిమాలూ మానేసి ఇంచక్కా మొహానికి పసుపురాసుకుని అంగారు బొట్టుపెట్టుకుని రెండు చేతులకీ గాజులేసుకోమంటావు. అయితే మాత్రం ఇవన్నీ చిన్నతనం సరదాలే కదుట్రా?"

0 0 0

ఆనర్స్ రెండేళ్ళకాలంలోనూ రమణ మేనమామ ఇంటిమీదకి తొంగిచూడలేదు. ఐ. ఏ. ఎస్. కి సెలెక్టయి ట్రెయినింగ్ అయిపోయేక మాత్రం ఓసారి వాళ్ళని పలకరించడం మంచిదవి అనుకుంటూ ఇంటికొస్తే తన గొంతుల్లోనే ప్రత్యక్షమైంది శేషు. అదీ ఎలాగా, వ్యాసపీఠంమీద భాగవతం పుస్తకం పెట్టుకుని తల్లికి సత్యభామా కల్యాణఘట్టం వినిపిస్తూనూ!

తామరసాక్షుడచ్యుతు డుదార యశోనిధి పెండ్లియాడె

నానామనుజేంద్ర వందిత గుణస్థితి లక్షణ నత్యభామను

ఉద్దామ పతివ్రతా త్వనయధర్మ విచక్షణ తాదయా యశఃకామను

సత్యభామను: ముఖద్యుతినిర్జిత సోమనయ్యేదన్—అన్న పద్యానికి ప్రతి పదార్థం తాత్పర్యం చెబుతూనూ!

"హౌ బ్యూటిఫుల్! క్వైట్ అనెక్స్పెక్టెడ్!" అన్నాడు.

"అక్కడికి నువ్వొక్కడివే ఏదో మహా ట్రెయినింగై వొచ్చినట్టు!" అంది శేషు.

"నాకిప్పుడెన్నొచ్చో తెలుసా? లక్ష్మీస్తోత్రం, విష్ణుసహస్రనామం, భజగోవింద శ్లోకాలు, అన్నపూర్ణాస్తవం, ఆఖరికి వెంకటేశ్వర సుప్రభాతం కూడా అర్థాలూ తాత్పర్యాల్తో సహా ట్రెయినింగైపోయేను!"

"నిజంగా?"

"నిజంగానే. ఈ వూరొచ్చి రెండేళ్లయింది. ఐతే ఇవన్నీ వొక్కనెల్లోనే నేర్చేసేను."

"మా పౌలాలూ అవీ చూసేవా, మరి?" అన్నాడు రమణ ఉత్సాహంగా.

"చూణ్ణా మరి? రేపు నువ్వు కోతలకో నూర్పులకో వెళ్ళి కళ్ళాల్లో కూచుంటే నాయుడుబావకి ఎంకి పట్టికెళ్ళినట్టు అన్నం తీసుకురావొద్దూ?"

0 0 0

అలా ఆలోచించుకుంటూ పాతజ్ఞాపకాలు తోడుకుంటూ అభిజాత్యం ఓవేపూ ఉదాసీనత ఓవేపూ బాధపెడుతున్నా శేషు రమణ గదిలోకి వెళ్ళలేదు.

"లే, శేషూ! భోజనాలు చేద్దాం" అని రమణ పలకరిస్తే కూడా ఆమెకి ఉత్సాహం రాలేదు. "నాకు భోంచెయ్యాలని లేదు."

"ఎందుకనేం? ఉదయం టిఫిను కూడా తిన్లేదు."

"నువ్వు మాత్రం తిన్నావేంటి? ఏవేవో జ్ఞాపకాలు—బాధగా ఉంది."

"అదంతేలే. నాకూ అల్లాగే. ఇంకచాలు గానీ పద."

"నన్నీపూటకి వొదిలేసి మీరు—"

"డోంట్ బి సిల్లీ. మనకా స్వతంత్రం లేదు. మనం ఇల్లా ఓ పూటంతా యెడమొహం పెడమొహం అని ఈపాటికే బోల్డు గుసగుసలైపోయుంటాయి." అని కాలింగ్ బెల్ బటన్ నొక్కాడు కలెక్టర్ రమణ.

"యస్సార్!" "వొస్తున్నానండి" "ఆయ్." అని మూడు కంఠాలు పలికాయి.

0 0 0

"నువ్విలా మౌనంగా ఉంటే నాకు బావుండదు శేషూ. నేచెప్పింది ఆలోచించు. ఈ జిల్లాలో కలెక్టర్ సతీమణి మహిళా సంఘానికి అధ్యక్షురాలుగా ఉండడం ఆచారంట. నీ మౌనం చాలా విమర్శకి అవకాశం యిచ్చింది."

"నాకలాంటి వాటిమీద నమ్మకం లేదు"

"ఒకప్పుడుండేదే కద."

"ఇప్పుడు లేదంటున్నాను కదా."

"అదికాదు శేషూ. నువ్వు పొడి పొడిగా మాటాడకు. తేల్చెయ్యి అటో ఇటో"

"అంటే? నాకు ఛాయిస్ ఉందిటా?"

"అఫ్‌కోర్స్. లేదు!"

"ఇప్పుడే కాదు, ఎప్పుడూ లేదు" అంది శేషు. "మంచిగానీ చెడ్డగానీ. నేను నమ్మనీ, నమ్మకపోనీ, నువ్వు చెప్పినట్టల్లా చేసేడమే నా కర్తవ్యం. స్టూడెంట్‌గా ఉండి మా నాన్నకి కాబోయే అల్లుడిగా ఉన్నప్పట్నుంచీ నువ్వే అధికారం చెలాయిస్తున్నావు. నేనెలావుంటే నీకు భార్యగా ఉండడానికి తగుదునో అన్నిగీతలు గీసిపెట్టేవు. నీ అభిరుచులు కాపాడ్డం కోసం మావాళ్ళు మీవాళ్ళు స్థితిమంతులే అయినా అన్నీ వొదులుకొని పాతకాలపు నగలూ సిద్ధాంతాలూ మోస్తున్నాను."

"అయామ్ సారీ శేషూ. టెరిబ్లీ సారీ. అప్పటిలో నేనిలా పెద్ద బాధ్యతగల వుద్యోగానికి వస్తాననుకోలేదు."

"రైటే బావా. కాని చిక్కల్లా ఎక్కడొచ్చిందంటే ఆరోజుల్లో నన్ను నువ్వు మారమన్నప్పుడు ఒక్కసారిగా నాగరీకం వొదిలేసి పాతకాలానికి వెళ్ళిపోడం కష్టం కదా, కష్టమైన పని చేస్తున్నానని గర్వంతో మారేను. అలా అని నన్ను అడుగడుక్కీ మారిపోమనడం న్యాయం కాదేమో అనిపిస్తుంది. పోనీ నేను నిన్ను కొంచెం మార్చాలనుకుంటే నువ్వు మారుతావా? అది చెప్పు."

"సమంజసం అయితే తప్పకుండా మార్తాను. దానికేం ఉంది?"

"నువ్వు ఇంటిలో వున్నప్పుడు, మనిద్దరం ఏదైనా బంధువులింటిలో శుభకార్యాని కెళ్ళినప్పుడూ పంచా లాల్చీ వేసుకోమన్నాననుకో. వేస్కుంటావా? ఇట్ లుక్స్ సోఫన్నీ!"

"అలా అంటే ఎలాగ—? పరిస్థితులు చూడాలి గదా."

"అంతెందుకు? ఇంకోటి చెప్తాను చూడు.నిన్నేదో బ్లాక్ మెయిల్ చేస్తున్నానని అనుకోకు. మనిద్దరి మధ్యా జరిగేదే చెప్తాను—ఆరోజు, అంటే మన పెళ్ళయిననాడు రాత్రి, నువ్వు నా దగ్గరిగా వొస్తే నీ నోరు సిగరెట్టు వాసన వేస్తోందని—ముద్దుపెట్టుకోనివ్వలేదు, నేను: ఆవేళ నిన్ను కోరిందే నా మొదటి కోరిక, నీకొక్కవల్సిన ..ంగా నన్ను మూసలో పోసి తీర్చుకున్నావు కదా, వెంటనే ఈ అలవాటు మానేస్తావని గర్వంగా అనుకున్నాను. ఒక్కసారిగా ఎలా మానడం, క్రమంగా—అని తప్పించుకున్నావు. పదేపదే అడిగి నిన్ను విసిగించడం నాకు మొహమాటంవేసి వొదిలేసినందుకు నువ్వు నామాటని మర్చేపోయేవు. ఆఖరికి—నీకు గుర్తుండకతప్పదు కదా—ఓసారి మనం మైసూరు వెళ్ళేం. అక్కడ సినిమాహాల్లో నువ్వు సిగరెట్టు కాలుస్తూవుంటే నువ్విక్కడ కరెక్టరని తెలియక గొడవచేసేరు, నాకు కష్టమనిపించి "పోనీ మానెయ్యకూడదా" అన్నాను. "టేకిట్ ఈజీ" అన్నావు నువ్వు—

రమణ దీర్ఘంగా నిట్టూర్చాడు. టిన్‌లోవి, కేస్‌లోవి సిగిరెట్లన్నీ పోగు చేసి న్యూస్‌పేపర్లో వేసి లైటర్‌తో మంట చేసేడు. లైటర్‌ని చెత్తబుట్టలో వేసేడు. "ఐమ్ సారీ శేషూ" అని ఆమె చేతులు రెండూ పట్టుకున్నాడు.

"ఈ పాతివ్రత్యం ఎన్నాళ్ళులే." అనే చవకబారు వెక్కిరింపు శేషుకి నోటిదాకా వచ్చింది. కాని రమణ నిర్ణయంలో బలం ఆమెకి తెలుసును.అంచేత ఆ చేతుల్ని పైకెత్తి ముద్దుపెట్టుకుంది.

* *

("యువ" మాసపత్రిక—దీపావళి 1972)

# శివాయ విష్ణురూపాయ

"అరవై నాలుగు మందొచ్చేరు, ఇంటర్వ్యూకి" అన్నాడు రామచంద్రయ్య షర్టువిప్పి వంకెన తగిలిస్తూ.

జానకి మొగాన నిరాశ పులుముకుని చూసిందంతే.

"అరవై నాలుగు మందిలోనూ అరుగుర్ని యేరేరు, ఇంటర్వ్యూ చేసిన బోర్డు" అన్నాడు రామచంద్రయ్య. ఈ మాటు చిరునవ్వుతో తల యెగరేసి.

"అంటే యాభై ఎనిమిదిమంది పని గోవిందా అన్నమాటేనా?"

"అన్న మాటేమిటి, ఉన్నమాటే! ఇంకా ఇప్పుడేం చూసేవు, మళ్ళీ ఈ ఆరుగుర్లో వొక్కణ్ని యెంచాలి. అప్పుడు ఇందులో ఐదుగురిపని హరేరామ హరే క్రిష్ణా!"

"అదేం?"

"ఉన్న ఖాళీ ఒక్కటే కదుటే!"

జానకికేం తోచలేదు. అడగవలసిన ప్రశ్న గొంతుకలోంచి ముందుకి రాక మింగుడుపడక వక్కలా బాధపెట్టింది.

రామచంద్రయ్య గట్టిగా నవ్వాడు. 'నువ్వేమిటనుకుంటున్నావో చెప్పేదా?" అన్నాడామె బుజంమీద చెయ్యేసి.

"నే నేమిటనుకుంటే యేమిట్లాభం" అంది జానకి, నియుత్సాహం అంతా వొలకబోసి చూస్తూ, నిలబడ్డపాటుని ప్రగల్భంగా నవ్వుకుంటూ గర్వపడుతూ ప్రేమ కురిపిస్తున్న మొగుడితో మాటాడ్డానికొక ధోరణంటూ దొరకలే దామెకి.

"లాభమున్నా లేకపోయినా సరే నువ్వేమనుకుంటున్నావో చెప్పేస్తున్నాను. ఇంతా హైదరాబాద్ దాకా పరీక్ష కెళ్ళి ఇంటర్వ్యూకెళ్ళి మా ఆయన గారు మా నాన్నగారి దగ్గరికెళ్ళేరో లేదో! ఒక్కసారి మామగారూ అని పలకరిస్తే ఈ వుద్యోగం మా ఆయనకి రాకుండా పోతుందా అని అనుకుంటున్నావు అవునా?"

తెల్లబోయింది జానకి. ఆమె అనుకుంటున్నది సరిగ్గా అదే.

"కాని మీ నాన్నగార్ని పలకరించకుండా, ఆయన్ని చూడకుండా, కనీసం సలానా ఆయన మా మామగారు సుమండీ అని చెప్పుగోకుండా అరవై నాలుగు మందిలోంచి ఆరుగుర్లో వొచ్చిపడ్డాను, తెలుసా!" అన్నాడు రామచంద్రయ్య సర్వంగా.

"ఆ పట్టుదల మానేసి ఆయన దగ్గరకోసారి వెళ్ళొస్తే ఈ చివరి వడ పోతలో కూడా చిక్కంలోంచి కిందరాలిపోకుండా బంగార్లాం టి వుద్యోగం మీ కొస్తుంది. మనకిది జీవన్మరణ సమస్య. ఆయన టెలిఫోన్లో పిల్చి గోరుతో మీటితేచాలు అంతా గుప్చుప్‌గా సక్రమంగా జరిగిపోతుంది." అని చెప్పాలనుం టుంది జానకికి చెప్పడానికి స్వతంత్రం వుంది. చనువుంది అవసరంవుంది. అధికారం కూడా వుంది. కాని అలా చెప్పిన మీదట అలా చెయ్యకపోడానికి ఆయనకీ అవన్నీ వున్నాయేమో!

ఈ వుద్యోగం కోసం ప్రయత్నించడానికి తలపెట్టిన దగ్గర్నుంచీ అన్నీ సక్రమంగా జరగం అంటూ బెదిరిస్తున్నాయి. అడ్వర్టయిజు మెంటు ఈయన కంటికి ఆలస్యంగా అవుపడ్డది. అప్లికేషన్‌ఫారం తెప్పించడానికి వాళ్ళకి రాయ డానికి టైమ్ లేకపోతే హైద్రాబాదులో ఎవరో ఫ్రెండుకి టెలిగ్రాం మనియార్డర్ చేసి తెప్పించేరు– ఛలానా కట్టడానికి పదిరూపాయలు అప్పు దొరకడం గడ్డు సమస్య అయిపోయింది. వ్రాతపరిక్షకి ఇంటర్వ్యూకి రెండుసార్లు హైద్రాబాదు స్వంతఖర్చులమీద వెళ్ళి రావడమయింది. ఇప్పటికీ ఉద్యోగ ప్రయత్నపర్వం పర్వతమై రెండు వందల రూపాయల అప్పు చూపెడుతోంది.

చివరికి మిగిలేవి శ్రమా ఖర్చులేనా?

"బంగారప్పళ్ళెనికయినా గోడచేరుపు వుండాలికదండీ" అంది జానకి వేదాంతిధోరణిలో యెటోచూస్తూ.

"నేను బంగారప్పళ్ళెం అయినా కాకపోయినా మీ నాన్నగారికి గోడ చక్కని వుపమానం" అని నవ్వి దూరంగా వెళ్ళేడు రామచంద్రయ్య.

జానకి మనసు చివుక్కుమంది.... గోడ లక్షణాలు కొన్ని నాన్నగార్లో లేకపోలేదు....

ఎమ్మే ఫస్టుక్లాసు, రామచంద్రయ్య. ఎలెల్బీ చదువుతూ ట్యుటోరియల్ కాలేజీలో పనిచేసేవాడు. గోల్డు మెడలిస్టు. ఆస్తీ అంతస్తూ లేకపోవచ్చు, కులం గోత్రం వుంది. వెనకాముందూ ఎవరూ లేకపోవచ్చు. విలువా విజయం

వున్నాయి. అరటిపండు వొలిచి చేతిలోపెడితే తినడానికింకా ఏవేనా అడ్డుతగ లొచ్చుగాని, ఆయన పాఠం చెబితే విద్యార్థి బోధపరచుకోలేకపోవడం అంటూ వుండదు.

ఈ పెళ్ళి నాన్నకిష్టంలేదు. ఇంట్లో ఎవరికీ ఇష్టంలేదని దబాయించేరు. అమ్మ చెయ్యాసరా యివ్వకపోతే ఆయన కాళ్ళకిందపడి తన ఆత్మ నలిగిపోయేదే.

కూతురు వుందని జ్ఞాపకం వుండి, దానికొక మొగుడున్నాడని, వాళ్ళిద్దరూ కలిసి అన్యోన్యంగా స్నేహంగా వుంటున్నారని గుర్తులేనట్టు ప్రవర్తిస్తాడు. ఈ పెళ్ళిఅయిన రెండేళ్ళలోను మూడుసార్లు ఆయన్ని కలుసుకోడం జరిగింది. మొదటిసారి: ఈ వూరికి ఆయనగారు క్యాంపువచ్చారుట. ఎవరో కలెక్టరాఫీసు వాళ్ళు వచ్చి చెప్పారు. అమ్మాయిగార్ని రమ్మన్నారని జీపుపంపేరు. ఆహ్వానంలో ఆప్యాయత లోపించడం బహిరంగంగానే కనబడింది. వెళ్ళలేదు.సాయంకాలం బజార్లో ఆయన్తో వెళుతూ వుంటే వెనకాల కారుహారన్. తలతిప్పిచూస్తే నాన్నగారు. పక్కన అల్లుడున్నాడన్న సంగతి నాకు కనబడనేలేదన్నట్టుగా రెండు నిమిషాలు మాటాడారు, కారుదిగి. 'ఆయనకి నా సంగతి జ్ఞాపకం లేదు. నీకూ లేదేం!' అని రామచంద్రయ్య—సరదాకే—అన్నాడు. కాని ఎంత గాయపడింది, గుండె!

క్లాస్‌మేటు అరుణ పెళ్ళి రాజమండ్రిలో జరిగింది. ఒస్తేనే కాని వీల్లేదని వాళ్ళతోబాటు కార్లో తీసుకుపోయింది. అక్కడికి మొగపెళ్ళివారి తరపున వచ్చారుట నాన్నగారు. పెళ్ళికొడుకు తండ్రి నాన్నగారి దగ్గర జాయింటు సెక్రెటరీ. అక్కడ ముఖాముఖీ రామచంద్రయ్య వచ్చాడా అనిగాని, రాలేదా అనిగాని అడగలేదు. అతని ఆరోగ్య సంపాదన స్థితిగతులు—ఏవీ భోగట్టా చేయలేదు.

మూడోసారి; శ్రీకాకుళం కలెక్టరాఫీసుకి తణిఖీ కెళుతూ 'వాల్తేరులో నా రైలు అరగంటాగుతుంది. వచ్చి కనపడు' అని కార్డు రాసేరు. వెళ్ళకూడదనే అనుకుంది. రామచంద్రయ్య బలవంతంగా సిటీబస్సెక్కించి పంపేడు. అప్పుడూ అంతే.

ఆయనగారు ఆఫీసరయితే ఈయనగారు ఆయనకి అల్లుడు. అల్లుడనే కారణం చేత జులుంచెయ్యడం చేతకాదు. కాని ఏదోబలం— వ్యక్తిస్వాతంత్ర్యం కావచ్చు. ఆబలంతో ఆయన్ని ఈయనా నిర్లక్ష్యంగానే చూస్తూ వచ్చాడు.

ఈ ఒక్క వేపు నుంచి అలక్ష్యం అవమానం మినహా ఈయన జీవితంలో ఎక్కడా అంగుళం మేర చిరుగులేదు. ఒక్కనాడు దుఃఖం, చీకటి, మౌనం ఉదాసీనత లేవు— పాతబడిన ఈ యింట్లో స్థిరమైన సంపాదనా శాశ్వతమైన వుద్యోగం లేవన్న చింత లేకుండా ఈ రోజులన్నీ ఇలా హాయిగా గడిచిపోతున్నాయంటే దానికి కారణం ఈయన గొప్పతనం చాకచక్యం సంస్కారం కావా!

"మీరొక్కరు మడిగట్టు కూర్చుంటే సరిపోయిందా! మీరు చెప్పిన ఆరుమందిలో మిగతా ఐదుమంది ఏ మినిస్టర్నో సెక్రటరీనో ఆశ్రయించి ఈ వుద్యోగం సంపాదించుకునే ప్రయత్నాలు చెయ్యడంలేదని మీకెలా తెలుసు? మా నాన్నగారు కాకపోతే మరొకరు. మీరీ చివరివడపోతలో కిందికి దిగిపోకుండా చూసే బంగారుతండ్రి మరో మహానుభావుడు— ఎవర్నో ఆశ్రయించడం మంచిదేమోనండి' అంది. చివరికి ఉండలేక, అతను బయల్దేరుతున్న సమయంలో జానకి.

"ఇలాంటి వడపోతలు ఎన్నొచ్చినా సరే నేనలాంటి పనిచెయ్యను" అన్నాడు రామచంద్రయ్య.

o o o

గవర్నమెంట్ సెక్రటరీ నారాయణరావుగారి విజిటర్స్‌రూమ్‌లో ఒంటరిగా కూర్చున్నాడు రామచంద్రయ్య. 'అయ్యగారు విజిటర్స్ అందర్నీ చూసేసి లోపలి కెళ్ళిపోయారుబాబూ. భోజనంచేసి వస్తారు కూర్చోండి' అని అటెండర్ తాను చెయవలసిన మర్యాద చేసేడు.

పక్కగదిలో అత్తగారూ, మామగారూ మెల్లిగా మాట్లాడుకుంటున్నారు. వినబడుతూనే వుంది. కాని ఆ గదికీ ఈ గదికీ మధ్య మందమైన దుప్పటితెర. మా మధ్యని తెరలాగే ఉంది.మా మధ్యనీ తెర — అనుకున్నాడతను. తెరలా తనని మరుగుపరుస్తున్న సమకాలీన ప్రపంచంలోనిపోటీధోరణి తెలుసుకుని— కాంప్రమైజ్ తెరలోంచి.

'చీటీరాసి ఇవ్వండి బాబూ, తమపేరూ ఊరూను. అయ్యగారికి చూపిస్తాను' అని నిశ్శబ్దంగా సూచించాడు అటెండరు.

'ఆయనంతట ఆయనొచ్చిచూస్తే పలకరిస్తాను, లేకపోతే నాదార్ని నేను పోతాను. అంతేకాని చీటీరాసి పంపుకునే అవసరంలేదు' అన్నట్టుగా బిగిసిపోయి కూర్చున్నాడు రామచంద్రయ్య-వద్దని అటెండర్‌కి సంజ్ఞచేసేసి.

ఫోన్ గణగణ మ్రోగింది.

'హలో— అత్తగారందుకుంది ఫోన్. 'నమస్కారం.... నేను వారి మిసెస్‌ని మాట్లాడుతున్నాను.... ఆయనా?.... ఇప్పుడే ఎక్కడికో బయల్దేరారు.. ఆఫీసుకే అయ్యుంటుంది.... కారుదాకా వెళ్ళుంటారు; పిలవనా?'

సంభాషణ ఆపేసి ఫోన్‌మీద మూత పెట్టినట్టు తెలుస్తోంది 'మినిస్టర్ ప్రకాశరావుగారి పరసనల్ సెక్రటరీట.'

'పదహారు——' అన్నాడు నారాయణరావు.

'హలో— సరే.... ఆఁ.... అయిదుకాగానే వచ్చేస్తారు. ఆఫీసుకి రింగప్ చెయ్యొచ్చు-థాంక్సు' అని సుందరమ్మ ఫోన్ పెట్టేసినట్లు ధ్వనివినపడింది.

'కేండిడేట్లారుగురు; రికమెండేషన్లు పదహారూను!' అని విసుక్కున్నాడు నారాయణరావు— 'వెధవదేశం, వెధవ మనుషులూనూ!'

బూట్లచప్పుడు.

వెళిపోతున్నాడు. వెళ్ళిపోయానని చెప్పేసిన కర్కోటక చక్రవర్తి నారాయణ్రావు ఆఫీసుకి నిజంగానే వెళ్ళిపోతున్నాడు.

అవేపునుంచి దారుంది. అలా గది దాటి, వరండాదాటి, కారుదాకా వెళ్ళిన చప్పుడు.

అటువేపు కూడా దట్టమైన తెరే—

కారు తలుపు తీసిన చప్పుడు.

'ఎవరు? ఇంతసేపేం చేస్తున్నాడు? వాడికి బుద్ధిలేకపోతే నీ బుద్ధేమైంది? వెళ్ళి పేరు కనుక్కురా!' గద్దింపు.

బహుశా అటెండరు——విజిటర్స్ రూమ్‌లో ఎవరో ఉండిపోయారని చెప్పుంటాడు. అయినా ఎంత పెడసరపు మాట!

తెర ఒత్తిగిల్లింది—అందులోంచి అటెండర్ మొహం కనబడ్డది.

'రామచంద్రయ్య' అన్నాడు రామచంద్రయ్య; కూర్చునే.

'రామచంద్రయ్యగారంట, బాబూ.'

'రామచంద్రయ్యాలేదు, భీమచంద్రయ్యాలేదు అవతలికి పొమ్మను!' గద్దింపుతో కారుతలుపు మూసినచప్పుడు.

కారు బయల్దేరిన చప్పుడు.

మళ్ళీ తెర ఒత్తిగిల్లింది.

'ఆఫీసుకి దయచెయ్యమన్నారు బాబూ,' అన్నాడు అటెండరు.

"మీ రావణాసురుడికన్నా నువ్వే నయం' అనుకున్నాడు రామచంద్రయ్య రేచి.

దేముడివ్వని వరం తానే యిచ్చేసిన పూజారిలా అబద్ధపు ఆశాబీజం వేసిన అటెండరు తెరకోపక్క ఒత్తిగిలి నిలబడి తెరనోపక్కకి ఒత్తిగిల్లించి పట్టుకుని రూపాయి విలువగల చూపు చూస్తూ చెయ్యి జాపేడాలేదా అన్నంత అనుమానంగా గాల్లోపెట్టాడు.

"నీ గురించి పొరపాటు పడ్డాను. నీకన్నా మీ రావణాసురుడే నయం." అనుకొంటూ తెరదాటేడు రామచంద్రయ్య.

గబగబా నడిచి కాంపౌండున్నూ దాటేసేడతను.

అక్కణ్ణుంచి వొక్కసారి అనుకోకుండా తలతిప్పిచూసేడు. అత్తగారు గుమ్మంలో నిలబడివుంది. పక్కని అటెండర్ నిలబడున్నాడు.

తలతిప్పి ముక్కుసూటిగా నడిచేడు రామచంద్రయ్య.

అటెండరు పరుగెత్తుకొస్తున్నట్టు అతని కళ్ళు పసిగట్టాయి.

"మీరు రెండుసార్లు గెంటేశారు....అనాలనిపించింది కసిగా. ఈ పతనం నాదికాదు. మీ గర్భవాసానిదే....అంచేత మీదేనూ." అనుకున్నాడతను, తన్ని వోదార్చుకుంటూ. "ఇంక మీరు నా దగ్గరికి రావాల్సిందే కాని నేనై మీ దగ్గరకి రావడం కల్లోమాట."

ం ం ం

ట్యుటోరియల్ కాలేజీ గెస్టురూమ్‌లో నిద్రపోతున్నాడు రామచంద్రయ్య. తలుపు దబదబా చప్పుడైతే నిద్రలేచాడు.

తలుపుతీసి, ఎదురుగా నిలబడ్డ అత్తగార్ని చూసి నిర్ఘాంతపోయాడతను.

"నమస్కారం! దయచెయ్యండి" అని తప్పుకున్నాడు.

మామగారంటే కోపమూ, అసహ్యమూనూ అతనికి.

"వాడొక దగుల్‌బాజీ: దగాకోరు! పూటకి ఠికానాలేని పుండాకోరు! పగటిపూట ట్యుటోరియల్ కాలేజీ, రాత్రి ఎలెల్బీ అఘోరిస్తున్నాడు. నా బంగళాలో అడుగు పెట్టడానికి వాడికి తాహతులేదు. దా కూతురు ఎలాగో వాడి మాయలో పడ్డాది. వాడికి వుద్యోగం యివ్వడంవల్ల మీరు నేరంచేసినట్టు నేను భావిస్తున్నాను.' అన్నాడాయన, తన ఎదురుగా, పల్లిగ్గా, తను పనిచేసిన ఈ ట్యుటోరియల్ కాలేజీ ప్రిన్సిపాల్ కమ్ ప్రొప్రయిటర్ రామనాథంతో, అనాడు.

గవర్నమెంట్లో సెక్రటరీ, అఖండ ప్రజ్ఞాశాలి; కర్కోటకుల్లో కర్కోటకుడూ అని, ఆయన నోటికి జడిసి, నోటి కంపుకి జడిసి; రెండునెలల్లో ఎలెల్బీ పరీక్షలున్నాయి, అంతవరకైనా ఆగవయ్యా అని మొరెట్టుకున్నా వినిపించుకోక వెంటనే తన వుద్యోగానికి స్వస్తి చెప్పేసేడు, రామనాథం.

ఆరెణ్ణెల్లూ తనుపడ్డ అవస్థ వర్ణనాతీతం. దానిక్కారణం అయిన అలాంటి మామగారి మీద అసహ్యంకాక మరేం పుడ్తుంది.

కాని ఆ బాధంతా నయమైపోడానికీ, మర్చిపోడానికీ అత్తగారి సాయమే కారణం. ఆవిడ అమోదముద్ర, చెయ్యి ఆసరాలేకపోతే జానకి తనతో రాడానికే వీలుండేదికాదు. పైకేమో, నువ్వు ప్రాజ్ఞురాలివి, నీకు నా అడ్డేముంటుంది; అది అన్యాయం అని కూతుర్ని దువ్వినట్టే దువ్వి, జానకిమీద సి.ఐ.డీల్ని పెట్టింది ఆయన కాదూ! అయినా, అనుకున్న చోటికి, అనుకున్న చోటికి తెచ్చి అత్తగారే తనకి జానకిని అప్పగించింది. ఎంత అసహ్యపడ్డా ఎంత మొహమాటపడ్డా, ఆవిడ అరోజు స్టేషన్‌కి తెచ్చిన ఆయిదు వందలరూపాయలూ, జానకి బంగారపు వస్తువులూ తమకి ఎన్నాళ్ళో అదునుకి రాడం రామచంద్రయ్య మరచిపోలేని విషయం. ఆవిడకి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పుగోవాలని, చేతుల్లారా నమస్కారం చేద్దామని ఎన్నిసార్లు ప్రయత్నిస్తే అన్నిసార్లూ ఈ రావణాసురుడే అడ్డం వచ్చేసేడు. ఇవాళ అతగాడు అంత అవమానకరంగా మాట్లాడి వుండకపోతే-అత్తగార్నోమాటు పలకరించి వచ్చేవాడే. ఆయన అన్నమాట తక్కువ మాటగాదు. 'రామచంద్రయ్యా లేదు, భీమచంద్రయ్యా లేదు అవతలికి పొమ్మను!' తనపేరు తెలిసే అన్నాడు. దాంట్లో సందేహం లేదు; క్రూరుడు!— అని కసిగా అనుకుంటూ మొహం ముడుచుకుని కూర్చున్నాడు రామచంద్రయ్య.

'మొహమేనా చూపించక్కుండా వొచ్చేసేరు. అంత పరాయివాళ్ళం అయిపోయామా?'

'అవతలికి పొమ్మను! అని కసిరేసిన ఆత్మీయులకి మొహం చూపించడం యెలాంటిదో నేనింకా ప్రెయినింగవలేదు.'

'ఆయన కసిరేశాడనుకోండి. నేను కబురుపెట్టానుగా... అయినా, ఆయన మీరని తెలిసే కసిరేసేరనుకుంటున్నారా?.... ఏదో తొందర్లో ఆఫీసుకి వెళిపోతూ- ఆయన సంగతి మీరెరగంది కాదుకదా!'

'కాదు, మీరాయన్ని వెనకేసుకు రానక్కర్లేదు.... అయినా అంతకంటే ఎక్కువ గౌరవం జరుగుతుందని నేను ఆశించనూలేదు.... అంత గరళం కడుపులో వుంచుకున్నాక మీరు కబురు పెట్టినా నా కాళ్ళు వెనక్కి తిరగలేదు.... అది నా తప్పయితే మన్నించండి.'

సుందరమ్మ మాట్లాడలేదు.

'మీరంటే నాకు భక్తి. గౌరవమే. కాని ఎప్పటికప్పుడు మీతోకూడా నిష్కర్షగానే కఠినంగానే మాట్లాడవలసిన దురదృష్టంలో పడిపోతున్నాను. దానికూడా మీర్నను క్షమించండి.'

'మనం ఎవరంకూడా ఒకర్నొకరు క్షమించుకోగల ఔన్నత్యం పొందలేదేమోలెండి.' అంది సుందరమ్మ.

'కావచ్చు.'

'కులాసాగా వున్నాం. ఫలానా చోటున్నాం అని ఉత్తరం రాయడం కూడా మానుకున్నారు. హైదరాబాదుకి ఎన్నిమాట్లువొచ్చుంటారో—— కనబడ్డం పోయింది. కనీసం ఫోన్లోనైనా పలకరించరాదా?....ఇది మీకు న్యాయంకాదు. చదువుకున్నవారు; సంస్కారం గలవారని మా అమ్మాయి మిమ్మల్ని నమ్ముకొని మీతో వొచ్చేసింది. ఏదో పెద్దవాళ్ళం మాకుండే బలహీనతలు మాకుంటాయి. అవి గాయాలూ. వ్రణాలూ అయిపోకుండా చూసే బాధ్యత మీకు మాత్రం లేదా?" అని కళ్ళొత్తుకుంది సుందరమ్మ.

రామచంద్రయ్య మాట్లాడలేదు.

సుందరమ్మా కాసేపేమీ అన్లేదు.

మళ్ళీ ఈ నిశ్శబ్దం ఏ దూరాలు తెస్తుందోనని ఇద్దరూ అల్లాడిపోతున్న సమయంలో సుందరమ్మే సంభాషణ ఆరంభించింది. అదీ ఎలాగు——

"ఎక్కడవున్నారు; విశాఖపట్టణంలోనేనా?"

"అవునండి"

"ట్యుటోరియల్ కాలేజేనా?"

"అవునండి"

"పాపాయి కులాసా?"

"అవునండి"

"ఏదేనా విశేషం——?

"ఛిఛీ అదేం లేదండీ."

"పన్లూ అవీ చేసుకోగలుగుతోందా? నేనేమీ మప్పలేదు. గారంచేసి పాడు చేసేను, దాన్ని—"

'అవసరం ఆలోచనకి ఆధారమండి....అయినా ఏం పెద్ద పన్లుంటాయని? ....ఇద్దరం!....ఇద్దరికీ వ్యాపకాలున్నాయి. కలిసి వెళిపోతాం; కలిసి పనిచేసు కుంటాం.'

'వ్యాపకాలా? అంటే, ఎక్కడన్నా పని చేస్తోందా?'

'పని కాదండి. బియ్యే చదువుతోంది.'

'కాలేజీకెళ్ళే?,

'అహా! కాలేజీకెళ్లే, ఏం, వెళ్ళక? అంతకన్నా పెద్దవాళ్ళు నాదగ్గర ట్యుటోరియల్ కాలేజీలో మెట్రిక్కూ- పియ్యూసీ చదువుతున్నారు?'

'మీరున్నారు దానికి చదువుకు లోటుండదు.'

రామచంద్రయ్య నవ్వేశాడు. 'సరస్వతీ కటాక్షమే గాని లక్ష్మీ కటాక్షం లేదంటారా?'

"లేదని నేనెందుకంటాను? ప్రయత్నంలో వుంటుంది బాబూ, పురుషుడి భాగ్యం.శక్తిమీద నమ్మకం కలవాళ్ళూ శక్తివంచన లేకుండా పనిచేసే వాళ్ళూనూమీరు.'

'నేనేకాదు. మామగారూ అంతే. రివిన్యూ ఇన్‌స్పెక్టరుగా జాయినై సెక్రటరీ ఉద్యోగానికి రాలేదా, వారు!?'

'పొగడ్తకింద ఏదో అగడ్త'ని శంకించి అయోమయంగా చూసింది సుందరమ్మ.

'ఎటొచ్చీ ఇతరులు వారిమీద అధారపడి వృద్ధిలోకొస్తే సంతోషించే స్థాయికి ఎదిగిపోయి ఆయనకి మా ఆదర్శాలు బోధపడకుండా వున్నాయను కుంటాను!'

సుందరమ్మ అతనివేపొకసారి చూసి నేలకి చూసింది. గొంతు సవరించు కొని 'మీరేం, వచ్చారు?' అంది.

'నిజానికి రెణ్ణెల్లలో ఇక్కడికి రావడం యిది మూడోసారి,

'అదేం, ఆలాగ?'

-కథంతా సూక్ష్మంగా చెప్పాడు- 'ఎల్లుండి ఇంటర్వ్యూ.'

సుందరమ్మ దీర్ఘంగా నిట్టూర్చింది. 'అంచేకని—మీ పట్టుదల వదిలి మామ గారిదగ్గిర కొచ్చేరన్నమాట!' అన్నది. చిన్నగా నవ్వొచ్చిందామెకి.

'మీ రన్నది నా కర్థంకాలేదు....ఈ వుద్యోగానికి మామగార్ని నా గురించి రికమెండు చెయ్యమని అడగడానికి వొచ్చేనమకుంటున్నారా?'

'రికమెండేం ఖర్మ? ఇచ్చేదే ఆయనగా;'

తుళ్ళిపడ్డాడు రామచంద్రయ్య. 'ఇదొకటా?' అన్నాడు. పొద్దున తను ఆయన బంగళాకి వెళ్ళడం ఎంత క్షమించరాని నేరమో ఒక్కసారి అర్థమై పోయింది.

'ఆదేమిటలా అంటారు?మీరు అప్లయ్ చేసింది........డిప్యూటీ రిజిస్ట్రార్ ఉద్యోగానిక్కాదూ?'

'అవునండీ—'

'మరదే! ఆ సెలక్షన్ ఆఖరి ఇంటర్‌వ్యూ మీ మామగారు కండక్ట్ చేస్తారు! అదేదీ మీకు తెలియనట్టు మాటాడతారేం?'

'నాకు తెలియదూ, తెలియదూ. ఎంతమాత్రం తెలియదు! నా కొచ్చిందల్లా ఇదుగో ఈ లెటరు—' అని. వంగి, సూట్ కేసులోంచి ఒక కాగితంతీసి ఇచ్చాడు. 'రెండుసార్లు హైదరాబాదు వెళ్ళికూడా మాయింటికి వెళ్ళేరుకాదు; మా అమ్మకైనా కనిపించేరుకాదంటూ జానకి కళ్ళ నీళ్ళు పెట్టుకుందని పొద్దున్న మీ ఇంటికొచ్చేను........'

సుందరమ్మ అతని ఇంటర్‌వ్యూ లెటర్ చూసింది. అందులో అభ్యర్థుల లిస్టులేదు. ఇంటర్వ్యూ చేసే అధికారి పేరుగాని హోదాకాని లేదు. ఇతన్ని ఎల్లుండి పదిగంటలకి ఫలానా ఆఫీసుకి రమ్మనుంది, అంతే........కానీ మిగిలిన కేండిడేట్సు కొందరున్నారు. వాళ్ళలో నలుగురు అప్పుడే మినిస్టర్ల ద్వారా.ఇంకా కొందరిద్వారా నారాయణరావును ఆశ్రయించడం జరుగుతోంది........ఒత్తిడి తేవడం అవుతోంది.

ఆమె లేచింది. "సరే-నేవెళ్ళొస్తాను.... సెలెక్షన్ ఆయనే చేస్తారు. అప్పుడే చాలామందికి తెలిసింది. మీకూ తెలిసిందేమో అనుకున్నాను....ఎన్ని రికమెండేషన్లు, ఎన్ని ఫోన్‌కాల్సు! ఇల్లెగిరిపోతోంది —.... మినిస్టర్లూ ఎమ్మెల్యేలూ చెబితే ఆయన కెలాగూ కిట్టదనుకోండి...కాని మీరంటే మరీ కిట్టదే!.... భగవంతుడా! ఈ గండం ఎలా గడిచేటట్టు?"

రామచంద్రయ్య తను తీసుకున్న గోతిలో తనే పడిపోయినప్పటి బాధ పడ్డాడు. పశ్చాత్తాపానికికూడా అవకాశంలేని నేరం ఇది. శిక్షే దీనికి గతి.ప్రాయశ్చిత్తంలేదు. జానకి సెంటిమెంటుకి తన వ్యక్తిత్వం, జీవితానందమైన ఆత్మవిశ్వాసం అన్నీ బలై పోయాయి. 'ఇంక ఇంటర్వ్యూకెందుకు నేను?కి ఇంటికెళిపోవచ్చేమో.' అనుకున్నాడు అన్నాడు.

'అలాంటి పిచ్చిపన్లు చెయ్యకండి....ఇంతవరకూవచ్చి ఇంటర్వ్యూ మానెయ్యడం ఎందుకు!....మీరొక పనిచేస్తారా!?....సాయంకాలం మళ్ళారండి.... అదికాదు, మీకు తెలీదు....నేనున్నానుగా!....మీకేమేనా అవమానం జరిగితే అది నా పూచీ....తప్పకుండారండి....మీ కాయన ఈ ఉద్యోగం ఎలా ఇవ్వరో నేను చూస్తాను....అయిద్దాటేకరండి....మీ తరపున నేనాయన్తో దెబ్బలాడతాను....మా అల్లుడవటమే ఈ ఉద్యోగానికి మీ డిస్క్వాలిఫికేషనైతే ఆయన ఇంత పెద్ద ఉద్యోగంలో వుండి అల్లుణ్ణిలా చూడ్డం ఈనాటి ఈ ప్రభుత్వానికొక డిస్క్వాలిఫికేషన్ కాకుండాపోతుందా!' అంటూ వెనకాతల ఆతను నిశ్శబ్దంగా వస్తూ వుండగా, ముందు నడుస్తూ ఆ ఆవరణ దాటింది సుందరమ్మ.

o o o

ఐదూ ఐదయ్యేసరికి నారాయణరావు కారు బంగళాకి చేరింది. నారాయణరావు కారుదిగి గబగబా లోపలికొచ్చేశాడు. అతన్ని చాలా కుతూహలంతో గమనిస్తూ, అల్లుడి సంగతి ఎలా చెప్పడమా అని ఉత్కంఠతో ప్రణాళికలు వేస్తోంది సుందరమ్మ.

మొహం కడుక్కునివచ్చి అక్కడ సిద్ధంగావున్న నిమ్మకాయరసం పుచ్చుకున్నాడు నారాయణరావు.

'చల్లగా ఉన్నట్టుంది; డాబామీద కూర్చుందామా?' అన్నాడు.

సుందరమ్మ తలూపింది.

'అయితే కుర్చీలు వేయించు.' అని అద్దందగ్గిర కూర్చున్నాడు నారాయణరావు.

ఫోన్ మ్రోగింది—

'వెధవలు—చూడు....పొద్దుటివాడే కాబోలు. అయిదుగంటలకి ఎంగేజ్ చేస్తానన్నాడుకాదూ! గొప్ప పంక్చువాలిటీ కీపప్ చేస్తున్నాడు—'

'హలో—' సుందరమ్మ ఫోన్ తీసింది. 'అవునండీ నమస్కారం.... ఇప్పుడే వచ్చినట్టున్నారండి; చూసి చెప్తాను....' ఫోన్ రిసీవర్ చెవిమూసింది. 'చీఫ్ సెక్రటరీగారి పి. ఏ.—'

నారాయణరావు లేచొచ్చి రిసీవరు అందుకున్నాడు. 'హలో—నారాయణ రావు స్పీకింగ్.'

'సారీసార్....సారీ టు డిస్టర్బ్ యు....ఇందాక ఆఫీసుకు ఒక కవరు పంపేం...దాని ఎక్నాలెడ్జ్ మెంట్ మీ పి.ఏ. ఇచ్చేరు....అది అందిందా అని చీఫ్ సెక్రటరీగారు అడగమన్నారు——'

'అందిం దందింది.'

'అది సీక్రెట్ ఎండ్ ఇమ్మీడియట్ సార్. అందులో, లోపలొక సీల్డ్ కవరుంటుంది. అదంతా ఇంటాక్ట్‌గా అందిందా లేదా, వెరిఫైచేసి తమర్ని స్వయంగా ఎక్నాలెజ్ చెయ్యమన్నారండి....సారీ ఫర్ది ట్రబుల్‌సార్.'

'ఫరవాలేదు——వెరిఫైచేసి. రాసి పంపిస్తాను. మీ రెక్కణ్ణుంచి మాట్లాడుతున్నారు?'

'బంగళానుంచి సార్.'

'యువిల్ గెటిట్ ఇన్ టెన్ మినిట్స్' ఫోను పెట్టేశాడు.

గబగబ నడిచి కోటు జేబులోంచి కవరు తీశాడు. 'ఐదుగంటలకు సరిగ్గా తెచ్చిచ్చాడు స్టెనో. పేరుపెట్టి రాసేరు. మోస్ట్ ఇమ్మీడియేట్, సీక్రెట్ కదా అని జేబులోపెట్టి తెచ్చేసేను—కార్లోనే ఓపెన్ చేసుండవల్సింది. కోట్‌స్టాండ్ నుంచి సోఫావరకు నడుస్తూ జవాబు ఆశించకుండా మాట్లాడాడు నారాయణరావు.

సుందరమ్మ చూస్తోంది.

సోఫాలో కూర్చుని కవరు విప్పాడు నారాయణరావు. సీల్డుకవరు ఓసారి అటూ ఇటూతిప్పి తణిఖీచేసి, సరిపోయిందన్నట్టుగా తలాడించేడు. 'యెస్! సుందరీ. ఒక ఎక్నాలెడ్జ్‌మెంటు, ఒక బ్లాంక్ కవరుమీద చీఫ్ సెక్రటరీగారి ఎడ్రసు టైప్‌చేసిపెట్టు?' అని, సీల్డుకవరు బ్రేక్ చేసేడు. 'నెంబరు, డేటు దీంట్లో వుంటాయి; దీనిప్రకారం టైప్ చెయ్యి....'.... సీక్రెట్టుట, సీక్రెట్టు. ఫార్స్ చూసేవా: మూడ్రోజుల్నుంచీ ఆదరగొట్టేస్తున్నారు ఊరంతాను. వాళ్ళం దరికీ తెలిసిన సీక్రెట్టు మనకి ఇప్పుడు పంపించేరు.... సీక్రెసీ కాదిది హిపో క్రిసీ—!'

కాగితం ఆమెకి అందిస్తున్నవాడే, హఠాత్తుగా వెనక్కి లాక్కున్నాడు నారాయణరావు. ఆరు సెకెండ్లలో చదవడం పూర్తయిన ఆ కాయితంలో ఏదో అరనిమిషంపాటు అతని దృష్టిని ఆకర్షించి అక్కడే నిలబెట్టింది. అతను దీర్ఘంగా నిట్టూర్చి తల నిలువుగా ఆడించేడు.

సుందరమ్మ గమనిస్తోంది.

రెండు దొంగచూపుల్తో ఆమె గమనిస్తోందన్న సంగతి కనిపెట్టేశాడు నారాయణరావు. పొద్దున్న రామచంద్రయ్య రావడం అతనికి గుర్తు వచ్చేసింది.

'ఒక లెటర్ చెప్తాను, షార్ట్‌హేండ్ నోట్‌బుక్కూ పెన్సిలూ తీసుకో.' అని కాగితం మడతపెట్టేసేడు నారాయణరావు.

సొరుగులోంచి పుస్తకం పెన్సిలూ తీసింది సుందరమ్మ.

'స్ట్రిక్ట్లీ కాన్ఫిడెన్షల్—' అని కాళ్ళు టీపాయ్‌మీద బారజాపి, సోఫాలో బాగా వెనక్కి జార్లబడి, సీలింగుఫాన్ వంక చూస్తూ ప్రారంభించాడు నారాయణరావు.

* * *

'అన్యాయం' అంది సుందరమ్మ, టైప్‌చేసిన కాయితాలు నారాయణరావు కందిస్తూ.

'చాలా ఆలస్యంగా అన్నావు.'

'అంటే?'

'నేను షార్ట్‌హేండ్‌లో రిపోర్టు డిక్టేటు చేసినప్పుడే నువ్వామాట అంటా వనుకున్నాను.'

'కొన్ని అన్యాయాలు చూసీ చూడగానే అర్థంగావు.'

'కొన్ని గొప్పపన్లు చేసి చూపించినా అర్థంకావు; నీలాంటివాళ్ళకి.'

'గొప్ప పనికూడా నంటారా?'

'తప్పకుండా. నూటికి ఒక్కడు కూడా ఇలాంటి పరిస్థితుల్లో ఇలాంటి నిర్ణయం తీసుకోడు.'

'ఏమైనా, మీరిలా చేస్తుండకూడదు. అమ్మాయీ అల్లుడూ మీ ఔన్నత్యాన్ని గుర్తించే అవకాశం మీ చేతులారా జారవొదులుకుంటున్నారు—'

నారాయణరావు నవ్వాడు. 'చాంచల్యమా, నీ పేరు స్త్రీ, అన్నాడు షేక్స్పియరు.'

'ఆ రోజులు పోయాయి. స్థిరనిశ్చయానికీ పట్టుదలకీ చిహ్నం ఇప్పుడు స్త్రీ!'

'అబ్బో, అబ్బో! చాలాదూరం వెళ్ళిందే. కథ! అల్లుడు మంచి వుపన్యాసమే ఇచ్చేడన్నమాట?'

సుందరమ్మ మాట్లాడలేదు–

నారాయణరావు సంతకాలు పెట్టడం పూర్తిచేసి కాలింగ్ బెల్ బటన్ నొక్కాడు–

'సంతకం అయిపోయింది; ఇక ఎవరేమనుకున్నా అంతే.'

'తాంబూలా లిచ్చేశాను, తన్నుకు చావండి, అన్న అగ్నిహోత్రావధానుల్లా వున్నారు, మీరివాళ.'

'నీ అల్లుడు గిరీశం కంటె హీనుడేమో ఆలోచించేవా?'

'నా కూతురు బుచ్చెమ్మ కాదు.'

'నా శ్రీమతి మాత్రం ఇవాళెందుకో ఒట్టి వెర్రివెంకమ్మలా మాట్లాడుతోంది.'

'అభిమానాలు అపేక్షలు లేనివాళ్ళకి మిగిలినవాళ్ళంతా వెర్రివెంగళప్పల్లా అవుపడతారు.'

'సెంటిమెంటు పొరలున్న కళ్ళున్న వాళ్ళకి మిగిలిన వాళ్ళందరూ ఔరంగజేబుల్లా కనిపిస్తారు.'

'పెరటిచెట్టు ముందుకి రాదన్నారిందుకే కాబోలు.'

'నేను వాడిపెరట్లో చెట్టునని వాడనుకున్నట్టయితే వాడికిదే మందు!'

—'సార్!' అని అటెండర్ లోపలి కొచ్చాడు.

'ఈ కవరు అతికించేసి, ఇప్పుడే తీసుకెళ్ళి ఛీఫ్ సెక్రెటరీగారి బంగళాలో ఆయనకి స్వయంగా అందజెయ్యి. కార్లో వెళ్ళు.'

'అల్లుడుగారొచ్చేరండి.' అంటూ కవరు పుచ్చుకున్నాడు అటెండర్.

'రమ్మను.'

రామచంద్రయ్య లోపలికొచ్చేడు. అతని మొహంలో ఏదో కొత్తకాంతి కనబడి చిన్నబుచ్చుకుంది సుందరమ్మ. అదేమీ గమనించకుండా అతను నారాయణరావుకి నమస్కారం చేసేడు. ఆ నమస్కారం మామూలుగా అల్లుళ్ళు

మామలకు పెట్టే దండాల్లాంటిది కాదు. ఆఫీసర్లకి తాబేదార్లు పెట్టే నమస్తే ల్లాంటిదీ కాదు. విలక్షణంగా వుంది.

'దీర్ఘాయుష్మాన్ భవ-' అన్నాడు నారాయణరావు.

'ఎందుకూ? కలకాలం కష్టాలు పడమనా?' అంది సుందరమ్మ.

'కష్టే—ఫలే!' అని నవ్వాడు నారాయణరావు.

'చేతిలో వున్న ఫలం నోట్లో కెళ్ళేదాకా రూఢి లేనప్పుడు ఇంకా కష్టేఫలే అంటూ తత్వంచెప్పి మోసం చెయ్యడమెందుకు?' గొంతుకలో వెలక్కాయంత ఉక్రోషం అడ్డంపడి సుందరమ్మ ఆ క్షణంలో అంతకన్నా అన్లేకపోయింది.

రామచంద్రయ్య వాళ్ళిద్దర్నీ మార్చి మార్చి చూస్తున్నాడు. వాళ్ళిద్దరూ తనక్కడ వున్నట్టు గమనించకుండా ఒకరి కళ్ళలో కొకరు చూసుకుంటూ మాట్లాడుకున్నారు.

'స్స్!' అని చేత్తో ఆగమని సంజ్ఞ చేసి, ఆమె మాటల్ని తానే అరికట్ట గలిగినంత దర్పహాసం చేసేడు నారాయణరావు.

'మీరా? నన్నాపుతున్నారా? ఇంకా ఎన్నాళ్ళాపుతారు?' అన్న ధోరణి వచ్చేసింది సుందరమ్మకి. 'మిమ్మల్ని పెళ్లాడినప్పుడే తెలుసుకున్నాను' అని ఆమె హఠాత్తుగా బిగ్గరగా మాట్లాడసాగింది. 'మీకెవరిమీదా అపేక్షలూ అభి మానాలూ లేవు. కాపరాని కొచ్చినప్పట్నుంచి చూస్తూనేవున్నాను. పిల్లలుపుట్టిన నాటి నుంచి దినదినం చెబుతూనే వున్నాను. వాళ్ళు పెద్దాళ్ళయ్యాక ఇహచూస్తూ వూరుకోలేక మొర్రెట్టుగుంటూనే వున్నాను— కాని మీరు ఎప్పటికప్పుడు జావ గారిపోతూనే వున్నారు. మీ బలం మనకో, మన బంధువులకో పిల్లలకో పని కొస్తుందని తెలిసిన సమయానికి అస్త్రసన్యాసం చేస్తూనే వున్నారు. ఇది చాతకాని తనమో తెలీదూ; సిగ్గులేని తనమేమో నా కంతకన్నా తెలీదు. అందర్నీ పాలించే నారాయణమూర్తి వారిపేరు పెట్టుకుని అయినవాళ్ళకి ఆకుల్లోను, కానివాళ్ళకి కంచాల్లోను పెట్టడం ఇదేం బాగులేదు-'

'సుందరీ!' అని గావుకేక పెట్టాడు నారాయణరావు. 'ఏమిటి, ఫూల్లాగ మాట్లాడతావు?'

'ఎవరు ఫూలో, కొంచెం ఆలోచిస్తే తెలుస్తుంది!' అంది సుందరమ్మ మళ్ళీ బిగ్గరగానే.

'ఐసే, షటప్!' అని లేచి వెళ్ళాడు నారాయణరావు.

రామచంద్రయ్య నిర్ఘాంతపడి చూస్తున్నాడు. 'ఐమ్‌సారీ——' అన్నాడు; నారాయణరావలా వెళ్ళగానే.

'ఆ మాట అనవలసింది నేను బాబూ' అని, అక్కడున్న డూప్లికేటు కాపీ రిపోర్టు అతనికి అందించింది.

అతనది ఆత్రంగా అందుకొని చదువుకున్నాడు. 'శ్రీ చీఫ్ సెక్రటరీ గారికి; నమస్కారం- పైనుదహరించిన ఆర్డర్‌లో నన్ను ఒకానొక ఇంటర్వ్యూ జరపమన్నారు కాని, కొన్ని కారణాలవల్ల ఆ ఇంటర్వ్యూ జరిపి నేనిచ్చే నిర్ణయం ఏదైనాసరే, అది నా వ్యక్తిగత నిర్ణయమే అయిపోయే ప్రమాదం వుంటుందని భావిస్తూ, సదరు ఇంటర్వ్యూ చేసే బాధ్యత నేను స్వీకరించలేనని, తెలియజేయడానికి మిక్కిలి విచారిస్తూ వున్నాను.'

కాగితం క్షుణ్ణంగా చదువుకొనిచిరునవ్వుతో సుందరమ్మకు అందించాడు రామచంద్రయ్య. 'ప్రాజ్ఞులుమీరు. రాగద్వేషాలకి అతీతులై వుండాలి. కనీసం మామగార్ని చూసైనా తెలుసుకోలేరా;' అనాడు, 'ఆయన అలా రాసిపంపటం మన కుటుంబానికి ఎంతోమేలు. ముఖ్యంగా నాకు అదెంతో ఉపకారం.'

○ ○ ○

'పెద్ద ఫిక్స్‌లో పెట్టేశారే,నన్ను!'అన్నాడు శివయ్య, గవర్నమెంట్‌లో ఇంకో సెక్రెటరీ.

'నేనా?' అన్నాడు నారాయణరావు.

'తెలుసులెండి సార్. ఎందుకు దాస్తారు! ఈ ఇంటర్వ్యూ అసలు మీరు కండక్టు చెయ్యవలసిందట, "కారణాంతరాలవల్ల" మీరు ఇది స్వీకరించలేదట;; అందుకని ఈ వురిశిక్ష నాకు విధించారట!'

'ఉరిశిక్ష కాదు ఏంకాదు. మీరుకూడా అలా అంటే ఎలా?'

'ఏదో ఒకటి; మీ ప్రసాదమేగా, ఇది?....చెప్పండి బాబూ చెప్పండి.ఈ ఇంటర్వ్యూలో ఏదో పితలాటకంవుంది. రేపు ఉదయం పంపిస్తారుట, డిటేల్సు, ఎంగేజ్ మెంట్సే మీ పెట్టుకోకుండానట; టెలిఫోన్‌లో పిక్సప్ చేసేరు?'

'ఇంకేం, దంచెయ్యండి.'

'క్లూ ఇవ్వండి——'

'క్లూ ఏం ఖర్మం,వివరాలేఇచ్చాను;చీఫ్ సెక్రటరీగారికి పంపిన రిపోర్టులో'

'మీ రిపోర్టు కాపీ నాకు పంపలేదు.'

'ఐసీ-దానికి నేనేంచెయ్యగలను!'

'మీరు సాల్వ్‌చెయ్యలేని ప్రాబ్లెమ్ నేను సాల్వ్‌చెయ్యగననా?'

'అని చీఫ్ సెక్రటరీగారు అనుకున్నారు!'

'మీరు కూడా అనుకుంటున్నారా!'

'నాకు ముందేతెలుసు. అందులో సమస్య నేను తప్ప ఎవరైనా సరిగ్గానే సాల్వ్‌చేస్తారు.'

'ఐసీ-అయితే ఇది మీ స్వవిషయం అన్నమాట.'

'ఏమో; మీరే ఊహించుకోండి.'

'ఏం వూహించుకోనక్కర్లేదు. నే నింకా ఏదో పెద్దఒత్తిడి వస్తోంది కాబోలు; చీఫ్ మినిస్టరా, ఫైనాన్స్ మినిస్టరా. చీఫ్ సెక్రటరీయా, బోర్డు మెంబర్సా- ఎవరున్నారిందులోనని ఊరికే స్పెక్యులేట్ చేస్తున్నాను.'

'అఫ్‌కోర్సు వాళ్ళు లేకపోలేదు, ఈరింగులో.'

'తెలిసిపోయిందిలెండి సార్. వాళ్లెవరో వున్నారన్న కారణంచేత ఇలాంటి బాధ్యతల్ని మీరు ఎన్నడూ మరొకరి మీదికి షిఫ్టుచెయ్యలేదు. అంచేత ఇందులో ఎవరో మీ స్వంతమనుషులే-'

'నేనేంచెప్పను-' అన్నాడు నారాయణరావు, నిర్లిప్తంగా; కొంచెం విషణ్ణగా కూడా. 'ఇప్పటికి చెప్పిందే చాలా ఎక్కువ!'

'ఇంత కన్నా ఇంకేంచెస్తారు! అందులో మీరు!' అనుకున్నాడు శివయ్య 'మిగతాది నేను చూసుకుంటాను హార్. యు కెన్ లీవిట్ టు మి-' అన్నాడు చిరునవ్వుతో.

నారాయణరావు అప్పుడు నవ్వాడు.

శివాయ విష్ణురూపాయ!

(పడమటిగాలి అంటే నా ఉద్దేశం పాశ్చాత్య సంస్కృతి అని, ఈ టైటిల్ చిరంజీవి నగ్నముని 'తూర్పు గాలి'ని చూసేక నాకు తట్టింది. అతని తూర్పు 'చైనా', అతని "తూర్పుగాలి" విప్లవ ఛాయ.

నా కథల్లో రెండే రెండు హిందీలోకి తర్జుమా అయ్యేయి. నేనూ కాటూరి విజయసారధీ కలిసి రాసినకథ వొకటి కన్నడంలోకి తర్జుమా అయింది. అయితే ఈ కథమాత్రం హిందీలోకీ కన్నడంలోకీ కూడా అనువాదితమైంది.

ఈ కథ తొలిసారిగా 19 / 2లో జ్యోతి దీపావళి సంచికలో ప్రచురితమైంది. "నాకు నచ్చిన నా కథ "శీర్షికలో,"యువ" 1984 సెప్టెంబరు సంచికలో రెండోసారి.)

# పడమటిగాలి

సాయంకాలం ఆరవుతూంది. పడమటిగాలి తాకిడి ఇంకా తగ్గలేదు. కందిపోతున్న బుగ్గలమీద నాలుగు నిమిషాల కోసారి 'కూటికురా' పౌడరద్దిన మెత్తని రుమాలుతో సేదదీర్చుకుంటూ ఊరికి పడమరగా వున్న కనకసుందరం గారి బంగళాకి నడిచాను మైలున్నర. ఎదురెండ; ఎదురుగాలి,చిరాగ్గా వుంది.

కౌంపౌండు గేటుదగ్గిరే నా గుండెలో నిరుత్సాహం దూరింది. పోర్టికోలో గాని షెడ్లోగాని కారు లేదు.

మీనాక్షమ్మగారు లేరన్నమాట........

గేటు దాటి లోపలి కెళ్ళాను. పోర్టికో దగ్గిర మెట్ల మీద కూచుని అనసూయమ్మ ఇన్లాండు కవరు రాస్తోంది. నా అలికిడికి ఆమె ఉత్తరం మడిచేసి లేచి నిలబడింది.

"అమ్మగా ర్లేరు."

"ఎక్కడికెళ్ళేరు?" అనడుగుతూ తలుపు వేపు చూసేను. దగ్గరగా నొక్కుంది. పైనున్న అద్దాల్లోంచి కనబడుతున్న విశాలమైన హాలు బావురుమంటోంది.

"తెలవదండి."

"ఒక్కరే వెళ్ళారా?"

"ఆంజనేయులుగార్తో వెళ్ళారండి."

అంజనేయులుగారు లయన్స్ క్లబ్ మెంబరు. పెద్ద సర్కిల్ వుంది, బిజినెస్ మాగ్నెట్.

"ఎప్పుడొస్తారు?"

"తెలవదండి" అనుసూయమ్మ నవ్వింది. నా ప్రశ్న తెలివితక్కువ ప్రశ్నలా దాని కనిపించుంటుంది. ఆంజనేయులుగారితో వెళితే ఎప్పుడొస్తారో ఎవరూ చెప్పలేరు. అయినా అలా అనడానికి వీల్లేదు.

"నే నొస్తానని తెలుసే ! ఎందుకు వెళ్ళిపోయారు చెప్మా?" అన్నాను.

అది నన్ను నేనే వేసుకున్న ప్రశ్న.

అందుకే నన్నట్లుగా అనుసూయమ్మ మాట్లాడలేదు. ఆంజనేయులు గారొచ్చి ఏదో ప్రోగ్రాం ఫిక్సప్ చేస్తే "ఎందుకు" అన్న ప్రశ్న వెయ్యకుండా బయల్దేరుతారు, మీనాక్షమ్మగారు, ఆ సంగతి తెలిసికూడా అనుసూయమ్మ మాట్లాడకపోయి వుండొచ్చు.

"నేనొస్తెచెప్పమని ఏమైనా చెప్పేరా!"

చెప్పి వుండరు. కనీసం "ఆ బాబొస్తె కూర్చోబెట్ట" మనైనా చెప్పి వుండరు. అసలు అనుసూయమ్మతో మాట్లాడ్డానికే తీరుబాటుండదు ఆవిడికి; ఆంజనేయులుగారొస్తె.

"సరే, ఒచ్చేక; నే నొచ్చి వెళ్ళేనని చెప్పు!" అని వెనక్కి తిరిగాను.

పడమటిగాలి వేడికంటే తీక్షణమైన బాధేదో కలిగింది. రాకపోయుంటే బాగుండేది. కానిరాకుండా యెలా వుండగలను?

"ఆరు గంటలకి రండి, అప్పుడైతే యెవరూ వుండరు." అన్నారావిడ. "మీతో ప్రోగ్రాం ఇంట్లో యెవరూ లేనప్పుడు పెట్టుకుంటే బావుంటుంది. మా పూర్ణ వుంటే మిమ్మల్ని మాక్ చేస్తుంది. ఆరింటికి అది ఆర్ట్ స్కూల్ కెళ్ళిపోతుంది. నే నొక్కదాన్నే వుంటా నింట్లో" అని వివరంగానూ చెప్పేరు మీనాక్షమ్మగారు.

బోలెడు ఆశలతో వొచ్చాను. నన్ను రమ్మని ఆవిడ ఎక్కడికో వెళ్ళి పోయారు.... "తెలవదండి" అనుకుంటూ ఈ అనసూయమ్మ వొకతి—

వెనక్కి వెళ్ళాలని లేదు. మీనాక్షమ్మగారు బహుశా త్వరగా వచ్చేస్తారని ఆవిడకోసం కొంతసేపు హాల్లో వెయిట్ చెయ్యె వచ్చునీ అనిపిస్తోంది! వేనిటీ

అయితేనేం. అది నా కంట్రోల్లో లేదు. అదీ ఆవిడ చుట్టూనే తిరుగుతోంది. హాల్లో టెలిఫోనుంటుంది, ఆంజనేయులుగారింటిలో టెలిఫోనుంది. ఫోన్ చేసి "నేనొచ్చానండి, మీరన్న ప్రకారం, మరి మీరు వెంటనే వొచ్చెయ్యండి" అనగలనా? అన్లేను, "ఒక్క నీవే నాకు; పెక్కు నేనులు నీకు." నా వెర్రి గానీ, ఆంజనేయులుగారూ అవిడా ఈ వేళప్పుడు ఆయనింటి కెందుకు వెళతారు?

"గేటు తీసినవారు దయచేసి గేటు మూసి వెళ్ళండి"

—"మా ఆయన పన్లన్నీ అలాగే వుంటాయి- ఏది చేసినా ఎడ్వర్టైజ్ చేసినట్టే! ఈ బోర్డు మహిమ ఎలాంటిదంటే; మా యింటికి దొంగతనానికొచ్చిన వాడైనా సరే; గేటు మయ్యకుండా లోపలికి రాలేదు; గేటు ముయ్యకుండా పారిపోడు!" అన్నారు మీనాక్షమ్మగారు; ఆ బోర్డు బావుందని నేను మెచ్చుకున్నప్పుడు.

మీనాక్షమ్మగారు తమాషాగా మాట్లాడతారు. అంతకంటె ఆకర్షణగా డ్రెస్ చేసుకుంటారు. డ్రెస్ అయిన దానికంటే స్మార్ట్‌గా బిహేవ్ చేస్తారు. బిహేవ్ చేసిన దానికన్నా అద్భుతంగా పాడుతారు.

"ఇంకా ఇవికాక నీకు తెలియంది మరోటుంది!" అన్నారు ఇన్కమ్ టేక్సాఫీసర్ రామస్వామిగారు; కొంటెగా నవ్వి.

"అదేంటండోయ్?" అన్నాను. తెల్లమొహం వేసి.

ఆయన అంతలోనే తేల్చేస్తూ "అన్నిటికంటా కూడా, ఆవిడ ఈ వయస్సులో కూడా ఇంత అందంగా వుండడమే గొప్ప!" అన్నారు. అది ఆయన చెప్పదల్చుకున్నది కానే కాదని స్ఫురించేటట్టు.

రామస్వామిగారు సంగీతం గురించి ఆర్టికల్స్ రాస్తారు. ఆయనతో మీనాక్షమ్మగారు చాలా క్లోజ్‌గా వుంటారు. అలా వుంటారని కనకసుందరంగారికి కూడా తెలుసు. ఓసారి మీనాక్షమ్మగారు ఏదో సంగీత కచేరికి వెళ్ళి చాలా లేటుగ వచ్చేరని కనకసుందరంగారు ఆవిడమీద నా ఎదురుగుండానే చిరాకు పడ్డారు. "రామస్వామిగారు వచ్చేడా, కాన్సర్ట్‌కి!" అని అడిగారు కనకసుందరం గారు. "ఆయన నా మ్యూజిక్ మీద మంచి మంచి కామెంట్స్ రాస్తారని మీ కాయనమీద అనుమానం!" అన్నారు మీనాక్షమ్మగారు. "అనుమానం ఏం లేదు నమ్మకమే" అన్నారు కనకసుందరంగారు.

కాలింగ్ బెల్ మోగింది, వరండామీద.

గేటు అప్పుడే మూసేను. తల ఇంటివైపు తిరిగి ఉండడాన్ని అనసూయమ్మ లేవడం కనబడింది.

ఇంట్లో యెవరో ఉన్నారు!

యామిని కళ్ళలో కదలాడింది.

యామిని ఇంటిలో వుంటే హాల్లో ఓగంట వెయిట్ చెయ్యవచ్చు.యామిని మాట్లాడదు. కూచుంటానని నేనంటే మేగజైన్స్, డ్రింక్స్ నామీద విసిరికొడ్తూ పేట్రనైజింగ్ ధోరణిలో పడిపోతుంది. నాకది బాగా వుండదు. గంటసేపు మీనాక్షమ్మగారి కోసం వెయిట్ చెయ్యాలంటే రెండు గోల్డ్‌స్పాట్‌లు ఉండి తీరాలా?

వెయిట్ చెయ్యడం ప్రాబ్లెమే.

మీనాక్షమ్మగారు "ఇండిఫినిట్లీ లేటు" నడుస్తున్న ట్రెయిన్ లాంటివారు. ఆవిడకోసం వెయిట్ చెయ్యడం ఇంకా పెద్ద ప్రాబ్లెమ్.

మీనాక్షమ్మగారి కోసం వెయిట్ చేస్తూ యామిని కెదురుగా కూర్చోడం- సొల్యూషన్ లేని ప్రాబ్లెమ్!

కాని తప్పేటట్టు లేదు.

యామినీ పూర్ణతిలక- కనకసుందరం మీనాక్షమ్మగార్ల ప్రథమసుపుత్రిక.. బి.ఏ. ఫైనల్ పరీక్ష మూడేళ్ళనుంచీ వ్రాస్తున్న అసూర్యం పశ్య! మోడర్న్ ఆర్ట్ నేర్చుకుంటూ, మోడర్న్ ఆర్ట్‌కన్నా అయోమయం దుర్గ్రాహ్యం అయిపోయిన "హైబ్రో" గరల్- ఇంట్లోంచి పరుగెత్తుకుంటూ వచ్చేసింది. ఆమె మాట్లాడితే వినాలనుంటుంది. కాని వింటే మొహం మొత్తుతుంది మరి.

"సారీ మేష్టారూ! మమ్మీ టౌన్లో కెళ్ళింది; అర్జంటుగా జడ్జీగారి మిసెస్ నుంచి ఫోన్‌కాల్ వస్తేను.... వన్నార్ టూ అవర్స్‌లో రిటర్నయిపోతుంది. మీరొస్తే ఎన్‌గేజ్ చెయ్యమంది. ప్లీజ్ కమిన్."

"ఆంజనేయులుగారితో వెళ్ళారని అనసూయమ్మ అంది?" అన్నాను.

"డోంట్ మైండ్ వాట్ దట్ డర్టీ బిచ్ సెడ్!"

నిస్సహాయంగా- ఆమె వెంట నడిచాను.

"మీరేంటీ, అలా వున్నారూ?" అన్నాను.

ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది యామిని. "ఎలా వున్నానేం?" అని దబాయించింది.

"బాగా అలిసిపోయినట్టున్నారు?"

అంతేకాదు. ఆమె మాట్లాడుతూ వుంటే ఆల్కహాల్ వాసన వస్తోంది.

జుట్టంతా రేగి వుంది. కళ్ళు నిద్రమత్తును సూచిస్తూ సగమే విడి వున్నాయి. నిద్రకోరుకుంటున్న కళ్ళో నిద్రనుంచి అప్పుడే తెరిచిన కళ్ళో తెలీడం లేదు. మీనాక్షమ్మగారుంటే ఈమెని తాగనివ్వరు. ఆవిడకాస్తా అలా వెళ్ళనిచ్చి ఈవిడ గారు ఓ డ్రింక్ పోసుకొని వుంటుందనుకుని భయపడ్డాను.

మెట్లెక్కి వరండా దాటి హాల్లో కొచ్చేం.

"ఓహ్!" అంది యామిని చిత్రమైన పోజులో వొళ్ళు విరుచుకుంటూ "ఐ షుడావ్ ఫాలెన్ ఎస్లీప్ ఇన్ మినిట్స్?" అంది. హాలు చివర బీరువాకి నిలువుటద్దం ఒకటి వుంది. అక్కడికి తొందరగా వెళ్తూ మధ్యలో ఓసారి ఆగి, "విచ్‌లా వున్నానా" అంది. మళ్ళీ అవయవాలు తొందరగా కదిలేటట్లు చురుగ్గా అటు తిరిగి అద్దం దగ్గిర చేరింది. "గాడ్! ఐ లుక్ సో హారిబుల్!" అంది.

హాలు తలుపు దాటి లోపలికొచ్చింది అనుసూయమ్మ. "బాబూ. దీనిమీద ఎడ్రసు రాసిపెట్టరా!" అని నాకు ఇన్లాండు కవరు అందిస్తోంది.

యామిని తన గదిలోకెళ్ళింది.

"బంటుపిల్లి నారాయణమూర్తి; ఫిట్టరు, డీజిల్ వర్క్‌షాపు; ఖర్గపూర్ రైల్వే స్టేషన్" అనసూయమ్మ చెప్పిన అడ్రస్ రాస్తున్నాను.

"ఇందాక మీ రొచ్చినప్పటికి పెద్దమ్మాయిగారు తలుపులేసుకుని గదిలో కూర్చున్నారండి. మీ రొచ్చారని చెబితే తిడతారని చెప్పలేదండి" అంది అనుసూయమ్మ నింపాదిగా.

"ఉత్తరం రాసుకున్నదానిని ఎడ్రస్ రాయలేవూ?" అన్నాను.

"ఇంగ్లీషచ్చరాలు నేర్నాస్తె ఆ ఉత్తరం ఎళ్ళదండి." అని నవ్వుతూ కవరు అందుకుంది.

అనసూయమ్మ తిన్నగా యామిని గదిలో కెళ్ళింది. నేను టీపాయ్ మీదున్న సినిమా పత్రిక ఏదో తిరగేస్తున్నాను. రెండు నిముషాలై వుంటుంది. యామిని పెద్దగా కేకలేస్తూ హాల్లో కొచ్చింది. వెనకాల ముద్దాయిలా అనుసూయమ్మ వస్తోంది.

"ఎప్పుడూ నువ్వింతే! సరిగ్గా గెస్ట్ లెవరో వొచ్చినప్పుడే నీ కర్జంట్ పన్లు తగుల్తాయి. వాళ్ళకి కాఫీలివ్వాలో టిఫిన్లందించాలో అని ఎగ్గొట్టానికే చూస్తా వెప్పుడూనూ. నీలాంటి డొమెస్టిక్ సెర్వెంట్సుంటే మా ప్రెస్టీజ్ నిలబడ్డట్టే!... మమ్మీ ఎన్నిసార్లు చెప్పింది నీకు! తన ఫ్రెండ్స్ వస్తె వాళ్ళని నువ్వు సరిగ్గా

ట్రీట్ చెయ్యడంలేదని? మమ్మీ రమ్మంది కదాని మాస్టారొస్తె రాగానే జస్ట్ కాజువల్‌గా లేరని చెప్పేసి అయన్ని పొమ్మనేశావు! సర్లే, వెళ్ళు! మమ్మీ రాగానే చెబుతాలే, నీ పని!" అంటోంది యామిని.

"ఇప్పుడే వచ్చేస్తానమ్మా! అమ్మగారొచ్చేసరికి ఇక్కడుండకపోతే అడగండి" అంది అనసూయమ్మ.

"సర్లే వెళ్ళన్నానుగా."

అనసూయమ్మ వెనక్కి నడుచుకుంటూ నావేపు ప్లీజింగ్‌గా చూస్తూ తలుపు దగ్గిరగా లాగి హాలు దాటింది.

"లెటర్ రాసిందట; అదిప్పుడే పోస్ట్ చెయ్యాలిట! బ్లడీ బిచ్! దాని పన్లన్నీ అర్జంటే" అంది యామిని కోపంగా. మళ్ళీ అంతలోనే 'కైండ్'గా అయిపోయి; "నా రూమ్‌లో కూర్చుందురుగాని రండి మేష్టారూ. ఐ వుడ్ లైక్ ఎ బాత్. మీన్‌వైల్; మీరు నా బొమ్మలు చూద్దురుగాని– నో నో!! మీ రింక పోస్ట్‌పోన్ చెయ్యడానికి వీల్లేదంతే. నేను ఇండిపెండెంటుగా వేసినవి మీ రొక్కటీ చూళ్ళేదు. దటీజ్ వెరీ మచ్ అన్‌లైక్‌యు." అంది.

నేనేదో అందామని గొంతు సర్దుకున్నా, నంతే. హాలు తలుపు దగ్గిరికి పరుగెత్తుకెళ్ళి ద్వారం దగ్గిర నిలబడి "జస్టెమినిట్" అంది. గదిలోకెళ్ళి; అందులోంచి మీనాక్షమ్మగారి గదిలోకి వున్న తలుపు తెరిచి అందులోకి వెళ్ళింది. మీనాక్షమ్మగారి గది తలుపు హాల్లోకి కూడా తెరిచివుండగా; సరాసరి వెళ్ళక ఈ రూట్ ఎందుకా అని ఆశ్చర్యపడుతూనే ఆమె నన్ను రమ్మని తల ఆడించి వేసిన ఆజ్ఞప్రకారం మీనాక్షమ్మగారి గదిలోకి వెళ్ళాను.

ఆమె, స్టీరియోసెట్ ప్లగ్ మెయిన్స్‌లోంచి తీసి, వైరంతా పొందిగ్గాచుట్టి; స్పీకర్లు రెండూ దానిమీద పేర్చింది. బాలమురళీకృష్ణ రికార్డులున్న అట్టపెట్టె తను తీసుకుంది. స్టీరియో, స్పీకర్లూ నేను తీసుకున్నాను. ఇద్దరం హాలుకి అడ్డంగా నడిచి, ఈ వైపున చివరగా ఉన్న ఆమె గదిలోకి వెళ్ళాం.

"ప్లీజ్ బి సీటెడ్, మాష్టారు. చేర్‌లో కంఫర్టబుల్‌గా లేకపోతే బెడ్ మీద కూర్చోండి. ఎక్స్‌క్యూజ్మీ-" అని; మంచంమీద డన్లప్‌బెడ్ మీద అడ్డదిడ్డంగా పడేసివున్న కట్టువిడిచిన గుడ్డల్ని తీసి దూరంగా పారేసింది. కొన్ని యాదృచ్ఛికంగా స్టాండుమీద పడ్డాయి.

స్టీరియో ప్లగ్ మెయిన్స్‌లో పెట్టింది. స్పీకర్లు రెండింటినీ వేరుచేసి వాటి

పిన్నుని సాకెట్స్‌లో పెట్టింది. "రికార్డ్ పెట్టుకోరు?" అంది వొయ్యారంగా వొంగి కళ్ళతో నవ్వుతూ.

నేను తలాడించాను; "వేసుకుంటాలే" అన్నట్టుగా.

"నౌ: టెల్మి వాట్ వుడ్యు హేవ్?"

"ఓ, నో! డోన్ట్ బాదర్ యువర్‌సెల్ఫ్" అన్నాను. నా మాట నాకే చిరాకేసి నెత్తిమీద ఒకటిచ్చుకోవాలనిపించింది.

"టీ, కాఫీ, గోల్డ్‌స్పాట్: కోకాకోలా: ఎనీ థింగ్ యు వాంట్:" అని, కొంటెగా నవ్వి "ఎనీ డ్రింక్స్ యు వాంట్!" అంది.

"ఒద్దండీ."

"మమ్మీ నన్ను చైడ్ చేస్తుంది! మిమ్మల్నిలా వదిత్తే!"

"నే నావిడతో చెప్తాగా!"

"నో! యు మస్ట్ టేక్ సమ్‌థింగ్. ఆల్‌రైట్. మీరెలాగూ చెప్పరు. నేనే సెలక్ట్ చేసి తెస్తాను. నో ఛాయిస్ ఫర్ యు నౌ."

ఈ లోపుగా బుజంమీద వేసుకున్న చీరా జాకెట్టూ ఎటాచ్‌డ్ బాత్‌రూం తలుపుమీద పడేసి– "ఎక్స్‌క్యూజ్మీ ఫర్ ఎ బ్రీఫ్ ఏబ్సెన్స్." అంది. ఆటోమెటిక్‌గా తాళంపడిపోయిన గదితలుపు తెరిచి హాలువైపు వెళ్ళింది.

నేను లేచి; "దేవాధిదేవ శ్రీ వాసుదేవ" రికార్డు ఏరుకుని ప్లేయర్ స్పీడ్ ఎడ్జస్ట్‌చేసుకుని; రికార్డు మేట్‌మీద పెట్టి ఆన్‌చేసేను. మధురమైన బాలమురళీ కృష్ణ కంఠస్వరంలోంచి మహత్తరమైన సంగీతం వినే మత్తుకి సిద్ధంకాసాగాను.

రెండు నిముషాలైంది.

చేతిలో పెద్ద రైల్వేసైజు గ్లాస్‌తో గదిలో అడుగు పెట్టింది యామిని. గ్లాసులో ఏదో డ్రింక్ వుంది.విస్కీ– సోడా కావచ్చు; సుగంధి షర్బత్ కావచ్చు. రంగునుబట్టి చెప్పడం కష్టం. రుచిచూస్తే తప్ప తెలీదు.

తలుపును పెద్ద చప్పుడుతో మూసి; "ఐ నో, యులైక్ ఇట్. ఓసారి మమ్మీ ఆఫర్‌చేస్తే పుచ్చుకున్నారు." అవి గ్లాసు నాకు అందించబోయింది.

నేను వద్దన్నట్టు చెయ్యాడించాను.

"డ్రింక్ తీసుకుంటూ మ్యూజిక్ ఎంజాయ్ చెయ్యండి నర్సరాజుగారూ; బావుంటుంది" అని ఆపుకోలేని నవ్వుతో అంది; యామిని. ఆమె తొడుక్కున్న "గురూ" షర్ట్‌మీద ఏదో ద్రావకం ఒలికిన చిహ్నాలున్నాయి; మెడదగ్గిరా రొమ్ము మధ్య; ఇంకా లోపలికి జాలువారి క్రిందికి ప్రవహించినట్టు–

ఈమె ఇందాక నేను రాకముందు కొంచెం తాగిందన్నది ఖాయం. మళ్ళా ఇప్పుడు మరో గ్లాస్ ఫ్రిజ్ దగ్గిర నుంచునే గల్ప్‌చేసినట్టుంది. "రా" కొట్టేదం దాకా వచ్చిందా?

"ఓకే; ఇట్స్ లెఫ్ట్ టు యు." అని గ్లాసు నాకు చాలా దగ్గిరసా పెట్టేసింది. "షెల్ఫ్‌లో మీదనే వున్నాయి నా పిక్చర్స్. అవి చూడ్డంమాత్రం మర్చిపోకండి; మ్యూజిక్‌లోపడి. మీకూ మమ్మీకి మ్యూజిక్ వుంటే మరేమీ అక్కర్లేదు!........ అఫ్‌కోర్స్! నేనో పెద్ద ఆర్టిస్టునని క్లెయిమ్ చెయ్యనుగానీ; ఆర్ట్ ఒక పర్వతమైతే దాని స్లోప్స్‌మీన కొట్టిన పల్టీలు, నా బొమ్మలు!" అని అల్లరిగా చూస్తూ బాత్‌రూమ్‌లో దూరింది యామిని.

"ఈవేళ, నా-

ఆరు శత్రువులను..........

అంటున్నాడు బాలమరళీకృష్ణ వాసుదేవుడితో దీనంగా.

ం ం ం ం

కిందటేడు నేనిక్కడి పి.జి. సెంటర్లో యమ్మే చదవడాని కొచ్చిన కొత్తలో; డాక్టర్ చంద్రశేఖరంగారు నన్ను కనకసుందరంగారికి పరిచయం చేసేరు.

కనకసుందరంగారు పడమటి దేశంవాడు. పెద్ద ఇంజనీరు. మూడేళ్ళ క్రితం వరకు శ్రీశైలం ప్రాజెక్ట్‌లో పనిచేస్తూ ఉండేవాడట. కాంట్రాక్టర్ల దగ్గిర బాగా డబ్బులు కోట్టేసి గవర్నమెంట్ స్టోర్స్‌లో సరుకు మాయంచేయించేసి; ఇలాగ ఇవప్పెట్టికి లకార గుణింతం నేర్పేడట. ప్రభుత్వంవారు ఇతన్నేదో చెయ్యాలనీ ఈయనేమో ప్రభుత్వంవారు తననేమీ చెయ్యకుండా చూసుకోవాలనీ ప్రయత్న ప్రతి యత్నాలుచురుగ్గా జరగ్గా; ఈయన రిటైరైపోవడమనే మధ్యే మార్గం దొరికిందట. ఇప్పుడు కాంట్రాక్టులు చేస్తున్నాడు. డిపార్టుమెంటులో పెద్ద పెద్ద ఇంజనీర్లంతా ఎరిగున్నవాళ్ళు కావడంవల్ల ఈయన పని మూడుపాళ్ళు సిమెంటు అరుపాళ్ళు ఇసకా వేసినట్టు "కాంక్రీటు"గా వుంది.

కనకసుందరంగారి భార్య మీనాక్షమ్మగారు, ఆవిడ పెద్ద సంగీతవిద్వాంసురాలు. ముప్ఫై ఏడేళ్ళు. చెంబై వైద్యనాథ భాగవతార్; జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం; మధురై మణిఅయ్యర్; మొదలైన తమిళ విద్వాంసులతో ఆవిడకి సన్నిహితమైన పరిచయం వుండేది, వారి శుశ్రూష ఆవిడ కొక పెద్ద "ఎసెట్." మీనాక్షమ్మగారి ద్వారా కనకసుందరంగారి డబ్బులో చెప్పుకోదగ్గ భాగం సంగీత

పరిశ్రమమీద ఖర్చవక తప్పలేదు. మాంచి టేప్‌రికార్డరు;లెక్కలేనన్ని టేపులు స్టీరియో, అంతులేని రికార్డులు: ఇలా, ఇంట్లో ఆవిడకొక పెద్ద మ్యూజిక్ లైబ్రరీ వుంది. చుట్టుపక్కల ఏ వూళ్ళో సంగీతకచేరి జరిగినా, కుటుంబం యావన్మందీ కార్లో వెళ్ళి ప్యాట్రన్ టిక్కెట్స్‌తో విని రావలసిందే. సంగీత విద్వాంసులనీ, సంగీత కళాభిమానులనీ ఇంటికి ఆహ్వానించి విందులు మందులు ఇవ్వడం వొక ప్రఖ్యాతమైన హాబీ, ఆవిడకి.

వాళ్ళ రెండో అమ్మాయి హేమలత: నా దగ్గిర ట్యూషన్ చెప్పించుకోవడం ద్వారా నాకా యింటితో సంబంధం ఏర్పడింది. నాది చిత్రమైన కెరీరు. స్కూల్ ఫైనల్, పి.యు.సి.ల్లో మేథమెటిక్స్, ఫిజిక్స్, కెమిస్ట్రి; బి.ఏ.లో హిస్టరీస్- తెలుగు, బియ్యీడీ చదివి మూడేళ్ళు టీచర్ సర్వీసు, స్టడీ-లీవుమీద ఎం.ఏ చదువు: అందులో సబ్జెక్టు ఇంగ్లీషూనూ. హేమలత రెండుసార్లు మెట్రిక్ తప్పింది, ఇంగ్లీషు. మేత్స్, ఫిజిక్స్, కెమిస్ట్రి ఇంగ్లీషు మీడియంలో చెప్పాలిట: తెలుగు మాత్రం తెలుగు మీడియంలో చెబితే చాలునట. అన్నీ చెప్పగల టీచర్ని నేనొక్కణ్ణే దొరికినట్టుంది. అవన్నీ అలావుంచి: సంగీతం అంటే చెవి కోసుకునే గుణం, అభిరుచీ నా కుండడం వల్లనే నాకా యింట్లో ప్రవేశం దొరికిందనక తప్పదు. నన్ను మొదట వారికి పరోక్షంగా పరిచయంచేసిన డాక్టర్ చంద్రశేఖరంగారు ఒక సంగీత కచేరీకి యధాలాపంగా రావటం తటస్థించింది. అప్పుడాయన నన్ను కనకసుందరం దంపతులకు ప్రత్యక్షంగా పరిచయంచేసేరు. "హౌ డిడిట్ హేపెన్ యు ఆర్ హియర్?" అని కనకసుందరంగారు ఆశ్చర్యపడడం: "బికాజ్ ఐ లవ్ మ్యూజిక్" అని నేను చెప్పడం, "దెన్ వుయ్ షుడ్ లవ్ టు టేక్ హిమ్ టు అవర్ ఫోల్డ్" అని మీనాక్షమ్మగారు సెటిల్ చేయడం జరిగాయి.

హేమ కాన్వెంట్ పిల్ల. ఇంగ్లీషు తప్ప తెలుగు అసలు మాట్లాడేదే కాదు. అనసూయమ్మకి కొంచెంకూడా ఇంగ్లీషు రాదని, "ప్రయిమరీ వాంట్స్" తెలుగులో "ఎక్స్‌ప్రెస్" చెయ్యవలసి వస్తోందనీ విసుక్కునేది. ఆమెకి ట్యూషన్ చెప్పటం ఒకానొక మరపురాని అనుభవం: అగ్నిపరీక్ష కూడాను.

వారానికి ఆరురోజులు: రోజుకి మూడుగంటలు చొప్పున చెప్పాలి. మూడు గంటల్లోనూ "రాజ్‌కపూర్ సినిమాలాగా" రెండు ఇంటర్వెల్స్ ఉండేవి. ఒకసారి డ్రింక్ తీసుకొని, వాళ్ళ మమ్మీ దగ్గర "ఫ్రెషప్" అయి వచ్చేది.మరో

సారి వెళ్ళి "డ్రెస్ ఛేంజ్" చేసుకొచ్చేది. ఈ రెండు ఇంటర్వెల్సూ, తరవాత చెప్పబోయే సబ్జక్టులు నెమరేసుకోడానికి నాకు పనికొచ్చేవి.

ట్యూషన్ టైమ్‌లో నేకాక, ఎప్పుడూ కూడా హేమ నా కెదురుగా కూర్చో లేదు. సోఫా సెట్‌లో భాగంగా వుండే సోఫాలో నా పక్కనే కూర్చొనేది. వీలయి నంతవరకు చదువు చెప్పనీకండా నన్ను పక్కదారి పట్టించేది. "మూవీస్ స్టోరీస్" "కామిక్స్" వర్ణించుకుంటూ ఫెళ్ళున నవ్వుతూ తుళ్ళిపడుతూ వుండేది: యధాశక్తి. గడికోసారి "హౌ డు యు లైక్ దిస్ లుంగీ" అనో, హౌ డు యు ఫీల్ ఐ లుక్ ఇన్ దిస్ జీన్స్" అనో ప్రశ్నించి చెప్పేదాకా వేధించుకు తినేది. "ఎక్సెలెంట్" అనో "వండర్ఫుల్" అనో, "ఫెంటాస్టిక్" అనో "స్టాక్ అన్సర్స్" చెబితే లాభంలేదు. "ఫీలిట్ అండ్ టెల్మియూర్" అని నా చెయ్యి తన తొడ మీదేసుకుని "యూర్" అన్నందుకు "సారీ" చెప్పేసేది. మొహంమీద కొత్తగా లేస్తున్న "పింపుల్" వీపుమీద "సడెన్"గా తెగిపోయిన "బటన్" లాంటి వేవో రోజుకొకటి "ఇన్‌వెంట్"చేసి, వాటిని "మెండ్" చెయ్యమని పురమాయించేది, పద్దెనిమిదేళ్ళొచ్చి: ఇరవై ఏళ్ళదాన్లా కనబడుతూ: తనకంటె ఏడేళ్ళే పెద్దఅయిన యువకుడి దగ్గిర అంత "క్లోజ్"గా వుండే ఏ యువతి అయినా ట్యూటర్‌కి అగ్ని పరీక్షే కదా. చెయ్యి చురక్కుండా కాలు జారకుండా ఆ కొంబై రూపాయల ఉద్యోగాన్ని అలా కష్టంతో నెట్టుకొచ్చి చివరికెలాగో హేమ మెట్రిక్ పాస్ అని పించేను. హేమ నా ట్యూషన్‌వల్లనే పాసయిందని నేను గర్వపడుతున్నరోజు, వాళ్ళ మమ్మీ నన్ను థేంక్ చేస్తున్నరోజు, రిజల్ట్ వచ్చినరోజు, హేమ నాగురించి చాలా నిర్దయగా వ్యాఖ్యానించింది. తను లెసన్స్ ఎగ్గొట్టడానికి చేసిన ప్రయత్నాలు ఏవీకూడా నేను పసిగట్టలేకపోయాననీ, తను నన్ను ఎట్రాక్ట్ చెయ్యడానికి చేసిన ట్రిక్స్‌కి మాత్రం విత్‌స్టాండయ్యాననీనూ. రెండూ విద్రోహక చర్యలు. నేను రెండిట్నీ విజయవంతంగానే ఎదుర్కొన్నాను. అది గ్రహించి నన్ను కాంప్లిమెంట్ చెయ్యవలసిందిపోయి, ఇలా కామెంట్ చేసిందన్నమాట. పోనీ, కనక సుందరంగారైనా నా వేపు ఒకమాట వెయ్యలేదు. పైగా దట్స్ ట్రూ మై చైల్డ్ యువర్ సచ్ ఎ డామినేటింగ్ ఫిగర్! అంతెందుకు? డిస్ట్రిక్ట్ జడ్జ్ మాధవయ్య గారంత ఎల్డర్లీ ఫెలో కూడా నేనొక్కణ్ణే వాళ్ళింటి కెడితే "వై డు యు కమ్‌ఎలోన్" అని మీద పడిపోతాడంతే. "బ్రింగ్ ఎట్‌లీస్ట్ యువర్ సెకండ్ పప్, నెక్స్ట్ టైమ్" అని ప్రాధేయపడతాడు. మీనాక్షమ్మగారు మాత్రం నా వేపు తియ్యగా

చూసి సన్నగా నవ్వేరు, "సో యువార్ నాట్ సెడ్యూస్ట్... ఓకే, లీవిట్ టుమి-" అని అర్థం చెప్పొచ్చు. కాని ఎవరితో చెప్పుకోడం?....తెలుసుకోడమే ప్రమాదం కదా.

మీనాక్షమ్మగారికి బాలమురళీకృష్ణంటే యిష్టం. ఇష్టమేమిటి, వెర్రి! ఆయన రికార్డులన్నీ కొనేసే రావిడ. ముప్ఫై నలభై మైళ్ళ దూరంలో ఎక్కడ బాలమురళీకృష్ణ కచేరి జరిగినా ఆవిడ అక్కడికి ముందురోజు వెళ్ళిపోయేటంత హడావిడి చేస్తారు. వీలుంటే వెళ్ళిపోతారు కూడాను. ఫ్రంట్ రోలో కూర్చుని; ఆయన పాడినా. పాడకపోయినా, నవ్వినా, వెనక్కి తిరిగి ఎవర్నో ప్రేమతో పలకరించినా స్వరప్రస్తారం సందర్భంగా 'గానాలోచన'లతో తలపైకెత్తినా; ఆయన్నే చూస్తూ మైర్ ఆఫ్ అడ్మైర్‌లో పడిపోతారు. బేటరీతో పనిచేసేదో; కరెంటుదో; ఏదో చిన టేప్‌రికార్డర్ మీద ఆయన కాన్‌సర్ట్ అంతా ముందు గానే పర్మిషన్ తీసుకుని రికార్డ్ చేస్తారావిడ. ఇంటికొచ్చాక అది మళ్ళీ 'ప్లే' చేసి; తన్మయత్వం చెందుతారు. రెండు మూడు వారాలపాటు మా కందరికీ మురళీ గానామృతం ప్రసాదంలా పంచిపెడతారు.

మీనాక్షిగారికి బాలమురళీకృష్ణంటేనే కాక ఆయన అడ్మైరర్స్ అంటే కూడా వల్లమాలిన యిష్టం. బాలమురళీకృష్ణ పాడిన సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనలు సరిగ్గా అయన బాణీలో ఆయన సంగతులన్నీ తు-చ- తప్పకుండా వేసి పాడగలనని నా మీద ఆవిడకి ఎనలేని అభిమానం ఏర్పడింది. "ఇమిటేషన్ ఈజ్ వన్ ఆఫ్ ది బెస్ట్ వేస్ ఆఫ్ ఎప్రీసియేషన్" అని నన్ను బాలమురళీకృష్ణ అడ్మైరర్స్‌లో కలిపేసే రావిడ. అందువల్ల కొంత నష్టపోయినా, మీనాక్షమ్మ గారి అప్పుల్లో లిస్టవ్ అయిపోడంవల్ల ఆ నష్టం కాంపెన్సేట్ అయిపోయిందని చెప్పొచ్చు. డాక్టర్ చంద్రశేఖరంగారు నన్ను వాళ్ళింట్లో హోమ ట్యూటర్‌గా ప్రవేశపెట్టిన కొన్నాళ్ళకి నా గురించి ఆవిణ్ని అడిగేరు; "హవ్ డు యు లైక్ దిస్ యఙ్మాన్" అని. దాని కావిడ ఉదారంగా నవ్వేసి; "నా హార్ట్‌లో బాల మురళీకృష్ణ కాన్సర్ట్ చేసే స్టేజ్ ఉందిగా; ఆ స్టేజ్‌మీద ఈయనున్నారు," అన్నారు. బహుశా తంబూరా పట్టా వుంటానేమో అని గర్వపడ్డాను, చంద్ర శేఖరంగారు. ఇన్కమ్‌టాక్స్ ఆఫీసర్ రామస్వామిగారు; సూపరింటెండింగ్ ఇంజనీర్ రఘునాథరాజుగారు బిజినెస్‌మాన్ ఆంజనేయులుగారు, సిమెంట్ డీలర్ సుబ్రహ్మణ్యంగారు; అన్నట్టు మర్చిపోయాను; ఎక్స్ ఇంజనీర్ అండ్ ప్రజెంట్

కాన్ట్రాక్టర్ డి.ఎఫ్. కనకసుందరంగారు– ఎందరుంటే నాకేమి? బృందావనమది అందరిదీ–

హేమవాళ్ళ బాబాయిగారింట్లోవుండి ఇంగ్లీషు మీడియమ్ కాలేజీలో చదవడంకోసం హైదరాబాద్ వెళ్ళిపోయిన దగ్గర్నుంచీ మీనాక్షమ్మగారు నామీద స్పెషల్ ఇన్టరెస్ట్ చూపిస్తున్నారు. నన్ను గాయకుడిగా తీర్చిదిద్దాలని దీక్షపట్టారావిడ. నాకు క్లాసికల్ మ్యూజిక్ నేర్పిస్తానన్నారు. నన్ను విజయవాడ తీసుకెళ్ళి అలిండియారేడియో లైట్ మ్యూజిక్ సెక్షన్లో ఆడిషన్ టెస్ట్ చేయించేరు. విజయవాడ కేంద్రంనుంచి వెలువడే నా లైట్ మ్యూజిక్ ప్రోగ్రాంకోసం నేనీమధ్య కొన్ని పాటలు ప్రాక్టీస్ చేసేను. అవి టేప్‌చేసి, తీరిగ్గా రెండుమూడు సార్లు విని ఎనలైజ్ చేస్తానన్నారు మీనాక్షమ్మగారు. ఈ మధ్య నే నావిడతో– ఆవిడ రూమ్‌లో కాదుగానీ– కార్లో, కారిడార్స్‌లో; పిక్చర్ హౌసెస్‌లో, కాన్సర్ట్ హాల్స్‌లో; "ఐవజ్ ఎలోన్ విత్ హర్ సెవరల్ టైమ్స్!" ఇవాళ; "బట్ ఫర్ దిస్ బ్లెసెడ్ మంకీ ఆఫ్ ఎన్ ఆంజనేయులు: ఐ షుడ్ హేవ్ బీన్ ఎలోన్ విత్ హర్ ఇన్ హర్ వోన్ రూమ్!" అని చెప్పొచ్చు.

* * *

యామినీపూర్ణతిలక– గ్రేట్ ఆర్టిస్టు అవుతుందో లేదో నాకు తెలియదు. కాని ఆమె బొమ్మలు నలుగుర్నీ ఆకర్షించే అవకాశం వుంది. ఆ నలుగుర్లో ఎక్కువమందికి అర్థమయ్యే ప్రమాదం కూడా వుంది. అన్ని కళల్లోను అర్థమయ్యేది గొప్పదా. అర్థంకానిది గొప్పదా అన్న సంఘర్షణ వుందని నాకు తెలుసు.

"వినీలాకాశం" అని ఒక బొమ్మ వుంది, ఆమె ఫైల్లో కాగితంమీదనే వేసింది రంగుల్లో: దాంట్లో ఒక స్త్రీ వుంది. ఆమె గుండెకు ఎడమ పక్కన పెద్ద తూటు పడినట్టుగా ఖాళీగా వుంది. ఆమె హృదయం ఆమె దగ్గిర లేదన్న మాట. ఆ హృదయాన్ని ఆమె తన చేత్తో పట్టుకుని ఎవరికో అందిస్తోంది. హృదయం ఎనటామికల్‌గా వుండే ఆకారంలోనే చిత్రించబడింది. అది ఇంతా అంతా కాదు. ఇంచుమించు కాగితం అంతా ఆక్రమించి వుంది. అంటే ఆకాశమంత ఆ హృదయం స్త్రీకి వుందనో యేమో ఆమె భావం. హృదయంలోకి వచ్చే రక్తం మాత్రమే లెక్కకి తీసుకుని అపరిశుద్ధ రక్తపు రంగు (నీలం) ఆ హృదయం అంతటికీ పూసింది. అనంతమైనదీ, వినీలమైనదీ అయిన

ఆకాశంలాంటి ఆ హృదయాన్ని ఆమె ఎవరికో సమర్పిస్తోంది. కాగితానికి ఈ మూలను, ఒక ఫ్యానీ లిటిల్ క్రీచర్ వున్నాడు. పురుషుడని చెప్పేటందుకు చిహ్నం వుంది. వాడు ఆమె అందిస్తున్న హృదయాన్ని బహుశా దాని అనంతత్వాన్ని అందుకోలేక కాబోలు! భయంగా చూస్తున్నాడు. అది నా కొద్దన్నట్టు సంజ్ఞ చేస్తున్నాడు. నాకు హృదయం వద్దు శరీరం చాలునన్నట్లు ఆమె అందించనిదాన్ని అర్థిస్తున్నాడు. రంగుల కాంబినేషను ఆకారాలూ అనవసరంగా ప్రఖ్యాతి చెందిన ఆర్టిస్టువిలా వున్నాయి, స్ట్రోక్ అంతకన్నా కూడా పేలవంగావుంది

ఇలాంటివి అయిదారు వరకు ఉన్నాయి: పెద్దవి. భారీ ఎత్తున వేసినవి.

మిగిలిన వాటిలో నేచర్ స్టడీ-ఫోటోలు చూసి వేసినవి,, దృశ్యం చూసి స్కెచ్ వేసుకుని గుర్తుంచుకొని డీటేల్స్ వర్క్-ఫుట్ చేసినవి ఉన్నాయి.

కాని, సంగీత కచేరీలకి వాళ్ళమ్మగారితో వెళ్ళినప్పుడు అక్కడ కూర్చుని లేసిన స్కెచ్‌లు నాకు చాలా బావున్నాయి. వాటన్నిట్లోను ఆయా కళాకారులు ఆ స్థాయికి చేరడానికి చేసిన కృషో అనుభవించిన వేదనో ప్రస్ఫుటంగా కనబడేటట్లు, వారి భౌతిక ఆకారాలనికాక, మానిసిక పరిణామాలను చిత్రించిందామె. ఎమ్మెస్ సుబ్బలక్ష్మి, ఎమ్మెల్ వసంతకుమారి డి.కె. పట్టమ్మాళ్, చిట్టిబాబు, వి.జి. జోగ్, బిస్మిల్లాఖాన్, హరిప్రసాద్ చౌరాసియా, ఎన్, రమణి, బాలమురళీకృష్ణ-ఇంకా చాలా వున్నాయి అందులో,

వాటిల్లో కూడా నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించినవి, రాధ-జయలక్ష్మి; టి.ఆర్. మహాలింగం- ద్వారం హంగతాయార్లవి, మొదటి జంట, జంట గాయినులు శరీరాలు వేరయినా నాదం ఒకటిగా వారు ప్రఖ్యాతలు. యూనిజన్ చిహ్నం చేసి వేసింది, ఆ స్కెచ్చి బాగానేవుంది. కాని, మహాలింగం, మంగతాయార్లు జంట కళాకారులు కారు, వారు రెండు జాతులు, అవి రెండు వాద్యాలు. రెండు నాదాలు, కాని ఎందుకో ఆరెండు ఒక్కటే అయ్యాయి, ఆ ప్రవృత్తుల ఐక్య భావం ఆ రెండు వాద్యాల్లోంచి ఒకే నాదం వస్తున్న స్ఫురణను శ్రోతలకిస్తోంది, ఈ భావాన్ని చిత్రించడానికి ఆమె వాయులీనం ఫింగర్ బోర్డ్‌ని గుండ్రంగా చిత్రించి దానికీ వేణువుకుండే బెజ్జాలు వేసింది వయొలిన్ కమాను మహాలింగం గుండెల్లో పొడుస్తోంది, అతని బాధ ఫ్లూట్ లోంచే పలుకుతోంది కాని వయొలిన్ లోంచి బయటపడుతోంది.

ఆ బొమ్మలన్నీ చూసి అలసి పోయాను.

షెల్ఫ్‌లో ఇంకా ఏమైనా అసంపూర్తి చిత్రాలుంటాయేమోనని చూస్తే అందులోంచి ఇంకో స్కెచ్ బుక్ బైటపడింది. శ్రీశైలం ప్రాజెక్టు, మల్లేశ్వరాలయం మొదలుకొని చాలా వ్యక్తిగతమైన చిత్రాలున్నాయి అందులో. మీనాక్షమ్మగారికి ఎంతమందితో సన్నిహిత సంబంధం వుందో అందరి బొమ్మలూ వున్నాయి. నాది తప్ప. అందరికీ నిర్మొహమాటంగా అంటగట్టవలసిన భావం అంటగట్టింది. యామిని, అంటే ఆవిణ్ణి చాలా నిశితంగా పరిశీలిస్తోందన్నమాట. అందులో నేను లేనందుకు సంతోషించాను. పేజీలు తిరగేస్తూవుంటే నన్ను ఆశ్చర్యంలో పడేసిన మరో బొమ్మ కనిపించింది;- హేమా, నేను! హేమకి కామినీ భావం ఇచ్చింది. నా బొమ్మలో సాత్వికత వుంది. బొమ్మ కింద ఏదో రాసి, మళ్ళీ తెలియకుండా కొట్టేసింది. అది చదవడానికి ప్రయత్నం చెయ్యగా చెయ్యగా; "నేను నువ్వయితే అతను అతను కాడు" అని అస్పష్టంగాఅర్థమైంది. నమ్మకంలేదు, ఈ పుస్తకం వెంటనే దాచేశాను. ఆని ఎవరికైనా చూపించే ఉద్దేశం యామినికి ఉన్నట్టు తోచదు....... పుస్తకం వెనకట్టమీద ఒక అడ్రస్ ఉంది. బంటుపిల్లి నారాయణమూర్తి, ఫిట్టర్. డీజిల్ వర్క్‌షాపు ఖర్గపూర్ రైల్వేస్టేషన్- ఈ అడ్రస్ ఎక్కడో చూసాను........అనసూయమ్మ ఉత్తరం మీద నేనిందాక రాసినది ఒక్క నిమిషంలోనే గుర్తొచ్చింది. ఎవడీ నారాయణ మూర్తి? అనసూయమ్మకి మాత్రం కావలసినవాడే. అయితే వీడి అడ్రస్ యామినిఇంత రహస్యంగా దాచిన ఈ స్కెచ్ బుక్ వెనకాల ఎందుకుంది? ఈమెచేత కూడా అనసూయమ్మ కొన్ని ఉత్తరాలమీద అడ్రస్ రాయించుకుందేమో? రాయించుకుంటే రాయిచుకునే ఉండొచ్చు కాని ఆ అడ్రస్ ఈమె ఇంత గుట్టుగావున్న పుస్తకంలో నోట్ చేసుకోడమెందుకు?

ఆ మూలని అల్మేరామీద నిలబెట్టి ఒకపెద్ద బొమ్మవుంది. ఎర్రనికాగితం చుట్టబెట్టి రిబ్బన్‌లాంటి సిల్క్‌టేపుతో కట్టివుంది. తెచ్చుకుని, విప్పాను. మౌంట్ మీద అంటించివుంది. ఏదో కాంపిటీషన్‌కో ఎగ్జిబిషన్‌కో పంపాలని ప్రయత్నిస్తున్నట్టు-

ఆ బొమ్మ నాకు కాసేపటిదాకా అసలేమీ అర్థంకాలేదు.

అందులో వొక లంబకోణ త్రిభుజం వుంది. త్రిభుజం మూడు బిందువుల దగ్గిరా ముగ్గురు మనుష్యులు. ఒక్కొక్కరు మిగిలిన యిద్దర్నిచూసి వేళాకోళంగా నవ్వుతున్నారు. ప్రతివారు ఏదో ఓ పక్కకి ఆకర్షితులవుతున్నట్టు

వారి అంశలతో, మేగ్నెటిక్ ఫీల్డులో లాంటి గీతలద్వారా; స్పెర్మటోజోవా లాంటి ఆకారాలు గల రేణువుల ద్వారా చూపించింది, దాని పేరు, "లంబము-విలంబము."

అయిదు నిముషాలు బొమ్మనలా కళ్లెదుట పెట్టుకోగా; లంబము అనేది ఒక గీతకు మరో గీత క్రాస్‌గా వచ్చి తాకడం అనే పరిజ్ఞానంవల్ల అది ప్రేమకు చిహ్నమే మోనని భావించాను. 'విలంబము' అంటే ఆలస్యం కదా. అంటే? ప్రేమ సఫలం కావడానికి ఆలస్యం కావచ్చునని భావమా? "ఫార్ ఫెచ్‌డ్ ఐడియా" లాగుంది. లేక నా తలకాయ ట్యూబ్‌లైటా?.... ఈ బొమ్మ భావం అడిగి తెలుసుకోవాలి, యామినిని-

హటాత్తుగా ఆ బొమ్మలో ఒక విషయం నా కళ్ళు గుర్తుపట్టాయి. నేను నిర్ఘాంతపోయాను.

ఆ బొమ్మలో ఉన్న మూడు బిందువులూ నేను, మీనాక్షమ్మగారు, యామిని!? ఏదో 'క్లూ' దొరుకుతుందేమో అన్నట్టుగా బొమ్మ అటు తిప్పాను. "ఐ లవ్ యు" అనుంది.

నన్ను చూడమని ఆమె చెప్పిన బొమ్మల్లో ఇది లేదు. ఇందాక స్కెచ్‌బుక్‌లో వాళ్ళ అమ్మగార్ని వివిధ భంగిమల్లో చూపినవి చూసిన దాని కన్న ఇప్పుడు కొంచెం బెదురు ఎక్కువైంది.........గబగబా పొట్లాం కట్టేసి బొమ్మని యథాస్థానంలో పెట్టేశాను.

స్కెచ్‌బుక్‌లో మీనాక్షమ్మగారి ఫ్రెండ్స్‌లో నే నెందుకు లేనో ఇప్పుడు నా కర్థమైపోయింది!

"ఐ లవ్ యు!"........ 'యు' అంటే?........ అసలు 'ఐ' అంటే యెవరని!

0 0 0

ప్లేయర్ మీద "వెంచర్స్" సంగీతం హైఫెడెలిటీ స్టీరియో స్పీకర్స్ లోంచి అట్టహాసంగా వస్తోంది. నేను బుద్ధిగా కూర్చుని మీనాక్షమ్మగారి గది లోంచి తెచ్చుకున్న సంగీత కచేరీల ఫోటోల ఆల్బమ్ తిరిగేస్తున్నాను. అప్పు డొచ్చింది యామిని, బాత్‌రూమ్‌లోంచి.

ఆశ్చర్యం పెనుహాసంగా మార్చుకుని వెంచర్స్‌ని ప్లేయర్‌మీద చూపించి "ఇదేమిటీ పతనం!" అన్నట్టు నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుంది.

చీరా జాకెట్టూ వేసుకున్న యామిని "గుడ్డి" సినిమాలో జయభాధురి లాగ ఒక్కసారి ఎదిగి పెద్దదైపోనట్టు కనబడ్డాది. వీళ్ళమ్మా నాన్నా దీనికి పెళ్ళెప్పుడు చేస్తారో, పాపం!

"ఆడవాళ్ళంతా వొక్కటే" అని నవ్వాను. యామిని వేసిన బొమ్మలు చూసేక నేను వాళ్ళింట్లో ప్రతి ఒక్కరికీ, ముఖ్యంగా తనకీ; అతి సన్నిహితు డను అయిపోయినట్టుగా ఒక ఆలోచనా తరంగం కదిపింది నన్ను.

"ఎలా?"

"నేను బాలమురళీకృష్ణ రికార్డ్ వింటే కామెంట్ చేసేవు. వెంచర్స్ వింటే కూడా కామెంట్ చెయ్యకుండా వుండలేకపోయావు!........ అదాపేస్తాను; నువ్వు పాడు!?" అన్నాను, ప్లేయర్ ఆపుచెయ్యడానికి లేస్తూ.

"నేనా? బౌటాఫ్ ఆల్ పీపుల్! నాకే పాడ్డం వొస్తే-" అంది యామిని పెద్దగా నవ్వుతూ.

నేను తనని ఏకవచన ప్రయోగం చేసినందుకేమీ అన్లేదు. అనడం మాటకేం, అనుకోనేలేనట్టుంది!

"నీకు పాడ్డం వస్తే మీనాక్షమ్మగారి దగ్గిర మానేసి నీ దగ్గిరే నేర్చుకుంటాను!"

"అందానికి మా చెల్లీ, పాటకి నేనూ—" అని నవ్వింది యామిని.

రికార్డ్ ఆపేశాను. గదిలో నిశ్శబ్దం యామిని ఆర్టులో ఇమాజినేషన్ లాగ సొలెమ్‌గా వుంది........

"నా బొమ్మలన్నీ చూసేరా!" అంది యామిని, నా అడ్మిరేషన్ కోసం ఆశగా కళ్ళు తెరచి చూస్తూ.

"యువర్ పిక్చర్స్ అర్ సింప్లీ మార్వెలస్."

"థాంక్సెలాట్." అంది యామిని, ఆనందంతో. షెల్ఫ్ దగ్గిరకెళ్ళి బొమ్మల కట్ట తీసింది. "చెప్పండి. ఇందులో మీ కేది బాగా నచ్చింది, గుడ్, బెటర్ అండ్ బెస్టు?" అని మంచంమీద నాపక్క కొచ్చి కూచుంది. ఆ బొమ్మల కట్ట నా వొళ్ళో పెట్టింది.

"బొమ్మల్లో వినీలాకాశం; స్కెచ్‌లో రాధ-జయలక్ష్మి. మహాలింగం-మంగతాయారు ఇంకొన్ని చూపించేను. వీటిల్లో చాలా సటిల్‌గా వుంది ఇమాజినేషన్!" అన్నాను.

"థాంక్స్ సరససరాజుగారూ! మెనీమెనీ థాంక్స్! నా ఇండస్ట్రీని మీరు రికగ్నైజ్ చేసేరు" చాలా పరవశం అయిపోతూ అంది. యామిని.

"అందరూ రికగ్నైజ్ చేస్తారు. యు విల్ బికమ్ ద గ్రేటెస్ట్ ఆర్టిస్ట్ ఆఫ్ యువర్ ఏజ్" అన్నాను.

"వీటిని మీ కెప్పుడో చూపించి వుండవల్సింది....ఐ లాస్ట్ ఎ గుడ్ డీల్ ఆఫ్ ఎంకరేజ్‌మెంట్ ఆల్ దీజ్ డేస్." అని ఎంతో బాధపడింది యామిని.

"ఇదుగో చూడు....ఈ బొమ్మ చూసి నేనెంతో యిదైపోయాను!" అన్నాను, అతి సన్నని బంగారపు తీగెలతో సింబలైజ్‌చేసి లతామంగేష్కర్ కంఠ మాధురికి చేసిన రూపకల్పన చూపించి.

యామిని మొహం ఆనందంతో విప్పారింది. "ఐమ్ సో గ్లాడ్ టు హావ్ యు సీయింగ్ దీజ్ హంబుల్ తింగ్స్!" అంది.నా చేతులు పట్టుకుని మీదికెత్తి.

"మాట హంబుల్‌గా వుంది. ఆర్ట్ ఏమో సబ్‌లైమ్‌గా వుంది" అన్నాను,

"ఐ విల్ కిస్ యు!" అని బెదిరించింది యామిని; వేలు ఆడిస్తూ.

నాక్కూడా కిక్కొచ్చేస్తోంది. నా చిన్న మెదడు,"మాటలు తగ్గించవోయ్ వెర్రి పీనుగా!" అని ఫైనల్ వార్నింగిచ్చేసి ఆబ్లివియాన్‌లోకి వెళ్ళిపోయింది.

"ఎండ్, యు ఆర్ వండర్ఫుల్!" అన్నాను, స్నానంచేసి రావడాన్ని తెల్లగా మెరిసిపోతున్న ఆమె బుగ్గమీద వేలెట్టి వెంటనే తీసేసి.

"థాంక్యూ, థాంక్యూ! థాంక్యూ ఎమిలియన్ టైమ్స్!"

యామిని, మంచంమీద నా పక్కనే కూర్చునుంది, బొమ్మలన్నీ దొంతర పెట్టూ "ఓ! ఇదెలా వొచ్చిం దిక్కడికి, దిస్ హారిబుల్ తింగ్!" అన్నది, పక్కనేవున్న కాన్సర్ట్‌ల ఫోటోల ఆల్బంతీసి. "అది సరేగానీ మేష్టారూ: నే నొక్కటడుగుతాను చెప్తారూ?" అంది. నా మొహాన్ని తన వేపు తిప్పుకుని నా కళ్ళలోకి తిన్నగా చూస్తూ.నేనేమీ అనలేదు.ఆమె పేజీలన్నీ గబగబా తిప్పింది. ఒక ఫోటో దగ్గిర ఆగి అందులో వొక అమ్మాయిని చూపించి "ఈ అమ్మా యెవరు మేష్టారూ? చెప్పగల్రా?" అంది.

అది వొక కచేరీ ఫోటో, అందులో గాయకుడికి వెనగ్గా కూర్చున్న ఆ అమ్మాయి గాయకుడిని ఆరాధనగా చూస్తూ తంబురా పడ్తోంది.

నాకు కవిత్వం వొచ్చేస్తుంది, ఆ అమ్మాయి గాయకుడివైపు చూస్తున్న

పద్ధతికి. "చెప్తాను. చెప్పగలనని అభయమిస్తున్నాను" అన్నాను. నేను కూడా గాయకుడిని ఆరాధనగా చూస్తూ, కొంటెగా.

"అది సరే మేష్టారు. పుడ్‌యు ప్లీజ్ బిలీవ్-ఓసారి వరద రాజేశ్వర్రావు గారేమో మురళీ కృష్ణార్పణమస్తు అన్నారంట.వాట్ డజ్ హి మీన్ మేష్టారు?"

"టు రివీల్ ఆర్ట్ అండ్ కన్సీల్ ది ఆర్టిస్టు ఈజ్ ఆర్ట్స్ ఎయిమ్."

"కన్సీల్ వాట్?"

"కన్సీల్ ద ఆర్టిస్ట్!" అని ఆమె భుజంమీద చెయ్యేసి, రెండో చేత్తో పుస్తకం మూసి దూరంగా పడేశాను.

"అయితే మీకు చూపించవల్సిందే." అని లేచింది యామిని. హడావిడిగా లేవడంలో జారిన పైటను అలవాటులేని విధంగా సవరించుకుని అల్మైరా దగ్గిర కెళ్ళింది.

అల్మైరామీద ఆ బొమ్మ వుంది. లంబము-విలంబము-లేక-"ఐ లవ్ యు." ఆ బొమ్మ నాకు చూపించాలని యామినికి ఆదుర్దాగా వుంది, ఆ బొమ్మ అర్థంగానీ నాకు ఆమె తెలియజేస్తే అంతా తెలియజేసినట్టే కదా.

అప్పుడు లంబము ఇంక విలంబంతో బాధ పడక్కర్లేదు............ఐ లవ్ యు........

0 0 0

"ఐ లవ్ యు, యామిని!" అన్నాను: తొందరపాటుకి కలిగిన పశ్చాత్తాపాన్ని సున్నితంగా మార్చుకుని ఆమెని లాలించే ధోరణిలో.

"థాంక్యూ."

"మనం జాగ్రత్తగా కంట్రోల్డ్‌గా వుందాం. ఇలా ఇంకెప్పుడూ తొందర పడొద్దు. నువ్వు వర్రీ కాకు. చదువులై పోగానే మేరేజ్ చేసుకుందాం, ఓకే!" అన్నాను ఆమె వీపు నిమురుతూ.

ఒక్క జర్కుతో విడిపడింది యామిని. "మేరేజి?" అంది చాలా అసహ్యంతో చూస్తూ.

"హు ఈజ్ బాదర్డ్ అఫ్ మారేజ్?....దట్ టూ విత్యూ!....ఇమ్....పాసిబుల్!!"

"ఐమ్ సారీ యామినీ. నువ్వన్నది నిజమే. నేను మ్యూజిక్‌లో పడి

టైమ్ వేస్ట్‌చేస్తున్నాను..... ఇంక శ్రద్ధగా చదువుతాను. ఐ విల్ వర్క్ హార్డ్; ప్రామిస్! ఫస్ట్‌క్లాస్ తెచ్చుకుని జాబ్ సంపాదిస్తాను."

"జాబ్!.........లిటరేచర్ ఎమ్మేతో ఏం జాబ్ వస్తుంది? అట్ ద మోస్ట్ యుడ్ బికమ్ ఎ లెక్చరర్; దట్సాల్!......... స్టాప్ డ్రీమింగ్, మిస్టర్ నర్స రాజు! నా కిప్పుడిప్పుడే వొక హజ్‌బెండు అక్కర్లేదు. కావలసినప్పుడైనా, ఐ వుడ్ హావ్ ఎ డాక్టర్, ఎ జడ్జ్, ఎ పోలీసాఫీసర్, ఎ బిజినెస్ మాగ్నెట్; ఎట్ లీస్ట్ ఏన్ ఇంజినీర్ ఇఫ్ నాట్ ఎ మిలియనీర్!" మాట్లాడుతూనే చెదిరిపోయిన గుడ్డల్ని జుట్టును హృదయాన్ని సర్దేసుకుంది. "హార్డ్ వర్క్ చేస్తావుట, హార్డ్ వర్క్!! హార్డ్‌వర్క్ ఈజ్ నో గుడ్ బాబా......... నిన్ను చూసి మమ్మీ నిన్ను పెట్ చేయడం చూసి నీకేదో ఫైన్ ఉస్తూ లాట్సాఫ్ కామన్ సెన్సూ వున్నాయనుకుని – ఐ టుక్ యు ఫర్ ఎ బాయ్‌ఫ్రెండ్. ఐమ్ సో సారీ మిస్టర్ నర్స రాజు. లేచి వెళ్ళిపొండి, నా వేపలా చూడకండి: ప్లీజ్!"

నేను నిర్ఘాంతపడి నిల్చుంటే తనే బయటికి వెళ్ళిపోయింది, అద్దంలో మరోమాటు తన ఆకారం వేషం చూసుకుని.

యామిని మాటలు వింటే కలిగిన జుగుప్సలో మనసునిండా బురద అంటు కున్నట్టయిపోయింది. వేసిన పొరపాటడుగు వెనక్కి తీసుకోలేక, చేసిన తప్పుకి క్షమార్పణ చెబితే అందుకునేవాళ్ళు లేక నేను నిస్సహాయుడనై పోయాను.

పరుగెత్తుకొచ్చింది యామిని. "హరీ అప్ మిస్టర్ నర్సరాజు!—మమ్మీ వొచ్చేస్తోంది—ప్లీజ్—డోంట్ లుక్ సోమచ్ అప్‌సెట్!—సరిగ్గా వుండండి మేష్టారూ—ఇట్స్ ఆల్ నథింగ్ బట్ ఎ స్వీట్ అండ్ కాజువల్ ఇన్‌స్పిరేషన్!— లైక్ పెయింటింగ్ ఎ పిక్చర్ ఆర్ స్ట్రెచింగ్ ఎ రాగ. దట్సాల్!... ఏదో పోగొట్టుకున్నట్టు మొహం పెట్టకండి బాబూ మీకు పుణ్యం వుంటుంది."

తొందర తొందరగా మొహాన ఫ్లవర్‌తో పౌడర్ కొట్టుకుంది. డబ్బీ లోంచి రెండు యాలక్కాయలు లవంగాలు తీసి నోట్లో వేసుకుని అర్జంటుగా నమల సాగింది.

"మమ్మీ రాగానే మమ్‌లాగ కూర్చోక, ప్లీజ్ సే సమ్‌తింగ్. లేకపోతే సస్పెక్ట్ చేస్తుంది. నాకు సీన్సంటే కిట్టదు!——ఓ మైగాడ్' వాట్టుడు విత్ దీజ్ రెచెడ్ శికాడ్స్!"

హాల్లోకొచ్చి సోఫాలో కూర్చున్నాను.

అప్పుడికే తెరిచున్న హాలు ద్వారంలోంచి పడమటి గాలిలా ఆకర్షణ వెద జల్లుకుంటూ వచ్చేరు మీనాక్షమ్మగారు.

"మాట్లాడు!" అన్నట్టు సంజ్ఞచేసింది, కిటికి కర్టెన్‌లోంచి యామిని.

"నమస్కారమండీ. భలే చేశారే, ఆరుగంటలకి రమ్మని!— —మీ గురించి తొంభై నిముషాలు........ కాదు నైన్‌టీ ఇయర్స్ నించీ వెయిట్ చేస్తున్నాను!" జోకేసి నేనే నవ్వుతున్నాను. పేలవంగా వచ్చుంటుంది.

"రియల్లీ?" అన్నారు మీనాక్షమ్మగారు, తియ్యటి నవ్వు పారేసి. "ఐమ్ రియల్లీ సారీ....జస్ట్ వన్ మోర్ మినిట్— — పే వన్ మోర్ ఇయర్!" అని నవ్వుకుంటూ తన గదిలోకి వెళ్ళిపోయి తలుపేసుకున్నారు.

రికార్డు ప్లేయరు. స్పీకర్సు, రికార్డులు, కచేరీల ఫోటోల ఆల్బమ్, అన్నీ దొంతరపెట్టి ఒక్కచేతిమీద మోసుకొచ్చింది యామిని.హాల్లో ఆ మూల టేబిల్ మీద పెట్టేసి చిందరవందరగా సర్దింది. నేను తన గదిలో మంచంమీద మర్చి పోయిన రుమాలు ఆ టేబిల్ దగ్గిర ఒక కుర్చీవుంటే దాంట్లో పడేసింది. పరు గెత్తుకొని నా దగ్గిరకొచ్చి "థాంక్యు ఎగెన్. యు డిడిట్ సో వెల్." అని నా బుగ్గమీద చిన్న ముద్దుపెట్టి తనగదిలోకి పారిపోయింది,

ఏడున్నరకి గాను, గడియారం అరగంట కొట్టింది.

పడమటి గాలి ఇంకా వెచ్చగా వీస్తూనే వుంది. ఇది ఎప్పటికైనా ఆగు తుందా అని విసుగుపుట్టేస్తోంది.

—0—

# మృగతృష్ణ

"వాల్తేరులో ఉద్యోగమాండి?"

గీత తలతిప్పి అతనివేపు చూసింది.

ముప్పయ్యేళ్ళుంటాయి అతనికి. తెల్లటి ఫుల్‌హాండ్స్ టెర్లిన్‌షర్టు. నీలం రంగు స్ట్రెచ్‌లాన్ బెల్‌బాటమ్‌లో టక్ చేసుకున్నాడు. కళ్ళతో పెదవులతో అందంగా నవ్వుతున్నాడు.

"అవునండి." అని చెప్పేసి ఎందుకు చెప్పానా అని తను ఈ సంభాషణ కిచ్చిన అవకాశానికి పశ్చాత్తాప పడుతూనే, నేను వాల్తేరు వెళుతున్నానని యితనికి ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపడ్డది.

"నేనూ వాల్తేరే వెళ్తున్నాను" అని తిరుగు బాణంలా చెప్పి అతను పాంటు చివర అంటీఅంటనట్టున్న దుమ్ముని రెండు వేళ్ళతో దులుపుతున్నాడు.

'అలాగా' అనుకుని వూరుకుంది గీత. మాటకి మాట తెగులు. ఊరుకున్నంత ఉత్తమంలేదు.

"నేను మెడికల్ రిప్రజెంటెటివుగా పనిచేస్తున్నాను. మా కంపెనీకి విశాఖపట్నంలో ఎవరూ లేరు. బెజవాడలో వుంటూ ఆరు జిల్లాల పనిచూస్తున్నాను" అన్నాడతను.

గీత అతనివేపు చూసి ఊరుకుంది.

"నా పేరు సరోజ్ కుమార్."

"...... ....."

"మీ పేరేంటో తెలుసుకోవచ్చా?"

"గీత. నేను యూనివర్శిటీలో క్లర్క్‌గా వున్నాను— వర్కింగ్‌వుమెన్స్ హాస్టల్లో వుంటున్నాను. నైట్ కాలేజీలో బీ.కామ్. చదువుతున్నాను"

"మిమ్మల్ని తెలుసుకుంటున్నందుకు సంతోషంగా వుంది" అని రెండు చేతులూ జోడించాడతను.

గీత అప్రయత్నంగా నమస్కారం చేసింది.

సన్నటి, పొడుగాటి వేళ్ళుగల ఆ అరచేతులవేపు, నాలుగు బంగారు గాజులు ఒకదానికి, నల్లస్ట్రాప్‌తో రోల్డ్‌గోల్డ్ స్క్వేర్ వాచి ఒకదానికిగల ఆమె ముంజేతులవేపు పరీక్షగా చూసి మళ్ళీ చిరునవ్వు నవ్వాడు సరోజ్‌కుమార్.

"మీలాంటి వాళ్ళు ఆ. బి. కామ్. కూడా పూర్తిచేస్తే, అనుభవం వుంది కనుక ఏ బ్యాంక్ వాళ్ళైనా తీసుకుంటారు."

"థ్యాంక్యు."

"మీరు సికింద్రాబాదులో యెక్కారు. మిమ్మల్ని చూడగానే యెందుకో పరిచయం చేసుకోవాలనిపించింది. కండక్టర్ చెప్పాడు, మీరు వాల్తేరు వెడుతున్నారని."

తొలిచూపులోనే నా గురించి భోగొట్టా చేయాలని కోరిక కలిగిందన్న మాట— అనుకుని హేళన అతనిమీద, ఆనందం తనమీద కలిగి రెండు నవ్వులు ఒకటిగా పోసుకుని అతనివేపు చూసింది గీత.

"మిమ్మల్నడుగుతే మీరే చెప్తారనుకోండి" అని కొంచెం ఆగి, "అయినా ఎందుకో, మీరేమనుకుంటారో అని భయంవేసి అడగలేదు" అన్నాడు.

గీత మాట్లాడలేదు. అతన్ని క్రీగంట చూసింది.

సికింద్రాబాదు స్టేషన్లో రైలు ఎక్కగానే తన బెర్తేదో వెతుక్కుని, దానిమీద సూట్‌కేసు పెట్టి, అందులోంచి దుప్పటి తీసి, సూట్‌కేసు ఓ పక్కగా లాగి, బెర్తంతా దుప్పటి పరచి, పైకెక్కి, తలకింద సూట్‌కేసు అమర్చుకుని వెల్లకిలా పడుకుని, కాలక్షేపానికి తెచ్చుకున్న పత్రిక చేతిలోకి తీసుకుని పేజీలు తిప్పసాగింది గీత.

అది టూ- టయర్ రిజర్వేషన్ కంపార్టుమెంటు. కింద సీటుమీద నలుగురు కూచున్నారు. అందులో ముగ్గురు ఒకరికొకరు తెలిసున్నవారని, వారి కబుర్లవల్ల, ఒకే పెట్టెలోంచితీసి ఒకే అగ్గిపుల్లతో అంటించిన సిగరెట్లద్వారా తెలుసుకుంది గీత. సిగరెట్ల పొగ సరాసరి పైకి వస్తుంటే అంతవరకు నిశ్శబ్దంగా వున్నఫ్యాన్ ఆన్‌చేసి పొగపోతుందేమోనని ప్రయత్నించింది. అంతగా ఫలించలేదు.

సికింద్రాబాదువదిలి పదిహేను మైళ్ళు వచ్చేసరికి ఏకారణంవల్లో రైలు ఆగింది. అప్పటిదాకా ఆమె, తన కెదర బెర్త్‌లో ఎవరున్నారో చూడనేలేదు. అప్పుడైనా, అతను పక్కపరచుకునే ధోరణిలో హోల్డాల్‌విప్పి బట్టలు దులు

పుతూ చేసిన చప్పుడుకి హడావిడికి అటు తిరిగి చూసింది. మొదటి చూపులోనే అతను ఇంతవరకు తననే గమనిస్తున్నాడని ఆమెకి అర్థమయిపోయింది.

చూడకండా ఎలా ఆపాలి?

నలుగుర్లోకి వస్తే చూస్తారు, తప్పదు.

ఆఫీసులో పనిచేస్తున్నప్పుడు కూడా, ఎవరి పన్లు వాళ్ళు చేసుకుంటు న్నట్టే వుంటారు. తనెప్పుడు ఎటుచూపినా అక్కడి వ్యక్తి సూటిగా తన కళ్ళ లోకి చూస్తూ కనబడతాడు. ఆ చూపులో అతనింతసేపూ తన చూపుకోసం ఎంతగా నిరీక్షిస్తున్నాడో తెలియజేసేది ఒక సందేశం వుంటుంది.

మాట కలుపుతారు. పుస్తకాలు అందిస్తారు. కాఫీలకి రమ్మని అహ్వాని స్తారు. వీళ్ళందరినీ స్నేహితులుగా, సహృదయులుగా తీసుకోక తప్పదు ఒంటరిగా చిక్కి, కాఫీదాకా వెళితే సినిమాకి, సినిమాదాకా వెళితే మరోచోటికి, అలా అలా తీసుకుపోతారు. డబ్బు సరిపోతోందో లేదో భోగ ట్టాలు చేస్తారు. ఇంటికి పంపడం, కాలేజీ ఫీజు, హాస్టల్ ఫీజు, పుస్తకాలు, చీరలు, కాస్మెటిక్స్, సినిమాలు, లంచ్‌టైము ఖర్చులు, అన్నీ తెలిసినట్టు వివ రించి సరిపోతుందని తను అంటున్నా సరిపోదని రుజువు చేస్తారు. పాపం అని ఫీలపోతారు. మరికొంత బాగా జీవించాలని ప్రబోధిస్తారు. అందులో యెక్కడో వోచోట అతిచాకచక్యంగా బైటపెడతారు అసలు సంగతి.

డబ్బు ఆశపెడతారు. కాలు జారడానికి యెంత పుచ్చుకోవచ్చు? అని మనసులో చిరునవ్వుతో ఆలోచించుకుంటూ మౌనంగా వూరుకుంటే వాళ్ళంతట వాళ్ళే రేటు పెంచుకుంటూపోతారు.

ఆ మధ్య వొక జోకు చదివింది. ఒక రోమియో ఒకమ్మాయితో "లక్ష రూపాయలిస్తాను; నాతో వ్యభిచరిస్తావా?" అంటాడు. అమ్మాయి సరే నంటుంది. వెంటనే అతను, "పది రూపాయలిస్తాను, నా దగ్గిర పడుకుంటావా?" అని అడుగుతాడు. ఆ అమ్మాయి కోపం తెచ్చుకుని "ఎవరనుకుంటున్నావు నీ మన సులోకి" అని దబాయిస్తుంది. దానికా అబ్బాయి, "ఆ సంగతి ఇంతకుముందే తెలిపోయింది. ప్రస్తుతం రేటు గురించి బేరం సాగుతోందంతే" అంటాడు.

అత దయావిహీనంగా వుంటుంది కాబోలు మగదృష్టి.

పెళ్ళయిన వాళ్ళు వుంటారు. పిల్లలు గల వాళ్ళూ వుంటారు. అంత కన్నా ఎక్కువ బాధ్యతలు గలవారున్నూ వుంటారు. ఎవరికీ ఏ విధమైన

అభ్యంతరం వుండనట్టే ఉంటుంది. "ఒకసారికి తప్పేమిటి?" అని నీతి, ధైర్యం చెబుతారు.

o o o

చిన్న జర్క్‌తో బండి ఆగగానే గీతకు మెలకువ వచ్చింది! అరచేతిలో శ్రీకారం చుట్టుకుని వొంటివేపు చూసుకుంది. మొద్దునిద్దర పట్టేసినా సద్దుకోవలసిందేమీ లేకపోవడం చూసుకుని వొళ్లు విరుచుకుంది.

ఏ స్టేషన్లో ఆగిందో తెలుసుకోవాలని కుతూహలం కలిగింది. అక్కడ నుంచి కనబడదు. కిందకూచున్న వాళ్ళ మాట్లాడుకునే ధోరణిని బట్టి, తుని స్టేషను కొద్ది దూరంలో ఉందని అర్థమయింది, టయిమ్ చూసుకుంటే ఆరు దాటి అయిదు నిమిషాలయింది,

ఎదుటి బెర్తులో 'అతని' వేపు చూసింది. నిద్రపోతున్నాడు, రాత్రి చాలా సేపు కబుర్లు చెప్పాడు. ఎంత వద్దనుకున్నా వినక తప్పిందికాదు. కొద్దిగా మాట్లాడకా తప్పింది కాదు. భోన్‌గిర్ స్టేషన్లో బిస్కెట్టు ప్యాకెట్టు పళ్ళ ఆఫర్ చేశాడు. మరో స్టేషనులో డ్రింక్స్ తెప్పించేశాడు. మొహమాట పెట్టేసి బలవంతంగా వాళ్ళో పెట్టేశాడు. భోజనం చేసే బయలుదేరానంటే వినలేదు, భోజనం తరవాత పళ్ళ తినడం, ప్రయాణంలో విటమిన్ల అవశ్యకత అంటూ ఉపన్యాసం చేశాడు. ఎంతో స్నేహం వున్న వాడిలా ఎన్నాళ్ళనుంచో మనసిప్పి మాట్లాడుతున్న వాడిలా తన్నితాను వర్ణించుకుంటూనే తన దేహంలో, కదలికల్లో, మాటలలో ఎన్నో సోయగాలంటూ పొగడ్తనిపించనంత నేర్పుతో చెప్పాడు. చివరికి పక్క బెర్తుల వాళ్ళ నిదరలోకి జారేక, కిందకూచున్న వాళ్లు కునికి పాట్లలో ఉనికి తెలియనంతగా మునిగి నప్పుడు—అసలు సంగతి బైట పెట్టాడు.... తను విశాఖపట్నంలో శాంతినివాస్‌హోటల్‌లో దిగుతాట్ట. రెండురోజులు- కాదు, రెండు రాత్రులుంటాట్ట. రూము నెంబరు నాలుగు తన కోసం రిజర్వు అయిందిట. అక్కడికి రమ్మన్నాడు. దేనికీ మొహమాట పడక్కర్లేదుట, ఏ పువ్వు లిష్టమో అడిగాడు.ఎందుకో ననుకొని చెబితే గులాబీలతో గదంతా అలంకరిస్తానని చెప్పాడు. పర్సు ఎదురుగా తెరిచి లెక్క పెట్టాడు. అందులో చిల్లరకాక అయిదువందల రూపాయలున్నాయి. ఇందులో ఏమీ ఇంటికి పట్టుకెళ్ళ నక్కరలేదుట. ఒక రోజుకి రెండేసి వందలు ఖర్చు చేసినా ఏమీ ఫరవాలేదుట.

0 0 0

ప్రతీ పెట్టెలోనూ చూస్తున్నట్టున్నాడు" అనుకుంది గీత అతన్ని చూడ గానే.

తుని స్టేషన్‌లో బండి ఆగిన రెండు నిమిషాలలో, రెండుసార్లు ఆ కంపార్టుమెంటుకి అటూ ఇటూ చూసుకుంటూ తిరిగి, చివరికి అందులో యెక్కి, ఖాళీగా వున్న కార్నర్ సీటులో గీతకు ఎదురుగా చతికిలపడ్డా డతను.

నలభయ్యేళుంటాయి. తెల్లటి దుస్తులు వేసుకున్నాడు. చత్వారపు కళ్ళ జోడు మినహా అతని మొహంమీద అతని వయసును చెప్పేవేవీలేవు, నెత్తి మీద ఒక పాయవెంట్రుకలు నెరిసినా అదేదో బాధని తెలియజేస్తోంది తప్ప వయసునుకాదు.

సిగరెట్టు కాలుస్తున్నా, పేపరు చదువుతున్నా- రైలు ప్రయాణానికి వ్యతి రేకంగా పరుగెడుతున్న చెట్లను గమనిస్తున్నా, ఆ కార్యక్రమాలన్నిటి సందు ల్లోంచీ అతను తననే గమనికగా చూస్తున్నాడని గీతకు అర్థమైంది. ఆ కళ్ళ లోని ఆకళ్ళు ఈ కళ్ళకి కొత్తలేదు, వయసు పెరిగినా బుద్ధిని పెరగనివ్వని జీవప్రవాహ సందేశాలవి.

"మీది హైద్రాబాదు కదండి" అని పలకరించే డతను, హటాత్తుగా.

"అవునండి. మీకెలా తెలుసు?"

"నేను ప్రపంచ తెలుగు మహాసభలకి వొచ్చాను. మనం అంతా ఒకచోట కూర్చుని ప్రోగ్రామ్ చూసేం. ఒకరోజు కాదు. మూడురోజులు వరసగా."

"అలాగాండి. మీ ఫామిలీ మీరూ వొచ్చారా?"

అనుకున్నట్టుగానే, వెంటనే తడబడ్డాడతను.

"లేదండి. నేను ఒక్కణ్ణేవొచ్చాను." అని ఒక అరనిమిషం వూరుకుని "నాకు పెండ్లికాలేదు." అన్నాడతను.

"చవటా!" అనుకుంది గీత, అతని బనియన్‌లోంచి తొంగిచూస్తున్న ఐదుపేటల జంధ్యాలవంక చూస్తూ "మీరు బ్రాహ్మిన్సాండి" అంది.

"అవునండి" అన్నాడతను, బుజాల అక్కళింపుతో చాకచక్యంగా జంధ్యాన్ని దాచుకుంటూ.

"మీ దేవూరండి"

"నేను పాయకరావుపేటలో పనిచేస్తున్నాను" అని వెళ్ళిపోయిన వూరి

వేపు వేలు చూపాడు. గబుక్కున పర్స్ తీసి, ఒక విజిటింగ్ కార్డు యిచ్చాడు. కె. వి. సూర్యారావు, బి.ఏ. బ్యాంకులో పని, అదంతా వుంది.

"వైజాగ్ వెడుతున్నారండీ!"

"అవునండి. మీరూ నా?"

"మరేండి. ఏం పనిమీద వెళ్తున్నారో?"

"ఇండియన్ బ్యాంక్‌లో ఇంటర్‌వ్యూకి రమ్మన్నారండి." అని నిట్టూర్చింది గీత.

"ఇండియన్ బ్యాంకా? శేషగిరిరావని నా ఫ్రెండు ఒకతను హైద్రాబాదు ఇండియన్ బ్యాంకులో ఆఫీసరున్నాడు." అని, కొంచెంసేపాగి "ఎప్పుడండి, ఇంటర్‌వ్యూ." అన్నాడు.

"ఎల్లుండి."

"చాలా ముందుగా బయల్దేరారే."

"అవునండి. యూనివర్శిటీలో నా ఒరిజినల్ సర్టిఫికెట్సు తీసుకోవాలి. వీలుంటే యెవర్నన్నా ఆశ్రయించి—" అని అతని కళ్ళలోకి చూసి ఆగింది గీత.

అతను ఒక నిమిషం తీక్షణంగా ఆలోచించాడు. "ఐసీ—" అని.

"మీరెక్కడ పుటప్ చేస్తారు?"

గీత పైకి చూసింది.

సరోజ్‌కుమార్ గబుక్కునదూకాడు. "గుడ్ మార్నింగ్. మిస్ గీతా" అని నవ్వుతూ కారిడర్‌లోకి వెళ్ళాడు.

"మీ బంధువులా?"

"కాదండీ. రైల్లో పరిచయమే,"

0 0 0

వాల్తేరు స్టేషన్‌లో దిగగానే ముందు గీత. వెనక సరోజ్‌కుమార్, ఆ వెనక సూర్యారావు గేటువైపు నడిచారు. గేటు దాటగానే ఒక ఫుల్‌సూట్‌లో వ్యక్తి సరోజ్‌కుమార్ కెదురువచ్చి "హల్లో" అని కౌగలించుకుని, "కమాన్ స్కూటర్ తెచ్చాను." అంటూ తీసుకుపోబోయాడు.

"వన్ మినిట్—" అని. సరోజ్‌కుమార్ "ఎక్స్‌క్యూజ్ మి.మిస్ గీతా!" అని ఆమెతో ఏకాంతం కోరినట్టు సూచించాడు.

గీత అప్రయత్నంగా ఆగింది.

ఇంచుమించు నిశ్శబ్దంగా అతను "శాంతినివాస్. రూమ్‌నెంబరు నాలుగు. ఇవాళ ఖాళీవుండదు. రేపు దయచేయండి. స్వాగతం, గులాబీల పండగ. థాంక్స్" అని జనంలో కలసిపోయాడు.

గీతనిర్ఘాంతపోతూ చూసింది.

కొద్దిదూరంనుంచి సూర్యారావూ చూశాడు. అతనికేమీ అర్థంకాలేదు.

బస్సుకోసం స్టేషన్‌దాటి రోడ్డుకొస్తోంది గీత. వెనగ్గా సూర్యారావు వస్తున్నట్టు గమనించింది,

"నేను మీకోసం ట్రైచేస్తాను. ఇవాళ పగలంతా నాకు పనుంది. రాత్రిగాని రేపుగాని వొచ్చి నాకు తెలిసిన వాళ్ళు ఎవరన్నా వున్నారేమో కనుక్కొని మీ ఇంటర్‌వ్యూ జయప్రదం కావడానికి ఏర్పాటు చేసే పద్ధతి చెప్తాను. మీ రెక్కడుంటారో చెప్పడానికి అభ్యంతరం లేకపోతే చెప్పండి" అన్నాడతను. గీతతో కూడా నడుస్తూ!

గీత అరనిమిషం ఆలోచించింది,

"థాంక్స్.నేను శాంతినివాస్ హోటల్‌లో రూం నెంబరు నాలుగు రిజర్వు చేసుకున్నాను. రేపు రాత్రికి రండి, నాకు గులాబీ పుష్పాలంటే యిష్టం. మర్చిపోకండి." అని చిరునవ్వు నవ్వుతూ. కదలడానికి సిద్ధంగా వున్న రిక్షాయెక్కి "పోనీవోయ్" అనిచెప్పి, "టాటా" చెప్పింది సూర్యారావుకి.

("జ్యోతి" మాసపత్రిక: సెప్టెంబరు 1964)

# గతితప్పిన కరుణ

సినిమా పన్నెండు గంటలకే అయిపోయింది. చర్రున కారు బైటికి తీసింది కరుణాదేవి. వ్యాసమూర్తి ఫ్రంట్ సీట్లోనే ఆవిడ కొంచెం దూరంగా కూర్చున్నాడు.

'సినిమా నీకు నచ్చలేదా?'

'అబ్బే, నచ్చిందండీ!—'

'నీకు క్రైమ్ పిక్చర్లంటే ఇష్టం గాబోలు—'

'అవే యిష్టమేననుకోండి—కాని నే నింగ్లీషు పిక్చర్లెక్కువ చూడను.'

—సాయంకాలం నాలుగున్నరకి ఆఫీసుకి ఫోన్ చేసింది కరుణాదేవి—'చూడు' ఆ ఫర్నిచర్ కంపెనీ ప్రొప్రయిటర్ సికింద్రాబాద్‌లో ఉంటున్నాట్ట—ఇప్పుడైదింటికివస్తే మాట్లాడొచ్చంటున్నాడు, ఫోన్ చేస్తే. వెళ్ళి మాట్లాడదాం. నువ్వు పర్మిషన్ తీసుకుని బైటి కొచ్చేసి మీ ఆఫీసు గేటు దగ్గిరే నుంచొని నా కోసం చూడు—ఇదుగో, కారు తీసుకు వచ్చెయ్యడమే. నిన్ను అక్కడే పికప్ చేస్తాను. ఆలస్యమా, అయితే కావచ్చు! నువ్వెవరికి జవాబు చెప్పాలోయ్, కుర్రాడా!——అక్కడే తాజ్‌లో భోంచేసి ఏదేనా ఇంగ్లీషు పిక్చరుకి వెడదాం; సిద్ధంగా ఉండు!' అంది—

'పన్నెండు దాటింది. మీ మెయిన్‌గేటు మూసేస్తారు కాబోలు—?'

ఔనండి. కాకపోయినా నేను రూముకి వెళ్ళట్లేదు.'

'ఏం?'

'వరంగల్‌లో నా ఫ్రెండొకడు కాలేజీలో ట్యూటర్‌గా పని చేస్తున్నాడండి. ఈ మధ్యనే పెళ్ళైంది—ఆవిణ్ని తీసుకొని సైట్ సీయింగు కొచ్చాడు. హైదరాబాదు—రూమ్ వాళ్ళ కిచ్చేసి నేను ఫ్రెండ్స్ దగ్గిర కాలక్షేపం చేస్తున్నాను. మొన్నటినుంచీనూ—'

'ఐసీ—' కరుణాదేవి నవ్వింది. 'గుడ్. అల్లా వుండాలి!'

'నిన్న మా కోబ్రెయినీ జహీరుద్దీన్ ఇంట్లో పడుకున్నాను. ఇవాళ ఏ.సీ.

ఘాట్స్‌లో నరిసింగరావింటికి పోతాను — అతను ఫేమిలీని పుట్టింటికి పంపే శాడులెండి'

'ఏబ్సర్డ్. వెళితే వెళ్ళొచ్చుగాని ఈ అర్థరాత్రప్పుడు అతన్ని డిస్టర్బ్ చెయ్యాలా, ఈ భాగ్యానికి-? మా బంగళాకొచ్చి, మా గెస్ట్‌రూమ్‌లో పడుకుని నిద్రపో—పొద్దుటే కాఫీతాగి కార్లో వెళుదువుగాని!-'

'మళ్ళీ మీ కెందుకండీ, అనవసరం శ్రమ?—ఏ, సీ. ఘాట్స్ దార్లోనే కదండీ—అక్కడ డ్రాప్ చెయ్యండిచాలు—'

'నథింగ్ డూయింగ్....'

కారు టేంక్ బండ్ ఎక్కింది. కరుణాదేవి ఆ అందమైన రోడ్డిచ్చిన ప్రోత్సాహాన్ని స్వీకరించి స్పీడ్ ఎక్కువ చేసిందికాని సరిగ్గా మధ్యకొచ్చేసరికి రోడ్డుమధ్యని విశ్రాంతి తీసుకుంటున్న వో జంతువును చూసి తక్కువ చెయ్య వలసి వచ్చింది. తప్పుకొని మళ్ళాజోరుగా నడపసాగింది.

అక్కడ, విమెన్స్ ఎంప్లాయ్‌మెంట్ స్కీమ్‌వారి స్టాల్ చాటున ఒక దృశ్యం వాతిరువురి దృష్టినీ ఆకర్షించింది—ఎవరో వొక జంట—పక్క పక్కగా కూర్చున్నారు—ఇద్దరిమధ్యా చీమదూరే సందైనా లేదు. ఒకరి చుట్టూ వొకరు చేతులు వేసుకొని, ఒకరి చెంప ఒకరి కానించుకొని వున్నారు— కార్లు వస్తూనే వున్నాయి. ఆగకుండా పోతూనే ఉన్నాయి—కార్లలో వెళ్ళేవాళ్ళకి మన సంగతే పట్టిందా అన్నట్టు వాళ్ళిద్దరూ ప్రపంచాన్ని మరిచి అలా కూర్చు న్నట్టుంది.

వ్యాసమూర్తీ కరుణాదేవీ ఒకరి కళ్ళలో కొకరు చూసుకున్నారు.

వ్యాసమూర్తి మాట్లాడదామని నోరు తెరిచాడు; కాని అతనికి మాట రాలేదు, నిస్సహాయంగా రెండోసారి ఆమెవేపు చూశాడు.

సీజన్లు టైములు లేని మానవ ప్రేమను గురించి వొకటి రెండు వాక్యాలు; ప్రస్తుతం కనబడ్డ దృశ్యంమీద ఒక వ్యాఖ్య, కరుణాదేవి మస్తిష్కంలో కద లాడాయి, ఆమె గొంతు సవరించుకుని అతనివేపు చూసింది—వెంటనే చూపు మళ్ళించుకొని, మాటలు గొంతులోనే ఉపసంహరించుకొంది. కాని ఆమె నోట పక్కుమని నవ్వుమాత్రం రాలేకపోయింది. మరుక్షణంలో ఆమె మునిపంట పెదవి నొక్కుకుంది.

* * *

బంజారా హిల్స్‌లో, కరుణావిల్లాలో గెస్ట్ రూమ్‌లో వ్యాసమూర్తి కూర్చున్నాడు. అతనికి నిద్ర పోదామని లేదు, నిద్ర రానూ లేదు. ఒకసారి ప్రయత్నించాడు కాని. అదెంతో కృత్రిమంగా తోచి,లేచి కూర్చున్నాడు.ఇక ఇప్పుడప్పుడే ప్రయత్నించడు. నిద్రకంటే ముఖ్యమైనదేదో, అసాధారణమైనదేదో, జరగాలని అతని కనిపిస్తోంది....

నిద్రొచ్చేదాకా ఏదేనా రాసుకోవాలనుంది; ఇన్ని తెల్ల కాయితాలు పడెయ్యండి—అని పుచ్చుకున్న లెటర్‌పాడ్‌లోని కొన్ని కాయితాలు టీపాయ్ కింద చిన్న ముక్కలుగా, కొన్ని నలిగిపోయిన ఉండలుగా ఉన్నాయి. కొన్ని మాత్రం నీటుగా దీటుగా నిండిపోయి టీపాయ్‌మీద వున్నాయి. వ్యాసమూర్తి వాటివి చదువుతూ, ఆలోచిస్తూ జ్ఞాపకాలు తెచ్చుకుంటూ, ముందుకివెళ్ళడం కోసం వెనక్కు వెళ్ళే ప్రక్రియ సహాయం తీసుకొంటున్నాడు.

ఎన్నాళ్ళైరోజులైంది, వ్యాసమూర్తి కరుణాదేవిని మొట్ట మొదటిసారి చూసి....

## 2

"రాజారావుగారు ఫారిన్ వెళ్ళేరు" అంది కరుణాదేవి.

"నేను తమ కోసమే వొచ్చానండి–"

కరుణాదేవి ప్రశ్నార్థకంగా చూసింది.

'నన్ను హనుమంతరావుగారు పంపేరు.... మీతో నా గురించి ఫోన్లో చెబుతా నన్నారు....'

"ఓహో, అతనా ను–"వ్వన్నట్టు చూసింది కరుణాదేవి. హనుమంతరావు నిన్న ఫోన్‌లో– 'నీ దగ్గిరికో అబ్బాయిని పంపిస్తాను. అతనికి నీవల్ల ఓ ఉపకారం కావాలి: నాకు చేసినట్టే భావిస్తాను–' అన్నప్పుడా అబ్బాయి ఇంత ముదురుగా ఉంటాడని ఇంత గడుసుగా మాట్లాడతాడని, ఇంత నిబ్బరంగా నించుంటాడని– అనుకోలేదు. అతనేదో చెప్పుతు పోతాడానీ, అలా చెప్పుతు పోకుండా వో నిమిషం ఆపాలనీ అనిపించిందామెకి.

"హనుమంతరావుగారు కేంప్ వెళతా నన్నారు....?"

"నిన్న జీ టీ. లో వెళ్ళేరండి."

"వాళ్ళమ్మాయి చెయ్యికాల్చుకుందటనే, ఇప్పుడెల్లా వుంది?"

"కొంచెం నయమేనండి...."

"వంట మనిషి దొరకలేదన్నారు—?"

"లేదండీ— డ్రైవరు పంతులే ఒండి పెడుతున్నాడింకానూ."

ఇంకేమేనా అడుగుతారా అన్నట్టు చూస్తూ ఉండిపోయాడతను.

"రాజ్యలక్ష్మీ!" అని కేకేసింది కరుణాదేవి—అల్లందూరాన అవతలి ద్వారాన రెండుమూడురంగులు తళతళ లాడాయి.

"కాఫీ తీసుకురా." అనేసికూడా.

"టీ తీసుకుంటారా?" అని మృదువుగా అతన్ని సంప్రదించి.

"ఏదైనా ఫర్వాలే"దని అతనన్నాక:

"ఇవన్నీ ఎందుకులెండి. ఇప్పుడు." అని అనలేదుకదా అని:

"ఫర్వాలే"దనుకుంది- కరుణాదేవి.

"మీ పేరు?"

"వ్యాసమూర్తి"

"అబ్బా, వ్యాసమూర్తే!,- గల గలా నవ్వింది కరుణాదేవి "ఏ వ్యాసమూర్తి?"

"అదిరాజు వారు, మా యింటిపేరు,"

"ఆదికాదు నేనడిగింది———" చమత్కారానికి తెచ్చుకున్న నవ్వు నిండుగా. హృదయపూర్వకమై వొచ్చేసింది; "భారతం రాసిన వ్యాసుడా భాగవతం రాసిన వ్యాసుడా?—

ఆవిడ తనతో కులాసాగా మాట్లాడుతున్నందుకు సంబరపడి తనని తాను అభినందించుకున్నాడు, అందులోమునిగిపోయి"ఇద్దరూ,వొకరే కదండీ."అన్నాడు

"ఇద్దరూ వొకరే—" నవ్వుకుంటూ కూచుంది కరుణాదేవి, "ఓస్ ఇంతేనా"అన్నిహేళనలేక పోలేదు ఆ నవ్వులో. తల ఆడించి"కాని ఇద్దరూ ఒకరెల్లా అవుతారు?" అంది.

బిక్కమొహం వేసేడు, వ్యాసమూర్తి ఇదేదో సర్వీస్ కమీషన్ ప్రశ్న లాగే ఉంది. ఒకవేళ ఇదేవొస్తే?

—మరుక్షణంలో అతను అవకాశం చిక్కబట్టుకొని చకచకా మాట్లాడేడు; తను గ్రాడ్యుయేట్, ఫస్ట్‌క్లాస్, యూనివర్శిటీ రేంక్ స్పోర్ట్స్‌మన్, యన్. సీ సీ; కల్చరల్ ఎసోసియేషన్ జాయింట్ సెక్రటరీ, మెడల్స్, ప్రయిజెస్, మెరిట్ సర్టిఫికెట్స్.- ప్రస్తుతం గ్రూప్-టూ సర్వీస్‌లో ఒక ఉద్యోగం

కోసం ప్రయత్నం. వ్రాతపరీక్షల చాలా బాగా వ్రాసేడు. ఇంటర్వ్యూ ఆరురోజు లుంది. మంచి రికమెండేషన్ ఉంటేనే మంచి ఉద్యోగం దొరుకుతుందన్నారు—

'........ ఈ పని మీవల్లే కావాలని హనుమంతరావు గారన్నారండీ'

"నోనో.... రాజారావుగారైతే ఏమోకాని– నేనా?'

'ఆ విషయం డిస్కస్ చేసేరండి. వారికంటే తమరు తల్చుకొంటేనే బాగా పని జరుగుతుందన్న నిశ్చయాని కొచ్చేరండి, హనుమంతరావు గారు....'

కాఫీలు ఒచ్చేయి. మాటలు ఆగేయి.

'—ఇంతాచేసి స్టేట్ గవర్నమెంట్లో ఉద్యోగానికా? రాజారావుగారైతే ససేమిరా కలగ జేసుకోరు. నేను కలగ జేసుకున్నానని తెలిస్తే ఊరుకోరు కూడానూ. ఇంతకీ హనుమంతరావుగారికి మిమ్మల్ని స్టేట్ గవర్నమెంట్లో పెట్టవలసిన ఖర్మేమొచ్చిందో.... సరే ఇంటర్వ్యూ పదకొండో తారీకు వన్నారుగా. పదో తేదీ సాయంత్రం వోసారి కనిపించండి. మిమ్మల్నో చోటికి తీసుకువెళ్తామ–' అంది కరుణాదేవి.

వ్యాసమూర్తి లేచి నమస్కారం చేసేడు, 'చాలా థేంక్సండీ' అన్నాడు. అతని మొహంలో చిరునవ్వు మెరిసింది. 'హనుమంతరావుగా రన్నట్టే జరిగిందండీ, సరిగ్గాను. రాజారావుగారుంటే పని జరగదని ముందే చెప్పారాయన. ఈ సమయంలో వారు ఫారిన్ వెళ్ళిపోయుండడం నా అదృష్టం....'

అతనలా వెళ్ళిపోగానే కరుణాదేవి ఫోన్ఎత్తి ఓ నెంబర్ డయల్ చేసి 'నేను తొందర పడుతున్నానా?' అనుకొని, నవ్వుకొని, మాట్లాడసాగింది.

0 0 0

ఇంటర్వ్యూకు ముందు రోజున వ్యాసమూర్తి కరుణావిల్లాకు వెళ్ళాడు. ఆవిడ కార్లో, వెనక సీట్లో కూర్చుని సర్వీస్ కమీషన్ మెంబర్‌గారింటికి వెళ్లాడు. మెంబర్‌గారికి తెలుగు బాగా రాదు. ఉర్దూలోనే వాళ్ళిద్దరూ ఏవో మాట్లాడుకుంటూ లోపలకి వెళ్ళారు. పదినిముషాలయ్యేక 'టీ' ఒచ్చింది. మరో పది నిమిషాలకి మెంబర్‌గారి భార్య, కరుణాదేవి, మెంబర్‌గారూ, ఇవతలికొచ్చేరు.

వ్యాసమూర్తితో మెంబర్‌గారు ఒక్క వాక్యంకూడా మాట్లాడలేదు. కాని అతనికి తప్పకుండా ఏదో ఉపకారం చేసేటట్టే అతని కళ్ళల్లోకి దయగా చూసేడు.

* * *

ఇంటర్వ్యూనాటి సాయంకాలం కరుణాదేవిని చూడడానికి వెళ్ళేడు వ్యాస మూర్తి. అతన్ని చాలా కరుణతో చూసిందావిడ. స్వయంగా టీ తెచ్చియిచ్చింది. ఇంటర్వ్యూలో తనని పరీక్షించిన విధం, తనని అంతలేసి పెద్దపెద్ద ఆఫీసర్లు గుర్తించిన విధం అతను వర్ణించి చెబుతూ ఉంటే ఆమె చాలా ఉత్సాహంతో వింది.

తను హాల్లోకి వెళ్ళగానే అందరి మొహాలూ చిరునవ్వులతో కలకలలాడే యని వ్యాసమూర్తి చెప్పగానే ఆవిడ సోఫాలో వెనక్కి చేరబడి కాలుమీద కాలు వేసుకొంది.

* * *

ఉద్యోగానికి ఆర్డర్ వచ్చినవాడు వ్యాసమూర్తి మళ్ళీ కరుణావిల్లాకు వెళ్ళాడు. థాంక్స్ చెప్పాడు.

'నా కెందుకూ థేంక్సు!– మీ హనుమంతరావుగారికి చెప్పు' అందావిడ.

'మీ దగ్గరికి పంపించినందుకు ఆయనకి థేంక్స్ చెప్పివలసిందేనండి'

'ఉండు. మరిచిపోకుండా ఈ థేంక్సు పార్టీ ఈయన కూడా యిద్దాం' అంటూ కరుణాదేవి, మెంబర్‌గారి నంబరు డయల్ చేసి మాట్లాడింది.... 'విన్నావా అయనకూడా నాకే థేంక్సంటున్నారు.' అని నవ్వుతూ ఫోన్ పెట్టే సింది.

వ్యాసమూర్తి ఆశ్చర్యంగా చూశాడు.

'.... మేం చేసిం దేముంది? మీరు పంపిన కేండిడేట్ అన్నిటా ఫస్ట్ రావడమే కాకుండా, మేం అడిగిందే తడవుగా అన్నిటికీ ఆన్సర్స్ చెప్పేడు. అంత బ్రిలియంట్ మేన్‌ని గవర్నమెంట్ సర్వీసులో మా ద్వారా చేర్పిస్తు న్నందుకు మీకు థేంక్స్–అన్నాడోయ్, ఆయన!' అన్నది కరుణాదేవి.

వెంటనేలేచి 'ఇంకేమిటి, విశేషాలు?– నేను సికింద్రాబాదు వెళ్ళాలి. ఏమేనా మాట్లాడాల్సి ఉంటే పద, కార్లో కూర్చుని మాట్లాడుదువుగాని. మళ్ళీ కార్లో వచ్చేద్దువుగాని' అంది.

ఏం మాట్లాడానికి లేకపోయినానరే, అవిడతో కారులో కూర్చుని ప్రయా ణం చేసే అవకాశం వొదులుకోలేక వ్యాసమూర్తి ఆవిణ్ణి అనుసరించేడు.

0 0 0

కెంటోన్మెంట్‌లో ఎవరో మిలిటరీ ఆఫీసర్‌తో పదిహేను నిమిషాలు

ఠకా మాట్లాడిందావిడ. డ్రైవరూ, వ్యాసమూర్తీ ఏకాంతంగా బైట కూర్చో వలసొచ్చింది.

'చుట్టాలా: వారూ వీరూ?' అన్నాడు వ్యాసమూర్తి.

'ఎవడికి తెలుసు?' అని అటు తిరిగి బీడీ ముట్టించాడు డ్రైవరు.

తిరిగి వచ్చేటప్పుడు టాంక్‌బండ్ ట్రాఫిక్ఐలండ్ దగ్గర 'కారిక్కడా పిస్తే నేనిలా గన్‌ఫౌండ్రీకి వెళిపోతానండీ' అన్నాడు వ్యాసమూర్తి.

'గన్ ఫౌండ్రీ కెందుకు?'

'నా రూమ్ అక్కడేనండి.'

'ఊఁహూఁ, కారు అటు పోనీవోయ్.'

కాలేజ్ దగ్గర దిగి, వ్యాసమూర్తి రెండడుగులు వేసేడు. కారు ఫతే మైదాన్ రోడ్డువేపు తిరిగి వెళ్ళిపోతూ ఉండడం ఆశ్చర్యంగా గమనించాడు. కారు వెళ్ళిపోడంలో ఆశ్చర్యం ఏమీలేదు. కాని మొత్తంమీద ఆశ్చర్యపడేది ఏదో జరిగినట్టుంది.

దక్షిణామూర్తీ అతనూ అక్కడ ఢీకొట్టుకున్నారు.

## 3

"ఏంవోయ్! ఎటు చూస్తూ నడుస్తున్నావ్?.... ఇంకో రెండడుగులు వేసి ఆ స్టేట్ బ్యాంక్ దగ్గిర ఇలా నడిచేవంటే చాలు....' అన్నాడు దక్షిణామూర్తి నవ్వుతూ.

"నాకు స్టేట్ బ్యాంక్ దగ్గిర ఈ వేళప్పుడేం పనుంది-ఏదో తమలాంటి వాళ్ళకి తప్ప-" అన్నాడు వ్యాసమూర్తి తనూ నవ్వేస్తూ.

"అదే, అదే!- ఆ కార్లోంచి దిగినవాడు ఇంకెలా మాట్లాడుతాకే-! ఇంతకీ ఈవిణ్ణెలా పట్టావ్"

"పట్టడం ఏమిటి, నేనేం దయ్యాన్నా, శనినా?"

"దయ్యానివి కాకపోవచ్చుగాని, శనివి మాత్రం అవును!"

"అయితే అయ్యానుగానీ, ఇవాల్టితో నా శని విరగడైపోయింది. గ్రూప్-టూ సర్వీసెస్‌లో నాకు సెలక్షన్ ఒచ్చింది. ఇవాళే ఆర్డర్సు వచ్చాయి...."

"ఊఁ అలా చెప్పు!- ఈవిడిద్వారా వచ్చుంటుంది," అన్నాడు దక్షిణామూర్తి ఆశ్చర్యపడకుండా.

"ఈవిడ, ఈవిడంటున్నారేమిటండీ- ఎవరో పక్కనే ఉన్నట్టు! ఆవిడ బంజారాహిల్స్‌కి వెళ్ళిపోయుంటుంది!"

దక్షిణామూర్తి నవ్వేశాడు. "అబ్బో, అబ్బో! బంజారాహిల్స్! చాలా దూరం వెళ్ళిందన్నమాట, వ్యవహారం!- జాగ్రత్తసుమా! అక్కడ మేడల గోడలేకాదు, మనుషుల మనసులూ రాళ్ళమయంగా ఉండొచ్చు!" పరిహాసం మేళవించిన మందహాసం విసురుతూ, దక్షిణామూర్తి దక్షిణ హస్తంతో వ్యాస మూర్తి వీపుమీద ఓ బరువయిన గుల్లదెబ్బ వేశాడు.

దక్షిణామూర్తి ధోరణి చాలా ఎబ్బెట్టుగానే ఉంది. అయినా సంతోషంలో, ఆనందాతిరేకంలో, తను మంచి ఉద్యోగం సంపాదించేడన్న సంగతి నలుగురూ తెలుసుకుంటున్నారన్న గర్వంలో, గుర్తించికూడా పట్టించుకోలేదు వ్యాసమూర్తి.

తనకీ ఆవిడకీ పరిచయం కావడం, అదంతా వరసగా చెప్పేశాడు.

దక్షిణామూర్తి డిప్లొమాటిక్‌గా నవ్వేడు.

"ఉఁహూఁ....హనుమంతరావుగారూళ్ళో ఉన్నారా?"

"లేరు. టూర్ ప్రోగ్రాం ప్రకారం యివాళ రాజమండ్రిలో ఉంటారు. ఐదార్రోజుల్లో వొచ్చేస్తారు...."

"ఆయనేం చెప్పారు నీతో. ఈవిణ్ణి గురించి?"

"ఏం చెప్పలేదు, ఫలానాచోట వాళ్ళిల్లు, ఆవిడకి నీ గురించి ఫోనులో చెప్పాను ఓసారి నువ్వెళ్ళి కనబడు, నీకు తప్పకుండా హెల్ప్ చేస్తుంది అన్నారు—"

"ఆవిడ ఎవరూ ఏం కథా-ఇవేం చెప్పలేదూ—?"

"ఆవిడ డాక్టర్ రాజారావుగారి భార్య?"

"అది సరేలేవోయ్- అసలు సంగతేం చెప్పలేదన్నమాట....పోనీలే— నిన్నెలా చూస్తోంది?"

"చాలా దయగా చూస్తోంది?—"

దక్షిణామూర్తి మళ్ళీ భావగర్భితంగా నవ్వాడు. "దయేమిటోయ్, వెర్రి వాడా! దయ చాలారోజులై ఆవిడ లోకాన్ని విడిచి వెళ్ళిపోయింది. ఆప్యాయం అను, ఇష్టం అను. ఇంకేదేనా అను. అందులో కరుణాదేవిగారా!— పేరుకి మాత్రం కరుణ!— చేసేపన్లు—"

"ఏం చేస్తుందేం?"

"ఏం చేస్తుందా?— మొగాళ్ళని ఆడిస్తుంది. మొగాళ్ళతో ఆడు కుంటుంది. నీకూడా అదృష్టం పట్టిందేమోనని!—"

"ఛీ ఛీ—ఏమిటండీ. మీ మాటలు?"

*　　　*　　　*

"ఊఁహూ....ఏం, ఆవిడందంగా లేదా?"

"..............."

"చెలాకీగాలేదా, కలుపుగోలుతనంగా లేదా?- మొగాళ్ళని వెర్రి వెధవల్ని చేసి పడేసేవి ఏమిటి లేవు, ఆవిడ దగ్గర?"

"నా కర్థం కావడంలేదు-"

"....మొదట్లో ఎవడికి మాత్రం అర్థమై ఏడిసింది గనక! నువ్వింకాక అన్నట్టు, ఆవిడ డాక్టర్ రాజారావుగారి భార్య అని మాత్రం అందరికీ అర్థమవు తుంది....ఆవిడకున్న పలుకుబడి అసలు రాజారావుగారికుందా అని!-ఐ.సి.యస్. ఆఫీసర్లు, గవర్నరు, గవర్నమెంట్ సెక్రటరీలూ, సర్వీస్ కమీషన్ మెంబర్లు, రెవెన్యూబోర్డు మెంబర్లూ, ఐ.జి. ఆఫ్ పోలీసూ, కార్పొరేషన్ మేయరూ— రిట్జ్, పెర్సీస్, రాక్‌కేసిల్ లాంటి హోటళ్ళు—శవాయ్, మంజూస్, లిదోస్, వికాజీప్‌లాంటి బార్లు—ఆవిడ మాట తీసెయ్యగల మహానుభావుడీ జంట నగ రాల్లో లేడు నాయనా—అలాంటావిడతో పరిచయం అంటే అదృష్టంగాక మరే మిటి?"

వ్యాసమూర్తి కళ్ళు మెరిశాయి.

"—ఈవిడ మొదట్లో పిఠాపురం దగ్గిర ఏ వూరునుంచో వచ్చిందయ్యా. బాగా చదువుకుంది,ఆంధ్రా యూనివర్సిటీలో పోస్టు గ్రాడ్యుయేషన్—చదివిందో, ఒడ్డెక్కించిందో తెలీదు...మామూలుగా మేరేజ్ కాలేదు, ఎవరితోటో వెళ్ళి పోయిందనీ, ఒక కొడుకో, కూతురో పుట్టడం కూడా జరిగిందనీ చెప్పుకుంటారు —పరమాత్ముడి కెరుక!....ఆనర్స్ చదువుతూ వుండగా ఒక పెద్ద ఎలక్ట్రికల్ ఇంజనీర్— రిటైరయిపోతూ ఉన్నాయన—ఈవిణ్ణి చేరదీసేడు—ఆయనతో ఎనిమిదేళ్లుంది, ఆయన పోతో పోతో ఆస్తంతా ఈవిడ పేరబెట్టి వెళ్ళాడు. డబ్బుచూసి అనేకమంది వెంటబడ్డారు.... కొంచెం అనుభవం, బలం, వచ్చే యిగా! ఎవర్నీ చేరనియ్యలేదు.... అలా కొంతకాలం స్వేచ్ఛగా, పెద్దపెద్ద వాళ్ళతో మాత్రం పరిచయం చేసుకొని వాళ్ళతోనే తిరుగుతూ— అంతా అట్

మోస్ట్ సీక్రెసీలో అనుకో- గడిపేసింది— రాజారావుగారి పరిచయం అయి ఆరేళ్ళయింది. ఈ ఆరేళ్ళయి ఆవిడ ఆడింది ఆటా పాడింది పాటా— ఆయన కేమిటి, పెద్దవాడు! ముగ్గురు కొడుకులున్నారు. ఒకడు యూకేలోనూ ఇద్దరు అమెరికాలోనూ సెటిలైపోయేరు. ఇంకెవ్వరూ లేరు; లంకంత యిల్లూ, గంపంత ఆస్తీ కొండంత ప్రతిష్ఠా తప్ప!— అలాంటప్పుడు ఈవిడ తటస్థపడింది. తెలివీ, అందం, యౌవనం, హుషారూ, మాట నేర్పరితనం వున్న మనిషి ....ఇన్నిటికీ మించి మొగవాణ్ని సంతోషంలో వూగించడంలో వూరించడంలో ఆవిడకున్న చాకచక్యం లోకంలో చాలా అరుదంటారు— ఆయన స్వర్గం అనుభవించి ఆనందపు లోతులూ, అనురాగపుటంచులూ చూసేడు.... ఇప్పుడిప్పుడు ఆవిడ చేసేపన్లు- అన్నీ కాకపోయినా కొన్ని- ఆయన కర్ణాకర్ణిగా వినేసరికి- చాలా బాధపడి,ఈవిడ ఎలాగైనా వదుల్తే బావుణ్ణురా అని చూస్తున్నాడు.... ఒకానొక సందర్భంలో డైవోర్స్‌కి లక్షరూపాయలు ఆఫర్ చేసేడని చెప్పుకుంటారు—"

"ఇవన్నీ నా కెందుకండీ— నేనేదో హనుమంతరావుగారు పంపేరుకదా అని వెళ్లేను; ఆవిడ రికమెండ్ చేస్తే సెలక్షన్ ఒస్తుందన్నారు; ఒచ్చింది—!"

"అంతే అనుకుంటున్నావా?.... వెర్రినాయనా!........అంత సుళువా. ఆవిడ పంజరంలోంచి వరాలైన పారిపోడం! శ్లేష్మంలో పడ్డ ఈగ నయం! ఆవిడ కిష్టం ఉండనీ, ఉండకపోనీ: నీ కావిడ వెంట పడదామనిపించేటంత వరకూ తెస్తుంది. నీ చేత యామండీ అనిపించుకుంటుంది. నిన్ను ఏం వోయ్ అంటుంది. ఇవ్వండీ అని పదే పదే అడిగించుకుంటుంది; ఇస్తాను రేపురా అంటుంది. వెయ్యేళ్ళు ఆశపెట్టి వేలిచుట్టూ తిప్పుకుంటుంది. ఒక్కొక్క మొగవాణ్ని ఒక్కొక్క బీర్ బాటిల్‌కన్నా కనాకష్టంగా చూసి అవతల విసిరేస్తుంది... తిరిగి చూసేసరికి పెంటపోగుమీద వుండడం తప్ప ఈ వెధవాయగారు చేసేదేమీ వుండదు—"

ఏదో ఉపన్యాసం విన్నట్టుండడం దగ్గిర్నుంచీ ఎడ్వెంచర్ సినిమా చూసినట్టుండడం వరకూ అనుభవాలు పొందేడు వ్యాసమూర్తి 'అలా ఎన్నాళ్ళు సాగుతుందండీ ఆవిడకి మాత్రం?—ఇంతమందీ నేడిపిస్తే యెంతపగ ప్రబల్తుంది!"

దక్షిణామూర్తి ఎగతాళిగా నవ్వాడు. మళ్ళీ మొహం చిట్లించుకొని అన్నాడు: పగ!— ఏర్పడ్డం ఎంతసేపు. ఏగానికి కొరగాకుండా ఎగిరిపోయి

చావడమూ ఎంతసేపు! రాళ్ళు ఆవిడకి తగలవు; రక్తమూ మెది ఉడకదు—చిరు నవ్వుతో చిదంబరం పంపేస్తుందిరా నాయన! పలుకుబడి పళ్ళతోటలా వున్న మనిషికిపగే ఒక భయమా?

—అప్పుడప్పు డీవిడకి కనబడి నా విశ్వాసాన్నీ కృతజ్ఞతనీ తెలియజేస్తూ వుండాలని గంటన్నర క్రితం చేసుకున్న నిర్ణయాన్ని తుడిచి అవతల పారేశాడు వ్యాసమూర్తి.

0 0 0

కాని, ఆవిడ వొదిలిందా?—

—సరిగ్గా ఐదోరోజున— ఏదో కారు—గన్‌ఫౌండ్రీ సందుల్లో గర్జించు కొంటూ గన్‌పేల్చినట్టు బేక్‌ఫైరింగు చేసుకుంటూ, తిరిగి తిరిగి, ఆఖరికి వ్యాసమూర్తి రూమున్న యింటిముందు ఆగింది.

కింద– "బ్రహ్మచారీ మఠ్"లో వుంటున్న సిద్ధేశ్వర్ పెర్షాద్‌ని 'వ్యాస్ మూర్తీ కహాఁ రహతే?' అని అడిగిన కరుణాదేవి కంఠస్వరాన్ని వ్యాసమూర్తి గుర్తుపట్టాడు. అంతే.... గడ్డంగీస్తున్న అతని రేజర్ జారిపడ్డట్టయింది. అతను వూహించసాగాడు—వాడు బహుశా ఆవిడ రూపానికి పరవశించి; దొరవకి ఆశ్చర్యపడి, అధికారానికి భయపడి; అవన్నీ చూసి నిర్ఘాంతపడి— నోటంట మాటరాక, ఒకవేలు పైకి చూపించి, 'ఊపర్' అన్నట్టు తలయెగరేసి, వొగుట కతో. రాబోయిన మాటని మింగేసుంటాడు– టైమ్‌లేదు. మెట్లెక్కి ఆవిడ మేడ మీద కొచ్చేస్తూవుంటే, పేముతో తయారు చెయ్యబడ్డ 'మోడా'– తన రూమ్‌లో వున్న ఒకే వొక ఫర్నిచర్ పీస్–ని ఖాళీ చెయ్యటానికి వ్యాసమూర్తి పడ్డయాతన వర్ణనాతీతం.... దానిమీద గుండు సూదుల దగ్గర్నుంచీ బెండగింజల వరకూ ఏవేవో–వున్నాయి.

"నమస్కారమండీ" అన్నాడతను. ఆవిడ ద్వారం అవతల కనబడగానే.

"నమస్కారం!.... ఇక్కడుంటున్నావా, నువ్వు– నువ్విచ్చిన డోర్ నంబరుతో ఈయిల్లు కనిపెట్టినందుకు నువ్వుగాని,ఈకార్పోరేషన్ వాళ్ళుగాని.... తనకేదైనా స్పెషల్ ప్రయిజ్ యివ్వాలంటున్నాడు మా డ్రైవరు!"

"క్షమించండి. మా రూమ్‌లోకి తమలాంటి వారొస్తే కూచుందికి కూడా ఏమీ లేవు దయచెయ్యండి. ఆ డ్రైవరో మరెవరో తోలెయ్యలేకపోయారా నేను రాకపోయానా? ఈ డర్టీప్లేస్‌కి మీరు రావడం...."

"అదేం లేదులే: బాధపడకు. నాలుగైదు నెలల్లో నువ్వే సంపాదిస్తావు; ఫర్నిచర్ కేముంది!.... సరే నువ్వెంతసేపట్లో బయల్దేరగలవు? మనం అలా వెళ్ళాలి—"

వాచీ చూసే మిషతో ఆవిడ పక్కకి తిరిగి నవ్వుకుంటూ వుండే పరధ్యానంగా తనమొహం అద్దంలో చూసుకొని, సబ్బురాసిన సగం గీసిన ఈ మొహాన్ని ఈవిడ యింతసేపూ నవ్వకుండా యెలా చూడగలిగిందా అని ఆశ్చర్యపడ్డంలో, ఆవిడడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పడం మరిచిపోయాడు వ్యాసమూర్తి.

"నాకో చిన్న సాయంచేసి పెట్టాలి నువ్వు..."

"నేనా?.... మీకా....?— సాయంచేసి పెట్టడమా?— మీరు ఫోన్‌చేస్తే పెద్ద పెద్ద వాళ్ళు మీ గుమ్మంలో వాల్తారు...."

కరుణాదేవి నవ్వేసింది. "ఇది పెద్దవాళ్ళ కప్పగించే పనికాదులే—"

ఎక్కడో ఏదో ఫర్నిచర్ కంపెనీ ఉందట—వాళ్ళదగ్గర ఏవో స్పెషల్ క్వాలిటీ పెయింట్స్ ఉంటాయట. అవి ప్రత్యేకం వాళ్ళ స్పెషల్ లైసెన్స్ క్రింద ఇంగ్లాండ్‌నించి వస్తాయట.... ఆ ఫర్నిచర్ కంపెనీ వాళ్ళతో మాట్లాడి, నాలుగు రకాల రంగుల నాలుగు డబ్బాలు రిజర్వ్‌చేయించి; ఆవిడ వేరేచోట, వేరే ప్యాట్రన్‌లో తయారు చేయిస్తోన్న ఫర్నిచర్‌కి ఆ కంపెనీ స్ప్రేయింగ్ మెషీన్స్‌తో వేయించాలి....

"దీంట్లో నే చేసే దేముందండి? వాళ్ళెవరో ఎక్కడుంటారో కూడా నే నెరగను...."

"నేనుమాత్రం ఎరుగుదునా?—నా పక్కన నిలబడ్డమే; నువ్వు చేసే దల్లాను—మిగతాదంతా నే చూసుకుంటాను— రెడీయేనా?—బయల్దేరు మరి!"

"అసలావిడ తత్వమే అంత" అన్నాడు దక్షిణామూర్తి— "ఆవిడపని ఆవిడ చేసుకోగలదు; అలా చేసుకోనివ్వాలికూడాను— కాని పక్కన ఎవడో ఒహడు నిలబడాలి!– అది జవాబుదారీకే అనుకో. లేకపోతే డాబుసరికే అనుకో– మొత్తంమీద ఎవడో ఒహడు వుండవలసిందే!....

"—నువ్వావిణ్ణి ఒదలొద్దు....ఎప్పుడైతే నీ రూమ్‌కి రావడం కూడా ప్రారంభించిందో, అప్పుడే కథ చాలావరకూ వెళ్ళిందన్నమాట....ఈ మాత్రం గౌరవం చాలా రోజుల్నించీ ఎవరికీ జరగలేదు....ఈమధ్య చిన్న కుర్రాళ్ళ మీదికి పోతోందిలే....కాని వొక్కటి మాత్రం గుర్తు పెట్టుకో, నీ బెజవాడ

యస్సారార్ కాలేజి టేక్టిక్స్ ఏమీ పని చెయ్యవిక్కడ.... ఆరితేరిన బుర్ర. అతి జాగ్రత్తగా వుండాలి—అంతెందుకూ. ఎక్కడా పప్పులో కాలు వెయ్యకుండా వ్యవహారం చివరంటా నడిపించి ఒడ్డెక్కి స్తే నీకు నాదో స్పెషల్ ప్రయిజ్—ప్రస్తుతానికి ఇదీ—"

వ్యాసమూర్తి నరాలు జివ్వుమన్నాయి. ఆలోచించడానికిష్టంలేనంత హడావిడి పడ్డాడు. అతని మనస్సు మాత్రం దక్షిణామూర్తి సూచించిన ధోరణిలో కొట్టుకుపోతోంది. "ఏమిటండోయ్, అది!" అన్నాడు ప్రస్తుతానికి వొస్తూ. సందేహాలు అడగకూడనివిగా మిగిలి, ఇంకిపోయాయి.

"ఇది థియేటర్ అనీ, ఒక నవలలే. సోమర్సెట్ మామ్ అన్నతను వ్రాసేడు—చదువు. నీకు బాగా, టెక్ట్సుబుక్కులా పని చేస్తుంది—"

○ ○ ○

అవకాశంకోసం వెతుక్కోడం వ్యాసమూర్తికొక వ్యాపకమైపోయింది—ఆవిడకీ తనకీ ఏమన్నా సాపత్యం సమత్వం ఉన్నాయా? ఏమిటి సంబంధం? ఇది- ఈ ధోరణి నిజమేనా? అన్న ప్రశ్నల్లేవు—ఉన్న క్షణాల్లో కొట్టొచ్చినట్టు తెలుస్తూనే ఉంటుంది, అంతెత్తున వుంటుందిక్కెందునా, ఆవిడ. తను చాలా అల్పుడేమో—కాని అలా అనుకోడం యిష్టం వుండదు. అలా ఎంత సేపు ఆలోచించడు... అవిడకొక బాయ్ ఫ్రెండు అవసరం కాబో లనిపిస్తోంది. దానికి కారణాలూ, ఆర్గ్యుమెంట్లూ. ఒకవేళ ఆవిడకి బాయ్‌ఫ్రెండ్ కావలసివచ్చిన సందర్భంలో తనకన్నా అర్హుడెవరు?... అందుచేత ఎలాగో ఒకలాగ ఆవిడతో అనుబంధం తెగకుండా బంధం గట్టి పడేటట్టు జాగ్రత్తపడాలి—అదీ దక్షిణామూర్తిగారి వుద్బోధా, తనకి సబబనిపించిన రీతీనూ. రోజూ కలుస్తాడు. ఎంత వరకూ వచ్చిందో చెప్పమంటాడు.ఏవో సలహాలు చెబుతాడు.చిక్కగావివరిస్తాడు, చక్కని ఉదాహరణలు తెస్తాడు, వాతావరణంలా, వ్యసనంలా, చుట్టూ వ్యాపిస్తాడు.

చివరికి ఓ అవసరంలాంటి అవకాశం తగిలింది.

"ఇక్కడ హైదరాబాద్‌లోనూ ఒక బేచ్ వాళ్ళు ఈ పనికి ట్రెయినింగ్ అవుతూ వుంటేకూడా, నన్ను కర్నూల్ వేసేం పొమ్మంటున్నాదండి. నేను యల్.యల్బి. చదువుకుందామని పుస్తకాలు పోగు చేసేను, నాతోసహా చదవడానికో అబ్బాయినీ సెలక్టు చేసుకున్నాను. ఇంక ఫీజు కట్టడ మాలస్యం. ఇప్పుడు కర్నూల్ వెళ్ళిపోతే-"

"ఇది చాలా సిల్లీగా ఉంది. ఆఫీసర్లు బాధపడతారు—వాళ్ళఆఫీసుల్లో, కార్యనిర్వహణ కోసం లక్ష ఆర్డర్స్ వేస్తారు. అన్నీ సదుపాయంగానే ఉండవు ఎక్కడో ఏదో ఒక ఆర్డర్ ఎవరికో వొకరికి ఇబ్బందిగానే ఉంటుంది; అలా అని అన్నీ మారుస్తూ కూర్చుంటే వాళ్ళ పని చేయించుకోడం ఎలాగ?—ప్రతీ సారీ ఇలా ఒకరిమీద ఆధారపడి ఉద్యోగం ఎంతకాలం చేస్తావు!"

"ఈ ఒక్కసారికీ మీరు నాకీ సాయం చెయ్యాలండి. ఫీజ్ కట్టేసిన తరవాత కోర్స్ అయ్యేవరకూ మార్చరు—"

కరుణాదేవి నవ్వకుండా వొక్కనిమిషం కూచుంటే. దీనంగా ఏదేనా అందామనీ, నేననకపోతే మాత్రం ఆవిడ నన్ని ఊర్నించి చూస్తూ వెళ్ళిపో నిస్తుందా అనీ— అనుకొన్నాడు. కష్టపడి నోరు మూసుకు కూర్చున్నాడు.

"హనుమంతరావుగార్ని కన్సల్ట్ చేసేవా?"

"లేదండీ, నిన్న ఆయనకోసం ఆఫీసుకి వెళితే లేరు—"

"ఇంటి కెళ్ళేవా. మరి?"

"లేదండి—"

"ఏం?—అప్పుడే ఆ యిల్లు మరిచిపోయావా. లేకపోతే ఆ ఇంటికి వెళ్ళక్కర్లే దనుకున్నావా?... నువ్వు కనబడ్డం లేదని నాతో వచ్చి చెప్పా డాయన! ఇదేం బావులేదు... సరే! మీ డిపార్టుమెంట్ హెడ్‌కి ఫోన్ డయల్ చెయ్యి: మాట్లాడదాం... ఇంతకీ ఈ ట్రాన్స్‌ఫర్ ఆపుచెయ్యమని వ్యక్తిగతంగా నువ్వు దరఖాస్తు పెట్టేవా, లేకపోతే వాళ్ళని నీ వేనిటీతో సర్‌ప్రైజ్ చేద్దామను కుంటున్నావా?"

"పెట్టేనండి, పిటిషన్."

"సరే డయల్ చెయ్యి, నెంబరు— సాయంత్రం లోపుగా హనుమంతరావు గార్ని కలు."

ఆ సాయంత్రం వ్యాసమూర్తి బాధ భరించలేక దక్షిణామూర్తి దగ్గిర కెళ్ళాడు.

"ఎక్కడో పట్టి కొట్టుంటుంది: నిన్ననో మొన్నోను! ఆ అక్కసు కాస్తా నీ మీద తీర్చుకొంది, అంతే! కంగారుపడకు. చనువు తీసుకుందన్నమాట. లేకపోతే చీవాట్లెలో వేస్తుంది...?"

వ్యాసమూర్తి కొక్క ముక్క కూడా బోధపడలేదు.

"పట్టీ కొట్టడం వేంటండీ?"

"అలాకూ్కడా ఆపుతూ ఉంటుందోయ్‌. అప్పుడప్పుడూ!... ఏముంది, ఆ క్లబ్బులంటపోవడం. మగాళ్ళతో సమంగా కార్డ్సూ, డ్రింకూ్స వ్యవహారం! ఎవణ్ణో ఒహాణ్ణి వెర్రెత్తించి వేలిచుట్టూ తిప్పుకోవడం, వాడు గేటు దాకా వొచ్చి బెదిరిపోయి క్షమించమ్మా అనడం. లేకపోతే యేమిటి? ఈవిడ కిప్పుడు ముప్ఫయ్యేడో ముప్ఫయ్యెనిమిదో ఉంటాయా, వద్దెనిమిదేళ్ళదాన్లా ముస్తాబు చేసుకుని ముద్దులు కురుస్తుంది. అవి చూస్తే కొందరికి కడుపులోంచీ వికారం పుట్టుకొచ్చిందంటే, ఆశ్చర్యం ఏముంది?—"

"ఏమిటన్నారూ?—ఆవిడకి ముప్ఫయ్యేడేళ్ళా?— ఇరవయ్యారో ఇరవయ్యేడో ఉంటాయనుకుంటున్నాను."

"అనుకో, అనుకో! నీ కలా అనిపించడమే మంచిది! గుడ్‌లక్!!"

ం ం ం

వరల్డ్‌బైనైట్ సినిమా ఒచ్చింది టివోలీలోకి. అక్కడ ఆవిడ కారు ఆగివుంది, ఆవిడ కనిపించలేదు.. ఫస్ట్‌క్లాస్ క్యూలో నిలబడ్డాడు వ్యాసమూర్తి... కాళ్ళు క్యూలో ముందుకి ఒక్క వేపుమాత్రం కదులుతున్నా, కళ్ళు ఆవిడకోసం నాలుగువేపులా వెతుకుతూనే ఉన్నాయి... మనస్సు ఆవిడ గురించి పరిపరివిధాల ఆలోచిస్తూనే ఉంది... సినిమాకొచ్చిందా? కూడా ఎవరొచ్చారో!....ఎవడో, ఆ అదృష్టవంతుడు, చూడాలి! దక్షిణామూర్తి చెప్పినట్టు దురదృష్టవంతుడేమో, ఒకవేళ! ఏ టిక్కట్టో! రిజర్వుడు క్లాస్‌కి ఎడ్వాన్సుబుకింగు, బహుశా ఫోన్‌లోనే చేసేసుంటారు... వాళ్ళ పక్కనో, వెనకనో సీటు సంపాదించి కూర్చోగలిగితే కొంత బోధపడుతుందేమో... డబ్బులు చాలేటట్టు లేవు... "వన్ టికెట్ ప్లీజ్..." ఆ కొద్ది క్షణాలూ కౌంటర్లో తలా, కళ్ళూ పెట్టి యివతలపడి ఇటు చూసేసరికి, ఆడుగో ఆవిడ, ఇదిగో ఆవిడ లోకసమ్మోహనకరంగా వొదిలిన పైటచెంగు!...

"నమస్కారమండి—"

"నమస్కారం!— — సినీమా కొచ్చేవా?"

"అవునండి—" తన చేతులో టిక్కెట్టు తన క్లాసేమిటో మొహమాటపడుతూ చెప్పేసిన తర్వాత జేబులో పెట్టుకున్నాడు. "ఒక్కరే వొచ్చినట్టున్నారే—?"

"అవును...." కరుణాదేవి విలాసంగా నవ్వింది, "....ఒక్కర్తైనే రావడం చాలా ఏళ్ళ తరవాత మొదటిసారి....జడ్జిగారమ్మాయి....తార, ఒస్తానంది....పావు గంటనించి వెయిట్ చేస్తున్నాను....ఇప్పుడే ఫోన్ చేసేను....ఇంటి దగ్గిర మధ్యాన్నం మూడింటికే బయల్దేరిందట, కారు తీసుకుని....ఏ ఫ్రెండ్స్ యిళ్ళలో తిరుగుతుందో....?"

"వస్తారనుకుంటానండి....కార్లో కదా! ఏ క్షణం వచ్చినా రావచ్చు!"

"అఫ్‌కోర్స్....అయినా ఓ అరగంటకంటే ఎక్కువ చూడదల్చుకోలేదు...."

చూసి వెళ్ళిపోతుందనుకున్నాడు వ్యాసమూర్తి....కాని ఆట మొదలెట్టిన యిరవై నిమిషాలకి గేట్ దగ్గిరుండే అతను— "ఎనీవన్ బై నేమ్ వ్యాసమూర్తీ—?" అంటూ వెతుక్కుంటూ తన దగ్గరకొచ్చి "ఎక్స్‌క్యూజ్‌మిసార్....మేడమ్ వాంట్స్‌యు...." అన్నాడు.

అవిడతో వెనక సీట్లో కూర్చునిక్కారులో వెళ్ళడంకోసం, తన రూమ్ దగ్గర డ్రాప్ చేయించుకోడం కోసం, తను తెచ్చిన సైకిల్ టివోలీ కాంపౌండ్ లోనే వొదిలిపెట్టి, పొద్దుటే రూపాయిన్నర అదనంగా చెల్లించి తెచ్చుకోడం కూడా, అన్నింటితోబాటు మరిచిపోడం కష్టం....

0 0 0

"ఎంతవరకూ ఒచ్చింది?" అంటూ దక్షిణామూర్తి రూమ్ కొచ్చేడు.

వ్యాసమూర్తి నవ్వేసి ఊరుకున్నాడు, ఎంత అడిగినా ఏం లేదన్నాడు.

"పోనీ, అంతవరకూ ఒచ్చింది గద!—ఇలాంటి విషయాల్లో నవ్వేసి ఏం లేదనడం సాధారణంగా ఎప్పుడు జరుగుతుందో నాకు తెలుసులేవోయ్."

దేవాంతకుడు....

"—రిలయబుల్ సర్కిల్స్‌లో రూమర్ ఒకటి బైలుదేరింది విన్నావా? —రాజారావుగారు ఫారిన్ వెళ్ళిపోతూ—అట్నుంచొచ్చే వేళకి డైవోర్స్‌కి సిద్ధంగా ఉండమని చెప్పి వెళ్ళేరుటోయ్, మీ దేవిగార్ని! లక్షకాదు, రెండైనా సరే, యిచ్చేసి సెటిల్ చెయ్యమని లాయర్ ముకుందంగారికి ఇన్‌స్ట్రక్షన్స్ యిచ్చేరుట....దేవిగారు బార్ మెంబర్సులో వో జూనియర్‌నో, లేక నీ లాగ లైఫ్‌లో కొత్తగా అడుగు పెడుతున్న బ్లూమింగ్ అండ్ బ్యూటిఫుల్ గాణ్ణో సెలక్టు చేసుకుంటుందని - రూమర్....మరి నీ ఛాన్సెస్ ఎంతవరకో!"

'..........'

"కాని ఒక్కటి మాత్రం జ్ఞాపకం పెట్టుకో. సర్వీస్ కమిషన్ పరీక్ష వ్రాసినట్టు కాదు. అక్కడ ఈవిడ రికమండేషన్ పనిచేసింది గాని ఇక్కడ ఎవడి రికమండేషనూ పనిచెయ్యదు...."

దక్షిణామూర్తి అలా వెళ్ళగానే మధురోహల్లో మజ్జనా లాడసాగాడు. వ్యాసమూర్తి—థియేటర్ పుస్తకం అలవోకగా తెరిచేడు. అది అతని అభిమాన పుస్తకం అయికూర్చుంది— సోమర్ సెట్ మాం ఆ పుస్తకాన్ని ముందుగానే వ్రాసేసినందుకు అతనికి మెత్తటికోపం ఒస్తూవుంటుంది—కొన్ని ప్రకరణాలంటే దక్షిణామూర్తిమాటలకంటే యిష్టం—నడివయస్సు దాటిన మహిళ,బాధ్యతలుతెలిసిన భామ—బొత్తిగా కొత్తవా డొకడు తారసపడి, మాసినగడ్డంతో మండమీంచి బుజమ్మీద వరకూ పెట్టిన కితకితలకి సమాధానం చెప్పలేక పోయింది. గౌరవనీయులూ, పెద్దలూ అయివుండి దాదాపు చిన్నతనంనుంచీ తనని ఆరాధిస్తూ వాంఛిస్తే, ఆయనకి చివరికి ఆరాధనే మిగిల్చింది. తనకింద పనిచేసేవాడు, డబ్బులోగాని. పలుకుబడిలో గాని, ఆఖరికి తానాడే నాటకాలు బోధపర్చుకోడంలోగాని—ఎందునా తనికి ఈడుగాని వాణ్ణిపట్టేసి, సాక్షాత్తూ పునర్యౌవనం పొందింది—లోకం అంతా వొక నాటకరంగం, కాకపోతే వొక నర్తనశాల— దేనికీ టైమ్‌రావాలని రాదు;ఉండాలని ఉండదు. సమయం చూచుకునీ, సమయం కనిపెట్టి, సమయం మించిపోకముందు అన్ని పన్లూ పూర్తిచేసుకోవాలి—

ఈ విధంగా తక్కువ మగవాణ్ణి యెంచుకోడం చరిత్ర ప్రసిద్ధంలాగే ఉంది—కారు డ్రైవర్లూ, తమతగాళ్ళూ, ఎకౌంటు గుమస్తాలూ కథానాయకులు కావటం అప్పుడప్పుడు అవుతూనే ఉంది—ఇందులో ఏదో ఉంది:లేకపోతే చరిత్ర చర్విత చర్వణం చేసి ఈ సత్యాన్ని పునః పునఃప్రతిష్ఠ చెయ్యడం జరగదు—

తను ఆవిడకంటె తక్కువవాడు కావడం—తన అనర్హత ఎలాగో, అర్హత అలాగే నేమో— ఈ అర్హతానర్హతల మధ్య ఆడంబరాల ఆవేదనల మధ్య, తను ఎలా ఉత్తీర్ణుడు కావడం?

# 4

ఏదెలా వున్నా దక్షిణామూర్తిగారు చెప్పింది నిజం — అనుకున్నాడు వ్యాసమూర్తి—ఈవిడ కెప్పుడూ ఒక మగవాడు పక్కన ఉండాలి—

అదృష్ట దేవతగానీ, దురదృష్ట దేవతేగానీ — ప్రేమ దేవత మాత్రం అవును....

మనుషుల్లో ఈ భావం ఎందుకు పుడుతుంది? దీనికి కారణం ఏమిటి; పరిధులెంతవరకు? తెలుసుకోడం వరకేగాని ఆచరణీయమైన నిర్ణయాలు చేసుకోడం కష్టం— ఏ వాగొస్తే దాంట్లో కొట్టుకుపోడం మనిషి లక్షణం— అంతకంటే మించితే మానవాతీతం, మొదట మానవులు; తరవాత, ఓపిక, తీరిక ఉంటే మానవాతీతులు—

పరిస్థితులూ, అవకాశాలూ కూడి రాకపోతే ఎలాగైనా కాలక్షేపం చేసెయ్యొచ్చును—అవకాశం అంటే అదొక పరీక్ష సమయమే—వినియోగించుకోవడమా; వ్యర్థం చేసుకోవడమా?

ఆవిడ తననిలా ఎందుకు ఆహ్వానించిందో? ఇది నిజంగా కాకతాళీయమా? అంతానా?

తను ఏంచేస్తే మంచిదో; ఏం చెయ్యకపోతే మంచిదిగాదో-?

* * *

ఇప్పుడావిడ ఏం చేస్తూందో!—

కనిపెట్టడం పెద్ద కష్టం గాదు. బాత్‌రూమ్‌కేసి వెళితే వరండా పక్కన ఆవిడ గదికొక పెద్ద-గాజు పలకల కిటికి ఉంది. ఆ కిటికీలోంచి సరిగ్గా మూసెయ్యని స్క్రీన్‌లోంచి, తిన్నగా ఆవిడ మంచం కనిపిస్తుంది.

ఆవిడ నిద్రపోడంలేదు.... పుస్తకం ఏదో కిందపడేసిన చప్పుడూ టీపాయ్ ఈడిస్తె అయ్యే బరబరా;చప్పుళ్ళు వినిపిస్తూనే ఉన్నాయి;అప్పుడప్పుడు—

ఆవిడ వుద్దేశమేమిటో—సుడిగాలికంటే విచ్చలవిడైన ఆవిడ చరిత్ర... ప్రేమికుల గురించి ఆవిడ ఉద్దేశాలు—కమ్ సెప్టెంబర్ దృశ్యాల సమక్షంలో ఆవిడ హర్షం. తన రూమ్‌లో ద్వయంపట్ల ఆవిడ సానుభూతి; టేంక్‌బండ్ మీద కనుపించిన జంటని గమనించినప్పటి ఆ మెచర్య—ఇవి తనకి ప్రోత్సాహాన్నివ్వడానికేనా? చాలా యివి? వీటితో తను ముందుకు వెళ్ళవచ్చా?—ఇంతకంటే వివరంగా ఇంత సంస్కారం ఉన్నవారు చెప్పరేమో!—

ఏమో—తొందర పడకూడదు—దక్షిణామూర్తి చెప్పినట్లు తొందర పడితే వ్యవహారం బెడిసికొడుతుందేమో—

దక్షిణామూర్తి సిగ్గోసిరి.., తొందరపడకపోతే...ఆవిడ అంతకన్నా తొందరపడదు....ఎవరూ తొందరపడకుండా కూచుంటే. అవకాశాలు మళ్ళీ వొస్తాయా? ... ఎలాగో వెతుక్కుని అవకాశం సృష్టించొచ్చుగాని — అవి వెలితిగా కృతకంగా ఉంటాయేమో...

ఇంక అట్టే టైమ్‌లేదు...

0 0 0

హాల్లో గడియారం ఒక గంట కొట్టింది. ఒంటి గంటా? అనుకుంటూ వాచి చూసుకున్నాడు వ్యాసమూర్తి. ఒకటిన్నర ... వ్యాసమూర్తి లేచాడు. లేచాడుగాని అతను నడవలేదు. అక్కడే నించున్నాడు; ధైర్యం చెయ్యలేక.

ఏం చేద్దామని? అని మనస్సు నిలవదీసి అడుగుతోంది ... ఏమో ... తెలియదని దబాయించి దాటేశాడు. ప్రశ్నని....అలాగే నిస్సత్తువ సహాయంతో నిర్ణయం వొకటి తీసుకొని ద్వారం వరకూ వెళ్ళి తలుపు తెరిచాడు.

ఎదురుగా కరుణాదేవి గది—తలుపు పూర్తిగా మూసిలేదు. రెండు తలుపుల మధ్య సన్నని సందు మిగిలిపోయి అందులోంచి వెల్తురు ఏటవాలుగా ఎటో వెళ్తోంది—ఆవిడ తలుపు తీసుంచడానికి కారణమేమిటో—అని ధైర్యం చెప్పుకున్నాడు వ్యాసమూర్తి.

సరిగ్గా అదే సమయానికి కరుణాదేవి గది తలుపులు తెరుచుకున్నాయి. తెల్లని చీర కట్టుకున్న కరుణాదేవి ఒక్క నిమిషం ద్వారాని కడ్డంగా నిల్చుంది.

"నే ననుకున్నది నిజం—" అనుకున్నాడు వ్యాసమూర్తి.

చీకటి పల్చగా, మెత్తగా, అందంగా వుంది—

వ్యాసమూర్తి ఒక్కడుగు ముందుకు వేసిఆవిడవేపు చూశాడు.

కరుణాదేవి ఠక్కున హాల్లో నాలుగు దీపాల స్విచ్ వేసింది. హాలంతా వెల్తురుమయమైంది—హఠాత్తుగా వొచ్చిన వెల్తుర్లో ఆమె మొహం చూడ్డానికి వ్యాసమూర్తి ధైర్యం చెయ్యలేదు, వెల్తురు చూడలేక కళ్ళూ, ఆవిణ్ని చూడలేక మనసూ, మిలమిల్లాడేయి. ఆ భయంలో, ఆ కంగారులో "నేను నేను—" అనకుండా నిలదొక్కుకున్నందుకు ఆనందించ వలసొచ్చింది.

చిరునవ్వుతో కరుణాదేవి పలకరించింది "నీకూ నిద్రపట్టలేదా?"

'లేదండీ' అన్న మాట కూడా నోటంట పెగల్లేదు, వ్యాసమూర్తికి.

"నీకు శ్రమ యిస్తున్నందు కేమీ అనుకోకపోతే-నాకో చిన్న ఉపకారం చేసిపెట్టాలి—"

"ఓ! తప్పకుండా!"

"—క్రిందని, బోట్ హౌస్‌లో డ్రైవరు పడుకొని నిద్రపోతూవుంటాడు వరండాలో బజ్ నొక్కితే అతను లేచొస్తాడు. కారు తీసుకుని సిటీలోకి వెళ్ళి, నాకో బ్రాందీ బాటిల్ తెచ్చిపెట్టాలి—మేము ఎప్పుడూ తెచ్చుకునే బార్ వాళ్ళకి చీటీ రాసిస్తాను, ఓ అరడజను స్లీపింగ్ టాబ్స్‌కూడా యిస్తాడు. తెచ్చిపెట్టు—లేకపోతే ఇవాళ ఇహ నిద్రపట్టేటట్టులేదు. ఈ అర్ధరాత్రివూట ఆ డ్రైవర్ని లెమ్మంటే ఏడుస్తాడుగాని చేసేదేం లేదు—ఇంత నీరసంలో నేను డ్రైవ్ చెయ్యలేను—"

"డ్రైవర్ విసుక్కుంటే నేను డ్రైవ్‌చేసుకు వెళ్తానండి—నాకేం నీరసం లేదు, నిద్రమత్తూ లేదు" అన్నాడు వ్యాసమూర్తి.

"వండర్‌ఫుల్, నీకు డ్రైవింగ్‌కూడా వచ్చా? చెప్పేవేకాదు. అలాంటప్పుడు ఆ డ్రైవర్ని లేపడం, వాడు విసుక్కోడం, సరేలే అంటూనువ్వెళ్ళడం అనోటెందుకు—? తిన్నగా షెడ్లో కారు తీసుకుని నువ్వే వెళ్ళొస్తె బావుంటుంది."

"నా ఉద్దేశం కూడా అదేనండి."

రెండు నిమిషాల్లో ఒక చీటీ, కారు తాళాలూ తెచ్చి యిచ్చింది కరుణాదేవి "—ఈ బార్ తెలుసా?" అంది,

"తెలుసు."

*　　　*　　　*

ఉదయం ఎనిమిదిన్నరైంది.

వ్యాసమూర్తి, దక్షిణామూర్తిదగ్గిర కెళదామని డ్రెస్ చేసుకున్నాడు, రూమ్‌కు తాళం పెట్టాడు.

క్రింద కారాగిన చప్పుడైంది.

చకచకా మేడమెట్లు దిగి వొచ్చేశాడు వ్యాసమూర్తి.

కారు హనుమంతరావుగారిది. డ్రైవరు నమస్కారంచేసి చీటీ ఇచ్చాడు.

"గొప్ప ప్రమాదం జరిగింది. ఉన్నపళంగా బైలుదేరిరా—హనుమంతరావు."

"ఏమైంది?"

"తెలీదుబాబూ."

కారెక్కాడు వ్యాసమూర్తి. "పద"

ం　　　ం　　　ం

పోర్టికోలో కారాగింది—హనుమంతరావుగారక్కడే సిద్ధంగాఉన్నాడు.

"పంతులూ నువ్వు దిగిపో—"

"చిత్తం."

"ఫ్రంట్ సీట్లోకి రా, మూర్తీ!" అని హనుమంతరావుగారు కారెక్కి స్టార్టుచేశాడు.

—కారు కాంపౌండ్ దాటి వెళ్తోంది.

"రాత్రేమైంది మూర్తీ?"

వ్యాసమూర్తికి షాక్ తగిలినట్లయింది, తెల్లమొహం వేశాడు. కరుణాదేవి ఇంటిదగ్గిర ఏమైందని అడుగుతున్నారని తెలిసింది.

"టైమ్ వేస్టుచెయ్యకు—ఫరవాలేదు, చెప్పు."

"సాయంత్రం ఆవిడ మా ఆఫీస్ కొచ్చేశారండి. ఇద్దరం కలిసి సికింద్రాబాద్ వెళ్ళి ఆ ఫర్నిచర్ కంపెనీ ఆయన్తో మాట్లాదామండి, లేటైపోయిందండి. తాజ్‌లో భోంచేసి రెండోఆటకి ఇంగ్లీష్ పిక్చరుకు వెడదాం అన్నారండి—సినిమా నుంచొచ్చి బంగళాలో గెస్టురూమ్‌లో పడుకున్నానండి. పొద్దుటే ఒచ్చేశానండి—" అని వ్యాసమూర్తి ఆయనవేపు చూశాడు.

ఆయన నమ్మలేదు, వ్యాసమూర్తి కళ్ళలోకి లోతుగా చూస్తూ "—నిన్ను అర్ధరాత్రప్పుడు ఊళ్ళోకి పంపిందటగా!" అన్నాడు.

"—అవునండి—రాత్రి ఒంటి గంటన్నరకి—బాత్రూమ్ కేసి వెడదామని లేచానండి—'నిద్దర పట్టట్లేదు. ఒక బ్రాందీ బాటిలూ అరడజను స్లీపింగ్ టాబ్లెట్సూ తెచ్చిపెట్టమని—బార్ మేనేజర్‌కి లెటర్ రాసిచ్చారండీ. కారు తీసుకునీ వెళ్ళొచ్చానండి—' ఇక్కడ పెట్టిపో, నేను స్లీపింగ్ డోస్ వేసుకుంటాను, లేచేసరికి లేటవుతుంది: నువ్వు లేవగానే రాజ్యలక్ష్మి నడిగి కాఫీ తీసుకుని, డ్రైవర్ని కారులో నీ రూమ్ దగ్గిర డ్రాప్ చెయ్యమను—' అనేసి తలుపేసుకున్నారండి—"

"అంతేనా?"

"అంతేనండి"

హనుమంతరావుగారు వ్యాసమూర్తిని మరొకసారి తీక్షణంగా చూశాడు. వెంటనే చూపు రోడ్డుమీదికి మళ్ళించేడు. స్టీరింగ్‌వీల్ మీద ఏదో పాటకితాళం వేసినట్లు వేళ్ళతో కొట్టసాగాడు.

"ఏమైందండీ? ఏదో ప్రమాదమని వ్రాసేరు!—" అన్నాడు వ్యాసమూర్తి.

హనుమంతరావుగారు అతని కళ్ళల్లోకి కటువుగా చూసేడు—మళ్ళీ

చూపు తిప్పేసుకుని ఐదు సెకండ్లు నిశ్శబ్దంగా ఊరుకున్నాడు. "కరుణాదేవి చచ్చిపోయిందోయ్."

"ఆ!—" వ్యాసమూర్తి కంగారుపడి సీట్లో సగానికి లేచాడు.

"—నా ఉద్దేశ్యం ఏమిటంటే—నువ్వు జరిగిందంతా చెప్పావా?"

వ్యాసమూర్తి వొణికిపోతున్నాడు. "అవునండీ—అంతా—చెప్పానండి"

"భయపడిపోకు—భయపడి అబద్ధం చెప్పడంకన్నా ధైర్యంగా నిజం చెప్పడం మంచిది—"

"న్నె.... న్నే.... నిజమే చెప్పేనండీ,"

"అయితే ధైర్యంగా ఉండు....ఆవిడెవరు, నువ్వెవరు, నేనెవరు!....కాని, నువ్వూ నేనూ కలిసి ఆవిణ్ని హత్య చేశామేమో అని—కనీసం నేను, ఆవిణ్ని చావకుండా ఆపేవాణ్ణనుకుంటాను—రాత్రి రెండు గంటలప్పుడు ఫోన్ చేసిందోయ్ 'గొప్ప ఆపదలో వున్నాను: రక్షించండి—' అంది,

"ఏవో హిస్టిరిక్ షాక్స్ తగుల్తూనే ఉంటాయి ఆవిడకి.—కొన్ని వందల మంది ఫ్రెండ్సు: కొన్నివేల యిన్సిడెంట్సు—అన్నీ దాదాపు ఎడ్వెంచర్సే. ఏది జ్ఞాపకంవొచ్చి బాధపడుతోందో, వొంటరిగా ఉంది! అనుకున్నాను.

"చెప్పు— అన్నాను.

"రక్షించండి! వెంటనే రండి—అంది.

"దొంగలా, దొరలా— అన్నాను.

"ఎవరూకాదు.... ఓ చిన్న అబ్బాయి.... నన్ను ప్రేమిస్తున్నానంటాడు. నాకు చాలా నీరసంగా ఉంది. అతన్ని ఊళ్ళోకి పంపేను. అతను తిరిగి రాక ముందు మీరురావాలి.లేకపోతే యేం జరుగుతుందోచెప్పలేను"—అంది,

"ఏమయినా బలప్రయోగం చేస్తున్నారా?"—అన్నాను.

'ఛీఛీ, వాడి మొహం!— ఇంకా ప్రారంభంలో ఉన్నాడు....అసలు ఇవాళే మొదలు, వాడి బుర్ర యిది ఆలోచించడం, అనుకుంటాను.ప్రస్తుతానికి అరడజను పేజీల ప్రేమలేఖ రాశాడు. ఆఫ్‌కోర్స్— అతనివ్వకుండానే ఆ బహుమతి స్వీకరించాను' అని పక పకా నవ్వింది. 'మీరు వెంటనే బయలుదేరి వొచ్చెయ్యండి!—' అంది

వాడెవడు?—అని నే నడగలేదు. అలా అడగడం మర్యాద కాదు. ఆవిడ చెప్పనూలేదు.

"సరే, నీరసంగా ఉందంటున్నావు గనక, ఇంట్లో బ్రాందీ ఉంటే కొట్టెయ్యి. బలప్రయోగం లేదంటున్నావు గనక, తలుపులు బిడాయించుకు హాయిగా నిద్రపో పొద్దుటే, ఒస్తాను: అబ్బాయిని మాత్రం వీలైతే దాచిపెట్టు: చూడాలనుంది'—అన్నాను,

'తరవాతేమైంది,మూర్తీ?—ఆ అబ్బాయి, నువ్వేగా!'

వ్యాసమూర్తి పెదవులు వొణికాయి'....నె...న్నే-నే—నండి....కాని నే నబద్ధాలాళ్ళేదండి....నేను సిటీలోంచొచ్చాక ఆవిడ నామొహంవైనాచూళ్ళేదండి, బాటిలూ పిల్చూ అందివ్వబోతే అందుకోలేదండి అక్కడ పెట్టిపో—అన్నా రండి. నా వెనకే తలుపు గడియేసుకొన్నారండి' అతని కళ్ళలో నీళ్ళు తిరి గాయి. ఉద్యోగంకోసం ఆవిడ సాయం ఆపేక్షించడం, ఆవిడిచ్చిన మర్యాదా, దక్షిణామూర్తి వ్యాఖ్యానాలూ, తన చర్యలూ, ఆలోచనలు, తన మూలంగా ఆవిడ మానసిక ఆందోళన పొందడం, మరణించడం—అన్నీ తెలిసిపోతూ, మిశ్రితభావాలు అందజేస్తూ అతణ్ణి కలచివేశాయి.పశ్చాత్తాపానిక్కూడా వ్యవధీ అర్హతా లేనట్టయి పోయాడు. భయంలో కొట్టుకుంటున్నాడు.

మరి కొంత పేపు హనుమంతరావుగారు నిశ్శబ్దంగా ఉండిపోతే వ్యాస మూర్తి తన భయాన్ని దాచటానికి ప్రయత్నిస్తూ సంభాషణ మొదలు పెట్టి ప్రతీ అక్షరంతోనూ వ్యక్తం చేసేవాడే, కాని 'కరుణావిల్లా' దగ్గర పడగానే ఆయన '.... ఆ వుత్తరం ఏదో-నీ దగ్గరుందా?' అన్నాడు.

'లేదండి. అట్నుంచొచ్చేక నే నెంత వెతికినా కనిపించలేదండి.'

హనుమంతరావుగారు వ్యాసమూర్తి వేపు చూశాడు. 'కళ్ళు తుడుచుకో' అన్నాడు.

కారు కరుణావిల్లా ఆవరణలో ప్రవేశించింది.

ం ం ం ం

హనుమంతరావుగారు దిగగానే అక్కడ కూర్చున్న రాజ్యలక్ష్మి, కారు డ్రైవరూ లేచి నమస్కారాలు పెట్టారు. డ్రైవర్ని చేత్తో పిల్చి, "కారు తీసుకు వెళ్లి, అమ్మగార్ని పెద్దమ్మాయిగార్ని తీసుకురా!....పోలీసులకి ఫోన్ చేశావా?' అన్నాడు హనుమంతరావుగారు.

'లేదండీ—తమరొచ్చేక—'

'దట్స్ రైట్. పోనీలే: నేను చేస్తాను—నువ్వు తొందరగా వెళ్ళు—రాజ్య లక్ష్మి పద'

రాజ్యలక్ష్మి, వ్యాసమూర్తి ఆయనవెంట కరుణాదేవి గదివేపు వెళ్ళారు.

మంచంమీద, దన్లపిల్లో మీద, సౌందర్యం, స్వేచ్ఛ శాశ్వత నిద్రపోతు. న్నాయి.... వ్యాసమూర్తి హనుమంతరావుగారివే పొకసారిచూసి, ఆయనంత న్యూట్రల్‌గా ఎలా చూస్తున్నాడా అని ఆశ్చర్యపోతూ. ఇంత త్వరగా అంత చలాకీ అయిన మనిషి జ్ఞాపకాల పోగుగా మిగిలిపోయి జ్యోతి ఆరిపోయినం దుకు భయపడిపోయి, దుఃఖాన్ని తుడుచుకుంటున్నాడు.

o o o o

మూడు ఉత్తరాలు దొరికాయి. తలగడ క్రింద.

ఒకటి రాజారావు గారికి, సీల్డుకవరు, పెద్దది: బరువైంది.

రెండోది హనుమంతరావు గారికి, అంటించని కవరు.

మూడోది పోలీస్ కమీషనరుకు. కాగితం మడత.

హనుమంతరావుగారు ముందుగా కవరులేని కాగితం మడత విప్పి చదివే శాడు. కేవలం ఆత్మహత్యేననీ, కారణాలు చాలా ఆధ్యాత్మికమైనవనీ ఎవరికీ ఎలాంటి సంబంధంలేదనీ, సమ్మతిపూర్వకంగా స్పష్టంచేసినట్లు వ్రాసింది. అది చూచి తేలికపడి నిట్టూర్పు నిడిచాడు.

* * *

హనుమంతరావుగారూ,

ఆఖరు నమస్కారం.

రాజారావుగారు అమెరికా వెళుతూ, కొడుకులు తన నంత దూరానికి రప్పించుకుంటున్నందుకు నొచ్చుకుంటూ, తన ఆపేక్ష అనే బలహీనతకీ, నా అసమర్ధతకీ సిగ్గుపడుతూ మనకోసం, ఈ దేశంలో వుండి పోగలిగిన కొడుకు నొకణ్ణి నే తిరిగొచ్చే వేళకి చూడమంటే— తల్లీ తండ్రీలేని వాణ్ని, బుద్ధీ జ్ఞానం ఉన్నవాణ్ని, ఉగ్గూపాలూ అక్కర్లేనివాణ్ని, అండా దండా కావల్సిన వాణ్ణి—చూశాననీ, ఆయన చూస్తె తప్పకుండా మెచ్చుకుంటారనీ తెచ్చుకుంటా రనీ, వారికి తెలియచేశాను.

వాడు నా కొడుకే. లేకపోతే నాకు వాడిమీద పుత్రప్రేమ ఎందుకక్కలుగు తుంది?

నా దృష్టి ఎప్పుడూ దెబ్బతినదు.... వాడు నిశ్చయంగా నా కొడుకే. ఇరవై రెండేళ్ళనాడు, పిఠాపురంలోని ఒక ధనవంతుడు నన్ను వైజాగ్‌లో కాలేజీలో చేర్చి, నా యోగక్షేమాలూ, సుఖ సౌఖ్యాలూ స్వయంగా వచ్చి విచారిస్తూ వుండిన రోజుల్లో, ఏదో నర్సింగ్ హోమ్‌లో నా బిడ్డగా జన్మించికూడా, నాకు గాని వారికిగాని ఆ బిడ్డను పెంచే సాహసం, అదృష్టం లేక: అయిదువేల రూపాయలతో తల్లి దండ్రుల్ని కొనుక్కున్న నెలతక్కువ బిడ్డ.... ఎప్పటికేనా తెలుసుకుంటాననీ,మళ్ళీ చూస్తాననీ ఆశించలేదు. పుట్టుమచ్చలూ వొంకర్లూ ఏమీ గుర్తులేవు....అయినా మాత్రం నా దృష్టి దెబ్బతినదు........ పేరు పెట్టిన వారెవరో, పాలు పోసిన వారెవరో.

పోతపాలతో, ఎర్రువు భావాల్తో పెరిగాడు గనకే, ఇలా బెడిసికొట్టింది. అమ్మెవరో, అతనెవరో తెలుసుకోలేకపోయిన మూర్ఖుడు.

జీవితాన్ని తిరగరాని వంపులుతిప్పి, అన్న. తమ్ముడు, తండ్రి,కొడుకు, ఇలాంటి బంధువులు లేకుండా చేసేసుకున్నాడు. నన్ను చూస్తే అందరికీ వొక్క లాంటి భావం కలిగితే అది నా తప్పుగాక, వారందరిదీనా?....నా తప్పులన్నీ వొక రూపంపొంది; నా జీవితంలో ఉన్న పొరపాటును ఎత్తి చూపించడానికి నా కొడుకును వినియోగించడం సిగ్గు పడవలసిన విషయం....నాకు ప్రేమలేఖ వ్రాసిన అతన్ని మందలించడానికిగాని, ఇలాంటి కుమారుణ్ని రాజారావుగారికి స్వీకరించ మనడానికీ—అన్నిటికీ మించి మొట్టమొదటే నా భావం నా కుమారుడికి తెలియజేయక పోయినందుకు సిగ్గు పడ్డానికిగాని నా కోపికలేదు. ఈ సమయంలో, నే నుంటే. పరిస్థితులో మనుష్యులో నా కనేక కర్తవ్యాలు నిర్దేశించడం జరుగుతుంది. నాకు తోచిన మార్గాన నేను పోవడానికి ఇదే అవకాశం.

సెలవు.

కరుణ.

తా, క— ఈ ఉత్తరంలో ఒక సీల్డు కవరూ, పోలీసులకొక ఉత్తరమూ ఉన్నాయి, ఎవరిది వారి కందజేసే బాధ్యత మీ కొప్పగిస్తున్నాను, వారి ఉత్తరంతప్ప మిగతాదేదీ పోలీసులకిచ్చి నా కొడుకు బ్రతుకు పాడుచెయ్యవద్దని నా కడసారి ప్రార్థన.

0)0(0

("జ్యోతి" మాసపత్రిక, జూలై 1963)

# అద్దం అబద్ధమాడింది

సీతాపతి మేడెక్కుతూ మెట్లు వంకర తిరిగినచోట ఆగాడు. అక్కడ నుంచి అతనికి కనపడ్డ దృశ్యం అతన్ని అడుగు ముందుకి వెయ్యనివ్వలేదు.

వెంటనే మొహం తిప్పుకున్నాడు, సీతాపతి కిందికి దిగి పోదామన్నట్టుగా మనిషి తిరిగాడు.

రవణమ్మా, అప్పారావూ ముందు విడిపడ్డారు. ఒకరి చేతుల్లోంచి వొకరు. తర్వాత ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. నవ్వుతుందామని, ఇద్దరికీ అనిపించింది. కాని ఒకరూ నవ్వలేకపోయారు. ఒక్క క్షణం ఇద్దరికీ ఏమీ తోచక బెరుగ్గా చూసుకున్నారు. మాట రాలేదు, ఎవరికీను.

ఆఖరికి రమణమ్మే ముందు మాట్లాడింది.

'ఏం కావాలి నాన్నా? రా!—' అంటూ చకచకా తండ్రి నుంచున్నవేపు వెళ్ళింది.

'ఏం లేదులే అమ్మా'—అని అప్పటికప్పుడే ఐదారు మెట్లు దిగి పోయాడు సీతాపతి.

సీతాపతి వెళ్ళడం గమనించిన అప్పారావు మెట్ల చివరదాకా వొచ్చేసి 'వెళ్ళి కనుక్కో. ఏం కావాలో పాపం!" అన్నాడు.

'అబ్బా, నే వెళ్ళను' అంది రమణమ్మ సిగ్గుతో.

'ఏడిసినట్టుంది తెలివి. ఏమిటాసిగ్గు;-ఇంతలోనే ఏం కొంప మునిగింది? వెళ్ళు వెళ్ళు—"

'అయినా మీరు మరీనండి—పట్టపగలు ఆరుబైట. ఛీ-' అని సిగ్గుపడింది రమణమ్మ.

అప్పారావు. శృంగారంగా నవ్వాడు, తల గోక్కున్నట్లు నటించి 'ఓహో—పగలుకదూ, మరిచిపోయాను! సరేలే, చీకటిపడ్డాకే వస్తాను' అని చిరునవ్వుతో చకచకా మెట్లుదిగి వెళ్ళాడు.

సీతాపతి మెట్లగది అవతల స్తంభందగ్గిర ఏమీ తోచక నిలబడ్డాడు.

అప్పారావు రావడం, విసురుగా కింది గదిలోకి వెళ్ళి తల దువ్వుకోడం, చొక్కా మార్చుకోడం, చెప్పులు తొడుక్కొని బైటికి వెళ్ళిపోడం, క్రీగంట గమనిస్తూ నించున్నాడు సీతాపతి.

'ఇందులో ఎవరి తప్పు మాత్రం ఏముంది?' అనుకున్నాడు.

లేదు. ఇప్పుడు జరిగిందాల్లో ఎవరి తప్పూ లేదు.

రెండేళ్ళ గుడ్డుని తన చేతుల్లో వొదిలి-అ నాడు నరసమ్మ కన్ను మూసినప్పుడే జరిగిపోయింది తప్పు....

లేని పోని బాధలు ఊహించుకొని, పచ్చని జీవితమూ, వెచ్చని వయసూ వొదిలి, రెండేళ్ళ పాపని అక్కగారు పార్వతమ్మ చేతుల్లో వొదిలి కొత్త బాధలు సృష్టించుకోకుండా, మిలట్రీలో చేరిపోకుండా ఆనాడు సరిదిద్దుకోవలసిన తప్పు అది.

ఇప్పుడనుకుంటే మాత్రం ఏం లాభం?

పన్నెండేళ్ళ సర్వీసు పూర్తి చేసుకొని. సందిటినిండా డబ్బూ ఆర్జించుకొని, తిరిగొచ్చిన వేళకి—

రవణమ్మ గుమ్మటంలా ఎదిగిపోయింది. ప్రభలా అలంకరించుకొని గుమ్మంలోనే ఎదురొస్తె.

చూసీ చూడగానే ఇది వాళ్ళమ్మా, ఇదేనా....అని ఓ లిప్త కంగారు పడ్డాడు.

ఎదిగొచ్చిన అమ్మాయినిచూస్తే కలిగిన ఆనందంతోబాటు ఎదురొచ్చిన సమస్యకూడా స్ఫురించి బెదురూ పడ్డాడు.

అయినా అతనికేం లేదా, పోదా?

ఉన్నఊళ్లో సొంత యిల్లూ, మొగుడు లేకపోబట్టి కాబోలు పదిమంది మొగాళ్ళ పెట్టుగా యిల్లూ పొలమూ దిద్దుకొస్తూ ఏడాదేడాదీ తమ్ముడు పంపిన డబ్బూ పొలంమీది డబ్బూ వడ్డీకే వేస్తూ లోటే లోటుగా వొప్పచెప్పిన విధవక్కగారూ.

వీటన్నిటికీ తోడు ప్రాజ్ఞతతో జాగ్రతతో నిలవచేసి తనతో తెచ్చుకున్న ముల్లె—

చుట్టుపట్ల ఈ రేడు వూళ్ళల్లో ఆ రేడు లోకాల్లో 'సమానంలో యింతకంటే మెరుగులే' దనిపించే సంబంధం తెచ్చి కట్టేడు. కూతురికి ఏడాది గిరున తిరిగేసరికి,

ఎవరో అనడం, ముఖప్రీతి, అనవసరం, సీతాపతే అనుకున్నాడు తన మామగారు నరసమ్మకి చెయ్యని న్యాయం తను రమణమ్మకి చెయ్యగలిగాడని. రమణమ్మా అప్పారావూ ఈడేకాకుండా జోడున్నూ కావడం వాళ్ళిద్దరూ ఒకళ్ళని చూసుకుని ఒకళ్ళు తృప్తిపడిపోడంలో ఆకలీ, వేళా కూడా మరిచిపోవడం చూసుగుని_

'ఏ పిల్లకి ఏ తండ్రి చేశా డిలాగా?' అని గర్వమూ పడ్డాడు సీతాపతి. 'కార్య'మైన తరవాత తొలి సంక్రాంతిది.

'అచ్చటా, ముచ్చటా, అచ్చ టేం జరిగేను—కోడల్ని తీసుకుని తమరే మా యింటికి దయచెయ్యండి. మీ పండగ సంబరం మేమూ పంచుకుంటాం అన్నగారూ!' అని వియ్యపురాలు పొడిస్తే—

"మాకేం లోటు? డబ్బులేదనా, చేసేవాళ్లు లేరనా? ఆ మాట కొస్తె రమణమ్మకి పార్వతమ్మ చేసినట్టు ఏ పిల్లకి ఏ తల్లి చేసిందీ" అనుకొని అక్కసూ పంతమూ పట్టి.

అల్లుణ్ని తీసుకొచ్చాడు....

ఎక్కడా ఏదీ బెడిసికొట్టలేదు.

బెడిసి కొట్టకపోడవేఁ కాదు—శ్వశురగృహం భారవికి కష్టంగా తోచడ మెందుకో అప్పారావు కర్థమవలేదు. జామాతా దశమగ్రహః అన్న నుడిలో ముడి విడనూలేదు సీతాపతికి,ఈ రెణ్నెల్లబట్టీనూ.

ఇప్పుడు ఈ సాయంకాలం ఓ దృష్టితో చూడ్డం అలవాటైన కళ్ళకి ఓ రకం దృశ్యం కనబడేసరికి తప్పొప్పుల ప్రసక్తి వొచ్చేసి జరుగుతున్నదంతా జరిగిందాంతో తూకం పడుతోంది.

ఏది ఒగ్గో ఏది మొగ్గో తెలీడంలేదు.

కూతుర్నీ అల్లుణ్ణీ చూసుకుంటూ గడిపేస్తున్న సీతాపతికి—

'ఈ సుఖం వెనుక వో సమస్య వుం'దనీ, 'ఏ వయస్సుకైనా' ఆ వయసు చెలిమే ఎక్కు అవసర'మనీ.

మబ్బుతెర విడిపోయిన ఎండలాగ,

ఎవరో స్పష్టమైన భాషలో చెప్పేస్తున్నట్టు.

తీక్షణంగా. కష్టంగా తోచసాగింది!

ఎందుకా?

సీతాపతి వయస్సు—అరవై కాదు....యాభై రాలేదు....నలభయ్యో వెళ్ళ లేదు....ముచ్చటగా ముప్ఫయి వెళ్ళి అందంగా ఆరుదాటాయి.

ఆ తరం ప్రారంభంలో—

ఇలాంటి పొంగే కాబోలు అదీను—

లక్షణాలు వేరయినా లక్ష్యం వొకటేగనక రవణమ్మ భూమ్మీద పడే సరికి నరసమ్మకి పదిహేడూ, సీతాపతి కిరవై, పెళ్లై ఏడాదీ!

పట్టుమని పదినిముషాలపాటు ఇరుగు పొరుగు వాళ్ళ పాపల్నయినా ఎత్తుకోడం నేర్చుకోని కుర్రాళ్ళకి—

వాళ్ళకీ వో పాప

ఏడిస్తే ఎత్తుకోడానికీ. ఏడవకపోతే ఎత్తుకోడానికీ ఓ పాప—

వొచ్చేసిందంటే—

ఆశ్చర్యానికి మించి సిగ్గే వేసింది.

ఇప్పుడు మళ్ళీ అలాటి సిగ్గే వేస్తోంది.

అల్లుడు అలా వెళ్ళీ వెళ్ళగానే గాలితెరల్లాంటి ఆలోచల్ని తోసేసు కుంటూ మేడెక్కాడు సీతాపతి.అలమార్లో అలవాటైన పుస్తకాన్నే పరధ్యానంగా వెతుకుతూ వుంటే కేవలం చూడ్డానికొచ్చి అక్కడ నిలబడ్డ రవణమ్మని చూస్తే అలాటి సిగ్గే వేస్తోంది.

ఇంతకు ముందే ఆ పుస్తకం పట్టుకుని ఎటో వెళ్ళివుంటే అల్లుడు పాపం ఈ అందమైన సాయంకాలం ఇంటిదగ్గిర ఈ డాబామీద గడిపేవాడు గదా అనిపించింది. అనాలనిపించింది—సిగ్గుచేత అనలేకపోయాడు.

విసురుగా మెట్లు దిగి వీధివేపు వెళుతూఉంటే—

హాల్లో అద్దం 'హల్లో' అంటూ పలకరించింది.

మొహం చూసుకో అని మోహపరిచింది.

అద్దంలో మొహంచూసి సీతాపతి మొహం ముడుచుకుపోయింది. ఛీ. ఇదేమి టీ మొహం?

ఇలా వుందేమిటి, నలిగిన పట్టుబట్టలాగ, ఎండిన అప్పడం లాగ, వాడిపోయిన జీడిపండులాగ?

ఇన్ని మడతలు, ఇన్ని ముడతలు: ఇన్ని పగుళ్ళూ ఉన్నాయేమిటి ఈ మొహంలో?

ఇదెవరిదో తప్పుచేసినవాడి మొహం. ముసిలాడి మొహం:

తనే, తప్పుచేసినవాడు....తనే ముసిలాడు....

తనే, తనే, తనే.

తనదే ఆ మొహం....తనే తప్పు చేసినవాడు....ఛీ!

పొద్దుపోయింది.

o o o o

అల్లుడు ఇంటికెళ్ళి వుంటాడు, తనకోసం చూడకుండా భోంచేసి 'వాళ్ళ' మేడెక్కి పడుకున్నా రనిపిస్తె బాగుండునని తోస్తోంది సీతాపతికి. ఎందుకో అతనికి తెలియడంలేదు.

అల్లుడు మర్యాదిచ్చి మర్యాద వుచ్చుకునే రకం.తను రాకుండా భోజనం చెయ్యడు. చేసిన ఆలస్యానికి నొచ్చుకుంటూ చకచకా అడుగులెయ్య సాగాడు.

చెరువుకొమ్మ వుంత దగ్గిర పలకరింపు విని ఒక్కక్షణం 'నన్నేనా' అని పస్తాయించి ఆగాడు.

'తఃవఃర్నేనండి బాబుగారండి. ఇల్లా వొస్తన్నా రెక్కణ్ణించండి?'

'ఎవరే అది? బుచ్చీ!'

'మరేఃనండి బాబుగారు....కాస్త మోపెత్తి పెడతారండి? సాలాసేపు నిలబడి పోయానండి. ఎవరూ ఒస్తల్లేదండి'

పుల్లలమోపు ముందుంచుకొని ఎత్తేవాళ్ళు లేక నుంచున్నది బుచ్చి. ఆమెని గురించి ఒక్కమాటలో చెప్పాలంటే 'గత వైభవచిహ్నం.' బుచ్చి ఆ వూరికి మత్స్యగంధి, ఇంటా బయటానూ.

అయితేనేం ఆమె చరిత్ర వ్రాయాలంటే మళ్ళీ ఏ వ్యాసమహర్షో రావలసిందే. అయితే యీమాటు భాగవతం రనించే శృంగార ఘంటంతో ఒస్తె మంచిది.

ఆమె లీలలు ఇంటింటా శిలా శాసనాల్లా వెలిసి వున్నాయి.

రసికావతంసులై యిల్లాళ్ళ నేలుతున్న ఊరి దాతుర్వర్ణ్యమూ కూడా వొకనాడు బుచ్చి శిక్షణ పొందాలని ఉవ్విళ్ళూరిన వాళ్ళే—ఆమె దగ్గిర గొప్పా బీదా లేవు—

'ఉండిపో'మని ఎందరు సుఖవంతంగా రసవంతంగా బలవంతం చేసినా ఒప్పుకోలేదు—ఊరిచివర ధాన్యంమిల్లు పెట్టడానికి ఆ రాచవారు ఒచ్చే వరకూమా.

మిల్లు ఉందిగాని 'వారు' లేరిప్పుడు—

ఎవరున్నా ఎవర్లేక పోయినా—ఏమున్నా ఏం లేకపోయినా—

బుచ్చి నెవరూ మరచిపోలేరు—

ఇప్పటికైనా దాని బింకమూ, బొంకమూ, పెంకెతనమూ, టంకంలాంటి మంకుతనాన్నైనా సరే రంకెలేయిస్తుందనడానికి—దేహం వున్నవాడెవడికీ సందేహం కలగదు.

మోమోట పడ్డా మోపెత్తి పెట్టాడు సీతాపతి.

'మీ నాన్న బావున్నాడ్టే?'

'ఏం బాగు సామీ....'సావా సావడు సాపాయివ్వ' డన్నట్టుంది ఆడిపని —ఇంకా ఆడి సేపల దుకానం, మిల్లు దొరగారూ ఉన్నారనే నండి ఆడి బెస ....అత్తుమానం తే తే అంటాడండి— ఏంటీ తెచ్చేదీ!'

మిల్లు వూడ్చడానికీ, అక్కడ నీళ్ళూ అవీ ఉంచడానికీ ఇలా ఏవో పేరు చెప్పి రాజుగారు బుచ్చికి పబ్లీకున నెలకి యింతా అని ముట్ట జెప్పేవాడు; ఆయన పోగానే ఆ ఉద్యోగంలో మర్యాదపోయింది. కొన్నాళ్ళకి ఆ ఉద్యోగమూ ఎవరికి చెందాలో వాళ్ళకి చెందింది.

ప్రజాస్వామ్యం వొచ్చాక రాజాదరణ తగ్గిపోయిన కళలా బుచ్చి మూల పడి 'పువ్వులమ్మిన ఊళ్ళోనే పుడకలమ్ముకుంటోంది.'

కదిపితే కందిరీగల పుట్ట—అని తెలిసినవాడు గనక సీతాపతి ఆ పలకరింపుతోనే చాలించుకొని మరేమీ కదపకుండానే నడక సాగించాడు.

ఎవరికెంత హీనమైన కథైనా బుచ్చి తన కథకి తనే నాయకురాలు గనక—

మాట్లాడనని భీష్మించుకున్న సీతాపతిచేత మొహమాటం మాటలు పలికిస్తూ, తన కథంతా చెప్పుకుంటూ అడుగు లేస్తోంది బుచ్చి.

సాప్తపదీనమైన సఖ్యం దాదాపు మూడు ఫర్లాంగులు నెరపి ఇటు బుచ్చి పక్కదారికి మళ్ళడమూ, అటు రెండే రెండడుగుల వెనకనించి ఒక సకిలింపుతోబాటు ఒక కొత్త పలకరింపు వినబడ్డమూ జరిగాయి.

'ఎక్కణ్ణించోయ్! ఇట్లాగ?'

సీతాపతి ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూశాడు.

'శంకరయ్య మాఁవాఁ?'

'అఁ ఆఁ—చీకటిలో కనబట్టంలేదుగావున్ను! ఏమిటి ఇల్లా బయల్దేరావు? అల్లుడాడు వెళ్ళాడా?'

'లేదు_'

'ఏం వెళ్తాడులే.... వెళ్ళక్కర్లేదు గూడాగావున్ను.'

'అంటే?'

'ఉద్యోగం సద్యోగం యిలాటి బాదర బందీల్లేవుగా.'

సీతాపతి నవ్వుతున్నాడు. ఏమిటో_తన అల్లుడు తనింట్లో తింటూ పది రోజులపాటు ఆనందంగావున్నా ఆ ముచ్చట్లూ లోకానికే కావాలి!

'ప్చ్!_వాళ్ళకెందుకు మామా. ఉద్యోగాలూ వూపిగాలూ.'

'అంతేలే!_అయినా ఇప్పుడేం తెలుస్తుంది? ఆ ఉన్న పిప్పీ పిసరూ నలుగు రన్నదమ్ములూ పంచుకోవాలి_తూతుకు నలుగురు పిల్లల్ని కనాలి_అప్పుడు గదా ఎంతొస్తుంది అన్నప్రశ్న! అందరూ నీలాగా దీపం వుండగానే ఇల్లు చక్క బెట్టుకోగలరా!'

సీతాపతి మాట్లాడలేదు.

'చెప్పవేం?_పదెకరాల పొలమూ ఊళ్ళో మేడా. ఒక్కడివీ_నువ్వే. యుద్ధంలోకిపోయి అంతోయింతో తెచ్చుకున్నావు. అందరికీ అలా చేతవుతుందా అని_'

సీతాపతి నవ్వుతున్నాడు. అయితేనేం_జవాబు చెప్పవలసిన అవసరం కాకతాళీయంగా తప్పింది....సరిగ్గా ఈ మాట అనేవేళకి శంకరయ్య యింటి ముందుకొచ్చారు ఇద్దరూ.

'మరి నే ఒస్తాను మావా.' అన్నాడు సీతాపతి.

శంకరయ్య నవ్వాడు. 'ఏదైనా అర్జంటు వ్యవహారవా?_రావోయ్. కాసేపు కూచుని వెడుదువుగాని.'

ఇహ తప్పేది లేదు.

శంకరయ్య షష్టిపూర్తు. ఇంటినిండా ఐలగం.

కాణీ అంత కుంకం బొట్టుతో ఇల్లాలూ_ పేడకళాపీ జల్లి ఇరవైనాలు గ్గంటలూ శుభ్రంగా వుంచే వాకిలీ. ఓ పక్క మల్లెపందిరి వోపక్క తులసికోటా ఇవన్నీ ఆ యింట్లో ఆకర్షణలు.

అక్కడికెళ్తే మళ్ళీ యివతలికి కొంచరగా రాబుద్దెయ్యదు ఒక్క సీతాపతికే గాదు. ఎవరికైనాసరే.

సీతాపతికిది చిన్నప్పట్నుంచీ అనుభవమే.

అంతేగాదు—

పన్నెండేళ్ళు ఆర్మీలో వుండి తిరిగొచ్చిననాడు—

ఊరంతా మారిపోయి,

మహాకవి కథలో లాగ 'పోయి'

కొత్త సంస్కృతులూ, కొత్త చొక్కాలూ తొడుక్కుని.

'ఇది మన వూరు కా'దనిపిస్తె.

ఈ వేపు శంకరయ్య యిల్లూ, ఈ తులసికోటా, పల్లెపందిరీ, ఈ వృద్ధ దంపతులూ నిలబడి.

'ఇది మీ వూరే నాయనా.' అని చెప్పగలిగింది.

ఆ పాత ఘుమ ఘుమల్తో. ఆ ప్రశాంతతతోనే.

అయితే ఈ ప్రశాంతమైన ఇంట్లో—

గేటు దాటీ దాటగానే, లోపలికి వెళ్ళి వెళ్ళగానే శంకరయ్య గొంతు మార్చి—

'ఏమిట్రా మామా, దీని వెనక పడ్డావూ? ఏమిటి కథ?' అన్నాడు.

తను లోపలి కడుగు వెయ్యలేరు.

సీతాపతిని వెయ్యనివ్వలేదు.

మెదడులో మేకుకొట్టినట్టయింది సీతాపతికి, బుచ్చిని గురించి అడుగుతున్నాడని అర్థమై.

తాటికింద పాలు తాగిన సీతాపతి నిలబడియాడు. వొంట్లో విద్యుత్తు పృథక్కరించినట్టూ, పాషాణం మింగినట్టూ వుంది. వమనం కాదేమని బాధగా వుంది.

అదేం మాటది?

ఆ మాట మరోడెవడైనా అన్నా,

మరోనాడు ఈ శంకరయ్య మావే అన్నా,

వేరేవిధంగా జరగవలసిన కథ—

మధ్యాన్నం నించీ మస్తిష్కాన్ని మథిస్తున్న మంతనం కాబోలు— మౌనముద్రే వేయించింది.

'ఛీ ఛీ లేదు మావా—' అననూ అన్నాడు.

దానికి శంకరయ్య 'ఏడిశావులే' అన్నట్టు పెద్ద నవ్వో నవ్వేశాడు.

అంతేగాదు.

అ సాయంత్రపు శీతాతపంలో
శంకరయ్యా యిచ్చిన గ్లాసెడు మంచితీర్థంలో-
సతీసమేతంగా చేసిన హితబోధలో—
ఏముందోగాని- ఇవతల బడేసరికి- ఒడ్డునపడ్డ చేపలా కొట్టుకునే ఈ చేపపోయి ఏ మత్స్యగంధి బుట్టలో పడుతుందోనని భయంవేసింది.

అరవై ఏళ్ళొళ్ళొన్నా శంకరయ్యా మామకి బుచ్చిని చూడగానే హుషారు కలిగి కలగవలసిన ఆలోచనా కలిగింది. తను అలా ఎందుకాలోచించలేదో?

అదొక ప్రశ్న! ఏమిటా ప్రశ్న? వడుచుదనం పరపళ్ళు తొక్కుతున్న తన యింద్రియాలు వెయ్యలేని ప్రశ్న! జవాబు లేని ప్రశ్న!... శంకరయ్యా మాఁవా తనని సవాల్ చేసేది?

చేసినా చేస్తాడు. శంకరయ్యమాఁవ ఆఖరు కొడుక్కి నాలుగేళ్ళు వెళ్ళ లేదుట. పదిసార్లు తాత అయిపోయిన శంకరయ్యమామ మళ్ళీ తండ్రి అవు తాడేమోనని అనుమానం—ట— యిప్పుడు!

'నీ కెందుకోయ్! భగవద్గీతలూ, బ్రహ్మసూత్రాలునూ? చిత్తం శివుడి మీదా భక్తి చెప్పులమీదా అన్నట్టూ!' అని పుస్తకం కాస్తా లాక్కున్నాడు కూడానూ.

హోసి బుచ్చీ! ఎంత పని చేయించేవే! కనపడకుండా, యెరక్కుండాను. మో పెత్తి నెత్తిన పెట్టడానికి మించి దాంతో ఏ అనుబంధమూ లేనేలేదని ఎవ రితో వేసుకోడం ఒట్టు?

ఒట్టు? ఒట్టులేదు—అంతా ఒట్టిది! నాటినించీ నేటి వరకూ, నాటుకు పోయినమాట, నరాల తీట!

రెండేళ్ళ పాపని 'సవిత్తల్లి' ఏం చేస్తుందోననీ.
ఏం చెయ్యదో అనీ—
'ఎలా చూస్తుందో; ఎలా చూడదో అనీ అప్పుడూ;
మిలిట్రీలో చేరనే చేరాంకదా యిప్పు డెందుకులే అని తరవాతా.

చెట్టంత కూతురు నట్టింట్లో తిరుగుతూ వుంటే దానికి సంబంధం చూడాలి గాని తనకా అని అన్నీ అయినాకా—
ఆపేస్తూ వొచ్చాడేగాని.... అవునా? అంతేనా?
'తాతా, పెళ్ళాడతావా?'
'నా కెవరిస్తారోయ్ పిల్లనీ?'

అబ్బబ్బ ఏమిటీ గొడవ?

కూతురూ అల్లుడూ డాబామీద నీ రెండ నీడలో ఒకర్నొకరు అమకొని ఏదో చేశారనీ,

శంకరయ్య మావఁ బుచ్చి వెనక పడ్డావా అని అడిగాడనీ స్ఫురించి నప్పుడల్లా కోపం రావడం, కోపం రాగానే సర్దుకోడం, ఏమిటి ఇదంతా? హూఁ!!

0 0 0

పంచమి చంద్రుడు కుంగాడు.

సీతాపతి వీధి చివర్నించే అనుకోకుండా మేడ గదివేపు ఓ చూపు విసి రేశాడు.

పెద్ద లాంతరు వెలుతురు లేదక్కడ.

చిమ్మ చీకటీ లేదు,

"కోడిగుడ్డు లాంపు"వెలిగిందప్పుడే.

ఎంత ఒద్దనుకున్నా దా నర్థం యిదీ అని మెదడులో వో కెరటం.

సీతాపతి సరదాగా కనురుకుని బెదురుగా నవ్వుకున్నాడు.

ఆవలిస్తూ తలుపు తీసిన అక్కగార్ని చూస్తే నవ్వొచ్చింది; ఆవిడ ఆవ లింతకి చిటికలు వేశాడు నవ్వుకుంటూనూ.

'ఎక్కడ కూర్చున్నా వింత వరకూనూ? వెంకడు ఊరంతా తిరిగొచ్చి బాబుగా రెక్కడా కనబళ్ళేదంటూ చక్కా ఒచ్చాడు."

సీతాపతి అన్నం తింటూ పేరుకుపోయిన నెయ్యి చేతికంటుకుందని కంచం అంచుకి రాస్తున్నాడు.

'అన్నం తిని వెళ్ళక పోయినావా? నీ అల్లుడు అరగంటపాటు అతి మర్యాదగా విసుక్కుని, బలవంతం చేయించుకుని, నాలుగు ముద్దలు తిని వెళ్ళాడు మేడమీదికి.

సీతాపతి మాట్లాడకుండా అన్నం తినేశాడు. కంచంలో చెయ్యి కడిగేసు కొని, ఉత్తరీయంతో జిడ్డు తుడిచేసికొని యింకా అక్కడే కూచున్నాడు.

'అయితే అప్పా! గవరయ్య మామకూతుర్ని నువ్వు చూశావటే ఈ మధ్య?' అన్నాడు.

పార్వతమ్మ వులిక్కి పడ్డది. అప్పా అన్న పిలుపే విచిత్రం! అది సాధారణంగా సీతాపతి నోటంట రాదు. అమ్మీ అనే ఎప్పుడు పిల్చినా!

'గవరయ్య మామంటే పాలెం మావేఁనా?'

'అఁ!'

'చూడకేం? మనింటికి పెళ్ళి కొచ్చింది! అందరి పెళ్ళిళ్ళూ చూసింది



అద్దం అబద్ధమాడింది

గాని దాని పెళ్ళే ఉండిపోయింది. ఇంకేం పెళ్ళిలే! ముప్పయ్యేళ్ళు వెళ్ళినట్టున్నాయి! దానికేమైంది యిప్పుడూ'

'దాని పేరేమన్నావ్?'

'గంగ.... కులాసాగా వుందిటా?'

'బావుంటుందా?'

'బావుండక పోడానికి దానికేం, కన్నోంకరా, కాలొంకరా? కట్నాల బాధ పళ్ళేకగాని, గవరయమామ దానికి సంబంధమే చూడలేక పోయ్యాడా?'

'నువ్వు సరిగ్గా చూశావా?— బుద్ధిమంతు రాలేనా?'

'అవుననుకో, అదంతా ఎందుకిప్పుడూ,'

'ఎందుకేమిటు, పెళ్ళికి' సీతాపతి పొడిగా నవ్వాడు.

'ఎవరేమిటి, దాన్ని చేసుకునేది?'

'ఎవరో చేసుకుంటే మన మెందుకూ మాట్లాడుకోడం? నేనే చేసుకుందామని'

పార్వతమ్మ నిర్ఘాంతపోయింది, 'ఇదేంటన్నా యిదీ?'

సీతాపతి లేచాడు. 'ఏం?— నాకేం వయసు మళ్ళిపోయిందనీ? చీకా, చింతా? రమణని అత్తారింటికి పంపవలసిందేగా, రేపో నేడో? ఆ తరవా తేం చెయ్యడం? బిక్కు-బిక్కు-మంటూ యీ యింట్లో మనిద్దరం యెంతకాలం(వని ఉంటాం?'

0 0 0

చకచకా నడుచుకుంటూ సీతాపతి హాల్లో కొచ్చేశాడు— లాంతరు పెద్దది చేసి వక్క-పొడి సీసాకోసం నాలుగువేపులా దృష్టి సారించాడు.

'అదిగో, ఆ నిలువుటద్దం దగ్గిర బల్లమీదుంది.'

చకచకా నిలువుటద్దం దగ్గిర కెళ్ళాడు సీతాపతి. వక్క-పొడి తీసుకునే ముందు అద్దం అతని దృష్టి నాకర్షించింది. అత నందులోకి చూశాడు.

అందులో ఒక నిశ్చయంలా నిగనిగలాడే దేహం, పన్నెండేళ్ళపాటు దేశంలోకెల్లా వుత్తమమైన భోజనం చేసినదేహం. బలంగా గుండ్రంగా, ఆకర్షణీయంగా ఉన్న దేహం కనిపించింది. అనుమానించి మొహంవేపు చూశాడు సీతాపతి.

ఆ మొహంలో నున్నటి నిర్ణయం, మెత్తటిహాసం కనబడింది.

'ఈ వెధవ అద్దం ఇందాక ఎంత అబద్ధ మాడింది!' *

("ఆంధ్రజ్యోతి" వీక్లీ: దీపావళి ఏప్రిల్ 1978)

# రక్ష

"ఒస్తున్నా, ఒస్తున్నా!" గబగబా చీర వొంటికి చుట్టబెట్టుకుంటూ అంది, నీలవేణి.

"ఆ తలుపు కొట్టేవాడు ఆగడేం; వాడి మొహం మండ!" అని విసుక్కుంది. "లైటు స్విచ్చెక్కడుందో కనబడి చావదు!" అనుకుంటూ సత్యారావుని నిద్రలేపింది. "ఊఁ" అని మూలిగి, అటువేపు వొత్తిగిలాడు సత్యారావు. "ఎవరో తలుపుకొడుతున్నారేవండి!" అంది నీలవేణి. "షటప్ అండ్ స్లీప్!" అని నీలవేణి చెయ్యి పట్టుకుని లాగాడు సత్యారావు. "ఏడ్చినట్టే వుంది సరసం" అంటూ రెండో చేత్తో అతని నడుంమీద వొక్కటిచ్చుకుంది.

"లెండి!" అని గద్దించి, మంచం కాళ్ళ వేపున్న లుంగీని అతనిమీద పడేసింది. అంత చీకట్లోనూ నీలవేణి ఒంటినిండా బట్టలు కట్టుకున్నట్టు కనిపెట్టి తక్కున లేచి కూర్చున్నాడు సత్యారావు. తలుపు చప్పుడు అలా వినబడుతూనే వుంది. క్షణంలో మత్తు వదిలింది. మరుక్షణంలో లుంగీ వొంటికి చుట్టబెట్టుకొని స్విచ్చిబోర్డు దగ్గరికెళ్ళి లైటేశాడు.

"అయ్యో! పైటంచు లోనకెళిపోయింది!" అంటూ బాత్‌రూంలో దూరింది నీలవేణి: జాకెట్టుకి బొత్తాములు పెట్టుకుంటూనూ.

తలుపలా చప్పుడవుతూనే వుంది.

"ఎవడ్రా నీయబ్బ!" అంటూ తలుపు గడియ తీశాడు సత్యారావు. తలుపు సగం తెరవగానే తలుపుకొడ్తున్న వారెవ్వరో తెలిసిపోయింది.

సత్యారావుని తన చేతిలోవున్న కర్రముక్కతో పక్కకి తోసేస్తూ లోపలికొచ్చేడు వెంకటస్వామి. అతని వెనకాలే సుబ్బయ్యకూడా గదిలో దూరేడు.

"అదేదీ?" అని దబాయించాడు వెంకటస్వామి.

"మాటలు తన్నగా రానీ. అదీ, ఇదీ అన్నావంటే మర్యాదగా వుండదు!"

"షటప్! గొప్ప మర్యాదస్తుడివి బైల్దేరేవు. బ్రాందీవాసనా నువ్వూను! ..........సుబ్బయ్యా, చూడు, బాత్రూంలోగాని దూరిందేమో?"

సుబ్బయ్య బాత్‌రూం దగ్గిరికెళ్ళి తలుపుమీద చెయ్యి వేశాడు. "ఆగండి! చీర కట్టుకుంటూవుంటే ఏమిటా గొడవ? అసలెవరూ, వచ్చింది?" అని అరిచింది నీలవేణి.

చేతిలో కర్రతో బాత్రూం తలుపుమీద కొట్టాడు సుబ్బయ్య. "ఎవడా? నీ రంకు మొగుడు!" అన్నాడు ధాష్టీకంగా.

"ఇట్రా, బ్రదర్!" అని సత్యారావు సుబ్బయ్య చెయ్యి పట్టుకొని గది మధ్యకి లాక్కొచ్చాడు. "ఏంటి, మీ ఉద్దేశం?" అన్నాడు అతిథులిద్దర్నీ వుద్దేశించి.

వెంకటస్వామి జేబులోంచి పుస్తకం, పెన్సిలూ తీశాడు. "రానీ, ఆ శాల్తీని కూడా" అన్నాడు సుబ్బయ్య.

"ఏటా యేషం, లుంగీ నువ్వూను. సొక్కా యేసొ్క. తొరగా యెళ్ళాలి మనం. మీ ఒక్కళ్ళతోనే కూకోమంటావేటి, తెల్లారే పరకూను!" అని సత్యారావుని కర్రతో పొడిచాడు వెంకటస్వామి.

"అడ్డమైన రకాల వాళ్ళనూ చూసి చూసి మీరు బొత్తిగా మంచీ మర్యాదా మర్చిపోయారల్లే వుంది! ముందు బైటికి పదండి! కింద కౌంటర్ దగ్గర తేలుస్తాను మీ సంగతి. మేనేజర్ వున్నాడా?" అన్నాడు సత్యారావు.

వెంకటస్వామి నవ్వాడు. "ఏంటి, కిందికెల్లి మాట్లాడేది? తొరగా రూంకి తాలంఏసి మాతో బయిలెల్లండి"

బాత్‌రూం తలుపు తోసుకుని వచ్చింది నీలవేణి, "ఇదేంటండీ ఈ అల్లరి?" అంది సత్యారావుతో వచ్చినవాళ్ళెవరో తెలుసుకుని.

సుబ్బయ్య పకాలుమని నవ్వుతూ వంగాడు. "మందు కొట్టేసింది గురూ, లంజ!" అని ముక్కుమీద రుమాలు పెట్టుకున్నాడు.

మెరుపులా సుబ్బయ్యమీద పడింది నీలవేణి. "లంజంటావురా, నీ మొహం మండా!" అంటూ, సుబ్బయ్య చంకలో వున్న కర్ర తీసుకుని, రెండు చేతులతోనూ పట్టుకుని, సుబ్బయ్య వీపుమీద గట్టిగా రెండు బాదులు బాదింది, ఎంత దెబ్బకొట్టావే నీయమ్మ!" అని సుబ్బయ్య ఆమె మీద పడి, చెయ్యి మెలితిప్పి, కర్ర లాక్కున్నాడు.

నీలవేణి సుబ్బయ్యను కొట్టడం ఆశ్చర్యంగా చూస్తున్న వెంకటస్వామికి తన చంకలో వున్న కర్రను సత్యారావు లాక్కోడం తెలీలేదు. సత్యారావు ఆ

కర్రతో సుబ్బయ్యను నాలుగేశాడు. సుబ్బయ్య ఇన్నాళ్ళూ తన కర్రతో నిప్పులు యుల్ని కొడుతూ రావడమేగాని, ఎన్నడూ ఒక దెబ్బ తిన్న పాపాన్న పోలేదు; ఎప్పుడో ట్రెయినింగ్‌లోతప్ప. ఈ హఠాత్ దాడికి సుబ్బయ్య సిద్ధంగా లేడు. అతడి కర్ర కింద పడిపోయింది. "బాబో" అని అరుస్తూ, గెంతి వెంకటస్వామి పక్కకు చేరాడు.

సత్యారావు వగరుస్తూ "ఎన్ని గుండెర్రా నీకు? నా వైఫ్ వొంటిమీద చెయ్యేస్తావా?" అన్నాడు.

"నే నంటూనే వున్నాను గురూ, అళ్ళేదో ఫామిలీ అయ్యుంటారని, నా మాటిన్నావుకావు" అన్నాడు సుబ్బయ్య బాధగా.

కిందినుంచి కఠోరంగా ఈల వినబడింది.

"ఎస్సార్" అని రూంలోంచి బయటికి పరుగెత్తాడు వెంకటస్వామి, తలుపు దగ్గర నిలబడి సుబ్బయ్యకి రమ్మని సౌంజ్ఞచేసి. సుబ్బయ్య తలుపు దాటగానే తలుపు గడియ బైటనుంచివేసి "నువ్విక్కడే వుండు!" అని కిందికి దిగాడు.

నీలవేణి పరుపుమీద బోర్లా పడుకుని ఏడవసాగింది.

"నీలా! ఏంటది? ఏం ఫర్వాలేదు, లేచి కూర్చో" అని చేతిలో కర్రను మూలకి విసిరేసి, ఆమె పక్కనే కూర్చున్నాడు సత్యారావు. ఆమెని తన కెదురుగా తిప్పుకోడానికి ప్రయత్నించాడు.

"వెధవ దేశం, వెధవ మనుషులూనూ!! ఛీ!" అంటూ లేచి కూర్చుంది నీలవేణి. "కింద ఇంకా బోలెడుమంది వున్నట్టున్నారు. ఏం చేస్తారో ఏమో, వీళ్ళ దుంపదెగ!" అంది.

"వాళ్ళ మొహం. వాళ్ళేంటి జేసేది, బూడిద: ఏమన్నా తప్పుజేస్తేగా, మనం?"

"వాళ్ళ దృష్టిలో తప్పేనేమో, మనం చేసింది?"

0 0 0

"ఒకప్పుడు నా దృష్టిలోనూ తప్పే!" అనుకుంది నీలవేణి.

రెండేళ్ళ కిందట వొకనాడు ఆలస్యంగా యింటికి చేరిన సత్యారావుని అడిగింది. "ఏమిటండీ ఆ వాసన? కొంపతీసి—"

"నేనెవరి కొంపా తియ్యలా, ఫ్రెండ్స్ నలుగురూ పార్టీ అన్నారు: వెళ్లొచ్చానంతే. నేనేం తాగి తాగి ధరణిపై బళ్ళా"

"బాగానే వుంది కవిత్వం. పార్టీ అనంగానే పోవటమేనా! తప్పించుకోటం చాతగాలేదా లేక ఇష్టమో అలవాటో ఏర్పడి పోయిందా యీ సరికే?"

"అలవాటేంగాలా."

"అలవాటు కాలేదంటున్నారు. అంటే కొన్నాళ్ళయిందన్నమాటేగా, ఇది మొదటి తడవగాదు."

"ఆ, ఏడాదవలా, మరి?"

"మరింతకు ముందెప్పుడూ వాసన లేదే!"

"ఇట్టాటా, నువ్వూళ్ళో లేనప్పుడో, బైటజేరినప్పుడో పెట్టుకుంటున్నాంగా."

ఆ తరువాత వొక నెలకి—

"మళ్ళీ యివ్వాళ కూడా పార్టీయేగా?"

"ఎట్టా దెలుసుకున్నావే, నీ అసాధ్యం గూలా!"

"ఎట్లానో యేం? గుప్పున వాసన గొడుతుంటా?"

"కొడితే కొట్టిందిలే—ముందన్నం వొడ్డిచ్చు. ఆకలవుతా వుంది."

"మీరే వొడ్డిచ్చుకోండి. నాకా వాసన వెలపరంగా వుంది. మీ పక్కన కూర్చుంటే నేదిన్నది కాస్తా వాంతయ్యేను!"

"సర్లే—!"

"ఎంత ఖర్చవుతుందండీ, ఒకో తడవ 'పార్టీ'కి?"

"ఆఁ ఎంతో ఎందుకవుతుంది? తలా యిరవై—"

మళ్ళీ నెల్లాళ్ళకి—

సాయంకాలం అతను బయల్దేరేముందే అడిగింది. "ఏంటో మా వుషారుగా ఉన్నారు, మళ్ళీ ఏదన్నా పార్టీనా?"

"ఆ; చెప్పటం మర్చా! వొచ్చేటప్పటికి పదకొండు కావచ్చు."

"ఇరవైలూ పాతికలూ తగలేసి వైబెక్కటో తాక్కపోతే మీ క్కావల్సిన మటుకు వదో, వదిహేనో పారేసి అదేదో యింటికే తెచ్చుకు తాగరాటు?"

"తాగొచ్చనుకో అయితే నలుగుర్తో తాగినప్పటి మజావుండదు. ఏవో కబుర్లూ అవీ వుంటాయిగా."

"ఏం కబుర్లేం మహా! జీతాలు. యింక్రిమెంట్లు. ప్రమోషన్లు యివేగా! కాకపోతే ఆఫీసర్లమీదనో లేడీ ఎంప్లాయీస్ మీదనో అవాకులూ చెవాకులు—అంతేగా!"

"నీదుంపతెగ, చూసినట్టు చెబుతున్నావే?"

"అ చూశాకాబట్టే అంటున్నా. పోయినతడవ మా అక్కగారూ రెళ్ళాగా, బావగారు మీకు మల్లే బైటకి పోడు! నాతో తాగాలనుకుండే వాళ్ళు నా యింటి దగ్గరే అఘోరించడంటూ ఇంట్లోనే పెడతారు. దుకాణం!"

"ఇంతకీ యీమంటావు?"

"ఏం లా, అ చెప్పుకునేవి మా లాపు కబుర్లు గాకపోతే ఇంటికి తెచ్చుకుని తాగమంటున్నా, బైటికి పోవటం, మీ దాతృత్వం కనిబెట్టి వాళ్ళంతా మీతో యాభైలూ, వందలూ ఖర్చు జేయించటం! అట్లాంటి వాళ్ళకు దూరంగా వుంటం మంచిదంటున్నా."

ఆ రోజు ఎనిమిది గంటలకే వచ్చేశాడు సత్యారావు.కొడుకు నిద్రపోతూ వుండడం గమనించి—"కాసిని వేరుశనగపప్పులు వేయించి కారం చల్లు. నూనెక్కువ వెయ్యమాకు. వీధి గుమ్మంలో బడ్డీ కుర్రాణ్ణి కేకేసి నాలుగో, ఆరో సోడాలు పెట్టి తెమ్మను. ఈలోగా నేను స్నానం గానిచ్చొస్తా" అన్నాడు.

"ఏం కథా?"

"ఇంట్లోనే తాగమన్నావుగా!" అని జేబులోంచి సీసా తీశాడు సత్యారావు.

"ఉఁహూఁ!" అని, సీసా అందుకొని "బ్రాందీ" అని చదివి, "ఈ సీసా ఎంత కరీదుంటుందేం?" అంది నీలవేణి.

"పంధొమ్మిది! మనకైతే పద్దెనిమిది!"

"అంత వాడుకగా కొనుక్కుంటున్నారా యేం!?"

"వాడుకా గాదు, నీ బొందా గాదు. ఆ బ్రాందీషాపు సేల్సుమన్ తమ్ముడు మా ఆఫీసులో వున్నాను!"

బజార్లోంచి తెచ్చుకున్న చిప్స్ తింటూ ఒకసారి పోసుకున్నది అరగంట పాటు తాగడం చూసింది నీలవేణి.ఈ లోగా వేరుశనగపప్పులు వేయించి చిన్న ప్లేట్లో పెట్టి అతని ఎదురుగా కూర్చుంది. అతను కొంతసేపు రేడియోవింటూ సిల్లాడి హోంపట్టి విద్దాడు. ఒక ఉత్తరం రాశాడు. అవన్నీ అయినాక ఏదో పుస్తకం తీసి చదవసాగాడు. గ్లాసు పాతికగంట పాటు ఖాళీగానే వుంది.

నీలవేణి ఏదో [illegible]టుకుంటోంది అక్కడ కూర్చుని.

"ఎట్లా వుంటుందేం, ఇది?" అని అడిగింది.అతను రెండోసారి గ్లాసులో పోసుకుంటూ వుండగా.

"కొంచెం చేదుగా, కొంచెం వగరుగా,"

"అందుకేగావును, ఈ శనగపప్పులూ, చిప్సూ అవీను. బావగారు జీడి పప్పులు తప్ప మరోటి వల్లగాదనేవారు-బోలెడు ఖరీదు!"

"ఆయనకేం. నా జీతానికి మూడురెట్లు ఆయన ఎడంచేతి సంపాదనే వుంటుందాయె."

అతను సోడాకొట్టి గ్లాసులో పోసుకున్నాడు. కిటికీలోంచి గ్లాసు అందుకుని "ఏదీ ఇందులో నాగ్గూడా పొయ్యండి,ఎట్టా వుంటుం దో చూతాం" అన్నది.

సత్యారావు నిర్ఘాంతపోయాడు. మరుక్షణంలా "అమ్మ నీ తెలివి పాడుగాను! ఇందుకా, ఇంటికి తెచ్చుకోమన్నది?" అని జోకు వేశాడు.

"అదేం కాదు. ఆ సీసాలోదంతా మీరొక్కరే తాగేస్తే నా అయిదువతనం యామయ్యేనో అని," అని నవ్వింది నీరవేణి.

o o o

అది మొదలు-అతను బయటెక్కడా తాగడంలేదు.ఆమెకి చేరాలనుంటే చేరుతుంది. లేకపోతే ఒక లిమిటు పెట్టి అతన్ని ఆపేస్తుంది, అది కాస్తా అయ్యాక అతను దాదాపురెండు గంటలపాటు రెండు రెట్లు వుత్సాహంతో వుండగలగడం ఆమెకి ముచ్చటగా వుండేది. మొగుడూ, పెళ్ళాం అన్నాక ఒకరితో వొకరు అబద్ధాలాడుకోడం, లోపల అసహ్యాలు పెంచుకుని పైకేమో చిరునవ్వులూ కృత్రిమ ప్రేమలూ వొలకబోసుకోడం బావుండదని వాళ్ళిద్దరికీ అనిపిస్తుంది.

ఒక్కడే కొడుకు, వాడు రెసిడెన్షియల్ స్కూల్లో చదువుతున్నాడు. వాళ్ళ "పేరెంట్స్ డే" జరుపుతున్నారు రేపు. ముందురోజు రాత్రికి చేరుకొమ్మనీ, ఇట్లావచ్చే తల్లిదండ్రులకి వసతి. భోజనం ఏర్పాటు చేస్తున్నామనీ స్కూలు వాళ్ళ ఆహ్వానంలో రాశారు. కాని ఇక్కడికి చేరేసరికి అటువైపు వెళ్ళే ఆఖరి బస్సు వెళ్ళిపోయింది. ఖచ్చితంగా వస్తామని రాసి, అక్కడకి చేరకపోయి సందుకు వాడక్కడ ఎదురుచూస్తూ భంగపడి మిగతా పిల్లలమధ్య అవమానమో, చిన్నతనమో లోటో పొంది వ్యథ చెందుతాడేమోనని, ఇక్కడ లాడ్జిలో డబుల్ రూమ్ తీసుకుని, ఫోన్‌చేశాడు సత్యారావు ఫలానా బస్‌స్టాండ్ దగ్గర ఫలానా లాడ్జిలో ఉన్నామని, పొద్దుట ఫస్టుబస్‌లో వస్తామనీనూ. అవతల ఒక మేష్టారు పలికి: ఆ పిల్లవాడు తనకి బాగా తెలుసనీ. కబురు తప్పకుండా చెబుతాననీ అన్నాడు.

రాత్రంతా ఎలా గడపడం అనే విషయంమీద ఇద్దరికీ రెండు అభిప్రాయాలు ఇప్పుడేకాదు, ఎప్పుడూలేవు. అందులోనూ: ఈ సారి "కాలక్షేపం" చేయక-చాలా రోజులు- దాదాపు మూడు నెలలు- అయింది!

0 0 0

పది నిమిషాలయ్యేసరికి మళ్ళీ వరండాలో బూట్ల చప్పుడైంది. తలుపు తెరుచుకు వచ్చారు: వెంకటస్వామి. సుబ్బయ్య "రమేష్."

రమేష్ లోపలికొస్తూనే-"ఏ వూరు?" అని అడిగాడు సత్యారావును.

"అవనిగడ్డ!"

"అంటే ఎక్కడ?"

"కృష్ణాజిల్లాలో, దివితాలూకా, ఆ మాత్రం తెలీదు?"

"ఈ అమ్మాయెవరు?"

"నా వైఫ్"

"ఈ సంగీతం చాలా మంది పాడేరు. నిజం చెప్పు!"

"నిజం చెప్పండి—అని వుంటే మీమీద గౌరవం కలిగేది నాకు—మీరు కూడా వాళ్ళలాగానే మాట్లాట్టం విచారకరం. ఎనీవే-మొదటిసారి గనక వూరు కొంటున్నా. నేను నిజమే చెప్పాను. షి ఈజ్ మై వైఫ్."

"నేన్నమ్మను. మీరు, నలుగురూ మెసిలే చోట, ఒక స్త్రీని గుప్తపరిచి; ఆమెతో వ్యభిచారం చేస్తున్నారు.అందుకని మీ పైన చర్య తీసుకోమని సిఫార్సు చేయాలి. మీరు మాతో రావలసొస్తుంది!" అని రమేష్ వెంకటస్వామికీ, సుబ్బయ్యకీ సౌంజ్ఞలు చేశాడు.

సత్యారావు తనవైపు వస్తున్న ఆ యిద్దర్నీ చూసి "ఇదుగో సోదరులూ, మీ రెండు కర్రలూ అక్కడున్నాయి; పట్టుకుపోండి. మరి మీరు ముగ్గురూ వెంటనే బయటికి నడవండి. మేం ఈ రాత్రికి ఈ రూం విడిచి రాం. నాపేరు, అడ్రసూ లాడ్జి రిజిష్టర్‌లో రాశాను. మేం యిద్దరం వచ్చాం, ఆ ప్రకారమే అక్కడ రికార్డ్ చేశాను, మేం యిద్దరం భార్యా భర్తలమని అక్కడ రాశాను. అలాగే చెబుతున్నాం కూడా. మీరు నమ్మకపోతే మీ ఖర్మ. అడ్డమైన రకాల వాళ్ళను చూసి చూసి మీకు మనుషుల మీద. మనుషుల నిజాయితీ మీద నమ్మకాలు పోతే దానికి మే మేం చెయ్యం? గుడ్ నైట్!"

"ఇదుగో, చూడండి, మిష్టర్!ఈ తాటాకు చప్పుళ్ళకి మా కుందేళ్ళు బెద

రవు. మీరు మర్యాదగా మా వెంటరండి. యు అర్ వేస్టింగ్ అవర్ టైమ్‌"
అన్నాడు రమేష్.

"తొందరపడకండి. మేం భార్యాభర్తలమని చెబుతున్నాం. అలా కాగితం రాసిమ్మంటేకూడా యిస్తాం. ఇద్దరం సంతకాలెడతాం. ప్రొద్దుట. వీ తప్పదూ అన్నట్టయితే ఒక ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేటు దగ్గరకొస్తాము, మా పన్లు మానుకొని అక్కడ వారుకోరితే డిపొజిషన్స్ యిస్తాము. అంతేకాని అర్ధరాత్రి ఇంతసేపు మీ మాటను ప్రతిఘటించి ఇప్పుడు మీకు లొంగిపోయి మీ వెంటవచ్చి అపదలను కొని తెచ్చుకోటానికి సిద్ధంగా లేం."

"ఆపద లేమిటి?"

"ఏమో! అవి ఎలా వస్తాయో!? ఆ మధ్య ఎక్కడో ఒక జంట సినిమ నుంచి వస్తూవుండగా పోలీసులు ఆ పురుషుణ్ణి హత్యచేసి స్త్రీని గర్భవతిని చేశారటగా- అట్లా."

"ఐ సీ, ఒ.కె. నేనూ చూస్తాను. రేపు ఉదయం మీరెలా తప్పించుకుటారో?"

రమేష్ బయటికి వచ్చి వెంకటస్వామినీ, సుబ్బయ్యానూ అక్కడ కాపలా పెట్టి వెళ్ళాడు.

o o o

ఉదయం ఆరున్నర- ఏడు మధ్య-

పన్నెండేళ్ళ కుర్రవాడు. అందమైన యూనిఫాం ధరించి ఆ లాడ్జి కౌంటర్ దగ్గరి కొచ్చాడు,

"గుడ్మార్నింగ్ అంకుల్. అయామ్ రాజేష్.ఇన్ సెవెన్త్ స్టాండర్డ్!"

"ఎస్, మాస్టర్ రాజేష్, నాపేరు గుర్నాథం. వాట్ కెన్ ఐ డూ ఫర్యూ?"

"మా అమ్మగారూ నాన్నగారూ రాత్రి మీ హోటల్లో బసచేశారట. వాళ్ళు మా స్కూల్ కేంపస్‌కి ఫస్ట్ బస్‌లో వస్తా మన్నారు. రాలేదు."

"వాళ్ళ పేర్లు చెప్పు బాబూ-"

"శ్రీ సత్యారావు; శ్రీమతి నీలవేణి!"

గుర్నాథానికి అర్థమై పోయింది. వెంకటస్వామికి కేక పెట్టాడు. సరిగ్గా వెంకటస్వామి మెట్లు దిగేవేళకి రమేష్‌ మోటార్ సైకిల్ చప్పుడు వినబడింది. వెంకటస్వామి తదేక దృష్టితో అటుచూస్తూ అటెన్షన్‌లో వుండి, అతను రాగానే సెల్యూట్ కొట్టి గుడ్మార్నింగ్ చెప్పాడు.

రమేష్ జేబులోంచి రెండు కాగితాలు తీశాడు. "రాత్రి రూమ్ నెంబరు టు-త్రీ వాళ్ళున్నారుగా ఈ కాగితాలు చూపించు, అయ్య గర్వం విరుగుతుంది"

"సార్" అన్నాడు గుర్నాథం.

"ఆఁ, ఏం?"

"ఈ కుర్రాడు___"

మిగిలిందంతా కుర్రాడే మాట్లాడాడు....

"ఇట్లా చాలమంది పేరెంట్స్ వచ్చి అక్కడ బస్సులులేక స్టకప్ అయిపోతారని మాస్కూల్ బస్ తీసుకొచ్చాం సార్. మా పేరెంట్స్ని పికప్ చెయ్యాలి."

రమేష్ నిస్సహాయంగా "మీ తల్లి దండ్రుల్ని నువ్వు గుర్తు పట్ట గలవా" అని అడిగాడు అతని ఉద్దేశం"ఆరూమ్లోమేం దాచినవ్యక్తులు నీ తల్లిదండ్రులేనని నువ్వు సాక్ష్యం చెప్పగలవా?" అని.

మాస్టర్ రాజేష్ చిరునవ్వు నవ్వాడు "మీ తల్లిదండ్రుల్ని మీరే గుర్తు పట్టలేరా?"

-[అతనన్నది "కెన్ యునాట్ రికగ్నయిజ్ యువర్ ఓన్ పేరెంట్స్?" అని-]

ఇంతలో మూడో రూమ్ తలుపు తెరిచి తెరవడంతో లోపల గడియ తీసి సత్యారావు చూశాడు. "హాయ్ డాడీ:" అంటూ ముగ్గుర్ని తప్పించుకుని లోపలికి దూకాడు రాజేష్ లోపలికి వెళ్ళీ వెళ్ళగానే "హాయ్ మమ్మీ;" అని తల్లిని కౌగలించుకున్నాడు.

"మమ్మీ, పోలీసులెందుకు మిమ్మల్ని రక్షిస్తున్నారు? రాత్రి మీ రూంలో దొంగలు పడ్డారా?" అని అడిగాడు.

# రామదాసు మళ్ళీ పుట్టాడు

"బ్యూటిఫుల్, బాలాజీ, సింప్లీ బ్యూటిఫుల్" బైనాక్యులర్స్‌తో తనివితీరా కొండ కిందినుంచి కనబడ్డ దృశ్యాన్ని చూసి అంది జోతి. ముందున్న బండ మీదినుంచి కాలుతీసి చదునుగా ఉన్నచోట వెయ్యబోయి, తూలింది. బాలాజీ వెనకనుంచి ఆమె నడుంమీద రెండు చేతులూ వేసి పడిపోకుండా ఆపాడు. 'సారీ' అన్నాడు.

"నా బెటాల్.... థాంక్స్, మీరు పట్టుకోకపోతే పదహారు వందల రూపాయల బైనాక్యులర్స్ బండలపాలై నాశనమయ్యేది."

బాలాజీ అనుభవం వున్న గిరిజను డిలా చకచకా కొండదిగి పోతూవుంటే అతని పరుగు అందుకోలేక "ఉండండీ మరీ–" అని గునుస్తూ మొదట అతని భుజాన్నీ, తరవాత అతని చేతినీ పట్టుకుని దిగింది.

రైల్వేలైను వెయ్యడానికని కొండ సానువులో నేల కొంత చదును చేసేరు. అక్కడికి చేరేసరకి అతని మోచేతికి ఆమె మోచెయ్యి పెనవేసుకుని ఆకలీ అనుభవం సమపాళ్ళలో వున్న ప్రేమికుల్లా కనబడ్డారు.

అక్కడ జలలోంచి పడుతున్న నీళ్ళు తాగారిద్దరూనూ. "అబ్బ. ఐస్ కూల్డ్ వాటర్ కన్నా చల్లగా వున్నాయి" అంది జోతి.

"ఈ టన్నెల్లోంచి అవతలి వేపుకి వెడితే అక్కడొక అత్యద్భుతమైన వంతెన ఉంది. అది చూడాలి నువ్వు. ఓపికుంటే నడు" అన్నాడు బాలాజీ లైను మీద కొంతదూరం జోతిని నడిపించి.

"టన్నెల్ పొడవు" అన్న అంకెచూసి "మైగాడ్, రెండువందల మూడు మీటర్లా? అంటే వొక ఫర్లాంగుంటుందా?" అంది జోతి ఆ అంకెమీద వేలు పెట్టి.

"ఈ లైనుమీద ఈ సెక్షన్‌లో వున్న సొరంగాలు మొత్తం నలభై అయిదనుకొంటాను. అందులో వొకదాని– ఎనిమిది వందల యాభై మీటర్ల పొడ వుంది తెలుసా!.... అంటే. దగ్గిర దగ్గిర నాలుగున్నర ఫర్లాంగులన్నమాట."

"అంతా చీకటే?"

"ఆ, అంతా చీకటే అవ్వాలసింది. కాని, అదృష్టవశాత్తు సొరంగం ఓ రెండు నోట్ల మరీ కొండ మధ్యనుంచి కాకుండా హద్దుకి; పది, పదిహేనడుగుల దూరంలో వెళ్ళడం తటస్థించింది. ఆ రెండు చోట్లా ట్రాక్ మీదికి వెలుతురు పడేటట్టుగా మిగిలిన కొండ భాగాన్ని పగలగొట్టి షట్‌టన్నెల్స్ ఏర్పాటు చేసేరు."

"ఇప్పుడీ రెండువందల మూడుమీటర్ల టన్నెల్లో అలాంటి వెంటిలేటర్స్ లేవా?"

"ఊఁహూ.... లేవు— ఇంకా నయమే మరి కొంచెం అవతల నాలుగు వందల పదిహేను మీటర్ల టన్నెలొకటుంది. అందులోనూ లేదు. అంటే రెండు ఫర్లాంగుల మేర అందులోంచి మనుషులు కటికచీకటిలో అంతా రాతిగాలిపీలుస్తూ వెళ్ళాలన్నమాట"

"రాతిగాలే కదా. అందువల్ల ప్రమాదమేమీ లేదుగా."

"జియాలజీ చదివావు కనక నువ్వలాగే అంటావు. కాని, ఆ సొరంగం నిర్మాణం జరిగిన నాటినుంచి నేటివరకు- అంటే అయిదేళ్ళపాటు... ఆ రెండు ఫర్లాంగుల మేర ఏర్పరచిన నేలమీద ఒక్క చుక్క అయినా నీరు పడలేదు. నీరుపడిన నేలమీంచి వచ్చే అరోమా— స్మెల్లాఫ్ ది సాయిల్.... తియ్యగా ఉంటుంది కదా. ఆ తీపి అక్కడ వుండదు."

"అయ్యా బాబోయ్. ఏమిటా చప్పుడు. మన ముందునుంచి రైలుగానీ వస్తోందేమిటి, కొంపదీసి— అయ్యో ఇక్కడ చిక్కుపడిపోయామే ఎలాగ?"

"ఏం పరవాలేదు జోతీ; రైలొస్తే మంచిదే, కొంత లైటింగ్ వస్తుంది."

"లైటింగ్ వెనకనుంచొస్తే బావుండును. ముందునుంచి కళ్ళలోపడి ఒకటే గ్లేర్— ఎదరేముందో కనబడి చావటంలేదు."

"గాభరాపడకు.... నువ్వు ఆ బండమీదికెక్కు. నేనిటువేపు ఈ బండ మీదికెక్కిపోతాను— ఊ, త్వరగా!.... అమ్మయ్య, నుంచునేవుండు. రాతి వైపు వంగో; అంతేగాని రైలువేపు వంగకు.... తెల్సిందా? ఓ. కే....సీయూ"

ఆ రైలు పూర్తిగా వెళ్ళిపోయేలోగా భయంకరమైన ఒంటరితనం అనుభవించింది జోతి. బాలాజీ కూడా ఈ బండమీదికే ఎందుకెక్కేడు కాదు!.... ప్రాణంలేని నల్లటి ఏడు వ్యాగన్లు డబ్‌డబ్‌మని ఫన్ ఫన్ మని వికారంగా చప్పుళ్ళుచేస్తూ చివర్ని వున్న పాసింజరు బోగీలోంచి ఎవరో తనని చూసి ఏదో

పాటలాంటి అరుపు.... గార్డు అనుమానంగా చూసినట్టయింది— వెనకాలవున్న ఇంజన్‌లోంచి తెల్లపాంటూ, ఎర్రచొక్కా. తెల్లటోపీ ధరించిన నడికారు మనిషి మాత్రం "టాటా" చెప్పేడు. "ఇద్దరం కలిసి ఒకే దగ్గిర నిలబడుంటే యెంత బావుండేదో" అనుకుంది జోతి.

మళ్ళా భయంకరమైన చీకటి—

బాలాజీ ఒక్క చెయ్యే అందించాడు. తడుముకుని రెండో చెయ్యి అందుకుని, చంటిపిల్లలా అతన్ని కరుచుకుంది; ఆర్థియాలజీతో మాస్టర్ డిగ్రీకి చదువుతున్న మిస్ జోతి పవన్‌కుమార్ చౌధురి. "గొప్పగా వుంది. బాలాజీ! క్వయిట్ థ్రిల్లింగ్!"

"అవును, థ్రిల్లింగే, ఇంకా అప్పుడే ఏం చూశావు? అని. కౌగిట్లోంచి ఆమెని ట్రాక్ మీదికి మధ్యగా దింపుతూ అన్నాడు బాలాజీ" కొంచెం త్వరగా నడు నీకో పూంచి అద్భుతం చూపిస్తాను!" అని, ఇంతసేపూ నడిచిన వేగానికి నాలుగింతలుండే వేగంతో జోతి చెయ్యి పట్టుకుని పరుగెత్తించాడు.

బాలాజీ చెప్పేడు కనక అది అద్భుతమే అయ్యుంటుందన్న నమ్మకంతో ఉత్కంఠ పెంచుకుని. జోరుగా, తన్నుకుంటున్న రాళ్ళను లెక్కయినా పెట్టకుండా నడిచి సొరంగం దాటేసి. అక్కడ లెవెల్ రాయి ఒకటుంటే దానిమీద కూర్చుండి పోయిందిజోతి, ఆయాసంతో రొప్పుతూ.

"అటుచూ, డటు చూడు!"

ఆ వేలికి తిన్నగా ఒక పెద్ద రైలు, ఎదురుగా పరుచుకుని వున్న కొండ స్లోపు మీదుగా, ఇప్పుడు వెళ్ళిన రైలుకి అభిముఖ దిశలో పరుగెడుతోంది.

"ఆ లైన్ ఎక్కడికి వెడుతోంది మరి?"

"అదే, నేను చూపిస్తానన్న అద్భుతం... ఆ రైలూ, ఇప్పుడు మనం టన్నెల్లో ఉండగా ఇటువేపు వెళ్ళిన రైలూ ఒక్కటే ఆ లైనూ ఈ లైనూ ఒక్కటే. అంటే ఈ సొరంగం గుండా. 'ఎస్' ఆకారంగల ఈ కొండని కొంత దాటి, అక్కడ సొరంగం తవ్వడం కూడా అసాధ్యం అయినందువల్ల మళ్ళా స్లోపు మీద వెడుతోందన్న మాట. రైలు. అర్థమైందా?

అర్థం కాకపోయేదే.... కాని ఆఖర్న వున్న ఇంజన్‌లోంచి ఇందాక తనకి "టాటా" చెప్పిన తెల్ల ప్యాంటూ ఎర్రచొక్కా టోపీ-దానికి ముందు గార్డు పెట్టె-దానికి ముందు పాసింజర్ బోగీ.... ....

మైమరచి, ఎవ్వరూ రైలే చూడని దాన్లా అలా చూస్తూ కూర్చుండి పోయింది జోతి.

చూసింది రైలే అయినా స్మృతి పథంలో మెదిలినవి మాత్రం మానవుడు నిర్మించిన ఈ మహత్తరమైన రైల్వే లైను, ఈ లైన్ సందర్శనంద్వారా తన కిప్పటిదాకా కనబడ్డ చిత్ర విచిత్ర ఆశ్చర్యకర అద్భుత రమణీయ కమనీయ మనోజ్ఞ సుందర దృశ్యాలే.

చూపును అక్కణ్ణుంచిక్కడికి తెచ్చేలోగా, ఒకే కొండ తాలూకు రెండు ముఖాలైన ఆ స్లోపుకీ ఈ స్లోపుకీ మధ్య, విశాలంగా లోతుగా అద్భుతంగా వున్న లోయ కనబడ్డది. ఎంత విశాలమది? అక్కడ బరువయిన రైలు ఇనుప పట్టాలమీద ఆ వేగంతో నడుస్తూఉన్నా ఇక్కడికి అంత తక్కువ చప్పుడు విని పించేటంత!....ఎంత లోతు? దాదాపు అరవయ్యి, డెబ్బయి అడుగుల ఎత్తుండే తాటి, యూకలిప్టస్. ఈత ఓకు చెట్ల తలలన్నీ గజిబిజిగా; యూనివర్శిటీ లేడీస్ హాస్టల్ పై డాబా మీదినుంచి చూసినప్పుడు పక్కని సర్ బి.ఎన్. శర్మ గార్డెన్స్‌లో మిగిలిపోయిన ఖాళీ స్థలాల్లో పిచ్చిగా పెరిగిన పచ్చిగడ్డి మొక్కల్లా కనిపించినంత! మరి ఎంత అద్భుతం, అంటే, దానికి పరిమితీ అవధీ లేదేమో అనిపించేటంత!

"పద ఆ వంతెన చూద్దాం."

"ఊహూ. కాసేపిక్కడ కూర్చుని వెడదాం." అంది జోతి.

"రెండు లెవెల్ పోస్టులు ఒక దగ్గర వెయ్యరు. మరి నేనెక్కడ కూచోను?"

"మీరూ దీని మీదనే నా పక్కన కూర్చోండి."

చాల్లేదు, స్థలం.

"వెలుతురు ఇంకెంతో సేపుండదు. ఇక్కడ పడమటి సూర్యుడికీ తూర్పు కనుమలు అడ్డొచ్చి అయిదున్నరకే వెల్తురు మాసిపోతుంది .... నీకు వంతెన చూడాలనుంటే వెంటనే బయల్దేరు....లేకపోతే వెనక్కి పోదాం."

"అదేం కుదరదు" అని తొక్కి వదిలిన స్ప్రింగులా లేచింది జోతి. సొరంగం బయట ఉన్న రైల్ ట్రాక్ ప్రక్కని సన్నటి కాలిదారిగుండా ఒక అర్థకిలో మీటర్ నడిచారిద్దరూనూ." ఇంకా యెక్కడ మీరు చెప్పిన బ్రిడ్జి? అని నాలుగైదు సార్లడిగింది. "ఏం నడవలేక పోతున్నావా" .... "ఇదిగో

వచ్చేశాం...."...."ఆ ఓక్ చెట్లు కనబడుతున్నాయి చూడూ, అక్కడ!" ....అంత అద్భుతమైన వంతెన కాదనిపించవచ్చుగాని చాలా రోజులు గుర్తుండి పోతుందా దృశ్యం"....ఇలా చెప్పుకొని తీసుకొచ్చాడు బాలాజీ, వెనక నడుస్తున్న జోతిని.

కాలిదారిమీంచి రైల్ట్రాక్ ఎక్కాడు బాలాజీ. "జాగ్రత్తగా అడుగెయ్యి"

ఒకసారి దిగువకి చూడు, ఆ స్లీపర్లమధ్య ఖాళీలోంచి!" అన్నాడు బాలాజీ.

కళ్ళు తిరిగాయి జోతికి. "బాప్‌రే" అని అడుగు వెనక్కివేసి బాలాజీని పెనవేసుకుంది. అతను నెమ్మదిగా విడిపించుకుని "ఎలావుంది?" అన్నాడు చిరునవ్వుతో.

"అద్భుతం అన్నాదు మీదు. అన్యాయం. ఇది భయంకరంగా వుంది!"

ఈమాటు తనే అతన్ని పట్టుకుని వొంగి తొంగి చూసింది జోతి అక్కడ ఆ"కింద ప్రవాహం ఏమిటి? ఒక గీతలా వుంది; ఉందాలేదా అన్నట్టు!" అంది.

"తెల్లగా నురుగుంది, చూడు."

"ఔను,"

"తెల్లనివన్నీ పాలుకావు." నవ్వి, ఆమెని అక్కణ్నుంచి తప్పించాడు. "అట్టేసేపు చూడకు; కళ్ళు తిరుగుతాయి.

జోతికి కళ్ళు తిరగలేదు. ఆనందంతో చెమ్మగిల్లాయి. అంతే.

"ఆ నీళ్ళు పారేచోట నీటిజాలు వెడల్పు రెండుమీటర్లు.... నువ్వు గీతలా ఉందన్నావే. ఆ గీత వెడల్పు ఆరడుగులు! అక్కడ ప్రవాహాన్ని తాత్కాలికంగా ఆపి; దానికింద నాలుగు మీటర్ల పునాది తీసి, ముందుగా పోత పోసి ఉంచుకున్న ఉక్కు స్తంభాన్ని దాంట్లో నిలబెట్టేరు. ఆ స్తంభం పొడుగు; అంటే ఈ వంతెన ఎత్తు - నూటతొంభై రెండు అడుగులు. కనకనే ఆరడుగుల వెడల్పుగల నీటిజాలు నీకో సన్నటి గీతలా కనబడుతోంది."

"ఇదంతా జపాన్‌దేశపు ఇంజనీర్లు కట్టిందేగా."

"అదే, మన దౌర్భాగ్యం. ఏమాత్రం బాగున్నా అదేదో విదేశీ మహిమ అయ్యుంటుందనీ, ఏమాత్రం అపకారం జరిగినా అందులో విదేశీహస్తం వుందని అనెయ్యడం! .... .... సరిగ్గా ఇక్కడ యిమడక పోవచ్చుననుకో; అయినా ఇలాంటిదే ఒక జోకు చెప్తాను—ఆమధ్య ఒక సమాచార శాఖ ఉన్నతాధికారిణి

పుష్కరాల సీజన్‌లో ధవళేశ్వరానికొచ్చి ఆనకట్ట, కాలవల సిస్టమ్స్ చూసి బావున్నాయని తెగ మెచ్చుకోగా; అక్కడ స్థానిక అధికారి ఒకరు అదంతా కాటన్ దొరగారి చలవ అని విన్నవించుకోడం జరిగింది. దాంతో ఆ ఉన్నతాధికారిణి, "కాటనా? ఎవరాయన? ఇక్కడ కలెక్టర్ చేశాడా?" అని అడగడంతో చుట్టూ ఉన్న వాళ్ళకి మతులు పోయినంత పనైంది. ఆ "సమాచార" అధికారిణి చాలా కాలం టీచరుగా పనిచేసి, డి.ఇ.ఓ అయి, ఇంకా గొప్ప ప్రమోషన్ తెచ్చుకునీ కూడా "కాటన్"గారి పేరూ వివరం ఎన్నడూ వినలేదని రుజువైంది. అంటే ఏమిటన్న మాట, ఆంధ్రుల్లో కొందరు సర్ ఆర్థర్ కాటన్ ఎవరో, చార్లెస్ ఫిలిప్ బ్రౌనెవరో, ఆఖరికి మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారెవరో గుర్తుపెట్టుకోక పోయినా ఎంతో ఉన్నతాధికారాలు నిర్వహించగల గుండె నిబ్బరం కల వాళ్ళయి పోతున్నారన్నమాట"

హఠాత్తుగా అతని వాక్ప్రవాహం ఆగిపోయింది.... వంతెన అవతలి వైపునుంచి గర్ మని చప్పుడు వినపడింది. "భలే. ఏం అదృష్టం." అన్నాడు. జోతిని ట్రాక్ మీంచి దింపాడు.

"ఏంటది?"

"ట్రాలీ. అందులో లిఫ్ట్ అడిగి, మనం రైలెక్కవలసిన స్టేషన్‌కి వెళ్ళి పోదాం."

o o o

దుర్భరమైన చలిని కేవలం డిపార్ట్‌మెంటల్ కబుర్లతో గడిపారు, జోతీ బాలాజీ. రైల్వే స్టేషన్‌కి సుమారు రెండు వందల అడుగుల దిగువన ఉన్న గ్రామానికి వెళ్ళి; ఉడికించిన పెండలందుంపలూ, కొర్రన్నంతిని, మేకపాలు తాగి; అర్ధరాత్రి వరకు స్టేషన్‌లో రైలుకోసం చూస్తూ గడిపారు. అతి కష్టం మీద రాత్రి పదిగంటలు దాటాక స్టేషన్ వరండాలోంచి లోపలికి ప్రవేశం సంపాదించారు.

"కిరండూల్" నుంచి ఇనుప ఖనిజం మోసుకొచ్చిన గుడ్స్ రైలు రాత్రి ఒంటి గంటన్నర కొచ్చింది ఆ స్టేషన్‌కి. అందులో ఉన్న ఒక్క పాసింజర్ బోగీలోను కిక్కిరిసి ఉన్నారు జనం. అయినా అందులో వొక బెంగాలీ కుటుంబం ఉన్నట్టు పసిగట్టి బాలాజీ, "వాళ్ళతో మీ భాష మాట్లాడు" అని మోచేత్తో పొడిచాడు జోతిని. "పని జరగొచ్చు. మనక్కావలసింది వొక్కసీటే.. మీవాళ్ళకి భాషాభిమానం మహామెండు కదా." అంటూ జోతి అతనిని కొట్టబోయి నట్టు చేతులడ్డం పెట్టుకున్నాడు.

ఏమైతేనేం, మాట పనిచేసింది. భాష మేలు చేసి పెట్టింది కూడానూ.

ం ం ం

ఉదయం ఏడు గంటలకి వాల్తేరు 'మార్షలింగ్ యార్డ్' దగ్గిర రైలు ఆగింది. జోతీ, బాలాజీ రైలు దిగి. "మద్రిపాలెం" బస్‌స్టాప్ కొచ్చి, ఇరవై తొమ్మిదో నెంబరు సిటీ బస్ వచ్చేలోగా 'డొక్కు టీ' తాగి, బస్‌లో వచ్చి కృష్ణచైతన్య మఠం దగ్గిర దిగారు.

"ఈ ట్రిప్పులో చాలా కష్టపడుంటావు. కాని బాగా ఎంజాయ్ చేసుంటావని కూడా అనుకుంటాను." అన్నాడు బాలాజీ. కెమెరా సంచి అందిస్తూ.

"ఆ మాట వేరే చెప్పాలా? ఎంతో శ్రమ పడ్డాం, నిజమే. అయినా ఎంత సాధించాం!... ఏమాత్రం అలసటా విచారంలేవు నాకు. థాంక్యూ వెరి వెరి మచ్.... మరి, ఈ రెండు రోల్సులో ఫిలిం లన్నీ అర్జంటుగా దెవలపింగు ప్రింటింగు చేయించాలి. ఈ జ్ఞాపకాలు తలలోంచి చెదిరిపోకుండా నోట్సు రాసేసుకోవాలి.... సాయంకాలాని కల్లా తెచ్చి ఇచ్చేస్తారుగా?"

* * *

స్నానం చేసి బట్టలు మార్చుకుందో లేదో, వార్డెన్ నుంచి కబురొచ్చింది. "మీ నాన్నగారొచ్చారు. హాస్టల్ ఆఫీస్ రూమ్‌లో నీకోసం చూస్తూ కూర్చున్నారు. అర్జంటుగా రా" అని.

అప్రయత్నంగా టైమ్ చూసుకుంది జోతి. ఎనిమిదీ నలభై. కాసేపు ఆలస్యమైతే మెస్‌లో టిఫినుండదు. ఈ ఆదివారం క్లాసులేమీ లేవు. అంచేత రాత్రి తీరని నిద్రా నిన్నటి అలసటా ఈ పూట తీర్చుకుందా మనుకుంది.

నాన్నగారొస్తె కారు ఉంటుంది. ఊళ్ళో ఆయన పలకరించగల బెంగాలీ మిత్రులు అయిదారుమంది ఉంటారు. వాళ్ళందరి ఇళ్ళకీ తీసికెడతాడు. ఎక్కడో "బ్రేక్‌ఫాస్ట్". మరెక్కడో "లంచ్". మధ్యలో ధారాపాతంగా 'టీ'లు. 'సనేన్‌సీ' హోటలు దగ్గిర 'ఈస్ట్ పాయింట్ గెస్ట్‌హౌస్'లో దిగుతారు. ఆఖర్న అక్కడికి చేరాలి. అప్పుడు తనవి నిజంగా నిండుగా పలకరిస్తాడు. "మరేంటి సంగతులు జోతీ డాళింగ్" అంటూనూ. డాడీకి చాదస్తం. వాల్తేర్ ఇనస్పెక్షన్ కొస్తె ఇరవై నాలుగు గంటలకి మించి ఎన్నడూ ఉండడు, కాని ఆయన వెళ్ళే చోటికల్లా తనూ వెళ్ళవలసిందే.

"కమాన్, జోతి డాళింగ్. ఎలా వున్నావు?"

తండ్రి దగ్గిర చేరి ఆయన కూర్చున్న కుర్చీ చేతిమీద ఆనుకుని బుగ్గ మీద ముద్దు పెట్టింది జోతి. "ఫైన్. డాడీ. ఎప్పుడు దిగావు?"

"నిన్న మెయిల్లో—"

గుండెలో రాయి పడింది జోతికి. ఒక్కసారిగా లేచి నిలబడి, బెదిరించి నట్టు వేలు చూపించి, "మరి....?" అని, కోపమో భయమో తెలీకుండా కళ్ళు పెద్దవి చేసి చూసింది.

"చాలా బిజీగా వున్నాను. నిన్నంతా. ఫర్గివ్ మి డార్లింగ్....నిజానికి ఇవాళ నిన్ను చూడకుండా ఉండలేక వచ్చేశాను.... సరే; మనకెంతో టైమ్‌లేదు. నువ్వు వెంటనే బయల్దేరాలి. నిన్నొక మంచి ఎక్స్‌కర్షన్ స్పాట్‌కి తీసికెడతాను. మనం ఈ రాత్రికి వై జాగ్ రాలేక పోవచ్చు. వచ్చినా ఏ పదకొండో.పన్నెండు గంటలో అయిపోవచ్చు....సరాసరి గెస్టుహౌస్ కెళ్తాం....సో—ఓ జతబట్టలూ, అత్యవసరమైన వస్తువులూ చిన్నపెట్టెలోనో బ్యాగ్‌లోనో వేసుకుని రా. మూణ్ణిమిషాల్లో రావాలి!"

జోతి, తను చాలా అలసిపోయివున్నాననీ, రాలేననీ చెబుదామని మాటల కోసం వెతుక్కుంది. వెర్రి అభిమానం డాడీ. ఎలాంటి ప్రతిమిలాట పెట్టినా అంతకి మించిన ముద్దుచేసీ మొహమాట పెట్టీ లాక్కుపోతాడు....

0 0 0

కార్లోనే ఉద్యోగ ధర్మం మొదలుపెట్టాడు, పవన్‌కుమార్ చౌధురి.

ముందు సీట్లో కూర్చున్న డిప్యూటీ ఛీఫ్ ఇంజినీరు. ఇతను ప్రశ్న ఏదైనా అడిగినప్పుడల్లా ఇటువేపు తలతిప్పి సమాధానాలు చెబుతున్నాడు. అలా, నిద్రలోకి జారుకుంది జోతి.

హఠాత్తుగా "లే. డార్లింగ్" అన్న తండ్రి మాటకి మెలకువ వచ్చింది. "ఇక్కణ్నుంచి మనం జీపులో వెళ్ళాలి!"

చుట్టూ చూసింది జోతి, కారు దిగి. అన్నీ కొండలు. చలిగా ఉంది. స్వెట్టరు, మఫ్లరూ, బ్రీఫ్‌కేసులోంచి లాగి ధరించింది.

జీపులో ముందు సీట్లో మధ్యని కూర్చుని "ఎక్కడున్నాం డాడీ. మనం?" అనడిగింది. పవన్‌కుమార్ చౌధురి చిరునవ్వు నవ్వాడు. వెనక సీట్లో కూర్చున్న డిప్యూటీ ఛీఫ్ ఇంజినీర్, "తూర్పు కనుమ లంటారే. నాటి తూర్పు అంచున ఉన్నా మమ్మా....మీరు నిద్రపోకండి. మంచి దృశ్యాలు మిస్సయిపోతారు" అన్నాడు.

"ఈ కొండల్లో అద్భుతమైన దృశ్యాలున్నాయి డాడీ."

ం ం ం

వొచ్చింది వేరే దార్లో అయినా, చేరింది నిన్నటి చోటికే కావడం; జోతికి చెప్పలేనంత విస్మయాన్ని కలిగించింది.

ఆ స్టేషన్‌లో రెండు మోటార్ ట్రాలీలు సిద్ధంగా ఉన్నాయి. స్టేషన్ మాస్టరు–నిన్న రాత్రి తనకి స్టేషన్‌రూమ్‌లో ఈజీచేర్ ఇచ్చినాయనే–తనవి చూసేడు కాని; పరిశీలించి "నిన్న టమ్మాయిలా వుందే" అనుకోడానికిగాని అనడానికిగాని కావలసినంత తీరుబాటుగా లేడు. పైగా తన వేషంలో మార్పు. అయినా జోతి "నమస్కారం సార్." అని తెలుగులో చెప్పింది.

"తమరు ఇనస్పెక్షన్ చెయ్యవలసిన ట్రాక్. ఈ స్టేషనుకి ఇటు రెండున్నర కిలోమీటర్లు. అటు ఒకటిన్నర కిలోమీటర్లూ ఉంది సార్. ముందుగా మనం దక్షిణం పైపు వెడతాం సార్, అట్నుంచి ఖాళీ రైలుబండి ఒకటొస్తుంది గానండి. ఇంకో రెండుగంటల వరకు రాదన్సార్. ఇట్నుంచి ఒక లోడ్‌బండి వస్తుంది సార్. అయితే అది మనం యిక్కడికి తిరిగి వచ్చాకనే ఈ స్టేషన్ దాటాలని స్టేషన్ స్టాఫ్‌కి చెప్పాంసార్."

"ఓ. కె"

ట్రాలీలు కదిలాయి. నిన్నటి దృశ్యాలు మళ్ళా కనబడ్డాయి. మనసు ముచ్చట పడ్డా మౌనంగానే చూసింది జోతి టన్నెలు, వంతెన, అన్నీ దాటాక 64 కె. ఎం. అని వున్న ఒక రాయి దగ్గర ఆగాయి. ట్రాలీలు

అక్కడ ట్రాలీదిగి, ట్రాక్‌దిగి, ఫైల్లోంచి ఒక పెద్ద మ్యాప్‌తీసి పట్టుకున్నాడు డిప్యూటీ చీఫ్ ఇంజనీర్, కాగితం అంచులు మరెవరో పట్టుకున్నారు.

"ఇది, మొదట ప్రతిపాదించిన మార్గం సార్. అంటే తొలిసారి సర్వే (పరిశీలన) చేసిన మీదట ఆ ఇంజనీర్ ఇచ్చిన రిపోర్టు ప్రకారం సార్. అప్పుడు డి.ఇ.ఎన్. (డివిజనల్ ఇంజనీర్) రామదాసుగారు శలవులోంచి డ్యూటీకొస్తె ఈ ప్రాజెక్టుకి వేశారు సార్. వార్ని. ఆయన ఈ మార్గాన్ని మళ్ళీ సర్వే చేయించి, మార్చిన మార్గం సార్, అంటే ఇప్పుడు నిర్మాణం అయిపోయి మనం ట్రాలీలమీద వొచ్చినది ఇదిసార్. ఈ రెండూ ఈ ప్లాన్‌లో వేర్వేరు రంగులలో గుర్తుగా చూపించాం, గమనించండి సార్, మొదటి మార్గం కంటె రెండోది ఏడువందల మీటర్లు పొడుగెక్కువ సార్.

మళ్ళా లైను నిర్మాణం అరవై నాలుగో కిలోమీటర్ చేరే వేళకి ఆయన, సుఖంగా హాయిగా ఉండే పనిలో వేరేచోట ఉంటూ కూడా, తనంతట తానుగా అడిగి, ఈ ప్రాజెక్టుకి ట్రాన్స్‌ఫర్ కోరుకున్నివచ్చారుసార్. ఆరవయి నాలుగు నుంచి ఆరవయి ఎనిమిదివరకు ఉన్న ఈ "రీచెస్"లో మామూలుగా అయ్యే ఖర్చుకన్నా సుమారు యాభయివేలు అధికంగా ఖర్చవుతుందని ఎస్టిమేట్లు వేసి ఆమోదం పొంది "బిల్సు" పాస్ చేసేరుసార్. అదిసార్, టూకీగా ఆడిట్ వాళ్ళ రిపోర్టు సారాంశం, ఇక మూడో పాయింటు సార్, విడిగా ట్రాక్ నిర్మాణానికి అయిన ఖర్చులో పెరుగుదల సంగతి అలావుంచి,అదనంగా వొచ్చి పడ్డ స్టేషను, దాని నిమిత్తం శాశ్వతంగా తగులుకొనే ఉద్యోగాలూ, క్వార్టర్సు మొదలయిన పద్దుల ద్వారా నిర్వహణ ఛార్జీలు, ఈ వర్క్ తనే ప్రతిపాదించేసి తనే చేయించడానికి రామదాసుగారు సిద్ధపడ్డం, ఇదంతా చూసి ఇందులో ఆయనకి లాభించేదేదో ఉండితీరాలని సి.బి.ఐ. వారు వేలెత్తి చూపిస్తున్నారు సార్. ఆ తరువాత, డివిజనల్ ఇంజినీర్ రామదాసుగారి మీద డిపార్టుమెంటల్‌గా చర్య తీసుకోమనడం, ఆయన్ని సస్పెన్షన్‌లో పెట్టడం అవన్నీ తమకు తెలిసిన విషయాలే సార్."

పవన్‌కుమార్ చౌధురి అవన్నీ క్షుణ్ణంగా తనికీ చేసేడు....

*                    *                    *

స్టేషన్‌లో పవన్‌కుమార్ చౌధురికీ జోతికీ భోజనాలు ఏర్పాటయ్యాయి. కేరియర్ వాల్తేర్ నుంచి ప్రత్యేకంగా నిర్ణయించిన డీజిల్ ఇంజిన్‌లో వచ్చింది.

"రిపోర్టులూ ప్లానులూ చూస్చూసి విసుగ్గావుంది, అయినా, జోతిడాళింగ్, తప్పదు. మరొక్కసారి. ఈఆడిట్ రిపోర్టు ఆ సి. బి. ఐ. రిపోర్టు అలా చదివి వినిపించమ్మా." అని కూతురికి చెప్పి ఈజీచేర్లో నడుం వాల్చేడు, పవన్ కుమార్ చౌధురి.

o                    o                    o

అంతసేపూ దీక్షగా చదివి, ఆఖరు వాక్యం మొదట్లో తండ్రివైపు చూసింది జోతి.

"నిద్రపోతున్నట్లుంది" —అనుకుంది.

"డాడీ?"

"ఎస్, డాళింగ్! పూర్తిచెయ్. నేను నిద్రపోవడంలేదు."

"అదికాదు. మనం విశాఖపట్నం ఎలా వెడతాం? ఒచ్చినదారే. అంటే ముందు జీప్‌లోను, తరవాత కార్లోను. అంతేగా."

"అవును, ఏం?"

"ఎన్నిగంటలకి బయలుదేరుతాం?"

"ఓ సారీ!" లేచి కూర్చున్నాడు చౌధురి, "నీకిదంతా యమ బోరింగ్‌గా ఉండుండాలి... సరే. నా ఇన్స్‌పెక్షన్ అయిపోయిందిగా!.... వెంటనే బయలుదేర దామని చెప్తాను." లేచి నిలబడ్డాడు.

"అదికాదు డాడీ!" జోతికూడా లేచి నించుంది. "నా ఉద్దేశం ఏంటంటే_ మనం యిద్దరం—అంటే జస్టు మనం యిద్దరమే—అలావెళ్ళి ఓ గంటసేపు బయట తిరిగి రావచ్చా? లేకపోతే_నీకూడా వొచ్చిన అధికార్లు మనం వెంటనే వైజాగ్ వెళ్ళిపోవాలని పట్టుపడతారా?"

"లేదు_ లేదు. గంటకాదు. రెండు గంటలైనా సరే, వాళ్ళు మనం తిరి గొచ్చేవరకు ఇక్కడే కాసుక్కూర్చుంటారు. నో ప్రాబ్లెం!"

ం ం ం

"ఈ గుహలు. డాడీ_ఇవి వేలకొలది సంవత్సరాలక్రితం ఏర్పడినవి. అయితే, క్రీస్తుపూర్వం_అదీ మూడు, రెండు శతాబ్దాలమధ్య, ఎవరో వీటిని సంస్కరించి, తత్వవేత్తలకు వాసయోగ్యంగా చేసేరు. బౌద్ధ సంస్కృతి ప్రభావం కళింగరాజ్యం మీద పడినప్పటి శిల్పాలూ కుడ్య చిత్రాలూ సూ ఇవి_ ఇదిగో, ఈ రాతిపలకమీద శిల్పంచూడు. కనపడీ కనపడనట్టుందనుకో. అది బుద్ధుడి మహాభి నిష్క్రమ ణం—" అదిగో అక్కడ బోధివృక్షంలాగా ఎవరో చెక్కారు చూడు! ఇందాక మనం చూసిన గుహలో భిక్షువుల ఆకారాలు, సన్న్యాసం స్వీకరించేటప్పుడు వాళ్ళు అవలంబించవలసిన విధులూ, సూచనా మాత్రంగా శిల్పాల్లో మలచారు చూశావుగా,"

"ఎస్. ఎస్. నువ్వు చూపించకపోతే ఇవన్నీ చూడకనే పోదును.... అయినా నువ్వు చూపించడంలో వింత ఏముంది? నీ చదువే ఇది కదా."

"ఇవి ఇక్కడ వుండి పోయినవి. అయితే బౌద్ధమతం వ్యాప్తిలో పరిణతిలో వున్న కాలంలోవివి. కొన్ని అవశేషాలు ఇక్కణ్ణుంచి తీసుకుపోయి నేషనల్ మ్యూజియంలో భద్రపరచారట తెలుసా?"

ఐతే, మీ వాళ్ళు రైల్వేలైను ఈ గుహలున్న చోటిని తాకకుండా

ఎక్కడో దూరం నుంచి పోయే విధంగా వేసేసిఉంటే; అత్యంత పురాతత్వ ప్రాముఖ్యం గల ఈ స్థలం; అటు రోడ్డుద్వారా అందుబాటులో ఉండక; ఇటు రైలుద్వారా కూడా చేరలేక మరుగున ఉండిపోయి ఉండేది! ఈ రైలుమార్గం ఎలా వెళ్ళాలి అనే విషయం మీద రెండోసారి సర్వే చేయించి నాయన (డివిజనల్ ఇంజినీరు రామదాసో ఎవరో అన్నారు, ఇందాక.) ఈ స్థలాన్ని రైలుద్వారా చేరడానికి తగిన వీలు కల్పించి, ఇక్కడ ఒక స్టేషనుకూడా పెట్టించాడు. ఈ రైల్వేలైను రాకపూర్వం గుహలు చూడ్డానికొచ్చే యాత్రికులు కొండమార్గం గుండా, బండలమీదినుంచి, తుప్పల్లోంచి నడచి, ఈ ఎత్తుకిచేరి, ఇక్కణ్ణుంచి దేకురుకుంటూ, జారుకుంటూ, పడిపోతూ దిగేవాళ్ళు, మళ్ళా ఎక్కేటప్పుడు అంతకి అంతా బాధపడే వాళ్ళేమో కూడాను. ఇప్పుడు ఈ రైల్వేలైను నిర్మాణం పుణ్యమా అని. రైలుగట్టునుంచి గుహలవరకూ, మిట్ట పల్లాలకీ పక్కని గ్రానైటు రాయితో, సిమెంటుతో మెట్లు, వాటిమీద నడిచేవాళ్ళు పరధ్యానంగా ఉన్నప్పుడు తూలిపడిపోకుండా పక్కన స్టీలు రెయిలింగ్సు ఏర్పాటు చేశారు.ఆ రెయిలింగ్స్‌లో కొన్ని, ట్రాక్ నిర్మాణం కోసం వుపయోగించే పట్టాలు-ఇక్కడికి తీసుకొచ్చేలోగా వంగిపోయినవీ వాడారు. అవన్నీ నువ్వు కళ్ళారాచూశావు. మరొక్క విషయం డాడీ, ఆ గుహల్లోపల, రాతితోబాటు, బోలెడు ఖనిజ సంబంధమైన మట్టివుంది.అది వాతావరణ ప్రభావానికి కరిగిపోయి, కారిపోడానికి ఆస్కారం వుండేటట్టిది, ఇన్ని శతాబ్దాలనుంచీ అలాగే కరిగీ, రాలిపోతోంది కూడాను, అయితే, నేల అలాంటికోత పడిపోకుండా సిమెంటుతో అడ్డుకట్టి, వాననీళ్ళు వాటంతటవే జారిపోడానికి వీలుగా తూములు కట్టారు. ఆ విధంగా అపురూపమైన ఈ పురాతత్వ సంపదని కాపాడారు మీ రైల్వేవారు. దానికి పురాతత్వశాఖ విద్యార్థినిగా నా అభినందనలు డాడీ."

ఒకసారి కళ్ళు మూసుకుని. పాశ్చాత్య పద్ధతిలో వంగి, "థ్యాంక్యూ మై చైల్డ్" అన్నాడు పవన్‌కుమార్ చౌధురి.

"నా అనుమానం ఏమిటంటే ఆ ఇంజినీర్ రామదాసుగారెవరో, కేవలం రైల్వే ఇంజినీర్‌గా కాకుండా, పురాతత్వ ప్రాముఖ్యంగల ఈ గుహలను దేశీయ విదేశీయ యాత్రికులు సందర్శించడానికి వీలు కల్పించే సంస్కారిగా, యివన్నీ ఏర్పాటుచేసి, మనదేశమే స్వయంగా అమర్చవలసిన కనీస సౌకర్యాలు తానే ఒక ప్రతినిధి అయి సమకూర్చాడేమోననీ. అంచేత అతను చాలా గొప్ప

వాడనీనూ. అందువల్ల రైల్వేకి కొంత ఖర్చు తగిలించుండొచ్చు. కాని ఆ ఖర్చును భరించవలసిన బాధ్యత ఈ దేశానికి వుంది. దేశ ప్రభుత్వంలో ఒక శాఖ అయిన రైల్వేకి కూడా వుందేమో, అది నువ్వు తేల్చాలి డాడీ."

"ఆపు." కోపంతో వూగిపోయి అరిచాడు పవన్‌కుమార్ చౌధురి. అంతలోనే తాను మాట్లాడుతున్నది ఎవరితోనో గుర్తొచ్చినట్లు, "క్షమించు చిన్నారీ, నువ్వు చెప్పినదంతా నిజమే కావొచ్చు. అతను నిజంగా గొప్పపనే చేసుండొచ్చు. మంచి దేశభక్తుడే కావొచ్చు, కాని, జోతీ డార్లింగ్, ఈ లోకంలో గాడిదపని గాడిదే చెయ్యాలి, కుక్కపని కుక్కే చెయ్యాలి! అంచేత, మనం విస్సహాయులం అమ్మా."

0 0 0

మర్నాటి వుదయం ఈస్ట్‌పాయింట్ గెస్టు హౌస్‌లో జోతికి ఆరు గంటలకే తెల్లవారింది: టెలిఫోన్ పిలుపుతో, తండ్రిని సరిగ్గా ఏడు గంటలకి లేపింది. అతనికి అలవాటయిన విధంగా వెంటనే "టీ" ఇచ్చింది.

"గుడ్మార్నింగ్ డాడీ: టీ!"

"థ్యాంక్యు"

"నన్ను క్షమించు డాడీ. నీ బాధ్యతల్ని గుర్తించకుండా నిన్న: నీ పరిపాలనలో వేలుపెట్ట బోయానేమో!"

"ఓ—అలాంటిదేం లేదు."

"సరే. రామదాసుని బందిఖానాకి పంపుతావో, ఆయన ఉద్యోగం ఊడపీకుతావో అది నీ యిష్టం. నాదొక ప్రాబ్లెం ఉంది. నువ్వు వినాలి."

"చెప్పు డార్లింగ్. నువ్వు చెప్పింది నేనెప్పుడైనా విన్లేదు కనకా?"

"వింటావు కనకే చెప్తున్నాను—నాకొక గురువుగారు దొరికారు. ఆయన్ని పరిచయం చెయ్యనిస్తావా?—నిజానికి ఆయన్ని పరిచయం చెయ్యాలని ఆరు నెలల కిందట నువ్వు వచ్చినప్పుడే అనుకున్నాను. కాని నీ క్యాంప్ తేదీకి ముందు రోజునే అతను ఉద్యోగం కోసం ఢిల్లీకి ఇంటర్వ్యూ కెళ్ళవలసి వచ్చింది."

"ఎవరతను? మీ ప్రొఫెసరా?"

"కాదు. నేను గురువుగారన్నానని ఆయనేదో పెద్ద వయసు వారని అనుకోకు. అతని పేరు బాలాజీ. నాకంటె మూడేళ్ళు ముందుగా ఆర్కియాలజీలో

మాస్టర్ డిగ్రీ తీసుకొని, మొన్నీ మధ్యే డాక్టరేట్ డిగ్రీ కూడా తీసుకుని ఖాళీగా వున్నారు. చాలా తెలివిగల వారు. (ఛార్మింగ్‌గా ఉంటారు కూడానూ!) యు మేకాల్ హిం ఎ బాయ్‌ఫ్రెండ్; కాని ఆరకం హాట్ టైప్‌కాదు. నేనిక్కడ చేరింది మొదలు నాకు నోట్సులు, డైరెక్షన్లు యిస్తున్నాడు. ఈ అయిదారు జిల్లాలల్లో పురాతత్త్వ శాస్త్ర దృష్ట్యా గొప్పవీ, ముఖ్యమైనవీ అయిన ప్రదేశాలన్నీ కూడా నాకు స్వయంగా సాయంవొచ్చి చూపించేరు. అతని వల్ల నేను పొందిన జ్ఞానం యింతా అని చెప్పడానికి లేదు. మేం తిరిగిన ప్రదేశాలు, అక్కడ సంస్కృతీ చూసి, ఈ దేశ సంస్కృతి తాలూకు కొన్ని ముఖ్య అధ్యాయాలు ఆయన పరిచయం కాకపోతే తెలుసుకోలేక పోదునే అనిపిస్తుంది, ఇటు సింహాచలం, శాలిహుండం, శ్రీకూర్మం, ముఖలింగంనుంచి అటు వుండపల్లి, ఫిరంగిపురం, నాగార్జునకొండ వరకూ అలా చాలా వున్నాయి. అవన్నీ నాకు చూపించి ఎప్పటికప్పుడు నోట్స్ రాయించి, ఫోటోలు డెవలపింగూ ప్రింటింగూ చేయించి, ఈ చివరి పరీక్షలు రాయగానే ఒక పుస్తకం రాయడానికి తగినంత మేటర్ సమకూర్చి పెట్టారు బాలాజీ. నిజానికి నిన్న మనం చూసిన గుహలు ఆయనతోనే నేను తొలిసారిగా చూశాను. అదీ ఎప్పుడో కాదు; సరిగ్గా ఒక్క రోజు ముందు, అంటే మొన్న—శనివారం....! అక్కడ నేను తీసిన ఫోటోలు నిన్నంతా కూర్చుని (పాపం ఆదివారం, ఎవర్నో ఆశ్రయించి) డెవలప్ చేయించి, ప్రింట్లు తీయించి, అవి నాకిద్దామని నిన్న సాయంకాలం హాస్టల్ కెళ్ళాడట. నేనిక్కడ నీతో వున్నానని తెలిసి, రాత్రి ఇక్కడకీ వొచ్చాడట. మనం ఇక్కడకు చేరేసరికి పదకొండైందిగా. అంచేత కలుసుకోలేక పోయాడు. పొద్దుటే ఫోన్‌చేసి చెప్పాడు. రమ్మన్నాను."

"ఓ. సర్లే. నీ రతనమంటే చాలా అభిమానంలావుంది. రానీ, చూద్దాం. తప్పేముంది?"

"అతన్ని చూడ్డం కాదుడాడీ. అతనికి ఎక్కడేనా ఓ మంచి ఉద్యోగం చూస్తావని కదా ఇదంతా నీకు చెప్పడం?"

○ ○ ○

రెండు చేతులూ జోడించి నమస్కారం చేసేడు బాలాజీ. పవన్‌కుమార్

చౌధురికి. "గుడ్‌మార్నింగ్ జోతి. ఇవిగో ఫోటోలు, కాంటాక్ట్ ప్రింట్స్ మాత్రం."

"కూర్చోండి' మిస్టర్ బాలాజీ.... ఆయనకి టీ ఇయ్యమ్మా జోతీ" అన్నాడు. పవన్‌కుమార్ చౌదరి.

"నో, థ్యాంక్స్ సర్, అదిసరే-జోతీ ఈయన మీ ఫాదరా?"

చిన్నగా నవ్వింది జోతి. "అవునూ" అని పాటలా అంది.

"ఏమిటి, సందేహం?" నవ్వాడు. చౌధురి.

"సారీ సర్! నాతో పరిచయం అయినప్పట్నుంచి జోతి తన తండ్రిగారు కల్కటాలో ఏదో వ్యాపారం చేస్తారని చెబుతూంది." నవ్వాడు బాలాజీ. ఈ రైల్వే గెస్ట్‌హౌస్‌లో గదులు వ్యాపారస్తులకి యివ్వరని నా అనుమానం....మీ పేరు చెప్పి మీరే సూట్‌లో వున్నారని అడిగితే మీ ఉద్యోగం హోదా చెప్పాడు వాచ్‌మేన్. చాలా ఆశ్చర్యపడ్డాడు."

"యు వార్ రైట్. యంగ్మాన్," అని నవ్వి, మరీ ఎక్కువ నవ్వితే బాగుండదన్నట్టు. ఆ నవ్వు పట్టుకుని బాత్‌రూం వేపు వెళ్ళాడు. పవన్‌కుమార్ చౌధురి.

"అలా ఎందుకు చెప్పావు జోతీ, ఐమ్ సారీ."

"సారీ అనవలసింది నేను బాలాజీ. ... తను అంత పెద్ద అధికారి అని చేస్తే ఎన్నో చిక్కులున్నాయని డాడీయే అలా చెప్పమన్నారు— డాడీ యీ వూరికి ఏడాదికి రెండు మూడు సార్లు క్యాంప్ వస్తారు —ప్రతీసారి వచ్చినప్పుడే మీ గురించి చెప్పి, ఆయన ఏమైనా ఇంప్రెస్ అయితే అప్పుడు మీకు చెబుదామనుకున్నాను. మీలా ట్రైనులో ఢిల్లీ వెళ్ళారు —ఇంకో తమాషా చెప్పనా? —మనం శనివారం వెళ్ళిన నోటికే ఆ గుహల దగ్గరకే. నిన్న, నేను మా డాడీతో, మరికొందరు ఇంజినీర్స్‌తో వెళ్ళాను." కొంచెం చిన్న బుచ్చుకుని, అది కప్పి పుచ్చుకోడానికి ధోరణి మార్చింది జోతి.

బాలాజీ మొహం ముడిచాడు. "ఆ ట్రైను, గుహలు, సెయిలింగ్స్ మెట్లు, వాటర్ అవుట్ లెట్స్ - అన్నీ ఇన్‌స్పెక్షన్ చేశారా మీ డాడీ?"

"డాడీ పూరికే ట్రాక్ చూసి బాలించు కున్నారు. నేనే ఆయన్ని విడిగా తీసుకెళ్ళి పురాతత్త్వ ప్రాముఖ్యమున్న ఆ స్థలాలన్నీ చూపించేను.ఆప్కోర్సు! ఆ విషయంలో డాడీకీ నాకూ అభిప్రాయ భేదంవొచ్చిందనుకో-నిన్నట్నించీ ఇవాళ తెల్లారే వరకూ నాకు డాడీ మీద కోపం వచ్చి మట్లాడం మానేశాను. ఆయనకు ఆ అభిరుచి లేక పోతే నన్ను ఆర్కి-యాలజీ చదవ మనడం దేనికి?"

బాలాజీ కదేమీ పట్టలేదు. "సరే. అయితే-ఇంజనీర్ని ఏం చేస్తున్నారు!"

"——— డిస్మిస్ చెయ్యొచ్చు. డాడీ మాత్రం ఏంచేస్తారు?వాతావరణం అంతా అతనికి ప్రతికూలంగా ఉంది పాపం. అదీ కాత ఆభిరుచి పేప-బాధ్యత వేరూ కదా."

"అలాగా" అన్నాడు బాలాజీ.

చౌధురి బాత్‌రూం లోంచి వచ్చాడు.

బాలాజీ నిలబడ్డాడు. మొహాన చిరునవ్వు ఉందా లేదా అన్నట్టు.

"ఐయాం సారీ సార్. ఈ ఫోటోలు జోతికి అర్జెంటుగా అందజేద్దామని మీ మకాంకి చొరవచేసి వొచ్చేశాను. అంతే.మీ పన్లకి అడ్డురావడం నా ఉద్దేశం కాదు. సెల విప్పిస్తె వెళ్ళవస్తాను."

"అంత అర్జంటుగా వెళ్ళిపోవాలా?.., కూర్చోండి."

ఇష్టం లేకపోయినా కూర్చున్నాడు. బాలాజీ. జోతి అప్పటికే తను చూడ్డం అయిపోయిన ఫోటోల దొంతర తండ్రి కిచ్చింది.అతను అతను వాటిని తిరగేస్తూ అన్నాడు. "అమ్మాయి చెప్పింది. ఆర్కి-యాలజీ మీద మీ అభిరుచి, అర్హత అన్నీనూ, అమ్మాయికి మీరు చేసిన సాయానికి థాంక్స్. మీకేదైనా ఉద్యోగం చూసిపెట్టమని అమ్మాయి చెప్పింది.అదీ ఓగంట కిందటే. దానిమీద అప్పుడే నేనొక మంచినిర్ణయం తీసుకున్నాను.... మీకు జోతి చెప్పేవుంటుంది.— నాకీ ప్రపంచంలో, జోతి తప్ప వేరే ఏ లౌకికమైన అనుబంధమూ లేదు! సో, జోతి చెప్పింది అంటే నేను చేసి తీరవలసిందే. బోధపడిందా?"

"ఐయాం సారీ సార్....నాకు ఉద్యోగం ఇప్పించగలగడం మీకెంతో

సులభమని నాకూ తెలిసింది. కాని ఆ సహాయం మీనుంచి స్వీకరించలేను సార్, క్షమించండి." అని మళ్ళీ లేచాడు బాలాజీ.

ఏదో శక్తి తనని లాగినట్టు జ్యోతి కూడా లేచింది. అతను వెళ్ళిపోతా డేమో. ఆపాలన్నట్టుగా అతని చెయ్యి పట్టుకుంది. "ఏమిటి బాలాజీ. ఇంత లోనే ఏమొచ్చింది. మీకు?....డాడీతో అలాగేనా, మాట్లాడ్డం? డాడీ మాట ఇచ్చా రంటే....మీరసలు గర్వపడాలి, తెల్సా?" ఉద్వేగంతో అంది జ్యోతి.

జ్యోతి చెయ్యి విడిపించుకున్నాడు బాలాజీ. "ఆయన అధికారం, పలుకుబడి నాకు తెలియక కాదు జ్యోతీ. నిన్ను బాధ పెట్టాలనీ కాదు.... నువ్విందాక అన్నావే బాధ్యత వేరూ, అభిరుచి వేరూ అని; ఆ మాటే చెబుతున్నాను." అన్నాడు.

నిర్ఘాంతపడి చూస్తున్న చౌధురివేపు తిరిగి అన్నాడు. "మమ్మల్ని క్షమించండి సార్. మేం అట్టే బాధ్యతల్లేనివాళ్ళం. కుర్రాళ్ళం. మేం చదువుకున్నది కేవలం వాక్కు విషయమే. దాంతోనే ఇప్పటిదాకా జీవించిన కాలం అంతా వెళ్ళబుచ్చడంవల్ల ఆ విషయంమీద అభిమానం, దురభిమానం కూడా ఏర్పడి వుండొచ్చు. మీ భావాలు అశేషమైన అనుభవాన్ని బట్టీ అనంతమైన బాధ్యతల్ని బట్టీ ఏర్పడినవి. అంచేత మీ ఆలోచనలూ మా అభిప్రాయాలూ వాక్కు త్రాసులో తూగకపోవచ్చు. వాటికి సఖ్య మంతెనదేర్పడ్డానికి వీలుకాకపోవచ్చు. కనుక, నేను మీ మెప్పూ, ప్రాపకం పొందడం సమంజసం కాదు సార్. గుడ్ బై. నుంచున్న పళంగా నాకు ఉపకారం చేద్దామని నిర్ణయించుకున్నందుకు వందనాలు."

వెనక్కి తిరిగి చూడనైనా చూడకుండా వెళ్ళిపోయాడు బాలాజీ. దారం కట్టినట్టు జ్యోతి అతని వెనకే నడిచింది. ఆ దారంమీద పువ్వులున్నాయి. చిక్కుముడులున్నాయి. అతని సత్ప్రవర్తన- నిరుద్యోగం- అర్హత- నిరుత్సాహం- ఉద్యోగాలకి పడే ప్రకటనలు- అప్లికేషన్లూ-వాటితో పంపే బ్యాంక్ డ్రాఫ్టులూ, పోస్టల్ ఆర్డర్లూ- ఇంటర్వ్యూలూ-వాటికోసం అయ్యే రైలు ఖర్చులూ, సావర్లూ- తనకి అతనిమీద పెరిగిన గౌరవం- అతనెందుకో పడుతున్న ఈ కొత్త శోభ- ఏమిటి, ఏమిటి, ఏమిటిది? ఎందుకిలా?

తెర వొత్తిగిల్లినప్పుడు స్టీలు గొట్టాం మీద కదలాడిన రింగుల చప్పుడికి

తల వెనక్కి తిప్పిచూసేడు బాలాజీ. అతను పరంగా చిపర ఉన్నాడు. ఆ కళ్ళల్లో అప్పటికే ఎరుపూ చెమ్మా.

"అయిదేళ్ళ కిందట తొలిసారిగా వెళ్ళేను జ్యోతీ, ఆ ప్రదేశానికి! ఆ దండకారణ్య మార్గంలో పడుతూ. లేస్తూ ఒళ్ళు గీరుకుపోయినా, బట్టలు చిరిగి పోయినా. ఉత్సాహమే ఉత్కంఠే బలం చేసుకుని చేరానక్కడికి. ఓ పక్క రైల్వే లైన్ల నిర్మాణం జరుగుతోంది. దాంతోబాటే ఆ గుహల పరిరక్షణ, సంక్షేమం,సదుపాయం;చూడ్డం జరుగుతోంది. ఉపయోగిస్తున్నదంతా రైల్వే వారిచ్చిన సామాగ్రే. కడుతున్నది రైల్వే కాంట్రాక్టరే. అజమాయిషీ చేస్తున్నది రైల్వే ఇంజనీరే. అని తెలిసి నాకు ఒక్కసారిగా జన్మంతా మరిచిపోలేని గౌరవం కలిగింది, అభినందిద్దామని అక్కడ సైట్ ఆఫీసులో వున్న ఇంజనీర్‌గార్ని కలిశాను. రామదాసుగారు నా ఆవేశం చూసి నవ్వేరు. అక్కడ అప్పుడు నేను విన్న సంభాషణ ద్వారా- ఆ పనులన్నీ రైల్వేశాఖవారు చేయించడం లేదనీ, రామదాసుగారే స్వయంగా రిస్కు తీసుకుని చేయిస్తున్నారనీ, కాంట్రాక్టర్ తనకు గిట్టుబాటు కావటంటాడన్న ఊహతో అక్కడి ట్రాక్ నిర్మాణానికి మామూలుగా అయ్యే ఖర్చుకన్నా రూపాయికి పావలా లెక్కని ఎక్కువ అవుతున్నట్టు రామదాసుగారు ఎస్టిమేట్లలో చూపించారనీ తెలిసింది. రైల్వేశాఖమీద గౌరవం అలాగే వుండి, ఆ ఇంజనీర్ రామదాసుగారిమీద అభిమానం కలిగింది. వ్యక్తుల్లో ఉండే లోపాలే డిపార్ట్‌మెంట్లకి చెడ్డపేరు తెచ్చినట్టు; వ్యక్తుల్లో ఉండే విలువలు డిపార్ట్‌మెంట్లమీద గౌరవం పెంచవచ్చుకదా! నాటికి నేడు వారంరోజుల కిందట తెలిసింది; ఆనాడు రామదాసుగారు ఈ పన్లు చేయించి అందు మూలంగా రైల్వేకి తగిలించిన అదనపు ఖర్చువల్ల ఆయన సస్పెన్షన్‌లో ఉన్నారని. ఎలా ఉన్నారు? చెబితే నమ్మరు! పద్దెనిమిదేళ్ళు ఇంజనీర్‌గా పని చేసిన రామదాసుగారికి ఏ బ్యాంకులోను కనీసం పోస్టాఫీస్ సేవింగ్స్ బ్యాంకులోనైనా పట్టుమని పద్దెనిమిది రూపాయలు లేవు. సస్పెన్షన్ కాలంలో ప్రభుత్వం యిచ్చే అలవెన్స్‌తో కాలక్షేపం చేస్తున్నారు; ఆయనా, ఆవిడా, యిద్దరు పెళ్ళికెదిగిన కూతుళ్ళూనూ. స్వయంకృతాపరాధానికి పడిన శిక్ష (ఈ సస్పెన్షన్)ని ఆయన చిరునవ్వుతో స్వీకరించి, శాంతంగా ఇంటిపట్టున ఉండిపోయారట. అంతే. ఏ అధికార్లనీ- ఆశ్రయించకుండా. కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన- అని అక్షరాలా వల్లిస్తూ జీవితం గడుపుతున్నారట.......

"ఆయన మనందరికంటే గొప్పవాడుకదా, జోతీ! నువ్వన్నది నిజమే అభిరుచి వేరు. బాధ్యతలు వేరు.... బాధ్యతలు నిర్వహించడానికి పరిపూర్ణ మానవుడక్కర్లేదు- యాంత్రికుడూ చెయ్యగలడా పని. కాని అభిరుచిని కాపాడు కోవాలంటే ప్రాథమికంగా మనిషై వుండాలి. అంచేత మీ నాన్నగారు తన బాధ్య తను ఎలాగ నిర్వహిస్తున్నారో, నేను నా అభిరుచిని రామదాసుగారిలాగే కాపాడు కుంటాను. ఆయనకా అధికారం వుంది. అలాగే నాకీ స్వతంత్రం వుందికదా....

"అంచేత నన్ను పోనీ జోతీ, నువ్వు బాధపడకు! గుడ్ బై"అని చకచకా మెట్లుదిగి వెళ్ళిపోయాడు బాలాజీ.

నీరసంగా ద్వారంవరకు వెనకడుగులు వేసుకుంటూ నడిచి- ద్వారం తగలగానే అగిపోయింది జోతి. అక్కడ చేరబడి, ఇటువేపు మొహంపెట్టి 'డాడీ' అని ఆక్రందించింది. అటువేపు తిరిగి "బాలాజీ, డోంట్ గో" అని అర చింది.

తెర పక్కనేవున్న పవన్‌కుమార్ చౌధురి, కూతురు ఆ ద్వారం దగ్గిర కూలబడిపోతూవుంటే పట్టుకుని, నిలబెట్టి, అక్కున చేర్చుకుని, "డోంట్ వర్రీ మై డార్లింగ్ జోతీ, నువ్వే గెల్చావు. దామ్మా!...... రెండూ చేద్దాం.... ఒప్పు కున్నానుగా. నీ బాయ్ ఫ్రెండ్ ఆ రామదాసు కంటె కూడా ఉన్నతుడు!" అన్నాడు. *

# ఈ సంపుటంలో రాని కథలు

నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు ఈ పుస్తకంలో చేర్చిన కథలు కాక నేను రాసినవి మరికొన్ని కథలున్నాయి. వాటిని ఈ సంపుటంలో చేర్చకపోవడానికి మొదటి కారణం నేను వాటిని జాగ్రత్త చేసుకోకపోవడం: రెండో కారణం "గ్రంథ విస్తర భీతి." వాటి వివరాలు ఇవి :—

| | | | |
|---|---|---|---|
| 1. | నేను—మా ఆవిడ | ఆంధ్రపత్రిక—వీక్లీ | 11-2-1949 |
| 2. | పిచిక కథ | భారతి—మాసపత్రిక | ఏప్రిల్ 1950 |
| 3. | రూపాయి | జ్యోతి—పక్షపత్రిక | 15-4-1950 |
| 4. | శృంఖలాలని బద్ధుడు | తెలుగుస్వతంత్ర—వీక్లీ | 30-6-1950 |
| 5. | కాలుజారిన కమల | ” | 7-7-1950 |
| 6. | వరుడికోసం వేట | ” | 21-7-19'0 |
| 7. | పుంభావ సరస్వతి | ” | 28-7-1950 |
| 8. | కోతల రాయుళ్ళు | సూర్యప్రభ—మాసపత్రిక | 1950 |
| 9. | 1961 | జ్యోతి—పక్షపత్రిక | 15-8-1951 |
| 10. | దెబ్బకు దెయ్యం | ఆంధ్రపత్రిక—వీక్లీ | 10-1951 |
| 11. | అల్లుగాడి పెళ్ళి | ” | 11-1 51 |
| 12. | కలం ఖరీదు | తెలుగు స్వతంత్ర—వీక్లీ | 1953 |
| 13. | పతంజలి పంతం | ” | 1955 |
| 14. | నాన్న కిష్టంలేదు | ఆంధ్రపత్రిక—వీక్లీ | 12-1958 |
| 15. | జలగా—మనిషీ | ” | 1-1959 |
| 16. | చేసుకున్నవారి—చూసుకున్న మార్గం | ” | 2-1959 |
| 17. | నళినీదళ సంస్థితమ్ | — | 1961 |
| 18. | ఒరవకి | ఆంధ్రప్రదేశ్—మాసపత్రిక | 8-1961 |
| 19. | పాకీ—జను | జ్యోతి—మాసపత్రిక | 5-1963 |
| 20. | మా వూళ్ళో ఒక్కసారి దిగండి | ” | 3-1964 |
| 21. | త్రిశంకు | జయశ్రీ—మాసపత్రిక | 1-1967 |
| 22. | అర్థంకాని కథ | జ్యోతి—మాసపత్రిక | 7-1967 |
| 23. | ప్రవృత్తిధర్మం | ఆంధ్రజ్యోతి—వీక్లీ | 14-7-1967 |
| 24. | చండిక | ” | 21-7-1967 |
| 25. | పెనుభూతం | ” | 17-11-1967 |
| 26. | గ్రీన్ రూమ్ | లత—మాసపత్రిక | 12-1967 |
| 27. | మామయ్యే దైవం | జయశ్రీ—మాసపత్రిక | 3-1968 |
| 28. | అక్రమ భిన్నం | జ్యోతి—మాసపత్రిక | 4-1968 |

| | | | | |
|---|---|---|---|---|
| 29. | దిద్దుకోలేని తప్పు | ఆంధ్రప్రభ-వీక్లీ | దీపావళి | 1968 |
| 30. | ఆంబోతు | జ్యోతి-మాసపత్రిక | | 3-1969 |
| 31. | చెయ్యిజారని అదృష్టం | ,, | | 10-1969 |
| 32. | సినిక్ | యువ-మాసపత్రిక | దీపావళి | 1973 |
| 33. | మట్టి (బుర్రలు) అమ్మబడును | జ్యోతి-మాసపత్రిక | దీపావళి | 1974 |
| 34. | అమ్మబడును | ,, | | 7-1974 |
| 35. | కాలింగ్ బెల్ | అనామిక-మాసపత్రిక | ప్రత్యేకసంచిక | 1976 |
| 36. | ఏ రాయైతేనేం | విజేత-మాసపత్రిక | | 1-1978 |
| 37. | పుట్టలోని చెదలు | అనామిక-మాసపత్రిక | | 7-1978 |
| 38. | ఆనందానికి అనకట్ట | ఆంధ్రజ్యోతి-వీక్లీ | | 11-3-1983 |
| 39. | ఆచార్య దేవోభవ | జ్యోతి-మాసపత్రిక | | 1985 |
| 40. | ఉద్యమం మొదలైంది | ఆంధ్రజ్యోతి-వీక్లీ | దీపావళి | 1985 |
| 41. | నిర్మాల్యం | ,, | ,, | 1987 |
| 42. | బురద | విపుల-మాసపత్రిక | ? | |
| 43. | శ్రీ-రంజని | ,, | ? | |
| 44. | ఆదివారం | ఆంధ్రప్రభ-వీక్లీ | ? | |
| 35. | పిచ్చుకగూడు | ,, | ? | |
| 46. | అయ్యా, ఏమి సెలవు? | స్నేహ-మాసపత్రిక | ? | |

ఇవికాక పైటిల్సుకూడా గుర్తులేనివి మరో ఇరవై దాకా ఉండొచ్చు.



పభ-వీక్లీ దీపావళి 1968
మాసపత్రిక 3-1969
10-1969
ాసపత్రిక దీపావళి 1973
మాసపత్రిక దీపావళి 1974
7-1974
పత్రిక ప్రత్యేకసంచిక 1976
ూసపత్రిక 1-1978
-మాసపత్రిక 7-1978
జ్యోతి-వీక్లీ 11-3-1983
.మాసపత్రిక 1985
జ్యోతి-వీక్లీ దీపావళి 1985
" " 1987
ాసపత్రిక ?
?
పభ-వీక్లీ ?
?
మాసపత్రిక ?
ఇరవై దాకా ఉండొచ్చు.





